# భారత ధ్వని దర్శనము

భాషాప్రవీణ ఆచార్య శలాక రఘునాథ శర్మ
ఎం.ఏ., పి హెచ్.డి.

ఆచార్యులు, తెలుగుశాఖ.
శ్రీకృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయం - అనంతపురం.

ప్రచురణ

ఆనందవల్లీ గ్రంథమాల
శ్రీవేంకటేశ్వరపురం - అనంతపురం.

ద్వితీయ ముద్రణ
ప్రమాథి - ఫాల్గునము
మార్చి - 2000.
ప్రతులు : 1000



మూల్యము : రు.150/-

ప్రతులకు :

శ్రీమతి శలాక రాజేశ్వరి
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం క్వార్టర్స్, ఎ-2
శ్రీవేంకటేశ్వరపురం
అనంతపురం - 515003.

ముద్రణ :

శ్రీ బాలాజీ గ్రాఫిక్స్
సీతంపేట,
రాజమండ్రి - 533 104.
ఫోన్ 473554

# శ్రీ స్వామి ప్రసాదము



ఈ గ్రంథముద్రణకు తిరుమల తిరుపతి దేవస్థానం వారు
"రచయితలకు ఆర్థిక సాహాయ్య పథకం"
క్రింద రు.20,000/- లు అందించినారు.
ఆ అధికార వర్గానికి హృదయపూర్వక కృతజ్ఞతాంజలి.

# సౌజన్య సంభావనము

'భారత ధ్వని దర్శనం' ఈ రోజులలో రెండవ ముద్రణకు నోచుకోవటం ఒక ఆశ్చర్యకరమైన అంశం!

ఈ గ్రంథముద్రణకు నన్ను ప్రోత్సాహపరచటమే కాక విలువకట్టటానికి వీలులేని సౌజన్యాన్ని హృదయంలో, ముద్రణవ్యయంలో గణనీయమైన ధనాన్ని చేతిలో కుక్కిన ఒక అక్కగాని అక్కను ఇక్కడ స్మరించకుండా ఉండటం సాధ్యంకాని విషయం. అవ్యాజ సౌహార్దం వెల్లిగొలిపిన ఆ నిర్మలాంతరంగానికి అభినందనలు.

పుస్తకానికి సుందరమైన అక్షరాకృతి కల్పించినది రాజమండ్రి బాలాజీ గ్రాఫిక్స్ అధినేత చి॥ వారణాసి సుబ్రహ్మణ్యం. అతనికి, అతని పరివారానికీ శుభాశంసనలు.

మొదటి ముద్రణలో నేను స్మరించిన గురుదేవులు, బంధువర్గంవారూ, ఆత్మీయులు నా హృదయంలో ఇంకా మెదులుతూనే ఉన్నారు.

నా రచనను మనసారా అభినందించిన మహనీయులు కనులలో కదలాడుతూనే ఉన్నారు.ఉంటారు.

ఈ సారస్వతయజ్ఞంలో అదృశ్యంగా ఉన్న ఋత్విక్కులు ఎందరో! ఈ వ్యవసాయపు ఫలసాయాన్ని పుష్కలంగా సొమ్ము చేసుకొనే వాడను మాత్రం నేనొక్కణ్ణే!! అయినా నేను సిగ్గు పడటం లేదు. ఈ లోకం తీరు అటువంటిదే కనుక. నేను లోకంలోని వాడనే కనుక.

కాగా వారి సౌజన్యం నన్ను నేనాశించినదానికంటె గొప్పవాణ్ణే చేసింది. చేస్తున్నది, చేస్తుంది కూడా! ఆ సౌజన్యాన్ని హృదయపు భద్రపీఠంపై నిలుపుకొని నీరాజనాలివ్వటమే నేను చేయగల ఆరాధన.

**1.2.2000** శరశర్మ



# అంకితము



నా ప్రథమ విద్యాగురువు - మాతండ్రి

కీ॥ శే॥ శలాక నరసయ్యగారి దివ్యస్మృతికి-

ఓమ్

విద్వత్కవిశేఖర, బ్రాహ్మీభూషణ,
కళాప్రపూర్ణ బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు
కాకినాడ.

# శ్రీగురుమూర్తయే నమః

'భారతధ్వనిదర్శనము' అని పేరిడి నామిత్రులు చిరంజీవి రఘునాథశర్మగారు వ్రాసిన సిద్ధాంతవ్యాసమున 160 పుటల గ్రంథము ముద్రితమైన భాగము మాత్రమే చూచు భాగ్యము కలిగినది. చూచినను స్థాలీపులాకముగానే కాని ప్రత్యక్షరము సవిమర్శనముగాఁ జూడ నావశమా? అని 'భూమిక' అను ప్రథమభాగ మక్షరాక్షరము చదువుటకే నాకు తలమున్కలైనది అని సత్యము పలుకక తప్పనిదాయెను.

ముందుగా ఆనందపదవిమర్శనము గలదు. అక్షరాక్షర ముపనిషన్మార్గ గమ్యము కాని సామాన్యవివరణము కాదు. "కావ్యానందము బ్రహ్మానంద సబ్రహ్మచారి" అను సిద్ధాంతము చెప్ప నెంచి పాతాళమునుండి పరమేష్ఠిలోకము వఱకు వారి లేఖిని విహరించినది. కావ్యమన నేమో; కవి యన నేమో; వాక్యము, పదము, వర్ణము మున్నగునవి యెట్టివో; వాని పరస్పరాంగాంగిభావ మెట్టిదో శాస్త్రీయమార్గమున అనాఘ్రాతకవితాగంధునకు సైతము తెలియునట్లు, గ్రహించి యానందించునట్లు లలితమగు చక్కని తెలుఁగువచనమునఁ దెలియఁ జెప్పి శ్రీ శర్మగారు సాహితీపరులకు గురుస్థానమైనారు.

శాస్త్రకారుల సిద్ధాంతములే కాని శర్మగారి సిద్ధాంతములా? అని యందురేమో? వారివి కావు. కాని యాయాశాస్త్రకారుల మతముల నన్నిటిని బరిశీలన పూర్వకముగాఁ జదివి వాని కన్నిటికిని ఏకవాక్యత కలిగించి పూర్వపరవిరోధము లెచటను లేకుండ, విద్యార్థికి గురువు పాఠమును శంక కవకాశము లేకుండ బోధించుతీరున వ్యాసమాద్యంతము కనఁబడిన దనిన శర్మగారి పరిశ్రమమునకు విలువ గట్ట నెవ్వరికిని సాధ్యముకా దనిపింప నేను మాత్రము మెచ్చుకొనకుండఁగలనా?

ఈ వ్యాసము ఆంధ్రభారతము మీఁది విమర్శనమో? ఆనందవర్ధనులవారి ధ్వనిప్రస్థానము మీఁది పరామర్శమో? విడఁదీసి చెప్పఁ దరము కాకున్నది. "కావ్యమునకు

ఆత్మ యేది?" యను విచారణమున అలంకారములని, గుణములని, రీతి యని, వక్రోక్తి యని యింక నేవేవో యని బహుముఖములుగా నిర్ణయించిన పూర్వశాస్త్రకర్తలకుఁ గూడ దిగ్భ్రమ కల్గించిన యానందవర్ధనులవారి పరమసిద్ధాంతమగు 'ధ్వని'కి సామ్రాజ్యము కట్టి - ఇతిహాసరత్నముగా వెలసిన కవిత్రయమువారి భారతమును మహాకావ్యముగా నెంచి 'కావ్యాత్మ యిదిరా' యని ధ్వనిప్రస్థానభగీరథులగు ఆనందవర్ధనుల మార్గమున సాకల్యముగా నిందు నిరూపించిన శ్రీ శర్మగారి తపస్సునకు ఫలముగా లభించిన పి.హెచ్.డి. బిరుదము - చాల చిన్నది కాని గొప్పది కాదు అని నా కనిపించినది.

రెండవ పరిచ్ఛేదము "ధ్వని ప్రతిష్ఠాపనము". దీనియందు పూర్వులగు శాస్త్రకారుల సిద్ధాంతము లెన్నియో స్వీకృతములై, వానియందలి లోపము లన్నిటిని విమర్శించి ధ్వనికారమతము నస్థూణాఖనన న్యాయమున ధ్రువపఱచుట శ్లాఘ్యము. అభినవగుప్తపాదులయొక్కయు, విశ్వనాథకవిరాజుయొక్కయు, జగన్నాథపండితరాజులయొక్కయు వీరవిహారములలోని శృంగారమంతయుఁ గ్రుమ్మరించి, రసధ్వనికి భారతమెట్లు లక్ష్యమయ్యెనో- యించుమించు నవరసములను లక్ష్యములతో నిరూపించుటయే కాదు, భావమునకు, తదాభాసాదులకుఁ గలభేదములను రేఖామాత్రముగా సోదాహరణముగాఁ జూపి భారతమునకుఁ బట్టముకట్టినవారు శ్రీ శర్మగారు.

మూఁడవదియగు "ధ్వనిస్వరూప" మను పరిచ్ఛేదమున అసంలక్ష్యక్రమ వ్యంగ్యమును, సంలక్ష్యక్రమవ్యంగ్యమును బహుముఖముల లక్ష్యములుగాఁగొన్ని భారతపద్యములందుఁ జూపి - అరఁటిపం డొలచి చేతికందించినట్లు తెలియజెప్పుట సామాన్యవిషయము కాదు. "కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధవస్తుకృతవస్తుధ్వని"119వ పుటలోఁ జూడఁదగును. అందువిచిత్రవీర్యుఁడు అంబికాంబాలికలయందు నిరంతరకాముకుఁడై మరణించెను అను నర్థముగల వాక్యమునందలి ప్రౌఢిని వెల్లడించుచు శ్రీశర్మగారు చూపిన ప్రతీయమానార్థవివరణము మెచ్చఁదగినది. మచ్చునకుఁ జూపితినిగాని ఇట్టి వాద్యంతము చూడమొదలిడిన నాచాదస్తముతోపాటు గ్రంథ విస్తరమును కాఁగలదు అని మానితిని.

నాల్గవపరిచ్ఛేదము "వ్యంజకము"ను గూర్చిన తలస్పర్శమగు విమర్శము మిగుల మనోజ్ఞము. మచ్చునకు - 159వ పుటయందలి విషయము చూతము. "వర్ణములే రసాభివ్యంజకము లగుచుండఁగా తత్సముదాయరూపమున నర్థవంతమగు పదమును, తత్సముదాయరూపము అఖండార్థబోధక మునగువాక్యమును రసాభివ్యంజక మగుటలో విప్రతిపత్తి లేదు. కావున పదము రసాభివ్యంజక మగుట కుదాహరింపఁబడుచున్నది అని

యెత్తికొని "అన్నగుమోమును నత్తెలి గన్నులు" ఇత్యాది భారత పద్యమందలి తచ్ఛబ్దార్థకమగు 'అ' అనుపదమును, "దాని విశేషసౌరభము" ఇత్యాదిపద్యమున పునఃపునఃప్రయుక్తమైన తచ్ఛబ్దమును వ్యాససమాస గతములై యెట్లు రసాభివ్యంజకములైనవో చేసిన విమర్శనము శర్మగారి నిశిత విమర్శనశక్తికి తార్కాణ.

శర్మగారి పూర్వు లేదో శాస్త్రమునందు [1] శలాకాపరీక్షకు నిలిచి జయమొంది 'శలాక' అను బిరుదనామము వహించియుందురు కావుననే ఆ వంశమున కది పరంపరాయాతమైనదని నాయూహ. వీరి సిద్ధాంతవ్యాస మిది శలాకాపరీక్షకు నిలిచి వెనుకటి బిరుదమునకు నూతనదీప్తిని కలిగించినది, కలిగించుచున్నది, కలిగింపఁగలదు. ఇదియే నాఆకాంక్ష. శ్రీ శర్మగారికి ఆయురారోగ్యములతో సర్వవిధముల నభ్యుదయము కలుగుఁగాక అని నాయాశీస్సు.

| | |
|---|---|
| కాకినాడ | ఇట్లు |
| సిద్ధార్థివత్సరాశ్వయుజ | శ్రేయోఽభిలాషి |
| బహుళసప్తమీ శుక్రవాసరము | (సం) వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి |

[1] శలాకాపరీక్షయన :- తన్నుఁ బరీక్షింపుఁడని తాను జదివిన శాస్త్రము, లిఖింపఁ బడిన తాళపత్రగ్రంథము చేతికీయ పరీక్షకుఁ డొక శలాకను ( సళాకు - లోహపుకడ్డీగాని పుల్లగాని) ఆగ్రంథమున నెందో గ్రుచ్చి గ్రంథము విప్పి రెండువైపుల పుటలలోని విషయమును తడవుకొనకుండ పూర్వాపరముల కవిరోధముగఁ జెప్పుమనఁగా నుపన్యసించి జయముగొనుట.

డా॥ దివాకర్ల వేంకటావధాని
ఎం.ఏ ( ఆనర్సు ) పి. హెచ్.డి.
ఎమరిటస్ ప్రొఫెసర్ - తెలుగు.
ఉస్మానియా విశ్వవిద్యాలయము,
హైదరాబాదు.

# ఆశీరభినందనము

శ్రీ డా. శలాక రఘునాథశర్మగారు సంప్రదాయపద్ధతిని కావ్యశాస్త్రాదు లభ్యసించి సంస్కృతాంధ్రములు రెండింటఁ గూలంకషమైన పాండిత్యము నలవఱుచుకొన్న విద్వాంసులు వారి విషయమున పాండిత్యమునకుఁ బ్రతిభ తోడౌటచే బంగారమునకుఁ బరిమళమబ్బినట్లైనది. వారు ప్రాచ్యభాషాపట్టమునందినతరువాత నాంగ్లమునుగూడఁ బఠించి ఉస్మానియా విద్యాలయమున ఎం,ఏ., పరీక్షకుఁ జదువుటయు, మాకు శిష్యులగుటయు సంభవించినది. ఎం.ఏ., పరీక్షలో వారంతకుఁబూర్వమెవ్వరును సంపాదింపనన్ని గుణములు సంపాదించి తమ వైశిష్ట్యమును బ్రకటించుకొనియుండిరి. తరువాత వారు కొన్ని సంవత్సరములు ప్రాచ్యకళాశాలలో నుపన్యాసకులుగాఁ బనిచేసి పిమ్మట అనంతపురమందలి పి.జి. కేంద్రమున నుపన్యాసకులుగాజేరి యిప్పుడందే రీడరుగా నుద్యోగము నిర్వహించు చున్నారు. "శిష్టా క్రియా కస్యచిదాత్మసంస్థా సంక్రాంతి రన్యస్య విశేషయుక్తా, యస్యోభయం సాధు సశిక్షకాణాం, ధురిప్రతిష్ఠాపయితవ్యఏవ" అని కాళిదాసు శిక్షకాగ్రగణ్యుల కుండవలెనని చెప్పిన రెండు లక్షణములును వారియందు నిండారి యున్నవి. వారికి సంస్కృతాంధ్ర సాహిత్యముతోడను, లక్షణగ్రంథములతోడను గల పరిచయవిశేషము నెఱింగినవాఁడ నగుటచే ధ్వనినిగూర్చి పరిశోధనచేయుఁడని మొదట సూచించినవాఁడను నేనే. వారు శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయమున కరిగిన పిమ్మట భారతధ్వని దర్శనమును గూర్చి సిద్ధాంతవ్యాసమువ్రాసి పి.హెచ్.డి. పట్టమును బొందియుండిరి. వారి సిద్ధాంతవ్యాసమును లిఖితరూపమున నున్నప్పుడే చదివి యందలి ప్రాశస్త్యమును గ్రహించి యానందించియుంటిని. ఇప్పుడది ముద్రితమగుట నాకేకాక విద్వద్విద్యార్థు లందఱికిని ప్రమోదావహమగునని వేఱుగాఁ జెప్పనవసరములేదు.

కావ్యమున కాత్మ యేది యను విషయమునఁ బ్రాచ్యలాక్షణికులు కావించిన పరిశోధన పరిశీలనము లపారములైనవి. చివరి కానందవర్ధనాచార్యులవారు ధ్వనియే

కావ్యాత్మయని నిరూపించి అనన్యాదృశమైన పాండితీప్రతిభలను బ్రదర్శించి యుండిరి. అస్ఫుటస్ఫురితమైన కావ్యతత్త్వమును వారు సుస్పష్టముగాఁ బ్రతిపాదించి విమర్శక మూర్ధన్యులని పేరుగాంచిరి. వారి యనంతరము కొందఱు లాక్షణికులు భిన్న వాదములను బ్రతిపాదించుటకో, పూర్వవాదములను సమర్థించుటకో యత్నించిరి కాని వారి వాదములు సుప్రతిష్ఠితములు కాలేదు. కావ్యాత్మ ధ్వని యను వాదమే సర్వపండితాంగీకృతమై అద్వితీయమైన పరబ్రహ్మమువలెఁ బ్రతిభాసించుచున్నది.

ధ్వనివాద మెంత హృదయంగమమైనదో యంత క్లిష్టమైనది. అందుఁగల భేదము లసంఖ్యాకములు. వాని నన్నిటిని నమగ్రముగా నవగాహన మొనరించుకొనుట సులభసాధ్యమైన కార్యముకాదు. ఒక్కొక్క భేదమునకు ధ్వనికారు డొసంగిన యుదాహరణములనే గ్రహించి యాభేదమందెట్లు సమన్వితమగుచున్నదో యతఁడు వివరించును కావునఁ దెలిసికొని యానందింపవచ్చును. కాని యుదాహరణాంతరములను స్వయముగా నెన్ని యం దా యాధ్వనిభేదములను నిరూపించి చూపుట యతికష్టసాధ్యము. అందును ఆభేదముల కాంధ్రకావ్యములనుండి తగిన యుదాహృతుల నొసంగఁజాలుట కపారమైన లక్ష్యలక్షణపరిజ్ఞాన మావశ్యకము. కీ.శే. వేదాల తిరువేంగళాచార్యులవారు తమ ధ్వన్యాలోకాంధ్రీకరణమున నట్టి ప్రయత్నము కావించి కొంతవఱకుఁ గృతకృత్యులైరి. వారొకే కావ్యమునుండికాక వివిధాంధ్రకావ్యముల నుండి యుదాహరణముల నెత్తిచూపియుండుటచే వారి కార్యము కొంతసులభమైనది. శ్రీ శర్మగారు మహాభారతము నుండియే యన్నిలక్ష్యముల నొసంగి లక్షణసమన్వయపూర్వకముగా నాయా ధ్వనిభేదముల నందు నిరూపించి చూపిన పాండితీపరిశోధనపాటవము శ్లాఘాలంఘనజాంఘికమై యున్నది.

నిజమునకు ధ్వనిమంతమైనదే యుత్తమకావ్యము. కవిత్రయమువారు నిరుపమానపాండితీప్రతిభామండితులగుటచేఁ దమరచనలో నప్రయత్నముగనే యెన్నో ధ్వనిభేదములను జొప్పించియుండిరి. వానిని గుర్తించి నిరూపించుట మహా విద్వాంసులకుఁ గాని సాధ్యముకాదు. ఆపనిని డా. శర్మగా రెంతో సమర్థతతో నిర్వహించి యుండిరి. వారు కవిత్రయమువారి భారతభాగములనుండి యెన్నో పద్యముల నుదాహరించి యందేయే ధ్వనులు కలవో విశదీకరించి యుండిరి. ఆపద్యములను, వారు కావించిన నిపుణమైన సమన్వయమును బఠించినవా రాశ్చర్యచకితులు కాకమానరు. భారతమునందు ధ్వనిమంతములైన హృద్యపద్యము లసంఖ్యాకములుగా నుండుటచేతనే అది

యుత్తమకావ్యము కాఁజాలినది. ఆమహాకవుల కాంధ్రకవి సముదాయమున నగ్రగణ్యత్వము లభించినది.

శ్రీశర్మగారు తమ సిద్ధాంతవ్యాసము నెనిమిదధ్యాయములుగా విభజించిరి. భూమిక యొక్క చిన్న లక్షణగ్రంథము. అందు కావ్యలక్షణసామగ్రియంతయు సంగ్రహముగా వ్యక్తీకరింపఁబడినది. ధ్వనిప్రతిష్ఠాపనము ధ్వని లక్షణమును, ధ్వన్యభావవాదముల ఖండనమును, కొన్ని అలంకారములకును ధ్వనికిని గల భేదమును విశదీకరించుచున్నది. ధ్వనిస్వరూపమందలి భేదముల నన్నిటిని నిరూపించుచున్నది. వ్యంజక మను చతుర్థాధ్యాయము బృహత్తరము మహత్తరము నైనట్టిది. వాచ్యాతిరిక్తవిలక్షణార్థాభిధాయిశబ్దాదికమే వ్యంజకము. వర్ణ, పద, వాక్య, రచనాదులవలన వ్యంగ్యార్థము స్ఫురించును కావున నవి వ్యంజకములు. వీనిలో నేవేవి యేయే సందర్భములలో వ్యంగ్యార్థమును ప్రతీయమానమొనర్చి వ్యంజకత్వమును పొందునో ధ్వనికారులు వివరించియుండిరి. డా॥ శర్మగారు భారతమునుండి సుందరములైన యుదాహరణముల నొసంగి వ్యంజకములను నిరూపించియుండిరి. శ్రీమహాభారత మను నధ్యాయమున నాంధ్రమున మహాభారత మావిర్భవించిన పరిస్థితులు, కవిత్రయమువారి కవితావిశేషములు విశదీకరింపఁబడినవి. షష్ఠసప్తమాష్టమాధ్యాయములలో నా ముువ్వురు మహాకవుల రచనలందలి ధ్వనివిశేషములు సోదాహరణముగాఁ బ్రదర్శింపఁబడినవి.

పూర్వాంధ్రకవులందఱును విద్వత్కవులు, ఆంధ్రముననేకాక సంస్కృతమునందును అపారమైన పాండిత్యము కలవారు. సంస్కృతమహాకవులవలెనే వారును ధ్వనిమంతములైన పద్యములెన్నో రచించియుండిరి. వారి కావ్యములందలి ధ్వనిభేదములను నిరూపించుటకు యత్నము చేయవలసియున్నది. ఆంధ్రకవులకు కవిత్రయమువారివలెనే అట్టి ప్రయత్నముచేయు భావిపరిశోధకులకు శ్రీశర్మగారు మార్గదర్శకులు కాఁజాలుదురు.

డా. శర్మగారి శైలి నిర్దుష్టము, ప్రౌఢము నయ్యు సుస్పష్టము, సుబోధము, విషయవ్యక్తీకరణదక్షము నై మనోహరముగానున్నది. గ్రాంథికశైలి సామాన్యులకుఁగూడ సులభమై గంభీరవిషయముల నందిచ్చుననుట కిదియొక మంచి నిదర్శనము, ధ్వనివిషయమున నింత ప్రశంసనీయమైన కృషికావించి కవిత్రయము వారి మహాకవిత్వమును ప్రదర్శించిన శ్రీశర్మగారి నభినందించుచు, విద్వద్వర్యులైన వారు విషయగంభీరములైన యిట్టి విమర్శగ్రంథము లింకను అనేకములు రచించి యువకుల కాదర్శప్రాయులగుదురుగాక యని ఆశీర్వదించు మన్నాను.

దివాకర్ల వేంకటావధాని.

డా॥ కోరాడ మహాదేవశాస్త్రి,
ఎం.ఏ (ట్రిబుల్) డి.లిట్ ;
ఆంధ్రశాఖాధిపతి, స్నాతకోత్తరవిద్యాకేంద్రము,
అనంతపురం

మనభాషలో కావ్యవిమర్శనము అలంకారిక సంప్రదాయము ననుసరించి బయలుదేరినది. కవిత్రయభారతము మనకు పరమప్రామాణికము, అతిప్రాచీనమునైన గ్రంథమగుటచే మహామహులగు పండితులెందరో దానిని తరిచిచూచి,అందలి కావ్యగుణములను చర్చించి, గ్రంథవైశిష్ట్యమును నిరూపించియున్నారు. ఆ విమర్శనము చాలవరకు స్థాలీపులాకన్యాయమున జరిగినది. వారి పరిశ్రమవలన భారతమును గూర్చిన మూలాధారములగు విషయములు తెలియవచ్చినవి. కాని 'ఎఱుక' సమగ్రమగుటకు ఒక్కొక్క కావ్యగతాంశమును సాధ్యమైనంతవరకు విపులముగ పరిశీలించవలసిన అవసరము కలదు. కావ్యమునకు ఆత్మభూతమైనది ధ్వని గనుక ఆంధ్రమహాభారతములో ధ్వనిసిద్ధాంత సమన్వయము ప్రప్రథమముగా గ్రహింపబడుటలో ఔచిత్యము లేకపోలేదు. శ్రీశలాక రఘునాథశర్మగారు ఈకార్యమునకు పూనుకొని సమర్థతతో నిర్వహించినారు. ఇందు వారు చూపిన ప్రతిభాకౌశలములు అసాధారణములు. ఆకిరిపల్లి వంటి గురుకులములో సంప్రదాయబద్ధముగ చదివిన చదువుకు రాణింపు సాఫల్యము కలిగినది. ధన్యులు.

ఈ పరిశోధనమున శ్రీశర్మగారు ఏర్చికూర్చినవికాక భారతమున ధ్వన్యర్థము లింకను ఎన్నో ఉన్నవి. వానిని కూడ ఒక అనుబంధములో గచ్ఛద్ వ్యాఖ్యారూపమున ప్రచురించినచో ప్రజలకు మహోపకారము చేసినవారగుదురు. నిజమునకు భారతము అర్థతాత్పర్యములతో ప్రకటింపబడవలసియున్నది. ఇట్టి గ్రంథములు కావ్యపఠనమునం దాసక్తి కలుగజేసి విద్యాస్థాయిని పెంచగలవనుటకు సందేహము లేదు.

కోరాడ మహాదేవశాస్త్రి

# ప్ర స్తా వ న

'భారత ధ్వనిదర్శనము' అను సంక్షిప్తనామముతో ప్రస్తుతము వెలుగులోనికి వచ్చుచున్న యీగ్రంథము 'కవిత్రయమువారి ఆంధ్రమహాభారతము - ధ్వని సిద్ధాంతసమన్వయము' అను శీర్షికతో 1975వ సంవత్సరమున నేను శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయమువారి డాక్టరేటు పట్టమునకై సమర్పించిన సిద్ధాంతనిబంధమునకు ఇంచుమించు యథాతథస్వరూపము. అందు మూడధ్యాయములుయా రూపొందిన విషయ మించు సౌకర్యదృష్టితో తొమ్మిది అధ్యాయములుగా వింగడింపబడుటయు, గ్రంథభాగము అతిస్వల్పప్రమాణమున తగ్గింపబడుటయు తప్ప దానికిని దీనికిని భేధమేమియు లేదు.

ఆనందవర్ధనాభినవగుప్తపాదుల ప్రతిభావిశేషముచే భారతీయాలంకారశాస్త్రములో అప్రతిహత ప్రభావముతో సునిరూఢమైన ధ్వనిసిద్ధాంతమును కవిత్రయము వారి ఆంధ్రమహాభారతముఖమున చూచుట యీ గ్రంథముయొక్క లక్ష్యము కావున దీనికి 'భారత ధ్వనిదర్శనము' అని నామకరణము గావించితిని.

లక్ష్యసమన్వయములేని లక్షణమునకు ప్రయోజనము శూన్యమని చెప్పుట తప్పుగాదు. ధ్వని కావ్యాత్మగా నిరూపితచరము. కీ.శే. శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులుగారు తమ ఆంధ్రధ్వన్యాలోకమున ఆంధ్రకావ్యములనుండి ధ్వనిభేదములకు లక్ష్యములను సేకరించి వివరించి సమన్వయించి చూపిరి. ఆపద్ధతి నాకెంతోనచ్చినది. తెలుగున కవిత్రయ మహాభారతము సర్వవిధముల నుత్తమ శ్రేణికి చెందినది. ఉత్తమకావ్యసిద్ధాంతము నుత్తమకావ్యమునందు సమన్వయించి చూచుట సాహిత్యవిద్యార్థి యొక్కకర్తవ్యములలో నొకటియని సంభావన.

ఈ విశిష్టసంభావనకు తొట్టతొలుత ప్రేరణము నొసంగినవారు ఉత్తమ దేశికులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు. లక్ష్యసిద్ధికి చేయూతనిచ్చి తుదిముట్ట నిర్వహింపజేసిన ఉత్తమదర్శకులు ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రి గారు. వీరిరువురికి నాయందున్న వాత్సల్యసౌహార్దములు నాకు నిత్య స్మరణీయములు.

ఇందు మొదటి ఆధ్యాయము భూమిక - దీనిలో ధ్వనిప్రస్థానావిర్భావమునకు పూర్వము కావ్యప్రధానాంశములుగా ఆ యా యాలంకారికులచే సునిరూపితములైన గుణాలంకార వృత్తిరీత్యాదుల స్థితిగతులను, ధ్వనిదృష్టితో వానికి గల స్థానమును చర్చించితిని.

ఆనందవర్ధనులు ధ్వని ప్రతిపాదనముచేయుటకై అభావవాదములను,

బుద్ధిస్థములగువానిని, కొన్నింటిని ప్రదర్శించి ఖండించిరి. తఱువాతి కాలమువారి కాలక్షేపములను చెప్పుటకు వీలులేని తీఱున నీ ప్రయత్నము పటిష్ఠపముగా రూపొందినది. ఈగ్రంథము ద్వితీయాధ్యాయమున నేనును ఆయభిప్రాయములను క్రోడీకరించుచు తోచిన కొన్ని క్రొత్త యుక్తులను ప్రతిపాదించుచు ధ్వని ప్రతిష్ఠాపనమును గావించితిని.

మూడవయధ్యాయమున ధ్వన్యాలోక ద్వితీయోద్ద్యోతస్థితాంశసారభూతముగా వ్యంగ్యముఖమున ధ్వనిప్రభేదములను ఉదాహరణ సమన్వయపురస్సరముగా నిరూపించితిని.

ఆనందవర్ధనులు తృతీయోద్ద్యోతమున వ్యంజకముఖమున ధ్వనిప్రస్తారము గావించిరి. ఆయంశమంతటిని చతుర్థాధ్యాయమున వివరించితిని. వ్యంజకములు ముందు చెప్పబడినవి గాక క్రొత్తగా నేమైన చెప్పుటకును అవకాశముగలదేమో పరిశీలించుటయు నిందు జరిగినది.

ప్రత్యేకముగా ఇంతవఱకు ఈగ్రంథములో పరిశోధించి యంశమేమనగా తొంబదితొమ్మిది శాతము ఆంధ్రమహాభారతమునుండి లక్ష్యముల నేర్చికూర్చి గ్రంథకర్త్రభిప్రాయసమ్మతముగా పూర్వాపర వైరుద్ధ్యము లేకుండునట్లుగా వ్యాఖ్యానించుట. లక్షణావృత్తి నిరూపణ సందర్భమునందును గతానుగతికమైన ఉదాహరణములను సాధ్యమైనంతవఱకు పరిహరించి నిత్యవ్యవహారములలోనుండు వానిని చూపితిని. లక్షణసమన్వయములో విద్యార్థులకు ఈపద్ధతి మిక్కిలి చొరవను గలిగించునని నేను సంభావింతును.

ఈధ్వనిప్రచారమునకు విహారభూమిగా కవిత్రయమువారి ఆంధ్రమహాభారతమును స్వీకరించితిని. తెలుగు వాఙ్మయములో కవిత్రయమువారిది అనితర సాధారణమైన స్థానము. ఉత్తమకవితాసంప్రదాయముల విషయమున తదనంతర కవులకు వారు పెట్టినదే భిక్ష. వ్యాసభగవానుడు వారికి పెట్టినభిక్షను వీరీవిధముగా సద్వినియోగముచేసి జగద్ధితముగా, ఆంధ్రావళి మోదముంబొరయునట్లుగా, సాధుజన హర్షసిద్ధి గోరుచు ఆంధ్రమహాభారతమును తెలుగున రచియించిరి. కావున నిందు పంచమాధ్యాయమున భారత గ్రంథ, తత్కర్తృ గౌరవములు, కవిత్రయమువారి కవితావిశేషములును స్థాలీపులాకన్యాయమున చర్చింపబడినవి.

కవిత్రయమువారు భారతరచనలో నేకాత్ములు. అయినను ఎవరిసత్త వారిది. కావున వారివారి రచనాభాగములలో కానవచ్చు ధ్వనివిశేషములను పర్వాశ్వాసాను క్రమముగా

భట్టారకుని భవ్యవాణి, అరుణాంశురాగరుచులు, తిక్కనార్యుని దివ్యవాణి అను శీర్షికలతో ఆతేడెనిమిధ్యాయములలో వివరించితిని. ఇందు నాబుద్ధికి తోచిన వానిలో కొన్నింటిని మాత్రమే వక్కాణించితిని. ఇంతతో నిది పర్యాప్తమనుట కవకాశము లేదు.

ధ్వని అనగా రసధ్వనియే. రసమనగా కావ్యమున ప్రధానముగ అంగియే కావున ధ్వనిసమాలోచన సందర్భమున అంగిరసచర్చ అప్రస్తుతము కానోపదు. ఆదృష్టితో ధ్వని ప్రతిష్ఠాపకులతాత్పర్యమునకు విరుద్ధముకాని ధోరణిలో తొమ్మిదవ అధ్యాయమున ఆంధ్రభారతమున అంగిరసమేదో చర్చించి నిరూపించితిని.

ఇట్లు వివిధ ధ్వనిభేదముల స్వరూపమును నూతనలక్ష్యములతో సమన్వయించుచు ఆంధ్రమహాభారతమునుండి దాదాపు అయిదువందల పద్యములకు ధ్వని పరమైన వ్యాఖ్యానమును గావించితిని. గ్రంథప్రమాణము పెరిగిపోవుచుండుటచే సేకరించిన లక్ష్యములను ఇంచుమించు ఏబదిశాతము వదలివేయవలసివచ్చినది. సహృదయమున: ప్రీతికై నాపరిశోధనసారమును ఆంధ్రవిద్వల్లోకమునకు అందించుచున్నాడను.

విశ్వవిద్యాలయ నిబంధనల ప్రకారము నాసిద్ధాంత వ్యాసమును ముప్వురు ఆచార్యులు పరీక్షించి పట్టప్రదానమునకే కాక ప్రచురణమునకును యోగ్యమైనదిగా ప్రశంసా పూర్వక నిర్ణయమును ఉద్ఘాటించిరి. ప్రాచీనగురుకులపద్ధతిలో సారస్వతసార మెఱిగిన విద్యావయోవృద్ధులు శ్రీమాన్ కలచవీడు శ్రీనివాసాచార్యులుగారును ( అనంతపురం), బ్రహ్మశ్రీ పాతూరి సీతారామాంజనేయులుగారును (ఆదోని), శ్రీ శ్రీ శ్రీ లక్ష్మణ యతీంద్రులవారును (ఏలూరు), గురుముఖమున నేర్చిన విద్యకు భావుకత్వబలమున వన్నెపెట్టుశీలముగల డా. తుమ్మపూడి కోటేశ్వరరావుగారును (అనంతపురం), సంస్కృతాంధ్రాంగ్ల సాహిత్యములయందును, భారతీయతత్త్వ శాస్త్రమునందును స్వయంకృషితోచెప్పుకోదగిన స్థాయి నిర్జించిన శ్రీరామకృష్ణ చెట్టిగారును (విశాఖపట్టణము), మఱికొందఱు మిత్రులును - కొందరు స్థాలీపులాక న్యాయముగా, మఱికొందఱు అసాంతముగ - ఈగ్రంథమును చదివి సదభిప్రాయముల నొసగిరి.

మఱియు నీసందర్భమున అస్మద్గురువర్యులు, వ్యాఖ్యానవైఖరిలో అభినవ మల్లినాథులనదగినవారు, 'శిష్యవాత్సల్యమ్మె చెలువుదీర్చినమూర్తి' కీ.శే.డా.పాటిబండ మాధవశర్మగారు 'నాయనా ; నీగ్రంథము చాలా బాగున్నది. ముఖ్యముగా అంగిరసచర్చ నాకెంతో ప్రమోదమును గూర్చినది' అని వెన్నుతట్టి చేసిన ప్రశంస నాగుండెలో కురిసిన అమృతజల్లు.

అయినను -

'ఆపరితోషా ద్విదుషాం
నసాధుమన్యేప్రయోగ విజ్ఞానమ్'
ఇతిశమ్

-రఘునాథశర్మ.

# ఉపయుక్త గ్రంథసూచి


1. శ్రీమదానందవర్ధన ధ్వన్యాలోకము - అభినవగుప్తలోచనసహితము.
2. భరతముని - నాట్యశాస్త్రము
3. దండి - కావ్యాదర్శము
4. వామనుఁడు - కావ్యాలంకారసూత్రము
5. రాజశేఖరుఁడు - కావ్యమీమాంస
6. కుంతకుఁడు - వక్రోక్తిజీవితము
7. మహిమభట్టు - వ్యక్తివివేకము
8. జగన్నాథపండితరాయలు - రసగంగాధరము
9. అప్పయ్యదీక్షితుఁడు - కువలయానందము
10. పతంజలి - వ్యాకరణమహాభాష్యము
11. భర్తృహరి - వాక్యపదీయము
12. నాగేశుఁడు - పరమలఘుమంజూష
13. కొండభట్టు - స్ఫోటవాదము
14. శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు - ఆంధ్రధ్వన్యాలోకము
15. శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు - రసగంగాధరము - శర్వాణి
16. శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి - ఆంధ్రధ్వన్యాలోకము
17. శ్రీసన్నిధానం సూర్యనారాయణశాస్త్రి - కావ్యాలంకారసంగ్రహవ్యాఖ్య
18. శ్రీ జమ్ములమడుక మాధవరామశర్మ - నవరసగంగాధరము
19. శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి - సాహిత్యదర్పణము
20. శ్రీ పింగళి లక్ష్మీకాంతం - సాహిత్యశిల్పసమీక్ష
21. డా॥ దివాకర్ల వేంకటావధాని - సాహిత్యసోపానములు
22. భండార్కరు ప్రాచ్యపరిశోధనాసంస్థ - మహాభారతప్రతులు
23. ఉస్మానియావిశ్వవిద్యాలయము - ఆంధ్రమహాభారతసంశోధితప్రతులు
24. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ - శ్రీమదాంధ్రభారతప్రతులు
25. శ్రీ విశ్వనాథసత్యనారాయణ - నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి
26. శ్రీ కోరాడ రామకృష్ణయ్య - ఆంధ్రభారతకవితావిమర్శనము
27. ఆచార్య దివాకర్ల వేంకటావధాని - నన్నయభారతము
28. డా॥ పాటిబండ మాధవశర్మ - ఆంధ్రమహాభారతము - ఛందఃశిల్పము
29. డా॥ కేతవరపురామకోటిశాస్త్రి - తిక్కన కావ్యశిల్పము
30. శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావు - భారతము - తిక్కనరచనము
31. ఆంధ్రసారస్వతపరిషత్తు - ఆంధ్రమహాభారతోపన్యాసములు
32. డా॥ నండూరి రామకృష్ణమాచార్యులు - కవిత్రయము
33. డా॥ కట్టమంచి రామలింగారెడ్డి - కవిత్వతత్త్వవిచారము
34. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి - మహాభారతతత్త్వకథనము
35. డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం - నవ్యాలోకము

# విషయసూచిక







ఓమ్

# భారత ధ్వని దర్శనము

## ప్రథమాధ్యాయము

## భూమిక

### 1. ఆనంద మీమాంస :-

" ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్, ఆనన్దాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే; ఆనన్దేన జాతాని జీవన్తి; ఆనన్దం ప్రయ న్త్యభింసంవిశ న్తీతి"

వారుణి యైన భృగువునకు బ్రహ్మతత్వ జిజ్ఞాస యుదయించెను. ఉత్తమగురువైన తండ్రిని పరిప్రశ్నచేయఁగా నతడు తపస్సే జ్ఞానసాధన మని యుపదేశించెను. వారుణి తపస్సాధనము చేయుచు నొక్కొక్కమెట్టులో నొక్కొక్కయంశమును బ్రహ్మమునుగా నెఱుఁగుచు జిజ్ఞాస యుపసంహృతము కాకపోఁగా మఱల మఱల పితృదేవుని పృచ్ఛించెను. ఆతని తపస్సు పక్వమైన స్థితిలో ఆనందము బ్రహ్మమను నెఱుక యాతనికి కలిగెను. ఆ యెఱుక యాతనికి తృప్తినిచ్చెను. ఆతని జ్ఞానదాహ ముపశమించెను. ఇట్లానందమే బ్రహ్మస్వరూప మని తైత్తిరీయోపనిషద్భృగువల్లి నామకప్రశ్నము విశదీకరించుచున్నది.

'ఆజ్' పూర్వక - 'టు - నది - సమృద్ధౌ' అను ధాతువు నుండి యానందశబ్దము నిష్పన్నమైనది. ప్రాణి కేయే వస్తుసముదాయము పరిపూర్ణముగా నుండుట వాంఛితమో యది యుండుటవలన సమకూడునది యని యానందశబ్దమున కర్థము చెప్పనొప్పును. సమస్తప్రాణికోటియు పుట్టినది మొదలు గిట్టుటవరకు నానందైక గమ్యమై శక్త్యనుసారము ప్రయత్నించుచుండుటయు యోగ్యతానుసారము కొంచెమో గొప్పయో పొందుచుండుటయు విదితమే.

ఆనందమనునది లభించినచో నది ప్రాణికోటిచే తరతమభేదము లేక యేకాకారముగ ననుభూయమాన మగుచున్నదా? అనుభవమును శాస్త్రమును గూడ పైప్రశ్నకు కాదనియే సమాధానమిచ్చుచున్నవి. అనుభవింపఁబడు వస్త్వాదికమును బట్టియు, ననుభవించు వ్యక్తినిబట్టియు నానందము యొక్క తారతమ్యము గోచరించుచునే యున్నది. మానవుఁడు తా ననుభవించుచున్న వస్తువున కన్న మిన్న యగు వస్తువు

ననుభవించు నితరునిపై నీసు వహించుట లోకమున దృష్టమే. దీనిని బట్టి యనుభూయ మానమగు నానందములో నంతరము లున్నట్లు నిరూపిత మగుచున్నది.

మానుషానందము కంటె మనుష్యగంధర్వానందమును, దానికంటె దేవ గంధర్వానందమును, దానికంటె పితృదేవతానందమును నూఱేసి రెట్లధికము లనియు నన్నింటికంటె బ్రహ్మానందము వరమోత్కృష్టమైన దనియు నువనిషన్మాత యుపదేశించుచున్నది. (తైత్తిరీయము - ఆనందవల్లి.)

కావున నానంద మందఱియం దేకాకృతిగ నుండదు. తత్తజ్జీవులకు దైవాయత్తముగా లభించు తత్తత్ఫలముల ననుసరించి యవి యనుభవించు నానంద స్వరూపములో ఎక్కువ తక్కువ లుండు ననుట యుపనిషచ్ఛాస్త్ర మంగీకరించిన విషయము.

మానవున కవశ్యముగా కావలసిన యాహారాది పదార్థములు లభింపక పూర్వమవి మాత్రమే లభించుట యభిలషణీయము. అవి లభించిన పిమ్మట నాతని మనస్సు కొన్ని భోగములను వాంఛించును. కన్నులపండువగు దృశ్యమో, కర్ణరసాయనమగు శ్రవ్యమో, జిహ్వాతృప్తి నొదవించు భక్ష్యమో, ఘ్రాణతర్పణమగు గంధమో, యొడలు గగుర్పొడుచు స్పృశ్యమో, లేక మఱేదేని హృద్యమగు పదార్థమో యాతఁడు కోరును. ఇట్లు వాంఛలు పుట్టుచుండునే కాని వాంఛితము లన్నియు లభించుట యెందును గానము. కాని కరుణాలయుఁడగు భగవంతుఁడు మానవ జీవితమునందలి యీ లోపమును పరిహరించి యాతఁడభివాంఛించు నానందమును మార్గాంతరమున ప్రసాదించుచునే యున్నాడు. చిత్రకళావిలసనమే యా మార్గాంతరము.

శిల్పము, చిత్రలేఖనము, నాట్యము, సంగీతము, కావ్యము మున్నగు లలిత కళలలో కవిత్వ మన్నింటికంటె మిన్నయైనది. “నియతకృతి నియమరహితాం హ్లాదైకమయీ మనన్యపరతంత్రామ్. నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవేర్జయతి” అను కావ్యప్రకాశోక్తిని బట్టి కవిసృష్టి బ్రహ్మసృష్టికంటెను గొప్పదని భావింపఁబడుచున్నది. కావ్యమువలన సహృదయునకుఁ గలుగు రసానందము బ్రహ్మానందసహోదర మని యభియుక్తోక్తి.

కావున మహాకఠోరమగు తపస్సుచేతనో, అనన్యమగు భక్తి విశేషము చేతనో, లేక తాదృశమగు మార్గాంతరముచేతనో పొందనగు బ్రహ్మానందసామ్రాజ్యపు పొలిమేరల లోనికి అంతటి మహాప్రయత్నము చేయనక్కర లేకయే కొని పోవు సామర్థ్యము గలది కావ్యము.

కావ్యము వాగర్థమయము. వాగర్థములు పార్వతీ పరమేశ్వరసదృశము లని

మహాకవి కాళిదాసుని సూక్తి. అనఁగా నిందు విశేష మే మున్నదని తీసివేయుటకు వీలులేని మహత్త్వము వాగర్థములకుఁ గల దనుట సంభావ్యము. కావున కావ్య తత్త్వపరామర్శకు ముందు వాగర్థతత్త్వము నరయుట సముచితము.

## 2. వాగర్థములు :-

ప్రాణికోటిలో మానవజన్మము విశిష్టమైనది. ఆహారనిద్రాభయాదులు సర్వ జంతు సాధారణములే యైనను మనుజుఁడు వివేకవంతుఁడు. తిర్యక్కులవలె కేవలము ప్రకృతి సిద్ధమైన ప్రవర్తనమునకు మాత్రమే కట్టుబడి యుండక మానవుఁ డాలోచనా మార్గమున యథేచ్ఛముగాఁ బ్రవర్తింపఁగలఁడు. జంతువులలో మానవుని విశిష్టతకుఁ గల కారణములలో నాతనికిఁ గల వాగ్రూపవమైన అభిప్రాయప్రకటన సామర్థ్యము గణనీయమైనది. తిర్యగ్జాతి యభిప్రాయమును ప్రకటింపనేచాల దని తాత్పర్యము కాదు. కాని దానికి సువ్యక్త వర్ణ విన్యాసరూపవాగ్వ్యాపారము లేదు. 'జన్మనాం నరజన్మ దుర్లభమ్' అనుటలో నీవ్యక్త వాక్ప్రయోగదక్షతయు నొక బలీయమగు కారణము.

'వక్తీతి వాక్' 'ఉచ్యత ఇతి వాక్' అని వాక్శబ్దమునకు రెండు వ్యుత్పత్తులు. జనము దీని నుచ్చరించును, జనముచే నిది యుచ్చరింపఁబడును అని పైవ్యుత్పత్తుల కర్థము. కావున వాక్శబ్దమునకు స్థూలముగా భాష యని అర్థము. భాషింపఁబడునది భాష. ఇది యక్షర - పద - వాక్య - మహావాక్య - స్వరూప.

వాక్శబ్దమునకు సరస్వతి యనునొక పర్యాయపదము గలదు. 'సరః ప్రసరణం సర్వత్రా స్తీతి సరస్వతీ' - అంతట వ్యాప్తి గలిగినది యని యీ శబ్దము యొక్క వ్యుత్పత్తి. అనఁగా వాక్స్వరూప మవిచ్ఛిన్నముగ ప్రవాహరూపమున ప్రసరించునని తాత్పర్యము. ఇట్టి యవిచ్ఛిన్న ప్రసరణశీలము గల సరస్వతి తాత్పర్య ప్రతిపాదనమున నఖండమైన వాక్యరూపముననే గోచరించినను దీనికి స్థూల-సూక్ష్మ-సూక్ష్మతరస్వరూపములను పదవర్ణాదిరూపమున పరిశీలించుటకు వీలున్నది.

ఆస్యమునుండి వెలువడు వాక్కుయొక్క మూలస్థితియేది? అది యెన్ని పరిణామములకు లోనగుచున్నది? అనువిషయమును ప్రాచీన భారతీయమహర్షులు చక్కగా భావించిరి. వాక్కు పరా-పశ్యన్తీ-మధ్యమా-వైఖరీ-నామములతో నాలుగు దశాభేదములు గలిగి వారికి సాక్షాత్కరించినది. మాటాడవలయు ననునిచ్ఛ మొదలుకొని వ్యక్త స్వరూపముతో వెలువడి శ్రోతకు వినఁబడువఱకుఁ గల కాలవ్యవధానము విస్పష్టముగా గుర్తింపఁజాలనిదే కాని యీనడుమ జరుగు వ్యాపారము మాత్రము చాల కలదు. మొదట మానవునకు వివక్ష కలుగును. అంత నాత్మ బుద్ధితోఁ గూడి అర్థములను

బాగుగా నెఱిఁగి మనస్సును నియోగించును. మనస్సు శరీరమునందలి యగ్నిని ప్రజ్వరిల్లఁ జేయును. ఆ యగ్నివలన నొక వాయువు ప్రేరిత మగును. అట్లు నాభిదేశమున ప్రేరితమగు వాయువు హృదయస్థానము ద్వారమున కంఠదేశమునకు వచ్చి యటనుండి ముఖావయవమునఁ గల తత్తత్స్థానములలో తత్తత్ప్రయత్నాదికముచే వ్యక్తధ్వని స్వరూపమును బొందును. ఇట్లు వాగుత్పత్తి ప్రకార మెంతయో కలదు.

ఇందు వివక్షామాత్రదశలో నున్నవాక్స్వరూపమును 'పరా' వాక్కందురు. నాభి ప్రదేశమున మనస్సు కాయాగ్ని నాహత మొనర్చు నప్పటి స్వరూపమే యీ 'పరా'వాక్కు. దీనికి స్థానము నాభిదేశము. కాయాగ్నివలన నుద్బుద్ధమగు వాయువు నాభిస్థానము నుండి యూర్ధ్వగతిలో ప్రయాణము చేయుచు హృదయస్థానమునకు వచ్చు వేళకు వివక్షామాత్ర స్థితినుండి యది వివక్షార్థరూపగా పరిణమించును. అనగా పరావాక్కు ఇచ్ఛారూప కాగా హృదయస్థానమున పశ్యంతిగా నైనవాక్కు జ్ఞానరూప. ఈ రెండును సాధారణ మానవుఁడు గుర్తింపజాలని సూక్ష్మ స్థితులు. ఈ జ్ఞాన రూపస్థితి హృదయము నుండి కంఠ దేశమునకు ప్రసరించు వేళకు వక్త దానిని తన శ్రవణేంద్రియముచే గ్రహింపఁ గలుగుచున్నాఁడు. అనఁగా నప్పటి కది ధ్వనిరూపావిర్భావము యొక్క ప్రథమ స్థితిలో నున్నదని తాత్పర్యము. కావుననే ఈ దశను వివక్షితార్థ ధ్వనిరూపనుగా తద్జ్ఞులు వివరింతురు. ఇదియే మధ్యమ యనఁబడును. ఇప్పటికి వాక్కు ఇచ్ఛారూపజ్ఞాన రూపములనుండి క్రియారూపముగా పరిణమించినది. అట్లు పరిణమించిన మధ్యమవాక్కు కంఠమున వర్ణోత్పత్తి కనుగుణమగు ప్రాణవాయు ప్రదానముచే కావలసిన వ్యంజన ధర్మములను సమకూర్చుకొని, కంఠబిలము యొక్క వివారసంవారదశలచే శ్వాసమహాప్రాణభేదములను, నాదాల్పప్రాణ భేదములను బొంది, ఆన్యభాగమునకు వచ్చి, అచట కంఠతాల్వాదిస్థానములయందు స్థాన కరణముల స్పర్శ, అస్పర్శ, వివృతి, ఈషద్వివృతి, సంవృతి అను ప్రయత్నములచే భిన్న వర్ణస్వరూపములు గలదియు శ్రోతృశ్రవణేంద్రియగోచరము నగువైఖరీ స్వరూపమును బొందుచున్నది. ఈ వైఖరీవాక్కు వివక్షితార్థాభివ్యంజకవాక్యరూప. పైఁ జెప్పబడిన యనుప్రదానవివారాది బాహ్యప్రయత్నముల వలనను, స్థాన కరణములు స్పృశించుట మున్నగు నాభ్యంతర ప్రయత్నముల వలనను నిష్పన్నమైన వర్ణ సముదాయరూపముగా నేర్పడిన పదబంధ స్వరూపముగలదియే యీ వైఖరీ వాక్కు. ఇట్లు పరావాక్స్వరూపముతో వక్తయొక్క యిచ్ఛారూపమున నాతసినాభియందు పొలమరించిన వక్తవ్యము వైఖరీ రూపమున శ్రోతయొక్క శ్రవణపుటముల ద్వారమున నాతనిహృదయమును జేరి విశ్రాంతమగుచున్నది.

(ఆధారము - ఆంధ్రమహాభారతము ఛందఃశిల్పము. పుట 58 - డా॥ శ్రీ పాటిబండ మాధవశర్మ)

ఇట్లుచ్చరితమైనదానిని మాత్రమే కాక వివక్షారూపస్థితి మొదలుకొని తక్కిన వైఖరీపూర్వస్థితులను గూడ వాక్ఛబ్దముచేతనే భారతీయ మహర్షులు వ్యవహరించిరి. భారతీయ తార్కికు లిట్లు వాక్కు యొక్క నాలుఁగు దశలను మెలఁకువతో గుర్తించి వాని స్వరూపమును వివరించిరి.

ఇట్లు వాక్కనునది ముఖావయవముల నుండి వెలువడు వ్యక్తావ్యక్తరూపమైన ధ్వనిసముదాయరూపమని సారాంశము. స్వరములుగా వ్యంజనములుగా విడఁబఱచి చూచుటకు వీలైన అకారకకారాదులు వ్యక్త ధ్వనులు. వెక్కిరించుటకుఁ జేయువికార ధ్వనులు, సంతోష విచారములను సూచించునట్టి హాసరోదనధ్వనులు మున్నగున వన్నియును నవ్యక్త ధ్వనులు. స్థూలరూపమగు నీవాక్కునకే భాష, వాణీ, సరస్వతి, బ్రాహ్మి మున్నగు నామాంతరములు గలవు.

అభిధేయాంశము వక్తయందు వివక్షారూపమునను, శ్రోతయందు శుశ్రూషా రూపమునను అర్థింపఁబడును గావున నది యర్థశబ్దవాచ్య మగుచున్నది. (అర్థ్యతే ఇత్యర్థః - అర్థ ఉపయాచ్ఞాయామ్ - లింగాభట్టీయము). ఇది వాక్కుతో నవ్యభిచరితము. కావుననే శబ్దార్థముల సంబంధము పార్వతీ పరమేశ్వరుల సంబంధము వంటిదని యుపమాపరమేశ్వరుఁడు కాళిదాసు వచించెను. వాక్కు శ్రుతిగోచరకాఁగా నర్థము హృదయగోచరము. కావుననే వాక్కు చెవులఁబడినను అర్థ మొకప్పుడు తెలియకపోవుట లోకమునఁ గానవచ్చుచున్నది. శ్రోత కభిధేయాంశము సంపూర్ణముగాఁ తెలియవచ్చు వఱకును నాతని శుశ్రూష యుపశమింపదు. ఉత్తమ శ్రోతకు వినినతోడనే యర్థము భాసించును గాక - తదితరులకు తెలియరాకున్నది కదా! శబ్దార్థముల సంబంధమవ్యభిచరితమను టెట్లని శంకింపరాదు. అట్లు తెలియరాకుండుట శ్రోతృశక్తికృతమే కాని వాగర్థసంబంధకృతము కాదు.

ఒక్కొక్కప్పుడు ప్రయుక్తమగువాక్కునకు భిన్నార్థకల్పనము చేయుట లోకమునఁ గానవచ్చును. వాగర్థసంబంధము నియతమే అయినచో నీ స్థితి కలుగు టెట్లు? అను ప్రశ్న రావచ్చును. సమాధానమునకై వాగర్థ సంబంధ మెట్టిదియో పరిశీలింపవలయును.

పదములు శక్తములు. ఈ పదమునుండి యీయర్థము బోద్ధవ్యము అను నీశ్వరసంకల్పమునే శక్తి యందురు. అట్టి శక్తి కలవి శక్తములు. ఇట్లనుట ప్రాచీన దార్శనికసంప్రదాయము. లోకములో నొక్కొక్కవస్తువున కొక్కొక్క ధర్మము నియతము.

కాని సంస్కారాదుల వలనను, ఇతర వస్తుసమ్మేళనముల వలనను ఆ వస్తుధర్మము నన్యథాకరింపవచ్చును. ధాన్యము నెండఁబెట్టుట, దంపుట, మఱుఁగుచున్న నీటిలో నుడుకఁబెట్టుట మున్నగునది సంస్కారవిశేషము. వ్యంజనాది సమ్మిశ్రితమగుటచే బియ్యమున రుచితోపాటు క్రొత్తరుచి వచ్చుచున్నది కదా! అట్లే యీపదమునుండి యీయర్థము బోద్ధవ్యమనుట కీశ్వరసంకల్పమే కారణము కాని యీపదములను ప్రయోగించువైఖరి, ప్రయోక్తృభేదము, కాకువులు మున్నగునవి యర్థమున కనేకత్వమును గల్పింపఁగలుగుచున్నవి. దీనివలన శబ్దార్థ సంబంధము యొక్క నియతికి హాని లేదు. సన్నివేశబలము, కాక్వాదిప్రయోగము మున్నగువాని వలనఁ గలిగిన యర్థాంతరము తాత్కాలికము. సంకేతరూపమైన యర్థము స్థిరమైనది. మఱియు నాయర్థాంతరముకూడ సంకేతితార్థము నెట్లో యంటిపెట్టుకొనియే యుండును.

స్థూలముగా వాగర్థతత్త్వ మిటఁబరిశీలింపఁబడినది. వాక్కున కక్షరాద్యంగములు గలవు. గృహ మనఁగా ఱాలు, మట్టి, కొయ్య, యినుము మున్నగు పదార్థముల సంయోజనముచే రూపొందిన వస్తువిశేషమే యైనను స్థూలదృష్టికి పాషాణాదులు గోచరములు కాని విధమున వాగంగములగు నక్షరపదాదులు స్థూల దృష్టికి గోచరింపవు. అఖండమగు వాక్యస్వరూపమే గోచరమగును. కాని తత్త్వ జిజ్ఞాస స్థూలదృష్టితో నుపసంహృతము కాదు. సూక్ష్మ పరిశీలనము చేయవలయును. కావున వాగంగతత్త్వ పరిశీలనము వాక్తత్త్వనిరూపణమునం దావశ్యకమే యగును. అగుటచే వాగంగములైన అక్షర పద వాక్య స్వరూపనిరూపణమునకై ప్రయత్నము అవసరమగుచున్నది. మహాకావ్యమును బట్టి వాక్యము కూడ నొకయంగముగనే యిట సంభావింపవలయును.

భాషయొక్క గుర్తింపఁదగిన కనిష్ఠరూపము వర్ణము. వర్ణమునకే యక్షరమనియు నామాంతరము. అక్షర శబ్దమునకు మహాభాష్యకారులు శ్రీపతంజలి రెండు విధములైన వ్యుత్పత్తులను చూపిరి. 'అక్షరం నక్షరం విద్యాత్' అక్షరమనఁగా క్షరము కానిది - చెడని స్వరూపము గలదియని దీని కర్థము. బ్రహ్మతత్త్వము వలె నిది యవినాశి యని భావము. అక్షరములు సూర్యచంద్రనక్షత్రాదులవలె సృష్ట్యాదియం దుత్పన్నములై సృష్ట్యంతమున రూపఱుచున్నవని మహాభాష్యోద్ద్యోతమునఁ జెప్పఁబడినది (మ.భా.పు 102). కావున వీనికిట్లు వ్యవహార నిత్యత సంభావింపఁబడినది. మఱియు భర్తృహరి తన వాక్యపదీయమున శబ్దతత్త్వము నిట్లు వక్కాణించెను.

'అనాదినిధనం బ్రహ్మ శబ్దతత్త్వం య దక్షరమ్
వివర్తతేఽర్థభావేన ప్రక్రియా జగతో యతః' (వాక్యప. 1. 1.)

ఇందలి విశేషములను బట్టియు అక్షర నిత్యత నిరూపిత మగుచున్నది.

అక్షర నిత్యత్వభావనవలన ప్రయోజన మేమి? నిత్యమైన వస్తు వెల్లరకు నుపాదేయము. అన్యము కాదు. కావున నక్షర నిత్యత్వభావన బ్రహ్మతత్త్వభావన వంటిదని ప్రాచీనుల యభిప్రాయము. పతంజలి భగవానుఁడును అక్షరోపదేశ ప్రయోజనము నుటంకించుచు నిట్లనెను.

"వర్ణజ్ఞానం వాగ్విషయో యత్ర చ బ్రహ్మ వర్తతే
తదర్థ మిష్టబుద్ధ్యర్థం లఘ్వర్థం చోపదిశ్యతే."

మ. భాష్య. ప్రథమఖండమ్ పు. 102.

ఇఁక భాష్యమునఁ జెప్పబడిన రెండవ నిర్వచనము "అశ్నోతే ర్వాసరో క్షరమ్" అనునది. వ్యాప్త్యర్థకమగు 'అశూ' ధాతువున కౌణాదికమైన 'సరన్' ప్రత్యయము చేర్పగా అక్షర మగునని దీని కర్థము. అర్థమును వ్యాపించునదని తాత్పర్యము. వర్ణపర్యాయ వాచకమగు నక్షరశబ్దమునకుఁ బై రెండు నిర్వచనములలో మొదటిది తాత్త్వికమైన యర్థమును, రెండవది యది చేయుపనిని బోధించినవి.

వర్ణశబ్దమునకును "వర్ణ్యతే, వర్ణయతి చ వర్ణమ్" అని రెండు వ్యుత్పత్తులు లింగాభట్టీయమునఁ జూపఁబడినవి (పుట 745). అక్షరపరముగా వర్ణింపఁబడునది, వర్ణించునది అను వ్యుత్పత్తుల కర్థమేమి? అక్షరము బ్రహ్మముగా భావింపఁబడినది కావున నిది వర్ణింపఁబడుట = కొనియాడఁబడుట సముచితమే. బ్రహ్మమును లేదా జగద్విషయము నిది వర్ణించును గావున రెండవ వ్యుత్పత్తియు సరిపడును.

వర్ణ - అక్షరశబ్దములకు ప్రాచీను లూహించిన యర్థములు పైతీరున నున్నవి. ఇట్టి వర్ణముల కర్థసమర్పణమున నుండుస్థితి యెట్టిది? పదములో వర్ణములు ప్రత్యేకముగా నర్థవంతములా? లేక అక్షర సముదాయము మాత్రమే అర్థవంతమా? అను చర్చ మహాభాష్యమునఁ జేయఁబడినది. ఆచర్చకు సారాంశమియ్యది. ఏకవర్ణములైన ధాతు ప్రాతిపదిక ప్రత్యయ నిపాతము లర్థవంతములే యగుచున్నది. 'ఏ'తి, 'ఏ' షు, ఔపగ 'వః' 'అ' అవేహి అనునవి క్రమముగా నుదాహరణములు. తదితరము లగుకృష్ణమున్నగు శబ్దములలో నక్షర సముదాయమే యర్థవంతము. వాని ఏక దేశము లగుకకారాదు లర్థవంతములు కావు. అయినచో నర్థరహితములైన వాని సముదాయ మర్థవంత మనుట యెట్లని శంకింపరాదు. సూటిగా ఖాద్యములు కాని కొన్ని పదార్థముల సముదాయము పాకరూపమున ఖాద్యమైనట్లు అర్థసమర్పణ శక్తిసముపేత మగు వర్ణ సంఘాతము అర్థవంతమైన పదమగుచున్నది.

వైయాకరణులు అర్థవంతము, ధాతుభిన్నము, ప్రత్యయభిన్నము, ప్రత్యాయాంతభిన్నము నగుశబ్దస్వరూపమునకు ప్రాతిపదికమని పేరిడిరి. (అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్. 1-2-45) ప్రత్యయాంతము లైనను కృదంత, తద్ధితాంత, సమాసములకును ప్రాతిపదిక సంజ్ఞ కలదు (కృత్తద్ధితసమాసాశ్చ 1-2-46) క్రియావాచకము లైన 'భూ' మున్నగునవి ధాతువు లనఁబడును. (భూవాదయో ధాతవః 1-3-1) ప్రాతిపదికము గాని, ధాతువు గాని స్వతంత్రముగా వాక్యమునఁ బ్రయుక్తము కానేరదు. అది విభక్త్యంతము కావలయును. వాక్యము లోని పదములకు పరస్పరము గల సంబంధమును విభజించి చూపునవి కావున సుప్పులును, తిఙ్ఙులును విభక్తులనఁ బడినవి. శబ్ద స్వరూపమునకు సుప్తిఙ్ ప్రత్యయ యోగమువలన పదత్వము సిద్ధించును. (సుప్తిఙన్తం పదమ్1-4-14) తార్కికులు "శక్తం - పదమ్" శక్తితో కూడినది పదముఅనిరి.

'అర్థస్మృత్యనుకూలపదపదార్థసంబంధశ్శక్తిః' అని వారు శక్తిని నిర్వచించిరి. అది కలది పదమని వారియభిప్రాయము. "తేవిభక్త్యన్తాః పదమ్" న్యాయసూత్రములు - 26 ఆహ్నికమ్ 2-సూ-57 యథాదర్శనం వికృతా వర్ణాః విభక్త్యంతాః పదసంజ్ఞా భవన్తి - వాత్స్యాయన భాష్యము. వాక్యమునందు స్వతంత్రప్రయోగార్హత కలశబ్ద స్వరూపమునకే పదత్వ వ్యవహార ముండుట యనునది సర్వసమ్మతమగు సిద్ధాంతము. 'రామ' అను ప్రాతిపదికముతో కూడక 'సు' ప్రత్యయము గాని 'సు' ప్రత్యయనిరపేక్షముగా 'రామ' యను ప్రాతిపదికము గాని వాక్యమున నిలువఁజాలవు. కావున నీరెంటి సమాహారరూపమైన 'రామః' మున్నగు విభక్త్యంతరూపములే పదములగునని తద్‌జ్ఞుల తలంపు.

లోకమంతయు ముఖ్యముగా క్రియాత్మకము. క్రియ వస్తువునో వ్యక్తినో యాశ్రయించియుండును. కావున లోకమునందలి వస్తువులు, వ్యక్తులు మున్నగు వానిని వచించునవి నామవాచకము లనియు, వ్యాపారావబోధకము లగుపదములు క్రియలనియు వ్యవహారము. స్థూలముగా నిట్లుపదములు రెండు విధములే. లింగ విభక్తివచనము లను బట్టి స్వరూపములో నెట్టిభేదమును బొందని యవ్యయములను మఱియొక భేదము కూడ కలదు. "సదృశం త్రిషు లిఙ్గేషు సర్వాసు చ విభక్తిషు, వచనేషు చ సర్వేషు యన్న వ్యేతి త దవ్యయమ్." అని లాక్షణికు లవ్యయములకు నిర్వచనము చెప్పిరి. వీనితోపాటు 'ప్ర'మున్నగు నుపసర్గములను గూడ కొందఱు పదములుగా లెక్కింతురు. ఇట్లు పదములు నాల్గువిధము లగుచున్నవి. వర్ణ సముదాయ రూపములగు పదములు సంకేతమును బట్టి తత్తదర్థములందు వ్యవహరింపఁబడుచున్నవి. ఈ సంకేతము ఈశ్వర

సంకల్పరూపమని తార్కికుల భావన. "అస్మా త్పదా దయ మర్థో బోద్ధవ్య ఇతీశ్వరసంకల్ప శ్శక్తిః" అని వారు శక్తిని నిర్వచించుట పైయభిప్రాయమునకు దోహదము. దేశకాలాను గుణముగ పదముల కర్థములు మాఱుచుండుటయు క్రొత్త పదములు రూపుదిద్దుకొను చుండుటయు గాన వచ్చును. కావున సంకేతమునకు మానవ సంకల్పమే కారణమని కొందఱందురు. కాని -

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽ ర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" ॥

(శ్రీమద్భగద్గీత - 18-16)

అను గీతావాక్యము ననుసరించి యేదేశమునందైనను, ఏకాలమునందైనను మానవుని హృదయకుహరమునుండి వెలువడు సర్వ విషయమునకు కర్త పరమాత్ముఁడే అని విశ్వసించువారికి సంకేత మీశ్వరకృతమనుటలో విప్రతిపత్తి యుండదు.

ఇట్టి సంకేతితములగు నర్థములు గల పదముల సముదాయ మొకనియతగతి ననుసరించి వాక్యమగుచున్నది. "ఆకాంక్షా యోగ్యతా సన్నిధిశ్చ వాక్యార్థజ్ఞాన హేతుః. పదస్య పదాంతరవ్యతిరేక ప్రయుక్తాన్వయాననుభావకత్వమాకాంక్షా. అర్థాబాధో యోగ్యతా. పదానా మవిలంబనే నోచ్చారణం సన్నిధిః" అని తర్కసంగ్రహమునఁ జెప్పఁబడినది. దీనిని బట్టి కేవలపదసముదాయము వాక్యము కానేరదు. ఒక పదమును వినినతోడనే తరువాతి పదమును వినవలయు ననుకోరికయు, పదముల యర్థములకు పరస్పర సంబంధమున బాధ లేకుండుటయు, పదముల దగ్గఱతనమును నెందుండునో యట్టిదానినే వాక్యమందురు. వాక్య మఖండముగా ప్రతిపాదించు నర్థమే వక్తృశ్రోతల చిత్తములయందు సమముగా నెలకొని లోకవ్యవహారమును సాగించుచున్నది.

ఇట్లు వాక్స్వరూప విషయక విచార మిట సంగ్రహముగ రూపొందినది. దీనితో నవినాభావ సంబంధము గల యర్థమునందలి వైవిధ్యము, అందలి ప్రాధాన్యము అను నంశముల విచారణమే ప్రస్తుత గ్రంథ ప్రధాన లక్ష్యము. అది కావ్యముఖమునఁ జేయఁ బడుచున్నది. పదము పదాంతరములతోఁ గూడి ప్రత్యేకలక్షణములతో వాక్యమైనట్లే వాక్యము వాక్యాంతరములతోఁ గూడి కొన్ని ప్రత్యేక లక్షణములతో కావ్య మగుచున్నది. కావ్య సముదాయమునే మహా వాక్యమనియు నందురు. అయ్యది కావ్యాది రూపములతో నుండును. కావున కావ్యమన నేమో దాని ప్రత్యేక లక్షణము లెట్టివో పరిశీలింప వలసియున్నది.

## 3. కావ్యము

అక్షరసముదాయరూపమైన దెల్ల పదము కాఁజాలదు. అర్థవంతమై ప్రయోగార్హత నది సంపాదించుకొనవలయును. పదసముదాయరూపమైన దెల్ల వాక్యము కానేరదు. ఆపదములు యోగ్యతాకాంక్షాలక్షణలక్షితములైన అర్థములు గలవియై యాసత్తియుక్తములై యుండవలయును. వాక్యసముదాయమో, వాక్యమో కావ్యము కాఁజాలదు. అది శ్రోతృపఠితృహృదయమును భేదించి తల లూపఁజేయవలయును. కావుననే లోకవ్యవహారమునకై ప్రయోగించిన వాక్యసముదాయముకంటెను కావ్యమునందలి వాక్యసముదాయము విలక్షణమైనది. ఈవైలక్షణ్యమును లాక్షణికు లనేకు లనేకవిధముగా నిర్వచించిరి. ఎవరిదృక్కోణము వారిది. ఎవరి సామర్థ్యము వారిది. కావుననే కావ్యలక్షణనిర్వచనము నందును, తదితర కావ్యాంగకావ్యాత్మ నిర్వచనములందును నానాత్వము సిద్ధించినది. లాక్షణికులనేకులు చెప్పిన కావ్య లక్షణములను శ్రీసన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు తమ కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్యానమునందు క్రోడీకరించిరి. వాని స్వరూపమిట్టిది. సహితములగు శబ్దార్థములు కావ్యమని భామహుఁడు. గుణాలంకార యుక్త శబ్దార్థములు కావ్యమని వామనుఁడు. దోషరహితములు, గుణసహితములునై కొండొకచో నలంకృతములు కాకపోయినను శబ్దార్థములు కావ్యమగునని మమ్మటుఁడు. నిర్దోషమై గుణాలంకార రసవంతమైన వాక్యము కావ్యమని భోజుఁడు. గుణాలంకార రీతిరసోపేతమైన సాధుశబ్దార్థసంబంధము కావ్యమని వాగ్భటుఁడు. నిర్దోషమును గుణాలంకారరీతి వృత్తిమంతము నగువాక్యము కావ్యమని పీయూషవర్షుఁడు. రసాదిమంతము కావ్యమని శౌద్ధోధని. రసాత్మకమైన వాక్యము కావ్యమని విశ్వనాథుఁడు. ఇష్టార్థభూషిత మగు పదావళి కావ్యమని దండి. రమణీయార్థప్రతిపాదకమగు శబ్దము కావ్యమని జగన్నాథుఁడు. రసాలంకారయుక్తమును సుఖవిశేషసాధనము నయినది కావ్యమని కేశవమిశ్రుఁడు. (కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్య, పు. 105)

ఈలక్షణములన్నియు పరికింపఁగా మొత్తముమీఁద చాలవఱకును సదోషములే. ఉత్తరోత్తరలాక్షణికులు పూర్వపూర్వుల అభిప్రాయములను ఖండించియే తమతమ యభిప్రాయములను బాదుకొలువ యత్నించిరి. హృదయావర్జకమైన మార్గమున పురుషార్థసిద్ధికి సముచితమగుదారిని ప్రసాదించి ఉపదేశానందముల నొసఁగుశక్తిగల వాక్యసముదాయము కావ్యమనుట సముచితము. అలంకారములున్నంత మాత్రమున సౌందర్య మినుమడింపదు. సముచితసన్నివేశ విన్యాసచాతురివలననే వాని కలంకారత సిద్ధించును. "కి మివ హి మధురాణాం మండనం నాకృతీనామ్?" అను న్యాయము

ననుసరించి యలంకారములు లేకున్నను గొండొకచో లోపము కలుగదు. గుణము లున్నంత మాత్రమున నుత్తమత్వము సిద్ధింపదు. దేశకాలానుగుణ్యము వానికి సిద్ధించినపుడే గుణత్వము సంధిల్లును. అట్లే తదితర కావ్యాంగములును కావ్యము యొక్క పార్యంతిక ప్రయోజనమైన యానందపరిపాక స్థితికి తోడ్పడనిచో గుణాలంకారవృత్తిరీతి శయ్యాద్యనేకములలో నొక్కటియు కొఱగాదు. కావున జగన్నాథుఁడు చెప్పిన "రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్యమ్" అను నిర్వచనము పైవానిలో తలమానిక మగుచున్నది. దుర్లభనరజన్మమునకు ప్రాప్తవ్యమయిన మోక్షపురుషార్థసిద్ధి యనుపేక్షణీయము కావున ఆనందముతో పాటు ఉపదేశమును గూడ నీనిర్వచనమున స్ఫురింపఁజేసినచో మేలనిపించును.

పై నిర్వచనము లన్నింటను వాక్యము, శబ్దము అనువాని ఏకవచనత్వము సముదాయమునకుఁ గూడ నుపలక్షణము.

కావ్యము యొక్క పార్యంతిక ప్రయోజనమైన యానందము సిద్ధించుట కందు తప్పక యేదియుండవలయు ననుమీమాంస బయలుదేఱినది. దానికి సమాధానముగా అలంకారము, వృత్తి, గుణము, రీతి, రసము మున్నగున వెన్నియో ప్రతిపాదింపఁ బడినవి. పూర్వపూర్వలాక్షణికులు దర్శించి ప్రదర్శించిన యలంకారాద్యంశముల నుత్తరోత్తరాలంకారికులు ఖండించి తమతమయభిప్రాయములను నెలకొల్పసాగిరి. తుది కానందవర్ధనులు రసాదిరూపమైన ధ్వనియే కావ్యాత్మ యనియు నది లేనిచో కావ్యము శవప్రాయ మగు ననియు గుణాలంకారాదులకంటె నది మిన్నయగునంగి యనియు తమ సునిశిత మేధా విశేషముచే సుసూక్ష్మముగ విచారించి నిరూపించిరి. దానిని గూర్చి విచారించుటకు ముందు లోకోత్తరానందదాయియగు కావ్యమునకు స్రష్టమయిన కవి యొక్క తత్త్వము భావింపవలయును.

### 4. కవి :-

భారతీయులు కవి కొసంగినస్థాన మనితరసాధారణమైనది. 'కవతే చాతు ర్యేణేతి కవిః' - 'చాతుర్యముతో వర్ణించువాఁడు' అను సాధారణమైన వ్యుత్పత్త్యర్థము గోచరించినను మొట్టమొదట నీశబ్దము "కవి ర్మనీషీ పరిభూః స్వయంభూ" రిత్యాది శ్రుతివాక్యములలో భగవత్పరముగా ప్రయుక్తమైనది. పిమ్మట పరతత్త్వదర్శనము గావించిన ఋషిపరముగను, వర్ణనానిపుణుఁడైన కావ్యస్రష్టపరముగను వాడఁబడినట్లు "నానృషిః కురుతే కావ్యమ్" "కవయః క్రాన్త దర్శనః" ఇత్యాద లోకోక్తులవలనఁ దెలయుచున్నది. కవి లోకోత్తరానంద జనిస్థానమగు కావ్యమును నిర్మింపఁదలఁచి భావనామయలోకమున విహరించుచు,

నవనవోన్మేషశాలిని యగు ప్రజ్ఞకలవాఁడై, దానికి వ్యుత్పత్తితో నపూర్వ వికాసమును సంధించి నిరంతరాభ్యాసపాటవమున నొక విలక్షణవర్ణనా నైపుణ్యమును సాధించును. దానితో నాతఁడు కావ్యసృష్టి కుపక్రమించి నిఖిలలోక స్రష్టయగు పరమేష్ఠితో సాదృశ్యమును భజించుచున్నాఁడు. పరమేష్ఠిసృష్టి యెంత విచిత్రమో, యెంత వైవిధ్యము గలదియో, యెంతగా ననూహ్యమో కవిసృష్టి కూడ నంత విచిత్రము, వైవిధ్యవిలసితము, నూహాస్వాదువునై విరాజిల్లును. కావుననే 'కవి శృంగారి యైనచో లోకమును రసమయ మొనరించును. వీతరాగుఁడైనచో నది నీరసమే కాఁగలదు. కవి సర్వతంత్రస్వతంత్రుఁడై యచేతనములను చేతనములనుగా చేతనముల నచేతనములుగా తీర్చిదిద్దఁగలఁడు.' అని యానందవర్ధనులు కవిశక్తి సామర్థ్యములను వక్కాణించిరి.

"రమ్యం జుగుప్సిత ముదార మథా ఽపి నీచ
ముగ్రం ప్రసాది గహనం వికృతం చ వస్తు,
యద్వా ప్యవస్తు కవిభావుకభావ్యమానం
తన్నాస్తి యన్న రసభావ ముపైతి లోకే"

అను దశరూపకమునందలి శ్లోకముకూడ కవిసామర్థ్యమునకు నివాళి యొసఁగుచున్నది.

మఱియు చతుర్ముఖుని సృష్టికంటెను కవిసృష్టి విశిష్టతరమైనదని మమ్మటాచార్యుఁడు సహేతుకముగా నిరూపించెను.

"నియతకృతి నియమరహితాం, హ్లాదైకమయీ మనన్యపరతంత్రామ్
నవరసరుచిరాం నిర్మితి, మాదధతీ భారతీ కవే ర్జయతి"

బ్రహ్మసృష్టి నియతధర్మ సముపేతము. కవిసృష్టి పరమ స్వతంత్రము బ్రహ్మసృష్టి సుఖదుఃఖ సమ్మిశ్రణరూప. కవి సృష్టి హ్లాదైకమయి. బ్రహ్మసృష్టి పరమాణ్వాద్యుపాదానకారణములు లేనిదే సాగదు. కవిసృష్టి కట్టివానితో పనిలేదు. బ్రహ్మసృష్టిలో రసము లారు కాఁగా కవిసృష్టిలో నవి నవత్వమును బొందినవి. ఇట్లిది దానికన్న మిన్న యగుచున్నది.

విశ్వసృజుని సృష్టిలో నున్న నిరస వస్తువులను గైకొని కవి దైవదత్తమగు ప్రతిభతో వాని కొకవినూతనత్వమును గల్పించి వానిని రసవంతములుగా రూపొందించు చున్నాఁడు. కావుననే లోకమున నేవ కలిగించు మాంసముల ప్రోవులు, మెదడుల తండములు, నరముల వరుసలు మున్నగునవి కూడ రసమునకు విభావములగుచున్నవి. అట్లే భయంకరసన్నివేశముల నతఁడు తన వాగ్విలాసముచే నానందఘనమగు రసస్థితికె కొనిపోవుచున్నాఁడు. సర్వజంతు పరిహార్య మగు శోకమును కరుణ రసముగా మార్చి

సహృదయహృదయముల నలరించుచున్నాఁడు. ఇంతకంటె కవి ఘనతకు వేరు నిదర్శనము లేమి కావలయును? ఇట్లు సారహీనమై యూషరక్షేత్రమువంటి సంసారమును ప్రతిభామృతవృష్టి సేచనముచే రసమయము గావించు కవిలో నట్టిశక్తిని పండించు లక్షణము లేవియో యరయుదము.

## 5. కావ్య హేతువు :-

"కావ్యం తు జాయతే జాతు కస్యచి త్ప్రతిభావతః" అను భామహోక్తిని బట్టియు "శక్తి ర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్ కావ్యజ్ఞ శిక్షయా భ్యాస ఇతి హేతు స్తదుద్భవే." అను మమ్మటాచార్యుని వాక్కును బట్టియు ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసముల సమాహారము కావ్యహేతు వనుట తెలియవచ్చుచున్నది. 'ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా' అని భామహుఁడు ప్రతిభానిర్వచనము గావించెను. ప్రజ్ఞ యనఁగా ప్రకర్షముగా తెలిసియుండుట. ఉన్మేష మనఁగా వికాసము. నవనవమైన ఉన్మేషమనఁగా నిత్యనూతనమైన వికాసము. దానిచే ప్రకాశించు ప్రజ్ఞకు ప్రతిభ యని వ్యవహారము.

ఒక ముగ్ధసుందరవదనారవిందము కల వ్యక్తి నిద్రనుండి మేల్కొనుట నెందఱో చూచి యుండవచ్చును. మేల్కొనుట యనువ్యాపారమునకు పట్టు కాల వ్యవధి స్వల్పమే కావచ్చును. కాని ఆ కొంచెము వ్యవధిలో కనుపాప తెఱవని ఱెప్పలలో కొంచెము కదలుట మెలమెల్లగా పక్ష్మములు విప్పారుట, జృంభోత్పాదనము, ఒడలు విఱిచికొనుట, పాన్పునుండి యీవలకు వచ్చుట మున్నగు సూక్ష్మాంశములు గోచరించును. ఈ ప్రక్రియాక్రమమును జూచినవాఁ డెల్ల నిది కవితావస్తువగు నని తలఁపఁడు. ఆవృత్తచక్షువై, ప్రత్యగాత్మను దర్శించు ఋషి హృదయము వలె నీ సన్నివేశమును గాంచి భావనచే తన్మయత్వమును భజించిన కవిహృదయము ఈ మేల్కొనుట యందలి అనున్మిషిత పక్ష్మాంతర స్థితకనీనికాచలనమును గాంచి పద్మకోశమున బందీకృతమైన తుమ్మెద చిఱు కదలికను స్మరించును. సహృదయహృదయానంద సంధానతత్పరత్వమున నాస్థితిని మధుర వాగ్గుంభనముతో వర్ణించును. కాళిదాసమహాకవి దైన యీ క్రింది శ్లోకము నరయుఁడు.

"తద్వల్గునా యుగపదున్మిషితేన తావత్
సద్యః పరస్పరతులా మధిరోహతాం ద్వే
ప్రస్పందమానపరుషేతరతార మన్త
శ్చక్షు స్తవ ప్రచలితభ్రమరం చ పద్మమ్." రఘు. 5-68.

ఇట్లు లౌకిక వస్తుదర్శనము వలననో, భావనాబలము వలననో కవి హృదయములో నుప్పొంగు శక్తి విశేషమును ప్రతిభ యనుచున్నాము. ఈ ప్రతిభ వ్యక్తి

విశేషములను బట్టి యనంతవిధములుగా నుండును. కావుననే యొకేవస్తువు నెందఱుకవు లెన్నివిధములుగా వర్ణించినను నది మనోహరముగా నుండుటయు, కవిపరంపరావాహిని నిరంతరముగా సాగుచున్నను వర్ణనీయములకు తఱుగు లేకుండుటయు జరుగుచున్నది. కవితా హేతుసముదాయమున ప్రధానమగు నీప్రతిభ స్వరూపమిట్టిది.

కవికి ప్రతిభ పుష్కలముగా నుండుట మాత్రమే చాలదు. తాను భావించిన యంశము వినూతనముగా నున్నదా? లేదా? శాస్త్రవిరుద్ధమా? కాదా? ఆనందదాయక మగునా? కాదా? అను నిట్టియంశములను నిరూపించుకొనవలయు నన్నచో నతఁడు తనకు పూర్వకాలికములగు శాస్త్రములందును కావ్యములందును సుదృఢమైన వ్యవసాయము కావించి వానిని జీర్ణము చేసికొనవలయును. అట్లు చేయుట వలనఁ గలుగు పాండిత్య విశేషమునే వ్యుత్పత్తి యందురు. దీనినే మమ్మటుఁడు లోకశాస్త్రకావ్యాద్యవేక్షణమువలనఁ గలిగిన నిపుణతగా పేర్కొనెను. అట్టి వ్యుత్పత్తి కలిగిన తనమును గొందఱు కవులు వాచ్యముగా చెప్పియుండుటయు గమనింపఁ దగినది. నన్నయభట్టారకుఁడు తాను సంహితాభ్యాసుఁడనియు, నానాపురాణవిజ్ఞాన నిరతుఁ డనియు, లోకజ్ఞుఁ డనియు, తనకు భారత రచనము నందభిమతముగ తోడయి నిర్వహించిన నారాయణభట్టు వాఙ్మయధురంధరుఁ డనియు చెప్పుకొనెను. ప్రతిభ సారవంతమైన నేలవంటిది. అందు బంగారమే పండవచ్చును. కాని కృష్టము కానిచో నది పంట నొసఁగదుకదా! కావున ప్రతిభకు పదను పెట్టి మధుర జలమునందు నిండించుట వంటిది వ్యుత్పత్తి. అప్పటికి హృదయక్షేత్రమునఁ బడిన భావబీజములు శీఘ్రముగా మొలకెత్తి రసవంతములైన కావ్యఫలములుగా పరిణమించును.

ఎంత ప్రతిభావంతుఁడైనను, మఱెంతటి వ్యుత్పన్నుఁడైనను మానవుఁ డొక్కమాఱుగా సత్కావ్యనిర్మాణధురంధరుఁడు కాఁజాలఁడు. అనఁగననఁగ రాగ మతిశయిల్లు విధమున చెప్పఁగా చెప్పఁగా నతఁడు కవనమునం దాఱితేరినవాఁడగును. కావున కవనము పాకమునఁ బడవలయు నన్న నిరంతరాభ్యాసము కవికి తప్పనిసరిగా నుపాదేయము కావలయును. కావ్యజ్ఞశిక్షతోడి యభ్యాసమని దీనినే మమ్మటుఁడు పేర్కొనెను. అభ్యాసముచే చేయి దిరిగినకవి మొదటి రచనము లంత ప్రౌఢములు కాకుండుటయు, కొన్ని కాలగర్భమున లీనము లగుటయు మనము చూచుచునే యున్నాము. కవి సార్వభౌముని మరుత్తరాట్చరిత్ర నామమాత్రావశిష్టమైనది. ఆంధ్రభోజుఁడు తన రచనలుగా పేర్కొన్న మదాలసచరిత్ర, సత్యావధూప్రీణనము మున్నగు సంస్కృత కృతులు నేఁడు కానరాకున్నవి. అవి కానరాని మాత్రమున నప్రౌఢములని నిర్ణయింపఁజాలము. కాని అప్రౌఢములు కాల

పరీక్షకు నిలువఁజాల వనిమాత్రము చెప్పవచ్చును. ఈ యుదాహరణములను బట్టి యభ్యాసము కూడ సత్కావ్యనిర్మాణమునకు చక్కని హేతు వగుచున్నది.

మమ్మటాచార్యుఁడు శక్తి ర్నిపుణతేత్యాది శ్లోకమున ప్రతిభాపరనామక మగుశక్తి, లోకశాస్త్రకావ్యాద్యవేక్షణము వలన సిద్ధించెడు నిపుణత (వ్యుత్పత్తి), కావ్యజ్ఞుల యొద్ద పొందెడు శిక్షణరూపమైన అభ్యాసము అను నీ మూఁడింటిని పేర్కొని 'ఇతి హేతుస్తదుద్భవే' అని హేతుశబ్దము నేకవచనముగా ప్రయోగించుట వలన నీమూఁడింటి సమాహారమే హేతువు కాని మూఁడును ప్రత్యేకముగా హేతువులు కాఁజాలవనుటను సూచించెను. కావున నీమూఁడింటి సమాహారము పుష్కలముగా నుండి రచన చేసిన కవుల కావ్యములు చిరస్థాయులై సర్వజనసమాదరణీయము లగుచున్నవి. దీనిలో నేదోయొక దానియభావమువలననో యపరిపూర్ణతవలననో కవులలో తరతమ భేదము లేర్పడుచున్నవి. వీని సంపూర్ణత కలకవి మహాకవిశబ్దవాచ్యుఁ డగు చున్నాఁడు. అట్టివారిద్దఱో ముగ్గురో కాక అయిదుగురో ఆఱుగురో యున్నారని సహృదయ శేఖరులానందవర్ధను లనుటచే కవిపదవాచ్యుఁడగుట యనల్పతపఃఫలమనియు, మహాకవిబిరుదలాభము పొందిన వ్యక్తి కారణజన్మునివంటివాఁ డనియు సంభావింపఁ దగియున్నది. కావుననే "సుకవితా యద్యస్తి రాజ్యేన కి" మ్మని భర్తృహరి వంటి మహామనీషి వాక్రుచ్చెను.

ఆంధ్రకవితా పితామహుఁడు ప్రాస్తావికముగా పేర్కొన్న నిరుపహతిస్థలము, రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు కప్పురవిడెము, ఆత్మ కింపయిన భోజనము, ఒప్పు తప్పరయు రసజ్ఞులు, ఊహ తెలియంగల లేఖక పాఠకోత్తములు మున్నగు నవి కృతిహేతువు లగుట యనియతము. అవి వైయక్తికమైన రుచిభేదము ననుసరించి హేతుత్వమును సంపాదించుకొనుఁగాక. ఇట్టి వేవియు నమకూడని నిఱుపేదలగు పోతనవంటివారు కూడ మహాకవిపదవాచ్యు లగుచున్నారు కదా! కావున నవి ప్రతిభాదికము వంటి నియత హేతువు కావని చెప్పనొప్పును.

ఇట్లు కవితాహేతుసముదాయస్వభావపరిశీలనము గావింపఁబడినది. ఏత ద్ధేతుసామగ్రి నింపుకొని కావ్య రచనకుఁ గడంగు కవితనకు, లేక పాఠకునకు, లేక యుభయులకును ఏ ప్రయోజనముల సాధించుటకు యత్నించునో యరయ వలయును. కావున కావ్య ప్రయోజనముల చర్చ చేయఁబడుచున్నది.

## 6. కావ్య ప్రయోజనము :-

కావ్యప్రకాశకారుఁడు కావ్యప్రయోజనముల ని ట్లుటంకించెను.

"కావ్యంయశసేఽ ర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యః పరనిర్వృతయే కాన్తాసమ్మితత యోపదేశయుజే."

ఈ చెప్పిన ప్రయోజనములు యదుద్దిష్టములో పరిశీలింపవలసియున్నది.

కావ్యమువలన యశస్సు కలుగును. సత్కవితానిర్మితి కర్తకు శాశ్వత కీర్తి నాపాదించుట చూచుచునేయున్నాము. "జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః, నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్." అను భర్తృహరి సూక్తియు నిందు ప్రమాణము. మహాకవులైన కాళిదాసాదుల యశః కాయము జరామరణజమైన భయము లేనిదై నిత్యనూతనమై యలరారుచున్నది గదా! ఒకప్పుడు కవిహృదయభావనాపండితుఁ డగుసహృదయుఁడు (విమర్శకుఁడు) కూడ కీర్తి ప్రతిష్ఠల నొందుచున్నాఁడు. మహాభారత వ్యాఖ్యాత నీలకంఠుఁడు, సంస్కృత పంచకావ్యాదివ్యాఖ్యాత మల్లినాథసూరి మున్నగువారిట్టి కీర్తివిశేషము గలవారే. కావున నీ యశస్సను ప్రయోజన ముభయులకు (కవి-సహృదయు లిరువురకు) వర్తించును.

కావ్యము వలనఁ గలుగు నర్థము (ధనసమ్మానరూపాదికము) కవికి లౌకిక జీవయాత్రకు సహకరించును. కాని ప్రాచీన భారతీయ కవులు యశస్సున కిచ్చిన ప్రాముఖ్యము దీని కిచ్చినట్లు కాన్పింపదు. ఈ రెండవ ప్రయోజనము కర్తకు సంబంధించిన దని భావింపనగును.

ఇఁక వ్యవహారవేత్తృత యనునది పాఠకునకు మాత్రము వర్తించునదిగాఁ దలఁపనగును. ఏలయన లోకశాస్త్రకావ్యాద్యవేక్షణము వలన సిద్ధించిన నిపుణత కొక స్థాయి వచ్చిన తర్వాతనే కవికి సత్కావ్యనిర్మాణదక్షత యలవడునని యితః పూర్వము చెప్పఁబడినది. అట్టియెడ మఱల కావ్యనిర్మాణమువలన కవి పొందెడు వ్యవహారవేత్తృత యనఁగా నెట్టిది? కవి తనయనుభవములను రమణీయముగా కావ్యమున నిక్షేపింపఁగా పాఠకుఁ డందలి లోకవృత్తమును బాగుగా నెఱిఁగి ప్రయోజనము నొందుచున్నాఁడు. ఇట్లిది పాఠకోద్దిష్ట మనుట స్పష్టము.

శివేతరక్షతి కవి సహృదయుల కిరువురకును సంబంధించినది. మానవుఁడు పురాకృతకర్మవిశేషమువలన వచ్చెడు నమంగళములను పరిహరించు కొనుట కనేక యత్నములను సల్పును. వర్ణనానిపుణత యలవడిన కవి 'కవితారూపతపస్సు'చే అమంగళక్షతిని గావించుకొనవచ్చును. మయూరకవి సూర్యశతకమును విరచించి యారోగ్యము నొందినట్లు తెలియవచ్చును. ఆంధ్రవాల్మీకి శ్రీ వావిలకొలను సుబ్బారావుగారు రామాయణరచన గావించి రాజయక్ష్మవ్యాధిని పోఁద్రోలె నని వినికిడి. అట్లే పాఠకులును సత్కావ్యపఠనశ్రవణాదికముచే అమంగళములను దొలఁగించు కొనుటయు కలదు.

అనావృష్టిపీడితులైన యాంధ్రదేశవాసులు సాధారణముగ విరాట పర్వ పఠన మొనర్చుటయో, తత్కథను హరికథాదిరూపమునఁ జెప్పించుకొని వినుటయో జరుగుచున్నది. అట్లే సుందరకాండపారాయణాదికముకూడ రుజాగ్రహ దోషాదిపరి హారమునకుఁ జేయుచుందురు. కొన్ని కావ్యములలో కానవచ్చు ఫల శ్రుతులుగూడ నీ విశ్వాసమును బలపఱచును. కావున నిది యుభయసాధారణము.

సద్యః పరనిర్వృతియు కవిభావుకోభయసాధారణ మైనదియే. కవి కావ్యనిర్మాణకాలమున తత్తదంశముల భావించుచు ఆనంద స్వరూపమగు పరనిర్వృతి నొందుచునే యున్నాఁడు. కవుల కావ్యముల నిరంతర మనుశీలించి, తన్మూలమున విశదీభూతమైన తనమనోముకురమునందు వర్ణనీయతన్మయీభవనయోగ్యత నొంది కవిహృదయ సంవాద భాక్కయిన సహృదయుఁడును అచ్ఛమైన యాయానందము ననుభవించుచున్నాఁడు. నిజమున కట్లు పొందుటయే కావ్యపఠనమువలన నాశింపఁదగిన పరమప్రయోజనము.

ఇట కొంతవడి నిలిచి యీకావ్యానంద మందఱకు నందుబాటులో నేల లేదో కొందఱ కెట్లు సిద్ధించుచున్నదో విచారించుట కర్తవ్యము. మానవుని మనస్సులో ననేకములగు సంస్కారములు ముద్రవైచుకొనియుండును. వానితో నాతని హృదయము స్వచ్ఛతను గోల్పోయి కావ్యార్థమును సూటిగ లోఁగొన జాలనిస్థితిలో నుండును. లేదా సహజమైన మేధాబలమునందలి తారతమ్యము ననుసరించియు కవిహృదయము (కావ్య నిర్మాణసమకాలములో కవి భావించెడు భావనలసముదాయము) ప్రస్ఫుటముగా మనసున కెక్కకపోవుటయు సంభవించును. కావున పఠిత కావ్యార్థభావనమున నూటికి నూరుపాళ్ళు సఫలీకృతుఁడు కావలయు నన్నచో హృదయమున పేరుకొనియున్న సంస్కారములను తాత్కాలికముగా నైనను దూరీకరింపవలయును. అది సాధ్యమా? సాధ్యమే యగును. ఎట్లు సాధ్యమగునో యభినవగుప్తపాదులు వక్కాణించియే యున్నారు. నిరంతర కావ్యాను శీలనము చేయుటయే దానికి ఉత్తమౌషధము. కావ్యముల నిరంతరానుశీలన మనఁగా నెట్టిది ? సంసారము నందు వర్తించుచున్న వ్యక్తికి కావ్యానుశీలమునందు నైరంతర్యమెట్లు సమకూడును? అను ప్రశ్నకు సమాధానము అనుశీలనపదమునందే నిక్షిప్తమైయున్నది చదువుట వేరు, అనుశీలించుట వేరు. చక్షురక్షర సంయోగమాత్రమున "పఠ"ధాత్వర్థము సిద్ధింప వచ్చును. పఠించినదానిని, లోకవృత్తములను తత్తదింద్రియముల ద్వారమున లోఁగొనుచునే, మనస్సునందు పదిలపఱచుకొనుటకుఁ జేయు యత్నమును అనుశీలన మనవచ్చును. కావున కావ్యము పఠ్యమానము కానిదశలోకూడ భావ్యమాన మగుట సంభవమే యగును. అప్పుడు నైరంతర్యము దానియంతట నదియే సిద్ధించును. ఎప్పుడది సిద్ధించునో యప్పుడు హృదయమునందలి సంస్కారములు క్షాళితములగుటయు, క్రొత్త



3

సంస్కారములు ప్రవేశింపఁజాలకుండుటయు సంభవించును. అప్పుడు హృదయము కురము స్వచ్ఛాతి స్వచ్ఛమై కవి హృదయమును దనలో ప్రతిబింబింపఁజేసికొనఁగలుగును. కావున కావ్యపఠన మొక తపస్సు వంటిది. అగుటచే కావ్యానందము సర్వజనసాధారణము కాకుండుటయు, పై ప్రక్రియకు తగిన కృషి యెవ్వఁడుచేయఁగలుగునో వానికి మాత్రమేయది లభించుటయు జరుగుచున్నది. కావున సద్యఃపరనిర్వృతి యను నీకావ్య ప్రయోజనము కవితోపాటు సహృదయ పదవాచ్యుడగు నొకానొక కావ్యవ్యవసాయశీలునకు మాత్రము పరిమిత మగుచున్నది.

ఈ సద్యఃపరనిర్వృతికి పూర్వమే వక్తవ్యమైన యుపదేశమను ప్రయోజనము పఠిత కుద్దిష్టమైనది. వేద మే యర్థమును ప్రభువువలె శాసించునో శాస్త్ర మదే యర్థమును కార్య కారణభావమును గలిగించుచు లాభనష్టముల వక్కాణించుచు మిత్ర సమ్మితమై నిరూపించుచున్నది. అదే యర్థమును కావ్యము హృదయ హారిణి యగు కాంత తన హావభావవిలాసవిభ్రమాదులచే ప్రియు నాకర్షించి వశపఱచుకొనునట్లు మానవుని వశపఱచుకొని యాతనిని కర్తవ్యనిష్ఠునిఁ గావించును. అందలి యుపదేశ ముపదేశ మనిపింపదు. ఆయా కథాంశములు హృదయములో నివి కార్యము లివి యకార్యము లను జ్ఞానమును బుట్టించును. రామాయణ మహాభారతాది గ్రంథపఠనమువలన రామాదులవలె ప్రవర్తింపవలయును. రావణాదుల వలె ప్రవర్తింపరాదను భావన పాఠకుని హృదయమున సూటిగా చొచ్చుకొని పోవును. కావున కావ్య మిట్లు సన్మార్గోపదేశమును రమణీయమార్గమునఁ జేయుచున్నది.

ఈ పైఁ జెప్పిన ప్రయోజనములలో శేఖరాయమాణమైనది సద్యఃపరనిర్వృతి యనుట స్పష్టమే. ఏలయన యశస్సుగాని, ధనముగాని, వ్యవహారవేత్తృతగాని, అమంగళ క్షతిగాని, మఱియేదికాని మానవునిచే నేల కాంక్షింపఁబడుచున్నది? దుఃఖ నిరసనపూర్వక సుఖలబ్ధి కొఱకే కదా! కావున ఆనందము, సుఖము, పరనిర్వృతి ఇత్యాదిపర్యాయపదములు గల యొకానొక అలౌకిక స్థిత్యధిగమము కావ్యపార్యంతిక ప్రయోజన మనుట సత్యమే.

ఇట్టి పరమప్రయోజనసిద్ధి కావ్యములో ప్రధానముగ నేది యుండుట వలన నగునో యను విచారణము ప్రారంభమైనది. దానితో బహువిధప్రస్థానములు బయలు దేఱినవి. ఆప్రస్థానము లెవ్వియో యందలి గుణదోషము లెట్టివియో పరిశీలించి ప్రతివాద ప్రభంజనముల కెదురునిలిచి చిరప్రతిష్ఠిత ప్రస్థానమైనధ్వనిసిద్ధాంత తత్త్వము నరయవలసియున్నది.

## 7. కావ్యాత్మ :-

కావ్యమున ప్రధానాంశమేది యనువిషయమునుగూర్చి యనేక ప్రస్థానములు బయలుదేఱె నని చెప్పుకొంటిమి. వానినిగూర్చి కొంత విమర్శింపఁదగిన యంశము గలదు. కొందఱు కావ్యమలంకారప్రధానము కావలయు ననిరి. మఱి కొందరు గుణముల నుగ్గడించిరి. వేఱొకకొందఱు రీతిని కావ్యాత్మ యనిరి. ఇంక కొందఱు వక్రోక్తిని కావ్యజీవిత మనిరి. రస మే జీవిత మని కొంద ఱుటంకించిరి. ధ్వని కావ్యాత్మ యనియు రసాదికము ధ్వనిరూపముననే యనుభూయమానమగు ననియు కొందఱు తత్త్వజ్ఞులు ప్రమాణీకరించిరి. వీనియన్నిటికి నాలంబనభూతమైన వస్తువనునది యొకటి యుండనేయున్నది. అది కథారూపమున నుండవచ్చును. భావ రూపమున నుండవచ్చును. కల్పితము కావచ్చును. 'సత్కవికల్పనా విభూషావహ పూర్వవృత్తము'ను గావచ్చును.

పైఁ జెప్పిన గుణాలంకారరీత్యాదులలో నేదోయొక్కటి మాత్రమే కవికి స్వీకార్యమని చెప్పఁజాలము కాని యేదియో యొక్కటి తప్పక స్వీకరింపఁబడిననే కావ్యమునకు కావ్యత్వము సిద్ధించునని మాత్రము చెప్పవచ్చును. ఆ యొక్కటి యేది? యేల? అనువిషయము నిరూపితమగుటకు ముం దీయలంకారాదుల తత్త్వము నరయవలసియున్నది.

అలంకారము : 'అలంకరోతీ త్యలంకారః' అలంకరించునది యలంకారము. "అలం భూషణ పర్యాప్తి శక్తి వారణ వాచక"మ్మని నిఘంటువు. ఇందు ప్రకృతమున భూషణార్థము గ్రాహ్యము. భూషించుట యనఁగా రమణీయముగా కన్పడునట్లు చేయుట యను నర్థము సంభావ్యము. సాధారణముగా వ్యక్తులు తత్తదవయవములకు తత్తదలంకారములను ధరింతురు. అచట దానిస్థితివలన నా యవయవము ముఖ్యముగను మొత్తము దేహము సామాన్యముగను దీప్తిమంత మగును. అట్లే కావ్యమున నీయలంకారములు సౌందర్యము నినుమడింపఁజేయును. సాధారణముగ సహజసుందరము లైనవానికె అలంకారమువలన వచ్చు ప్రత్యేకత యేమియు లేదు కాని వానియునికి సమాదరణీయమే యగును. కావ్యమొక సజీవవ్యక్తిగా రూపింపఁబడినది. అపుడు శరీరము, గుణములు, శోభాకరములగు నలంకారములు, శైలి, వృత్తి, రీతి, ఆత్మ మున్నగున వన్నియు నిటకూడ రూపితములు కావలయును. దానినిబట్టి కంఠహారాదికమగు భూషణసము దాయము భౌతిక శరీరము నలంకరించి శోభాహేతువైనట్లు, ఉపమాద్యలంకార వర్గము కావ్యశరీరము నలంకరించి శోభావిశేషమును గలిగించును. కావుననే "కావ్యశోభాకరాన్ హేతూ నలంకారాన్ ప్రచక్షతే." (కావ్యాదర్శము) అనుట. ఇవి కావ్యశరీరము నెంత తళతళలాడించినను బాహ్యములే. అట్లని వీనియెడల లఘుభావము వహించుట కాదు కాని ప్రాచీనాలంకారికులగు భామహాదులవలె నివియే కావ్యమున ప్రధానాంగము లనుకొనుటమాత్రము

తగదు. అలంకారశబ్దార్థమే యీయంశమును సమర్థించును. వామనుఁడు "కావ్యశోభాయాః కర్తారో గుణాః. తదతిశయ హేతవస్త్వలంకారాః; పూర్వే నిత్యాః." అని చెప్పుటచే అలంకారానిత్యత ఉక్తప్రాయమే యయినది.

అలంకారశాస్త్ర నిర్మాత లనేకులు వీనిని విపులముగా వివరించి యున్నారు. అలంకారశాస్త్రపితామహుఁడు భరతాచార్యుడు ఉపమ, దీపకము, రూపకము, యమకము నని నాలుగలంకారములనే వచించెను. ఆసంఖ్య క్రమాభివృద్ధి నొంది అప్పయ్యదీక్షితునిచే నూటయిరువదినాలుగుగా సంఖ్యాతమైనది.

కావ్యమునకు శరీరము శబ్దముమాత్రమే యని కొందఱందురు. శబ్దార్థములు రెండునని మఱికొందఱ యభిప్రాయము. "ఇతి వృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తితమ్." అని మఱియు నొకమతము. అదియును శబ్దార్థముల నాశ్రయించియె యుండును. శబ్దార్థోభయాత్మక శరీరము నలంకరించు నలంకారవర్గమునందు ప్రధానముగా రెండు భేదములు గలవు. శబ్దము నలంకరించునది శబ్దాలంకారము. అర్థము నలంకరించునది యర్థాలంకారము. యమకాదికము మొదటివర్గమునకును, నుపమాదికము రెండవ వర్గమునకును జేరును. అక్షరవిన్యాసవైఖరిచే చమత్కార హేతు వగునది శబ్దాలంకార మనియు వక్తవ్యమైన యర్థమును వక్రముగా రమణీయముగా వచించుటద్వారమున చమత్కారమును గలిగించున దర్థాలంకార మనియు భావము.

"ప్రకృతి మధురంబులకు వేషరచన లేల?" అను నూక్తి ననుసరించి స్వభావసుందరములైన మహాకవి వాక్కు లనలంకృతములైనను కావ్యత్వమునకు క్షతి లేదు. ప్రబంధములందువలె మహాభారతాదీతిహాసములయందు అలంకారములు తఱచుగఁ గానరాకున్నను నయ్యవి వరితృజనాస్వాదనీయములే యగుచున్నవి. కావున సలంకారము కావ్యరచనయం దపరిహార్యమని చెప్పఁ జాలము. వానియునికి ఫలసఁ గొండొకచో సౌందర్య మినుమడించును గాక. అది కావ్యమున ప్రధాన మైనది కాదనుట స్పష్టము.

గుణములు : జీవకోటిలో నొక్కొక్కజాతికి కొన్ని ప్రత్యేకలక్షణము లుండును. దీని కిది సర్వ విధముల సమానమని యేరెండుజీవులను జెప్పఁజాలము. కాని స్థూలముగా నొక సామ్యము కొందఱిలో, లేక కొన్నిటిలో కానవచ్చును. నడచుటలో, మాటాడుటలో, చూచుటలో, తదితర సర్వవ్యాపారములలో మానవులందు వైవిధ్యము గోచరించును. ఔద్ధత్యము, సౌకుమార్యము, ప్రసన్నత, గంభీరత, స్మితపూర్వాభిభాషిత్వము, నోటితో నవ్వుచు నొసలితో వెక్కిరించుట మున్నగు లక్షణములను మనము మానవాళియందు చూచుచునేయుందుము. ఇందు మానవుని నుత్తమునిగాఁ బరిగణించుటకు వీలైనవానిని గుణము లనియు నాతని నధమకోటి లోనికిఁ జేర్చువానిని దోషములనియు నందురు.

కావ్యము లోకానుకరణశీలి కావునను నయ్యది వ్యక్తిగా రూపణము చేయఁబడినది కావునను దానియందును గుణదోషములు లాక్షణికులచే నిరూపింపఁబడినవి. అలంకార శాస్త్రపితామహుఁడు భరతుడు మొదలుకొని దండి-భామహ-వామనాదులు వీని స్వరూపమును వివేచించి చూపియేయున్నారు.

లోకములో వాగ్వ్యాపారము సందర్భమునుబట్టియు, వక్తనుబట్టియు, వాచ్యమును బట్టియు, తదితరాంశములను బట్టియు వైవిధ్యవిలసితమై యుండును. బాలకులతో వాత్సల్యస్ఫోరకముగా మాటలాడునప్పుడును, సమవయస్కులతో నిష్టాలాపము లాడునప్పుడును, ప్రియురాలితో సరస సంభాషణము చేయునప్పుడును, పెద్దమనుష్యుల యొద్ద వినయముగా ప్రసంగించునప్పుడును, కోపతాపములను వెలార్చునప్పుడును వాగ్ధోరణిలో భేదము స్పష్టముగాఁగానవచ్చును. మంద్ర మధ్యతార స్థితులు కంఠనాదమున సందర్భమునుబట్టి గోచరములగును. తదనుగుణముగ నుపయోగించు పదజాలమునందును పరుషాక్షరబాహుళ్యమో, సరళాక్షరాధిక్యమో, సమస్థితియో అప్రయత్నముగ చోటు చేసికొనును. అట్టి స్థితి భేదములను బట్టియే సాధారణముగ నితడు కోపముగ నున్నాడు; ప్రసన్నుఁడై యున్నాడు; ఇత్యాది రూపమున సంభావించుటయు జరుగుచున్నది. కావ్యమున కవికి ఏది స్ఫురింపఁజేయవలసినను శబ్దము తప్ప వేఱొకయుపకరణము లేదు. సమర్థుఁడైనకవి యక్షర పదగ్రథనరూపమున వ్యక్తులయు, సందర్భములయు గాంభీర్యప్రసన్నతాదిగుణముల నభివ్యక్తముచేయును. ఇట్టి పదగ్రథనరూపస్థితి విశేషమునే గుణశబ్దముచే లాక్షణికులు వ్యవహరించిరి. ఇట్టివి కావ్యార్థమును పఠితృ హృదయమునకు సూటిగా చేర్చుట కుపకరించును. ఇవి కావ్యశోభను గలిగించుననియు నిత్యము లనియు వామనుఁడు పేర్కొనెను. గుణహీనుఁడగు పురుషుఁ డెట్లు సమాదృతుఁడు కాఁడో యట్లే గుణహీనమగు కావ్యమునకుఁగూడ కావ్యత్వగౌరవము కలుగదు. ఆ మార్గమున నివి కావ్యమున నిత్యము లని వామనుఁడు చెప్పెనని సంభావింపఁదగును. మనుజుని యాత్మోన్నత్యము గుణములవలన పరిపోషింపఁబడినట్లే కావ్యాత్మోన్నత్యముకూడ మాధుర్యౌజః ప్రసాదాదిగుణముల వలన సుపుష్ట మగును.

గుణసంఖ్యానమున నాలంకారికుల కందఱకు నేకాభిప్రాయము కుదురలేదు. భరతుఁడు, దండి, వామనుఁడు మున్నగువారు పదిగుణములను బేర్కొనిరి. భామహానంద వర్ధనమమ్మటాదులు వానిని మూఁడనియే నిరూపించిరి. భోజుఁడు శబ్దార్థములకుఁ బ్రత్యేక మిరువదినాలుగేసి గుణములను వ్రాకుచ్చెను. కాని మాధుర్యము (పృథక్పదత్వము) ఓజస్సు (గాఢబంధత్వము) ప్రసాదము (బంధశైథిల్యము) అనునవి తక్కిన శ్లేష-సౌకుమార్య-అర్థవ్యక్తి-ఔదార్య-సమతా-కాంతి-సమాధులను దమలో నంతర్భవింపఁ

జేసికొనుటవలన వానికి ప్రత్యేక గణన మనవసర మను నానందవర్ధనాదుల యభిప్రాయము సమంజసము.

కావ్యమున గుణములకుఁ గల స్థాన మెట్టిది? వామనాచార్యుడు గుణములు కావ్యశోభను గలిగించు నిత్యధర్మములుగా వక్కాణించెను. గుణము ధర్మము అనుపదములే గుణి, ధర్మియైన కావ్యప్రధానాంశము వేఱొకటి కలదని చెప్పుచున్నవి. అప్పుడివి గుణివాచ్యమైన రసాదికమున కంగభూతములే యగును గాని యంగిత్వము నొందఁ జాలవు. ఇట్లివియు నలంకారములవలె ప్రధానత్వమును బొందక యంగములుగనే నిలుచును.

వృత్తులు : వర్తనమే వృత్తి యనఁబడును. మానవుడు తన మనో భావమున కనుగుణమగు చేష్టల నొనరించుట చూచుచుందుము. అతఁడనుద్వేగ స్థితిలో హస్తచాలనాదికము నంతగాఁజేయఁడు. ఉద్విగ్నుఁడై చేతు లొకదానితో నొకటి పెనవేసి నొక్కుటయో, వేగముగా నూపుటయో చేయును. ప్రేమాభి వ్యక్తిలో నాతని యాంగిక చాలనము మృదువై యుండును. ఇట్టి చేష్టావిశేషమును గాంచి వీఁడు కోపముతో నున్నాడు, వీఁడు సౌమ్యముగా నున్నాడు, వీఁ డుదాసీనుఁడై యున్నాడు అను రీతిగా సంభావింతుము. ఇట్లు హృద్గతమైన భావమును ప్రస్ఫుటము చేయుటకు మానవుఁ డవలంబించు వర్తనమే వృత్తి.

ఇట్టి వర్తనము రూపకమున నటులు ప్రదర్శించుచుండఁగా దృశ్యమే యగును. కాని కావ్యమున నిది దృశ్యము కానేరదు. కావ్య మెన్నివిధములుగాచూచినను అక్షర సమాహారరూపమే కదా! అయినను సమర్థుడైన కవి వర్ణ విన్యాసవైఖరితోనే యానటనను పాఠకుని హృదయమున ప్రత్యక్షము గావింపఁ గలుగును. అట్లు కావ్యార్థరూపమైన రసాదికమును బ్రత్యక్షము గావించుట కుపయుక్తములగు వర్ణవిన్యాసవైఖరులచే నభివ్యక్తములగు నాంగికాభినయరూపములను వృత్తు లందురు.

**"యా వికాసేఽథ విక్షేపే సంకోచే విస్తరే తథా,**
**చేతసో వర్తయిత్రీ స్యా త్సా వృత్తిః - సాపి షడ్విధా."**

అని సరస్వతీ కంఠాభరణవ్యాఖ్యాత రత్నేశ్వరుడు వృత్తికి వ్యుత్పత్తిని వివరించెను. చిత్తమునకు వికాస విక్షేప సంకోచ విస్తరములను గలిగించు వ్యాపారవిశేషమే వృత్తియని పై శ్లోకమునకు తాత్పర్యము. "వర్తతే నయా చిత్త వికాసాది స్థితి కరణసాధనో యం వృత్తి శబ్దః" అని రత్నేశ్వరుని నిర్వచనము. వృత్తులచేత చిత్తము వికాసాదులయందుఁ బ్రవర్తించును. చిత్త వికాసాదులను గలిగించునవి వృత్తులని

ఫలితార్థము. అభినవగుప్త పాదులు చెప్పిన "వ్యవహారో హి వృత్తి రుచ్యతే." అను వాక్యముకూడ పై అభిప్రాయముతో సంవదించుచునేయున్నది. ఇట వ్యవహారమనగా వ్యాపారమని యర్థము.

ఈ వ్యాపారము శబ్దము నాశ్రయించి శబ్దవృత్తి యనియు నర్థము నాశ్రయించి యర్థవృత్తి యనియు రెండువిధము లగుచున్నది. శబ్దవృత్తి మఱల రెండు విధములు. శబ్దమర్థమును సమర్పించుపద్ధతులకు సంబంధించిన యభిధాదికము మొదటిది. అనుప్రాసమునకు సంబంధించినదై నియతవర్ణగతమగు రసవిషయ వ్యాపారమైన యుపనాగరకాదికము రెండవది. ఇందు మొదటిదానిని గూర్చి విపుల మైన విచారణము ముందుఁజేయ బడుచున్నది. ఉపనాగరికాదివృత్తుల సంఖ్య యందును భిన్నాభిప్రాయములు గలవు. ఉద్భటుఁడు పరుషా, ఉపనాగరికా, గ్రామ్యావృత్తులను మూడింటిని పేర్కొనగా రుద్రటుఁడు మధుర, పరుష, ప్రౌఢ, లలిత, భద్ర అని యైదు వృత్తుల నుగ్గడించెను.

ఒక వర్ణము ననేకపర్యాయము లీషద్వ్యవధానముతో నావృత్తిచేయఁగా నొక శ్రావ్యత యేర్పడును. అట్టి శ్రావ్యతనుగూర్చు వ్యాపారమే యీ పరుషాదివృత్తి. అది పరుషాక్షరములచే నైనచో పరుషావృత్తి యనియు, కోమలాక్షరములచే నైనచో కోమలా (గ్రామ్యా) వృత్తి యనియు. పరుషాక్షర - లలితాక్షర - సమాహారముచేనైనచో నుపనాగరికా వృత్తి యనియుఁ జెప్పఁబడినది.

పై వానికంటె భిన్నస్వరూపముగల కైశిక్యాదివృత్తిత్రయము మఱియొకటి కలదు. ఇది రసాదిరూపమైన కావ్యార్థమునకు సంబంధించిన దగుటచే దీని నర్థవృత్తిగా వ్యవహరింతురు. రసోచితమగు చేష్టావిశేషమే వృత్తి యను నభినవ గుప్తుల నిర్వచనమును బట్టి యితివృత్తానుగుణముగ రసస్ఫోరకముగా నాటకమునందు నాయకాదులు చేయు వ్యాపారవిశేషమే యిది. ఇట్టి వ్యాపారము రసానుగుణముగ మాఱుచుండుట యనుభవ సిద్ధమే. ఆ మార్పును బట్టియే యిది త్రివిధ మైనది. సాత్త్వత, కైశికి, ఆరభటి యని వీనికి నామములు. నాట్యశాస్త్రమున నీపేర్లెట్లు కలిగెనో తెలుపు చిత్రమైన కథ గలదు.

జగత్ప్రభువు విష్ణువు కృతయుగారంభమున నేకార్ణవమున నాగపర్యంకమున శయనించియుండఁగా మధుకైటభులను రాక్షసులు యుద్ధకాంక్షతో నాతనిదరికి జేరి తమ ప్రతాపమును జూపుచుండిరి. బహువిధములగు నధిక్షేపవాక్యములను బలుకుచుండిరి. చతురాననుఁడు దానిని సహింపఁజాలక వారినిఁ జంపుమని విష్ణువును గోరఁగా నపుడు సర్వేశ్వరుడు "భారతీవృత్త్యావిర్భావమునకై వీరి యాగడము నుపేక్షించితిని.

వాక్యబహుళమగు నీభారతీవృత్తి వక్తలకు ఆశ్రయము కాఁగలదు. ఇంక వీరిని జంపుదు" నని పలికెను. ఆ సమయమున సత్త్వప్రధానములైన శార్ఙ్గధనుస్సు వల్గితములవలన సాత్త్వతీవృత్తియు, వాసుదేవుఁడు విడివడిన తన కేశపాశమును సవిలాసముగా ముడివైచుకొనుట యను చేష్టనుండి కైశికీవృత్తియును, సంరంభావేగసమన్వితములైన బాహు యుద్ధములవలన నారభటీ వృత్తియును జనించినవి. (తెలుగు నా. శా. పు. 610-611) వీనితోపాటుగ నుదయించిన భారతీవృత్తి వాగ్వ్యాపారరూపము కావున నది శబ్దవృత్తిగానే పరిగణింపఁబడినది. కొందఱు దానినిగూడఁ గలుపుకొని నాలుగు వృత్తులందురు. కాని మూడుఁ గుణములు, మూఁడు రీతులు అనువాని సంబంధమును బట్టియు, పైనుదాహరించిన కథను బట్టియు, జూడగా నర్థవృత్తులు మూఁడే యనియు, భారతి శబ్ద వృత్తియే యనియు విమర్శకులు తలఁచుట సమంజసమే.

వృత్తులు రసాదిస్ఫోరకములగు చేష్టా విశేషములుగా ప్రతిపాదింపఁబడుటచే నివి కావ్య ప్రధానాంశమున కంగప్రాయములనుట నిరూపితమైనది. అంతేకాక చాల మంది యలంకారశాస్త్రజ్ఞులు వీనిని రీతులలో నంతర్భవింపఁజేసిరి. వాగ్రూపమైన శబ్దవృత్తిగా పరిగణింపఁబడిన భారతీవృత్తి ప్రభేదములైన వైదర్భ్యాది రీతు లీ యాంగికాభినయరూపమైన వృత్తిని స్ఫుటీకరించును. కావున రీతి యన నేమో పరిశీలింపవలసి యున్నది.

రీతులు : "రి-గతౌ" "రిజ్-ప్రస్రవణే" అను ధాతువులకు 'క్తిన్' ప్రత్యయ యోగముచే రీతి శబ్దము సిద్ధించుచున్నది. "రిణన్తి-గచ్ఛన్తి-అస్యాం గుణాః" - దీనియందు గుణములు ప్రవర్తిల్లును. "రీయతే-క్షర త్యస్యాం వాఙ్మధు ధారా" - దీనియందు వాఙ్మధుధార స్రవించుచుండును అని రీతిశబ్దమునకు రెండు వ్యుత్పత్తులు. 'రియన్తే -పరంపరయా గచ్ఛన్త్యనయా రీతిః' అని మరియొక వ్యుత్పత్తిని రత్నేశ్వరుఁడు చెప్పెను. 'దీనిచే పరంపరాక్రమమున కావ్యగమ్యమగు రసపదవిని పొందుదురు.' అని దీని అర్థము. మొత్తము మీద నీ మూఁడు వ్యుత్పత్తులను పరిశీలింపగా గుణసమాహారరూపమై రసస్ఫూర్తిని గలిగించుట కుపయుక్తమగు మార్గవిశేషము రీతియని స్పష్టమగుచున్నది. అంగికాభినయరూపము లగు వృత్తులను స్ఫుటీకరించుటకు వాచికాభినయరూపములైన యీరీతులు సహకరించునని పూర్వము తెలుపఁబడినది. కావున నివి పరంపరాక్రమమున రసోపస్కారకము లగును.

రీతి యనుదానిని మార్గాపరనామముతో మొట్టమొదట వ్యవహరించినఁవాడు దండి. కాని దాని కాతఁడు సమగ్రస్వరూపము నీలేదు. వామనుఁడు దానికి సంపూర్ణమైన

నిర్వచనము నొసఁగుటే కాక యది కావ్యాత్మ యనియు వక్కాణించెను. 'విశిష్టా పదరచనా రీతిః' యని యాతని రీతి నిర్వచనము. విశిష్టత గుణసమాహారరూపమున సిద్ధించును.

రీతులు మూఁడు. మృదుపదములు అల్పసమాసములు లేదా సమాసములు లేకయే యుండుట యను లక్షణము గల వైదర్భి మొదటిది. పరుషాక్షరబాహుళ్యము, దీర్ఘ సమాసములును గల రచన గౌడి రెండవది. పైరెండింటి మధ్యస్థితి కలది - కొంత మృదుపదరచనయు కొంత పరుషాక్షరయుతరచనయుఁగలది - పాంచాలి. వీనికి నామములు దేశభేదములనుబట్టి వచ్చినవి. విదర్భ, గౌడ, పాంచాల దేశములందు ప్రచురముగా నున్నవని కాని, లేక యక్కడివారి రీతి కనుగుణముగా నుండునవియని కాని వీనికి తాత్పర్యమును సంభావింపవచ్చును. అయినచో ఎన్నియో దేశభేదములును, వానిని బట్టి స్వభావ భేదములును వానిమూలమున వాక్ప్రయోగ భేదములును కలుగవచ్చును గదా! అట్టియెడ రీతులు మూఁడే యనుట యెట్లు పొసఁగు నని శంకింపరాదు. మృదుపదరచన, కఠినపదరచన, ఈ రెంటి సమాహార రూపము అను స్వభావమును బట్టి యేర్పడిన మూఁడు భేదములకు వ్యవహారమును బట్టి దేశనామములు చేయఁబడినవి కాని దేశనామములను బట్టి రీతు లేర్పడలేదు.

తడయక పుట్టిననాఁడ తల్లిచేఁ దండ్రిచె విడువఁ
బడితి; నిప్పుడు పతిచేతను విడువఁబడియెదనొక్కొ;
నుడువులు వేయు నింకేల? యిప్పాటి నోములు దొల్లి
కడఁగి నోఁచితినిగాకేమి! యనుచును గందె డెందమున. 1.4.103.

ఈ పద్యమున నన్నియును మృదుపదములు. ఒండురెండు సమాసము లున్నను నవి సమాసములే యనిపింపవు. అతిసుకుమారమైన కరుణమును వర్ణించుటకు ఈ మృదుపదయుతరచన యెంతయు నావశ్యకము. ఇట్టిది వైదర్భీరీతి.

ఘోరవికారసన్నిహితకోపముఖంబులు దీప్తవిద్యుదు
ల్కారుణదారుణాక్షములు నై నిజదృష్టివిషాగ్ని నన్యులం
జేరఁగ నీక యేర్చుచుఁ బ్రసిద్ధముగా నమృతంబుచుట్టు ర
క్షారతి నున్న యుగ్రభుజగంబుల రెంటిని గాంచి చెచ్చెరన్. 1. 2-101

ఇందు భుజగముల యుగ్రత్వమును వర్ణించుపట్టున ప్రయుక్తములైన దీర్ఘసమాసములు, రేఫాక్షరబాహుళ్యము, పరుషాక్షరములు మున్నగునవి సందర్భోచితములై గౌడీరీతిని సిద్ధింపఁజేయుచున్నవి.

అతని తపంబు పెంపునఁ జరాచరసంభృత మైన విష్టప

త్రితయము భీతిఁ బొందిన ధృతిం బితృలోకనివాసులైన త
త్పితృవరులెల్ల వచ్చి కడుఁబ్రీతి నపాకృతగర్వు నౌర్వు న
ప్రతిమతపోవిభాసిఁ గని పల్కిరి తద్దయు శాంతచిత్తులై. 1. 7. 140.

ఈ పద్యమున సమాసము లున్నవి. అయిన నవి నాతిదీర్ఘములు. కొన్ని మృదుపదములును మఱికొన్ని పరుషాక్షరయుత పదములును నిందుఁ గలవు. కావున నిట్టిరచన పాంచాలీరీతి యన నొప్పును.

ఇట్లక్షరముల మార్దవకాఠిన్యములను బట్టియు, సమాసముల హ్రస్వత్వ దీర్ఘత్వములనుబట్టియు నేర్పడిన రచనావిధాన మగు రీతి కావ్యమున నాత్మస్థానీయమని రీతివాదప్రస్థాపకుఁడగు వామనుని యభిప్రాయము. కావుననే యాతఁడు "రీతి రాత్మా కావ్యస్య" అని సూత్రించెను. రీతి కంతటి స్థాన మీఁదగునా? యని చర్చించుటకు ముందు దీనికీ గౌరవ మెట్లాపాదింపనగునో యరయవలయును.

కవి వర్ణనీయాంశగత వివిధ సూక్ష్మాంశములను వర్ణించునపుడు లోకము నందువలె వివిధమైన పద్ధతుల నవలంబింపవలసి యుండును. వర్ణనీయము మృదు వగుటయు, పరుష మగుటయు, నాతిమృదువు, నాతిపరుషము నగుటయు కాన వచ్చును. ఉదాహరణమునకు బాలుర శరీరము, మాట, చేష్ట మున్నగునవి పరమ సుకుమారముగా నుండును. వారితో సంభాషించునపుడును, వారి వ్యవహారము వక్తవ్యమైనపుడును, అప్రయత్నముగనే మెత్తని మాటలు, ముగ్ధములగు చేష్టలును ప్రయుక్తము లగును. అట్లే శత్రువుతో వ్యవహరించునపుడు తారస్వరము, కను లెఱ్ఱవడుట, అంగములు మిక్కుటముగా చలించుట మున్నగునవి జరుగును. సమవయస్కులతో సాధారణ విషయముల వ్యవహార మున్నపుడు సాధారణస్థితి స్వీకరింపఁబడును. లోకమున వాక్కునందలి స్థాయిభేదము, అంగ విక్షేపాదికమును నాయా హృద్గత భావములను సువ్యక్తము చేయుటకు సహకరించును. పఠనీయమగు కావ్యములో నిట్టి స్థితి వైవిధ్యము నభివ్యక్తము చేయుటకు కవి రచనాగతమగు వైవిధ్యము తప్పక స్వీకరింపవలసియే యుండును.

బకాసుర కథలో అమాయకుఁడగు విప్రబాలుఁడు రాక్షసుఁ డన నేమో తెలియని మౌగ్ధ్యమున తలిదండ్రుల నూఱడించుటకై పలికిన తొక్కుపలుకులను నన్నయ వర్ణించిన విధానమునకును, ద్రౌపదీ పరాభవదర్శనముచే నొడ లెఱుంగని కోపతీవ్రతతో కీచకుని క్రూర దంష్ట్రాఘరట్టనిష్పిష్యమానునిగాఁ జేయ నుంకించిన వృకోదరుని రూపవిశేషమును తిక్కనామాత్యుఁడు వర్ణించిన విధానమునకును గల భేదము నీ క్రింది పద్యములలో

నరయఁ దగును.

బాలకుం డొక కొండుకకోల చేతఁ
బట్టుకొని యేన రక్కసుఁ గిట్టి చంపి
చులుక వత్తు మీ రేడ్వగావలవ దంచుఁ
గలయ నూరార్చెఁ దన తొక్కు(బలుకు లొప్ప. 1. 6.363

కనుగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులురాల, నంగము
ల్గనలఁగ, సాంద్రఘర్మసలిలంబులు గ్రమ్మ, నితాంతదంతపీ
డనరటదాస్యరంగ వికటభ్రుకుటీచటుల ప్రవృత్తన
ర్తనఘటనాప్రకారభయదస్ఫురణాపరిణద్ధమూర్తి యై. 4. 2.133.

ఇట్లు వర్ణనీయవస్త్వాదికము యొక్క స్థితియందలి తారతమ్యమును సమర్థుఁడైన కవి నిర్మాణచాతుర్యముచేతనే యభివ్యక్త మొనరించును. అట్లు రూపొందించుట కాతని హృదయమున జరుగు వికృతియంతయు సహకరించును. వాగంగాభినయ మంతయు మనస్థితిని బట్టియే కదా రూపుదిద్దుకొనును. పరగతసుఖదుఃఖాద్యను భవముతో సానుభూతి (నమానమైనయనుభూతి) కలిగి దానిని పాఠకుని హృదయమున ప్రస్ఫుటీకరించుటకు సమర్థుఁడైన కవి కీప్రతిభ సహజమే కావున నొక్కొక్కప్పు డీ నిర్మాణ మప్రయత్నముగనే సిద్ధించినట్లు కావచ్చును. కావున నిట్టి రచనావైఖరికి కావ్యమున ప్రముఖస్థానమే కల దనుటలో విప్రతిపత్తి లేదు. దీనినే వామనాచార్యుఁడు రీతిగా, దండ్యాదులు మార్గముగా, ఆనందవర్ధనుఁడు సంఘటనగా పేర్కొని వ్యాఖ్యానించిరి.

కాని యిది కావ్యాత్మ యనుట యెంతవఱకు సమంజసమో పరిశీలింతము. ఉత్తమ మానవునికి పరగత సుఖమును గాంచినంత తనలో తాదృశమగు సుఖానుభూతి యొకటి తరంగప్రాయముగా నుద్బుద్ధమై మనసు ద్రవించి తాత్కాలికముగా నాతఁడొక పారవశ్యమును బొందుచున్నాఁడు. పరగత దుఃఖమును గాంచి తాదృశ దుఃఖవిశేషముచే అశ్రుపాతవైస్వర్యాదికమును బొందుచున్నాఁడు. ఇట్లే తదితర భావములయందు తత్తత్సదృశానుభవ విశేషము తనకే కలిగినట్లొక యనిర్వచనీయస్థితికి లోనగుచున్నాఁడు. ఇట్టి స్థితి మనోహరమగు నాటకము జూచుచున్నపుడును, రమణీయార్థవిలసితమగు కావ్యమును పఠించుచున్నపుడును సాధారణముగా సర్వ మానవులకును గలుగుచున్నది. ఆ స్థితి యేమి? అది పార్యంతికముగా నేరూపమున పరిణమించుచున్నది? అది వాంఛనీయమా? పరిహార్యమా? అని యీ మొదలుగ నొకవిచారణ ప్రారంభమైనది. కాఁగా నది రసానుభవస్థితి యనియు తుది కది బ్రహ్మానందసహోదరమగు నానందవిశేషముగా

పర్యవసించుచున్నదనియు, నానంద మేరూపమున నున్నను (కరుణరసాదికమును దృష్టిలో నిడుకొని) మానవునకు వాంఛనీయమే యగుచున్న దనియు విజ్ఞులు కనిపెట్టిరి. పనివడి లోకహితైషియై ప్రతిభావ్యుత్పత్త్యభ్యాససముపార్జిత మగు కావ్యరచనాదక్షత యలవడిన కవికి హృదయమున నానందమధుధారానిష్యందము వెల్లిగొలుపుట కంటె నితర కర్తవ్య మేమి యుండును? కావున నానందరూపమైన రసాదికము కావ్యాత్మ కాఁజాలును గాని తదభివ్యక్తి హేతువు లేవియును నాత్మస్థానీయములు కాఁజాలవు. వైదర్భ్యాదిరీతులు రసస్ఫోరకములే కాని రసాదికమే కాదు. కావున రీతి కావ్యాత్మ యనుట చెల్లదు. వామనుఁడు కావ్యతత్త్వజిజ్ఞాసలో తుదిమెట్టువఱకుఁ బయనించెను గాని గమ్యము చేరినట్లు తోఁచదు. అందువలననే ఆనందవర్ధనులు రీతివాదులకు కావ్యతత్త్వ మస్ఫుటస్ఫురిత మైన దనియు గాన దానిని సరిగా వ్యాకరింపఁజాలక వారు రీతులను బ్రవర్తింపఁజేసి రనియుఁ జెప్పిరి.

"అస్ఫుట స్ఫురితం కావ్యతత్త్వ మేత ద్యథోదితమ్
అశక్నువద్భి ర్వ్యాకర్తుం రీతయః సంప్రవర్తితాః"

ఈ విచారణమును బట్టి శోభాహేతువు లగు గుణాలంకారములు, సాక్షాద్రసోపస్కారకములగు వృత్తులు, పరంపరాక్రమమున రసోపస్కారకము లగు రీతులు, రుచిభేదమును సూచించు పాకములు, పదపరివృత్త్యసహిష్ణుతారూపమైన శయ్య మున్నగునవన్నియు నంగములేకాని యాత్మస్థానీయములు కాఁజాల వనుట స్పష్టమైనది. కావ్యాత్మ రసాదికమే. ఇది సూటిగా వాచ్యము కాదు. లక్షింపఁబడదు. అనుమానింపఁబడదు. అది సహృదయహృదయమున స్ఫురించును. ఆస్ఫురణ యెట్టిది? మార్గ మేది? అది యందఱకు నేల గోచరము కాదు? గోచరమగుటకు పాఠకుఁ డెట్టి యర్హతను సంపాదింపవలయును? మున్నగు విచారణము యొక్క పరిపక్వస్థితియే ధ్వనిమార్గము. ఈ మార్గమును కనిపట్టి యందలి సాధక బాధకము లను క్షోదక్షమముగా విచారించి యితర మార్గములకంట దీనికిఁగల యాత్కృష్ట్యమును ప్రతిపాదించి సువ్యవస్థాపితము చేసిన మేధావి యానందవర్ధనుఁడు. ఆ మార్గమును నిష్కంటకముగా ప్రతిష్ఠాపించి యందలి గుణ విశేషములను ద్విగుణీకృత మొనరించిన మహితాత్ముఁడభినవ గుప్తపాదుఁడు.

ఈ ధ్వనితత్త్వమర్మము నరయుటకు ముందు శబ్దమునుండి యర్థము సిద్ధించుటలోఁ గల విధానములను గూర్చి పరిశీలింపవలసి యున్నది. కావున నభిధాది శబ్దవృత్తుల విచారణము కర్తవ్యము.

ఓమ్

# భారత ధ్వని దర్శనము

## ద్వితీయాధ్యాయము
## ధ్వనిప్రతిష్ఠాపనము

### 1. అభిధావృత్తి :-

ప్రతి శబ్దమునకు సంకేతితమైన యర్థ మొకటి యుండును. ఈ శబ్ద మా యర్థమును బోధింపవలయు నను నేర్పాటే సంకేతము. అట్లు సంకేతితమైన యర్థమునే వాచ్యార్థము, అభిధేయము, ముఖ్యార్థము అనుపేరులతో వ్యవహరింతురు. ఈ వాచ్యార్థము సాధారణముగా వ్యాకరణము, ఉపమానము, ఆప్తవాక్యము, వ్యవహారము, వివరణము, అన్యపదసాన్నిధ్యము అనువాని ద్వారమున తెలియవచ్చును. ఇట్టి వాచ్యార్థమును లేక యభిధేయమును బోధించు శక్తిని లేదా వృత్తిని లేదా వ్యాపారమును అభిధ యందురు.

(1) 'రామః' అనుపదమును వినుటతోడనే వ్యాకరణజ్ఞుఁడు 'రమ్' ధాతు 'ఘఞ్' ప్రత్యయముల యోగముచే నేర్పడిన 'రామ' అను ప్రాతిపదికమునకు 'సు' ప్రత్యయము చేర్పఁగా నేర్పడిన రూపమిది యని మనస్సున స్మరించి 'రమించువాఁడు', 'దీనియందు యోగులు రమింతురు' అను నర్థముగల దశరథ జ్యేష్ఠాపత్యము అను జ్ఞానము పొందును. కావున నిట అభిధేయార్థము వ్యాకరణము వలనఁ దెలియవచ్చినది. (2) పులి పిల్లి వలె నుండును అని బాలకునకుఁ జెప్పఁగా 'పులి' అను పదముచేఁ జెప్పబడు జంతువిశేషము జ్ఞానము స్థూలముగా వానికిఁ గలుగును. ఇట నుపమానముచే పులిశబ్దమున కర్థము గ్రహింపఁబడినది. (3) రాగద్వేషవిహీనచిత్తుఁడై హిత ముపదేశించు నాప్తుఁడొక వస్తు విశేషమును జూపి యిది 'ఖడ్గము' అని చెప్పఁగా తదర్థము అంతకుముందు తెలియని వానికిఁ దెలియుచున్నది. ఆప్తవాక్య మిట్లర్థజ్ఞానమునకు తోడ్పడుచున్నది. బాలుఁ డింటిలోని పెద్దల వాగ్వ్యవహారమువలన ననేక శబ్దముల కర్థము తెలిసికొను చున్నాఁడు. ఉదాహరణమునకుఁ దనతండ్రి తల్లిని ఫల మిమ్మని యడుగఁగా నామె తెచ్చు వస్తు విశేషమును జూచి ఫల మనఁగా పండని కుమారుఁడు గుర్తించుచున్నాఁడు. ఇట వ్యవహారము సంకేతమును బట్టి యిచ్చినది. (5) ఇది నాగలి, ఇది దున్నుట, ఇది నీలమైన పటము, ఈమె జానకి అని పెద్దవారు చిన్నవారికి వివరింపఁగా సంకేతము

తెలియవచ్చుచున్నది. (6) కొండొకచో అన్యపదసాన్నిధ్యమువలనను వాచ్యార్థ మవగత మగుచున్నది. మీ అప్పమగని పేరేమి? అనువాక్యమున 'మగని' అనుశబ్దము సాన్నిధ్యమువలన 'అప్ప' శబ్దమునకు సోదరి యనునర్థమును 'మీ యప్ప యేమి చేయుచున్నాఁడు?' అను వాక్యము నందలి చేయుచున్నాఁడు అనుమహద్బోధక క్రియాపదసాన్నిధ్యమువలన అప్పశబ్దమునకు తండ్రియను నర్థమును నిర్ణీతములగు చున్నవి.

కొన్ని యెడల నొకశబ్దముచేతనే అనేకార్థములు లోకమున వ్యవహరింపఁ బడుచున్నవి. అప్పుడీ యభిధాశక్తి యర్థము నెట్లు నిర్ణయించు నను ప్రశ్నకు సమాధాన మిట్లు చెప్పఁబడినది.

"సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా,
అర్థః ప్రకరణం లిఙ్గం శబ్ద స్యాన్యస్య సన్నిధిః,
సామర్థ్య మౌచితీ దేశః కాలో వ్యక్తి స్స్వరాదయః,
శబ్దార్థ స్యానవచ్ఛేదే విశేషస్మృతి హేతవః."

సంయోగము, విప్రయోగము, సాహచర్యము, విరోధము, అర్థము, ప్రకరణము, లింగము (చిహ్నము), అన్యశబ్ద సన్నిధి, సామర్థ్యము, ఔచిత్యము, దేశము, కాలము, వ్యక్తి (లింగము), స్వరము మొదలగునవి శబ్దార్థనిర్ణయమున నందియము కలుగునపుడు విశేషస్మృతి హేతువు లగును. ఉదాహరణముల నరయుదము. (1) హరిశబ్దమున కనేకార్థములు గలవు. చతుర్భుజుఁడగు హరి యని యందుమేని చతుర్భుజసంయోగము గల విష్ణువే ఇట వాచ్యుఁ డగుచు నశ్వాదికమగు నర్థమును పరిహరించుచున్నాఁడు. (2) ఈతఁడు గాండీవము లేని కృష్ణుఁడు అన గాండీవవిప్రయోగము (రాహిత్యము) వలన కృష్ణశబ్దమున కర్జునుడను నర్థము నియమిత మగుచున్నది. (3) లక్ష్మణ శబ్ద సాహచర్యముగల రామశబ్దముచే దశరథరాముఁడే వాచ్యుఁ డగుచున్నాఁడు. (4) రామరావణు లన్నచో రావణునితో విరోధముగల లక్ష్మణాగ్రజుఁడే గ్రహింపఁబడును గాని పరశురామ బలరాములు కారు. (5) ముక్తికై శివార్చన చేయుదు నన్నచోట ముక్తి యను నర్థము (ప్రయోజనము) శివాశబ్దపార్వత్యర్థమును నియమించుచు నక్కయను నర్థమును పరిహరించుచున్నది. (6) పావని సీతాన్వేషణమున సఫలీకృతుఁడాయె నన్నచో ప్రకరణమును బట్టి హనూమంతుఁడను నర్థమేకాని భీమసేనుఁడను నర్థము గ్రహింపఁ బడదు. (7) కుమారుఁడు శక్తిధరుఁ డన్నచో శక్తిధరత్వ చిహ్నము షాణ్మాతురుఁ డను నర్థమును బోధించును. పుత్రుఁడను నర్థము నీచిహ్నము తొలగించును. (8)

అన్యపదసన్నిధి కుదాహరణము చూపఁబడినది. మఱియు నొకటి - మనము నిశ్చింత మాయెను. అనువాక్యమున ఆయెను అను క్రియాపదసన్నిధానమువలన ఉభయార్థక సర్వనామార్థ మిట గ్రాహ్యము కాదు. (9) విషముఁ ద్రావి మరణించె నమనపుడు మరణింపఁజేయు సామర్థ్యము గరళమునకే కలదు కావున జలమను నర్థము తొలఁగు చున్నది. (10) ప్రాచీముఖమున సూర్యుడు కన్పట్టుచున్నాఁడు అనువాక్యమున ముఖ శబ్దమున కౌచిత్యముచే ముందు భాగమనునర్థము సిద్ధించి యాననమను నర్థము పరిహరింపఁబడుచున్నది. (11) భాస్కరుఁడుత్తరమున నున్నాఁడందుమేని ఉత్తరమున సూర్యుఁడుండుట యసంభవము కావున భాస్కర శబ్దమునకు తన్నామక వ్యక్తి యర్థమగుచున్నాఁడు. ఇట దేశ మభిధను నియమించుచున్నది. (12) ఒక విప్రలబ్ధ విభావరియందు తాపము భరింపశక్యము గాకున్న దన్నచో నచట తాపశబ్దము జ్వర తీవ్రతను చెప్పును. ఇచట కాల మభిధానియామకము. ఇట్లే స్వరము, కాకువు, శాస్త్రము, మున్నగునవి కూడ నభిధానియామకము లగుచున్నవి. ఇట్లభిధావృత్తియే సన్నివేశాదులవలన భిన్నార్థముల నొసఁగుటకుఁ జాలియున్నది.

వాచ్యార్థము నొసఁగు శబ్ద రూపమైన దానికి వాచక మనిపేరు. కావున నర్థము వాచ్యము, శబ్దము వాచకము. వ్యాపార మభిధ యనఁబడుచున్నది. లోకములో నధికవ్యవహారము దీనివలన నగుట మాత్రమే కాదు. తరువాతివగు లక్షణావ్యంజనా వ్యాపారములకుఁగూడ మూల మియ్యదియ.

ఈ వాచక మర్థమును బోధించువిధానమునందు వైవిధ్యము గలదు. () కొన్ని పదముల కాయర్థ మెట్లు సిద్ధించునో వ్యాకరణాంశముల మూలమున నిరూపింపవచ్చును. కర్తా, కారకః మున్నగు నిట్టి పదములను యౌగికము లందురు. (2) కొన్ని పదముల కట్టి యర్థసిద్ధిని శాస్త్రీయముగా నిరూపింపలేము. ఇల్లు, ఊరు మొదలగునవి. ఇట్టివానిని రూఢము లందురు. (3) కొన్నింటికి వ్యుత్పత్త్యర్థమును జెప్పవచ్చునుగాని యాయర్థముగల యన్నింటికి నది వర్తింపదు. ఇట్టివి యోగ రూఢము లనఁబడును. తురంగము వేగముగా పోవునది - గుఱ్ఱము మొదలగునవి యిట్టివాని కుదాహరణములు. (4) కొన్ని పదము లవయవార్థముచే నాయర్థము వర్తించు నన్నింటిని, రూఢిచే నొక్కదానిని బోధించుట కలదు. ఉదా: పార్థుఁడు - పృథయొక్క పుత్రుడు అను నవయవార్థముచే ధర్మజ భీమార్జునులకును, రూఢిచే నర్జునున కొక్కనికిని వర్తించును. ఇట్టివి యౌగికరూఢము లనఁబడును.

## 2. లక్షణావృత్తి :

లోకములో పైఁ జెప్పిన ముఖ్యార్థముకంటె భిన్నమైన యర్థమొకటి గోచరించుచున్నది. నిలిచి విచారించినచో నర్థమునకు పొసఁగుదలలేని పదములను మనమందందు ప్రయోగింతుము. వాఁడా తనుగాత్రిని కనులతోఁ ద్రావుచున్నాఁ డను వాక్యమున కనులతో త్రావుట యనుదాని కర్థము కుదురదు గదా! నోటితో ద్రవపదార్థమును జుఱ్ఱిన ట్లామెను లోఁగొనఁజూచుచున్నాఁడని పైక్రియాపదమునకు సన్నిహితమైన యర్థమును జెప్పుకొందుము. ఆమెయం దాతనికిఁ గల వాంఛాతిశయ మిట్లు చెప్పుటలో ప్రయో జనముగా నగుచున్నది. ఇట్లొకవాక్యమున నొకపదము యొక్కయో, కొన్ని పదముల యొక్కయో యర్థము కుదురకుండుట, సన్నిహిత మగు నర్థమును కల్పించుకొని వాచ్యార్థమును కుదుర్చుకొనుట దానికి లోకవ్యవహారమున రూఢియో, యేదేని ప్రయోజనమో యుండుట యనుతీ రందందు గోచరించును. అభిధావృత్తి వాచ్యార్థమునే చెప్పఁ జాలియుండును.మిగిలిన ప్రక్రియకు వృత్త్యంతర మొకటి యవసర మగుచున్నది. దానినే 'లక్షణ' యందురు.

పైవివరణము ననుసరించి లక్షణలో మూడు ప్రధానాంగములు గన్పట్టు చున్నవి. (1) వాచ్యార్థము పొసఁగకుండుట (ముఖ్యార్థబాధ) (2) పొసఁగించుటకై దానికి (వాచ్యార్థమునకు) సన్నిహితమగు నర్థమును గల్పించుకొనుట (3) అట్టి కల్పనకు రూఢియో, ప్రయోజనమో యాధార మగుట. నిత్య వ్యవహారములో మన కిట్టి వనేకము గోచరించును. ఉదాహరణమునకు అన్న ముడుకుచున్నది అను వాక్యము కలదు. బియ్య ముడుకగా నేర్పడిన వస్తు విశేషమును అన్నముగా వ్యవహరింతుము. అనఁగా నుడికెడి దన్నము కాదు - బియ్యము. కావున నిట ముఖ్యార్థబాధ కలదు. దానిని తొలఁగించుటకై అన్నముగా నుడుకుచున్న దనునర్థము లోకరూఢిని బట్టి కల్పించుకొందుము. కావున నిందు ముఖ్యార్థబాధ, రూఢి, అన్యార్థ కల్పనము అను లక్షణా సామగ్రి కలదు.

మఱియొక యుదాహరణము : ఈ యేఱు మాయూరిమీఁదుగా ప్రవహించు చున్నదను వాక్యములో ముఖ్యార్థబాధ కలదు. ఊ రనఁగా గృహసముదాయ రూపము. దాని మీఁదుగా నేఱు ప్రవహించినచో ఊరు సముద్రము పాలగును. కావున నర్థము పొసఁగదు. కావున మాయూరి కతిసన్నిహితముగా ప్రవహించుచున్న దను పొసఁగెడు నర్థమిట స్వీకార్యము. ఏటి వలని ప్రయోజనములు - సస్యానుకూలమగు జలసమృద్ధి, శీతల వాయు ప్రసరణము మొదలగునవి - మాకు బాగుగా లభ్యమగుచున్న వనుట

యిట ప్రయోజనము. ప్రయోజనమును బట్టి యేర్పడు లక్షణాస్వరూప మిట్లుండును.

ఈ లక్షణావృత్తిచే నర్థము సూటిగా వచింపఁబడక (వాచ్యము కాక) లక్షింపఁబడును - సూచింపఁబడును గావున నీవృత్తిచే నేర్పడు నర్థమును లక్ష్యార్థ మనియు నాపదమునకు లక్షక మనియు వ్యవహారము కలిగినది.

ఇందనేకప్రభేదములు గలవు. పై రెం డుదాహరణములలో లక్ష్యార్థమునకు వాచ్యార్థముతో సంబంధము గలదు. అన్న ముడుకుట - అన్నముగా నుడుకుట, ఊరిమీదుగా ప్రవహించుట - ఊరి కతిసన్నిహితముగా ప్రవహించుట అనువానిలో సంబంధము స్పష్టమే కదా! కావున నిట్టి పద్ధతిని సంబంధ నిబంధనగా వ్యవహరింతురు. ఇందు రెండవది ప్రయోజనమును బట్టి యేర్పడినది.

'వాడు ప్రజాధనమును మ్రింగివైచెను' అను వాక్యమున నర్థము పొసఁగదు. ఎవ్వఁడు గాని ధనము నన్నమువలె నోటితో మ్రింగఁడు. (ఒకవేళ కాగితమును నమిలి మ్రింగుట జరిగినను నది యిట వివక్షితము కాదు.) కావున మ్రింగుట యనఁగా మ్రింగిన పదార్థము వలె స్వాయత్తము చేసికొనుట యను నర్థ మిట కల్పించుకొనవలయును. ధన సంబంధ మిట కలదు కావునను, మ్రింగుట యనఁగా గుట్టుగా స్వాయత్తము చేసికొనుట యను రూఢి కలదు కావునను నిది రూఢివలన సిద్ధించిన సంబంధ నిబంధనలక్షణ కుదాహరణము.

మఱియు నీసంబంధనిబంధన జహత్స్వార్థ, అజహత్స్వార్థ యని ద్వివిధము. ముఖ్యార్థమును కేవలము వదలివైచినది జహత్స్వార్థయు, వదలనిది అజహత్స్వార్థయు నగును. మొదటియుదాహరణమున నూరిమీఁదుగా నేఱుపోవుట యనుచోట 'మీదుగా' ననుదానియర్థము సర్వథా త్యాజ్యమే. ఊరికి 'నడుమ' లేక 'ప్రక్కగా' 'సన్నిహితముగా' ననునర్థమే యిటసంభావ్యము. కావున నిట్టిది జహత్స్వార్థ. 'మేళములు వచ్చుచున్నవి.' అనుచోట వాద్యవిశేషములు తమంత తాము వచ్చుట సంభవింపదు. మేళగాండ్రు వచ్చుచున్నా రనునది లక్ష్యార్థము. మఱియు నిందు మేళగాండ్రతోపాటు మేళములు కూడ వచ్చుట కలదు. అనఁగా స్వార్థమిందు త్యజింపఁబడలేదు. ఇట్టిది అజహత్స్వార్థ.

'వాఁడొక కోఁతి' అనినచో తిర్యగ్వాచకమగు కోఁతికి మహద్బోధక సర్వనామము 'వాఁడు' అనునది ప్రయోగించుటచే ముఖ్యార్థబాధ యున్నది. కోతి వంటివాఁడనునది యిట లక్ష్యార్థమగును. కోఁతికున్న వికారలక్షణములు, వికృత చేష్టలు నీతనికిఁగలవని చెప్పుట ప్రయోజనము. ఇచట నొకవ్యక్తికి కోఁతితో సామ్యము వివక్షిత మగుచున్నది.

కావున దీనిని సామ్యనిబంధన యందురు. ప్రకృతోదాహరణమున తచ్ఛబ్దవాచ్యునియందు మర్కటత్వ మారోపంపఁబడినది. కావున నిది సారోపలక్షణ యనఁబడును. ఉపమేయము చెప్పఁబడక యుపమానమే చెప్పఁబడిన సామ్యనిబంధనాలక్షణను సాధ్యవసాయలక్షణ యందురు. 'అదిగో కోఁతి' అని మనుష్యు నొక్కనిగూర్చి వ్యవహరించినచో నది సాధ్యవసాయలక్షణ కుదాహరణమై యావ్యక్తి కోఁతియే యన్నంత వికారస్వరూపచేష్టాదులు గలవాఁడనుటను దెలుపును.

ఈ సామ్యనిబంధన రూఢినిబట్టి యేర్పడుటయును గానవచ్చును. తాపత్రయమను పదమున కాధ్యాత్మికాధిభౌతికాధిదైవికములను మూఁడుతాపము లర్థము. వాఁడు తనప్రియురాలినిఁ బెండ్లి యాడుటకు తాపత్రయ పడుచున్నాఁ డను వాక్యమున తాపత్రయము వంటి కష్టము పడుచున్నాఁ డను లక్ష్యార్థ మిట సిద్ధించును. తాపత్రయ మనఁగా నధికమైన కష్టమను నర్థము లోకమున రూఢి కెక్కినది. ఇట్టిది రూఢినిఁ బట్టి యేర్పడిన సామ్యనిబంధనాలక్షణ యగును.

ఈ పై (జెప్పినవి కాక లక్షితలక్షణ, వ్యతిరేక లక్షణ యను మఱిరెండు భేదములు గలవు. వాచ్యార్థానుపపత్తి కలిగినపుడు వాచ్యార్థమునకు సాక్షాత్తుగా సంబంధించిన యర్థము కాక పరంపరగా సంబంధించిన వేఱొక యర్థమును బోధించు శక్తిని లక్షిత లక్షణ యందురు. ద్విరేఫాదిశబ్దము లిట్టి లక్షణ కుదాహరణములు. ద్విరేఫ మనఁగా రెండు రేఫములు గలది. రేఫము వర్ణమగుటచే నది యొక శబ్దాంతరమును - భ్రమర మనుదానిని - లక్షించును. అది తుమ్మెదను జెప్పును. శబ్దము సాక్షాత్తుగా నొక వస్తువునో, వ్యక్తినో వచింపవలసి యుండఁగా నట్లు కాక వేఱొక శబ్దమును దోఁపఁజేయుటచే నిట వాచ్యార్థానుపపత్తి యని గుర్తింపఁదగును.

వాచ్యార్థమునకు పూర్తిగా విరుద్ధమైన యర్థమును గ్రహించు సందర్భములును గలవు. వెలయాలిని పతివ్రత యనుట, మూర్ఖుని బృహస్పతి యనుట, త్రికరణ శుద్ధి లేనివానిని అపర గాంధి యనుట, ఆలస్యముగా వచ్చినవానిని పెందలకడ వచ్చితి వేమని పృచ్ఛించుట మున్నగునవి యీ విధానమునకు సంబంధించినవి. ఇట్టివానిని వ్యతిరేక లక్షణ యందురు. కొందఱు దీనిని జహత్స్వార్థలో గతార్థము చేయుదురు.

ఈ లక్షణము శబ్దవృత్తి యనవచ్చునా? అను విషయమును గూర్చి యభిప్రాయభేద మున్నది. నిజమున కిట అభిధ తనవ్యాపారమును ముగించిన పిమ్మట నదేశబ్దమునకు మఱియొక వ్యాపారమును బ్రవర్తించు లక్షణ యర్థవృత్త యనియే భావింపఁదగు నని కొందఱ అభిప్రాయము. నిజమే. కాని యేశబ్దము నర్థనిర్ణయమునకు

అభిధాశక్తి చాలుటలేదో యా శబ్దమునందు వర్తించు శక్తి కావున దీనిని శబ్ద శక్తిగా నంగీకరించుటలో దోషము లేదు. లేదా 'ఇట నర్థధర్మమును శబ్దమునం దారోపించి శబ్దశక్తియని యౌపచారికముగా వ్యవహరించు చున్నారు'. అని శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి గారు చెప్పిన సమాధానము ననుసంధించు కొననగును.

(కా. సం. వ్యా. పుట. 146)

లక్షణభేదముల నీ క్రిందిపట్టికలో చూడనగును :




ఇది లక్షణ స్థూల స్వరూపము. అభిధవలె నిదియు లోకమున ప్రచురముగనే వాడఁబడుచున్నది.

## 3. వ్యంజనావృత్తి :

ధ్వన్యాలోక మావిర్భవించుటకు ముందు ప్రాయికముగా నభిధాలక్షణా వృత్తులనే లాక్షణికు లంగీకరించిరి. కాని యీ రెండు వృత్తులును కొండొక యర్థ విశేషమును జెప్పుటకు అసమర్థము లగుచున్న వని గుర్తించి యట్టి యర్థవిశేషమునకై మఱియొక వృత్తి నంగీకరింపక తప్పదని మొట్టమొదట వక్కాణించిన మనీషి ఆనందవర్ధనుఁడు. అదియే వ్యంజనావృత్తి. సుప్రసిద్ధమగు సంకేతితార్థముకంటెను, వాచ్యార్థానుపపత్తిచే వాచ్యార్థమునకు సన్నిహితముగాఁ జెప్పికొనెడు లక్ష్యార్థముకంటెను భిన్నముగా స్ఫురణరూపమున గోచరించు నర్థవిశేషమొకటి లోకమునఁ గానవచ్చుచున్నది. అది సంకేతితము కాదు. కావున వాచ్యార్థము కాదు. వాచ్యార్థముకానిదాని నభిధ చెప్పదు. వాచ్యార్థానుపపత్త్యాది హేతుత్రయ మిట్టియర్థమున లేదు. కావున నిది లక్ష్యార్థము కాదు. లక్ష్యార్థముకానిది లక్షణచేఁ జెప్పఁబడదు. కావున వాచ్యలక్ష్యార్థములకంటె భిన్నమయిన

యర్థవిశేషమును జెప్పుటకు వృత్త్యంతరమొకటి యవశ్యగ్రాహ్య మగుచున్నది. వాచ్యలక్ష్యార్థములకంటె భిన్నమగు తాత్పర్యార్థము నొకదానిని పూర్వులంగీకరించిరి. ప్రకృతము అర్థవిశేషముగా భావింపఁబడిన దిదియే యగునా అన్నచో కాదు. భిన్న భిన్న సంకేతార్థములుగల పదము లొకచో నొకక్రమమున నుచ్చరింపఁబడఁగా వానియన్నిటి సమాహారముచే సిద్ధించు వాక్యార్థమునకే తాత్పర్యార్థమని వ్యవహారము. వ్యంజనచే సిద్ధించున దట్టిది కాదు. అది పరమరమణీయము, సహృదయైక వేద్యము. తాత్పర్యార్థ మిట్టిదికాదు. తఱచినకొలఁది మనస్సు నాకర్షించి 'యాహా' పుట్టించు నాయర్థమునకును, కేవలవాక్యార్థరూపమ్మైన తాత్పర్యార్థమునకును జాలయంతరము గలదు. అట్టి రమణీయమగు నర్థాంతరము భావనాబలము గలవాని హృదయమున స్ఫురించును. ఆ స్ఫురణను గలిగించునదియే వ్యంజనావృత్తి.

వాచ్యలక్ష్యార్థములకంటె భిన్నమైన యర్థవిశేషము గలదా? యని శంకింపఁ బనిలేదు. అయ్యది మహాకవుల వాక్కులయందు గోచరించుచునే యున్నది. ఒక యుదాహరణము నరయుదము.

> "నా కెడ యిమ్ము; లెమ్ము; కురునాథమనఃప్రియధర్మపత్ని ! నే
> నేకత మెట్టులుండుదు? మహీశునితోడన పోదు; పుత్త్రులం
> జేకొని పెన్పు; నాపనుపు సేయుము; నావుడు మాద్రి తద్దయున్
> శోకపరీతచిత్త యగుచుం బృథ కి ట్లనియెం బ్రియంబునన్." 1.5.155

శతశృంగపర్వతమున కిందము శాపము నొందకుండఁ దలఁచి మునివృత్తినున్న పాండురాజు మ్రోల నపూర్వశృంగార విలాసలీలతో విహరించి మాద్రి యాతని మృతికి హేతువైన దని యెంచి క్రోధశోకములు పెనఁగొన కుంతీదేవి యాడిన మాట లియ్యవి : 'ఓ మాద్రీ! నీవు పాండుమహారాజునకు మనఃప్రియురాలవగు ధర్మపత్నివి. నా కవకాశ మిమ్ము. లెమ్ము. నేను భర్తృహీననై యెట్లుందును? రాజుతోడనే పోవుదును. కుమారులను జేకొని కాపాడుము. నేను జెప్పినట్లు చేయుము.' అనఁగా మాద్రి మఱియు మిక్కుటమగు శోకముతో కుంతి కిట్లనెను. ఇది వాచ్యార్థము. ఇందు విశేషార్థసంభావన కాస్కార మున్నట్లు తోఁచును. 'కురునాథమనఃప్రియధర్మపత్ని' అను సంబోధనమునం దొక నిగూఢమైన దెప్పిపొడుపు కానవచ్చును. ఎట్లన తత్కాలమున కుంతి తలఁపున మాద్రి భర్తృహంత్రి. అట్టిది మనఃప్రియుర లెట్లగును? తాత్కాలిక సౌఖ్యహేతుత్వరూపమున ప్రియురాలైనదని సంభావింపరాదు. సత్క్రియానుష్ఠానార్థము సహధర్మచారిణియైన వనితనే పత్ని యందురు. 'పత్యు ర్నో యజ్ఞసంయోగే' అను పాణినీయ సూత్రము దీనికి ప్రమాణము. కాని మాద్రి

దీనికి విరుద్ధముగా కామపీడితయై రానున్న ఘోరవిపత్తును సైతము లెక్కసేయక భర్తృసమాగమ మాశించినది. ఇట్టిది పత్నియెట్లగును? మనఃప్రియ యెట్లగును? కేవలము భర్తృహంత్రియే యను నభిప్రాయము భరింప శక్యము గాని శోకోద్వేగమువలనఁ గలిగిన కోపోద్రేకముతో కుంతీహృదయమున నుదయించియుండు ననుట సంభావ్యము. ఆయభిప్రాయము మాద్రికి భంగ్యంతరముగా స్ఫురించుటకు కురునాథుమనఃప్రియ ధర్మపత్ని యను సంబోధనము చాలియున్నది. 'నేనేకత మెట్టులుండుదు' అను వాక్యమున శాపమున్నదని యెఱిఁగి భర్తృసంరక్షణమున నేమఱినదానవు నీవు భర్తృహీనవై బ్రదుకఁ గలవు గాని పతితోడిదే లోకమని బ్రదుకు నేనెట్లు జీవింతును? దౌర్భాగ్య జీవనము నీక తగుఁ గాని నాకు వలదుసుమా! అను నభిప్రాయము స్ఫురించును. ఇట్టి యభిప్రాయము కృతక మనరాదు. నిజమునకు పాండురాజు తన కెట్టివాఁడో మాద్రికి నట్టివాఁడే. కావున నేకత ముండుట తన కెట్లు దుస్సహమో మాద్రికి నట్లే. అట్టియెడ కుంతి 'నేను' అని చెప్పుటలో తన మనస్థితికిని, మాద్రిమనస్థితికిని భేదము వక్కాణించి నట్లయినది. 'మహీశునితోడన పోదు' అను వాక్యమున పతియే సతికి గతికాని తదన్యము కాదు. పతి ననుగమించుటయే కర్తవ్య మను లోకాచారమును మాద్రికి స్ఫురింపఁజేయు తాత్పర్య మభివ్యక్త మగును. మాద్రిపత్యనుగమన నిశ్చయమున కిదియే ప్రేరక మనవచ్చును. 'పుత్రులం జేకొని పెన్పు' అనుటలో పతి నుపేక్షించిన విధమున నర్భకులగు వీరిని గూడ నేమఱి దిక్కుమాలిన వారినిగా నొనర్పకుము అను నర్థమునుగాని, ప్రాణాధికముగా సంరక్షించుకొనఁదగిన భర్తనే చంపినదానవు నీకు పుత్రులన్న లెక్కయా? వీరిని తగు విధముగా పెంపఁగలవా? అను నభిప్రాయమును గాని యూహింపనగును. 'నా పనుపు సేయుము' అనుటలో ఇంతకు ముందు నిన్ను హద్దులో నుంచుటకు నే చేసిన యత్నము వృథ యైనది. ఇఁకనైన - నేను మరణించిన వెనుక నైన - నామాట పాటింపు మను నెచ్చరిక యభివ్యక్త మగును. అణఁపరాని శోకక్రోధములవలన హఠాత్తుగ కుంతి నోటినుండి వెలువడిన యీ వాక్యసముదాయమును బట్టి సంభావితమైన పైయర్థ విశేషమువలన కుంతి సపత్నీమాత్సర్యము ప్రస్ఫుట మగు ననుకొనరాదు. పతిదేవతయగు నామెకు భర్తృమరణజనిత దుఃఖ మిట్టి సూటిపోటిమాటలకు హేతువైన దనుటయే సంభావ్యము. ఇట్టి విశేషార్థము తోఁచుటంబట్టియే మాద్రి తద్దయు శోకపరీతచిత్త యైనది. అనఁగా పతి మరణజనిత వేదనకంటె నధికతరవేదన యామె హృదయమున కుంతీ వాక్యముల వలనఁగలిగిన దనఁగాఁ బైయర్థ మంతయు నామెకు స్ఫురించిన దనియే చెప్పవలయును.

ఇట్లు స్ఫురించిన యర్థ విశేష మంతయు సంకేతితము కాదు. కావున నభిధ యట ప్రవర్తింపదు. వాచ్యార్థానుపపత్తి యెందును లేదు. కావున లక్షణావృత్తికి ప్రవేశము

లేదు. ప్రసిద్ధములగు నీ రెండు శక్తులకును శక్తి చాలనిచోట సువిచారిత రమణీయమైన యర్థాంతర స్ఫురణ ముండుటంబట్టి యద్దానికై యభిధాలక్షణలకంటె వేఱైన వృత్తియొకటి తప్పక గ్రాహ్యము. అభివ్యక్తము చేయుట, స్ఫురింపఁజేయుట యనునది యిట వృత్తిచేసెడు కార్యము కావున నీ వృత్తికి వ్యంజనయను పేరు కలిగినది.

వాచ్యార్థము పొసఁగినపిమ్మట కవివివక్ష ననుసరించి సహృదయుని భావనా బలమును బట్టి సంభావితమగు నర్థవిశేషమును సమర్పించు వృత్తిని వ్యంజనా వృత్తి యందురని ఫలితార్థము. దానివలన సిద్ధించు నర్థమును వ్యంగ్యార్థ మందురు. ఆ యర్థమును బ్రతిపాదించు శబ్దమును వ్యంజక మందురు. ఈ వ్యంజనావృత్త్యా విష్కరణములో నుద్బోధక సామగ్రి యెట్టిదో పరిశీలింపవలయును.

## 4. వ్యంజనావృత్త్యుద్బోధక సామగ్రి :-

ఈ వ్యంజనావృత్తి ప్రతిపాదనమున కానందవర్ధనులు తమ మేధాసంపద నెంతయో వినియోగింప వలసివచ్చినది. క్రొంగ్రొత్తగా నొక సిద్ధాంతమును ప్రతిష్ఠాపించుట కెట్టివారికిని శ్రమపడక తప్పదు. ఈ వ్యంజనకు ఉద్బోధక సామగ్రి యెట్టిదై యుండునో పరిశీలింపవలసి యున్నది. లోకమున నొక లేగదూడ తల్లి పొదుగున పాలుద్రావి పిమ్మట గంతులిడుచు పరువెత్తుచుండును. అది చూచి మనము దానియానంద పారవశ్యస్థితిని గుర్తింతుము. ఇట్లు దాని మానసవృత్తి యభివ్యక్తమే యగుచున్నది కాని వాచ్యమగుట లేదు. అట్లే తన బిడ్డ కేదేని కీడు వాటిల్లినచో గోవు ముఖవైఖరి, బుసగొట్టుట, అక్షివికారము మున్నగు వానిని బట్టి యది కోపముతో నున్నదని గుర్తింతుము. ఈ గుర్తింపు మనస్సునకు తోఁచునదియే కాని వాచ్యము కాదు. నెలల బిడ్డ యేడ్చెడు నేడ్పులలోని వైవిధ్యమును బట్టి వీని కాకలి యగుచున్నది, కడుపున నేదో బాధ యున్నది, ఏ చీమయో కుట్టినది, నిద్ర వచ్చినది, భయమైనది యను నీ మొదలైన రోదన హేతువులు తల్లి మనసునకు తట్టుచున్నవి. ఇవియన్నియు స్ఫురణరూపములే. యౌవనప్రాదుర్భావమున యువతీ యువకుల యాంగిక వికారములను బట్టి వార హృద్గతాభిప్రాయము లూహకు వచ్చుచున్నవి. ఇదియు వ్యంగ్యవైఖరియే. ఒకఁ డొకవస్తువు నపేక్షగాఁ జూచినచో వానికి దానిపై మోజు కలిగిన దనియు నొకవేళ నది యపహృతమైనచో నది వాని పనియే యనియు ననుమానింతుము. ఇట్లు లోకములో ననేక సందర్భములలో ననేక విషయములు వాగ్వ్యవహార రహితముగనే మనకు తెలియవచ్చుచున్నవి. ఈ పైఁజెప్పిన యన్నింటియందును ధూమాగ్నుల సంబంధమువంటి నియత సంబంధము నన్యూనానతి రిక్తముగ నిరూపింపఁజాలము కావున నా యా సముదితజ్ఞాన మనుమానప్రమాణ

జన్యమనుట పొసఁగదు. కావున వ్యంగ్యసద్భావజ్ఞానమునకు లోకవృత్తము చాలవఱకు నుద్బోధక మని తలఁపనగును.

ఆనందవర్ధనులు తమ కీవ్యంజనావృత్తి జ్ఞానము విద్వాంసులలో ప్రథమ గణ్యులగు వైయాకరణులవలననే కలిగిన దని వక్కాణించిరి. వైయాకరణులు శబ్దము వలన నర్థజ్ఞాన మెట్లు గలుగునో పరీక్షించిరి. పదైకదేశములగు నక్షరములవలన నర్థజ్ఞానము కలుగునా? లేక సముదాయరూపము వలననా? అను పక్షద్వయమును పేర్కొనిరి. అందు మొదటి పక్షమున వ్యస్తముగా నక్షర మర్థవంతమైనచొ తక్కినయక్షరములతో నక్కఱ యేమి? యను నాక్షేపము బయలుదేఱినది. కావున మొదటిపక్షము నిరాకరణీయ మగుచున్నది. సముదాయమే యర్థవంత మను రెండవ పక్షమునందును నొక యిబ్బంది యున్నది. నైయాయికుల మతమున నక్షరము రెండు క్షణములే యుండును. మూఁడవ క్షణమున నది నశించును. అపుడు కనీసము మూఁడు వర్ణములు గల పదములో మూఁడవవర్ణ ముచ్చరిత మగునప్పటికి సముదాయము లేదు కదా! లేనిదాని కర్థ సమర్పణ శక్తి యెట్లు కలుగునని శంకించి తచ్ఛంకానివృత్తికై వారు స్ఫోటసిద్ధాంతమును బ్రతిపాదించిరి. "వర్ణాతిరిక్తో వర్ణాభి వ్యంగ్యోర్థప్రత్యాయకో నిత్యః శబ్దః స్ఫోటః" యని స్ఫోట నిర్వచనము. వర్ణములకంట వేఱైనదయు, వర్ణములవలన వ్యక్తమై యర్థమును బోధించెడు నదియు నగు శబ్దము స్ఫోటము. ఇది నిత్యము. కావున నశించువర్ణముల కంటె నిది భిన్నము. ఉచ్చరితములై నశించు వర్ణములచేత నిత్యమగు స్ఫోటము మాత్ర మెట్లభివ్యక్త మగునను పూర్వపక్షమును శంకించుకొని వారిట్లు సిద్ధాంతము చేసిరి. మూఁడవవర్ణ ముచ్చరిత మగునపుడు మొదటి వర్ణము నశించుచున్నను తత్సంస్కారము నశింపదు. అట్టి సంస్కారముచే స్ఫోట మభివ్యక్త మగును. ("పూర్వ పూర్వవర్ణానుభవాహిత సంస్కారసచివేన అంత్యవర్ణానుభవేన అభివ్యజ్యతే స్ఫోటః") 'స్ఫుటత్యర్థో స్మాదితిస్ఫోటః ' (దీనివలన అర్థము స్ఫుటమగును) 'స్ఫోటయ త్యర్థ మితి స్ఫోటః' (అర్థము నిది స్ఫుటము చేయును) అని స్ఫోటశబ్దమునకు రెండు విధములగు వ్యుత్పత్తులు చెప్పఁ బడినవి. అట్టి స్ఫోటరూపమైన శబ్దమువలన నర్థజ్ఞానము కలుగు నని వైయాకరణుల సిద్ధాంతము.

తాను ప్రతిపాదించెడు ధ్వని సిద్ధాంతమున కీ స్ఫోటతత్త్వము మార్గదర్శకమని యానందవర్ధనుఁడు సూచించెను. పూర్వపూర్వవర్ణముల సంస్కారముతోఁ గూడిన యంత్యవర్ణధ్వని స్ఫోటము నభివ్యక్త మొనర్చునట్లే వక్తృవాచ్యప్రకరణాదులను బట్టి శబ్దము వాచ్యార్థము కంటె భిన్నమును రమణీయము నైన యర్థాంతరమును స్ఫురింపఁజేయును.

స్ఫోటవాదమునందు వర్ణధ్వని స్ఫోటమును వ్యక్త మొనర్చినట్లే యిందు శబ్ద మర్థాంతరమును వ్యక్తపఱచును. అచట వ్యంగ్యము స్ఫోటము, ఇట నర్థాంతరము. వ్యంజకమగు వర్ణధ్వనియందలి నామసాదృశ్యమును బట్టియే గమ్యమానము - అభివ్యజ్యమానము-అగు నీ యర్థాంతరమునకు ధ్వనియని యాతడు నామకరణము చేసెను. కావున అట్టి యర్థాంతరము నొసఁగు వ్యంజనావృత్తియనునది యపూర్వము నాధారరహితము నైన విషయము కాదు. విద్వాంసు లంగీకరించినదే యని యాతఁడు నిరూపించెను. ఇట్లు స్ఫోటవాదమనునదియు నీ వ్యంజనావృత్తి ప్రతిపాదనమున కొక హేతువైనది.

మరియు భరతుఁడు తన నాట్యశాస్త్రమున నేడవయధ్యాయమునందలి డెబ్బదియవ శ్లోక వివరణ సందర్భమున "యదాన్యోన్యార్థసంభూతై ర్విభావానుభావ వ్యంజితై రేకోనపంచాశతా భావైః సామాన్య గుణయోగేన అభినిష్పద్యన్తే రసాః. త త్కథం స్థాయిన ఏవ భావాః రసత్వ మాప్నువన్తి? ఉచ్యతే." అని వ్రాసిన గ్రంథ భాగమును బట్టి యందలి 'వ్యంజితైః' అనుపద మాధారముగ నానందవర్ధనుఁడు వ్యంజనావృత్తిని గ్రహించియుండనోపునని కొందఱుపండితుల యభిప్రాయము. దీనిని బట్టి వ్యంజనావృత్తి యను యానందవర్ధనుఁడు ప్రతిపాదించినది కేవలమపూర్వము కాదనియు నయ్యది పూర్వ శాస్త్రజ్ఞులచే నించించుక స్పృశింపఁబడినదే యనియు తెలియవచ్చుచున్నది.

మఱియు రామాయణ మహాభారతాది గ్రంథములందే కాక "ద్వా సుపర్ణా సయుజా సఖాయా, సమానం వృక్షం పరిషస్వజాతే, తయో రేకం పిప్పలం స్వాద్వ త్త్యనశ్న న్నన్యో అభిచాకశీతి." ఇత్యాద్యుపనిషద్వాక్యములందును లక్ష్యముఖమున నిది దృశ్యమాన మగుచునే యున్నది. కాన దీనిని పూర్వ లాక్షణికులు సమగ్రముగా వివేచించి నిరూపింపని కారణమునను, వ్యంగ్యార్థ ప్రాధాన్యమును బట్టియే కావ్యమునకు నుత్తమత్వము సిద్ధించు ననుట త్రోసివేయఁజాలని యభిప్రాయముగాఁ గానవచ్చుచుండుటవలనను, పూర్వులు కావ్యప్రధానాంశముగా ప్రతిపాదించిన గుణాలంకార వృత్తిరీత్యాదుల కాస్థితి సుదృఢము కాకుండుటవలనను ఆనందవర్ధనులు వ్యంజనావృత్తి నవలంబించి ధ్వని సిద్ధాంత ప్రతిష్ఠాపనము చేయువలసి వచ్చినది. ఈ ధ్వని సూర్యోదయముతో గుణాలంకారాది ప్రదీపముల వెలుఁగునకు పరిమితత్వ మేర్పడినది. మహారాజు ననుసరించు భృత్యవర్గమువలె నివి ధ్వని ననుసరించి మనవలసి వచ్చెను. ఇది కావ్యాత్మగా నంగీకరింపఁబడెను. ఈ సిద్ధాంతము వెుక్కవోకుండుటకై యానందవర్ధనులే కొన్ని యభావవాదముల నూహించి ఖండించిరి. వానిని పరిశీలింతము.

## 5. అభావవాదములు :-

ఆనందవర్ధను లూహించి ఖండించిన యభావవాదము లైదు తెఱఁగులు. అందు మొదటివాదము స్వరూప మియ్యది. శబ్దార్థమయ మగు కావ్యశరీరమునకు శోభ నొసఁగు ననుప్రాసాదులకంటెను, ఉపమాదుల కంటెను, అక్షర విన్యాసరూపమున నేర్పడు మాధుర్యాది గుణములకంటెను, తత్సమాహారరూపములే యైన వైదర్భ్యాది రీతుల కంటెను ధ్వని యనునది భిన్నముగా నొకటి యుండదు. అనఁగా ధ్వని యనునది శబ్దార్థరూపము కాదు కావున సౌందర్యస్థానము కాదు, గుణాలంకార భిన్నము కావున సౌందర్య హేతువును గాదని యీయభావవాదతాత్పర్యము.

దీనిని పరిశీలింతము. ధ్వని యనునది సౌందర్యస్థాన మగు శరీరముగనో, సౌందర్యహేతు వగు గుణాలంకారములలో నొకటిగనో భావింపఁబడలేదు. కావుననే యానందవర్ధనులు ధ్వన్యాలోక గ్రంథమును ప్రారంభింప వలసి వచ్చినది. ధ్వని యని తాను భావించినది కావ్యమునకు ఆత్మ. అది లేనిది శవప్రాయము. కావున ధ్వని కలదు. లోక వ్యవహారము నందును ఇది కానవచ్చును. ఒక యత్త క్రొత్తకోడలిని గూర్చి ప్రక్కయింటి యామెతో 'మా కోడలి కింకను దెల్లవాఱలే' దన్నచో నిందు కేవలము సంకేతితమైన యర్థమునే స్వీకరించుట వక్త్రితాత్పర్యము కాదు కదా! తెల్లవాఱుట యొక ప్రాంతములో నున్న వారందఱకొక్కమాఱే జరుగును. కావున నిందు విశేషార్థ ముండి తీఱవలయును. ఇంకను కోడలు నిదుర లేవలే దను నర్థము శ్రోత్రి భావింపవలయును. ఇంతవఱకు దీనిని లక్ష్యార్థ మనుకొన్నను నిదుర లేవకుండుటకుఁ గారణముగా నూహింపఁబడు రాత్రి నిద్రలేనితనము; భార్యాభర్తల రహఃక్రీడ - తెల్లవాఱిన సంగతి తెలియనీని యలసత మున్నగు నర్థవిశేష మంతయు వాచ్యలక్ష్యార్థముల కంటె భిన్నమే కదా! మఱియు నదియే ప్రాధాన్యమును భజించుచున్నది కదా! కేవలము వాక్యమున కందమును గూర్చు తాత్పర్యముతో కాక వివక్షితమైన యర్థమును శ్రోత్రికి స్ఫురింపఁజేయు తాత్పర్యముతోడనే యీవాక్య మిట్లు ప్రయుక్త మైనది కావున వక్రోక్తివంటి బాహ్యమైన యలంకారము నిట సంభావింపఁజాలము. ఇట్లు లోకవ్యవహారమును బట్టి ధ్వని సద్భావమును గూర్చి శంకింపఁ బనిలేదు.

కావ్యమునందును ఇది గోచరమే యగుచున్నది. ఒక యుదాహరణము నరయుదము. వనవాసాజ్ఞాతవాసములను గడు సమర్థముగా నిర్వహించి యున్న పాండవులకడకు ధృతరాష్ట్రుడు యోగక్షేమ విచారణమునకై సంజయుని పంపెను. ధృతరాష్ట్రుడు 'నితాంతస్నేహపూర్ణచేతోవృత్తి'తో నీవును నీవారలును యోగ క్షేమంబున



6

నున్న తెఱఁగు నారసి రమ్మని నన్ను పంపెనని సంజయుఁ డనఁగా ధర్మజుఁడు చెప్పిన సమాధానము :

" ఆ రాజు మాదెసం గల కారుణ్యముకతమునను సుఖంబున నిట్లు న్నారము; నిను బుత్తెంచిన గౌరవమున నాదు మది వికాసముఁ బొందెన్."

5.1.276

ధర్మజుఁడు సుఖంబున నున్నారమని కాక యిట్లున్నార మని తమస్థితిని చూపి చెప్పుచున్నాఁడు. అట్లు చెప్పుటలో మాకు సుఖమెక్కడిది? పరమనీచమైన కష్టస్థితి ననుభవించుచున్నార మను నర్థము వ్యక్త మగును. 'ఆరాజు' అనుటలో ధృతరాష్ట్రుడు తన్ను సింహాసన మెక్కించిన తమ్ముని పుత్రులను మమ్ము రాజ దృష్టితో చూచి రాజనీతినే నెఱపెను గాని వాత్సల్యము మాయం దెన్నఁడేని ప్రదర్శించెనా? అనునర్థము తోఁచును. దీనివలన కారుణ్య మనుదానికి పగయను విపరీతార్థము సంభావ్యము. 'నినుఁ బుత్తెంచిన గౌరవమున నాదుమది వికాసముఁ బొందెన్' అను వాక్యమువలన చేయఁదలచిన యపకార మంతయుఁ జేసి యిప్పుడు యోగక్షేమము లడుగుటకు నీవంటి యోగ్యునిఁ బంపిన మాత్రమున కష్టము లనుభవించి యింకను మఱవని నామనస్సునకు వికాసము కలుగుట యెట్లు? అను నర్థము గమ్యమాన మగును. మఱియు 'నాదుమది వికాసముఁ బొందెన్' అని తన్నొక్కనినే పేర్కొనుటవలన వారు చేసిన చేతలకు నేను సమాధానపడినను ఆశీవిషముల వంటి నా సోదరులును, తోక త్రొక్కిన త్రాచువలె నున్న ద్రౌపదియు నూరకుందురా? వారిమది వికాసము పొందఁగలదా? అనునర్థము అభివ్యక్తమగును. ఇట్లిట్లు భావింపఁబడెడు నర్థవిశేష మంతయు కృతక మనుకొనరాదు. తఱువాత ధర్మజుఁ డాడిన మాట లీయర్థమును సమర్థించును. కావున నిది వివక్షితమే. ఇట్టి యర్థ విశేష మంతయు నభిధాలక్షణావృత్తులవలన సిద్ధించునది కాదు. కావున నిట్టియర్థము నొసఁ గుటకు వ్యంజనావృత్తి యావశ్యకమే యగును. ఇట్లు వాచ్యార్థము సిద్ధించిన పిదప ప్రకరణమును బట్టియు వక్తను బట్టియు స్ఫురించెడు నర్థవిశేషము కన్పట్టు చుండగా నది ప్రధానమగుచుండఁగా లేదనుట యెట్లు? కావున నీయభావవాదము నిలువఁజాలదు.

మఱికొంద ఱిట్లందురు! ధ్వని యుండుటకు వీలు లేదు. ఏల యన నది ప్రసిద్ధ ప్రస్థానములలో చేరలేదు కదా! ప్రసిద్ధ ప్రస్థానముల వ్యతిరేకించినచో కావ్యమునకు కావ్యత్వసిద్ధి యెట్లు కలుగును? కావున ధ్వని లేదు. లేనిదానికై వ్యంజనా వృత్తి నొకదానిని కల్పింపఁబనిలేదు. ఒకవేళ నేదేని రమణీయార్థమని యున్నచో నది యభిధాశక్తిచేతనే సిద్ధించును. ఎట్లన - సమర్థుఁడగు ధానుష్కుడు ప్రయోగించిన బాణము దీర్ఘ దీర్ఘతర

వ్యాపారము గలదియై పగవానికవచమును, శరీరమును జీల్చి లోనున్న గుండెను భేదించునట్లు అభిధాశక్తియే వాచ్యార్థమును బోధించి తాత్పర్యావగమ మొనరించి విశేషార్థమును స్ఫురింపఁజేయు నని వారి తాత్పర్యము.

పరిశీలింప నీవాదము నిలువదు. అంతకు మున్ను ప్రసిద్ధములైన ప్రస్థానము లన్నింటికి నేదియో ప్రారంభస్థితి యుండినదే కదా! రీతి కావ్యాత్మ యను సిద్ధాంతమును ప్రతిపాదించిన వామనాచార్యునికి పూర్వ మది యెట్లు ప్రసిద్ధము కాలేదో యిదియు నట్టిదియే. కావున పూర్వ లాక్షణికులు చెప్పకుండుట యంగీకరింపకుండుట కొక హేతువుగాఁ బరిగణింపఁబనిలేదు. అంతియకాక లక్షణ కర్తల కిది స్ఫురిత ప్రసుప్తకల్పమై యుండుటచే లక్షణ కల్పనలో వారసమర్థు లగుట వారిదోషము కాని సత్కావ్యతత్త్వ మియ్యది రామాయణ మహాభారతాది గ్రంథములందు కాన వచ్చుచునే యున్నది. ఆనందవర్ధనులు "రవిసంక్రాన్తసౌభాగ్య - స్తుషారావృత మణ్డలః - నిఃశ్వాసాన్ధ ఇ వాదర్శ శ్చన్ద్రమా న ప్రకాశతే" అను రామాయణ శ్లోకమును, "యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ; యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః" అను భారత శ్లోకమును ధ్వన్యుదాహరణములుగాఁ బ్రదర్శించియే యున్నారు. ఇట్టి రమణీయమైన యర్థ విశేషమును అభిధావృత్తి చెప్పఁజాలదు. అభిధకు శరము వంటి దీర్ఘదీర్ఘతర వ్యాపారమున్న దనుటకు ప్రమాణము లేదు. ఒకవేళ వాదమున కున్నదని యంగీకరించినచో లక్షణావృత్తిని గూడ నంగీకరింపఁబనిలేదు. లక్ష్యార్థమును గూడ నభిధయే సాధించును. లక్షణావృత్తి ప్రాచీనకాలము నుండియు సుప్రసిద్ధముగా వ్యవహరింపఁ బడుటచేతనే యభిధకు శరము యొక్క దీర్ఘ దీర్ఘ తర వ్యాపారము వంటిది లేదనుట స్పష్టమైనది.

మరియు నభిధేయార్థము శ్రోతల కందఱ కొక్కవిధముగానే స్ఫురించుట అనుభవగోచరమైన విషయము. కాని వ్యంజనావృత్తిచే సిద్ధించు నర్థవిశేషము ప్రకరణ పాత్రాదివశమున భిన్న విధములుగా స్ఫురించుచున్నది. ఒక యుదాహరణమున దీనిని సమన్వయించి చూడనగును: కీచకసంహారమునకై నర్తనశాలలో ద్రౌపదివలె భ్రాంతి కల్పించు భీమసేనుఁడు కీచకునితో నన్న వాక్యముదాయము -

"నాయొడలు చేర్చినప్పుడ నీయొడ లెట్లగునొ - దాని నీ వెఱిఁగెదు; న
న్నే యబలలతోడిదిగాఁ జేయఁదలంచితివి? తప్పుచేసితి కంటే? 4.2.338

నను ముట్టి నీవు వెండియు వనితల సంగతికిఁ బోవువాఁడవె? యైనం
దను వేఁ బడసినఫలమే కనియెద విదె చిత్తభవవికారము లెల్లన్" 4.2.339

ఈ రెండు పద్యములలోని భీమోక్తులవలన సాక్షాద్భ్రాంత యగు కీచకుఁడు నా కీవనిత యొడలు ఏమగునో తెలియనంతటి పారవశ్యమును సంధానింతుననుచున్నది. దీనిని సామాన్యస్త్రీ వలె నెంచి - నిజమే - తప్పు చేసితిని. ఇది లోకోత్తర సౌందర్యవతి. దీనితో రమించిన వెనుక తదితర స్త్రీ జనసంగతి చవి లేనిదగును. దేహధారి యగు వాని కిట్టి సౌఖ్య మబ్బిననే జన్మము చరితార్థ మగును' అను నీమొదలగు నర్థమును సంభావించును. ఈ మాట లన్నియు గూఢముగా పొంచి వినుచున్న ద్రౌపది 'భీమసేనుని యొడ లితనియొడలికి తాఁకి నంతన తాను చచ్చునని తెలియకున్నాఁడు, అయశ్శరీరుఁడై యనేక రాక్షసుల సంహరించిన భయంకరమూర్తి నీతని నాతుచ్చుఁడు సుకుమారి యగు సుందరిగా భావించుచున్నాఁడు. వీని కంటె మూర్ఖుఁ డుండునా? వీఁ డింక స్త్రీల మానప్రాణహరణము గావింపకుండుటకై చంపుదు నను నర్థమును 'వెండియు వనితలసంగతికిఁ బోవువాఁడవె?' అనువాక్యభాగముచే భీముఁడు సూచించుచున్నాఁడు'. అను నర్థమును సంభావించును. పాఠకుఁ డీ వాక్యమునందు స్ఫురించు ద్రౌపదీభీమసేనులవంచనము, దురాత్ముఁడగు కీచకుఁడు పొందఁబోవు విపరీత ఫలము మున్నగువానిని గుర్తించి నవ్వుకొను చుండును. ఎవఁడేని పరకాంతావ్యామోహ దూషితుఁడిది విని యిట్టి సన్నివేశములలో నీదృశములగు వంచనము లుండవచ్చును. కాన నిట్టి నీచకృత్యములు విడువ వలయును సుమా! అను నుపదేశమును స్వీకరించును. ఇట్లొకే వాక్యసముదాయము భిన్న వ్యక్తులకు భిన్న విధములగు నర్థములను స్ఫురింపఁజేయుచున్నది. అభిధ కిట్లు భిన్నార్థస్ఫోరకతాశక్తి లేదు కదా. కావున నభిధావృత్తి కంటె వ్యంజనా వృత్తి భిన్నమే యగుచున్నది.

మఱియు వ్యంగ్యార్థము వాచ్యార్థముకంటె స్వరూపమునందే భిన్నమైనది. ఎట్లన నొక్కొకచో వాచ్యార్థము విధి రూపమున నుండఁగా వ్యంగ్యార్థము నిషేధ రూపమున నుండుట కానవచ్చును. విధి నిషేధము లొకదాని కొకటి విరుద్ధము లనుటలో విప్రతిపత్తి లేదు. పరస్పర విరుద్ధములైన యర్థము లొకపదమునకు సంకేత రూపమున నుండుట అసంభవము. కావున నభిధకంటె భిన్నమైన వృత్తి నంగీకరింపక తప్పదు.

అరణ్యాజ్ఞాత వాసముల నిర్వహించిన పిమ్మట సంధికై రాయబారమునకు కృష్ణునిఁ బంపు పాండవుల సమక్షమున కృష్ణునితో ద్రౌపది పలుకు పలుకులు పైపద్ధతికి చక్కని యుదాహరణములు.

"ఏ నిటు లంటి నా వలవ; దింకను నీవును రాజుఁ దమ్ములుం
గా నుచితంబు చూచి మన కార్యము మీసుజనత్వముం జెడం

గా నొకభంగి చేయక తగం గురువర్గముతోడిసంధి మీ

కైనతెఱంగునన్ వలచి నట్టుల చేయుఁడు నేర్పు లేర్పడన్" 5.3.105

ఇందు 'సంధి చేయుఁడు' అని విధివాక్యము ద్రౌపదీవివక్షిత మని వాక్యవైఖరిని బట్టియు, పూర్వోత్తర వాక్యములను బట్టియు సంభావింపఁజాలము. పరమ నికృష్ట స్వభావము గల కురువర్గముతో సంధి చేయుటకంటె నవివేకము లేదు. దానికై యింత యాలోచన యేల? పౌరుషముతో విజృంభించి దుష్టశిక్షణ మొనర్చుటయే ప్రస్తుతము కర్తవ్యము. కావున సంధికై యత్నింపకుఁ డనునర్థమే యిట సంభావ్యము. ఈ యర్థమున క్రియ నిషేధ రూపమున సిద్ధించును. కావున వాచ్యార్థము కంటె వ్యంగ్యార్థము భిన్నమగుట నిట్టియుదాహరణముల మూలమున నరయవచ్చును.

ఇట్లే వాచ్యార్థము నిషేధ రూపమున నున్నచో వ్యంగ్యార్థము విధి రూపమున గానవచ్చును. పై పద్యమునందలి 'యే నిటు లంటినా వలవదు' అను వాక్యమే దీని కుదాహరణము. కేవల మొక స్త్రీ మాట కేటి పట్టింపని త్రోసివేయకుఁడు; నా మాటను శ్రద్ధగా నాలోచింపుఁడనుట యిట ద్రౌపది భావము. మరియు వాచ్యార్థము విధి రూపమున నుండ వ్యంగ్యార్థ మనుభయరూపమున నుండుటయు నట్లే వాచ్యార్థము నిషేధ రూపమున నుండ వ్యంగ్యార్థ మనుభయరూపమున నుండుటయు దృష్టమగుచున్నది.

కపటద్యూతముచే ధర్మరాజును వంచించి యాతనివిభవము వశీకరించుకొనుట కంగీకరింపు మని ప్రార్థించుచు తండ్రితో దుర్యోధనుఁ డాడిన మాటలు:

**"దీని కొడఁబడు; మొడఁబడవేని - నేఁడ-యీ క్షణమ- సర్వభక్షుచే భక్షితుండ**

**నగుదుఁ; దెల్ల; మే నట్లైన వగపు దక్కి విదురుఁడును నీవు నుండుఁడు ముదముతోడ"**

**2.2.127**

ఇందలి 'ముదముతోడ నుండుఁడు' అను విధివాక్యమును బట్టి దుర్యోధను నొప్పరికించి సుఖముగా నుండుటయా ? లేక యాతఁడు చెప్పుదాని కంగీకరించి పాండవుల కహిత మాచరించుటయా? యను వికల్పములలో దేనియందును ధృతరాష్ట్రునికి నిశ్చయజ్ఞానము కలుగని పరిస్థితి కలదు. కావున వ్యంగ్యార్థ మిట ననుభయరూపమున నొప్పుట గోచర మగును. ఇట్టి భంగు లింకను ననేకములు గలవు.

ఒక్కొక్క చోట వాచ్యార్థముకంటె వ్యంగ్యార్థము మిక్కిలి భిన్నముగా రమణీయముగా నుండును. ఆ వ్యంగ్యార్థము సన్నివేశమున కెంతయు దీప్తిని కలిగించును. ఈ క్రింది పద్యమున నట్టిది గోచరించును :

"కయ్యము కల్గి నట్లయిన గంధగజప్రకరంబుకుంభముల్
వ్రయ్యఁ దురంగపంక్తులు ధరం బడఁ దేరిగముల్ బడల్పడన్
డయ్యమి కీవు వెక్కసపడన్ గదపండువు సేయఁగోరు నా
దయ్యమునెత్తికోలు తుది దాఁకుట గాదె - భుజంగభంజనా!" 5.3.67

ఈ పద్యమున భీముఁడు యుద్ధము కల్గినచో తానెట్లు విజృంభించునో కృష్ణునకు వివరించుట ప్రకృతార్థము. ఇందు భావించిన కొలఁది రమణీయ మగు నర్థ విశేష మెంతయో తోఁచి పాఠకుని కానందము కలుగఁజేయుట గమనింపవచ్చును. కృష్ణుఁడు సోదర గౌరవముచే సంధి నభిలషించుచున్న తన్నుఁ బరిహసించుటను గాంచి మృదుకోపము నొందిన భీముని యీ మాటలలో నెంతయో వ్యంగ్యార్థ మిమిడియున్నది. 'భుజంగభంజనా!' అను సంబోధనములో ఏదో ఒక పామును పీడించి మొనగాఁడ నైతి ననుకొనువాఁడా! అను వేళాకోళము ధ్వనించును. గంధగజ ప్రకరంబుకుంభములు వ్రయ్యునట్లుగా గదపండువు సేయుదు ననుటలో ఒక గజము కాదు, గజసముదాయము, అదియు సామాన్యమైనది కాదు, గంధగజ ప్రకరము, అట్టిదాని కుంభముల వ్రయ్యఁ జేసెదను. అనఁగా నేను సింహము వలె విక్రమింతును సుమా! అను నర్థము స్ఫురించును. అట్లే తురంగపంక్తులు, తేరిగములు అనుపదములందు పంక్తి, గమి అను సముదాయార్థక పదములే తురగాదుల సంఖ్యాబాహుళ్యమును జెప్పుచుండఁగా మఱల బహువచన ప్రత్యయమును జేర్చుటచే అనంతము లైన గుఱ్ఱములయు, రథములయు, మందలను అసహాయ శూరుడనై నుగ్గునూచ గావింతు ననునర్థము ప్రతీయమాన మగును. తురంగ శబ్దమునకుఁ గల వ్యుత్పత్తిని బట్టి యవి యెంత వేగముగా పరువెత్తుచున్నను వాని కంటె లాఘవము మెఱసి యంత మొందింతు ననుట వ్యక్తము. ఎదుట నున్న కృష్ణుని 'నీవు' అని నిర్దేశించుటచే, భ్రాతృగౌరవముచే 'సంధికూర్పు' మని యడుగుచున్న నన్ను ఏ నీవు నేఁడు వెక్కిరించుచున్నావో - యానీవే వెక్కసపడునట్లుగా గదపండువు సేయుదు నను నర్థము తోఁచును. 'గదపండువు' అను పదమువలన నింత భయంకరమైన యుద్ధము కూడ నాకు పండుగుతో సమానమే. కావున క్రీడా ప్రాయముగఁ బోరుచు నాపై, నావారిపై నీగను గూడ వాలనీను సుమా! అను భావము వ్యక్త మగును. ఇట్లీ పద్యమున వాయుసుతుని యనంతబలసంపదయు, నమితోత్సాహగరిమయు, కౌరవుల యెడఁ గల క్రోధోద్వేగము - మున్నగు లక్షణములు స్ఫురించుచున్నవి. ద్వియకారప్రాసము కూడ వేగముగా నవయవముల నూపుట వంటి యాంగికాభినయమును దోఁపఁజేయును. గంధ, కుంభ, వ్రయ్య మున్నగు మహాప్రాణాక్షరసంయుక్తాక్షర సమావేశము కూడ

తత్కాలజనితోత్సాహాతిశయమును స్ఫుటీకరించును. భవిష్యద్యుద్ధవర్ణనమును బట్టి యీ సంభావితమైన యర్థవిశేష మంతయు కవికి వివక్షితమే యనఁదగును. ఇట్లు ప్రతీయమానమైన యర్థవిశేష మంతయు నభిధాలక్షణావృత్తులవలన సిద్ధింపజాల దనుట సువిదితమే. కావున వ్యంజనావృత్తియు - వ్యంగ్యార్థమును - తప్పక యంగీకరింపవలసినవే యగుచున్నవి.

మఱికొంద ఱిట్లందురు : ప్రసిద్ధప్రస్థానములగు గుణాలంకార వృత్తి రీత్యాదుల కన్న భిన్నమైన ధ్వని యను నదేదో యుండనిండు. అట్లున్నచో నది కావ్యశోభాహేతువగుట తప్పదు. కావున శోభాహేతువు లగు పైవానిలోనే యది యంతర్భవించును. అంతే కాని యట్టి ప్రకారలేశ మొకటి కలదని చెప్పి యది కావ్యాత్మయగు నని కిరీటము పెట్ట నక్కఱలేదు.

కాని యీయభిప్రాయము కూడ సరిగాదు. ఏల యన - ధ్వని యనునది గుణాలంకారాదులలో నంతర్భవించెడు స్వల్ప విషయము కాదు. గుణాలంకారాదులన్నియు ధ్వని కంగములు మాత్రమే. ధ్వని యంగి. అంగి కంగములో నంతర్భావము పొసగదు. ధ్వని యనఁగా ప్రధానముగా రసమే. కావ్యమునం దదియే యాత్మస్థానీయము. రస మెప్పుడును సహృదయ హృదయమున స్ఫురించునే కాని 'యిదిగో! యిట నీ రసము కల' దను రీతినిఁ జెప్పఁబడదు. ఒకవేళ చెప్పఁబడినను దానివలనఁ గలుగు నానందవిశేష మేమియు లేదు. కావున రసము ధ్వనించునే కాని వాచ్యము కాదని తాత్పర్యము. అట్లు ధ్వనించిన దానినే ధ్వని యందురు. కావున రసమే ధ్వని. అదియే కావ్యాత్మ. గుణాలంకార వృత్తిరీత్యాదు లన్నియు దీనికి పోషకములో, శోభాహేతువులో యగును. దీనిని బట్టి యంగి యగు ధ్వని యంగములగు గుణాలంకారాదులలో నంతర్భావ మగుట యను నభిప్రాయము పరాస్తమగును. మఱియు గుణాలంకారాదులన్నియు వాచ్యవాచక భావాశ్రితములు. ధ్వని వాచ్యార్థ స్ఫురణము ముగిసిన వెనుక వ్యంగ్యవ్యంజకభావాశ్రితమై పొడ సూపును. ఇట్టిదానికి గుణాలంకారాదులం దంతర్భావ మెట్లు పొసఁగును? ధ్వని కావ్యశోభాహేతు వను మాటయు పొసఁగదు. ఏల యన ధ్వనియే కావ్యము. అదియే యలంకార్యము. అదియే గుణి. అట్టిది శోభాహేతు వెట్లగును?

"యత్రార్థః శబ్దో వా, త మర్థ ముపసర్జనీకృతస్వార్థౌ,
వ్యఙ్క్తః - కావ్యవిశేషః స ధ్వని రితి సూరిభిః కథితః" (ధ్వన్యా.1.13)

అను నానందవర్ధనుని శ్లోకము కావ్యవిశేషమే ధ్వని యనుటను ప్రతిపాదించుచున్నది.

ఇంతకు పూర్వమే గుణాలంకారాదులకు కావ్యమునఁ గల స్థానమెట్టిదో నిరూపింపఁబడినది. ఆ విచారణచే వానియంగత్వము కూడ నిరూపితమే అయినది. కావున మహా విషయమగు ధ్వని అంగభూతములగు గుణాలంకారాదులలో నంతర్భవింప దని సిద్ధాంతము.

కాని మఱికొందఱు, కొన్ని యలంకారములలో లేకుండుఁగాక; కొన్నింటి యందు స్ఫుటమును - రమణీయమునగు నర్థాంతరావగతి కన్పట్టుచున్నది. అట్లున్న వానియం దీధ్వని నేల యంతర్భవింపఁజేయరాదు? అందురు. నిజమే; సమాసోక్తి, ఆక్షేపము, అనుక్తనిమిత్తవిశేషోక్తి, పర్యాయోక్తము, అపహ్నుతి, దీపకము, సంకరము, అప్రస్తుత ప్రశంస మున్నగు నలంకారములయందు వాచ్యార్థముకంటె భిన్నముగా నర్థాంతర స్ఫురణము గలదు. కాని పరిశీలింపగా ప్రాధాన్యాప్రాధాన్యములనుబట్టి యట్టి యలంకారములే ధ్వనియం దంతర్భవించుటయో, అసలు ధ్వనియే కాకుండుటయో యగుచున్నది. దీని తత్త్వము నరయుదము.

**సమాసోక్తి** : ప్రస్తుతవృత్తాంతమునం దప్రస్తుతవృత్తాంతము గమ్యమానమగుట సమాసోక్తి లక్షణము. ఇందు విశేష్యము తప్ప తక్కిన పదము లన్నియు ప్రకృతాప్రకృతములకు రెంటికిని సంబంధించియుండును. "అయ మైంద్రీముఖం పశ్య రక్త శ్చుంబతి చన్ద్రమాః" అను నుదాహరణమున ఎఱ్ఱగా నున్న యీ చంద్రునిఁ జూడుము. ప్రాగ్దిక్కు ముందుభాగమును తాఁకుచున్నాఁడు. అను ప్రకృతార్థముతోపాటు చంద్రుఁడను నాయకుఁడు రాగపూరితుఁడై యైంద్రి యనెడు నాయికముఖమును ముద్దిడుకొనుచున్నాఁ డను నప్రకృతార్థము కూడ గోచరించుచున్నది. కావున నిట సమాసోక్త్యలంకారము గలదు. స్ఫురించిన యర్థాంతర రూపమైన ధ్వని యనునది యీ యలంకారములో నంతర్భవింపదా? అని యిట శంకవొడమును. ఇందు ప్రకృతార్థము చంద్రోదయవర్ణనము. అప్రకృతమైన నాయికానాయిక వ్యాపారము ప్రకృతమగు చంద్రోదయము నలంకరించుచున్నది. అనఁగా ప్రాధాన్యము చంద్రోదయవర్ణనమునకే కాని నాయికానాయక వ్యాపారమునకుఁ గాదు. ధ్వనివ్యపదేశము కావలయునన్నచో శబ్దము తన యర్థమును, అర్థము తన్ను నప్రధానము చేసికొని యర్థాంతర ప్రతీతికి తోడ్పడవలయును. ప్రకృతమున నట్టి స్థితి లేదు. కావున ఇందు ధ్వని గలదనరాదు.

**ఆక్షేపము** : విశేషమును బోధించు తలఁపుతో నుక్తమగు నిష్టమును నిషేధించుట ఆక్షేపాలంకారలక్షణము. 'చంద్ర! కన్పట్టుము, పోనిమ్ము; ప్రియా ముఖమున్నది లెమ్ము' అను వాక్యమున నిష్టమగు చంద్ర దర్శనవాంఛ 'పోనిమ్ము'

అను వాక్యముచే నిషేధింపఁ బడినది. దానిచే నీదర్శనముచేఁ గలుగు నానందవిశేషము నాప్రియాముఖమువలనఁ గలుగును. నా ప్రియా ముఖము నీవంటిదే యను నర్థము స్ఫురించును. ఈ స్ఫురితమైన యర్థమంతయు వాచ్యమగు నిషేధమును సమర్థించుటకే పనికి వచ్చుచున్నది. అనఁగా వ్యంగ్యము వాచ్యమాత్రానుయాయి యయి ప్రాధాన్యమును కోల్పోవుచున్నదన్నమాట. అప్పుడు ఉపసర్జనీకృత స్వార్థములగు శబ్దార్థములు లేవు కాన నీ విధమగు నర్థవిశేషము ధ్వని కాదు.

పైని జూపినట్లు వ్యంగ్యార్థమునకు ప్రాధాన్యము లేకపోయినను కొంతవరకు వ్యంగ్యార్థము చమత్కారమును గలిగించుచునేయున్నది కదా! దానిని బట్టి దీనియందు ధ్వని గలదని యేల యనరాదని మరియొక శంక ఇట నుదయించును. కాని ఇది సరికాదు. ఎట్లన దీపకము, రూపకము, అపహ్నుతి, స్మృతి, భ్రాంతి, సందేహము మున్నగు నలంకారములందు ఉపమ వ్యంగ్యమగుచున్నది. కాని దానివలనఁ గలుగు చమత్కారముకంటె దీపకాదులవలనఁ గలుగునదియే యధికతరము. కావున దీపకాది వ్యవహారమే కాని యుపమా వ్యవహారము లేదు కదా! అట్లే పైఁజెప్పిన యలంకారములందు కొన్నిటియందును వ్యంగ్యార్థ సమలంకృమైన వాచ్యార్థమే యధిక చమత్కారక మగుట వలన నందలంకార వ్యపదేశమే కాని ధ్వని వ్యపదేశము లేదని చెప్పఁ బడినది.

విశేషోక్తి : "ఏకదేశస్య విగమే యా గుణాంతర సంస్తుతిః. విశేష ప్రథనాయాసౌ విశేషోక్తి రితి స్మృతః" అనునది విశేషోక్తి లక్షణము. ఒక వస్తువునందలి విశేషమును వెలువరించుటకై అవస్తువునందు కారణరూపమగు ఒకయంశము లోపించినను, కార్యరూపమగు వేరొక ధర్మమున్నట్లు వర్ణించుట విశేషోక్తి. ఆ తెలుపఁ గోరిన వస్తుగతమగు విశేషము నలంకరించునది యగు నిమిత్తము, అక్షేయమో, ఉక్తమో, అనుక్తమో యగును. (ప్రభామతి) ఇట నక్షేయాది రూపమున నుండు నిమిత్తమే వ్యంగ్యాంశము. అది యక్షేయ మైనచో ధ్వని యుండదు. ఉక్తమైనచో వాచ్యమగును, కావున ధ్వని కాదు. ఇఁక నిమిత్తమనుక్తమై యుండుటకు వీలున్న యెడల నట వ్యంగ్యమునకు స్థితి యుండును. అట్టి దాని నుదాహరణ ముఖమున నరయుదము.

"ఆ పార్థుఁడు భరతాన్వయ దీపకుఁ - డమరేంద్రసుతుఁడు - తేజోనిధి - వి
ద్యాపారగుండు - వినుత వ్యాపారుం - డాపదలకు నగ్గంబయ్యెన్." 4.2.205

అనునీపద్యమున ఆపదల కగ్గముకాకుండుటకు వలసిన కారణ రూప విశేషజాతము - భరతాన్వయదీపకుఁడగుట - అమరేంద్రసుతుఁడగుట - మున్నగునది సమృద్ధిగాఁ గలదు. దీనిని బట్టి ఎంతటివాఁడైనను దైవము నతిక్రమింప జాలడు, 'విధిబలీయము' అను

నిమిత్త మిట వ్యంగ్యముగా సంభావితమగును. కాని యం దాస్వాదనీయమగు చారుత్వ మేమియు లేదు. వాచ్యార్థమే రమణీయముగా నున్న యిట్టి పట్టుల నేదో యర్థవిశేషము వ్యంగ్యమైనంత మాత్రమున నది ధ్వని యనుటకు వీలులేదు.

పర్యాయోక్తము : "పర్యాయోక్తం - య దన్యేన ప్రకారే ణాభిధీయతే వాచ్యవాచక వృత్తిభ్యాం శూన్యే నావగమాత్మనా" - వాచ్యవాచకవృత్తులకంటె భిన్న మగు నవగమనాత్మక - ప్రతీయమానాత్మక - ప్రకారాంతరముచేత చెప్పఁబడునర్థ విశేషము గలది పర్యాయోక్తము. గమ్యమగు నర్థమును భంగ్యంతరముగాఁ జెప్పుట పర్యాయోక్తమని తాత్పర్యము.

"అల్పులకు మ్రింగఁ జేదైన హాలహలము భంగిఁ బొంగెడుకోపంబు మ్రింగికొనఁగ నీలగళు నెన్ని ని న్నెన్నఁబోలు నట్టి నీవు చాలినఁ గా కేల నెగడుఁ బేరు?"
5.1.333

అని సంజయుఁడు ధర్మజునితో నన్న యీ వాక్యమున 'నీకు గొప్ప సహనము గలదు. సాక్షాన్నీలకంఠ సదృశుఁడవు. యశోధనుఁడవు. నీయశోధనము చెడకుండ సురక్షితముగా నుండవలయు నన్న నిపుడు కోపము వహింపరాదు. కావున నీ కపకృతి గావించిన దుర్యోధనాదులయందు కోపమును త్యజించి శాంతి వహింపుము' అను నర్థవిశేషము వివక్షితము. ఈయర్థ మంతయు ప్రతీయమానమే యగుచున్నది. వాచ్యము కాదు. మఱియు నీయర్థమునకు ప్రాధాన్యమును గలదు. అయినచో నిదియే ధ్వని యనరాదా? ధ్వని యనునది యిం దంతర్భవింపదా? యని శంక పొడమును. నిజమే; యిట ధ్వని కలదు. కాని ధ్వని యని నిరూపింపఁ బడఁబోవు ప్రకారాంతరము పర్వతాయమానముగా ముందున్నది. అది యంతయు వచ్చి స్వల్పమైన యట్టిదానియం దంతర్భవించుట నరిపడదు. కావున నిట్టి పట్టులు ధ్వనిలో నంతర్భవించు ననియే చెప్పవలసి యున్నది. అనఁగా నీయలంకారమునకు ధ్వన్యంతర్భావమే భావ్యము కాని ధ్వని కలంకారాంతర్భావము కాదని భావము. అనఁగా - నిట్టితావులు అలంకారవ్యపదేశమునకుఁ గాక ధ్వనివ్యపదేశమునకు యోగ్యము లగునని తాత్పర్యము.

దీపకము, అపహ్నుతి, స్మృతి, భ్రాంతి, సందేహము మున్నగువానియందు ఉపమ వ్యంగ్య మగుటయు నది ప్రధానమగు వాచ్యము ననుసరించి యుండుటయు సుప్రసిద్ధమే. ముఖపద్మము - ముఖము కాదిది పద్మము - పద్మమును జూచి ప్రియా ముఖమును స్మరించుచున్నాను - వాఁడు పద్మమును గాంచి ప్రియాముఖ మనుకొనుచున్నాఁడు - అది ముఖమో పద్మమో నిర్ణయము కాకున్నది - ఆకమలాక్షి

నేత్రములును, కమలములును చక్కగా విరాజిల్లుచున్నవి అను నిత్యాదిరూపమున నుండు రూపకాదులయందు ముఖము పద్మసదృశమను నుపమార్థము తోఁచుచున్నది. కాని యీ తోచినయర్థముకంటె పై రూపకాద్యర్థములే చారుతరములై యుండుట చేతనే వాని కలంకారవర్గమున స్థాన మవిచలితమై యున్నది. కావున వీనియందు ధ్వనివ్యవహారమునకు తావులేదు. ఎచట నైన కవివివక్ష ననునరించి యలంకారమున నలంకారాంతరము ధ్వనించినచో నది యాస్వాదనీయమైనచో నట అలంకార ధ్వని యను విభాగ ముదయించునని ముందు నిరూపింపఁబడును.

సంకరము : క్షీరనీరన్యాయమున వేర్పఱచుటకు వీలులేని యలంకారద్వయ సమావేశ మెందుండునో యట సంకరాలంకార ముండును. ఇందు తప్పక రెండలంకారము లుండును. కావున నొకదానిని భావించునపుడు రెండవది వ్యంగ్య మగునని భావము. కాని సంకరమున నున్న రెండలంకారములలో ప్రాధాన్యనిర్ణయమున కవకాశము లేనిచోట ధ్వనికి తావులేదు. వ్యంగ్యార్థ ప్రాధాన్యమున్నపుడే ధ్వని వ్యవహార ముండునని ముందు నిర్ణయింపఁబడనున్నది. సంకరము నాలుగు విధములు : (1) సందేహసంకరము (2) శబ్దార్థాలంకారముల సన్నివేశము (3) అనేకార్థాలంకారములకలయిక (4) అనుగ్రాహ్యానుగ్రాహక భావసంకరము - అను నీనాల్గింటిలో మొదటి మూఁడింటియందును ప్రాధాన్యవివక్షకు వినిగమకము లేదు. ఎట్లన సందేహసంకరమున నదియా - యిదియా - యని నిర్ణయమే లేనిచో నన్యతర ప్రాధాన్యము నెట్లు సంభావింతుము? రెండవ దానిలో నర్థాలంకార మొక్కటియే వాచ్యరూపమున నుండును గావున వ్యంగ్యప్రసక్తి లేదు. మూఁడవదానిలో రెండును సమప్రాధాన్యమును భజించును. కావున నందును ధ్వనిని భావింపఁజాలము. ఇఁక నాల్గవదానియందు - అనఁగా నొకయలంకారము మఱియొక యలంకారమునకు స్వరూప లాభము సమకూర్చుట యను లక్షణము గల అనుగ్రాహ్యానుగ్రాహకభావరూప సంకరమునందు - వ్యంగ్యము వాచ్యముపై నాధారపడి యుండి యస్వతంత్ర మగును గావున నందును ధ్వని యుండనేరదు. ఒక యుదాహరణము -

"నిమిషాంతరమున ని ట్ల శ్రమమున మర్త్యులకు నేయ సమకూరునె? యు
త్తము డీతఁడు; బ్రాహ్మణరూ పమున సురేశ్వరుఁడొ, హరుఁడొ, భానుఁడొ, గుహుఁడో"

1.7.185

అనుపద్యమున నిమిషాంతరములో నశ్రమముగా నిట్లు మత్స్యయంత్రము నేయుట యనుకారణమున 'నితఁడు మర్త్యుఁడు కానోపఁడు' అను నర్థమున కారణకథనముచే కావ్యలింగాలంకారము తోఁచినను అది తుదిపాదముననున్న

సందేహాలంకారమునకు దోహదము చేయుచున్నది. అనగా వ్యంగ్యార్థ మిట వాచ్యార్థపోషక మగుచున్నది. కావున అప్రధానమై ధ్వనివ్యపదేశమున కనర్హమై యున్నది.

కాని యెందైన వ్యంగ్యార్థము వాచ్యము నుపసర్జన మొనర్చి నిలువఁబడు నేని యట్టిసంకరమున ధ్వని యుండవచ్చును. అయినను అప్పుడు అలంకారమున ధ్వని యంతర్భవించుట కాక పర్యాయోక్తమునఁ జెప్పిన న్యాయము ననుసరించి యలంకారమే ధ్వనిలో నంతర్భవించును. ఈ క్రింది పద్యమున నట్టిదానిని కాననగును.

"శ్రవణసుఖంబుగా సామగానంబులఁ జదివెడుశుకముల చదువుఁ దగిలి
కదలక వినుచున్న కరులయుఁ - గరికర శీతల చ్ఛాయఁ దచ్ఛీకరాంబు
కణముల చల్లని గా డ్పొసపడి దానిఁ జెంది సుఖంబున్న సింగములయు
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి పెట్టు నీవారాన్నపిండతతులు
గడఁగి భక్షింప నొక్కటఁ గలసి యాడు చున్న యెలుకలుఁ బిల్లులు నొండు సహజ
వైరివర్గంబులయు - సహవాసమపుడు సూచి మునిశక్తి కెంతయుఁ జోద్య మంది"
1.4.23

ఇం దాశ్రమవాసి తిర్యక్కులదివ్యజీవనము స్వభావరమణీయముగా వర్ణింపఁ బడుటచే వాచ్యముగా స్వభావోక్తి కలదు. దీనిచే, 'జ్ఞాన విహీనమగు తిర్యగ్జాతియే యింత సౌహార్దముతో మెలఁగు నన్నచో శమదమసంపన్నులైన మహర్షుల జీవనవిధానము దివ్యాతిదివ్య మనుట చెప్పనేల?' అని కైముత్యన్యాయమున నర్థసిద్ధి కలిగి, అర్థాపత్త్యలంకార మిట ప్రతీయమాన మగును. ఆయాశ్రమమున నివసించు తాపసులు కామక్రోధరహితులై పరస్పరం సౌహార్దము మఱియు జీవింతురు. అట్టివారికి మార్గ దర్శకుఁడై యుండు కణ్వ మహామునిని దర్శించుట యవశ్యకర్తవ్యమను భావమును బుట్టించి దుష్యంతుని యభిలాషమును పెంచుట కీయర్థాపత్తి యెంతయు సహకరించును. కణ్వదర్శనాభిలాష దుష్యంతునికిఁ గలుగుటలో నీ యర్థాపత్తికే బలమక్కువ కావున దీని ప్రాధాన్యము సంభావించుట సముచితమే యగును. ఇట్టి సంకరాలంకారమున వ్యంగ్య ప్రాధాన్య ముండును గావున నిట్టిది మహావిషయమగు ధ్వనిలో నంతర్భవించును.

అప్రస్తుత ప్రశంస : అప్రస్తుత వృత్తాంతకథనముచే ప్రస్తుతవృత్తాంతము తోఁచుట దీని లక్షణము. ఇట్టిదానిలో ప్రస్తుతాప్రస్తుతములు ఈ క్రింది విధములుగా నుండవచ్చును. (1) అప్రస్తుతము సామాన్యమును - ప్రస్తుతము విశేషము నగుట, లేదా అప్రస్తుతము విశేషము, ప్రస్తుతము సామాన్యము నగుట (2) అప్రస్తుతము

నిమిత్తమును ప్రస్తుతము నైమిత్తకము నగుట - ఈ రెండు విధములలో సామాన్య విశేషములకును, నిమిత్తనైమిత్తికములకును పరస్పరాశ్రయభావము గలదు కావున వాచ్యమును వ్యంగ్య ముపసర్జన మొనర్పఁజాలదు. అనఁగా వాచ్యార్థమును వదలి వ్యంగ్యార్థము నిలువఁజాలదు. అట్టియెడ ధ్వనివ్యవహారము కుదురదు. దీని కొక్కయుదాహరణము నరయుదము. అభినవగుప్తులు లోచనమున సామాన్యమగు నప్రస్తుతముచే విశేషమగు ప్రస్తుతము తోఁచుట క్రిందియుదాహరణమును జూపిరి :

"అహో సంసారనైర్ఘృణ్య ! మహో దౌరాత్మ్య మాపదామ్!
అహో నిసర్గజిహ్మస్య దురంతా గతయో విధేః" (పు. 50)

ఇందు దైవస్వాతంత్ర్యరూపమైన సామాన్యమగు నప్రస్తుతము వర్ణితమై ప్రకృతమగు నేదో వినష్టవస్తు రూప విశేషమును స్ఫురింపఁజేయును. అయినను నిందు విశేషాంశము సామాన్యముతో వ్యాప్తమై యున్నందువలన విశేషమునకు వలె వాచ్యమగు సామాన్యమునకును ప్రాధాన్యము గలదు. వ్యంగ్యార్థమునకు వాచ్యముతో సమప్రాధాన్య మున్నచోట ధ్వని వ్యవహారము లేదు. నిమిత్తనైమిత్తిక భావము గల యప్రస్తుత ప్రశంసయందు నిట్టిదే స్థితి. ఇంక మూఁడవది సారూప్యపురస్కృతమైన యప్రస్తుత ప్రశంస. అప్రస్తుతమగు వృత్తాంతముచేత సరూపమైన ప్రస్తుత వృత్తాంతము గమ్యమాన మగుట. ఇందు అన్యోన్యాశ్రయస్థితి లేదు కావున స్వార్థ మముఖ్యమై వ్యంగ్యార్థమును నెలకొల్పవచ్చును. అట్టిపట్టులు ధ్వనికోటిలోనికిఁ జేరును. అందును వాచ్యమే వ్యంగ్యము కంటె చమత్కారకారి యయినచో నది యలంకారమే యగును. ఆంధ్రధ్వన్యాలోకకర్త శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు గారు ధ్వనియగు నప్రస్తుత ప్రశంస క్రింది యుదాహరణమును జూపి యున్నారు.

"రంతు ల్మానుము కుక్కుటాధమ! దరిద్రక్షుద్రశూద్రాంగణ
ప్రాంతోలూఖలమూలతండులకణగ్రాసంబుచేఁ గ్రొవ్వి, దు
ర్దాంతాభీలవిశేషభీషణఫణాంతర్మాంసనసంతోషిత
స్వాంతుండైన ఖగేంద్రుకట్టెదుట నీజంజాటముల్ సాగునే!"

అల్లసాని పెద్దన చాటుధార.

దీనికి వారు వ్రాసిన వివరణము : "ఇం దప్రకృతములగు కుక్కుట ఖగేంద్రముల వృత్తాంతము సహజముగా సంభవించునది కాదు. ఈర్ష్యాభావమున కంగమును వ్యంగ్యమును నగు దాంభిక సహజశూర వృత్తాంతము దీనికన్న రమ్యమైనది కావున ప్రధానము. ఇది ధ్వని కాఁదగును." (ఆం.ధ్వ.పు. 76)

ఇట్లే వ్యాజస్తుతి మున్నగు నలంకారములందును వ్యంగ్యార్థము వాచ్యము నలంకరించి దాని కలంకారతనే కూర్చును. అలంకారములలో ధ్వని యంతర్భవించు ననుదానికి సంబంధించిన శంకా సమాధానముల సారాంశము నీక్రింది శ్లోకములు వక్కాణించుచున్నవి.

"వ్యంగ్యస్య యత్రాప్రాధాన్యం వాచ్యమాత్రానుయాయినః-
సమాసోక్త్యాదయ - స్తత్ర వాచ్యాలంకృతయః స్ఫుటాః.
వ్యంగ్యస్య ప్రతిభామాత్రే వాచ్యార్థానుగమేఽ పి వా
న ధ్వని - ర్యత్ర వా తస్య ప్రాధాన్యం న ప్రతీయతే.
తత్పరా వేవ శబ్దార్థౌ యత్ర వ్యంగ్యం ప్రతిష్ఠితౌ -
ధ్వనేః స ఏవ విషయో మన్తవ్యః సఙ్కరోజ్ఝితః (ధ్వ.ప్ర.శ్లో.14,15,16)

వాచ్య మాత్రము ననుసరించుచు వ్యంగ్య మముఖ్యమై యుండెడు సమాసోక్తి మున్నగువానిలో నలంకారతయే కాని 'ధ్వని' యను వ్యపదేశము లేదు.

వాచ్య వ్యంగ్యముల క్రమము నున్పష్టముగాఁ దెలియక రెంటికిని సమ ప్రాధాన్యమే యుండుటయో, వ్యంగ్యమునకు ప్రాధాన్యస్ఫురణము స్ఫుటముగా లేకుండుటయో కల యలంకారములందును ధ్వని వ్యవహారము లేదు.

శబ్దార్థము లెచట సరసమైన వ్యంగ్యార్థమును బ్రకటించుటలో తత్పరము లగునో యట్టితావు లలంకారవిషయములు కాక ధ్వని విషయము లగును.

ఇట్లు శోభాహేతువైనచో ధ్వని యలంకారాదులలోనే యంతర్భవించు నన్న వాదము పరాస్త మగుచున్నది.

మఱియు గుణాలంకారవృత్తిరీత్యాదు లన్నియు కావ్యమున కంగభూతములు. ధ్వని అంగి. అంగి కంగములలో నంతర్భూతత్వము లోకవిరుద్ధమైన విషయము. ధ్వని అంగిత్వము ముందు ముందు సునిరూపితము చేయఁబడును.

## 6. భాక్తాగోచరాద్యభావవాదములు :-

కొంద ఱీధ్వని యనునది భక్తికి సంబంధించిన దందురు. 'భక్తి' యనఁగా గుణవృత్తి. "భజ్యతే - సేవ్యతే - ప్రాజ్ఞేన - ప్రసిద్ధతయా భక్తి ర్ధర్మోఽ భిధేయేన సారూప్యాదిః" అని అభినవగుప్తుల నిర్వచనము. "ముఖ్య స్యార్థస్య భంగో - భక్తిః" అనియు మఱియొక వ్యుత్పత్తి. భక్తివలన నైనది భాక్తము. అనఁగా గౌణార్థము, లాక్షణికార్థము అని తాత్పర్యము. వ్యంగ్యార్థ మనునది గుణవృత్తివలన సిద్ధించు నర్థము కంటె భిన్నము గా దని యీవాదసారాంశము.

కాని యిది సరి కాదు. రూపభేద ముండుటవలన భక్తికిని ధ్వనికిని నైక్యము చెప్పఁజాలము. (1) లక్షణావృత్తి లేక గౌణవృత్తి యనుదాని యందు ముఖ్యార్థబాధ - సంగతార్థ కల్పన - రూఢియో, ప్రయోజనమో యుండుట - అనువిధానము గలదు; వ్యంజనలో ముఖ్యార్థ బాధాదికము ఉండనక్కఱలేదు. (2) లక్షణ శబ్దమాత్రాశ్రితము - వ్యంజన ప్రకరణాదులను బట్టి శబ్దశబ్దైక దేశాదుల నాశ్రయించి యుండును. (3) భక్తి లేక గుణవృత్తి యనునది ఉపచార మాత్రము (ఉపచార మనఁగా నతిశయితమగు శబ్దముల వాడుక. శుచిత్వాది గుణవిశిష్టుఁడని చెప్పుటకు అగ్నిసదృశుఁ డను లక్ష్యార్థముగల అగ్ని శబ్దముతో వటువునకు సామానాధికరణ్యము చెప్పుట వంటిది) - వాచ్యవాచకములు తాత్పర్యమున మఱియొక యర్థమును బ్రకాశింపఁజేయు నెడ వ్యంగ్యము ప్రధాన మగుచో నది ధ్వని. ఇట్లు భక్తికిని ధ్వనికిని విస్పష్టమైన రూపభేదము గోచరించుచున్నది. కావున నీ రెంటికిని తాద్రూప్యమును శంకింపఁబనిలేదు.

అట్లు కాక భక్తి యనునది ధ్వనికి లక్షణముగాఁ జెప్పవచ్చు నన్నచో అతివ్యాప్త్య వ్యాప్తి దోషములు రెండును సంభవించును. లక్షణ యున్నచోటులం దెల్ల ధ్వని యుండవలసి వచ్చుట యనురూపమున నతివ్యాప్తియు, లక్షణ లేనిచోటులందు ధ్వని యుండరా దనురూపమున నవ్యాప్తియు సంభవించును. ధ్వని లేనితావు లందును కవులు ప్రసిద్ధి ననుసరించి గుణవృత్తిని వాడియున్నారు.

(1) "ఓడి వచ్చినాఁడ; నుద్ధతి నా కెల; యుడుకు మాని నీవ యుర్వి యేలు;
గుఱ్ఱములును నేనుఁగులు లేనిబయలు నీ తలనె కట్టి కొనుము ధర్మతనయ :"

9.2.72

(2) "ప్రాణములు తీపన మున్ వినవే బృహన్నలా !" 4.4.55

(3) "దెసలు బీటలు వాఱఁ దివురుచిందంబుల
కోలాహలములకుఁ గుదియఁబడక :" 4.4.62

ఇత్యాదస్థలములందు తలన కట్టికొనుట, ప్రాణములు దీపగుట, దసలు బీటలువాఱుట మున్నగు లాక్షణిక ప్రయోగము లున్నంతమాత్రమున ధ్వని పుట్టుట లేదు. భక్తి ధ్వనికి లక్షణ మన్నచో నిట్టితావులందు రమణీయమగు ధ్వని విశేషముండి తీఱవలయును. మఱియు స్వార్థమునకంటె భిన్నమగు నర్థవిశేషమున రూఢి కెక్కిన లావణ్యాదిపదములు కొన్ని గలవు. అట్టి లావణ్యప్రవీణకుశలాదిపదము లందును, తెలుఁగువ్యవహారములో కొండొకచో ధనపర్యాయముగా గోచరించు తైలము మున్నగువాని యందును ఉపచారము గలదు. అంతమాత్రమున నవి ప్రయుక్తమైన తావులందెల్ల

ధ్వని కానరాదు. ఆపదము లున్నసందర్భములలో నొకవేళ ధ్వని వ్యవహార మున్నను, అది వ్యంజకత్వము ననుసరించి యేర్పడునదే కాని ఉపచారమువలన నైనది కాదు. ఉదాహరణమునకు 'పెద్దతనము' అను పదము వయః ప్రమాణాదికములోని అంతరమును జెప్పును. కాని అది కాలక్రమమున గౌరవముగలవానితనము, ఎట్టివానియాజ్ఞ నుల్లంఘింపఁ జనదో యట్టివానితనము, వయసుచే వచ్చినయసమర్థత మున్నగు నర్థములందు రూఢమై యున్నది.

"పొలుతెంచిన యక్కులపాంసనుండు కోప మడరంగ వెనుకన కూడముట్టె
నట యెఱుంగుదు నీవు మీ యన్న పెద్ద తనముఁ జూచితి వే మందు ననిలతనయ!"

4.2.175

అను నీపద్యమున పెద్దతన మనుమాట ఆజ్ఞాపించువాని లక్షణము అనునట్టియర్థమున లోకరూఢినిబట్టి ప్రయుక్తమైనది. ఇం దాపదమువలన నగు వాచ్యార్థాతిరిక్తార్థ విశేష మేమియు నంతగాఁ గన్పట్టదు. కావున నిట్టిపట్టులు ధ్వని విషయములుకావు.

ధ్వనికిని లక్షణకును విషయము భిన్నము. అముఖ్యార్థమును జెప్పునది లక్షణ. ప్రయోజనమును గూర్చి ప్రవర్తించునది ధ్వని (లక్షణామూలధ్వనిని బట్టి). ఇట్లు భిన్న విషయములైనవానికి లక్ష్యలక్షణభావము సమకూడ దనుట లోకవిరుద్ధము. కొందఱు ప్రయోజనసహితమైన అన్యార్థకల్పనమే లక్షణ నిర్వహించు నందురు. కాని అన్యార్థకల్పనము వఱకు అభిధేయముతోడి సామీప్యాదులనుబట్టి లక్షణ నియతస్వరూపముతో నుండుటయు, ప్రయోజనము దగ్గఱకు వచ్చునప్పటికి సందర్భోచితముగా వివక్ష ననుసరించి భేదించుటయుఁ గానవచ్చును. ఇట్ల నియత స్వరూపమైన ప్రయోజన మనునది లక్షణ పరిధికి బాహ్యమే యగుచున్నది. కావున ప్రయోజనావగతికై వృత్త్యంతరము స్వీకార్యమే యగును. అదియే వ్యంజన. దానివలన సిద్ధించు నర్థ విశేషమే వ్యంగ్యము. అది ప్రధానముగా నుండుసందర్భమే ధ్వని. కావున భక్తియును ధ్వనియును భిన్నములే.

మఱియు లక్షణ అభిధాపుచ్ఛభూత యనియు గుర్తింపఁబడినది. అనఁగా నీపదమున కీయర్థము సంకేతిత మని చెప్పినట్లే యీ పదమున కిది యముఖ్యార్థ మనియుఁ జెప్పుట యున్నది. (ఉదాహరణమునకు లావణ్యపదమునకు శరీరము సందలినై గనిగ్యము అనునది లక్ష్యార్థము) కావున గుణవృత్తి వాచకతనే యాశ్రయించియుండును. ధ్వనిమాత్రము వ్యంజకత్వము నాశ్రయించియుండును. కావున గుణవృత్తి ధ్వనికి లక్షణము కాఁజాలదు.

ధ్వనిప్రభేదములలో నొకటి యగు అవివక్షితవాచ్యమున భక్తి యుండును గాక,

వివక్షితాన్యపరవాచ్యధ్వనియందు గుణవృత్తికి ప్రవేశము లేదు. ఇట్టిస్థితివలన గుణవృత్తి ధ్వనికి లక్షణ మన్నచో అవ్యాప్తిదోషము సంభవించునుగదా!

ఇఁక నేదో ధ్వనిభేదమున భక్తి యున్నది కావున నదియే ధ్వని కంతటికి నుపలక్షణ మనియును, అది ప్రాచీనులచేత చక్కగా నిరూపితమైనది కావున మఱల ధ్వనికి లక్షణకథనముతో పనిలే దనియు కొంద అనవచ్చును. కాని యదియు సరికాదు. ఏలయన నభిధావృత్తి లక్షణకారులచే చక్కగా నిరూపింపఁబడినంత మాత్రమున దానిచే సిద్ధించు నలంకారవర్గమునకు లక్షణకల్పన మక్కఱలే దని యెవ్వరు ననఁజాలరుగదా! అంతియకాక ఈ ధ్వనికి లక్షణావృత్తిని లక్షణముగాఁ జెప్పినందువలన నభావవాదము పరాస్తమే యగుచున్నది. అట్లు చెప్పుట ధ్వనిసద్భావము నంగీకరించుటయే కదా! కావున నీమహిమ యంతయు భక్తిదే యన్న వారుకూడ తమవాదమునకు న్యాయము చేకూర్పఁ జాలరు.

ఇఁక నిస్సారమైనను ధ్వనిసద్భావాంగీకారమును భంగ్యంతరముగాఁ జేయు ననిర్వచనీయవాదము మఱియొకటి కలదు. ఈవాదమువారు ధ్వని యనునది యుండవచ్చును గాని యది నిర్వచింప శక్యముకాని దందురు. అనఁగా ధ్వని సద్భావవిషయమున వారికి విపరీతాభిప్రాయము లేదు గాని యది వివేచించి చూప శక్యముగాని దని వీరియభిప్రాయము. కాని ఆనందవర్ధనులు నిర్వచించి చూపుట జరిగినది కావున నివాదము కూడ నిలువలేదు.

ఇ ట్లభావవాదము లైదుతెఱఁగులు. అందు మొదటిమూఁడును ధ్వనిలేనేలే దని నిరూపింప యత్నించెను. 'వీరికంటెను భక్తిలో నంతర్భవించునేమో!' యనువా రొకింత మెఱుఁగు. వారు ధ్వని నంగీకరించుచునే యది మఱియొక దానిచే గతార్థమగు నేమో యని శంకించిరి. ఇక నైదవవాదమువా రింకను ముందునకుఁ బోయిరి. ధ్వని కలదు. అది భక్తిలో నంతర్భవింపదు. కాని దానిని నిర్వచింపఁ జాలము అని వీరియభిప్రాయము. ఆనందవర్ధనాభినవగుప్తు లీయభావవాదముల నన్నింటిని మొదట ఖండించి తఱువాత లక్షణవివేకము కావించిరి. అనఁగా ముందు వ్యతిరేకముఖమున విచారించి నిర్ణయించి తఱువాత నన్వయక్రమమున ధ్వనిసిద్ధాంతమును ప్రతిపాదించి ప్రతిష్ఠాపించి రని తాత్పర్యము.

పై వాదము లన్నియు నించుమించు ధ్వన్యాలోకకర్త యూహించి ఖండించినవే. కాని తత్కాలమునఁ గొంద ఱీధ్వనివాదమును త్రోసిపుచ్చుటకును ప్రయత్నములు చేసినట్లును కానవచ్చును. ఆనందవర్ధనునికి సమకాలికుఁడైన మనోరథ కవిశ్లోక మొకటి

యీసందర్భమునఁ జూపఁ బడినది.

"యస్మి న్నస్తి న వస్తు కించన మనఃప్రహ్లాది సాలంకృతి
వ్యుత్పన్నై రచితం చ నైవ వచనై ర్వక్రోక్తి శూన్యం చ యత్,
కావ్యం తద్ధ్వనినా సమన్విత మితి ప్రీత్యా ప్రశంసన్ జడో
నో విద్మోఽ భిదధాతి కిం సుమతినా పృష్టః స్వరూపం ధ్వనేః."

ఇందు చెప్పిన వస్త్వలంకారవాక్చమత్కారవక్రోక్త్యాదు లన్నియు కావ్యమునకు బహిర్విషయములు. ఆంతరమైనరసాదిక మిట రానేలేదు. ఆత్మస్థానీయమగు దానినిఁ బేర్కొనకయే చేసిన యీయాక్షేపమునకు విలువ యెక్కడిది? ధ్వని కావ్యాత్మగా నానందవర్ధనులు కూలంకషముగా చర్చించి నిరూపించిరి. కావున సుమతి ధ్వనిస్వరూపమును బ్రశ్నింప ధ్వనిని ప్రశంసించు జడుఁ డేమని చెప్పునో తెలియరా దను నీయార్యోక్తిని సహృదయుఁడు పెడచెవి నిడవచ్చును.

మఱియు కొంద ఱీధ్వనిని యనుమానప్రమాణగమ్యమనియు దానికై యపూర్వముగ వ్యంజనావృత్తిని ప్రతిపాదింపనవసరములే దనియు నందురు. వ్యక్తివివేకకారుఁడు మహిమభ ట్టీయనుమానవాదముతో ధ్వనిసిద్ధాంతఖండనము చేయ నెంతయో ప్రయత్నించెను గాని అభినవగుప్తాదుల వివేక మాఖండనమును నిలువనీలేదు. అనుమానప్రమాణ జన్యజ్ఞానమునందు వైవిధ్యముండుటకు వీలులేదు. పొగను జూచిన యెల్లవారును అగ్నినే యనుమానింతురు కాని జలమునో, పృథివినో యూహింపరు. అనఁగా వ్యంగ్యార్థజ్ఞానము అనుమానప్రమాణజన్య మన్నచో నది ధూమాగ్నుల సంబంధమువలె వైవిధ్యము లేనిదై నియతస్వరూపముతో నుండవలయును. కాని వ్యంగ్యార్థ మట్లు నియతముగా లేక వైవిధ్యవిలసితమై యొప్పుచుండుట పూర్వోక్తోదాహరణ ములయందు నిరూపింపఁ బడినది. కావున నీయనుమానవాదము కూడ పసలేనిదే యగుచున్నది.

ఇట్లీ యభావవాదముల నన్నింటిని త్రోసివైచి ధ్వనిసిద్ధాంత మవిచ్ఛిన్నముగ లాక్షణికులచేతను, కావ్యతత్త్వమర్మజ్ఞులచేతను, కావ్యకర్తలచేతను చక్కగా స్వీకరింపఁబడినది. కావున ధ్వనియు, తత్ప్రతిపాదకవ్యంజనావృత్తియుఁ గల వనుటలో విప్రతిపత్తి యుండరాదు.

## 7. రససిద్ధి :-

ధ్వని ప్రధానముగా వస్త్వలంకారరసరూపములైన మూఁడు శాఖలతో విరాజిల్లును. వాచ్యమగు నొకవస్తువు (విషయముచే) చే, లేక అలంకారముచే నొక వస్తువు

స్ఫురించినచో నది వస్తుధ్వని యనియు, వాచ్యమగు నొకవస్తువుచే, లేక యలంకారముచే నొక యలంకారము ప్రతీయమానమైనచో నది యలంకారధ్వని యనియును, రసాదికము ప్రతీయమానమైనచో నది రసధ్వని యనియు నివి ముప్విధములు. అయినచో "ధ్వని కావ్యాత్మ కదా! అత్మ మూఁడు విధములుగా నుండునా?" యను నొకశంక యాపాతముగ జనియించును. దాని కభినవగుప్తులు చక్కని సమాధానము చెప్పిరి. ఆస్వాద విశేషమునుబట్టి వస్త్వలంకారధ్వనులను వేఱుగాఁబేర్కొనుటయే కాని నిజమున కవి రసరూపధ్వనికి సహకారకములే. కావ్యమున రసమే అత్మ. కావున రసధ్వనియే యాత్మస్థానీయము. వస్త్వలంకారధ్వనులు రసపర్యవసాయులే కాని భిన్నములు కావు. ఇట్లీశంక నివృత్తమగును. అనందవర్ధనులు ధ్వని కిట్లు నిర్వచనము చేసిరి.

"యత్రార్థః శబ్దో వా తమర్థ ముపసర్జనీకృతస్వార్థౌ,
వ్యజ్క్తః - కావ్యవిశేషః స ధ్వని రితి సూరిభిః కథితః."

ఎచట నర్థము తన్ను, శబ్దము తనయర్థమును అప్రధానము నొనర్చి, పరమ రమణీయమగు నర్థవిశేషమును వ్యంగ్య మొనర్చునో యట్టి కావ్య విశేషమును ధ్వని యని సూరులు వ్యవహరింతురు. ఇక కావ్య మనఁగా సామాన్య వ్యవహారమున నున్న పుస్తకము, గ్రంథము అనునర్థము సంభావనీయము కాదు. ఒక వాక్యమే కావ్యము కావచ్చు. ఒక విశిష్టత గల వాక్య సముదాయ మెట్లును కావ్యమే యగును. సహృదయ హృదయమున నానందస్రోతస్సును వెల్లిగొలువు రచనావిశేషమే కావ్యమని సంభావింపనగును.

అట్టి యానందవిశేషము కావ్యమున రసాదికమువలననే యుప్పతిల్లును. ఆ రసాదికము పై శ్లోకమున వివరించిన విధమున వ్యంగ్య రూపమున వెల్లివిరియును. అంతేకాని ఇదిగో శృంగారము, ఇదిగో వీరము మున్నగు విధముల వాచ్యముగాఁ జెప్పుటకు వీలుకాదు. ఒకవేళ నట్లు చెప్పినను దానివలన నానందము కలుఁగజాలదు. కావున రసప్రతీతి విధానము కూడ ధ్వని స్థాపనమున సహకరించును. ఆ విధానము నించుక పరిశీలింపవలసి యున్నది. అట్లు పరిశీలించుటకు ముందు రసమన నేమియో సుంత విచారించుటయు నప్రస్తుతము కాదు.

రస్యమానతయే జీవితముగాఁ గలది రసమనఁబడును. అవిచ్ఛిన్నముగా రుచి నొదవించుచు నలౌకికమైన యానందము నేదికూర్చునో యయ్యది రస మని తాత్పర్యము. లోకమునందలి మధురఫలాస్వాదనాదులవలనఁ గలుగు నానందముకంటె లలితకళల వలనఁ గలుగు నానందము విలక్షణమైనది. మానవుఁడు తన లౌకిక స్థితులను మఱచి,

భావనామయ ప్రపంచమున హృదయము జొనిపి యందు కనవచ్చిన దెల్ల కమనీయమని తలపోయుచు విచిత్రమైన యనుభూతి విశేషము నెందుఁబొందునో యట్టిదానిని రసమని భావింపవచ్చును. లోకమునందు వలె కాక యందు శోకాదికము కూడ నాస్వాదనీయమే - వాంఛనీయమే యగుచున్నది. ఒక యుదాహరణము నరయుదము. తిండి లేక క్రుంగి కృశించి యస్థిపంజరము వలె నున్న యొకానొక బీదవాఁడు తనకడకు వచ్చి పరమదీనముగా యాచింపఁగా విదలించుకొని పోయిన మానవుఁడే నాటకమున నట్టి సన్నివేశమును గాంచి తనకుఁ దెలియకయే కన్నీరోడ్చుట లోకమునఁ గానవచ్చును. పిదప వెలుపలకు వచ్చి యా నటుని మెచ్చుకొనుటయుఁ జూచుచుందుము. కొండొకచో తత్సన్నివేశ దర్శన కుతూహలము అధికమగుటయు నుండును. అనఁగా నట్టి సన్నివేశదర్శన మాతని హృదయము ద్రవించుటకు కారణ మాయెననియు, నట్లగుట యాతనికి వాంఛనీయ మనియు, నతని కదియొక విలక్షణమైన యానందము నొసంగుచున్న దనియు తెలియు చున్నది గదా! ఇట్టి యనుభూతి విశేషమును గలిగించు దానిని రస మనవచ్చును. అనుభూయమానమగు నీ రసము స్థాయిభావభేదమును బట్టి ముఖ్యముగా శృంగారాది నామములతో నవవిధములుగా నుండు నని ప్రాచీన తత్త్వజ్ఞులు భావించిరి. స్థూలముగా రసమనఁగా నిది.

ఇట్టి రసమును ప్రేక్షకులు లేక పాఠకులు ఎట్లనుభవించుచున్నారు? అను విషయమునఁ గూడ పలువిధముల చర్చలు గలవు. మఱియు రసానుభవము సర్వ జనసాధారణమా? యనియు ప్రశ్న వచ్చినది. ఈ రెండంశములను పరిశీలింతము.

భరతముని చెప్పిన రసనిష్పత్తి సూత్రము "విభావానుభావవ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః" అను దాని ననేకు లనేక విధములుగా వ్యాఖ్యానించిరి. ఇందలి సంయోగ నిష్పత్తి పదముల కొక్కొక్క రొక్కొక్క విధముగా నర్థమును భావించిరి.

**అందు భట్టలోల్లటుఁ డిట్లనును :** రస మనుకార్యు లగు రామాదులయం దుండును. అనుకర్తయగు నటునియం దది నాట్యరూపమున భాసిల్లును. నాటకమున నాట్య నైపుణ్యమును గాంచు సామాజికునియందు అనుకార్యనిష్ఠ రత్యాదిస్థాయి భావములు పుష్టములై స్ఫురించును. తన్మూలమున నాతని హృదయమునందు చమత్కారము గలిగి యాతఁడానందించును.

ఈతని యభిప్రాయము ననుసరించి రస ముత్పాద్యము, విభావము లుత్పాదకములు, అనుభావములు గమకములు సంచారి భావములు పోషకములు. ఉదాహరణమునకు - శకుంతల యను నాలంబన విభావమువలన దుష్యంతునియందు

రసముప్పతిల్లును. భావము, హావము, హేల మున్నగు ననుభావములచే నది వారిరువురి యందున్నట్లూహకు వచ్చును. నిర్వేదశ్రమాది సంచారి భావములు దానిని పోషించును. దుష్యంత పాత్రధారి యీ యనుభావాదులను నటించు నేర్పువలన రసమాతని యందున్నట్లు సామాజికునకు స్ఫురించి యతఁ డొకవిధమగు చమత్కారమును బొంది యానందించును. దీని నుత్పత్తివాద మందురు.

ఈ యభిప్రాయము సరికాదు. రసము నాయకునియందుండుటయు, నానందానుభవము సామాజికునియం దుండుటయు ననుభవవిరుద్ధమైన విషయము. మధుర పదార్థమును భుజించు వానికి దాని మాధుర్యము తెలిసి వాఁ డానందించును గాని చూచువాని కాయనుభవము కలుగుట లేదు. కావున నీ యుత్పత్తివాదము నిలువఁ జాలదు.

శ్రీ శంకుకుఁడు రస మనుకర్తృనిష్ఠ మని నొడివెను. సామాజికుఁడు ప్రత్యక్షముగా విభావానుభావ సంచారిభావముల నెచటఁ జూడగల్గుచున్నాఁడో యట్టి నటునియందే రసముండు నని యీతని యభిప్రాయము. ధూమ మున్నచోట నగ్ని యున్న దన్నట్లు విభావాదు లెచట నుండునో రస మచట నుండు నను వ్యాప్తి నిచట నీతఁడు పట్టించెను. అట్టి నటనిష్ఠమగు రసమును - సామాజికుఁడు ధూమమును బట్టి యగ్ని ననుమానించినట్లు - విభావాదులను బట్టి యనుమానించును. కాని యాయనుమానము కేవల లౌకిక విషయ జ్ఞానమునకు సంబంధించినది కాక వస్తు సౌందర్య బలమున సుందరమై విలసిల్లును. ఆ సౌందర్యమువలన నాతఁ డానందము ననుభవించుచున్నాఁడు. దీని కనుమితివాద మని పేరు.

ఈ యభిప్రాయముకూడ సరియైనది కాదు. ఇందనేక దోషములు కలవు. (1) రస మెచటనుండునో యచట వేద్యాంతరము విగళిత మగును. కావున నటునియందు రస మున్నదన్నచో నాతనికి నేను నటించుచున్నా నన్నజ్ఞానము పోయి పారవశ్యము కలిగ గ్రంథానుసరణము కాక, దర్శకానుసరణముగాక చేయుట సంభవింపదు. (2) రసానుభవము ప్రత్యక్షజ్ఞానజన్యమే కాని ఆనుమానికము కాదు. 'రసం సాక్షాత్కరోమి.' ఇత్యాదివాక్యముల ప్రమాణము కూడ దీనిని దృఢ పఱచును. (3) నాటకమును వీక్షించుచున్న సామాజికుఁ డెల్లవాఁడును వ్యాప్తి స్వరూపము నన్వయించుకొనుచున్నాఁ డనుటలో వానికిఁ గలుగునానందము ధారారూపమునఁగాక తునుకలు తునుకలుగా నున్నదని యంగీకరింప వలయును. (4) ఎట్లో దృశ్యకావ్యపరముగా దీని నంగీకరింత మన్నను శ్రవ్య కావ్యములం దీసిద్ధాంతము తొంగి చూడనుగూడఁ జాలదు. అట ననుకర్త లేనేలేఁ

డు. శ్రవ్య కావ్యములు రసశూన్యములని చెప్పఁజాలము. అందును సహృదయమునకు రసానుభవము గలుగుచునే యున్నది. (5) మఱియు నుత్పత్తివాదమునందుఁ జెప్పిన యుక్తి - రస మెటనుండునో యానంద మచటనే యుండవలయు ననునది - యిందునుఁ బొసఁగదు. ఇట్లీ యనుమితివాదము పరాస్త మగుచున్నది.

భట్టనాయకుఁడు రసము సామాజికనిష్ఠ మని సముచిత నిర్ణయమే చేసెను. కాని యది వానియందు నెలకొనుమార్గమును వక్కాణించుటయందు మాత్రము పొర బడెను. అతఁడిట్లనెను: రసము సామాజిక నిష్ఠ మన్నచో విభావాదులు వారి యందుండవు గదా యను శంక వొడమును. దానికి సమాధాన మిది. రసము లౌకిక మనియు, నలౌకిక మనియు రెండు విధములు. లౌకికరసము లౌకిక నాయకుల నాశ్రయించియుండును. దుష్యంతాదులగు కావ్య నాయకులు అలౌకికులు. వారి నాశ్రయించి యుండునది అలౌకిక రసము. ఇది యలౌకిక నాయకుల నాశ్రయించి యుండునదే యయినను సామాజికుని యందే యుండును. ఎట్లన శబ్దమున కభిధాభావకత్వభోజకత్వనామములతో మూఁడు వ్యాపారములు గలవు. అభిధ శబ్దము వాచ్యార్థమును బోధింపఁగా భావకత్వ వ్యాపారము రసాదులను బోధించును. పిమ్మట భోజకత్వ వ్యాపారము వానిని (రసాదులను) సహృదయులచే భోగింపఁజేయును. అభిధావ్యాపారానంతర ముద్బుద్ధమైన భావకత్వ వ్యాపారము విభావాదులను సాధారణీకరించును. అనఁగా దుష్యంతాదిభావన నశించి సాధారణ నాయకత్వము సామాజికునికి గోచరించును. భావకత్వ వ్యాపారమువలన ప్రత్యేకత రూపఱి సామాన్య స్థితి భాసిల్లునని తాత్పర్యము. తన్మూలమున సామాజికునకు నాయకునితో నభేదము సంఘటిల్లును. ఈ స్థితిలో భోజకత్వ వ్యాపార ముద్బుద్ధమై సాధారణ రూపము నొందిన రత్యాదులను సామాజికునిచే భోగింపఁ జేయును. ఈ భోజకత్వవ్యాపారమువలన వాని హృదయమునందు రజస్తమోగుణము లణఁగి సత్త్వగుణ మతిశయించును. దీనిచే నాతనికి విగళిత వేద్యాంతరమైన స్థితి కలుగును. ఆ స్థితిలో నాతని హృదయమునందు రత్యాదు లనుభూయమానము లగును - దీనికి భుక్తివాద మని వ్యవహారము.

దీనియందును దోషములు గలవు. (1) భావకత్వభోజకత్వ వ్యాపారములు శబ్దములకుఁ గల వనుటకు ప్రమాణము లేదు. (2) విభావాదు లీకల్పితభావకత్వ వ్యాపారమువలన సాధారణీకృతములగు ననుకొన్నను, సామాజికునియందు బీజ రూపముగా నవి యున్నవని యొప్పుకొననిచో నాతనికి నాయకాదులతో నభేదము కలుగుట గాని, తన్మూలమున రత్యాదులు అనుభవమునకు వచ్చుటగాని జరుగదు. (3)

అభిధావ్యాపారమువలె భావకత్వ భోజకత్వ వ్యాపారములు శబ్దమునకు సంబంధించినవే యన్నచో వాచికాభినయముకంటె భిన్నములైన అంగికాహార్యాదుల మాటయేమి కావలయును? శ్రవ్య కావ్యములం దివి యన్నియు కవిసామర్థ్యమువలన కన్నులకు గోచరించినట్లగును. దృశ్యములం దివి రసోపస్కారకములే యగుట ప్రసిద్ధమే కావున నాంగికాభినయాదులు భావకములును భోజకములును కావలసి యున్నది. అది యిందుఁ గానరాదు. ఇట్లు భట్టనాయకుని భుక్తి వాదము రసానుభవ పద్ధతిని సరిగా నిర్ణయింపలేదు.

పై అభిప్రాయభేదముల నన్నింటిని సమాలోచించి అందలి గుణ దోషములను వివేకించి రసము యన్నిష్ఠమో శాస్త్రీయమైన మార్గమున నభినవగుప్తపాదులు చక్కగా వక్కాణించిరి. వారి యభిప్రాయము ననుసరించి రసము సామాజిక నిష్ఠము. మానవుఁడు విభిన్న సన్నివేశములలో రతి, శోకము, ఉత్సాహము మున్నగు భావములను బొందుచున్నాఁడు. అట్లెప్పు డెప్పుడో యనుభవించిన రత్యాదు లాతని హృదయమున సంస్కార రూపమున నిలువయుండును. ఈ సంస్కారమునే 'వాసన' యందురు. "*భావస్థిరాణి జననాంతరసౌహృదాని*" అను కాళిదాసుని సూక్తియు, వేదాంతుల యంగీకృతియు ఈ వాసన యనుదాని యునికిని సమర్థించును. అనుభవము కూడ నట్టిదే. ఒకనికి దబ్బ తగిలనచో కొంచము వయసు వచ్చినవాఁడు చూచి 'అయ్యో!' అని సానుభూతి చూపుటయు, ననుభవము లేని బాలుఁడు, లేక బాల స్వభావము గలవాఁడు నవ్వుటయు సంభవించుచున్నది. అనఁగా నవ్వినవాని హృదయమున దెబ్బవలనిబాధ సంస్కార రూపమున నెలకొనలేదని కాని, ఇతర సంస్కారముల బలమువలన నుప్పొంగి పైకి రాలేదని కాని భావింపవచ్చును. ఇట్లు స్వగతపరగతానుభవములవలన హృదయమున వాసనారూపమున నున్న రత్యాదులు విభావాను భావసంచారి భావముల వలన వ్యక్తములై రసరూపము నందును. ఇచట విభావమనఁగా విభావనమను వ్యాపారము గలది. సామాజికుని హృదయమునందు వాసనారూపమున నున్న రత్యాదుల నాస్వాద్య యోగ్యములుగాఁ జేయుటను విభావన మందురు. ఈ వ్యాపారము నాయికానాయకుల యందును, మలయానిలచంద్రికాదులయందును ఉండును. ఇట్టి విభావనము గలది విభావము. ఇది యాలంబనో ద్దీపనభేదముచే ద్వివిధము. వాసనారూపరత్యాదుల ననుభవింపఁజేయు వ్యాపార మనుభావనము. అది కలది యనుభావము. కావ్యమున రత్యాదులను విశేషముగా నంతటను నంచరింపఁజేయుట నంచారణము లేక వ్యభిచారణము. అది కలది సంచారి భావము లేక వ్యభిచారిభావము. నిరంతర కావ్యానుశీలనమువలన హృదయమునందలి మలినము సంస్కారవంతునకు క్షాళిత

మగును. అప్పుడది బాహ్య విషయ జ్ఞానమును (దృశ్యమాన - శ్రూయమాణ - కావ్యవస్తువు కంటె భిన్నమైనది యిట బాహ్యము) సంపూర్ణముగా కోల్పోవును. అపుడు దానియందు - నిర్మలమైన దర్పణమునందువలె - కవి హృదయము (కావ్య నిర్మాణ కాలమున కవి హృదయమునఁ బొంగివచ్చు భావనాపరంపర) ప్రతిబింబించును. ఇట్టి ప్రతిఫలనము గలవానిని సహృదయుఁ డందురు. అట్టి సహృదయుఁడు నాయకుఁడు తుష్టి నొందఁగా తుష్టి నొందును; శోకము పొందఁగా శోకించును; క్రోధము వహింప క్రుద్ధుఁ డగును; భయపడఁగా భయపడును. ఇట్టిట్లాయాభావములచే రసింపఁగల హృదయము కలవాడే సహృదయుఁడు - శ్రేష్ఠుఁడగు ప్రేక్షకుఁడు - లేక శ్రేష్ఠుడగు పఠితయు - నగుచున్నాఁడు. **"యస్తుష్టౌ తుష్టిమాప్నోతి శోకే శోక ముపైతి చ, క్రోధే క్రుద్ధో భయే భీరుః స శ్రేష్ఠః ప్రేక్షకః స్మృతః."** ఇట్టి దేమియు లేక నిర్వికారముగా నుండు నాతఁడు కాష్ఠకుడ్యశిలాసదృశుఁ డగును. వానికి రస మంటదు.

ఈ పద్ధతిలో నెవఁడు తన హృదయమును రసానందానుభవమునకు యోగ్యముగా చేసికొనునో వాని హృదయమున విభావాది దర్శనమువలన సత్త్వగుణము వెల్లివిరియును. అనఁగా నందు రజస్తమోగుణముల స్పర్శయు నుండ దన్నమాట. ఆసత్త్వగుణోద్రేకమువలన వాని హృదయమునందు సంస్కారరూపమున నున్న రత్యాదు లుద్బుద్ధము లగును. విభావాదులు వాని నభివ్యక్త మొనర్చును. పునః పునరనుసంధానముచే నావిభావాదులు సాధారణము లగును. అపుడు వానికి రంగస్థలమునఁ గాంచునదంతయు, లేదా పుస్తకమున పఠించున దంతయు నటనము లేదా కవనము - అన్న జ్ఞానము నశించును. తా నాదృశ్యమాన - శ్రూయమాణ - విషయమునందు లయము నందును. తన్ను తాను విస్మరించును. ఆ విస్మరణమునం దతఁ డనిర్వచనీయమైన యానందమును బొందును. ఇట్టి స్థితికి మూల మాతనిహృదయమున బీజ రూపమున నున్న సంస్కారములే. అవియే విభావాదుల భావనా బలమువలన నభివ్యక్తము లగుచున్నవి. ఆ మార్గమున నాతనికి రసానందము కలుగుచున్నది. ఈ యభిప్రాయమును బట్టి రసము పుట్టుటయో యనుమానింపఁబడుటయో - భోగింపఁబడుటయో - కాక అభివ్యక్త మగుచున్నదని తెలియుచున్నది. అభివ్యక్త మగుట యనఁగా భగ్నావరణ సంవిద్రూపస్థితి - యన్నమాట. ఈ యభిప్రాయముపై నేవిధమైన యాక్షేపణమును రాలేదు. కావున నిది యప్రతిహతమైన సిద్ధాంతమైనది. దీని కభివ్యక్తి వాదమని నామము.

భట్ట నాయకుఁడిది యంతయు శబ్ద వ్యాపార మనుట తప్పు. ఇది విభావాదు లకు సంబంధించినదిగా అభినవగుప్తపాదులు నిరూపించిరి. విభావానుభావవ్యభిచారి

భావములు వాచ్యము లైనంత మాత్రమున రసాభివ్యక్తి కలుగదు. లక్షణాసామగ్రియగు ముఖ్యార్థబాధాదికము లేదు కావున నిది లక్షణవలన నేర్పడు ననుటకు వీలులేదు. కావున అభిధాలక్షణావృత్తులు రసప్రతీతివిషయమున సమర్థములు కావు. కావున వ్యాపారాంతరము తప్పక స్వీకార మగుచున్నది. అదియే వ్యంజన. దాని వలన సిద్ధించు రసధ్వనియే కావ్యాత్మ. అది లేదనుట కాస్కారము లేదు. కావున వ్యంజనావృత్తియు ధ్వనియు కల వనుట సిద్ధాంతము.

విభావాదులన్నియు దృశ్యశ్రవ్యకావ్యములందు శబ్దప్రపంచరూపమున వర్ణితము లగును గావున నీవ్యంజనయు శబ్దవృత్తిగనే రూపొందినది.

విభావాదిచర్వణ మున్నంతవఱకు సహృదయహృదయమున నీయనిర్వచ నీయానందము చెక్కు చెదరక యుండును. చర్వణము ముగియఁగానే యానందము కూడ ముగియును. ఇదియే బ్రహ్మానందమునకును గావ్యానందమునకు గల భేదము. ఇట్లు కావ్యానందము బ్రహ్మానందసబ్రహ్మచారి యయినది.



ఓమ్

# భారత ధ్వని దర్శనము

## తృతీయాధ్యాయము

## ధ్వనిస్వరూపము

### 1. ప్రధానభేదములు :-

ఇంతవఱకు నుటంకించిన విషయములు ధ్వన్యస్తిత్వమును నిరూపించినవి. ఇఁక దీని స్వరూప మెట్టిదియో యరయవలసియున్నది.

**"ప్రతీయమానం పున రన్యదేవ - వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్ -**
**తత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతి లావణ్య మివాఙ్గనాసు"**

అను నానందవర్ధనుని కారికను బట్టి ప్రతీయమానమగు వస్తువు అంగనల శరీరమున లావణ్యమువలె విరాజిల్లు నని తెలియుచున్నది. ఈ యుపమానముచే నీధ్వనియనునది కావ్య శరీరమునం దంతటను వ్యాపించి వేర్పఱచుటకు వీలు కానిదై ప్రకాశించుచుండునని మనము భావింపవచ్చును. వ్యంగ్యార్థ విలసితమైనదియే యుత్తమ కావ్యమనియు, తత్కర్తయే మహాకవి యనియు, నట్టి మహాకవులు కాళిదాసప్రభృతు లిద్దఱు ముగ్గురో, అయిదుగు రారుగురో యుందు రనియు వ్యంగ్యసద్భావవిషయమున నదియు నొక ప్రమాణమనియు నానందవర్ధనుల యభిప్రాయము. ఇది వాచ్యలక్ష్యార్థముల కంటె భిన్నమైనది కావుననే శబ్దార్థశాసన జ్ఞాన మాత్రముతో తెలియవచ్చుట లేదు, కావ్యార్థ తత్త్వజ్ఞునకు మాత్రమే తెలియనగుననియు వారనిరి. అయినను వెలుఁగు కావలసినవాఁడు దీపశిఖను ఆదరించినట్లు వ్యంగ్యార్థభావమునకై వాచ్యార్థమునం దాదరము చూపవలసినదే యని

**"ఆలోకార్థీ యథా దీపశిఖాయాం యత్నవాన్ జనః,**
**తదుపాయతయా - తద్వదర్థే వాచ్యే తదాదృతః".** ధ్వ. 1.9

అను శ్లోకము చెప్పుచున్నది. మఱియు కోరినవెలుఁగు సిద్ధించిన పిదప దీపపు ఉనికి ప్రత్యేకముగా గుర్తింపఁబడని విధముననే ఆత్మస్థానీయమగు కావ్యార్థము తోఁచిన పిమ్మట వాచ్యార్థము ప్రత్యేకముగా గోచరింపదు.

స్థూలముగా నిట్టి స్వరూపము గల యీ ధ్వనిమహావృక్షమునకు శాఖోపశాఖలు పెక్కులు విస్తరిల్లినవి. సహృదయభావనాబలమునుబట్టి యయ్యవి యసంఖ్యాకము

లును గావచ్చును. ఆనందవర్ధనులు ప్రధానముగా నిరూపించిన ధ్వనిభేదములు సోదాహరణముగా పరిశీలనకు వచ్చుచున్నవి.

ధ్వని ప్రధాన భేదములు **అవివక్షిత వాచ్యము, వివక్షితాన్యపరవాచ్యము** - అను నామములతో రెండు గలవు.

దేనిచేత వాచ్య మవివక్షిత మగునో యది - అట్టి అర్థవిశేషము - **అవివక్షిత వాచ్యము.** వివక్ష యనఁగా వచింప నిచ్ఛ. వివక్షింపఁబడినది వివక్షితము, అది కానిది అవివక్షితము, అవివక్షితమైన వాచ్యము గలది యని దీనికి విగ్రహము. కవి వాచ్యార్థమును ప్రధానముగా భావింపని సన్నివేశ మెచట నుండునో యది యవివక్షిత వాచ్యము. వాచ్యార్థము వివక్షితము కానిచో వివక్షితము మఱియొకటి యేదియో యుండవలయును. అదియే వ్యంగ్యరూపమైన యర్థ విశేషము. అవివక్షిత వాచ్యమను బహుప్రీహిసమాసముచే వ్యక్తమగు నన్యపదార్థము వ్యంగ్య మని తాత్పర్యము. ఈ ధ్వనిభేదమున కొక యుదాహరణము :

> **"పతివిహితానురాగమున భార్గవపుత్త్రి యయాతిచేత వం**
> **చిత యయివాఁడు దానవికిఁ జేసిన నెయ్యు మెఱింగి కోపదుః**
> **ఖితయయి తండ్రిపాలి కతిఖేదమునం జని దీర్ఘనేత్రవి**
> **ర్గతజలధారలం గడిగెఁ గాంత తదీయపదాబ్జయుగ్మమున్."** **1.3.168**

యయాతి తన్ను వంచించి శర్మిష్ఠకు పుత్రులఁ బ్రసాదించె నని యెఱిఁగి దేవయాని తండ్రికడ కేఁగి దుఃఖించుట సందర్భము. దేవయాని దీర్ఘ నేత్ర నిర్గతజల ధారలతో శుక్రాచార్యుని పదాబ్జ యుగ్మమును గడిగె నను వాచ్యార్థ మిచట అవివక్షితము. ఏలయన నిట దేవయాని తండ్రికి పాదప్రక్షాళన చేయుటకై రాలేదు. అందును బాష్పధారలతో కాళ్ళు గడుగుట సంభవము కాకపోవుటయే కాదు సహజమును గాదు. కావున నీవాచ్యార్థమును కవి ప్రధానమైన దానినిగా వివక్షింపలేదు. అనఁగా నిట వాచ్యార్థము పొసఁగలే దన్నమాట. దేవయాని, పాదప్రక్షాళనము చేయుట కెంత జలసమృద్ధి కావలయునో యంతటి కన్నీటిని స్రవింపఁజేసె నను నర్థమిట కల్పించుకొనవలయును. ఇట్లు కల్పితమైన యీ యర్థమున కామె దుఃఖ మవధులు దాటినది యని చెప్పుట ప్రయోజనము. ఇట్లామె హృదయమునం దున్న దుఃఖోద్వేగమును జెప్పుటయందే కవికి వివక్ష కలదు. ఈ యర్థ మిట వాచ్యముగా లేదు. అది సహృదయహృదయమునం దభివ్యక్త మగుచున్నది. ఈ యభివ్యక్తి వాచ్యార్థావివక్షవలన సిద్ధించినది కావున దీనిని అవివక్షిత వాచ్యధ్వని యని వ్యవహరింతురు.

ఇట మొదట వాచ్యార్థమునకు క్షతి యేర్పడినది. కన్నీటితో కాళ్ళు కడుగుట కుదురదు కదా! ఇట్లు ముఖ్యార్థ భంగమగుటవలన దీర్ఘ నేత్రనిర్గత జలధారలతో తండ్రి పాదముల నామె కడిగినంత పని చేసిన దను నర్థమును కల్పించుకొనవలసి వచ్చినది. ఈ కల్పనమున కామె దుఃఖోద్వేగము నభివ్యక్తము చేయుట ప్రయోజనము. ఇట్లు లక్షణా సామగ్రి యంతయు నిందు గోచరించుచున్నది. ప్రయోజనరూపవ్యంగ్యార్థ మిట లక్షణా వృత్తి మార్గమున నేర్పడుటచే దీనిని లక్షణామూలధ్వని యనియు నందురు.

రెండవది వివక్షితాన్యపరవాచ్యధ్వని. వివక్షితమై యన్యార్థపరమైన వాచ్యార్థము గలది యని దీని యర్థము. ఇందు పైదానియందు వలె వాచ్యార్థ మవివక్షిత మగుట యుండదు. కాని యది యన్యార్థమును జెప్పుటలో పర్యవసించును. వాచ్యార్థమునకు పొసఁగుదలయుండి రమణీయమైన యర్థాంతర మెచట దానివలన ప్రతీయమాన మగునో యట్టిసందర్భమును వివక్షితాన్యపరవాచ్య మందురు. ఉదాహరణము :

"నరనుత ! నీ ప్రసాదమున నా కుదయించిననందనున్ మహీ
గురుతరయౌవరాజ్యమునకున్ దయతో నభిషిక్తుఁ జేయఁగా
వరము ప్రసన్నబుద్ధి ననవద్యముగా దయసేయు నెమ్మితో;
నిరుపమదాన! యట్లయిన నీకును నాకును సంగమంబగున్" 1.4.60

తన్ను వివాహమాడుమని పలికిన దుష్యంతునితో శకుంతల పలికిన పలుకు లియ్యవి. ఇందు వాచ్యార్థమున కేమియు భంగము లేదు. నీ యనుగ్రహమువలన నాకు పుట్టిన కుమారునకు యౌవరాజ్యాభిషేకము చేయుదునని వరమిచ్చినచో మన కిరువురకును వివాహ మగునని యిట వాచ్యార్థము. ఈ యర్థ మిట వివక్షితమే. ఈ వివక్షితమగు నర్థము చిత్రచిత్రములైన యర్థవిశేషములను ప్రతిపాదించును. శకుంతల కోరెడుకోరిక యసాధారణమైనది. రా జిత్తు ననుచో యీ ననునో యనుశంక యామెహృదయమునఁ బొడమినది. ఈ నన్నచో పోనిమ్ము నాకేమి నష్ట మన్న గుండెనిబ్బర మామెకు లేదు. రా జెట్లామె రూపయౌవనవిలాసాదులకు వశుఁడయ్యెనో, యామెయు రాజున కట్లే వశమైనది. కాని వివేకవతి కనుక, స్త్రీయగుటచే భవిష్యజ్జాగ్రత్తకొఱకు వరమడుగుట తప్పనిసరి యగుచున్నది. ఆమ ఈ యర్థ మాతనికి వ్యక్తముచేయ నంచునది. అది వాచ్యముగానైనచో పసచెడును. కావున తనయభిప్రాయము నాతనికి వ్యక్తమగునట్లు చేయవలయును. 'నీ కింతకు పూర్వమే అనేకకాంత లుండియుందురు. వారందఱు నిన్నుఁ గోరి స్వయంవరమున వరించిన రాజకన్యకలు కావచ్చును. ఇఁక ముందును ఎందఱనో పరిగ్రహింపవచ్చును. రాజులు బహువల్లభులు గదా! నే నడవిలో పెరిగినదానను. తక్కిన వారితో సమానప్రతిపత్తి

నాకు లభింపదేమో! యను శంకతో నీవర మడుగుచున్నాను. అంతేకాని నీపై నిష్ఠము లేక కాదు.' అనునభిప్రాయము ఈ ప్రార్థనమునఁ దోఁచును. 'నరనుత!' యనుసంబోధన మా ప్రార్థనయందలి మార్దవము నభివ్యక్తము చేయును. 'దయతో' ననుటలో తన కోరికయు, 'ప్రసన్నబుద్ధి' ననుటలో లాలనయు, 'అవవద్యముగా' ననుటలో తఱువాత నిచ్చిన మాటను వీటిఁ బుచ్చకుమా! అను నెచ్చరికయు 'నెమ్మిన్' అనుటలో నిది యేదో 'బలవంతపు బ్రాహ్మణార్థ' మనుకొనకుము; నీకు ప్రీతి యున్నయెడలనే యీవర మిమ్మను భావమును, 'నిరుపమదాన!' యనుటలో నే నడుగువరము నీకొక లెక్కయా? ఇంతకు మించినవర మెట్టిదడిగినను లేదననిస్వభావము గలవాఁడవు అనురూపమున కార్యమును సానుకూలపఱచుకొనునేర్పును ప్రతీయమానము లగుచున్నవి. నీ వాటవిక స్త్రీవి; నీకుఁ బుట్టెడుకుమారునకు రాజ్య మేలు సామర్థ్య ముండునా? యని శంకింతువేమో వాఁడు నాకుఁ బుట్టెడువాఁ డైనను 'నీప్రసాదమున' పుట్టును గావున నీవలె మహాసామ్రాజ్య మేలఁగలఁడు సుమా! అనునర్థము 'నీప్రసాదమున' అనుపదముచే స్ఫురించును. రాజ్యభార వహనమునం దుండవలసిన శక్తిసామర్థ్యముల నెఱుఁగని దానను కాననుభావము 'మహీగురుతర' అనుపదైకదేశముచే తోచును. 'ఉదయించిన' అనుపదమునందును బుట్టఁ బోవుపుత్రుని యౌన్నత్య ప్రకటన తాత్పర్య మభివ్యక్తమగును. ఈ పదము సూర్యోదయము చంద్రోదయము మున్నగువాని వంటిది. నందనుఁ డనుటచే వాఁడు మనయిద్దఱకు నానందసంధాయకుఁడు కాఁగలఁడన్న యాశ స్ఫురించును. ఇది బేరమాడుటగాఁ దలఁ పవలదు. నిన్ను దైవ సమానునిగా నెంచి నేను యాచించుచున్నదాన ననుభావము 'వరము' అను పదమువలన సిద్ధించును. నావంటి మహారాజు వచ్చి యడుగఁగా నీయరానివరము కోరి నన్ను తిరస్కరింతువా యని యభిమానము పూనకుము. స్త్రీకి సంతాన వాత్సల్య మెంత అపరిహార్యమో నీ వెఱుఁగవా! దానికొఱకై యెంతటి మహాభోగము నైనను నామె తృణప్రాయముగా విడువఁగలదు అను మాతృహృదయము 'అయినన్' అను చేదర్థక క్రియచే తెలియవచ్చును. 'అట్లయిన నీకును నాకును సంగమంబగున్' అను నియమముచే నాకు నాసౌఖ్యముకంటె నాసంతానసుఖమే ప్రధానము. దానికి సరియైన మార్గమున్నపుడే నేనంగీకరింతు నన్నదృఢనిశ్చయము ప్రతీయమానమగును. నీ ప్రసాదమున - నాకు, నీకును - నాకును - అనుతీఱున నీసర్వనామముల ప్రయోగము ఇంకను మన మొక్కవ్యక్తిగా కాలేదనుటకు తోపఁజేయును. అనఁగా నిప్పటికి నీవు నీవే నేను నేనే కాని 'మనము' గా నేర్పడలేదని తాత్పర్యము.

ఇట్లు సంభావింపఁబడిన యీరమణీయమైన యర్థవిశేషమంతయు వాచ్యార్థము వివక్షిత మైనపిమ్మట సహృదయుని భావనాబలము ననుసరించి సిద్ధించును. ఇట

వాచ్యార్థ మంతయు నీవ్యంగ్యార్థ పరముగనే వ్యవస్థితమై యున్నది. కావున నిది వివక్షితాన్య పరవాచ్యమునకు మేలైన యుదాహరణము.

అభిధాశక్తివలన సిద్ధించు వాచ్యార్థమునుండి యేర్పడిన యర్థవిశేషమగుటచే దీని నభిధామూలధ్వని యనియు నందురు.

ఇచట నొకమాఱు నిలిచి యనుకొనవలసినయంశ మొకటి కలదు. సాధారణముగా నిట్టిట్టి యర్థము లిందు స్ఫురించుచుండునని వక్కాణింపఁగా నిది కవి హృదయమా? విమర్శకుని శక్తియా? రెండవదియే యైనచో నాదరపాత్రమా? అని కొందఱు శంకించుట కలదు. ఇట్టి శంకల కభినవగుప్తపాదులు వ్యంగ్యముగా సముచితమైన సమాధానమును జెప్పియున్నారు. వారు ధ్వన్యాలోకవ్యాఖ్య నారంభించుచు నీక్రింది శ్లోకమును వ్రాసి యున్నారు :

"అపూర్వం యద్వస్తు ప్రథయతి వినా కారణకలామ్ -
జగద్గ్రావప్రఖ్యం నిజరసభరాత్సారయతి చ;
క్రమాత్ప్రఖ్యోపాఖ్యా ప్రసరసుభగం భాసయతి; త
త్సరస్వత్యా స్తత్త్వం కవిసహృదయాఖ్యం విజయతామ్".

ఇందు కవిసహృదయాఖ్యమైన సరస్వతీతత్త్వమును ఏకరూపమునఁ బేర్కొనుటలో కవిసహృదయులభావైక్యము వక్కాణించినట్లయినది. సహృదయుఁడనఁగా కవి హృదయసంవాదభాక్కనియే కదా!

కావున ధ్వని యనునది కేవలము సహృదయ విమర్శకుని శక్తియే యని త్రోసి వేయరాదు. అట్లు చేసినచో భారతీయులు కవియెడఁ జూపెడు గౌరవమునకు క్షతి యేర్పడును. అట్లేర్పడుట ప్రాచీనాలంకారికులకును, సహృదయులకును సమ్మతము కాదు; సముచితమును కాదు.

మఱియు మహాకవిరచన సారవంతమైన భూమి వంటిది. విమర్శకుఁడు సమర్థుఁడగు కృషీవలుని వంటివాఁడు. ఉన్నభూమిలో శక్తి నంతటిని వినియోగించి అత్యధిక ఫలసమృద్ధిని బొందుటకు కృషీవలుఁ డభిలషించి తదున్ముఖముగ కృషి చేసినట్లే సహృదయుఁడును ఆనందప్రాప్తికై మహాకవిరచనము నుండి, పూర్వాపర వైరుధ్యము లేకుండ, మహార్థములను త్రవ్వికొనుట ఆక్షేపణీయము కాదు.

ఇట్లు ధ్వనికాండమునుండి వెలువడిన యీ రెండు ప్రధాన శాఖల నుండి యనేకోపశాఖలు బయలుదేరినవి. ఆయవాంతర భేదము లన్నియు నిట నుదాహరణ పూర్వకముగా వివరింపఁబడుచున్నవి.

## 2. అవివక్షితవాచ్యధ్వని :-

అవివక్షిత వాచ్యాపరనామకలక్షణా మూలధ్వని అర్థాంతర సంక్రమిత వాచ్యము - అత్యంతతిరస్కృత వాచ్యము - అను పేరులతో రెండు విధము లగుచున్నది. అనఁగా వాచ్యమవివక్షిత మగుపద్ధతి రెండు విధములుగా నుండునని భావము.

వాచ్యము బాధితము కాకపోయినను, ప్రకృతములో నంతగా నుపయోగింపక ధర్మాంతరములతో మిశ్రమై యన్యముగా భాసిల్లులక్షణ మెచట నుండునో యది అర్థాంతర సంక్రమిత వాచ్య మనఁడును. అర్థాంతర మనఁగా నిచట ప్రతీయమాన మగు నర్థము. దానియందు సంక్రమింప ఁజేయఁబడిన వాచ్యార్థము కలది యని దీని కర్థము. ఒక పదము యొక్కయో, వాక్యముయొక్కయో యర్థమునకు పొసఁగనితన మేమియు నుండక పోయినను, దానివలన నచట నగు ప్రత్యేక ప్రయోజన మేమియు నుండదు. అట్టి స్థితి వలన వివక్షితములగు వ్యంగ్యార్థములు స్ఫురించును. తద్రూపమున వాచ్యము పరిణతమగును. ఇట్టి గుణము కల ధ్వనివిశేషము నర్థాంతరసంక్రమితవాచ్యధ్వని యందురు. ఒక్క పదము యొక్క యర్థము మాత్రమే యర్థాంతర సంక్రమిత మగుట, వాక్యముయొక్క యర్థ మట్లగుట యనుద్వైవిధ్యమును బట్టి యీ ధ్వనిభేదము పదగతమనియు, వాక్యగత మనియు మఱల రెండు విధములగుచున్నది. అందు మొదటి భేదమునకుదాహరణము :

"ఏల యమ్మునె నాకు నిచ్చె నమ్మంత్ర మమ్మంత్రశక్తి యే నెఱుఁగంగ వేడ
యేల పుత్రునిఁ గోరి యెంతయు భక్తి నినుఁ దలంచితిఁ ప్రీతి నినుఁడును నాకు
నేల సద్యోగర్భ మిచ్చెఁ; గుమారుఁ డేల యప్పుడ యుదయించె; నిం కెట్టు
లీలోక పరివాద మే నుడిగింతు; నింతకు నింతయు నెఱుఁగరె జనులు."1.5.28

దుర్వాసుఁ డిచ్చినమంత్రశక్తిని పరీక్షింపఁ గోరి అనివార్యముగ తల్లి కావలసివచ్చిన కన్యయగుకుంతి మానసికావస్థను వర్ణించునీపద్యమున నాకు, ఏను అనుపదము లర్థాంతరసంక్రమిత వాచ్యములు. ఈ పదముల కిం దన్వయబాధ యేమియు లేదు. కాని వాని కిట ప్రత్యేక మైన ప్రయోజనమును లేదు. కావున వీని వాచ్యార్థ మొక విధముగా నవివక్షిత మగుచున్నది.

ఇందు మొదటిదగు 'నాకు' అనుసర్వనామము బాల చాపల్యము వీడని స్థితిలో అజాగ్రత్తవలన రాఁబోవు కష్టనష్టములను గుర్తింపని అవివేకవతినగు నాకు, అను నర్థాంతరమున సంక్రమితమైన వాచ్యము కలది యగును. 'ఏను' అనుసర్వనామము, 'ఇచ్చినవరము పుత్రోత్పాదన సమర్థమనియు, కన్యను గావున నిదశలో పుత్రవతి నగుట

నింద్య మనియు తెలిసియు చాపలము నణఁచుకోలేక నేను మంత్రశక్తి నెఱుఁగ వేడుట యెంత యవివేకము!' అనునర్థమును బ్రతీయమాన మొనర్చును. రెండవదియగు 'నాకు' అను పదమువలన 'నేను బాలను గావున నెఱుఁగక వేఁడినను, మౌగ్ధ్యమువలన రాఁ బోవు ననర్థము నీ ముద్దియ గుర్తింపఁజాలకున్నది. ఇట్టి యీమెకు సద్యోగర్భ మిచ్చుట తగదని యెంచక కన్యను, శీలభంగభీతి గలదాన నగునాకు సూర్యుడు వరమీనేల?' అనునర్థము వ్యంగ్యమగును. ఉత్తమక్షత్రియవంశమునఁ బుట్టినదానను, ఏ మహారాజునకో పత్నిని కావలసినదానను, ఏ మహారాజునకో తల్లిని కావలసినదానను, అభిమానవతిని అయిననేను ఈ లోకపరివాదము నెట్లు పోఁద్రోతును అను నాందోళనము రెండవ 'నేను' పదమువలన స్ఫురించును. మఱియు పలు పర్యాయము లావృత్తమైన 'ఏల' అను నవ్యయము కూడ నాయాకార్యముల అసంభావ్యత్వమును సువ్యక్త మొనర్చును. ఇట్లీ పద్యము నందలి కొన్ని పదములు పైని వివరించిన యర్థాంతరములందు సంక్రమితములైన వాచ్యము గలవియై తద్రూపమున పరిణతములగుచు ప్రయోజనమును సమకూర్చు కొనుచున్నవి. ఈ పదములవలన స్ఫురించిన పై యర్థవిశేషములవలన కుంతీదేవి హృదయమునందలి శోకము సహృదయునిచే నాస్వాదింపఁబడుచున్నది. ఈ పద్యమునం దీయర్థ మంతయు ముఖ్యముగా నేను, నాకు, ఏల అనుపదములచే సిద్ధించుచున్నది గావున నిది పదగతార్థాంతర సంక్రమిత వాచ్యమునకు లక్ష్యము.

ఈ యర్థాంతర సంక్రమిత వాచ్యము వాక్య గతముగా గోచరించుట కుదాహరణము :

> "అనిన-నీవేమి పనిచిన నట్లచేయ వలయు; నీ పున్నయెడ నుండవలయు; నీవు చన్నదెసఁ జనవలయు; నాశక్తి యెఱిఁగి పంచి పనిగొని కడిమిమైఁ బగఱ గెలుము."
>
> **4.4.43.**

ఉత్తర గోగ్రహణవార్తను విని 'రథమునకు గుఱ్ఱములను బూన్పుము, వేగముగా సిడ మెత్తుము, జనులు నావిజయము నభినందించుచు నెదుర్కొనఁగా గోగణమును గొని యిపుడ రావలయును' అని సంభ్రమముతో పలుకుచున్న అమాయికుఁడగు నుత్తరునితో బృహన్నల పలికిన పలుకు లియ్యవి. ఈ పద్యార్థము మొత్తమున వాచ్యార్థ సంగతికి భంగము లేదు. అయినను ప్రత్యేకముగా నీవాక్య సముదాయము లేకున్నను సందర్భమునకు లోపము లేదు. కావున నిచట వాచ్యార్థమునకు ప్రయోజన రాహిత్యరూపమున క్షతి ఏర్పడినది. దానివలన వాచ్యార్థము నంతటిని నన్యార్థపరముగ సంక్రమింపఁజేయవలయును. బృహన్నల మనస్సులో నుత్తరుని యాజ్ఞాపనమువలనఁ

గలిగిన భావవైఖరి యిందభివ్యక్తమగును. 'కుంజరయూధము దోమకుత్తుకఁ జొచ్చె, నన్నట్లు మహా పరాక్రమవంతుఁడను, మహారథిని, పరమేశ్వరాదులకును బరాక్రమము చవిచూపినవాఁడను మహాధానుష్కుఁడ నైననేను స్త్రీ సముదాయములో బీరములు పల్కు నీవంటివానికి సారథ్యము వహింపవలసివచ్చినది. కావున నీవేమి యాజ్ఞాపించిన నట్లే చేయవలయును; నీ వున్నచోటనే యుండవలయు, నీవు చన్నదెసనే చనవలయు-' నిత్యాద్యర్థము వ్యంగ్యమగును. 'మఱియు నన్ను కేవలము నపుంసకునిగా భావింపకుము. 'కారణ జన్మమై తనువికారము' రావచ్చును. కావున నా సంపూర్ణ శక్తి నెఱిఁగి తదనుగుణముగ నన్నాజ్ఞాపింపుము. అపుడు నీకు జయము లభించును'. అనునర్థము తుదివాక్యమున సంభావితమగును. 'నాశక్తి యెఱిఁగి' అనుటలో 'ఇపుడు నీయాజ్ఞాపించు ధోరణిని బట్టి నాశక్తి నీవెఱుఁగలే దని తెలియుచున్నది. ఎఱుఁగుటకు ప్రయత్నింపు' మను నర్థ మభివ్యక్తమగును. మఱియు 'నీవు నన్నెఱుఁగని కారణమున నీ వాజ్ఞాపించినచో నేను దానిని శిరసావహించినట్లు భావించుచున్నావు. కాని నీకు నిజముగా నేను లొంగలేదు. మీఁదుమిక్కిలి నేనే నిన్నాజ్ఞాపించుచున్నాను. నీవు (నేను) ఏమి పనిచిన నట్ల చేయవలయును. అపుడే నాశక్తి నీకుఁ తెలిసివచ్చును. అపుడే నీవు నన్ను యోగ్యమైన విధమున (రథిత్వమునందు) నియోగించి తగువిధమగు బలమును బొంది శత్రువులపై విజయమును సాధింపఁగలవు' అను వేరొక విధమైన యెచ్చరికయు 'నేను' అనుపద మధ్యాహారముగఁ గొనుటవలన సిద్ధించును. ఈ రెండవ యర్థము సూటిగా నుత్తరునికిఁ జెప్పఁబడుట కంటె తోఁచుటయే యుత్తమ మార్గము. ఒకవేళ నాతనికిఁ దోఁపకున్నను ప్రక్కల నున్న ద్రౌపద్యాదులకు తోఁపఁజేయుటయు బృహన్నలకు సమ్మతమే యని భావింపనగును. ఉత్తముఁ డధమ వృత్తిలో నియుక్తుఁ డయినపుడు ఇట్టి యన్యార్థ కల్పనమునకు వీలున్న వాక్యవైఖరిని ప్రయోగించి యభిమానమును గాపాడుకొనుటకు ప్రయత్నించుట సహజము కాకపోదు. ఈ పద్యము నందలి వాక్యార్థ మంతయు పైని వివరించిన వ్యంగ్యార్థమునందు సంక్రమింపఁజేయఁబడినదగుటచే నిది వాక్యగతార్థాంతర సంక్రమితవాచ్యమునకు మంచి యుదాహరణము.

అవివక్షితవాచ్యధ్వని రెండవ భేద **మత్యంతతిరస్కృత వాచ్యము**. ఇందు వాచ్యార్థము బొత్తుగా కుదరదు. కావుననే ఇది అత్యంత తిరస్కృత వాచ్యమైనది. ఇదియు పదగతము, వాక్యగతము నని ద్వివిధమగును. వాక్యమునందలి యేదో యొక పదము వాచ్యార్థము మొత్తము తిరస్కృతమై రమణీయ మగు నర్థ విశేషమును స్ఫురింపఁ జేసినచో నది *పదగతాత్యంతతిరస్కృతవాచ్యమ*నియు, వాక్యార్థము మొత్తమట్లయినచో

వాక్యగతాత్యంతతిరస్కృత వాచ్య మనియు ననఁబడును. అందు మొదటి భేదమున కుదాహరణము :

"ఏమిర! పసు లని యార్వవు,
నీ మాటలు నిలువఁబడియెనే - పసరమ! మి
మ్మేము మగుడ నిదె యార్చెద;
మీమాటకు మాఱుపల్క రెవ్వరుఁ: గంటే." 8.3.221

భీమసేనుఁడు దుస్ససేనుని పరమ భయంకరముగా సంహరించి కోపోద్రేక పరవశమున మాటాడు సందర్భమునందలి యీ పద్యమున 'పసరమ!' అను పదము అత్యంత తిరస్కృత వాచ్యము. కరచరణాద్యవయవ సంనివిష్టుఁడైన దుశ్శాసనుని 'పసరమ!' అని సంబోధించుటలో ముఖ్యార్థ బాధ యున్నది. కావున నిట వాచ్యార్థ మత్యంతము తిరస్కృత మయినది. కావున 'పసరమ!' అను సంబోధమునకు ఓరీ పశుతుల్యుఁడా! అనులక్ష్యార్థము కల్పించుకొననగును. దీనిని బట్టి, 'నీవు పశువు వలె ప్రవర్తించి యుక్తాయుక్త జ్ఞాన వివేక శూన్యుఁడ వైతివి. ఇప్పుడు నీవే యట్టివాఁడ వైతివి. కావుననే భగవంతుఁడు నీనోట వాగ్వ్యవహారము కూడ లేకుండ నాచే చేయించెను. మానవుఁడవై పశుప్రవృత్తి నవలంబించిన కతమున నిన్ను పశువుగా సంభావించి వధించుట దోషము కాదు సుమా!' అను భీమసేనునిహృద్గతాభిప్రాయము వ్యక్త మగును. ఈ యర్థ మంతయు 'పసరమ' అను పదము యొక్క వాచ్యార్థము సంపూర్తిగా తిరస్కృత మగుటవలన సిద్ధించుచున్నది కావున నిది పదగతాత్యంత తిరస్కృత వాచ్యమున కుదాహరణ మగును.

ఇది వాక్యగతముగా నీక్రింది యుదాహరణమున సమన్వీత మగును.

"కొడుకులఁ గానరే నృపు లకుంఠితతేజుల నెందు? నిమ్మెయిం
జెడుతెరువైనచోఁ దగవు చెప్పక యొప్పరికించి చూతురే?
పుడమిజనంబు లెల్ల నినుఁ బ్రువ్వఁగఁదిట్టఁగ వించునున్కి నొ
చ్చెడుమది; యెప్పుడుం జెవులు చీములు కట్టెడుఁ గౌరవేశ్వరా!" 5.2.10

సంజయుఁడు పాండవులకడకు వెళ్ళి వచ్చి సారాంశము విన్నవించుచు ధృతరాష్ట్రునితో నిట్లు పలికెను.

జనులు తిట్టినచో 'చెవులు చీములు కట్టుట' యనునది జరుగదు. కాన సంజయుఁ డిట ధృతరాష్ట్రునితో 'నిన్ను జనులు తిట్టెడుతిట్టులకు నా చెవులు చీములు కట్టుచున్న' వనిన యీ వాక్యపు వాచ్యార్థ మత్యంతము తిరస్కృత మగుచున్నది. చెవులు

చీములు కట్టినట్టయ్యె ననులక్ష్యార్థకల్పనచే వాచ్యార్థమునకు పొసఁగుదల కలుగును. దానివలన 'చీములు కట్టుటవలన చెవుల కెంత దుర్భర బాధ కలుగునో - అట్టిబాధ నా కీజనుల నిందావాక్యముల వలనఁ గలుగుచున్నది. నిజమునకు మధ్యస్థుఁడ నైననాకే యింత బాధ కలిగినచో స్వయముగా నింద్యుఁడ వైననీ కెంత బాధ కలుగవలయునో యూహించుకొనుము' ఇత్యాద్యర్థ మిట ప్రతీయమాన మగును. ఈ యర్థము 'జనులు నినుఁ బ్రువ్వఁగఁ దిట్టఁగ వించు నుస్కిఁ జెవులు చీములు కట్టెడు' నను వాక్యమువలన సిద్ధించుచున్నది. కావున నిది వాక్యగతాత్యంత తిరస్కృత వాచ్యధ్వనికి లక్ష్యమగును.

ఇట్లు లక్షణామూలధ్వనికి నాలుగు భేదములు గలవు.

(1) పదగతార్థాంతర సంక్రమిత వాచ్యధ్వని

(2) వాక్యగతార్థాంతర సంక్రమిత వాచ్యధ్వని

(3) పదగతాత్యంత తిరస్కృత వాచ్యధ్వని

(4) వాక్యగతాత్యంత తిరస్కృత వాచ్యధ్వని

అని వీనికి క్రమముగా పేర్లు. వాచ్యార్థము, ప్రత్యేక ప్రయోజన రాహిత్య రూపమును, అత్యంతము తిరస్కృత మగుట యనురూపముననుు పొసఁగని కారణమున అవివక్షిత మగుటచే ని భేదద్వయ మేర్పడినది. పదవాక్యములయం దిది గోచరమై మఱియు రెండు భేదము లేర్పడినవి.

## 3. వివక్షితాన్య పరవాచ్యధ్వని - అసంలక్ష్యక్రమము :-

ఇఁక అభిధామూలాపరనామక వివక్షితాన్య పరవాచ్యధ్వని స్వరూపము నరయుదము. ఇదియు మొదట అసంలక్ష్యక్రమమనియు, సంలక్ష్యక్రమ మనియు రెండు విధము లగుచున్నది. వాచ్యవ్యంగ్యార్థముల స్ఫురణములో క్రమము తోఁపకుండుట తోఁచుట యను విధానమును బట్టి యీ భేదద్వయము సిద్ధించుచున్నది. ఇందు మొదటి దానియందు వాచ్యవ్యంగ్యార్థములకు క్రమము లేదని తాత్పర్యము కాదు. క్రమము గుర్తింపఁబడదని మాత్రమే యర్థము. సూచీశతపత్రన్యాయమునుబట్టి వాచ్యవ్యంగ్యార్థముల స్ఫురణములో క్రమమున్నను నది గుర్తింపఁబడక వాచ్యార్థస్ఫురణ సమకాలమునందే వ్యంగ్యార్థ స్ఫురణము గలిగినట్లుండును. కావుననే యసంలక్ష్యక్రమ మని దీనికి నామము కలిగినది.

కావ్యమునం దంగిగా నెలకొను రసాదిక మంతయు నసంలక్ష్యక్రమ స్వరూపము తోడనే భాసిల్లును. రసము, భావము, రసాభాసము, భావాభాసము. భావోదయము, భావసంధి, భావశాంతి, భావశబలత, రసశాంతి యనునవి యీ విభాగమునకు చెందినవి.

వస్తువును బట్టి వస్త్వలంకారములో, అలంకారమును బట్టి వస్త్వలంకారములో స్ఫురించు విధానముకంటె రసాదిస్ఫురణము భిన్నముగా నుండునని చెప్పుటయే యీ సంలక్ష్య, అసంలక్ష్యక్రమ వ్యంగ్య భేదముల వేర్పాటునకు ముఖ్య హేతువు. ఒక వస్తువును బట్టి మఱియొక వస్తువునో, యలంకారమునో సంభావింపవలయు ననఁగా వాచ్యార్థ భావనమును ముగించుకొనిన పిమ్మటనే యది సాధ్యమగును. కావున క్రమ మట విస్పష్టముగాఁ దోచుచున్నది. అలంకారమును బట్టి వస్త్వలంకారములు స్ఫురించుట యందును నదియే మార్గము. ఇఁక రసాదికమునం దన్ననో విభావాదులు వర్ణితము లగుచుండఁగా నవి (రసాదులు) వెనువెంటనే స్ఫురించు చుండును. కావున నివి యసంలక్ష్యక్రమవ్యంగ్యములుగా పరిగణింపఁబడినవి.

మఱియు నిందు వివేచించి చూడఁదగిన యంశ మొకటి కలదు. ఈ రసాదులు కావ్యమునందు, లేక కావ్యైకదేశమునందు ప్రధానముగా వివక్షితము లైనపుడే యివి యీ ధ్వని భేదమునకు లక్ష్యము లగును. అట్లు కాక యవి యంగములుగా నిర్ణయింపఁ బడినచో రసవత్ప్రేయ ఊర్జస్వీసమాహితాద్యలంకార కోటిలోనికిఁ జేరును. అంగిత్వాంగత్వ నిర్ణయము సందర్భమునుబట్టి చేయవలసి యుండును.

'వివిధమాభిముఖ్యేన చరన్తీతి వ్యభిచారిణః' అను నిర్వచనము కలిగి బహువిధములై అభిముఖముగా సంచరించు భావములను వ్యభిచారు లందురు. ఇవి పుట్టుచు, కొంతసేపు స్థితి నొందుచు, నణఁగుచు రత్యాదుల నంతటను సంచరింపఁ జేయును. వీనివలన స్థాయిభావము పరిపుష్టమై రస్యమానతాస్థితికి వచ్చును. రసమే కావ్యాత్మ యైనను గొండొకయెడ రసాంగభూతమగునొక యంశమువలనను చమత్కారము కలుగుచుండును. ఉద్రిక్తమైన యవస్థను బొందిన భావము, అనుభావాదులచే సంపూర్ణముగా పోషింపఁబడక, చమత్కారకారియైనచో, మఱియు మఱియొక భావమునకో రసమునకో యంగము కాక స్వతంత్రముగా నిలువఁ గలిగినచో అట్టిదానిని భావధ్వని యందురు.

ఇట్లు భావము ధ్వనింపఁబడుట యనువిషయము నిరూపిత మైనపిదప దానికి సంబంధించి గుర్తింపఁదగిన యంశములు కొన్ని కలవు. భావము పూర్తిగా స్ఫురించు సన్నివేశమును భావస్థితి యందుము. ఇట్లే పుట్టఁబోవు స్థితిని భావోదయ మనియు, నణఁగు స్థితిని భావశాంతి యనియు వ్యవహరింతురు. ఇవి భావము యొక్క యవస్థాభేదములు. ఒక్కొక్కప్పుడు సమానకక్ష్యలో రెండు భావములు సమావేశము నొంది యొక్కసారిగనే సహృదయమున కాస్వాదము కలిగించును. అట్టి స్థితిని భావసంధి

యందురు. పరస్పర విరోధులగుననేక భావముల సమావేశమువలన పాఠకున కాస్వాదమును గలిగించు స్థితిని భావశబలత యందురు. అనౌచిత్య ప్రవృత్తమైన భావమును భావాభాస మందురు.

ఇట్లు భావము (భావస్థితి) భావోదయము, భావశాంతి, భావసంధి, భావ శబలత, భావాభాసము అనునవియు రసము, రసాభాసము అనునవియు ధ్వనించు సన్నివేశముల నాయానామములతో భావధ్వని, రసధ్వని మున్నగు విధముగా వ్యవహరింతురు. వీనికి క్రమముగా నుదాహరణ సమన్వయము ఇట్లుండును.

**భావధ్వని** : తన కన్నుల యెదుట తనసతికి కీచకాధమునివలన నగుచున్న ఘోరావమానమును గాంచిన భీమసేనుని స్వరూప మీక్రింది పద్యమున కాననగును:

"కనుగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల, నంగము
ల్గనలఁగ సాంద్రఘర్మసలిలంబులు గ్రమ్మ నితాంతదంతపీ
డనరటదాస్యరంగ వికటభ్రుకుటీచటుల ప్రవృత్తన
ర్తన ఘటనా ప్రకారభయదస్ఫురణా పరిణద్ధమూర్తియై." 4.2.133

ఇందు భీమసేనుని హృదయమున పెల్లుబికిన 'క్రోధ' మను భావము పాఠకునికి నాస్వాదనీయ మగుచున్నది. పాఠకునిచిత్తమున సంస్కారరూపమున నున్న క్రోధమను భావ మీ పద్యార్థమువలన స్ఫుటమై యాతని కొక యలౌకిక చమత్కృతి విశేషమును ఈ పద్యార్థము కలిగించుచున్నదని భావము. కన్నుల నిప్పులు రాలుట, అంగములు కనలుట, సాంద్రఘర్మసలిలంబులు గ్రమ్ముట, నితాంతదంతపీడనము మున్నగుననుభావము లీభావమునకు గమకములగుచున్నవి. ఈ పద్యమును వినుటతోడనే సహృదయ హృదయమున క్రోధము పరవళ్ళు త్రొక్కును. కాని యది లౌకికము కాదు కావున దాని వలన ప్రమాదము లేకపోవుటయే కాక యనిర్వాచ్యమగు నొక యానందము కూడఁ బొడముచున్నది. ఇట నొక యాక్షేపము పుట్టవచ్చును. ఇందు 'కోపవేగమున' అనుపదము సాక్షాత్తుగాఁ గలదు కదా! మఱల నిట 'అమర్ష' మనుభావము వ్యంగ్యము కానేల? అను శంకకు సమాధాన మియ్యాది. ఇం దాపదముండుటవలన మన కేమేని చమత్కారము గలుగుచున్నదా? లేదు. మఱి దేనివలనఁ గలుగు చున్నదనఁగా తదితరమూర్తి చిత్రణము వలననే కదా! పవనసుతుని భయంకర స్వరూపమును, అనుభావాదులును మనసునకుఁ దోఁచుటవలననే పాఠకుఁ డిందు రమించును గాని 'ఆతనికి కోపము వచ్చెను' అనువార్త వలన కాదు. కావున నిది వ్యంగ్యరూపముననే తోఁచుచున్నది. ఆ ఘట్టమున నది ప్రధానముగా వివక్షింపఁ బడిన దగుటచే ధ్వని యగుచున్నది. కాన నిది భావధ్వని కుదాహరణ మగును.

**భావోదయము** : ఉదయోన్ముఖమైన భావము, మూర్తికట్టకుండఁగనే చమత్కార హేతువై స్ఫురించినచో నది భావోదయధ్వని యనఁబడును. కీచకుని ప్రార్థనాదీనములగు వాక్యములవలన ద్రౌపదీ ప్రతినిధిగ నున్న భీమసేనుని హృదయమునఁ గలిగెడు జుగుప్స రూపొందుచునే నిలిచిపోయిన ఘట్టము -

"అనవుడు మనమున 'నిస్సీ!' యని యుచితనిగూఢభంగు లగుభాషణముల్
తనప్రియ వినిపించుట కి ట్టనియెన్ మృదురీతి భీముఁ డాతనితోడన్."

4.2.336

ఇందలి 'ఇస్సీ!' అనుపదముచే కీచకుని నీచకామమునెడ పావనికి జనించిన జుగుప్స పొటమరించుచునే, తన సతికి నిగూఢభంగులగు భాషణములు వినిపింప వలయునను వాంఛచే వెనుదిరిగినది. అనఁగా నుదయద్భావ మిట నభివ్యజ్యమాన మగుచున్నదని తాత్పర్యము.

**భావశాంతి** : కృష్ణున కర్ఘ్యప్రదానము నిర్ణయింపఁబడగా విరుద్ధ వచనము లాడుచున్న శిశుపాలుని ప్రవృత్తిని సహింపనేరని సహదేవుని విజృంభణ మీ క్రింది పద్యమున వర్ణింపబడినది.

"ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి; మిచ్చిన దీని కిం దొడం
బడ మని దుర్జనత్వమునఁ బల్కెడువీరులమస్తకంబుపై
నిడియెద; నంచుఁ దాఁ జరణ మెత్తె సభన్ సహదేవుఁ డట్టిచో
నుడిగి సభాసదుల్ పలుకకుండిరి తద్దయు భీతచిత్తులై." 2.2.30

ఇందు చరణ మెత్తుట యను భావముచే వ్యక్తమగు సహదేవుని కోపమనెడు భావము, అటుపై ప్రోదిచేయఁబడకుండుటచే శమించినదని తెలియవచ్చుచున్నది. కావున నిది భావశాంతి ధ్వని కుదాహరణ మగును.

**భావసంధి** : శకుంతల దుష్యంతుని సభకు వచ్చి, గురునాశ్రమమున మున్నరుదుగ పతివలనఁ గలిగిన యనురాగాదికమును గాననిదై యిట్లు తలపోసెను.

"ఎఱుఁగ డొకొ నన్ను; నెఱిఁగియు నెఱుఁగనియట్లుండునొక్కొ;యెడదవ్వగుటన్
మఱచెనొకొ; ముగ్ధ లధిపులు; మఱవరె? బహుకార్యభారమగ్నులు గారే?"

1.4.69

ఇం దెఱుఁగఁడా? ఎఱిఁగియు నెఱుఁగని యట్లుండునా? అను వితర్కమును, మఱచెనొకో! యను శంకయును, బహుకార్య భారమగ్నుడై యుండి మఱచి యుండ

వచ్చు నన్నధృతియు సమానకక్ష్యలో నభివ్యక్తములై యామె మానసస్థితిని పాఠకునకు రూపు కట్టించుచున్నవి.

**భావ శబలత** : సుధేష్ణ మద్యము గొని రమ్మని కీచకుని యింటికి పంపఁగా పోనిష్టము లేక, పోక తప్పక యాందోళనము నొందు ద్రౌపది దురవస్థ నీక్రింది పద్యమున కవి వర్ణించెను.

**"అలమటఁ బొందు; మాయవిధియా యని దైవము దూఱు; 'నిత్తఱిం
గలరొకొ నాకు ది' క్కను; మొగంబున నశ్రులు వెల్లిగొల్పుఁ; దొ
ట్రిలఁబడు; జల్లనం జెదరుడెందముఁ గూడఁగఁ దెచ్చి 'నన్నుఁ గే
వలమున ముట్ట నెవ్వరికి వచ్చు' ననుం; గలఁగున్; వెనుంబడున్". 4.2.104**

ఇందు అలమటఁబొందు ననుటలో నిర్వేదమును, దైవము దూఱుటలో చాపల్యమును, నాకు దిక్కుగలరా? యనుటలో దైన్యమును, అశ్రులు వెల్లి గొల్పుటలో విషాదమును, తొట్రిలఁబడుటలో త్రాసమును, చెదరుడెందమును గూడఁగట్టుకొని నన్ను ముట్ట నెవ్వరికి వచ్చు ననుటలో ధృతియును, కలఁగుటలో నార్తియును, వెనుంబడుటలో ఆలస్యము ననువ్యభిచారి భావములు వ్యక్తములై ద్రౌపదీ హృదయమునందలి శోకము నాస్వాదింపఁజేయుచున్నవి. ఇందనేక భావముల కూడిక యుండుటచే దీనిని భావశబలతాధ్వనిగా పరిగణింపవచ్చును.

**భావాభాసము** : భావము వలె కన్పట్టుచు నిజముగా నది కానిది భావాభాస మనఁబడును. రసభావముల స్వరూపసిద్ధికి ప్రతిబంధకముగా నున్న అనౌచిత్యము గల భావ వర్ణనము భావాభాసముగా పరిగణింపఁబడును. భావము కాని దాస్వాదనీయ మెట్లగునని శంకింపఁబనిలేదు. నిజమున కిట భావ ముండును. కాని యది యనౌచిత్యముతో ప్రవర్తిల్లుచున్నది. అయినచో నిది యాస్వాదనీయ మెట్లగు నన్నచో నాస్వాదనీయమైన భావము వలె ననిపించుట చేతనే యనునది సమాధానము. దీనికొక యుదాహరణము నరయుదము :

"కృష్ణునిదేవి రుక్మిణి సోదరుఁడు, రుక్మి యనువాఁడు, బలవిక్రమాన్వితుండు,
శార్ఙ్గగాండీవ విజయములు నాఁగల దివ్యచాపములఁ దృతీయమైన
చాపంబుగలవాఁడు, సైన్యసమేతుఁడై చనుదెంచి ధర్మజుఁ గని తదీయ
సత్కారములు గాంచి సముచితాసనమున నుండి యక్కొలువున నున్నవీరు
లెల్ల వినఁ గిరీటి కిట్లను; సమరంబు చేయ వెఱచితేనిఁ జెప్పు; నాకు
నెదురు లేరు జగతి నెవ్వరు; నీకుఁ దో డ్పడి జయింతు నెట్టిపగఱ నైన"

**5.4.174**

ఇందు పాండవులకు యుద్ధమున సాహాయ్యము చేయవలయు నను రుక్మి ఉత్సాహ మనుచితముగాఁ బ్రవర్తించిన దగుటచే దీనిని భావాభాసముగా భావింపఁ దగును. రుక్మి బలవిక్రమాన్వితుఁ డైనను, దివ్యచాపములలో తృతీయమైన విజయ ధనుస్సు గలవాఁ డైనను దేవేంద్రాది దేవతల యందును, మహాదేవునందును పరాక్రమము మెఱసి వారి మెప్పుగాంచిన యర్జునునితో, తన్నొకమారు నిర్జించి తన చెల్లెలిని వివాహ మాడిన కృష్ణుని సమీపమున నిట్టి బీరపు మాటలు పలుకుట యనుచితము గదా! కావున నిది భావాభాసమున కుదాహరణ మగును.

రసధ్వని : విభావానుభావవ్యభిచారి భావములు నాట్యమున దృశ్యమానములై కావ్యమున శ్రూయమాణములై సహృదయహృదయములందు వాసనారూపమున నున్న రత్యాదుల నుద్బుద్ధ మొనరించును. దానివలన నాతనికి ఆనందఘనమగు నాస్వాదవిశేషము జనించును. రసానుభవమార్గము పూర్వమే వక్కాణింపఁబడినది. ఉదాహరణమున సమన్వయము చేయఁబడుచున్నది :

తపోనిమగ్నుఁడైన విశ్వామిత్రుని సన్నిధానమునకు ఇంద్రప్రేరితయై మేనక యనునచ్చరలేమ వచ్చినది.

1) "అనిమిషకాంతయున్ నవలతాంత విభూషణలీల నల్లన
ల్లన వనకేళిలాలసవిలాసగతిం జనుదెంచి ముందటం
గనియె మహాముని ప్రవరుఁ గౌశికుఁ గౌశికచిత్రభీతిసం
జననమహాతపశ్చరణసంయుతచిత్తు నిరస్తచిత్తజున్."

2) "అంబుజలోచన గని విన యంబున నమ్మునికి మ్రొక్కి యనురాగముతో
డం బుష్పాపచయవ్యా జంబున విహరించుచుండె సఖులుం దానున్."

3) "అలసత యొప్పఁగాఁ దరుణి యమ్మునివల్లభు మ్రోల నున్నసం
మిళితసుగంధ బంధురసమీరవశంబునఁ దూలి బాల పై
వలువెడలన్ బయల్పడియె వల్దకుచంబులుఁ గక్షయుగ్మమున్
లలితకృశోదరంబుఁ దరళత్రివళీయుతరోమరాజియున్."

4) "అందుఁ దనదృష్టి నాటుడుఁ గందర్ప నిశాతసాయకంబులు పెలుచన్
డెందముఁ గాఁడిన ధృతివెడి కందిమునీంద్రుండుదానిఁ గవయం దివిరెన్.

1.4,42,43,44,45.

ఉదాహరణమునకై కావ్యముగా గ్రహింపఁబడిన యీ కావ్యైకదేశమునందు విశ్వామిత్రుఁడు నాయకుఁడు. మేనక ఆలంబనవిభావము. తారుణ్యము, లతాంత విభూషణములు, పుష్పవనము, సుగంధబంధురసమీరము మున్నగునవి యుద్దీపన విభావములు. వనకేళిలాలసవిలాసగతి, విహారము, అవయవములు బయల్పడుట మున్నగునవి యనుభావములు. అల్లనల్లన చనుదెంచుట, అలసత, పైవలువ యెడలఁగా సరిదిద్దుకొనఁజాలని జాడ్యము, చాపల్యము మున్నగునవి యనుభావములు. ధృతిచెడుట, డెందముకందుట మున్నగునవి విశ్వామిత్రునియందు వ్యభిచారి భావములు. దృష్టినాటుట కవయఁదివురుట మున్నగునవి మన్మథావస్థలు. వీని సమాహారరూపమున మేనకా విశ్వామిత్రుల క్రీడావర్ణనముచే సహృదయునియందున్నరతియను స్థాయిభావము పరిపుష్టమై శృంగార రసముగా పరిణమించి యాస్వాదనీయమగుచున్నది. ఈ యాస్వాదమునకు కేవలము వాచ్యార్థము హేతువు కాదు. దానిచే నభివ్యజ్యమానమగు శృంగారమే హేతువు. అది ధ్వన్యమానమే యగును. కావున నిట్టిదానిని రసధ్వని యందురు.

మఱియుక యుదాహరణము నరయుదము :

1) "మెఱుగుమెఱసినట్లు మెఱయంగ నరదంబు కర్ణికారకేతుకాంతి వెలుఁగ
నంపగముల గురుని నలయించి కడచి యిం ద్రజుని కొడుకు మొగ్గరంబు సొచ్చె"

2) "ఇట్లనన్యభేద్యం బగునాపద్మవ్యూహంబు భేదించి సొచ్చి సౌభద్రుండు రౌద్రరసోల్లసిత మూర్తియై యందు మహార్ణవంబునం దిరుగు మందరనగంబు చందంబునం గాననం బునం జరియించుతీవ్రానలంబు తెఱంగునన్.. కెలిగతుల మెలంగి యమ్మోయి నమ్మోహ రంబు ద్రిప్పికొలిపియుం బొడిసేసియు రూపుమాపియు రణవిహారం బొనరింప...."

(3) "వీఁకమెయిఁ గ్రీడికొడుకుం దాఁకఁగ నీకొడుకు దలఁచి తఱిమి కవిసెఁ బే
రాకలితో నున్నహరిం దేఁకువసెడి చేరుకరిగతిం – గురుముఖ్యా:"

(4) "కృపుఁడు గురుసుతుండు కృతవర్మ కర్ణుండు సోమదత్తి శలుఁడు సౌబలుండు
పౌరవుండు మద్రపతి వృషసేనుండు కౌరవేశ్వరుండుఁ గడఁగి రపుడు"

(5) "ప్రకటబలాఢ్యు లొక్కటఁ దిరంబయి పల్వురు వీఁక భూమిపా
లకునకు నడ్డమైనఁ దవులంబడి హు మ్మని నోరికండ నాఁ
చికొనిన మ్రోఁగుబెబ్బులి విశేషము దోఁపఁగఁ బార్థుపట్టి సా
యకముల నొంచినం దెరలి రందఱు లేళులపిండు నాకృతిన్"

7.2, 17, 18, 19, 23, 25.

అస్త్రగురుఁడగు ద్రోణాచార్యుఁడు నీతిమై నేర్పుమైఁ బన్నినపద్మవ్యూహము నవలీలగా భేదించి చొచ్చి వీరవిహారము సల్పుచున్నయభిమన్యుని యుద్ధవర్ణనమగు నిందు ప్రతిపక్ష వీరులు ఆలంబన విభావము, వారి వ్యూహసంరక్షణ తాత్పర్యము, వీరాలాపములు మున్నగునవి యుద్దీపనములు. మెఱుపువలె మెఱయుట, మహార్ణవమునఁ దిరుగు మందరనగముమాడ్కి విహరించుట మున్నగునవి యనుభావములు. వీని వర్ణనముచే నిట పాఠకుని హృదయమున వీరరసస్ఫూర్తి కలుగుచున్నది. దీనిని 'పేరాకలితో నున్నహరిం దేఁకువసెడి చేరుకరిగతిన్' 'నోరికండ నాఁచికొనిన ప్రోఁగుబెబ్బులి విశేషము దోఁవఁగ' అనునలంకారములు మఱియు పోషించుచున్నవి. ఇట్లీవర్ణనమువలన సామాజికుని హృదయమునం దున్నఉత్సాహమను స్థాయిభావము పరిపుష్టమై వీరరసస్వరూపముగ పరిణమించి యాస్వాద్యమగుచున్నది.

ఇట్లే మఱియొకటి :

1) "చేతులు నడుదల సేర్చు టుత్కటశోక మాకారములు దాల్చి నట్టులుండ
విరిసినవేనలుల్ వెన్నులఁ బ్రక్కల నెఱసి చూపఱదృష్టి నీఱుసేయ
సందంద తొరఁగెడు సస్రుజలంబుల పెంపుస మేఘులు ములపఁబడఁగ
నేమియుఁ దొడవులు లేమిఁ బాడఱియున్న యంగంబులందు దైన్యంబు నెఱయఁ
బతుల నన్నలఁ దమ్ముల సుతుల హితులఁ బేరుకొని వాతు లెండంగఁ బ్రేముడించి
పనవుపలుకులు వినువారి వనటఁదేల్పఁ గురుకుమార నారీజనకోటి వచ్చె."

2) "చెలులైనఁ జూడఁ బయ్యెద దొలఁగుటకును సిగ్గువడువధూజనతతి య
త్తలయెదుర నేకవస్త్రం బులతో నంగములు వికృతిఁబొందఁగ నడచెన్."

11.1.98, 99

ఇందు వర్ణింపఁబడిన కురుకుమార నారీజనకోటియవస్థ పాఠకుని హృదయమున నున్నశోక మనుస్థాయి భావమును ప్రబోధించి కరుణ రసము నాస్వాదింపఁ జేయును. ఇట్లే యాయాసన్నివేశములందు హాస్యాదితరరసముల స్ఫూర్తియుఁ గాన వచ్చును. మొత్తము కావ్యముపై దృష్టినిడక యీ యీ ఘట్టములను మాత్రమే గ్రహించుట వలన వీని కిట నంగిత్వ భావన సముచితమే యగును.

భావ మనుచితముగా ప్రవర్తిల్లి భావాభాసమైనట్లే రసము కూడ కొండొక యెడ నాభాసము కావచ్చును. అట్టి సన్నివేశములను రసాభాసము కలవిగా భావింతురు.

"ఏకత్రైవానురాగ శ్చేత్ తిర్యఙ్మ్లేచ్ఛగతో௨ పి వా,
యోషితో బహుసక్తి శ్చేద్రసాభాస స్త్రిధా మతః."

అనుకారిక శృంగారరసాభాసపు మూఁడుగతులను వివరించుచున్నది. దీనిని బట్టి రసాభాసమొక్క శృంగారమునకే సంబంధించిన దని భావింపరాదు. అది రసము లన్నింటి యందును దోఁపవచ్చును. లాక్షణికులు ప్రధానముగా రసరాజమగు శృంగారమునే లక్ష్య లక్షణ సమన్వయ పూర్వకముగా వివరించి తక్కిన వాని నామార్గమున నరసికొనవలసినదిగా నిర్దేశించియుండుటచే పైశ్లోకము శృంగారరసాభాసమును మాత్రమే వింగడించినది. రసమువలె రసాభాసము కూడ నాస్వాద్యమే యగునా? యను శంకకు రసస్పర్శ గలయేద్దైనను ఆస్వాద్యమే యగునని సమాధానము. రసాభాస ధ్వనికు దాహరణము నరయుదము :

1) వెఱవకననుఁజూచె వీఁ డని యెదఁ గలు షించిన నొండొండచెమటవొడమ
ననుచితకృత్యంబు లాచరించువిధాత్ర బలిమికి నివ్వెఱపాటు దోఁప
నిచ్చట దిక్కు లే రెవ్వరు నా కను భయమున మేనఁ గంపంబు పుట్టఁ
జేయంగ నేమియుపాయంబు లేమి నా ననమున వెల్లఁదనంబు గదుర

నున్నపాంచాలిఁ గనుఁగొనియన్నరాధ ముఁడు వివేక విహీనుఁడై ముదితుఁ డగుచు
మదనవికృతియకాఁ దనమదిఁ దలంచి రాగసాగరపూరనిర్మగ్నుఁ డయ్యె."

2) "పొలఁతుకకాంతి యింత పొలివోవఁగ నీ కెసలారఁ దారని
శ్చలతఁ గడంగి క్రోలికొనఁజాలుటఁ గీచకముఖ్యులోచనం
బులు 'నయనం ప్రధాన' మనుపూర్వవచఃస్థితి తప్పకుండఁగా
నెలమి వహించెఁ దక్కుఁగల యింద్రియవర్గము ధిక్కరించుచున్."

3) తన్వంగి మవ్వంపుఁదనులత నెసఁగెడు నునుఁగాంతి వెల్లువ మునుఁగఁబారఁ
గిసలయహస్తకెంగేలఁ దీపారుక్రొ మ్మించనులేయెండ మిగులఁ బర్వఁ
గమలాస్యముద్దుమొగంబులె మెఱుఁగుల మొత్తంబు పరిచుట్టు ముట్టుకొనఁగ
ధవళాక్షి తొంగలితఱచుతెప్పల చెన్ను కప్పనుచీఁకటి గవియుదేర

బెగ్గలం బంతకంతకు నగ్గలింప నొదవుచెమటతోఁ జిత్తంబు చెదరి యెందు
మెలఁగఁదలఁపేది యాసింహబలుఁడనంగుపట్టియాడెడుజంత్రంబుపగిది నుండె.

4.2.33, 35, 37

దుర్విదగ్ధుఁ డైనకీచకుఁడు 'అఖిలలావణ్యపుంజంబు నబ్జభవుఁడు మెలఁతఁ గాఁ జేసి దీని నిర్మించెనొక్కొ' యని కురుకుమార కాంతాజనమునకుఁ గూడ నీసుఁ బుట్టించిన సౌందర్యము గల పాండవ ధర్మపత్ని ద్రౌపదిని, సైరంధ్రిగా నున్న స్థితిలోఁ

గాంచి పొందిన కామవికారము పైనుదాహరించిన రెండు మూఁడు పద్యములలోని వస్తువు.

ఆపద్యార్థములవలన నాతని కామెయందుఁ గల ప్రీత్యాదులు తెలియుచున్నవి. వానివలన అభిలాష రూపవిప్రలంభ శృంగార మభివ్యక్తమగుచున్నది. ఱెప్పలార్పక చూచుట, స్వేదోదయము మున్నగుసాత్త్విక భావము లిటఁజెప్పఁబడినవి. ద్రౌపదికి భయజుగుప్సాదులవలనఁ గలిగిన స్వేదోద్గమము, స్తంభము, కంపము, వైవర్ణ్యము మున్నగు సాత్త్విక భావము లాతనికిఁ దనయందలి ప్రేమచే నుదయించినవిగా కనవచ్చి యుద్దీపకము లయినవి. తుది పద్యమునందు అనేక సంచారి భావములు వర్ణింపఁ బడినవి. ఈ యన్నింటి సమాహారముచే పాఠకుని హృదయమున విప్రలంభ శృంగారము అనుభూయమాన మగుచున్నను, తొలి పద్దెమున వక్కాణించిన విధమున ద్రౌపది కానరాధమునియం దనురాగము లేకపోవుటయే కాక యేవగింపు కూడ పెల్లుగా నొదవెనని తెలియవచ్చుటచే ప్రీతి యేకపక్షాశ్రయము కావున నిది రసాభాస మగుచున్నది.

తిర్యఙ్మ్లేచ్ఛగత మగు శృంగారమున ఆభాసతాహేతువులుకలవా? యని శంకింపఁ బనిలేదు. తిర్యక్కులలో దాదాపు నూటికిఁ దొంబదింటియందు ఉభయనిష్ఠమగు ప్రీతి లేకుండుటయు, మిథున కర్మమునం దవి కేవలము మోటుగా, నొక్కొక్కపుడు భయంకరము గా ప్రవర్తించుటయుఁ గానవచ్చును. దయ, జాలి, సానుభూతి, క్రమశిక్షణము, సత్యభాషణము మున్నగునుత్తమ ధర్మములు కానరాని మ్లేచ్ఛులయందును (మ్లేచ్ఛశబ్ద మిట జాతి పరముగాఁ గాక స్వభావ పరముగా వాడఁబడియుండును) హృదయమును రసీభవింపఁజేయఁగల ప్రవర్తన కానరాదు. కావున వారియందు దృశ్యమానమగు నాట్య విశేషము సహృదయునియందు రసోత్పాదనమునకు సహకరింపదు. కావుననే యది యాభాస మగుచున్నది.

భారతీయ ధర్మశాస్త్ర నిర్మాతలు పురుషునిబహువల్లభతను నిషేధింపలేదు. కాని, స్త్రీ బహువల్లభాత్వమును నిషేధించిరి. పురుషుని బహుభార్యత్వమువలన సంతానమునకు వాటిల్లు ననర్థములకంటెను, స్త్రీ బహుపురుషాసక్తి వలనఁ గలుగు దోషపుంజము మిక్కిలియపాయకర మనునుద్దేశముతోఁ గావలయు నిట్టి ధర్మశాస్త్రప్రసంగము బయలుదేఱినది. సముచితమైన లజ్జ, సచ్ఛీలము మున్నగు గుణవిశేషములు భూషణములుగాఁ గలయింతికి బహుసక్తి యవగుణమై సంస్కార వంతులమనస్సులఁయుం దేవగింపు పుట్టించును గావున నిట్టిదియు రసాభాస మగుచున్నది.

మహాసమర్థుఁ డొకడు హీనునితో యుద్ధ మొనరింప నుంకించుట, లుబ్ధుఁడు ధననష్టము వలన శోకించుట - మున్నగునవి వీరాదిరసముల కాభాసత్వమును

గలిగించును. లోకమునందు వలె కావ్యమునందును అనంతముఖ వైవిధ్యము గోచరించుటచే రసాదులతో పాటు తదాభాసములును గానరాక మానవు. కావున రసాదులవలె నవియును, వాని ప్రమాణములో, ననుభూయమానములే యగుచున్నవి.

ఇట్లు రసాదులభివ్యక్తములగుటను సోదాహరణముగా నరసితిమి. ఏతదభివ్యక్తికి తోడ్పడు మార్గములు కొన్ని గలవు. వాని నరయుదము.

కావ్యమున నంగియగురసాదికము నవలంబించి యుండు మాధుర్యాది గుణములను దండ్యాదులు పేర్కొని ప్రపంచించిరి. ఇవి యాత్మనిష్ఠములగు శౌర్యధైర్యాది గుణముల వంటివి. కావ్యమున కంగములైన వాచ్యవాచకముల నాశ్రయించి, తత్త దవయవములందు కటకాదులవలె నలంకారము లుండును. అనఁగా గుణాలంకారములు రసాద్యభివ్యక్తికి తోడ్పడు సాధనవిశేషములే కాని యవియే ప్రాథమ్యమును వహించునవి కావని తాత్పర్యము.

శృంగారము రసములలో నెల్ల మిక్కిలి మధురమైనది. సమస్తజీవకోటికిని మిక్కిలి యాహ్లాదకరమైనది. పానకరసము స్వస్థచిత్తునకును, రోగికిని ఒకేవిధముగా రుచి పుట్టించు నట్లిదియును సర్వజనులకును శీఘ్రముగా చమత్కారహేతు వగును. కావున శృంగారమయమగు కావ్యము నాశ్రయించి మాధుర్య గుణము విలసిల్లును. అనఁగా శబ్దార్థములకుఁ గల మధుర శృంగారరసాభివ్యక్తి సమర్థతయే మాధుర్య గుణము లక్షణమని తాత్పర్యము. (మధురశృంగార రసాభివ్యక్తిసమర్థతా శబ్దార్థయో ర్మాధుర్య మితిహి లక్షణమ్ - లోచనమ్) దీనినే 'పృథక్పదత్వం మాధుర్య' మ్మని వామనుఁడు నుడివెను.

ఒక యుదాహరణము నరయుదము :

**"కోర్కులు గెడఁగూడుకొని పారమెయ్యంగఁ జిత్తంబు లూఅటఁ జిగురులొత్తఁ**
**బులకాంకురములకుఁ దలతాఁకుడై యిరు మేనను మవ్వంబు మిగిలి పాదలఁ**
**దఱివేచి చనఁబోయి తడఁబడి మార్గతి పడి చూపు లాదట బయలుపఱుపఁ**
**జెమటలతావులు తమలోనఁ గలసి వే ఱొక్క సౌరభమయి చొక్కుచేయ**
**గాఢసంస్పర్శభంగులు కలుగునట్టి హోమసమయకృత్యంబుల నోదవి సౌఖ్య**
**రసము పెన్నిట్ట పొరిఁబొరిఁ గ్రమ్మదేర సమ్మదాంబుధిఁదేలిరి సతియుఁబతియు."**

**4.5.402**

ఉత్తరాభిమన్యుల వివాహ సందర్భమునందలి యీ పద్యము సమాసజటిలత, అన్వయకాఠిన్యము మున్నగు లక్షణములు లేక పృథక్పదత్వశోభితమై వారిరువురి ప్రథమ స్పర్శలోఁ గలిగిన యానందవిశేషమును జక్కగా నభివ్యక్త మొనర్చుచున్నది. ఈయభివ్యక్తి కీపద్యమునందలి మాధుర్యగుణము సహకారి యగుచున్నది.

ఈ మాధుర్యగుణము శృంగారమునందును, దానికంటెను విప్రలంభ

శృంగారమునందును, నంతకంటెను కరుణరసము నందుఁ బ్రకర్షముగా గోచరించును. దీనికి ప్రమాణ మేమన - సహృదయుని మనస్సు వీనియందు క్రమాధికముగా నార్ద్రతను బొందుచున్నది (*శృంగారే విప్రలంభాఖ్యే కరుణే చ ప్రకర్షవత్, మాధుర్య మార్ద్రతాం యాతి యత స్తత్రాధికం మనః - ధ్వ. ద్వి. 9*)

రౌద్రవీరాద్భుత రసములు పాఠకుని హృదయమునందు దీప్తిని బుట్టించును. దీప్తి యనఁగా హృదయమున వికాస విస్తరప్రజ్వలత్స్వభావ ముండుట. ఇదియే ఓజ స్సనఁబడును. ఈ యోజోగుణమనునది దీర్ఘ సమాసరచనాలంకృతమై విలసిల్లును. అనగా రౌద్రాదిరసాభివ్యక్తి హేతువు లగుశబ్దార్థముల నాశ్రయించి యోజోగుణ ముండునని తాత్పర్యము. 'గాఢబంధత్వ మోజః' అని వామనుని నిర్వచనము. ఈగాఢబంధత్వము సమాసదైర్ఘ్యమువలనఁ గాని, సంయుక్తాక్షర పరుషాక్షరబాహుళ్యమువలనఁగాని సిద్ధించును. ఈ క్రింది పద్యమున నట్టిది కలదు.

"నరనాగాశ్వవరూథయూథములతో నానావనీనాథులు
ద్ధురులై యొక్కొట నొండొరుం జఱచి యుత్తుంగానిలోద్ధూతసా
గరసంక్షోభసమంబుగాఁ గలఁగి వీఁకన్ వీరులై తాఁకియే
సిరి దేవవ్రతుపై నభోవలయ మచ్ఛిద్రంబుగా నమ్ములన్." 1.4.201.

కాశిరాజకన్యకలఁ దనతమ్మునికిచ్చి వివాహముసేయఁగోరి రాక్షసవిధానమునఁ గొనిపోవుదేవవ్రతునిపై విజృంభించిన రాజలోకపు ఉత్సాహాతిశయ మీయోజోగుణ భూయిష్ఠమగురచనచేఁ జక్కగా వ్యంజింపఁబడుచున్నది. ఇందలి నరనాగాశ్వాదియుతదీర్ఘ సమాసములు, ధకారధకారప్రాచుర్యము, సంక్షోభ, అచ్ఛిద్ర- మున్నగుపదములందలి సంయుక్తాక్షరములు మున్నగునవి యాపద్యమునకు గాఢ బంధత్వమును గలిగించు ననుట స్పష్టమే.

కొండొకయెడ దీర్ఘ సమాసాదులు లేకున్నను ప్రసాదసుందరములగు పదముల వలన సిద్ధించు నర్థవిశేషముకూడ రౌద్రాదుల నభివ్యక్త మొనర్చుటయు నచట నర్థపరమైన యోజోగుణము గన్పట్టుటయు కావ్యములందు దృశ్యమానమగుచున్నది. ఇట్టిదాని నీక్రింది సుయోధనోక్తులలో నరయుఁదగును :

"తమ్ముల నిన్నుఁ గేశవుని తమ్ముని ద్రౌపదియన్నదమ్ములం
గ్రమ్మన గీటడంచెద నొకండన యే నిదె వచ్చి బాహుద
ర్పమ్మున నిర్గవారమును భానుఁడు దోఁచి సముజ్జ్వలాత్మతే
జమ్మున రూపుమాపుక్రియ; సజ్జత నిల్వుము సుస్థిరుండవై." 9.2.86

ద్వైపాయనహ్రదమునఁ బ్రాణరక్షగావించుకొనునుయోధనుఁడు ధర్మరాజుచేఁ బురికొల్పఁబడి సమరసన్నద్ధుఁ డగుచుఁ బలికినయాపలుకులు ప్రసాదగుణభూషితములే

యైనను నిందలియర్థము పాఠకుని హృదయమున దీప్తిని గలిగించుచున్నది. కావున నిదియు నోజోగుణపూర్ణమేయై వీరరసస్ఫూర్తిని గలిగించుచున్నది.

ఇఁక శబ్దార్థముల స్వచ్ఛతనే ప్రసాద మందురు. ఇది సర్వరససర్వరచనా సాధారణము. వ్యంగ్యార్థమును బట్టియే యిది ముఖ్యమైనదిగా వ్యవస్థితమై యున్నది. బంధ శైథిల్యము ప్రసాద మని వామనునియభిప్రాయము. అట్లగుట దోషముగాదా యని శంకింపఁబనిలేదు. సుప్రసిద్ధములగు పదములను ప్రయోగించుటవలన గాఢ మైనబంధ మేర్పడకుండుటయే యిట శైథిల్యపదమున కర్థము. అట్టిది గుణమేయగును. దీనిగుణత్వప్రతిపాదనమును లోచనతాత్పర్యరూపమున ఆంధ్రధ్వన్యాలోకకారులు శ్రీమాన్ తిరువేంగళాచార్యు లిట్లు గావించిరి. "శుష్క కాష్ఠములం దగ్నివలెను, నిర్మలమగునుదకము వలెను స్వస్వరూపముతో సామాజికుల హృదయములందు వెంటనే వ్యాపించుట ప్రసాదమునకు స్వభావము. ఈయకాలుష్య రూపమగు ప్రసన్నత్వ మన్నిరసములకును గుణము. అట్లు రసవ్యంజకమగు నర్థమును శబ్దములు సమర్పించుటయే యుపచారపశమున ప్రసాదమని గ్రాహ్యము. కావ్యసాత్యములందు రసస్ఫురణము శబ్దార్థముల యకాలుష్యమున్ననే సంభవించును. కావున శబ్దార్థముల స్వచ్ఛతయే ప్రసాదమని పర్యవసించిరి. అందువలననే యిది సర్వరససాధారణమైనట్లు, శబ్ద గతములునై నమస్తానమస్త రూపములగునన్ని విధములగు రచనములకును సాధారణమైనది. అర్థము సమర్పక మనఁగా రసముల విషయముననే. శబ్దమునకుఁ గల సమర్పకత్వము స్వవాచ్యాత్మత. ఇది లోకసిద్ధమే. ఇందలౌకికత లేదు. ఇట్టి యెడ నీ ప్రసాదము గుణమనుటలో సందేహ మేముండును?" (పు. 204)
వామనాచార్యునియభిప్రాయము ప్రకారము ఓజోగుణమిశ్రితమగు ప్రసాదమే గుణమగును. అట్లు మిశ్రితమగుట ముప్విధములుగా నుండును. (1) ఓజః ప్రసాదముల సమత్వము (2) ఓజ అధిక్యము (3) ప్రసాదాధిక్యము. వీనికిఁ క్రమముగా నుదాహరణములు :

1) "కోరినకోర్కికిం దగఁగఁ గుంతి సుతత్రితయంబుఁ గాంచె; గాం
ధారియు నక్కడన్ సుతశతంబు ముదం బొనరంగఁ గాంచె; నేఁ
బోరచి యాడుపుట్టువునఁ బుట్టి నిరర్థకజీవనైతి సం
సారసుఖావహం బయిననత్సుతజన్మముఁ గానఁబోలమిన్." 1.5.129.

అనపత్యత తనహృదయమును పీడింపఁగా నిర్వేదమునఁ గ్రుంగుమాద్రి శోకము నభివ్యంజించునీపద్యమున నోజః ప్రసాదములు సమస్థితిలో మిశ్రితము లైనవి.

2) "ఆదుష్యంతుఁ డనంతసత్త్వుఁడు సమస్తాశాంతమాతంగమ
ర్యాదాలంకృత మైనభూవలయ మాత్మాయత్తమై యుండఁగా

నాదిత్యాంశుసమీరదుర్గమమహో(గ్రారణ్యదేశాళితో
నాదిక్షత్ర చరిత్ర నేలె నజితుండై బాహువీర్యంబునన్." 1.4.8.

దుష్యంతునిరాజ్య పరిపాలనా సామర్థ్యము నభివర్ణించు నీ పద్యమున సమాసము లున్నవి. కాని యవి యర్థక్లేశము నొనఁగునవి కావు. కావున నిట ప్రసాదము కూడ నున్నది. కావున అధికమగు నోజోగుణముతో మిశ్రిత మగు ప్రసాద మిటగలదు.

3) "వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె; ధేనువుల్
నేఁ డిట వచ్చె నేకతమ; నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
పోఁ డిగ వేల్వఁగాఁబడియెఁ; బ్రొద్దును బోయెఁ; గచుండునేనియున్
రాఁడు; వనంబులోన మృగరాక్షసపన్నగబాధ నొందెనో?" 1.3.112

కచుడు వనమునుండి తిరిగిరాని కారణమున శోకించుదేవయాని పలికిన యీ పలుకులందు వాఁడి మయూఖముల్ గలుగువాఁడు - నిష్ఠమెయిన్ భవదగ్ని హోత్రముల్ - మృగరాక్షసపన్నగబాధ - అనువానియం దోజోగుణ స్పర్శయున్నను మొత్తముమీద ప్రసాదగుణ మధికముగాఁ గానవచ్చును.

రసాభివ్యక్తి సందర్భమున నీ గుణముల ప్రసక్తికి తాత్పర్య మియ్యది : రసాదులు గుణములవలనఁ చక్కగా నభివ్యక్తము లగును. గుణముల స్వరూపసన్నియమువలన ప్రధానముగా వ్యంజితమగు రసాదికము గుణియై యలరును. అట్లే యలంకారములవలన నాత్మస్థానీయమగు రసాదిక మలంకార్యమై విలసిల్లును. అనఁగా గుణాలంకారములు రసపర్యవసాయులని సారాంశము.

కావ్యదోషములు కూడ రసప్రాధాన్యమునే నిరూపించును. కావ్యదోషములు నాల్గు విధములుగా వింగడింపఁబడినవి. చెవిని బడినంతనే యేహ్యమగు నర్థమును జ్ఞప్తికిఁ దెచ్చునవి శ్రుతి దుష్టములు. వాక్యార్థబలమున నశ్లీలార్థమును బోధించునవి యర్థ దుష్టములు. రెండు పదముల యోజనచే నశ్లీలార్థ స్ఫురణకలుగుచోటు కల్పనాదుష్టము. చదివే కఠినముగా వినఁబడునవి శ్రుతి కష్టములు (ఆంధ్ర. ధ్వ. పు. 20) ఇందుఁ గొన్ని అనిత్యదోషములు. అనఁగాఁ గొండొకచో నవి దోషములు కావనియే తాత్పర్యము. ఇవి వాచ్యాదులకు సంబంధించిన వైనచో సర్వత్ర దోషములే యగును. కావున నివి వ్యంగ్యములగు రసాదిపరములే యనుట సిద్ధించుచున్నది. శ్రుతిదుష్టాదులు శృంగార వీర కరుణా ద్భుత శాంతములందు దోషములును, బీభత్సాదులందు గుణములు నగుచున్నవి. ఇట్లివి యనిత్యదోషము లనుట రసపరముగానే యనుటయు, కావున రసాదికమే యంగి యనుటయు నిరూపిత మగుచున్నది.

అసంలక్ష్య క్రమవ్యంగ్యము స్థూల స్వరూపమియ్యది. ఇది యనంత విధములుగా నుండవచ్చును. ఎట్లన రసములసంఖ్యను గూర్చియే యనేకాభిప్రాయములున్నవి. ఎట్లో సిద్ధాంత మొనరించి నవత్వమును బ్రతిపాదించినను వానియం దొక్కొక్కటియు మఱల సూక్ష్మ భేదములతో ననేక రూపముల నొంద వచ్చును. వీని కంగములగు విభావానుభావాదులు, రసవ్యంజకములగు నలంకారాదులును పెక్కు భంగులుగా నుండును. మఱల భావము, భావాభాసము, భావసంధి, భావశబలత, రసము, రసాభాసము మున్నగునవియుఁ గలవు. వీని కొక్కొక్క దానికి అనుభావ వ్యభిచార్యాదులు లెక్కకు మిక్కిలిగా నున్నవి. ఇవి సంకీర్ణము లగుచో వాని సంఖ్యయు గుర్తింపఁజాలనిదై యుండును.

ఉదాహరణమునకు శృంగారము మొదట సంభోగవిప్రలంభభేదముచే ద్వివిధమగుచున్నది. సంభోగశృంగారము దర్శనము, సురతము, విహారము మున్నగు భేదముల నొందును. దర్శనాదులను మరల వింగడింపవచ్చును. ప్రేమతో వీక్షించుట, సంభాషించుట, ఆలింగనము, చుంబనము, బంధములు, జలక్రీడ, పానగోష్ఠి, ఉద్యానవన విహారము మున్నగున వెన్నియో విధములగును. అట్లే విప్రలంభమును అభిలాషేర్ష్యా విరహప్రవాసాద రూపమున నానాత్వమును భజించును. ఈయిన్నింటికే వేర్వేరుగా విభావవ్యభిచార్యాదులు గలవు. దేశకాలభేదములు, అవస్థాభేదములు మున్నగుతీరున నసంఖ్యాకములైన భేదములు పుట్టుచుండును. ఇన్నింటి పరిగణనము కష్టము కావున నిదియంతయు నొక్కస్వరూపముగానే భావింపఁబడినది.

ఇఁక నంగియగు ఈ రసాదికమున కంగములుగా నలంకారాదివర్గమును గూర్చుటలో కవి పాటింపవలసినమెలఁకువ లెట్టివో తెలియవలసియున్నది.

"ప్రాయేణ యమకే చిత్రే రసపుష్టి ర్న విద్యతే" యనునాలంకారికోక్తిని బట్టి యమకాదినిబంధనముపై దృష్టి నిడినవానికి రసపోషణసామర్థ్యము క్షీణించును. యమకాదకము రసవ్యంజకము కాకపోవుటయె దానికి హేతువు. ముఖ్యముగా శృంగార విప్రలంభశృంగారకరుణరసములందు కవి తానెంత శక్తిమంతుఁడయ్యును యమకాదిక సంకలనముపై వ్యామోహము చూపరాదు. ఏలయన నిర్మాణసమయమున కవికిని దర్శనపఠనసమయములందు సహృదయునికిని నది ప్రయత్నపూర్వకముగా మాత్రమే వశమగును. అట్టిది మహాకవి పదవాచ్యతకు భంజకము కదా! ఒకప్పుడు కాకతాళీయముగా నప్రయత్నముగా యమకాదికము కొండొకచో వచ్చిపడినచో పనివడి దానిని పరిహరింప నక్కర లేదు. అట్టిది రసభంజకమును గానోపదు. ఈక్రింది పద్యమిట్టిదాని కుదాహరణముగా

నాంధ్రధ్వన్యాలోకమునఁ జూపఁబడినది. తన్ను వీడిపోయిన నలు నన్వేషించుచున్న దమయంతి యాయావృక్షముల నాతని యునికి నడుగుసందర్భము :

"సహకార !మత్ప్రియసహకారుఁ -బున్నాగ ! పున్నాగుఁ-దిలక ! భూభువనతిలకు,
జందన ! బుధహరిచందనుఁ - బుష్పితా శోక ! సుహృజ్జనశోకదమను -
వకుళ ! కులైకదీపకు - విభీతక ! భయో పేతార్తిహరు - నలుఁ - బ్రీతితోడఁ
గానరే కానలలోన లోకోత్తరు - నని మ్రానిమ్రానికి నరిగియరిగి
యడుగు; నడుగులెండఁబొడఁబొడఁబొక్కిన నిర్ఝరాంతరముల నిలుచుఁ; బొలుచు
గిరుల దరుల యెడల నురుగుహాగృహములఁ దొంగితొంగి చూచుఁ దోయజాక్షి."

3.2.95.

ఇందు శబ్దాలంకార మున్నది. కాని యది ప్రయత్న సాధ్యమైనట్లు తోఁపదు కావున నిట్టివి రసభంజకములుగా భావింపఁబనిలేదు; కాని శబ్దాలంకారతత్పరత్వమున రసమును మట్టిలోఁగలువు ప్రయత్నముగలసన్నివేశములును మన కందందు గోచరించును.

"కానక కన్నసంతానంబు గావునఁ గానక కన్నసంతాన మయ్యెఁ;
నరయ గోత్రనిధానమై తేఁచుఁ గావున నరయగోత్రనిధాన మయ్యె నేఁడు."

ఇత్యాది రామాభ్యుదయపద్యములవంటివి సర్వవిధముల త్యాజ్యములే యగును.

ఉపమాద్యర్థాలంకారముల రసాంగములుగాఁ గూర్చుపట్టులందును గవి సంయమమునే పాటింపవలయును. అంగశోభానివేశ మంగిని మ్రింగునంతటిది కారాదు. కావున అపృథగ్యత్ననిర్వర్త్యములైనవానిని మాత్రమే సమాదరింపవలయును గాని వానికై ప్రయత్నపడరాదు. ఆంధ్రకవిలోకమునకుఉత్తమకవితా భిక్ష నిడినకవిత్రయమువారిరచనలో సర్వసాధారణముగా నిట్టియేర్పాటే కానవచ్చును. కావుననే వారికవితలలో నలంకారములు కొట్టవచ్చినట్లు కానరావు. కొండొకచోఁ గానవచ్చినను అవి అతిసహజములై కన్పట్టును. చూడుడు :

"అలయక ధర్మ శాస్త్రములయందుఁ బురాణములందుఁ జెప్పె ను
త్పలదళనేత్ర విందుమ యపత్యము మే లని; కావునన్ యశో
నిలయులఁ బుత్త్రులం బడయు; నీ కొనరించెద సంగతాంగుళీ
దళవిలసన్మదీయకరతామరసద్వయయోజితాంజలిన్."  1.5.90.

అనపత్యతాదుఃఖము మేరమీఱినపాండురాజు తనభార్యను ధర్మసమ్మతమైన విధానమున సంతానముఁబడయు మని ప్రార్థించునీపద్యమునందలి తుదిపాదమున

నున్నరూపకాలంకార మతిసహజముగా వచ్చిపడి యాతనిదైన్యము నభివ్యక్తము చేయుటలో సహకారకముగనే యున్నది. పద్మములే యనఁదగిననాకరము లింతకు పూర్వ మెవ్వరికిని మోడ్పు ఘటించినవి కావు. అట్టివానితో ని న్నిపుడు వేడుకొనుచున్నాను. కావున నాప్రార్థన త్రోసివేయకు మన్నదయనీయయాచన యిందలిరూపకాలంకృతిచే నభివ్యక్త మగును. అట్లే-

"అంభోగర్భము సొచ్చి పాండుసుతబాహాగర్వదుర్వారసం
రంభం బోర్వక డాఁగియుండెనఁటె రారా; జిస్సిరో ! చచ్చుచో
గాంభీర్యంబును ధైర్యము న్విడిచి దోర్గర్వంబు బెండయ్యెనే
శుంభన్మానము దూలెఁగా కని జనస్తోమంబు నిందింపదే."        9.2.58

అనుపద్యమున సుయోధనుని కుడుకెక్కించుప్రయత్నముగలయీవాక్యము నందలి 'రారాజ'నుసాభిప్రాయవిశేష్యము సందర్భమున కెంతయుఁ దగినదై యలంకార మన్నభావమే కలుగనీదు. మఱియు -

"హిమవత్పాదవనాంతకేలిరతిమై నేపారి కోపారుణ
క్రమనేత్రాంచలమై ప్రభూతమదరేఖంబైనగంధద్విపేం
ద్రము డాయంజని సిళ్ళుసూపుట సుమీ ధర్మాత్ము నత్యుగ్రవి
క్రముఁ గౌంతేయవరిష్ఠు నీవు దొడరంగాఁజూచు టూహింపఁగన్."   3.6.176

సైంధవునకు ధర్మజునిపరాక్రమమును క్రోధభాషణములతో వినిపించుచున్న ద్రౌపది యీవాక్కులందలినిదర్శనాలంకార మప్రయత్నసిద్ధమైనదిగానే కన్పట్టుచు సందర్భమునకు దీప్తి నొసఁగుచున్నది.

రసము నంగిగా వివక్షించినకవి యలంకారనిబంధనమున మిక్కిలి జాగ్రత్తతో మెలఁగవలయును. అలంకారప్రయోగమునెడ నాతనికి సమీక్ష అవసరము. ఆసమీక్ష యెట్లెట్లుండవలయునో ధ్వన్యాలోకమున నీక్రిందిశ్లోకములయందు వివరింపఁబడినది.

"వివక్షాతత్పరత్వేన - నాఙ్గిత్వేన కథంచన -
కాలే చ గ్రహణత్యాగౌ నాతినిర్వహణైషితా,
నిర్వ్యూఢావపి చాఙ్గత్వే యత్నేన ప్రత్యవేక్షణమ్,
రూపకాదే రలంకారవర్గ స్యాంగత్వసాధనమ్."        (ధ్వ. ద్వి 19, 20)

అలంకారమును రసపరముగా నిర్మించుట, సముచితమగుకాలమున గ్రహించుట, స్వీకరించినయలంకారమును రసానుగుణముగా విడుచుట, మిక్కలిగా నిర్వహింపకుండుట, నిర్వహింపవలసివచ్చినచో ప్రయత్నపూర్వకముగా నంగముగనే

ప్రతిపాదించుట అనునైదువిధముల సమీక్షచేసి రసమును పరిపోషింపవలయును. వీనికి క్రమముగా నుదాహరణముల నరయుదము.

1) అలంకారవర్గమును రసపరముగా నిర్మించుట :

"పెనుఁగుదుట నిడినచూతం
బును నవమాలికయుఁ బోలెఁ బొలుపొంది రతం
డును నమ్ముగ్ధయు నేకా
సనమున నున్నపుడు నూత్నసౌభాగ్యమునన్." 4.5.401

ఉత్తరాభిమన్యులు వివాహసందర్భమున నేకాసనోపవిష్టులగుట, పెనుఁగుదుట నిడినచూతనవమాలికాసంగమమువలె నున్న దను నీయుపమాలంకార మాదంపతుల యనురాగాతిశయమును జక్కగా నభివ్యక్తముసేయుచు తత్పరముగనే నిబంధింపఁబడినది. ఈయుపమానముచే వారిరువురి అత్యంతసన్నిహితత్వము ధ్వనించి వారిభవిష్యదాశ్లేషము నందలిగాఢత్వమును వారిదాంపత్యజీవనము నిండుదనమును వక్కాణించుచున్నది. కావున నిట్టీయలంకారమును కవి శృంగారరసమున కంగముగా సమీక్షించి కూర్చెను.

2) అలంకారమును సముచితకాలమున గ్రహించుట :

"చిత్తమున గాఢరాగంబు చేతఁ జూపు తెఱఁగు దోఁపఁ గెంపారెడుతీఁగబోఁడి
మృదులపాణిఁ గుమారుండు మెలపుమై గ్ర హించెఁ బల్లవాలంబిమత్తేభలీల." 4.5.399

ఉత్తర కెంపారెడు మృదుహస్తమును గ్రహించునభిమన్యుని మత్తేభముతోఁ బోల్చుట యిట నెంతయు సముచితము. ఈయౌపమ్యము వారి దాంపత్యవైభవమును సువ్యక్తముసేయును. ఆమె పల్లవమువలె మార్దవసౌకుమార్యాదిలక్షణములుగలిగి యాతనికి విధేయురాలై యుండును. ఆతఁడు మత్తేభమువలె తొట్రుపాటులేక యామె నవలీలగా భరించును. వారిరువు రొకరికొకరు భూషణప్రాయముగా నుందురు ఇత్యాద్యర్థము నభివ్యంజించుటకై తిక్కనామాత్యుఁ డిట నీయలంకారమును వివాహవర్ణనసందర్భమున సముచితముగా గ్రహించెను.

3) స్వీకరించినయలంకృతిని సమయానుగుణముగాఁద్యజించుట :

"అలినీలకుంతలుం డనియును హరినీల సమవర్ణుఁ డనియు నాజానులంబి
తాయతస్థిరబాహుఁ డనియును రక్తాంత నళినదళాకారనయనుఁ డనియు
నుత్తుంగఘనవిశాలోరస్కుఁ డనియును గవ్వడి యనియును గరము వేడ్క
వివ్వచ్చు నెప్పుడు వినియెడునది దన వినినట్లు యతిఁ జూచి వీఁడు విజయుఁ
డొక్కొ యనుచు సంశయోపేతచిత్తయై యుండి యుండనోప కొక్కనాఁడు
భోజనావసానమున నున్నయమ్ముని కిందువదన ప్రీతి నిట్లనియె." 1.8.185

సుభద్ర యతిరూపమున నున్న యర్జునునిరూపలావణ్యముల వీక్షించి యాతఁ డేమో యని సంశయించిన యీపద్యమున నర్జునుని సౌందర్యవర్ణనమున మొదటి రెండు విశేషణములలో గ్రహింపఁబడిన ఉపమానము తుదిముట్ట నిర్వహింపఁబడలేదు. కారణ మేమన నట్లు నిర్వహించినచో పాఠకుని కాతనికి సౌందర్యానుభవమునందే యేకాగ్రత యేర్పడి సుభద్రాగతాభిలాషరూపశృంగారానుభూతికి విఘాత మేర్పడును. కావున నిట మెలఁకువగాఁ జేపట్టిన యలంకారము విడువఁబడినది.

4) మిక్కిలిగా నిర్వహింపకుండుట :

రసతత్పరత్వమున, నారంభించినయలంకారమును దుదిముట్ట నిర్వహింపక అలంకారాంతరమును గ్రహించుటగాని, పూర్తిగా విడచుట గాని కవి చేయవలసి యుండును. అందు రెండవపద్ధతికి పై పద్య ముదాహరణము. మొదటిదానికుదాహరణమిది.

"చనుదెంచి యమ్మహాజనపతి జల మపే క్షించి యచ్చో విశ్రమించి చూచి
తత్కూపమున విలసత్కూలఘనవల్లి యన్విష్టసఖి నూఁదియున్నదాని
గురుకుచయుగముపైఁ బరువడిఁ దొరఁగెడు కన్నీరు పూరించుచున్న దానిఁ
దనసమీపమునకు జనులయాగమనంబు పన్నుగాఁ గోరుచు నున్నదాని
వరుణదేవుతోడఁ గరమల్గి జలనివా సంబు విడిచి భూస్థలంబువలని
కరుగుదేర నున్నవరుణేంద్రుదేవియ పోనిదాని దేవయానిఁ గనియె." 1.3.140.

శర్మిష్ఠ తన్ను నూతఁద్రోయ శోకక్రోధములు పెనఁగొని కుములుచున్న దేవయానిని యయాతి యాదృచ్ఛికముగాఁ జూచుసందర్భములోని దీపద్యము. ఇందు రెండవపాదమున స్వీకరింపఁబడినరూపకము పరిత్యజింపఁబడినది. దేవయాని స్వరూపవర్ణనముకంటె నామె దుఃఖమును వ్యంజింపఁజేయుతలంపే దానికి హేతువు. మూఁడునాలుగుపాదములలో కేవలదుఃఖమే చెప్పఁబడినది. గీతియందు మఱల నుపమాలంకారము కలదు. దీనిచే దేవయాని స్వభావము వ్యక్తమై భావి కథ కది బీజప్రాయముగా నలరుచున్నది. ఇట్లు దేవయాని శోకక్రోధముల వర్ణించునీపద్యమున హేతుబద్ధముగా నలంకారత్యాగము కన్పట్టుటయే కాక గ్రహించిన యలంకారాంతరము భావికథాస్ఫోరకముగా రూపొందుటయు నొక విశేషము.

5) అలంకారమును దుదిముట్ట నిర్వహింపవలసివచ్చినపు డది ప్రకృత రసాదికమున కంగప్రాయముగనే నిర్వహించుట :

"పలుకులముద్దును గలికిక్రాల్కన్నుల తెలివును వలుఁదచన్నులబెడంగు
నలఘుకాంచీపదస్థలములయొప్పును లలితాననేందుమండలమురుచియు

నళినీలకుటిలకుంతలములకాంతియు నెలజవ్వనంబునవిలసనంబు
నలసభావంబునఁ బొలుపును మెలుపును గలుగునగ్గిరికన తలఁచి తలఁచి
ముదితయందుఁ దనదుహృదయంబు నిలుపుటఁ జేసి రాగ మడర భాసురముగ
రమణతో వనాంతరమున రేతస్స్కంద మయ్యె నవనిపతికి నెయ్యె మొనర." 1.3.27

గిరికాదేవి రూపలావణ్యముల నతిరమణీయముగా వర్ణించిన యీపద్యము నందు సీసపాదములన్నింటను స్వభావోక్తి పఱచుకొనియున్నది. ఈస్వభావోక్తియంతయు వసురాజగత విప్రలంభశృంగారమునందే పర్యవసించి దాని కంగముగనే యొప్పుచున్నది. కావున నిట తుదిముట్ట నిర్వహింపఁబడినయలంకారము అంగిగా భావింపఁబడురసము నకుఁ బోషకమే యగుచున్నది.

ఇట్లు కావ్యమున రసాదిక మంగియైనపుడు శబ్దార్థాలంకారము లెట్టిస్థితిలో నుండవలయునో సోదాహరణముగ గమనించితిమి.

ఇప్పటి కసంలక్ష్యక్రమవ్యంగ్యము స్వరూపము, తత్ప్రాధాన్యము, తదభివ్యక్తి మార్గములును వక్కాణింపఁబడినవి.

## 4. సంలక్ష్య క్రమవ్యంగ్యము.

వివక్షితాన్యపరవాచ్యము రెండవభేదము సంలక్ష్యక్రమవ్యంగ్యము. వాచ్యవ్యంగ్యా ర్థముల క్రమమును గుర్తించుటకు వీలున్నచో నది సంలక్ష్యక్రమ వ్యంగ్యము. ఘంట యందు మొదటిదెబ్బ ననునరించి ప్రకంపనములగతివలన నొకవిధమగు నాద ముప్పతిల్లుచుండును. దెబ్బ, నాదము అనువానిక్రమము సంలక్ష్యమే యగుచుండును. అట్లు వాచ్యార్థభావము ననుసరించి స్ఫురించు వ్యంగ్యము గల యీసంలక్ష్యక్రమభేదమునే అనురణనవ్యంగ్యము, అనుస్వాన వ్యంగ్యము అను నామాంతరములతోడను వ్యవహరిం తురు. ఈయనురణనపదమువలన భావింపఁదగిన యంశ మొకటి కలదు. వాచ్యవ్యం గ్యార్థముల సమావేశము సూత్రబద్ధమువలె నవిచ్ఛిన్నముగనే సాగును గాని యసంబద్ధమై యుండ దని తాత్పర్యము. వాచ్యార్థవిశ్రాంతి యుండనిచోట అర్థాంతరస్ఫురణమువలన విశ్రాంతి సంభవించుస్థితి యెచట నుండునో యట్టిది సంలక్ష్యక్రమవ్యంగ్యమని భావము.

ఇది శబ్దశక్తిమూలము, అర్థశక్తిమూలము నని ద్వివిధము. శబ్దశక్తి యనఁగా నెట్టిది? అర్థద్వయసమర్పణసామర్థ్యరూపమా ? అట్లనుటకు వీలులేదు. ఏలయన నప్పుడది శ్లేషాలంకార మగును. అనేకార్థసంశ్రయమైనశబ్దప్రయోగమునే కదా శ్లేష యందురు. కావున శ్లేషకును, శబ్దశక్తిమూలవ్యంగ్యమునకును భేదము నరయవలయును.

ఒకానొక శబ్దప్రయోగమువలన వ్యంగ్యరూపమున అలంకార మొకటి ఆక్షిప్తమగు చుండును. అట్లాక్షిప్తమగుట ప్రయుక్తమైనశబ్దము సామర్థ్యమునుబట్టియే యగుచుండును. శబ్దమునకుగల అలంకారప్రతిపాదన సామర్థ్యమును బట్టి సిద్ధించుధ్వని భేదము కాన దీనిని శబ్దశక్తిమూలధ్వని యందురు.

శబ్దశక్తిచే నలంకారమే సిద్ధించు నన నేల ? వస్తువుమాత్రము సిద్ధింపదా? యనుశంక యిట కలుగవచ్చును. వాచ్యమగువస్తువుచే వ్యంగ్యమగువస్తువు శబ్దశక్తివలన సిద్ధింపదా ? యని యీశంకకు తాత్పర్యము. దానికి సమాధాన మియ్యది. ఎచట శబ్దముచే వస్తుద్వయము సిద్ధించునో యట్టిసన్నివేశములు శ్లేషతో గతార్థములగును. అట్లే శబ్దశక్తిచే నలంకారద్వయము సిద్ధించినపుడును శ్లేష యనియే వ్యవహారము. ఉదాహరణమునకు "వసువులు రుద్రులు వసుహీన విప్రులక్రియ దక్షిణాశ్రితు లయిరి భీతి" (1.2.100) అను పద్యపాదమున ఉపమా వాచకమగు 'క్రియ' అనుపదముచే దక్షిణాశ్రితశబ్దమున కర్థద్వయము సాధింపవలయుట అనివార్యమగుచున్నది. ధనము లేనివిప్రులు రాజు లిచ్చుదక్షిణల నాశ్రయించిన విధముగా వసువులు రుద్రులును గరుత్మంతునివిజృంభణమునకు తాళక దక్షిణదిక్కు నాశ్రయించిరి అనునీయర్థ మంతయు శ్లేషాలంకారరూపమున వాచ్యమే యగును గాని వ్యంగ్యపరిధిలోనికి రాఁజాలదు. కావున "దక్షిణల నాశ్రయించు వారయిరి" అను వస్తు విట శబ్దశక్తిచే వ్యంగ్యమైన దనరాదు. అది వాచ్యమే.

పై యుదాహరణమును బట్టి ఉభయార్థబోధన సామర్థ్యమున్న శబ్ద ప్రయోగము గలచోటు శబ్దశక్తిమూలధ్వని యనరాదని తెలియుచున్నది. ఒకశబ్దమున కర్థద్వయ ప్రతిపాదన సామర్థ్యమున్నను, ఆయర్థద్వయము పరస్పరసంబద్ధము కానిచో అది ద్వ్యర్థికావ్యవిషయమగుటయో, లేక అసంబద్ధప్రలాపమువంటిదగుటయో యగును. ఇందు మొదటి పక్షమున ధ్వని వ్యవహార ముండదు. ద్వ్యర్థులలో నొకయర్థ మప్రధాన మగుట సంభవింపదుగదా ! అపుడు 'ఉపసర్జనీకృతస్వార్థత' అను ధ్వనిలక్షణము సరిపడదు. రెండవపక్షమునుగూర్చి యాలోచింపనక్కఱయే లేదు. అట్లు కాక రెండర్థములకు పరస్పరసంబంధము కలుగునేని అప్పు డది యలంకారముగనే పరిణమించును. ఎట్లన 'ఆ దుష్యంతుఁడనంతసత్త్వుండు' (1.4.8) అనువాక్యము నందు 'అనంతసత్త్వుఁ డ'నుపదమునకు అనంతమైనసత్త్వముగలవాఁడు, అనంతుని సత్త్వమువంటి సత్త్వముగలవాఁడు అని యర్థద్వయమును సాధింపవచ్చును. అపుడీ రెంటికి నొకసంబంధమును గల్పింపనగును. అనంతుని - ఆదిశేషుని సత్త్వము వంటి

యనంతమైనసత్త్వముగలవాఁడు - అనునర్థము పొసఁగును. అట్లు సంబంధము కల్పించినంతనే యది యలంకారముగా పరణమించుచున్నది కదా ! కావున శబ్దశక్తిచే నలంకారముమాత్రమే ధ్వనించు నని తెలియుచున్నది. ఇట్లు పరస్పరసంబంధము లేక అర్థద్వయము చెప్పక తప్పనిసరియైనతావులెల్ల శ్లేషవిషయములే యగును. అవి ధ్వని కోటిలోనికిఁ జేరవు. ఈరెంటికిని వేర్వేరుగా నుదాహరణముల నరయుదము.

అర్థద్వయము చెప్పుకొనవలసిశ్లేష అయినసన్నివేశము.

"ద్విజుఁడఁ; గురువిషయజాతుఁడ; సుజనప్రియుఁడైనధర్మసుతుసఖుఁడఁ; బరి
వ్రజనాశ్రమకలితుండ, మ నుజవల్లభ ! యోగ్యబహువినోదకరుండన్."

ధర్మజుఁడు కంకభట్టవేషధారియై విరాటునికడ తన్ను పరిచయము చేసికొను సందర్భమునందలి దీపద్యము.

ఈ పద్యమునం దర్థద్వయము చెప్పుకొనవలసి యున్నది. అట్లుకానిచో సత్య సంధుఁడని పేరొందిన ధర్మరాజునకు అసత్య వాగ్దోషము సిద్ధించును. కావున ద్విజుఁ డను - బ్రాహ్మణుఁడను, కురువిషయ జాతుఁడను - కురుదేశమునందుఁ బుట్టిన వాఁ డను, ధర్మ సుతుసఖుఁడను - ధర్మరాజునకు మిత్రుఁడను, పరివ్రజనాశ్రమకలితుఁడను - సంన్యాసాశ్రమముతోఁ గూడినవాఁడను, ఇత్యాద్యర్థము పైకి తాను ధర్మరాజన్న భావము గలుగకుండ చెప్పుకొనవలసి యున్నది. సమకాలమున అసత్యభీతితో తాను ధర్మరాజే యన్నయర్థము కూడ శబ్దశక్తివలనఁ గలుగఁజేయుటయు వివక్షితమే యనఁదగును. అపుడు ద్విజశబ్దమునకు క్షత్రియుఁ డనియు, కురు విషయజాతుఁ డనుదానికి - కొంచెము క్లిష్టముగా -కురువంశమున జనించిన వాఁడనియు, ధర్మసుతుసఖుఁ డనుదానికి ధర్మసుతునితో సమప్రాణము గలవాఁడనియు (సమప్రాణః సఖా మతః) కావున ధర్మజుఁ డే యనియు, పరివ్రజనశబ్దమునకు అంతట తిరుగుట అనుయోగార్థము నాశ్రయించి పరివ్రజనాశ్రమకలిత - నిలువనీడలేక యంతట తిరుగుట యనువిశేష శ్రమతోఁ గూడినవాఁ డనియు నర్థమును గ్రహించినచో ధర్మరాజ పరముగా సరిపడును. ఈ రెండవ యర్థము కవికి వివక్షితమా? యన్నచో సందర్భమును బట్టియు, పదప్రయోగవిధానమును బట్టియు, సత్యసంధతా రక్షణ తాత్పర్యమును బట్టియు వివక్షితమే యని చెప్పనొప్పును. అప్పు డీ రెండర్థములకును పరస్పర సంబంధమును గల్పింపనక్కఱలేదు. కావున నిట్టి సందర్భము లను శ్లేషవిషయములుగనే భావింపవలయును. ఇందు రెండర్థములును సమప్రధానములు కావున ధ్వనివ్యపదేశము కుదురదు. కావున నిట్టివి శ్లేషాలంకారములే యగును.

శబ్దసామర్థ్యమును బట్టి యలంకారము ప్రతీయమానమైన యెడల నది శబ్ద శక్తిమూలకానురణనవ్యంగ్యమున కుదాహరణ మగును. ఆంధ్రధ్వన్యాలోకమున శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు గారు దీనికి భారతము నుండి యీ క్రింది పద్యము నుదాహరించిరి.

"నవతాదూర! పురాతనానుపగతా! నానాత్వసంశోభితా!
వివిధత్వాపగమోజ్జ్వలా! బహుకళావిర్భావశాలీ! సము
ద్భవరాహిత్యనిరూఢ ! సూక్ష్మతరసంభాసా ! మహాస్థూలమూ
ర్తివిశేషా! నిరుపాధికా! గుణమయా! ధీవర్తకా! నిష్క్రియా!" 4.4.274.

భగవత్ప్రార్థనాపరమైన యీ పద్యమునందలి రెండేసి విశేషణములందు విరోధము ప్రతీయమానమగును. కాని అది వాచ్యముగా లేదు. 'నవత్వమునకు దూరమైన వాఁడా'! అను మొదటిసంబోధనమును బట్టి హరిహరనాథుని సనాతనత్వము సంభావింప బడినది. పురాతనానువగతా! అనుటచే నాతని ప్రావడితనము నిషేధింపఁ బడినది. కావున నివి రెండును విరుద్ధములు. దీనిచే సనాతనుఁడయ్యు నవీనుఁడైనవా డను విరోధాభాసా లంకారము ప్రతీయమాన మగును. దేశకాలావస్థాతీతుఁ డగుటచే విరోధము పరిహృత మగును. ఇట్లీ పద్యమునం దంతటను విరోధాభాసము ధ్వనించును.

ఇట్లు శబ్దశక్తిచే నలంకారము మాత్రమే ధ్వనించు ననుట స్థిరమైనది. కాని మమ్మటాదులు శబ్దశక్తిమూలవస్తుధ్వనిని గూడ ప్రతిపాదించిరి. కాని ధ్వనిమార్గ ప్రవర్తకు లగు నానందవర్ధనాభినవ గుప్తులయభిప్రాయమున కది విరుద్ధమగుటయే కాదు యుక్తసహమును గాదు. కావ్య ప్రకాశమునఁ జూపిన లక్ష్యమును దానివివరణమును బరిశీలించి యది యెంతవఱకు సరిపడునో యిట నరయవలసి యున్నది.

"పాంథ! నాత్ర సంస్తర మస్తి మనా క్ప్రస్తరస్థలే గ్రామే,
ఉన్నత పయోధరం ప్రేక్ష్య యది వససి - తద్వస."
"అత్ర యద్యుపభోగక్షమోఽ సి తదా ఆస్స్వేతి వ్యజ్యతే." (కా. ప్ర. (పు. 80)

"ఓ పాంథుఁడా! ఇచట చాప లేదు. ఈ యూరంతయు ఱాలనేల. పెద్దవి యగుపయోధరములను (మేఘములను) జూచి యుండఁదలఁచినచో నుండుము." అనునది యిట వాచ్యార్థము. "పాంథా! ఇట రసికజనము లేదు. ఇందలిజను లందఱు ఱాలవంటి వారు. కావున నాయున్నతస్తనములను గాంచి యనుభవింపనెంచినచో నుండుము" అనునది యిచట వ్యంగ్యమగు నర్థాంతరము. ఈ వ్యంగ్యార్థము 'ఉన్నత పయోధరమ్' ఇత్యాది శబ్దమునందలి యర్థాంతర ప్రతిపాదన సామర్థ్యమువలన

సిద్ధమగుచున్నది. కావున నిది శబ్ద శక్తి మూల వస్తు ధ్వని యని మమ్మటుని యభిప్రాయము.

కాని యీ యభిప్రాయము సరిగాదు. ఎట్లన నిట శబ్ద మర్థ ద్వయమును జెప్పుచున్నది కావున నిట్టి స్థలములు వాచ్య శ్లేషకే లక్ష్యము లగును. అట్లు గానిచో లోకమున నర్థద్వయ మున్న సందర్భము లన్నియు శబ్దశక్తిమూలవస్తుధ్వని కుదాహరణము లయి శ్లేషాలంకారమే యుండుటకు వీలుండదు. మఱియు 'ప్రస్తరస్థలే గ్రామే' అనుదానికి ఊయివంటియరసికు లున్నారను నర్థము సాక్షాత్తుగా శబ్దమునుబట్టి భాసిల్లుచున్నది. జారభోగము నాకాంక్షించువక్త్రినిబట్టి యాయర్థ మాక్షిప్తమగుచున్నది. కాన నీ యర్థాంతర ప్రతీతికి శబ్ద శక్తియే హేతు వనఁజాలము గదా? కావున నీయర్థాంతరము శబ్దశక్తి సిద్ధ మనుట పొరబాటు. శబ్ద శక్తి మొదటి యర్థమును జెప్పి ప్రకరణ సంగతిని గూర్చిన పిమ్మట అపహతమై పోయినది. అపుడు రెండవ యర్థము 'వక్త్రి' ని బట్టి సంభావింపఁ బడినది. కావున నిచట రెండర్థములును శబ్ద శక్తి వలన సిద్ధించినవి కావు. రెండవ యర్థము మొదటి యర్థమును బట్టియే యాక్షిప్తమైనది. కావున నది యర్థశక్తికృత మనుటయే సముచితము. ఇట్లు శబ్దశక్తిమూల వస్తుధ్వని యుండదనుట స్పష్టమైనది.

ఇఁక వివక్షితాన్యపరవాచ్యము నందలి సంలక్ష్యక్రమభేదము అర్థశక్త్యుద్భవ మగుటను పరిశీలింతము. ధ్వన్యాలోకమున దీనికి నిర్వచన మిట్లు గలదు.

"అర్థశక్త్యుద్భవ స్త్వన్యో - యత్రార్థః సంప్రకాశతే -
యస్తాత్పర్యేణ వస్త్వన్యద్వ్యనక్త్యుక్తిం వినా స్వతః" 2.23

వాచ్యార్థమువలన తాత్పర్యార్థము సిద్ధించిన పిదప శబ్దవ్యాపారాపేక్ష లేకయే యర్థాంతర ప్రతీతి కలుగు సందర్భము లర్థశక్తి మూల ధ్వని విశేషమునకు లక్ష్యములు.

ఒక్కొకయెడ నర్థశక్తిచే సంలక్ష్యక్రమమున భావము ధ్వనించుటయుఁ గలదు. భావాదిక మసం లక్ష్య క్రమముననే తోఁచు నని పూర్వమునఁ జెప్పినదానికిని, దీనికినిగల సూక్ష్మ భేదము నిట్లరయవలయును. శబ్దములచే సాక్షాత్తుగా నివేదితము లైన విభానుభావవ్యభిచారులు రసప్రతీతిని వెంటనే యొదవించుట అలక్ష్యక్రమ వ్యంగ్య ధ్వని పద్ధతి. ఇచట సాక్షాన్నివేదిత మనఁగా విభావాది బలమున వ్యభిచారులు అవ్యవ హితముగా స్ఫురించుట. ఇట్లు కాక యర్థ సామర్థ్యమున వ్యభిచారి భావ మాక్షిప్తమైనచో నది సంలక్ష్యక్రమపద్ధతికిఁ జెందిన దగును. ఉదాహరణము -

శర్మిష్ఠాదికన్యకా పరివృతయై వనకేళీకౌతుకమున నున్న దేవయాని కడకు యాదృచ్ఛికముగా యయాతి వచ్చెను. ఇంతకు మున్న దేవయాని నెఱిఁగియు 'అతిశయ

రూపలావణ్యగుణ సుందరియయిన శర్మిష్ఠ నెఱుంగవేఁడి యందఱకుల గోత్రనామంబు లెఱుంగవలఁతు' ననెను. అప్పుడు దేవయాని యిట్లనెను.

"నన్ను మున్న యెఱుఁగు; దిన్నాతి నాకు దాసి; వృషపర్వుఁ డనుమహాదానవేంద్రు
కన్య;నాయొద్ద నెప్పుడుఁగదలకుండు; ననఘ!మఱి దీని శర్మిష్ఠయండ్రు జనులు."

1.3.159

ఈ వాక్యమునందు వాచ్యార్థతాత్పర్యము ముగిసిన పిదప దానివలన దేవయానికి శర్మిష్ఠయందుఁ గల అసూయామర్షములును, సహజమైన గర్వరేఖయు నభివ్యక్తము లగుచున్నవి. నన్ను మున్న యెఱుఁగు దనుటలో నీవెఱుఁగఁగోరినది శర్మిష్ఠనే యనుసంగతి నేను గుర్తించితిని సుమా! నీ యభిప్రాయ మెఱుఁగనియమాయికురాల నని సంభావింపకు మన్న భావము ప్రతీయమాన మగును. యయాతి కులగోత్రనామము లడుగఁగా ఇన్నాతి నాకు దాసి; నా యొద్ద నెప్పుడు కదలకుండు - నని చెప్పుటలో 'ఇది తళతళలాడుచు మహాసౌందర్యవతివలె నీకుఁ గన్పట్టినను అది దాసి; దానికి స్వాతంత్ర్యము లేదు; కాన నామెపై నాశ పెట్టుకొనకుము.' అనురీతిని ఈర్ష్యాభావము స్ఫురించును. మహాదాన వేంద్రుకన్య అనుటలో 'అట్టిది నాకు దాసి యయ్యెఁ ననఁగా నా గొప్ప యెంతటిదో గమనించితివా?' యను నాత్మాభిమాన కథన తాత్పర్యము తోఁచును. 'మఱి' అనునవ్యయము నీకుఁ జెప్పవలసిన దంతయుఁ జెప్పితిని. ఇంక దీని పేరుగదా నీకుఁ గావలసినది! జనులు దీనిని శర్మిష్ఠ యందురు అనునొక విధమగు చులుకనతనము నభివ్యంజించును. ఇట్లీ పదమున దేవయానీ గర్వేర్ష్యామర్షములు అర్థశక్తిమూలమున వ్యంగ్యము లగుచున్నవి. అభిధేయ మీ భావనకు సహకరించుటచే నిది సంలక్ష్యక్రమ మగుచున్నది.

అర్థ శక్తివలన వస్తువో యలంకారమో ప్రతీయమాన మగుటలో రెండువిధములు గలవు. *(1) ప్రౌఢోక్తిసిద్ధము (2)* స్వతస్సంభవి. ఇందు మొదటిది మఱియు రెండు విధము లగుచున్నది. *ప్రౌఢోక్తి కవి దగుట*, కవినిబద్ధవక్తది యగుట యనునది యీ ద్వైవిధ్యమునకు హేతువు. సమర్పింపఁదలఁచిన యర్థమును సమర్పించుటలో నేర్పు గల ఉక్తి ప్రౌఢోక్తి. కావున నిప్పుడు మూఁడు భేదము లేర్పడుచున్నవి. *(1) కవిప్రౌఢోక్తి సిద్ధము (2) కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తి సిద్ధము (3) స్వత స్సంభవి.*

ఈ పై మూఁడు భేదములందును వస్తువుచే వస్తువు, వస్తువుచే నలంకారము, అలంకారముచే వస్తువును, అలంకారముచే అలంకారమును ప్రతీయమానములు కావచ్చును.

అందు కవిప్రౌఢోక్తి సిద్ధ వస్తుకృత వస్తుధ్వని కుదాహరణము :

"అతిశయరూపయౌవన గుణాధిక సుందర మైనయాసతీ
ద్వితయమునందు సంతతరతిన్ వివశుండయి రాజకృత్యముల్
మతి నొకనాఁడు చేయ కహిమద్యుతి తేజుఁడు రాజయక్ష్మబా
ధితుఁడయి దేవలోక సుదతీప్రియుఁ డయ్యె విచిత్రవీర్యుఁడున్. 1.4.115

అంబికాంబాలికలయందు సంతతరతిచే క్షయరోగము నొంది విచిత్ర వీర్యుఁడు మరణించిన వృత్తాంత మిందు విషయము. ఇందు మరణించె ననుటకు దేవలోక సుదతీప్రియుఁ డయ్యెననుట ప్రౌఢోక్తి. ఈ ప్రౌఢోక్తిచే విచిత్రవీర్యుని కామాతిరేకము వ్యంజితమై చచ్చినను జావని కామగుణ మాతనిఁ బట్టి పాలార్చి ప్రాణములు తీసె నను నర్థమును ప్రతీయమాన మొనరించును. మరణించె నను విషయము భంగ్యంతరముగాఁ జెప్పెను గావున కేవల మిది పర్యాయోక్తాలంకారముగా భావింపరాదు. ఇందు విచిత్రవీర్యుడు మరణించె నని చెప్పుట మాత్రమే వివక్షితము కాదు. కామాతిరేకమువలన సంభవించు భయంకరమైన పరిణామము లెట్టివో యుగ్గడించుటయే కవితాత్పర్యము. అది యీ వ్యంగ్యార్థ భావమువలనఁ జక్కగా సిద్ధించును. కావున దీనిని ప్రౌఢోక్తిగా భావించుట సమంజసము.

కవిప్రౌఢోక్తి సిద్ధ వస్తుకృతాలంకారధ్వని నరయుదము. వాచ్యార్థ సంభావనము ముగిసిన పిదప నచటి వస్తుస్థితిచే రమణీయమగు నలంకారము ప్రతీయమాన మగును. అచట వాచ్యమగు వస్తువుకంటె వ్యంగ్యమగు నలంకారము చమత్కారకమై యాస్వాదనీయ మగును. ఇట్టిస్థితి కవిప్రౌఢోక్తిచే సిద్ధమైన యెడల నట్టిదానిని కవి ప్రౌఢోక్తిసిద్ధ వస్తుకృతాలంకార ధ్వని యందురు. ఉదాహరణము -

"ఉడుగక యొండొరుం జఱచి యొక్కబలంబున దేవదానవుల్
వడిగొని వార్ధి నిట్లు దరువం దరువన్ విష ముద్భవిల్లి నల్
గడలను విస్ఫులింగములు గప్పఁగఁ బర్విన దానిఁ జెచ్చెరన్
మృడుఁడు గడంగి నట్టుకొని మ్రింగి గళంబున నిల్పెఁ బొల్పుగాన్." 1.2.15

దేవదానవులు సముద్రమును మథించిన వృత్తాంతము నందలి యీ పద్యమున విషమువలన విస్ఫులింగముల వ్యాప్తి వర్ణింపఁబడినది. 'త్రిషు స్ఫులిఙ్గోఽ గ్నికణః' అనునమర కోశవాక్యమును బట్టి స్ఫులింగమనఁగా నగ్నికణము. విస్ఫులింగ శబ్దమునకు నదియే యర్థము ఇట విస్ఫులింగ శబ్ద ప్రయోగము ప్రౌఢోక్తి. దాని వలన విషమున కగ్నితో రూపకము గాని, చెదరిపడిన విషపుబిందువులను నుపమేయము చెప్పఁబడక యుపమాన భూతమగు విస్ఫులింగములే చెప్పఁబడుటచే నతిశయోక్తి గాని ప్రతీయమాన

మగును. ఈ రెంటి ప్రతీతివలనను విషముయొక్క యప్రధృష్యత వ్యంగ్యమై శివుని యఘటనఘటనాసామర్థ్యము వక్కాణింపఁబడుచున్నది. ఇట్టి యలంకారప్రతీతి సందర్భమున కెంతయు వన్నె తెచ్చుచున్నది.

విష దాహకత్వాది లక్షణమువలన నగ్ని తాదాత్మ్యము సంభావనీయ మే కాని దాని నిట విస్ఫులింగ శబ్ద ప్రయోగము సిద్ధింపఁజేయుచున్నది కావున నిది ప్రౌఢోక్తిగా పరిగణింపఁబడినది.

కవి ప్రౌఢోక్తిచే వాచ్యమగు సలంకార విశేషముచే రమణీయ మగు వస్తువిశేషము ప్రతీయమానమగుటయుఁ గలదు. అట్టి దానిని కవి ప్రౌఢోక్తి సిద్ధాలంకార కృతవస్తు ధ్వనిగాఁ బేర్కొందురు. ఉదాహరణము :

"హరికులిశక్షతి యెఱుఁగని గురుతర పక్షముల తోడికులగిరివోలెన్
గరుడుండు గగనగతి నురు తరజవమున నరుగుదెంచి తల్లికి మ్రొక్కెన్."

1.2.41

ఈ పద్యమున గరుత్మంతునికి కులపర్వతముతో సామ్యము చెప్పఁబడినది. కాని హరికులిశక్షతి యెఱుఁగని గురుతరపక్షముల స్థితిని చెప్పుట విశేషము. లోకమున మైనాకము కాక మహేంద్రాదికులపర్వతములలో హరికులిశక్షతి యెఱుఁగనిది లేదు. అట్టిది యిట నుపమానముగా గ్రహింపబడుటచే దీనిని ప్రౌఢోక్తిగా భావింపనగును. ఈ యుపమాలంకారమువలన గరుత్మంతుఁ డింద్రునికంటె గొప్పఁవాడు. ఇంద్రునికి నప్రధృష్యుఁ డను నర్థము వ్యక్తమై భవిష్యత్కథాంశ సూచన మొనర్చు చున్నది. ఇట్టి యలంకారమువలన గరుత్మంతుని యింద్రాతిశాయి పరాక్రమవిశేషము స్ఫురించి సందర్భమునకు సముచితమై యలరుచున్నది. దాస్యమున మ్రగ్గుచున్న తల్లికిఁ దన కొడుకు కులపర్వతము వలె నున్నాఁ డన్న సామాన్యతృప్తికంటె, ఇంద్రునంతటివాని నతిక్రమించి దాస్యనిరాసపూర్వకముగా తన్నుద్ధరించు నన్నవిశేషతృప్తియే యభిలషణీయము కావున నిట వాచ్యమగు నలంకారముకంటె వ్యంగ్యమగు వస్తువే ప్రాధాన్యమును భజించుచున్నది.

కవిప్రౌఢోక్తివలన వాచ్యరూపముగా నెలకొన్న యలంకారవిశేషమువలన నలంకారాంతరము ప్రతీయమానమై చమత్కారాతిశయహేతువైన సన్నివేశము కవి ప్రౌఢోక్తి సిద్ధాలంకార కృతాలంకార ధ్వనిగా వ్యవహరింపఁబడును. ఉదాహరణము :

"ఆనారాయణ పాండవేయ గుణమాహాత్మ్యామల జ్యోత్స్న చి
త్తానందం బొనరించుచున్ జనుల కర్థాంశుప్రకాశంబుతో

మానై సాత్యవతేయ ధీవనధిజన్మశ్రీ మహాభారతా
ఖ్యానాఖ్యామృతసూతి యొప్పు నిఖిలాఘధ్వాంత విధ్వంసియై" 1.3.21

ఈ పద్యమున శ్రీ మహాభారతము చంద్రుఁడుగా, నారాయణ పాండవేయుల మహిమ జ్యోత్స్నగా, అర్థము లంశువులుగా, సాత్యవతేయుని బుద్ధి వనధిగా, అఘములు ధ్వాంతముగా నిరూపింపఁబడినవి. ఇట్టి సావయవరూపకము నుండి వ్యతిరేకాలంకారము ధ్వనించును. చంద్రుడు కాలవశమున వచ్చిన చీఁకటిని విరియించును. వస్తు ప్రకాశమును గొంతవఱ కాచరించును. నేత్రానందము కలిగించును. కాని భారతాఖ్యానచంద్రుఁడు సమస్త పాపసంహార మొనరించును. సర్వార్థముల వెలయించును. చిత్తానంద మొనరించును. ఉపమాన భూతుఁడైన చంద్రునిచే భౌతికమైన మేలు కలుగుచుండఁగా భారతచంద్రునిచే విశిష్టమైన పరమసుఖము లభించుచున్నది. ఇట్లుపమానముకంటె నుపమేయమునకు వైశిష్ట్యము స్ఫురించుటచే నిట వ్యతిరేకాలంకారము ధ్వనించును. భారత గ్రంథ వైశిష్ట్య మును వక్కాణించుటయే కవి తాత్పర్యము కావున దానికి రూపకాలంకారముకంటె వ్యతిరేకా లంకారమే ఎక్కువగా సహకరించును. ఇట్లు వ్యంగ్యమగు నలంకారమున కిట ప్రాధాన్యము సంభావింపఁదగును.

కవి ప్రౌఢోక్తి సిద్ధార్థ శక్తి మూల ధ్వని విశేషముల నాల్గింటిని చూచితిమి. కవి నిబద్ధవక్తృప్రౌఢోక్తి మూలధ్వని భేదములను పరిశీలింతము. ప్రౌఢోక్తి కవిదైననేమి? కవిని బద్ధవక్తది యైననేమి? రెండును భంగ్యంతరముగా కవివే కదా! అట్టి యెడ నీ రెండవ భేదమును జెప్పుటలో విశేషమేమి? యని యిట నొకయాక్షేపము పుట్టవచ్చును. కవినిబద్ధవక్త కవిదృష్టితో బాలప్రాయుఁడగును. వృద్ధోక్తి కంటె బాలోక్తి చమత్కార హేతు వనుదృష్టితో నీవిభాగము చేయఁబడినది. ఒక విధముగా మహాభారత మంతయు కవినిబద్ధ వక్త ఉక్తియే. కావున వైశంపాయన కథిత మంతయు కవ్యుక్తిగను తక్కిన వ్యక్తుల సంభాషణాదికమును కవినిబద్ధ వక్తల ఉక్తిగను భావించుట సముచితము. ఆ దృష్టితో ఉదాహరణము లరయుదము.

కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తి సిద్ధార్థ శక్తి మూల వస్తుకృత వస్తుధ్వని కుదాహరణము: బాల్య చాపల్యము వలన దుర్వాసుఁ డిచ్చిన మంత్రశక్తి నెఱుఁగఁగోరిన కుంతి సూర్యదేవుని బలాత్కారమునుండి తప్పించుకొనుటకై యిట్లనుచున్నది.

"బంధుమతి నైనసను ని ర్బంధము మెయి ధర్మబాహ్య పదమున - నలినీ
బాంధవ! యిటు సేయుటయును మంధరభవదీయకీర్తి మలినము గాదే"
3.7.386

ఇందు కవినిబద్ధ వక్త్రియగుకుంతి 'మంధర భవదీయకీర్తి మలినము గాదే' యనుట ప్రౌఢోక్తి. ఏలయన ప్రకృతమున కుంతికి సూర్యదేవునికీర్తి సంరక్షణ తాత్పర్యముకంటె తన శీల రక్షణ తత్పరత్వమే ప్రధానము. అట్టి యెడ నన్నిట్లు చేసినచో నీకే నష్టమని చెప్పుట ప్రౌఢోక్తి కదా! ఈ ప్రౌఢోక్తివలన 'నీవంటి లోకబాంధవుఁడు తుచ్ఛమైన శరీర సుఖమునకై స్వచ్ఛమైన కీర్తికి మలిన మాపాదించుట కూడదు. మాబోం ట్లవివేకముతో ప్రవర్తించినపుడు మీవంటి ధర్మాత్ములు సరిదిద్దవలయును గాని యిట్లు చేయుదురా? చేసినచో మీకీర్తి ప్రతిష్ఠలకు భంగము రాదా? నశ్వరదేహములు గల మే మొకవేళ కీర్త్యపకీర్తులను పరిగణింపని స్థితిలో నున్నను దేవభావము గల మీకట్టి దనుచితముగదా' అను నర్థవిశేషము వ్యంజిత మగుచు కన్యాత్వ పరిరక్షణ తాత్పర్యమునకు సహకార మొనర్చుచున్నది. 'నలినీబాంధవ!' అను సంబోధనము కూడ నీ వ్యంగ్యార్థము నకు దోహద ప్రాయము. 'నీవు సంసార సౌఖ్య మెఱుఁగనివాఁడవు కావే, నన్నేల బలవంతము చేసెదవు'? అను నర్థమిట స్ఫురించి సందర్భమునకు దీప్తి నిచ్చును.

కవినిబద్ధవక్తృ ప్రౌఢోక్తి రూపమైన వస్తు విశేషమువలన నలంకారము స్ఫురించి చమత్కారక మగుట నీ క్రింది యుదాహరణమునఁ గానవచ్చును. కీచకునివలనఁ దనపడనపాటు దలంచుకొని కుములుచున్న ద్రౌపది డెందంబుకుందు పాపం దలంచి భీముఁ డిట్లనెను :

చ్యవనుని వాంఛకు సంయాతినందన యిడుమలఁ గుడువదె యడవిలోన?
రాఘవుతోడ నరణ్యావాసము చేసి సంతాప మందదె జనకతనయ?
కుంభసంభవునకై ఘోరదుర్గముల లోపాముద్ర యలజడి పాలుకాదె?
నలునిపిఱుందఁ గానల కేఁగి దమయంతి మనుజాలు పడని యుమ్మలిక పడదె?
వారు సైరణ చేసి దుర్వారమైన నిరతిశయదుఃఖభారంబు నిస్తరించి
సౌఖ్య మొందరె? నీవు నాచందమునన యాపదల కోర్చి సంపద లనుభవింపు.
4.2.234

అత్యంత దుఃఖపూరితయైయున్న సతికి, మహాకష్టము లనుభవించినవారి చరితము నుగ్గడించి యోదార్చుట కుపయుక్తమగు నీ వాక్యసముదాయమునందు సుకన్య, జానకి, లోపాముద్ర, దమయంతి అను పతివ్రతలు పడిన కష్టములు లుగ్గడింపఁబడినవి. ఏ యొక్కటి యుదాహరించినను జాలియుండగా ననేకములఁ బేర్కొని యూఱట నొదవించు తాత్పర్య మిట ప్రౌఢమైనదిగా సంభావింపఁదగును. సుకన్యాదుల వలె నీవును తాత్కాలిక దుఃఖముల కోర్చి శాశ్వత సుఖముల ననుభవింపు మను నీ వాచ్యార్థము ముగిసిన పిదప 'నీవు సుకన్య జానకి మున్నగు పతివ్రతా శిరోమణుల కెనయైనదానవు

కావునఁ బతుల నిందింపకుము. నీపతులు కూడ సామాన్యులు కారు. చ్యవన రాఘవాగస్త్య నలమహారాజ సదృశులు, కాలాననుకూలతవలన సామాన్యులవలెఁ గన్పట్టుచున్నా రనురూపమున నుపమాలంకార మిట వ్యంగ్యమై విలసిల్లును. 'ఆచందమున' అను పదముచే నిది వాచ్యమే యనరాదు. చందమను నుపమావాచక మున్నంత మాత్రమున నలంకారము కాఁజాలదు. సాదృశ్యలక్ష్మి వాచ్యార్థము నందుకంటె వ్యంగ్యార్థమునందే రమణీయతరమై యలరుచున్నది. కావున నిది వస్తువుచే వ్యక్తమగు నలంకారమున కుదాహరణ మగును.

కవి నిబద్ధవక్తృ ప్రౌఢోక్తి సిద్ధాలంకార కృత వస్తుధ్వని కుదాహరణము :

"కాలంబైనను బోవక యీ లోకమునందు నిలువ నెవ్వరివశ; మి
ట్లేల యవివేకిజనముల పోలిక శోకానలమునఁ బొగులుచునుండన్." 7.2.327

ప్రియపుత్రుఁడగునభిమన్యుని మరణమువలనఁ గలిగిన శోకముతోఁ బొగులు చున్నసుభద్ర నూఱార్చుచుఁ గృష్ణుఁ డన్న వాక్య మియ్యది. 'అవివేకిజనముల పోలికన్' అనుపద మిందు ప్రౌఢోక్తి. నీవు వివేకవతి వని భంగ్యంతరముగాఁ జెప్పుటయే కదా వక్తృతాత్పర్యము! దీనితోఁ గూడిన శోకానల మనురూపకాలంకారమును గూడ ప్రౌఢోక్తి యందలి భాగముగాఁ బరిగణింపఁదగును. ఈ యలంకారమువలన 'అనలము స్వాశ్రయ వినాశక మైనట్లు శోకముకూడ నిన్ను మిక్కిలి క్రుంగఁదీయును. కావున వివేకము నవలంబించి శోకమును బోకార్చికొనుము. లేనిచో నది నిన్ను కాల్చివేయును సుమా'! అను నెచ్చరిక యిట వ్యక్తమగును. శోకమున కగ్ని తారూపణముకంటె నాగమిష్యమాణానర్థ పరంపరాకథనము నందే వక్తకు వివక్షకల దని సందర్భమునుబట్టి గ్రహించినచో ప్రకృతమున వాచ్యమగునలంకారము కంటెను వ్యంగ్యమగువస్తువే యధిక చమత్కారహేతు వగుననుట తెల్లమగును.

ఇట్లే కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తిసిద్ధాలంకారకృతాలంకార ధ్వని నీక్రింది యుదాహరణమునఁ జూడనగును. దుర్యోధనుని పాటునకు వగచుకృపకృతవర్మాశ్వత్థామల యవస్థ యిట్లు వర్ణింపఁబడినది.

"వారిముఖమండలములతో వారిజములు
మొగిడె; శోకతమంబుతో నిగిడెఁ దిమిర
పటలి; బహువిచారములతోఁ బరఁగఁ బొల్చె
భూతభేతాళగణములు భూపవర్య!" 9.1.13

ఈ పద్యమున ముఖమండలముతోపాటు వారిజములు మొగుడుట,

శోకతమముతోపాటు తిమిరపటలి వ్యాపించుట, బహు విచారములతోపాటు భూత భేతాళ గణములు పొల్చుట అను విధమున వాచ్యముగ సహోక్త్యలంకారము గలదు. దీనిని బట్టి వారి హృదయములలో పెల్లుబికిన దుఃఖాతిశయమువలన వారిముఖములు పద్మముల వలె జడప్రాయము లైనవి. వారి శోకము సర్వ దిగ్వ్యాపిఅయిన తమము వలె వారిని సంపూర్ణముగా ఆక్రమించెను. వారి విచారములు భూతభేతాళ గణముల వలె భయంకరములై వ్యాపించెను. అను తీఱున ఉపమాలంకారము వ్యంగ్యమగును. దీనిని బట్టి వారియుక్తాయుక్త వివేకము నశించుట, ఘోరమైనయకార్యకరణమునకు వారుద్యుక్తులగుట, భూతభేతాళముల వలె పాపభీతి లేక ప్రవర్తిల్లుట అనుభవిష్యదంశము సమర్థింపఁబడుచున్నది. ఇట్టి సమర్థనకు సహోక్తికంటె నుపమయే యెక్కువ సహకరించును. ఉపమానగతభూయోధర్మవత్త్వ ముపమేయమందుండుట సహజము గదా?

ప్రౌఢోక్తివశమున సిద్ధించుధ్వని భేదములు సోదాహరణముగ వివరింపఁబడినవి. ఉక్తి యందలి ప్రౌఢత యేమియు లేక సాధారణ వాక్యములం దౌచిత్యవశమునఁ దోఁచునర్థవిశేషములును గలవు. వాచ్యార్థము ముగిసిన పిదప నట్టి యర్థవిశేష మేదేని స్ఫురించు సన్నివేశములు స్వతస్సంభవి ధ్వనివిశేషముగలవిగా నెన్నఁబడినవి. వాని యందును, వస్తువుచే వస్తువు, వస్తువుచే నలంకారము, అలంకారముచే వస్తువు, అలంకారముచే నలంకారము స్ఫురించుట యను నాల్గు భేదములు పుట్టవచ్చును. ఉదాహరణముల నరయుదము.

స్వతస్సంభవ్యర్థశక్త్యుద్భవవస్తుకృతవస్తుధ్వని :

"కొనకొని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు; సే
కొని భరియింపు మీతని; శకుంతల సత్యము వల్కె, సాధ్వి స
ద్వినుత మహాపతివ్రత వివేకముతో, నని దివ్యవాణి దా
వినిచె ధరాధినాథునకు విస్మయ మందఁగఁ దత్సభాసదుల్." 1.4.105

అన్యు లెఱుఁగమిఁజేసి లోకాపవాద భీతి నెఱిఁగియు నెరుఁగ నని శకుంతలను తిరస్కరించు దుష్యంత మహారాజున కాకాశవాణి సత్యము నెఱిఁగించుసందర్భమునందలి యీ పద్యము వాచ్యార్థమున ప్రత్యేకమైన ప్రౌఢి యేమియు లేదు. వాచ్యార్థము ముగిసిన పిదప నౌచిత్యవశమున 'ఓ మహారాజా! నీవసత్యమాడుచున్నావు. ధరాధినాథున కిది తగదు. నీది ప్రస్తుతమున నసాధువర్తన మగును. అట్లయినచో నీవు సద్వినుతుఁడవు కాఁజాలవు. కావున నధర్మమును విడనాడి, గాంధర్వవిధిని వివాహమాడిన నీపత్నిని,

ఆమెయందు జనించినప్రియపుత్రుని స్వీకరింపుము'. అను నర్థము వ్యంజితమగును. నిండుసభలో పాలితుల సమక్షమున వాచ్యముగా రాజుదోషము నుట్టంకించుటకంటె వ్యంగ్యముగా దెలుపుట సముచితమైన పద్ధతి. దోషోద్ఘాటనము చేయుట సమీహితమే యనునంశము భరియింపు మనువిధ్యర్థక క్రియ వలనను, 'ప్రియ' అను నందన విశేషణమును బట్టియు, శకుంతలకైన విశేషణములను బట్టియు, వివేకముతో ననుపదమును బట్టియు నిరూపిత మగును. కావున నీధ్వన్యర్థము భావించుట సముచితమే.

స్వతస్సంభవ్యర్థ శక్త్యుద్భవవస్తుకృతాలంకార ధ్వని:

**"వినయమున ద్రోణురూపు మన్నున నమర్చి దాని కతిభక్తితోడఁ బ్రదక్షిణంబుఁ**
**జేసి మ్రొక్కుచు సంతతాభ్యాసశక్తి నస్త్రవిద్యారహస్యంబు లర్థిఁ బడసె."1.5.232.**

ఏకలవ్యునియస్త్ర విద్యారహస్య పరిజ్ఞానము కలిమి ఘటిల్లిన విధ మీ పద్యమున వర్ణితము. ఇం దిట్లు విద్యను బడయుట మహావిశేషవిషయము. పాఠకుని హృదయ మిట నీ వస్తువును విన్నంతనే విశ్రాంతి నొందదు. కావున భక్తిశ్రద్ధాతత్పరత్వములు గలవాఁడు సాధింపఁజాలనిది లేదన్న సామాన్యోక్తి యిట స్ఫురించి యది యీవిశేష వాక్యమును సమర్థించును. ఆ విధముగా నిందర్థాంతరన్యాసాలంకారము నిష్పన్నమగును. గురువుకడ నిరంతరము మెలఁగుచున్న రాజకుమారుల విద్యకంటెను, గురుభావనతో మాత్రమే పొందిన యేకలవ్యునివిద్య యధికతర మగుటయును నాశ్చర్యకరమైన విషయమనుట కీయలంకార స్ఫూర్తి యెంతయు సహకరించును. ఈ వాక్యమున ప్రౌఢోక్తి యేమియు లేదు. కావున నిది స్వతస్సంభవి.

స్వతస్సంభవ్యర్థ శక్త్యుద్భవాలంకార కృతవస్తుధ్వని :

**"మృదువులకుఁ జాల మృదువులు,విదితయశా! వినుము; పాండవేయులు; కడుబె**
**ట్టిదులు బెడిదంపువారికి; మదలోభిత్వములు లేవు మందున కైనన్."15.1.104**

శంబు వనువిప్రుఁడు పౌరజనములయనుమతిని ధృతరాష్ట్రునకు నివేదించు సందర్భమునందలి దీపద్యము. అతఁడు ప్రాస్తావికముగా పాండవేయుల స్వభావకీర్తనము గావించుచు పలికిన యీ పలుకులందలి 'మదలోభిత్వములు లేవు మందున కైనన్' అనువాక్యమున లోకోక్త్యలంకారము గలదు. నిజమునకు మదలోభిత్వములు మందునకు కొఱగావు. మందున కవసరమగు పదార్థ మీషత్ప్రమాణము నందున్నను జాలును. మఱియు మందున కన్నచో జనము తమ గృహమున నున్న పదార్థమును శోధించి యేకొంచెమైన సాధించుటకు యత్నింతురు. అట్లు బొత్తుగా లేని సందర్భములం దిది లోకమున వాడఁబడుచుండును. గావున లోకోక్తి 'సాధారణముగా మదలోభము లంతయో యింతయో సర్వజనులయం దుండును గాని పాండవేయులయం దవి వెదకి చూచినను

గానరావు. అట్లగుటవలన వారుత్తమోత్తమ ప్రకృతి కలవారు. అట్టివారు మాకు ప్రభువులుగా లభించిరి. మాయదృష్టము నే మని చెప్పుదుము.' ఇత్యాదిపౌర జనాభిప్రాయ మీయలంకారమువలన వ్యక్తమగును. వాచ్య రూపముకంటె వ్యంగ్యమగునీయర్థమే సందర్భమునకుఁ దగియున్నది. ఇందు ప్రౌఢోక్తియేమియు లేదు. కేవలలోకోక్తి ప్రయోగము ప్రౌఢోక్తి కాఁజాలదు. కావున నిది స్వతస్సిద్ధమగు నర్థశక్తివలన నుద్భవించు నలంకారకృత వస్తుధ్వని కుదాహరణ మగును.

స్వతస్సంభవ్యర్థ శక్తికృతాలంకార కృతాలంకారధ్వని :

పాశుపతాదిదివ్యాస్త్ర సంపాదనకై యరిగిన యర్జునుఁడెన్నఁడు వచ్చునా యని విచారముతో నిరీక్షించు చున్న ధర్మజాదులకడకు రోమశమహాముని యేతెంచి యాతని క్షేమవార్త నెఱింగించి యాతని బలపరాక్రమాదుల నభివర్ణించుచు నిట్లు పలికెను.

బలవంతులైనభీష్మా దుల నర్జునుఁ డోర్చు నూర్జితుండై, మఱి పో
రులఁ గర్ణుండు పదాఱవ కళకు సమానుండు గాఁడు కవ్వడితోడన్.3.2.296

ఈ పద్యమునందును పదాఱవకళకు సమానుఁడు కాఁడనుటయు లోకోక్తియే. చంద్రునిపదాఱవభాగమును 'కళ' యందురు. 'కలాతు షోడశో భాగః' అని యమరము. యుద్ధములందు కర్ణార్జునులకు సామ్యమే లేదని చెప్పుటకు లోకమున సాధారణముగా నిట్టి సందర్భములందు వాడఁబడుపదసముదాయము వాడఁబడినది కావున నిట లోకోక్త్యలంకారము వాచ్య రూపమునఁ గలదు. ఇందు ప్రౌఢోక్తి లేదు. ఈ యలంకారమువలన నిందర్జునునకు పూర్ణచంద్రసామ్య మభివ్యక్త మగుచున్నది. ఇట్ల భివ్యక్త మగునుపమాలంకారము ధనంజయుని పరాక్రమాతిశయమును జక్కగా నలంకరించును. కర్ణార్జునుల తారతమ్య వివక్ష కీవ్యంగ్యమగునుపమ యెంతయు సహకరించును. అంతియ కాక యాతని రాకను నిరీక్షించుచున్న ధర్మజాదుల కాతనిరాకానిశాకరత్వ సామ్యస్ఫురణము సంపూర్ణాహ్లాదకారణ మగుననుటలో విప్రతిపత్తి యుండదు. కావున నిది స్వతస్సిద్ధార్థశక్తి మూలాలంకారకృతాలంకార ధ్వనికి మేలైన యుదాహరణ మగును.

ఇట్లు సంలక్ష్యక్రమవ్యంగ్య భేదములు సోదాహరణముగా పరిశీలింపఁ బడినవి.

ఇప్పటి కేర్పడిన ధ్వని ప్రభేదముల స్వరూప మీ క్రింది విధముగా నున్నది.

**అభిధామూలము - లక్షణామూలము** - అని మొదట ధ్వని రెండు విధములగును. ఇందు మొదటి దానిని **వివక్షితాన్య పరవాచ్యమ**నియు రెండవ దానిని **అవివక్షిత వాచ్యమ**నియు వ్యవహరింతురు. ఈ యవివక్షిత వాచ్యమునందే వాచ్యార్థము

సంపూర్ణముగా విడువఁబడునెడల దానిని జహత్స్వార్థమని కాని అత్యంతతిరస్కృత వాచ్యమని కాని యందురు. వాచ్యార్థము పూర్తిగా విడువఁబడక అర్థాంతరము నందు సంక్రమింపఁజేయఁబడినచో నట్టి దానిని అజహత్స్వార్థమనియు నర్థాంతరసంక్రమిత వాచ్యమనియు వ్యవహరింతురు. ఇట్లు లక్షణా మూలక ధ్వనులు రెండు విధములు.

అభిధామూలము కూడ నసంలక్ష్యక్రమము, సంలక్ష్యక్రమము నని రెండు విధములు. అందు మొదటిది రసభావతదాభాసాదిరూపమున ననంతవిధములుగా నుండవచ్చును గావున నందవాంతరవిభాగ పరిగణనము చేయక యొక్కటిగనే లెక్కించిరి.

రెండవది శబ్దశక్త్యర్థ శక్తిమూలము లని ద్వివిధ మగుచున్నది. ఇందు రెండవ దానికి వ్యంజకమగు వాచ్యార్థము *కవి ప్రౌఢోక్తి సిద్ధము, కవినిబద్ధ వక్తృ ప్రౌఢోక్తి సిద్ధము, స్వతస్సంభవి* యని మూఁడు విధములుగా నుండును. ఈ మూఁడును వస్త్వలంకార రూపమున ద్వైవిధ్యము నొందుటచే నాఱు విధములగును. ఈ యాఱువిధములగు నర్థములును వస్త్వలంకారములను వ్యంగ్య మొనర్చును గావున వ్యంగ్యవశమున నీ సంలక్ష్యక్రమము పండ్రెండు విధము లగుచున్నది. ఇట్లు లక్షణామూల భేదములు రెండు, అభిధామూలమున నసంలక్ష్యక్రమభేద మొకటి, సంలక్ష్య క్రమమున శబ్ద శక్తి మూల మొకటి, అర్థశక్తి మూలభేదములు పండ్రెండును గలసి మొత్తము పదునాఱు భేదములు సిద్ధించుచున్నవి.

ఈ చెప్పిన పదునాఱింటిలో అసంలక్ష్యక్రమ భేదము తక్క తక్కిన పదునైదు విధములును ముందు చెప్పఁబోవుపదప్రకాశ్యము, వాక్యప్రకాశ్యము అనుభేద ద్వయమును బట్టి ముప్పది విధములగును. (15×2×30) (ప్రబంధగతముగా మఱి పండ్రెండు భేదములును సిద్ధింపఁగలవు.)

అసంలక్ష్య క్రమము వర్ణము, పదము, వాక్యము, సంఘటన, ప్రబంధము అను వ్యంజకపంచకమును బట్టి యైదు విధములుగా రూపొందును. ఇట్లిప్పటికి సిద్ధించిన ధ్వని ప్రభేదములు మొత్తము ముప్పదియైదు.

ఇంతవఱకును వ్యంగ్యస్వరూపమును బట్టి ధ్వని ప్రభేదములు వింగడింపఁ బడినవి. 'ధ్వన్యతే ఇతి ధ్వనిః' అను కర్మవ్యుత్పత్తి ననుసరించి ధ్వన్యమానములగు నర్థ విశేషములు సోదాహరణముగా వక్కాణింపఁబడినవి. ఆనందవర్ధనులు ధ్వన్యాలోక ద్వితీయోద్యోతము వఱకు ప్రతిపాదించిన విషయ మింతవఱకును సంగ్రహింపఁ బడినది.

'ధ్వనతీతి ధ్వనిః' అనెడుకర్తృవ్యుత్పత్తి ననుసరించి పైచెప్పిన విషయమే వ్యంజక సామగ్రి నిరూపణపరముగా తృతీయోద్యోతమున విస్తరించి చూపఁబడినది. కావున వ్యంజక సామగ్రి యొక్క స్వరూప స్వభావము లెట్లుండునో యిఁకముం దరయవలసి యున్నది.

ఓమ్

# భారత ధ్వని దర్శనము

## చతుర్థాధ్యాయము

## వ్యంజకము

వాచ్యార్థాతిరిక్త విలక్షణార్థాభిదాయి శబ్దాదికమునకు వ్యంజక మని పేరు. వర్ణము, పదము, వాక్యము, రచన మున్నగునవి యాదిపదగ్రాహ్యములు. వీనివలన వ్యంగ్యార్థము ప్రతీయమానమై కావ్యమునకు ధ్వనివ్యపదేశమును గలిగించును గావున నివి వ్యంజకము లగుచున్నవి. అనఁగా ధ్వన్యర్థమును వ్యంజింపఁజేయునవని తాత్పర్యము. ఆనంద వర్ధనులు తమ ధ్వన్యాలోక తృతీయోద్యోతమున నేవి యేవి యేయేసన్నివేశములలో వ్యంజకము లగునో సోదాహరణముగ నిరూపించిరి.

ప్రకృతమున ఆనందవర్ధనులు చూపిన వ్యంజకములను బట్టి సిద్ధించుధ్వని విశేషములను కవిత్రయ మహాభారతోదాహరణ సమన్వయ పురస్సరముగఁ బరిశీలింతము.

### 1. లక్షణామూలధ్వని (లేక) అవివక్షిత వాచ్యము :-

వాచ్యార్థము వివక్షితము కాక యన్యార్థమును జెప్పుటయే కవితాత్పర్యమైన సన్నివేశము లీభేదమునకుఁ జెందినవి. ఆయన్యార్థమే వ్యంగ్యార్థము. ఇందు వాచ్యార్థము బొత్తుగా పొసఁగనిచో అత్యంత తిరస్కృత వాచ్యమను భేదము సిద్ధించును. అట్లు వాచ్యార్థ మత్యంత తిరస్కృత మగుట యేదో యొక్క పదమునందు మాత్రమే గోచరించినచో నాపద మట వ్యంజకము. అనఁగా అత్యంత తిరస్కృత వాచ్యధ్వని యచట పదముచే ప్రకాశించు నని తాత్పర్యము.

"త్రేతాద్వాపరసంధి నుద్ధతమదాంధీభూత విద్వేషిజీ
మూతోగ్రశ్వసనుండు రాముఁ డలుకన్ ముయ్యేడుమాఱుల్ రణ
ప్రీతిన్ వైరిధరాతలేశ్వరులఁ జంపెం బల్మెరన్ దీర్ఘని
ర్ఘాతక్రూరకుఠారలూన విశిఖక్షత్రేరుకాంతారుఁడై." 1.1.79

అను పద్యమున నట్టిధ్వనిభేదమున కుదాహరణ మరయఁదగును. శౌనకాది మహామునులకు శమంతపంచక మననేమో సూతుఁడు వివరించు సందర్భమునందలి

దీపద్యము. ఇందలి 'అంధీభూత' అనుసమాసాంతర్గత పదము వ్యంజకము. 'గ్రుడ్డిదిగా నైన' అనువాచ్యార్థము ఈ పదమున కిట పొసఁగదు. ఏలయన విద్వేషులు నిజమునకు గ్రుడ్డివారు కాలేదు. మఱియు మదముచే కన్నుల కాంధ్య మేర్పడదు. కావున నీ పదము వాచ్యార్థ మిట మొత్తముగా తిరస్కృత మగును. 'గ్రుడ్డివారివంటి వారయిన' అను లక్ష్యార్థముచే వాక్యార్థము పొసఁగును. ఈ లక్ష్యార్థమువలన 'గ్రుడ్డివారి కెట్లు వస్తు దర్శన శక్తి నశించునో యట్లే యుద్ధతులై మదముచే పుణ్య పాపముల వివేకము నశించి అధర్మగర్తమునఁ బడినట్టి వారయిన' అను నర్థమిట స్ఫురించును. కావుననే యవతార పురుషుఁడగు పరశురాముఁడు వారిని ముయ్యేడు మాఱులు చంపుట జరిగినది. కేవల మంధులగుటవలన చంపె ననుటకంటె వివేక రహితులై వర్తించిన కతమునఁ జంపె ననుట సముచితము. కావున నీ వ్యంగ్యార్థ మిట ప్రాధాన్యమును భజించుచు ధ్వనివ్యపదేశమున కర్హమగుచున్నది.

సమాసాంతర్గత పదములకు విడిగా పదత్వమును శాస్త్ర మంగీకరించును. కావున నిది పదైకదేశము గదా యని శంకింపఁబనిలేదు. కానిచో మఱియొక యుదాహరణము.

"ఎగ్గుచేసినవారికి హితము సేఁత యార్యజనములు గీర్తింతు; రన్యదోష
కారి తనపాపమునఁ దాన కాలిపోవు; వేఱ వానికిఁ గీడు గావింపనేల?"3.5.59

ధర్మవ్యాధుఁడు కౌశికునకు ధర్మ విశేషములను జెప్పుచున్న సందర్భము నందలి దీపద్యము. 'అన్యదోషకారి తనదోషమునఁ దాన కాలిపోవు' అను నీ వాక్యమునందలి 'కాలిపోవు' ననుపదము ఇట వ్యంజకము. కాలిపోవుట యనువ్యాపార మగ్నివలన సంభవించును. ఇచట నగ్నిలేదు. కావున 'కాలిపోవు' అనుపదము వాచ్యార్థమున కిట సంగతి లేదు. కావున నశించు ననులక్ష్యార్థమిటఁ జెప్పుకొనఁ దగును. దీనివలన 'అగ్నిలో పడిన వస్తు వెట్లు నామరూపములు లేకుండ నశించునో ఇతరుల కపకారము చేయువాఁ డట్లు సంపూర్ణ వినాశము పొందును. పాప మగ్ని వంటిది. కావున దానిజోలికి పోరాదు' ఇత్యాద్యర్థవిశేష మిట ప్రతీయమాన మగును. ఈ ప్రతీతి కంతటికిని 'కాలిపోవు' ననుపదమే వ్యంజకము కావున లక్షణామూలాత్యంతతిరస్కృత వాచ్యధ్వని పదగతమై గోచరించుట కిది యుదాహరణ మగును.

అత్యంత తిరస్కృతవాచ్య ధ్వని పదమునఁ బ్రకాశించుట కుదాహరణములను చూచితిమి. అది వాక్యగతమై చూపట్టుట కుదాహరణము :

"అనిన విని పార్థునకు ని ట్లనియె నినాత్మజుఁడు; దుర్వాలాయాసక్తే
పని బంధమ్ములు పలుకక ఘననిశితాస్త్రములఁ బలుకఁగడఁగుము నాతోన్."

1.6.37

కుమారాస్త్రవిద్యాప్రదర్శనము జరుగుచుండఁగా కర్ణుని ప్రవేశ మందున్నవారికి కలవరమును గలిగించెను. ముఖ్యముగా నర్జునుఁడు అతని వాక్యౌద్ధత్యమునకు సహింపక 'అనాహూతుఁడవై సభకు వచ్చి యిష్టాలాపములాడి నరకలోకముల కరుగఁగోరెదవు; పరాత్మపరిమాణము లెఱుఁగ వోరిపలువా.' అని కర్ణుని నిందించెను. దానికి సమాధానముగా కర్ణుఁ డాడినవాక్య మియ్యది. ఇందు 'ఘననిశితాస్త్రములఁ బలుకఁగడఁగుము నాతోన్.' అను వాక్యపు వాచ్యార్థము అత్యంతము తిరస్కృత మగును. ఎవ్వరైనను నోటితో మాట్లాడుదురు గాని నిశితాస్త్రములతో మాటాడఁజాలరు. కావున - 'మాటలతోఁ బనిలేదు. అస్త్ర ప్రయోగ మొనర్పు' మను లక్ష్యార్థ మిట సంభావ్యము. ' నేను నీవలె వాక్శూరుఁ డఁగాను అస్త్ర విద్యానిపుణుఁడను. పరాత్మపరిమాణము లెఱుఁగ నని నాయస్త్రవిద్యాపాటవ మెఱుఁగకయే నీవు పలుకనేల? ఘననిశితాస్త్రములఁ బ్రయోగించినచో నీనా ప్రమాణములు లోకమునకుఁ దెలియునుగదా! నీవాక్యములలో నించుకంతయు పసలేదనుట తెల్లమే. ఇక నీయస్త్రములు ఘనములయినచో, వానియందు నిశితత్వమున్నచో ప్రయోగింపుము. చూతము అనునర్థవిశేష మిట వ్యంగ్యమగును. ప్రయోజనరూపమగు నీవ్యంగ్యార్థ ప్రతిపాదనము కొఱకే యీ లక్షణాప్రధానవాక్యము ప్రయుక్త మైనది. కావున 'ఘననిశితాస్త్రములఁ బలుకఁ గడఁగుము నాతోన్' అనువాక్య మిటవ్యంజకము.

వేఱొక యుదాహరణము :

"నహుషుండు పనుచువాఁడటె : విహితానుష్ఠానపరులు విరటె : తా లో
కహితం బటె; యిది మనకున్ మహనీయము కాక యెట్లు మానఁగవచ్చున్!"

5.1.159

"నహుషుఁడు మహేంద్రపదవీసహితుఁడు. శచి కాతని వరింపఁజనును. కావున నామెను లోకహితమగునట్లుగాఁ బుచ్చు"మని వేడినమునీంద్రులను సురలను జూచి శచీసంరక్షణతాత్పర్యమున నున్న బృహస్పతి పలికినపలుకు లియ్యవి. సందర్భమును బట్టి పొనఁగదు. పురుహూతపురోహితుఁడిట్టియువాచ్యములు వలుకఁడు. కాన నిటవ్యతిరేకలక్షణచే 'ఇది యత్యంత మనుచితము, మనము తప్పక మానవలయు' ననునర్థము సిద్ధించును. దీనినిబట్టి 'మహేంద్రపదస్థితుఁడైనంతమాత్రమున వివేకరహితుఁ డు గొప్పవాఁడు కాఁబోఁడు. అట్టివానియాజ్ఞను మీరు అనుష్ఠింపనేల ? వాఁడు పంపుటయు మీరు వచ్చుటయు జరిగినను నేను శచిని పంపుటమాత్రము జరుగదు. ఈ యసహ్యకృత్యము మానుఁడు.' ఇత్యాద్యర్థ మిట వ్యంగ్యమగును. ఈయర్థమునకు 'అటె' అనునవ్యయము సహకారక మగును. ఇట్లీపద్యమున తుదివాక్యము వ్యంజకము.

అవివక్షితవాచ్యము రెండవభేద మర్థాంతరసంక్రమితవాచ్యము. అదియును పదగతము వాక్యగతము నని రెండువిధములుగా నుండును. వాక్యము నందలిపద మొక్కటియే వ్యంజకమైనచో నట్టిది పదగతార్థాంతరసంక్రమితవాచ్యధ్వని యనఁబడును. ఉదాహరణము :

"నీవు మాచుట్టమవపోలె నెమ్మితోడ నవహితుండవై మాపల్కు లాదరించి;
ఆజరత్కారుఁగని చెప్పవయ్య - వాని నెఱుఁగుదేని - మాపడియెడునీయవస్థ."

1.2.145

ఉత్తమగతులు లేక "వీరణతృణస్తంబంబు నవలంబించి తల్క్రిందై యాదిత్య కిరణంబుల యాహారంబుగా వ్రేలుచున్న" జరత్కారుని పితృదేవత లాతనిఁ గని తమయవస్థను దెలిపి పైవిధముగాఁ బలికిరి. ఆతఁడే జరత్కారుఁ డని తెలియక వారిట్లనిరి. ఇందలి 'ఆజరత్కారు' 'మాపడియెడు', 'ఈయవస్థ' అనుచోటులందు ఆ-మా-ఈ-అను సర్వనామపదములు వ్యంజకములు. వీనియర్థ మర్థాంతరసంక్రమిత మగుచున్నది. 'ఏజరత్కారుఁడు వివాహము చేసికొననొల్లక తనపితృదేవతల నధమలోకములఁ బట్టించుచున్నాఁడో యాజరత్కారునిఁ గని, అతనివలన నుత్తమగతు లందవలసి, యిందక కుందడు మేము పడియెడు ఈ భయంకరమైన ఘోరావస్థను గూర్చి చెప్పుమా!' అనురూపమున నీసర్వనామము లర్థాంతర సంక్రమితము లై సార్థక్యము నొందుచున్నవి. మాచుట్టమవపోలె, మాపల్కులు, మాపడియెడు అనుతిఱున త్రిరావృత్తమైన యీయస్మదర్థకసర్వనామ మీయర్థప్రతీతి కుపోద్బలకముగా నున్నది.

వేఱొక యుదాహరణము :

"నీప్రియభర్తల నిర్మలచరితులఁ బ్రకటతేజుల లోకపాలనిభులఁ
బార్థుల నేవొకభంగిన వదలక చెలువ యెబ్బంగి భజింతు తగిలి,
యొక్కరొక్కరికంటె నువిద నీ కేవురు ననురక్తులగుట యత్యద్భుతంబు;
నగుమొగంబుల కాని నలినాక్షి నీదెసఁ బతులకుఁ గింకిరిపాటు లేదు;
వ్రతము పెంపొ - మంత్రౌషధవైభవంబొ- సరసనై పథ్యకర్మకౌశలమొ-చతుర విభ్రమోల్లాసరేఖయో - వెలఁది! నీవి శేషసౌభాగ్య హేతువు; సెపుమ నాకు."

3.5.291

అరణ్యవాసముచేయుచున్న పాండవేయులఁ జూడవచ్చిన కృష్ణునితో కూడి యేతెంచినసత్యభామ యేకాంతమున ద్రౌపదితో నాడిన యీవాక్యసముదాయము నందలి 'నాకు' అనుపదమునకు వాచ్యముగా ప్రత్యేకప్రయోజన మేమియు లేదు. 'చెపుమ!'

అని ప్రార్థించినచో తనకు చెప్పవలయు ననియే తాత్పర్యము. ఇట్లు దీనియర్థ మవివక్షిత మగుచున్నది. కావున దీనియర్థ మర్థాంతరమున సంక్రమిత మైనచో దీనికి సార్థక్య మేర్పడును. పైసీసపద్యమున వర్ణింపఁబడినసౌభాగ్యము వంటిసౌభాగ్యమును సంపూర్ణము గాఁ బొందజాలక, యట్టిది పొందవలయు ననుకోరికతో నున్ననాకు - అనునర్థాంతర మిచట వ్యంగ్యముగా నేర్పడును. ఆయర్థాంతరముతోఁ గూడినపు డీపదమునకు సార్థక్య మేర్పడును. కావున నిట 'నాకు' అను పదము అర్థాంతరసంక్రమితవాచ్యధ్వనికి వ్యంజకము. సత్యభామ తన కట్టి సౌభాగ్యము లేదనుకొన్నదనుట సముచితమా ? యని శంకింపఁ బనిలేదు. తఱువాతి పద్య మీయర్థమును నిరూపించుచునే యున్నది.

"ఏనును నీవలన నిజము గా నిది యంతయును నెఱిఁగి కమలదళాక్షుం
బూని వశగతునిఁ జేసి య నూనస్నేహానుభావయుక్తిఁ దలిర్తున్." 3.5.292.

ఈపద్యార్థమువలన సత్యభామ ద్రౌపదీసౌభాగ్యమువంటిది తనకు లేదని మనస్సున భావించిన దనుట ఉక్తప్రాయమేకదా !

అవివక్షితవాచ్యధ్వనిలోనియర్థాంతరసంక్రమితవాచ్యము పదప్రకాశ్య మగుట నుదాహరణముఖమున నరసితిమి. ఇంక నిది వాక్యగత మగుట కుదాహరణములను పరిశీలింతము.

వసిష్ఠవామదేవ వాలఖిల్యభృగునారద సదృశులైన మహామునులు కానవచ్చి తన్నుం జూచి 'యవ్వా ! నీవెవ్వరిదాన వివ్వనదేవతవో, దేవభామినివో, దివ్యంబైన తేజంబుతో నేల ప్రుమ్మరియెద' వనిన వారలకు దమయంతి !

"వినుఁ డేఁ బుణ్యశ్లోకుం డనఁగ సదాయజ్ఞనిరతుఁ డనఁగ ధరిత్రిం
దనరిననలుభార్యను; స జ్జననుత దమయంతి యన నెసంగినదానన్."3.2.99

అని సమాధానము చెప్పెను. ఇచట మును లడిగినప్రశ్నకు చెప్పవలసిన సమాధానము నలమహారాజభార్యను, దమయంతియనుదాన ననునంత మాత్రమే. తక్కినపదములతోఁ గూడిన వాక్యమంతటికిని వాచ్యార్థము ప్రత్యేక ప్రయోజనము గలదికాదు. నాభర్త అసాధారణుఁడు, నే నట్టిమహాపురుషునిభార్యను, ఈవిషయము నాదరపూర్వకముగా నాలకింపుఁ డనునర్థమున వినుఁ డనుపదము వాచ్యార్థము సంక్రమిత మగును. 'ఏన్' అనుపదము తనయప్పటి శోచనీయస్థితిని వ్యంజించును. 'పుణ్యశ్లోకుఁ డనఁగ, సదాయజ్ఞనిరతుఁ డనఁగ ధరిత్రిం దనరిన' అను విశేషణముచే నామహానుభావుఁడు మీయట్టి మహర్షులయనుగ్రహ విశేషమునకు యోగ్యుఁడు సుమా! అను నర్థము ప్రతీయమానమై దానితో నన్వయించును. 'ధరిత్రిం దనరిన' అను వాక్యభాగముచే నాపతి

ప్రశస్తి కెక్కినకీర్తి ప్రతిష్ఠలు గల వాఁడే కాని సాధారణుడు కాఁడనునర్థము స్ఫురించును. 'సజ్జననుతన్' అను పదము మీవంటి యోగ్యతముల ఆదరమునకు పాత్రమైన సత్స్వభావము గలదాన ననునర్థమున పర్యవసించును. 'దమయంతి యన నెసంగినదానన్' అనుటచే నాయందు వనదేవతాదిభావము నుజ్జగింపుఁడు. మర్త్యకాంతనే కావున నాయందనుగ్రహము నింపుఁడను నర్థము వ్యక్తమగును. 'భార్యను' అనుపదమునకుఁ గల యౌగికార్థముచే నేనాతనిచే భరింపబడఁదగినదాననే యైనను ప్రకృతమున కర్మవశమున దూరీకరింపఁ బడితిని. నాభార్యాత్వ మాతనియందు సుప్రతిష్ఠిత మగునట్లాశీర్వదింపుఁడను ప్రార్థన ప్రతీయమానమగును. మునులడిగిన ప్రశ్నమునకు కావలసినదానికంటె నధికమైన సమాధాన మొసఁగుటలో నిట్టిట్టి యర్థము వారికిఁ దోఁపవలయు నను తాత్పర్యము దమయంతి కుండెనని తలఁచుట అప్రస్తుతము కాదు. ఇట్లీ వాక్యము వాచ్యార్థమంతయు నర్థాంతర సంక్రమితమై విశేషార్థాభిదాయక మగుచున్నది. ఇట్టి యర్థ ప్రతీతి కీపద్యము నందలి యేదో యొక్క పదము కాక వాక్య మంతయు వ్యంజకమగుటచే నిది వాక్యగతార్థాంతర సంక్రమిత వాచ్యధ్వనికి మంచి యుదాహరణము.

ఈ క్రింది ఆంధ్ర మహాభారతోద్యోగపర్వపద్యమును శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులుగారు తమ ఆంధ్రధ్వన్యాలోకమున నీధ్వని భేదమున కుదాహరించి యిట్లు వివరించిరి :

**"లేరిచట మగలు నీకును; వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్;**
**వారిజలోచన ; నీపైఁ గూరిమిగలమగని వెదకికొను మొరు; ననఁడే?"5.1.350**

"ఇది శ్రీకృష్ణుని వాక్యము. జూదమునాటికర్ణుని మాటలను గుర్తించిన శ్రీకృష్ణుని యుద్ఘాటనము. మగలు అనునది రక్షణసామర్థ్యము, ప్రేమయు గలపతులు అని వ్యంగ్య మొనర్చును. 'విడుచుట' ఇట రక్షింపలేకపోవుట రూపమున వ్యంగ్యమగును.

'నిన్నున్' అనునది కూడ 'ఒయ్యారంపుగనివి' అనురూపమున పరిణతార్థకము. ఈ ధ్వని కవకాశమొసంగునది 'వారిజలోచన' అను పదము. 'నీపైకూరిమిగల మగఁడు అనునది కూడ నిట్లు వ్యంగ్య మొనర్చును. పాపము నీవు వారిని ప్రేమించితివి కాని వారికి నీయందు ప్రేమ లేదు. అందును గూడ నిను రక్షింపక విడిచిరి. ఇపుడు నీయం దత్యంతానురాగము గలిగి నిన్ను రక్షించు సామర్థ్యము గలమగనిని' అని 'ఒరున్' అనుపదము 'పాండవులయంతటి బలపరాక్రమాది సంపన్నుఁడ నగునన్ను' అను స్వరూపముతో నితరుని బోధించును. 'వెదకికొనుము' అను పదమువలన నిట్లు వ్యంగ్యమగును. 'ఇది వఱలో నీ స్వయంవరసమయమున రాజు లెల్లరు విల్లెక్కు పెట్టజాలక

యుండఁగా నేను విల్లెక్కుపెట్టి బాణము సంధింపఁబోవునంతలో 'నాహంవరయామి సూతమ్' అని నిషేధించి యుంటివి. ఇపుడు, ఆ నాడు నీవు వరించిన వారందఱు నిట్లయినారు. ప్రకృతమున నీయున్న యందఱిలో పాండవుల ప్రతిఘటింపఁజాలిన శౌర్య ధైర్య పరాక్రమాదులు కలిగి నిన్ను రక్షింపఁగలవాఁడెవడో - అట్టి వాఁడను నేనగుదునో కాదో - నీయంతటనీవే జాగ్రత్తగా పరిశీలించుము.' అను పరిశీలనారూపమగు నన్వేషమును బోధించును. ఇట క్రియలోని 'కొను' అను ఆత్మనేపద ప్రత్యయము కూడ వ్యంజకమే. ఇట్టి వాక్యమంతయు నర్థాంతర సంక్రమిత వాచ్యధ్వనియే. ఇట్టి విశిష్టార్థ మిచట వ్యంగ్య మగును గనుకనే, కర్ణుని యీమాటను గుఱించి యర్జునునకుఁ జాలమాత్సర్యము కలిగినది. ఈ విషయము తఱువాతి - 'నరునకు నది వాఙ్మయమగుశరమై హృదయమున నాటి' అను శ్రీకృష్ణునివాక్యము స్పష్టపఱచును."- (ఆంధ్రధ్వన్యాలోకము పు. 322, 323)

ఇంకను పైపద్యమునందలి కొన్ని పదములు చక్కనివ్యంగ్యార్థములందు పరిణతము లగును. 'ఇచట' అనుమాటచే 'ఈయెదురుగా నీకుఁ గనఁబడుచున్న పాండవులు వినుచుండఁగా పలుకుచున్నాను గావున దీనికి వారి యంగీకార మున్నట్లే భావింపు' మనునర్థము ప్రతీయమానమగును. 'వారిజలోచన!' అనునంబోధనము 'ఇంతవఱకు దుఃఖించి నీకనులు కాంతి హీనములై యున్నవి. ఇటుపై నిట్టి నిష్ప్రయోజకులతో నీవు దుఃఖపడ నవసరము లేదు. కావున నీ కన్నులు పద్మములవల విలసిల్లును గాక!' యనునర్థమున పర్యవసించును. మగలు, మగని యనుపదములందలి వచన భేదము, 'లోకమున పడఁతి కొక్క పతియే యుండుట భావ్యము కాని యిందఱు భర్తలుండుటేమి? కావున నొక్క భర్తనే యెన్నుకొనుము' అను నర్థమును ప్రతీయమాన మొనర్చును. ఇట్టి పదమున ప్రతిపదము రమణీయమగునర్థాంతరము నందు పరిణత మగుచు చమత్కారము నొదవించుచు వాఙ్మయమగు శరమగుటకు మరింత పదును పెట్టుచున్నది.

ఇట్టిద మఱియొక యుదాహరణము :

ధర్మరాజు సకలబంధువధ యొనర్చి పశ్చాత్తాపపరితప్తుఁడై, తన్ను సింహాసన మెక్కుమని యొత్తిడిచేయుచున్న యర్జునునితో నిట్లు పలికెను :

"సేమపుఁదెరువొక్కటిగల; దే మెచ్చితి; దాని నడుగు మెయ్యది యని సు
త్రామసుత! యడుగకున్నను నేమి! వినుము; చెప్పదను మునీంద్రుల కక్కన్."

12.1.57

ధర్మరాజు తానేదో చెప్పఁదలచుకొనెను. దానికి ముందు మాటగా నీవాక్యము లాడెను. ఈ పద్యము లేకున్నను సందర్భమున కెట్టి లోపమును లేదు. అట్లు ప్రయోజన రాహిత్య రూపమున నిది యవివక్షిత వాచ్యమగుచున్నది. కాని యిందలి వాచ్యార్థ మంతయు పరమరమణీయమగు వ్యంగ్యార్థమునందు సంక్రమితమై యొప్పుచున్నది.

'సేమపుఁదెరువొక్కటి కలదు' అనుటలో నీవు చెప్పునది క్షేమమార్గము కాదనునర్థము వ్యంగ్యము. ఒక్కటి యనుటచే నాయూహించు మార్గముతోపాటు నీవు చెప్పు రాజ్యస్వీకారము కూడ క్షేమపుమార్గ మందువేమో! కాదు నామార్గమునకు వికల్పము లేదు సుమా! అనునర్థము వ్యంగ్యము. 'ఏ మెచ్చితిన్' అనుటవలన నీవు చెప్పు మార్గము కంటె నా మార్గమున సుఖ మధికము గలదు గావుననే నేను మెచ్చితి నను ప్రతీతి కలదు. మఱియు నీ మార్గమును నేను మెచ్చలేదు. దాని యందు నేనెట్లు ప్రవర్తింతు నన్న అభిప్రాయము కూడ నిందభివ్యక్తమగును. తాను జెప్పఁగోరిన యర్థమును జెప్పక 'దాని నడుగు మెయ్యది యని' అనుటలో అది పరమోత్తమమైన ధర్మమార్గము. అట్టిదాని నడుగకయే చెప్పుట ధర్మేతరము. "నాపృష్టః కస్యచిద్బ్రూయాత్" అను ధర్మ శాస్త్రమునకు విరుద్ధము. కావున 'నడుగు' మనుచోదన మిట వ్యంగ్యము. 'అడుగుము, ఎయ్యది', అనుపదముల వలన నాదరాతిశయముతో నడుగవలయు ననునర్థము స్ఫురించును. లేదా స్వబుద్ధితో నాలోచించువివేకములేనివాఁడు బుద్ధిమంతుల నడిగియైన తెలిసికొనవలయును సుమా! అనులోక మర్యాద నుగ్గడించుతాత్పర్యమైన నిందభివ్యక్తమగును. 'సుత్రామసుత!' అను సంబోధనమువలన దేవేంద్రు డంతటివానిపుత్రుడను నాకు తెలియని విషయముండునా? యని గర్వింపకు మన్న యొచ్చరిక తోఁచును. 'అడుగకున్ననునేమి?' అనుటచేత నేను జెప్పఁబోవు విషయము నీకును నాకును హితకరము కావున "ఎఱిఁగెడువారికి నైనను గఱపక తక్క రుచిత ప్రకారము శుభముం గొఱలుహితు" లను న్యాయమున నీవడుగకున్నను జెప్పెదను విను మనునర్థము స్ఫురించును. మఱియు నీకుఁ జెప్పుట నామేలునకే, ఎట్లన నేను జెప్పునది విన్నచో నన్ను సింహాసన మెక్కుమని యొత్తిడిచేయవు. అదియే నా కోరిక. దానిని తీర్చుకొనుటకై నీ వడుగకున్న నేమి చెప్పెదను వినుము అను నర్థము కూడ సిద్ధించును. వినుము అను విధ్యర్థక క్రియ వినక తప్పదను నంశమును జెప్పుటలో పర్యవసించును. 'చెప్పెదను' అను క్రియ కథనమునందు తన నిశ్చయమును వక్కాణించును. "మునీంద్రుల కెక్కన్" అను పదములవలన నిది నీకును నాకును మాత్రమే కాదు. సర్వేంద్రియ సుఖ వివర్జనము గావించి యాత్మసాక్షాత్కారమునకై

యతించుమునులకు, చాలమందికి, అందును శ్రేష్ఠులకు - ఎక్కునట్లుగా చెప్పుదును. అట్టివారికి రుచించు మార్గము నీకేల త్యాజ్యమగును? కావున నీ వవధానబుద్ధివై వినవలయును సుమా! అను నర్థము వ్యక్త మగును. ఇట్లీ పద్యమునందలి వాక్యముల వాచ్యార్థ మంతయు సుందరనిగూఢాభిప్రాయకథనమునందుఁ బరిణతమై సహృదయ హృదయమున కధిక చమత్కారక మగుచున్నది.

ఇ ట్లవివక్షిత వాచ్యధ్వని ప్రభేదములు రెంటికిని పదము, వాక్యము అనునవి వ్యంజకము లగుటను సప్రమాణముగ పరిశీలించితిమి.

## 2. సంలక్ష్యక్రమ వ్యంగ్యము :

వివక్షితాన్య పరవాచ్యాపరనామకాభిధామూల ధ్వని ప్రభేదమగు నసంలక్ష్యక్రమ వ్యంగ్యము ముందు సవిస్తరముగా నిరూపింపఁబడనున్నది. రెండవ దగుసంలక్ష్య క్రమ వ్యంగ్యమునకు వ్యంజకము లెట్లుండునో యిట నరయుదము. సంలక్ష్యక్రమమునే యనురణనవ్యంగ్యము లేక అనుస్వానోపమవ్యంగ్యము అనునామాంతరములతో వ్యవహరింతురనియు, శబ్ద శక్తి మూలము, నర్థ శక్తి మూలము నని దీనికి రెండు భేదములు గల వనియు పూర్వము చెప్పఁబడినది. ఈ రెండు భేదములును పదముచేతను, వాక్యముచేతను నేర్పడుట గలదు. అందు శబ్దశక్తి మూలమగు సంలక్ష్యక్రమవ్యంగ్యము పదముచే నేర్పడువిధానము నీక్రింది యుదాహరణమున నరయఁదగును :

"ప్రక్షీణదర్పు ద్రుపదు ర థాక్షముతోఁ గట్టి తెచ్చి యర్జునుఁడు క్రియా
దక్షుండయి గురునకు గురు దక్షిణగా నిచ్చి చెసెఁ దత్సమ్మదమున్." 1.3.88

ఇందలి 'గురుదక్షిణ' అనుపదము శబ్దశక్తి మూలానురణనవ్యంగ్యమునకు వ్యంజకము. గురువు కొఱకై దక్షిణ యనుసామాన్యార్థముతో పాటు గురువైన దక్షిణ యనుమఱియొక యర్థము కూడ ననుసంధించుకొనుట కవకాశము గలదు. అపుడర్జునుఁడు గురునకు గురువైన దక్షిణ నొసంగె నను నర్థ మేర్పడును. ఈ ధ్వని నిట నూహించుటకు 'గురునకు' అనుశబ్దము సహకరించును.

మఱియు శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు గారు తమ ఆంధ్రధ్వన్యాలోకమున నీక్రింది భారత పద్యమును శబ్ద శక్తి మూలకానురణన ధ్వని కుదాహరించిరి :

"ధరుణీ రాజ్యసంపదమదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరుదేశమున నుండఁగఁ బిల్చిన యిద్దురాత్ము దు
ర్వారమదీయబాహుపరివర్తిత చండగదాభిఘాతభ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్." 2.2.249

దీనికి వారిట్లు వివరణము వ్రాసిరి. "ఇచట 'రంభోరు' అనునది దుర్యోధనుని తొడలకు విశేషణముగా వాడఁబడినను అనురణనశక్తిచే ద్రౌపదియం దన్వితార్థము కాఁ గలదు. ఇట్టి ధ్వని కవకాశ మొసఁగుటకే 'కోమలి' అని యుపయోగింపఁబడెనని తెలియునది" (ఆం. ధ్వ. పు. 323)

ఈ యభిప్రాయ మొకింత విమర్శనీయము. ఇచట రంభోరుపదము దుర్యోధనుని తొడలకు విశేషణముగా వాడఁబడిన దనుట ప్రామాదికము. అపక్షమున రంభల వలె ఉరువులైన తన ఊరువుల ప్రదేశమునందే అనునర్థమును దీనికి భావింపవలయును. ఈ యర్థ మిట సముచితము గాదు. ఇచట వక్తయగు భీముఁడు దుర్యోధనునికి ఆబాల్యశత్రువు. ఇప్పు డాదుర్యోధనుఁడు తనకు మఱియు నపకృతి గావించెను. దానికి పట్టరానికోపము వహించి వలుకుచున్న భీముఁడు, ఆతని ఊరుభంగము గావించుటకు ప్రతిజ్ఞను బూనుచున్న భీముఁడాతనివి రంభోరువులనునా? రంభోరుశబ్ద మిట సౌందర్యపరముగాఁ కాక సుచ్ఛేద్యతాపరముగా వాడఁబడిన దని చెప్పుటకు లోకరూఢి లేదు. మరియు 'భగ్నోరుతరోరుఁజేయుదు' ననుచోటి ఉరుతరశబ్దము కూడ నుచ్ఛేద్యములను నర్థమున వాడఁబడిన దనునభిప్రాయమును సమర్థింపదు. కావున నీరంభోరుశబ్దము సుయోధనోరుపరముగా వాడఁబడ లేదనుటయే సముచితము. అది ద్రౌపదికే విశేషణము. పాపము కోమలిని, కృష్ణను, రంభోరువును తన నీచమైన ఊరుదేశమునఁ గూర్చుండవలసినదిగా ఈపాపాత్ముఁడు పిలిచెను. గావున వీనియూరువుల భంజింతునని భీముఁడనె ననుటయే సందర్భోచితము. విశేష్యమును బ్రయోగించిన పిమ్మట (చూచియను క్త్వార్థక క్రియావ్యవధానమున) విశేషణమును వాడుట కలదా? యని శంకింపఁ బనిలేదు. నన్నయ పద్యరచనలో నిట్టివి చాల కలవు. మచ్చున కొక్కటి:

**"అవనరతార్థ దానయజనాభిరతున్ భరతాన్వయాభివ**
**ర్ధను సకలప్రజాహిత విధాను ధనంజయసన్నిభున్ భవ**
**జ్జనకుఁ బరీక్షితున్ భుజగజాల్కు డనహ్యవిషోగ్రధూమకే**
**తనహతిఁ జేసి చేసె నతిదాంతుఁ గృతాంతనికేతనాతిథిన్." 1.1.123**

ఇందు 'కృతాంతనికేతనాతిథిన్' అనునది విధేయవిశేషణమనుకొన్నను, 'అతిదాంతున్' అనునది యట్టిది కాదుకదా! కావున రంభోరుశబ్దము ద్వితీయా విభక్త్యంతపదము, ద్రౌపదీవిశేషణ మనుటయే యుక్తము. అప్పుడిది శబ్దశక్తిమూల ధ్వని కుదాహరణము కాఁజాలదు.

ఈ క్రింది పద్యమును పరిశీలింతము.

"కురుకులజుండు; పాండునకుఁ గుంతికిఁ బుత్రుడు; రాజధర్మబం
ధురచరితుండు; నీ వితనితోడ రణంబొనరించె దేని వి
స్తరముగ నీదువంశమును దల్లిని దండ్రిని జెప్పు; చెప్పినన్
దొరయగుదేని నీ కెదిరి దోర్బలశక్తి నితండు చూపెడిన్." 1.6.45

కుమారాస్త్రవిద్యాప్రదర్శన సందర్భమున కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము తీవ్రరూపము ధరించు నని శంకించి వారింపనెంచి 'ధర్మవిదుండును నఖిలద్వంద్వయుద్ధ సమాచార నిపుణుఁడు' నగుకృపాచార్యుఁడు కర్ణునితో నన్నమాట యిది. ఇందు దొరయను శబ్దమున కుద్దిష్టార్థము రాజు, ప్రభువు, క్షత్రియ వంశజాతుఁడు అనునీతీఱుగా సంభావ్యమే యైనను అంతమాత్రము చాలదు. నీ వితనితో సమానుఁడ వైనచో నప్పుడీతఁడు నీతో యుద్ధము చేయును అనునర్థము కూడ ప్రతీయమాన మగును. కేవలము ప్రభువు అనునర్థమును మాత్రమే స్వీకరించుట యిట వివక్షితము కాదు. ఏలయన అర్జునునికి విశేషణమైన రాజధర్మబంధురచరితుండు అనునది కేవల ప్రభువైనచో చాలదనియు తెలుపుచున్నది. అంతియ కాక 'వివాహశ్చ వివాదశ్చ సమయో రేవ శోభతే' అనున్యాయ మును బట్టియు నిటసామ్యమే కవి వివక్షిత మన నొప్పును. కావున కృపాచార్యునితలంపుతో 'దొరవును సముఁడవునైనచో' అనుశ్లేషార్థము గలదనుట స్పష్టము. కాని దుర్యోధనుఁడు మొదటి యర్థమును మాత్రమే గ్రహించి 'దొర' కాదంటివి కదా! చూడు మిదిగో 'దొరగా' చేయుచున్నానని కర్ణున కంగరాజ్యమిచ్చి పాలనాధికారముగల ప్రభువుగాఁ జేసెను. అర్జునునితో నపేక్షితమైన సామ్యములో నేకదేశమగు నీపనికంటె వేఱేమియు దుర్యోధనుఁ డు చేయఁజాలఁడు కదా! ఇట్లు చేయుటలో కృపాచార్యుని వాక్యమునకు వక్రభాష్యము చెప్పినట్లయినది. ఎట్లన కృపుఁడు మొదట అర్జునుని వంశమును, తల్లిని దండ్రిని పేర్కొని, యాతఁడాచరించు ధర్మమును వచించి యాతని క్షత్రియత్వమును, జన్మకర్మముల ద్వారమున సిద్ధించినదానిని నిరూపించెను. పిదప నీదు వంశమును, తల్లి దండ్రులను చెప్పుము; చెప్పినచో 'దొరయగుదేని' నీకెదిరి దోర్బలశక్తి నితండు చూపెడి నని పలికెను. కృపుడు వాంఛించినది యేదియో స్పష్టముగా తెలియుచునే యున్నది కదా! కాని కర్ణుఁ డు తనకులంబును దలిదండ్రులను జెప్ప సిగ్గుపడి తలవంచి కొనియుండెను. ఇట్టి స్థితిలో దుర్యోధనుఁ డంగరాజ్యమిచ్చి యతనికి దొరతనము కలుగఁజేసి యతడు తనకులనామమును తలిదండ్రుల నామములను జెప్ప నక్కఱలేకుండఁజేసెను. ఈ విచారణమును బట్టి ప్రకృతమున దొర యను శబ్దమునకు కృపాచార్యసుయోధనులు

భిన్నార్థకల్పనము చేసికొని రనుట యుక్తము. ఇట్టి భిన్నార్థకల్పన మిట నవశ్యము భావింపఁ దగినదే యగుచున్నది. దీనివలన సామాన్య జనుఁ డుత్తమ క్షత్రియునితోఁ బోరాడఁ జాలఁ డనుసామాన్య వాక్యమొకటి స్ఫురించి యర్థాంతరన్యాసాలంకారము ధ్వనించును. ఇది 'దొర' యనుశబ్దము యొక్క అర్థ ద్వయ ప్రతిపాదన శక్తి వలన వచ్చిన దగుటచే శబ్ద శక్తి మూల ధ్వనికిది యుదాహరణము. దొరయను శబ్దము మొదట ప్రభువనునర్థమును అభిధాశక్తిచే నొసంగి పిదప సమానుఁడను నర్థమును కూర్చునని తాత్పర్యము.

శబ్దశక్తిమూలధ్వని వాక్య ప్రకాశ మగుట కీక్రింది వచనభాగము ధ్వన్యాలోకమున నుదాహరింపఁబడినది.

"వృత్తేస్మిన్ మహాప్రళయే ధరణీ ధారణాయాధునా త్వం శేషః" హర్ష చరితమునందలి సింహనాదుని వాక్యములలోని దీ భాగము. 'ఈ మహాప్రళయము జరుగగా నీవు ధరణీ ధారణమునకై శేషుఁడ వైతివి' అనునీ వాక్యమందు 'తండ్రి యగు రాజ్యవర్ధనుడు, , జ్యేష్ఠ భ్రాతయగు రాజ్యవర్ధనుఁడును చనిపోవుట యను మహా ప్రళయము (మహ + అప్రళయము=ఉత్సవవినాశము) జరుగగా రాజ్య భారమును వహించుటకు నీవు శేషుఁడవై (మిగిలినవాఁడవై) యున్నావు అనునది ప్రాకరణికార్థము. దీనితోపాటు కల్పాంతము కాఁగా భూమిని దాల్చుటకు నివే ఆదిశేషుఁడవై యున్నా వను నర్థాంతరము కూడ సిద్ధించుచున్నది. దానివలన భూభారవహనమున నీవు ఆది శేష సదృశుఁడ వనునలంకారము వ్యజ్యమానమగుచున్నది. ఇం దీయర్థాంతరప్రతీతికి వాక్యమంతయు వ్యంజకముగా నున్నది కావున నిది వాక్యగత శబ్దశక్తి మూలానురణనవ్యంగ్యమున కుదాహరణ మగుచున్నది.

**అర్థశక్త్యుద్భవధ్వని :-**

ఇఁక క్రమానుసారము అర్థశక్తి మూలధ్వనుల వ్యంజకములు పరిశీలింపఁ బడుచున్నవి. అర్థశక్తి మూలధ్వని ప్రౌఢోక్తిసిద్ధ మనియు, స్వతస్సంభవి యనియు రెండు విధములుగా నుండుననియు, నందు ప్రౌఢోక్తి కవిదియో కవినిబద్ధవక్తదియో యగు ననియు పూర్వము చెప్పఁబడినది. ఈ మూఁడు భేదములును పదము నందును, వాక్యము నందును జూపట్టుటను బట్టి యాఱు విధములగును. వీనికి వ్యంజకము లెట్లుండునో యుదాహరణ సమన్వయ పూర్వకముగా పరిశీలింపఁబడుచున్నది.

పదప్రకాశమగునర్థ శక్తి మూలకవిప్రౌఢోక్తి సిద్ధవస్తుధ్వని.

కీచకోపకీచకుల వధానంతరము ప్రభాతమైన సందర్భమున తిక్కనాచార్యుని ప్రౌఢోక్తి.

"అంతం గుంతీనందన కాంతాచింతామహాంధకారముతో న
త్యంతంబు మచ్చరించెనొ సంతమసంబనఁ బ్రభాతసమయం బయ్యెన్." 4.3.35

కుంతీ నందనుల కాంతయగు ద్రౌపది చింతారూపమహాంధకారముతో సంతమసము మిక్కిలి మచ్చరించెనో యనునట్లు ప్రభాతసమయ మయ్యెనని వాచ్యార్థము. ఆరాత్రి సుదీర్ఘమై అతికష్టమున తెల్లవారిన దని తాత్పర్యము. ఆమె చింత దైర్ఘ్యము కంటె నాదైర్ఘ్యమే మిన్నకావలె నని సంతమసము మచ్చరించెనో యన్నట్లు అతికష్టముగా తెల్లవారిన దనునర్థమిట వాచ్యరూపమునఁగలదు. 'మచ్చరించుట' యనుచేతనగత వ్యాపారవిశేష మిట జడమగునంతమసమునకు ఉత్ప్రేక్షారూపమున నన్వయించుట ప్రౌఢోక్తి. దీనివలన కీచకోపకీచకకృత ద్రౌపదీదుఃఖవిశేషము సాంద్రత యభివ్యక్త మగుచున్నది. ఈ యభివ్యక్తికి పద్యమునందలి 'మచ్చరించెనొ' అనుపదమొక్కటియే సహకరించుచున్నది. వాచ్యార్థము ముగిసిన పిదప తన్మూలమున లభించునర్థ విశేషమగుటచే నిది అర్థశక్తి మూలధ్వని యనఁబడుచున్నది. 'మచ్చరించెనొ' అనుపదము యర్థ మిట వ్యంజక మని తాత్పర్యము.

అర్థశక్తిమూలధ్వని, అనురణనరూపమున వాక్యముచేత ప్రకాశించుటకు నన్నయ్యగారి రెండు పద్యము లాంధ్రధ్వన్యాలోకమున నుదాహరింపఁబడినవి.

"దళితనవీనకందళకదంబకదంబకకేతకీరజో
మిళితసుగంధబంధుర సమీరణుఁడన్ సఖుఁ డూచుచుండఁగా
నులియుచు మొల్లగుత్తులనుయ్యెల లొప్పఁగ నెక్కి యూఁగె ను
ల్లలదళినీకులంబు మృదులధ్వనిగీతము విస్తరించుచున్." 3.4.138

దీనిపై శ్రీ తిరువేంగళాచార్యులుగారు గావించిన వ్యాఖ్య యిది. 'గాలివీచు చుండ కదలుచున్న మొల్లపూగుత్తులమీఁద నున్న ఆడుతుమ్మెదలు కదలుచున్నవి అనువస్తుస్థితి నన్నయ్య భట్టారక ప్రౌఢోక్తివశమున నేకదేశవర్తిరూపకరూపము నొంది ప్రియుల ప్రియారాధనావశ్యకతను వెల్లడించుచున్నది.' (ఆంధ్ర. ధ్వ. పు. 326)

అనఁగా సమీరణుని యందు సఖిత్వారోపణము, మొల్లగుత్తులయం దూయెల తనము నారోపణము, మృదులధ్వనులయందు గీతత్వారోపణము చేయుట ప్రౌఢోక్తి. తద్వశముననను, 'అళినీకులము' అనుపదమునందలి అళినీశబ్దగతస్త్రీలింగ సారస్యమువలనను, దానికి ప్రియాత్వారోపణము ప్రతీయమాన మగుచున్నది. ఈ మొత్తముచే ప్రియులు ప్రియల నుయ్యేలలూచుట మధుర శృంగార చేష్టావిశేషమనియు, దానివలన వారికి సంసారసౌఖ్యము నిండి యొప్పు ననియు నిత్యాద్యర్థ విశేషము ప్రతీయమానమగును. ఈ యర్థప్రతీతికి పద్యమునందలి వాక్యవిశేష మంతయు

వ్యంజకముగా నున్నది కావున నిది వాక్యగతార్థ శక్తి మూలానురణన ధ్వనికి చక్కని లక్ష్యము.

వారు చూపిన రెండవ పద్యము శరద్వర్ణనలోనిది, నన్నయ్య భట్టారక సరస్వతి మూగబోవుటకు ముందు మధురదివ్యనాద సమ్మిళితమై మ్రోగినపద్యరత్నము.

"శారదరాత్రు లుజ్జ్వలలసత్తర తారక హారపంక్తులం
జారుతరంబులయ్యె; వికసన్నవకైరవ గంధబంధురో
దారసమీర సౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణక
ర్పూర పరాగపాండురుచిపూరము లంబర పూరితంబులై." 3.4.142

ఈ పద్యమునకు వారిట్లు వ్యాఖ్యగావించిరి. 'ఇటశారద రాత్రులకు మదనోద్దీపకత్వము వ్యంగ్యమగుచున్నది. అది నన్నయభట్టారక ప్రౌఢోక్తి రూపమగు సమాసోక్తి వలన నేర్పడునని గ్రహింపవలెను'. (అం. ధ్వ. పు. 326)

ఇచట శారద రాత్రుల వర్ణనము ప్రకృతము. శరద్రాత్రులు ప్రకాశించు నక్షత్రములతో, వికసించిన కలువల సౌగంధ్యమును దాల్చి, చంద్రునినుండి వెదఁజల్లఁ బడు కర్పూర పరాగమువంటి తెల్లని వెన్నెల కాంతులతో నిండినదై చారుతరము లైన వనునది వాచ్యార్థము. ప్రకృతమైన యీ శరద్రాత్రివర్ణన మప్రకృతమైన శృంగారరసోద్దీపనములను ద్యోతనము చేయుచున్నది. లసత్తరతారక హార పంక్తులనునది నక్షత్రముల వంటి ముత్యముల హారపంక్తులను గమ్యమాన మొనర్చును. నవ కైరవగంధబంధురోదార సమీర సౌరభము కాంతా కేశపాశములందలి మాల్య విశేషముల సౌరభమును స్ఫురింపఁజేయును. సుధాంశువికీర్యమాణ కర్పూర పరాగ పాండురుచి పూరములు ప్రేయసులు శరీరమునకు మార్దవ సౌరభాదులకై పూసికొన్న అంగరాగమును వ్యక్తము సేయును. రాత్రి శబ్ద గత స్త్రీలింగము నాయికలను ప్రతీయ మాన మొనర్చును. ఇట్లు ప్రస్తుతమగు శరద్రాత్రివర్ణనముచే నప్రస్తుతమగు కాంతావ్యవహారము గమ్యమానమగుచున్నది. కావున సమాసోక్తి రూపకవిప్రౌఢోక్తి కలదు. దీనివలన శారదరాత్రులకుఁ గల మదనోద్దీపకత్వము వ్యజ్యమానమగుచున్నది. ఈ వ్యంగ్యమునకు సమాసోక్తి రూపవాక్యము వ్యంజకము. కావున నిది వాక్యగతార్థ శక్తి మూలానురణనధ్వనికి మధుర లక్ష్యము.

ఈ రెండును కవిప్రౌఢోక్తి సిద్ధములు. ఇట్లు కవిప్రౌఢోక్తి సిద్ధ ధ్వని భేదములు రెండును పదవాక్య ప్రకాశ్యములగుట కుదాహరణములు చూపఁబడినవి. ఇఁక కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తి సిద్ధములకు లక్ష్యముల నరయుదము.

కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తి సిద్ధార్థశక్తి మూలధ్వని పదప్రకాశ్యమగుట కుదాహరణము. శత్రుదుర్భేద్యమగు ద్వైపాయనహ్రదమున జలస్తంభన విద్యచే దాగి యున్న దుర్యోధనునిఁ గనిపట్టి ధర్మజుఁ డిట్లనెను :

"కొడుకులు దమ్ములుం గలన ఘోరవుఁజావులు సావఁ జూచి యె
ట్లోడఁబడె నీదుబుద్ధి యొడ లోముటకై; నిను రాజరాజ! యి
మ్మడువున కీడ్చి తెచ్చె విధి; మానము ప్రాణముకంటెఁ జాల నె
క్కుడగుట సెప్పఁగా వినవొకో; కడు నీచతఁ బొంది తక్కటా." 9.2.57

ఈ పద్యమునందు కవినిబద్ధవక్తయగు ధర్మజుఁడు 'రాజరాజ' 'చెప్పఁగా' అనుపదములను సాభిప్రాయముగా ప్రయోగించెను. అట్లు ప్రయోగించుట ప్రౌఢోక్తి. మొదటి పదమువలన "ఓరీ! నీచుఁడా! లోకమంతయు నిన్ను రాజరాజుగా సంభావించు చున్నది. రాజరాజైనవాఁడు ధర్మయుద్ధమున గెలిచి లక్ష్మీకర గ్రహణము చేయుటయో చచ్చి అప్సరః కాంతాకరవల్లరీసమాలింగన సౌఖ్య మందుటయో చేయవలయును గాని శత్రువులకు భయపడి ప్రాణరక్షణకై నీచవిద్యాప్రాభవమున నీరుసొచ్చి పౌరుషహీనముగా ప్రవర్తించునా?నీవేటిరాజరాజవు!" అనునర్థము ప్రతీయమాన మగును. అట్లే 'చెప్పఁగా' అనుపదముకూడ అధిక్షేపణమును ద్విగుణీకృత మొనర్చును. "మానము ప్రాణముకంటె నెక్కు డగుట యనునది జన్మముతో నభ్యాసముతో స్వయముగా నలవడవలసినలక్షణము. అట్లు నీకు కలుగలేదు సరికదా ! చాలమంది చెప్పినను, దాని నవహితుఁడవై వినియును, నీకు దానితత్త్వము జీర్ణము కాలేదు. అట్టి నిన్ను మానధనుఁ డనుటయు రాజరా జనుటయు దబ్బఱసుమా. నీవింతకాల మట్టివానివలె నటించితి వనుట యీనీచకృత్యమువలన నేఁ డులోకమునకు వెల్లడియగుచున్నది" అనునర్థ మిట స్ఫురించును. ఎట్లైనను నీట దాగియున్న సుయోధనుని వెలిఁబుచ్చుటకు యత్నించు ధర్మజుని పలుకులలో నీయర్థ మంతయు వివక్షితమే యనుట తప్పుకాదు. 'రాజరాజ' 'చెప్పఁగా' అనుమాట లీయర్థము నకు వ్యంజకములు కావున నిది పదగతార్థశక్తిమూలానురణనధ్వని కుదాహరణము.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తి సిద్ధార్థశక్తిమూలానురణనధ్వని వాక్యమున భాసిల్లు నుదాహరణములు.

సంజయునివలన పాండవుల ఉద్యోగోత్సాహములను విని బెదరిన ధృతరాష్ట్రునకు ధైర్యము నూరిపోయుచు సుయోధనుఁ డన్న యీ క్రిందివాక్యముల నరయుదము.

"గద నాతో సరి మూఁడులోకముల నేఁ గానం, జలంబెత్తి యు
న్మదుఁ డాభీముఁడు నన్ననిం దొడరిన న్వజ్రప్రహారంబు బె
ట్టిదమై తాఁకినఁ గూలుపర్వతము మాడ్కిం గుంభినిం గూలవ్రే
సెద; నాకోర్కికదా గదారణము వచ్చెం బెద్దకాలంబునన్." 5.2.218

ఇందలి "వజ్రప్రహారంబు బెట్టిదమై తాకిఁనఁగూలు పర్వతముమాడ్కిన్" అను నుపమారూపప్రౌఢోక్తివలన సుయోధనునిగదకు వజ్రాయుధౌపమ్యముతోపాటు అతనికి దేవేంద్రౌపమ్యము స్ఫురించును. ఈయభివ్యక్తివలన నేను పాండవులను జంపి భూమినే కాదు స్వర్గమునుగూడ నేలుదు నన్నదుర్యోధనుని దర్పోత్సాహములు ప్రతీయమానములై సందర్భమునకు వన్నెవెట్టుచున్నవి. ఈవ్యంగ్యార్థమునకు 'మూఁడులోకములన్' అను పదము కూడ సహకరించును. నిజమునకు ముల్లోకములందును గదాయుద్ధమున నా కెదురు లేనే లేరు. మర్త్యలోకమున నుండె నని నీవనుకొనుభీమునిస్థితిని వక్కాణించితిని. అతని నొక్కని నోడించినచో నిఁక నాకు తిరుగులేదు. అనునభిప్రాయము వ్యంగ్యమై పైవ్యంగ్యార్థమునకుఁ బోషకముగా నగును.

ఈక్రిందిపద్య మిట్టిధ్వనికే మఱియొకలక్ష్యము.

"సమరంబున నీ వోడుట సముద్ర మింకుట; జయించె సాత్యకి గురుఁ గ
య్యమున నని యెసఁగు జనవా దమ మేలుగఁ దలఁచితొక్కొ ధనురాచార్యా!"
7.4.164

పరంపరగా కలుగుచున్న ఓటములను సహింపఁజాలక ద్రోణాచార్యునిచిత్తశుద్ధిని శంకించి పలుకుచున్న సుయోధనుని యీవాక్యములందు అలంకారరూపమున ప్రౌఢత గలదు. 'సమరంబున నీవోడుట, సముద్రమింకుట' అనుచోట నిదర్శనాగర్భమిథ్యాధ్యవసిత్యలంకారము గలదు. 'సాత్యకి గురుఁ గయ్యమున జయించె' ననువాక్యమున 'గురున్' అనువిశేష్యము సాభిప్రాయము. ఏగురునికడ సాత్యకి ధనుర్విద్యాపాటవము నభ్యసించెనో యాతఁడే యీతనివలన నోడుటయా యను నభిప్రాయ మిట తోఁచును. 'ధనురాచార్యా!' అనుసంబోధనము కూడ నిట నభిప్రాయగర్భితమే. కావున నీరెండుసందర్భములందును పరికరాంకురాలంకారము కలదు. ఇట్లిచట కవినిబద్ధవక్తయగు సుయోధనుని ప్రౌఢోక్తులలో 'నీవుచిత్త శుద్ధితో యుద్ధమాడుట లేదు, ఇచ్చకమునకై చేసినట్లు నటించుచున్నావు. నీ కపకీర్తి భీతికంటె పాండవపక్షపాతమే మిక్కిలిప్రీతికరము. అది నేనింతవఱకు గుర్తింపఁ జాలక నిన్ను నము కొని మోసపోయితిని.' అనురీతిని దుర్యోధనుని యమర్ష మభివ్యక్తమై ద్రోణునిఁ బురికొల్పుట కెంతయు నహకరించును. 'జనవాదమ' అనుచోటి

అవధారణార్థకాకారము, 'ఒక్కొ' అనుసంభావనాసూచినిపాతము, 'ఎసఁగు' ననువ్యాప్త్యర్థక క్రియాజన్యవిశేషణమును పైధ్వనికి పోషకములు. ఇట్లీ పద్యమునందలి వాక్యముల యర్థములు రమణీయమగు నర్థవిశేషమునకు వ్యంజకము లగుచున్నవి.

ఉక్తిలోని ప్రౌఢత ననుసరించి పదవాక్యప్రకాశ్యములగునర్థశక్తి మూలధ్వని విశేషములకు వ్యంజకములు సోదాహరణముగ పరిశీలింపఁబడినవి. అలంకారాది కృతమగునుక్తిప్రౌఢత లేకయు నర్థశక్తివశమున ప్రతీయమానమగుధ్వన్యర్థము చూపట్టు చున్నది. అట్టిదానిని స్వతస్సంభవి యందురు. ఇదియు పదగతము, వాక్యగతము నని రెండువిధములుగా నున్నది. అందు పదగతమైనదానిస్వరూప మీక్రింది యుదాహరణ మునఁ జూడనగును.

సైంధవునిమరణమునకు విలపించుదుస్సలను జూపి గాంధారి శ్రీకృష్ణునితో నవినమాటలు :

"తోడఁబుట్టువు విధవయై తొలఁగి యునికి
కోర్చి చలమునఁ బతిఁ దెగటార్చి సంత
సించితిరె తండ్రులార! మీరంచుఁ బాండు
పుత్రకుల దూఱుచున్నది పొలఁతి వింటె !" 11.2.100

దుస్సలదుఃఖాతిశయపూరితవాక్యములలోని 'తండ్రులార !' అను సంబోధనము నందు ప్రౌఢత యేమియు లేదు. ఇట్టిసన్నివేశములలో నది సాధారణముగఁ బ్రయుక్త మగునట్టిదయే. ఈపద మిట రమణీయమగు నర్థవిశేషమునకు వ్యంజకము. ఆడుబిడ్డకు తండ్రితఱువాత తండ్రివంటివారు, అందును ఒక్కఁడు కాక యైదుగురు, మీలో నేయొక్కరికిని సోదరివిధవాత్వమునకుఁ గారణము గాఁదగమన్న ఆలోచన రాలేదు. అంతేకాక చెల్లెలిమగని చేసేతుల వధించి సంతసించెడుస్వభావము కల మీరెంతటి క్రూరాత్ములో చింతింపుఁ డన్న అధిక్షేపణ మిట వ్యంగ్యరూపమునఁ దోఁచును. ఈయర్థవిశేషము 'తండ్రులార !' అనుసంబోధనముచే సిద్ధించుచున్నది. ఈవ్యంగ్య రూపమైననింద పాండవులహృదయమున కధికసంతాపహేతువగు ననుట లోకానుభవ సిద్ధము కావున నీయర్థభావనము సముచితమగుటయే కాక యావశ్యకము నగుచున్నది.

స్వతస్సంభవ్యర్థశక్తికృతానురణనధ్వని వాక్యమునఁ దోచుట కీక్రింది యుదాహరణము నరయఁదగును. రాజసూయము పూర్తిగావించి భీష్మునియభిప్రాయము ననుసరించి వాసుదేవుని ధర్మజుడు పూజింపఁగా నహింపని శిశుపాలుఁడు పలికిన పలుకులలోని దీపద్యము.

"ఇతనికిఁ గూర్తురేని ధనమిత్తు, రభీష్టములైనకార్యముల్
మతి నొనరింతు రిష్టుఁ డని మంతురు గాక ! మహాత్ములైనభూ
పతులయు విప్రముఖ్యులసభన్ విధిదృష్టవిశిష్టపూజనా
యతికి ననర్హు నర్హుఁ డని యచ్యుతు నర్చనసేయఁ బాడియే" 2.2.10

ఈపద్యమున 'ధనమిత్తురు; అభీష్టములైనకార్యముల్ మతి నొనరింతురు; ఇష్టుఁ డని మంతురు' అనువాక్యములవలన నీతఁడు ధనహీనుడు. కావున దానికై కక్కుఱితి పడును. తనకు కావలసినకార్యములను స్వయముగా సాధించుకొనలేఁడు. నీవంటివాని న్నాశ్రయించి చేయించుకొనవలయును. బ్రదుకు తెరువు కూడ లేనివాఁడు. కావుననే నీవంటివానిచేత మనుపఁబడవలసినవాఁడు. ఇత్యాదిరూపమున శిశుపాలుని హృదయము నందలి కృష్ణగతవైమనస్యము చక్కగా నభివ్యక్తమగును. ఇంకను 'మహాత్ములైన' ఇత్యాదికము కృష్ణుఁడు మహాత్ముఁడును గాఁడు, భూపతియుఁ గాఁడు, విప్రత్వాసనయు నాతనియందు లేదు అను నర్థమును ప్రతీయమాన మెునర్చును. 'విధిదృష్టవిశిష్టపూజనాయతికి' అనుపదము పూజ ఘనత నుటంకించుచు కృష్ణుని పనికిరానితనమును సూచించును. 'పాడియే?' అను ప్రశ్న కృష్ణుని అనర్హత నటుండనిమ్ము; మాయందఱ యవమానముమాట పోనిమ్ము; ధర్మవిరుద్ధమునాచరించిన నీకుమాత్రము దీనివలన మేలు జరుగునా? యనుభావమును స్ఫుటీకరించును. ఇట్లీపద్యమున విశేషార్థములు ప్రతీయమానములగుచు శిశుపాలుని యీర్ష్యాక్రోధముల యనుభూతికి మిక్కిలి సహకరించుచున్నవి.

మఱియొక యుదాహరణము : 'మాయ ట్లిడుమలఁబడినవారు గలరె ?' అని యడిగినధర్మజునితో బృహదశ్వమహాముని యిట్లు పలికెను :

"దేవసములైనయనుజుల తో విప్రులతో రథాలితో వచ్చి యర
ణ్యావాసముసేసెదు ధర ణీవల్లభ నీవు ధర్మనిష్ఠితబుద్ధిన్." 3.2.5

ఇందలి వాక్యార్థమువలన నీక్రిందియర్థవిశేషము స్ఫురించును. 'నీయనుజులు దేవసములు. ఏది కావలసినను తమశక్తిసామర్థ్యములచే సాధింపగలరు. వారు నీయనుజులు కనుక అట్లు సాధించిన దాని నెల్ల భయభక్తివినయములతో నీకు సమర్పింతురు. దానివలన నీవు దేవేంద్రోపముఁడ వగుదువు. నీ కెల్లప్పుడు ప్రియమును సంధించువిప్రులు నీతో కలిసియే యుండిరి. వారివలన వినఁదగిన యర్థ మెల్ల వినుచు హృదయాహ్లాదమును బొందుచుందువు. ఏయరణ్యము నీకు ప్రియమో - యందేగుటకు వలసినరథాదికము నీకుఁ గలదు. మఱియు పేరున కరణ్యావాసము కాని నీ

ధరణీవల్లభత్వమునకు క్షతి కానరాదు. అంతేకాక నీవీయరణ్యవాసమును ధర్మనిష్ఠిత బుద్ధితోఁ జేయుచున్నావు కాని మనస్సున ధర్మభావమును కొంచెము ప్రక్కకు నెట్టినచో నేక్షణమం దైనను నీతమ్ములపరాక్రమముతో రాజ్యమును వశీకరించు కొనఁగలవు. ఇట్టియరణ్యవాసము నీకేలకష్టకారణమైనది ? ఇత్యాదిభావ మిట గమ్యమానమగును. వక్ష్యమాణనలోపాఖ్యానమున కిది ముందుమాటగా నేర్పడి నలుఁడు పడినకష్టములు ధర్మజునికష్టములకంటె నెన్నోమడుగు లధికము లని చెప్పుటలో నీయర్థమంతయు పర్యవసించుచు ధర్మజుని ఊఱటకు సహాయభూతముగా నున్నది. కావున నీయర్థ సంభావన మిట నముచితమే యగును. ఇట్లీ పద్యమునందలి సర్వపదముల వాచ్యార్థమును పైఁజెప్పినయర్థాంతరమునకు వ్యంజక మగుచున్నది.

ఇట్లు అవివక్షితవాచ్యమునందును, వివక్షితాన్యపరవాచ్యమున సంలక్ష్యక్రమ వ్యంగ్యమునందును పదవాక్యములచే ప్రకాశ్యములగువ్యంగ్యవిశేషములను సోదాహరణముగ చూచితిమి. ధ్వని పదప్రకాశ్యమనుటలో నొకింత యాక్షేపము తోఁచుచున్నది. ఆపూర్వపక్షసమాధానము లీక్రిందివిధముగా నుండును.

ఆక్షే : ధ్వనియనఁగా కావ్యవిశేషమనికదా అది పదగతమగు టెట్లు ? పదములు వ్యంగ్యార్థమునకు వాచకములు కావు గదా !

సమా : పదములు ధ్వనికి వాచకములు కావు. వ్యంజకములు.

ఆక్షే : ఆకాంక్షాసహితముగ ప్రతీతిని గలిగించు రమణీయమగు వాక్యమే కదా కావ్యము. కేవలమొక్క పదముచే ఆకాంక్ష ఉపసంహృతము కాదుకదా ! అట్టియెడ పదమొక్కటిచే కావ్యపరముగా చెప్పబడిన ధ్వనికి సంగతి యెట్లు ?

సమా : నిజమే. పదమొక్కటి కావ్యము కాదు. కావుననే పదమొకదానిని ధ్వనిగా చెప్పుటలేదు. వాక్యమున ధ్వని పదముచే ప్రకాశించు ననిమాత్రమే చెప్పఁబడినది.

ఆక్షే : ఇదియు సరికాదు. విశిష్టార్థప్రతీతి నొదవించు రమణీయమగు వాక్యమే కావ్య మనునపుడు ఆ ప్రతీతి వాక్యమువలన నఖండముగానే కలుగును గాని ఖండములగు పదములవలనఁ గలుగఁజాలదు. కావున రమణీయార్థప్రత్యాయన శక్తి లేని పదమువలన చారుత్వప్రతీతి యెట్లొదవును ?

సమా: శరీరము సుందరమని అఖండముగానే తోఁచును. కాని కన్నో, ముక్కో విలక్షణ స్థితిలో నున్నపుడు వానివలన సౌందర్యము ప్రస్ఫుటముగా భాసిల్లుట లోకమున నున్నది. కావున నఖండమగు వాక్యమున నొకానొకవ్యంజకమగు పదమున్నపుడు సౌందర్య మినుమడించుటయు, అది లేనిచో సౌందర్యము కొఱవడుటయు దృశ్యమానమగుచున్నది.

స్త్రీలను వర్ణించునపుడు మృగాక్షి, మృణాళహస్త, వ్యామగ్రాహ్యస్తని, అస్తినాస్తివిచికిత్సా హేతుశాతోదరి, కణిశజంఘ, వామోరువు మున్నగు పదములలో అవయవికమైన విశిష్టతయే కదా శరీరమున కాపాదింపఁబడినది. అట్లే కావ్యమునందును పదమొక్కటి విశిష్టార్థప్రతీతికి వ్యంజకము కావచ్చును. మఱియు శ్రుతిదుష్టములగు పేలవాదిపదముల వలన అసభ్యార్థము స్ఫురించి కావ్యము దుష్టమైనట్లు చెప్పఁబడుచున్నది. ఒక పదము కావ్య దుష్టతకు హేతువైనచో నొక పదము కావ్యశిష్టత కేల హేతువుకాఁజాలదు? ఈ న్యాయము ననుసరించి పదమువలన ధ్వని ప్రకాశించు ననుటలో అసామంజస్య మేమియులేదు.

ధ్వన్యాలోకమునం దీపరికరశ్లోకములు పై యర్థమును సంగ్రహించినవి.

**"అనిష్టస్య శ్రుతిర్యద్వదాపాదయతి దుష్టతామ్,**
**శ్రుతిదుష్టాదిషు వ్యక్తం తద్వదిష్టస్మృతి ర్గుణమ్.**
**పదానాం స్మారకత్వేఽ పి పదమాత్రావభాసినః**
**తేన ధ్వనేః ప్రభేదేషు సర్వేష్వేవాస్తి రమ్యతా.**
**విచ్ఛిత్తిశోభినైకేక భూషణేనైవ కామినీ**
**పదద్యోత్యేన సుకవే ర్ధ్వనినా భాతి భారతీ."** (ధ్వ. త్ర. 159 వ పుట)

శ్రుతి దుష్టాదులం దనిష్టశ్రుతి యె ట్లచారుత్వమును బుట్టించునో యట్లే యిష్టస్మృతి చారుత్వమును గల్గించును. కావున ధ్వనిభేదము లన్నింటియందును రమ్యత యుండనేయున్నది. తళుక్కుమని మెఱయు నొకనగచేత కామిని యెట్లు విరాజిల్లునో పదముచే వ్యక్తమగు ధ్వనిచేతను సుకవివాణి విరాజిల్లు నని శ్లోకముల భావము.

ఇట్లింతవఱకు లక్షణామూలధ్వని భేదములకు, నభిధామూలధ్వనిలో సంలక్ష్య క్రమవ్యంగ్యములకును వ్యంజకముల స్వరూప నిరూపణము జరిగినది. ఇఁక నసంలక్ష్యక్రమ వ్యంగ్యమునకు వ్యంజకము లెట్టివో పరిశీలింపవలసి యున్నది.

## 3. అసంలక్ష్యక్రమవ్యంగ్యము :-

భావము, భావాభాసము, భావోదయము, భావశాంతి, భావశబలత, రసము, రసాభాసము అనునవి వ్యంజితములగునపుడు వాచ్యవ్యంగ్యముల క్రమము సంలక్ష్యము కాఁజాలదని వెనుక చెప్పుకొంటిమి. భావాదులు ప్రతీయమాన మగుటకు విభావానుభావాదుల వర్ణనము జరుగును. విభావాది వర్ణనమువలన రసాదు లనంతర కాలికములై స్ఫురించినను వానిస్ఫూర్తి క్రమము సూచీశతపత్రన్యాయము ననుసరించి జరుగుటచే గుర్తించుటకు వీలుకాదు. అట్టి ధ్వనిభేదమునే అసంలక్ష్యక్రమ మనిరి. రసాదిక

మనంత విధములుగా నుండవచ్చుననుట పూర్వమే నిరూపింపఁ బడినది. అవాంతరవిభాగకల్పనమును, పరిగణనమును క్లిష్టసాధ్యము కావున నది యంతయు నొకే భేదముగా పరిగణింపఁబడినది. ఈ రసాదిక మభివ్యక్తమగుటకు వర్ణము, పదము, పదైకదేశము, వాక్యము, ప్రబంధము అనునవి నిమిత్తములు కావచ్చునని యీ క్రింది మూలకారిక తెలుపుచున్నది.

"యస్త్వలక్ష్యక్రమవ్యఙ్గ్యో ధ్వనిర్వర్ణపదాదిషు-
వాక్యే-సంఘటనాయాం చ - స ప్రబన్ధేఽ పి దీప్యతే." (ధ్వ. తృ. 2 వ శ్లో.)

ధ్వన్యభివ్యక్తికి అర్థశూన్యమగు వర్ణ మెట్లు వ్యంజకము కాఁగలదని శంకింపరాదు. అత్యంతము మధురమును సుకుమారమునగు శృంగార మభివ్యక్తము కావలసిన చోటులందు రేఫ సంయోగాక్షరములయు శ-ష-ఢ- మున్నగు వర్ణములయు ప్రాచుర్యము రసభంజక మగుచున్నది. అదియే బీభత్సాదులయందు రసదీప్తిని కలిగించుచున్నది. లౌకిక సన్నివేశములఁ బరిశీలించినచో నిది నిరూపిత మగుచును. ప్రేమార్ద్రత, లాలన మున్నగునవి విషయములైనపుడు సుకుమార వర్ణ ప్రాచుర్యమును, కోపాదికము విషయమైనపుడు పరుషాక్షర ప్రాచుర్యమును సహజముగా కానవచ్చుచుండును. వర్ణ ప్రాచుర్య మొక్కటియే కాదు - నాదములోఁగూడ మంద్ర మధ్యతారభేదములు - సందర్భానుగుణముగ అనభ్యస్తములై బాలుర యందుఁ గూడ దృశ్యమానములగును. వీనిని జాగ్రత్తగా కనిపట్టువారికి వర్ణములు రసాది వ్యంజకము లనుటలో నెట్టి యాక్షేపణము నుండదు. కావ్యమున కవికి వర్ణ విన్యాస వైవిధ్య మనివార్యముగ నుపాదేయ మగుచున్నది. ఉచ్చారణలోని మంద్రాదిస్వర భేదముల కచట - ముఖ్యముగా శ్రవ్య కావ్యమున - ప్రవేశ ముండఁజాలదు. కావున సమర్థుఁడైన కవి తత్త్రదసానుగుణముగ వర్ణములఁ గూర్చుకొనకతప్పదు. అపు డావర్ణములు రసవ్యంజకము లగుటలో విప్రతిపత్తి యుండదు. ఈ క్రింది యుదాహరణముల నరసినచో నిది స్పష్టమగును. మృగవధార్థము వనమేఁగిన వసుమహారాజునకు భావనామయ ప్రపంచమున తనయర్ధాంగి గిరిక తోఁచి హృదయమున గిలిగింతలు పెట్టఁగా నాతనికి రేతస్ఖలన మాయెను. నన్నయ దీని నిట్లు వర్ణించెను.

"పలుకుల ముద్దును - గలికిక్రాల్కన్నుల తెలివును - వలుదచన్నులబెడంగు-
నలఘుకాంచీపదస్థలముల యొప్పును-లలితానేందుమండలమురుచియు -
నళినీ కుటిలకుంతలముల కాంతియు - నెలజవ్వనంబున విలసనంబు -
నలసభావంబునఁ బొలుపును-మెలుపును-గలుగు నగ్గిరికన తలఁచి తలఁచి
ముదితయందుఁ దనదుహృదయంబు నిలుపుటఁజేసి రాగ మడర భాసురముగ
రమణతో వనాంతరమున రేతస్స్కంద మయ్యె నవనిపతికి నెయ్య మొనర."

1.3.27

ఈ పద్యమునందలి మృద్వక్షరయోజనమును లకారబాహుళ్యమును బ్రకృతమగువిప్రలంభ శృంగారమున కెంతయు సహకరించుచున్నవి. ఈ పద్యమునందలి పదములు, తదర్థములు మున్నగువాని భావనకంటె ముందుగనే యక్షరలాలిత్యమే రసస్ఫోరకమగుచుండుట సహృదయైక వేద్యమగు విషయము.

గరుడి కద్రువపుత్రులను మార్తాండమండలముదాఁక కొనిపోవఁగా నాతాపమునకు వారు మాడిచచ్చిరి. అంత కద్రువ యమృతవర్షమునకై పాకశాసను నుద్దేశించి పాడినస్తోత్ర మియ్యది :

"నరసురసిద్ధకింపురుషనాగనభశ్చర ముఖ్యులెల్ల నీ
కరుణయ వేచి మండ్రు; త్రిజగంబులు నీకులిశాభిరక్షణ
స్ఫురణనఁజేసి సుస్థిరతఁ బొందుఁ; బురందర! సర్వలోకసుం
దర! శరణంబు నా కగుము - దానవసూదన! పాకశాసనా!"   1.2.47

ఇందు శ్రుతివికర్తనశీలమైన రేఫము పలుమాఱు లావృత్త మగుట యామె హృదయమునందలి పుత్రమరణజనిత శోకోద్వేగమును జక్కగా నభివ్యక్తము సేయుచున్నది. ఒక విధమైన యనుప్రాసము నర, సుర, పురు, చర - ఇత్యాదిరూపమున నిందు నెలకొని ప్రార్థ్యమానుఁడగు నింద్రుని అభిముఖ్య సంపాదనమున కానుగుణ్యమును బొందుచున్నది. ఇ ట్లీచటివర్ణముల కూర్పు మిక్కిలి రమణీయమై రసానుగుణముగ నిబద్ధమైయున్నది.

తమ ప్రియపత్నికి నిండుసభలో వస్త్రాపహరణము గావించిన దుశ్శాసనునిఁ గాంచి దంతసందష్టదారుణముఖుఁడైనవృకోదరుఁడు పలికిన వాక్యములందలి రసాను గుణాక్షర వినివేశ చాతురీమహిమ యెట్టిదో యీ పద్యమునఁ జూడదగును :

"కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచుచుండన్ మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు చేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘుని
ర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్"   2.2.233

ఈ పద్యమునందలి మహాప్రాణాక్షరబాహుళ్యము భీమసేనుని క్రోధము పెంపును రౌద్రవర్తనము నభివ్యక్తము సేయుట సహృదయ హృదయవేద్యమే. 'అనేకుల్', 'వక్షశ్శైల' ఇత్యాదులందు యత్యక్షరము ఆకలిగొన్న సింహ మెరపై దూకినట్లుండి రౌద్రరసాభివ్యక్తికి దోహదము చేయుచున్నది. ద్విరుక్తధకారావృత్తియు, సంయుక్తాక్షరములును దంతపీడనాద్యవయవవికారములను స్ఫురింపఁజేయును. పద్యము

నందలిధారాశుద్ధి కోపోద్వేగజనితతీవ్రత నభివ్యంజించును. ఇది యంతయు వర్ణ విన్యాస వైఖరీమహిమయే.

ఇట్టిదియే రౌద్రరసాభివ్యంజకమగు రచన అర్జునపరముగా తిక్కన మహాకవిది:

"పటునారాచపరంపరాప్రసరదర్పం బేర్పడం బేర్చి త
ద్భటసంఘంబులు ఘోటకవ్రజము శుంభత్స్యందనౌఘంబు ను
ద్భటకుంభిప్రకరంబునుం బొదివి విధ్వంసంబు గావించి నె
త్తుట జొత్తిల్లెడునట్లు సేయుదు సమిద్భూభాగ మత్యుగ్రతన్" 7.2.307

అభిమన్యువధ జనితశోకసమీరిత క్రోధుడై సైంధవునిఁ జంపుదునని ప్రతిజ్ఞ చేయునప్పటి ధనంజయుని వాక్యములందలి మహాప్రాణారక్షసంయుక్తాక్షర బాహుళ్యము రౌద్రరసావిష్కారోపస్కారకముగా నిబంధింపఁబడినది.

ఇట్లు వర్ణములు రసాద్యభివ్యంజకములగుట లక్ష్యములందుఁ జూచితిమి. ప్రతిపాద్యమైన అర్థస్వభావమును ముందుగనే పాఠకుని హృదయమున కెక్కునట్లుగా వర్ణములు కూర్పఁబడుట మహాకవులకవితలయందు సాధారణముగా గోచరించు చుండును. దీనినే వికటత్వమను గుణముగా వామనాచార్యులు పేర్కొనిరి. కావున దీనికి ఇతరాలంకారికుల యామోదముద్రయుఁ గలదు. నన్నయభట్టారకుఁడు పేర్కొనిన యక్షరరమ్యత యనునదియు పైలక్షణమును సమర్థించును. శ్రీనాథమహాకవి తిక్కన మహాకవికవితాపరముగా వక్కాణించిన రసాభ్యుచితబంధ మనునదియు దీని కుపోద్బలకమే యగును. ఇన్ని ప్రమాణములచే వర్ణములు రసాద్యభివ్యంజకము లగు ననుసిద్ధాంత మపరిహరణీయ మగుచున్నది.

వర్ణములే రసాభివ్యంజకము లగుచుండగా తత్సముదాయరూపమును, నర్థవంతము నగుపదమును, పదసముదాయరూపమున నఖండమై యేకార్థీ భావముగల వాక్యమును రసాభివ్యంజకమగు ననుటలో విప్రతిపత్తి యుండదు. కావున పదము రసాద్యభివ్యంజక మగుట చూడవలసియున్నది. ఈ క్రింది ఆంధ్రమహాభారత పద్యమును శ్రీమాన్ తిరువేంగళాచార్యులు గారు తమ ఆంధ్ర ధ్వన్యాలోకమున నుదాహరించిరి :

"అన్నగుమోమును, నత్తెలి గన్నులు, నవ్వెడఁదయురముఁ, గన్నారంగాఁ
గన్నను బ్రదుకుదుఁ; గానక యున్నను బ్రాణంబు లెట్లు లుండఁగ నేర్చున్?"
7.2.238

దీనికి వారివ్యాఖ్య యిది - "నిహతుఁడగు నభిమన్యుని గుఱించి యర్జునుని యేడ్పిది. 'ఆ' అనుపదము కరుణోద్దీపకము లగువదనలోచన హృదయముల శోభావిలాస

విస్తార సౌభాగ్యములు నుడువుటకు వీలులేని రీతిగా నేక బుద్ధి గోచరములుగా వ్యంజన మొనర్చును. దీనివలననే ప్రకృతమున కరుణ మలక్ష్యక్రమముగా వ్యంగ్యమగును. ఈయంతటి యర్థమిట స్ఫురించునా? యని సంశయింపవలదు. శబ్దము ఉన్నచో అర్థమును నిరూఢమే యని గ్రహింపవలయును". (ఆంధ్ర. ధ్వ. తృ. పు. 388)

తచ్ఛబ్ద మిట్లే విశేషస్మృతిహేతు వగుట నీక్రింది పద్యమునందు నరయఁ దగును.

"దానివిశేష సౌరభము దానివిలోలవిలోకనంబులున్
దానిమనోహరాకృతియు దానిశుచిస్మిత వక్త్రకాంతియున్
దానివిలాసముం గడుముదంబునఁ జూచి మనోజబాణసం
తానహతాత్ముఁడై నృపతి దానికి నిట్లనియెం బ్రియంబునన్" 1.4.172

శంతనుమహారాజు యోజనగంధిని జూచినప్పటి స్థితి యిది. ఇందు పునః పునః ప్రయుక్తమైన తచ్ఛబ్దము శంతను హృదయమునందలి యేకాగ్రతను నామెయందుఁ గల అభిలాషరూపరతివిశేషమును అభివ్యక్తము చేయును. పూర్వోదాహృతపద్యముకంటె నిందొక విశేషము గలదు. అందు తచ్ఛబ్దము వేర్వేఱుగా తత్తదవయవముల శోభావిశేషము నభివ్యక్తము సేయుచున్నది. ఇందలి సంబంధార్థకముతోఁ గూడిన తచ్ఛబ్దము విడివిడిగా తత్తదవయవ సౌభాగ్యాతిశయనిరూపణము గావించుచునే యఖండశరీర శోభాసమగ్రత్వ మును వ్యంజింపఁజేయుచున్నది. దీనికి షష్ఠ్యంతతచ్ఛబ్దము హేతువని తాత్పర్యము.

ఇచట నొకయాశంక ఉద్బుద్ధమగును. ప్రక్రాంతపరామర్శకమగు తచ్ఛబ్దమునకీ శక్తి యున్నదా? అని. దీనిని శ్రీతిరువేంగళాచార్యులుగా రిట్లు వివరించిరి. "ఏవేని కొన్ని ధర్మము లొకవస్తువునందు ముందన్వయింపఁబడఁబోవునపుడు వానితో గలిసి యుండుటకుఁ దగిన ధర్మ మింకొకటి ఆవస్తువునం దున్నదని చెప్పుటకై యచ్ఛబ్దమును మొదట నుపయోగించి పిమ్మట బుద్ధిస్థమగునావెనుకటి ధర్మాంతరముతోడి సాహిత్యమును తచ్ఛబ్దముచే పరామర్శింతురు. అచటనే యత్తచ్ఛబ్దములకు విడువరాని సంబంధ మున్నదందురు. *'యత్తదోర్నిత్యసంబంధః'* అని ప్రమాణము. ఆచోటితచ్ఛబ్దమే ప్రక్రాంతపరామర్శకము" (ఆం. ధ్వ. 339) ఇంతకుపూర్వము ప్రారంభించినదానిని పరామర్శించునది యని తాత్పర్యము. ఇట్టిది కాక ప్రసిద్ధార్థకమై యేదేని వస్తువును విశేషాకారముతో సూచించుటకును తచ్ఛబ్దమును వాడుట గలదు. పై యుదాహృత పద్యమునందలి తచ్ఛబ్ద మిట్టిది.

"ఏయది హృద్య మపూర్వం బేయది - యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు - నఘనిబర్హ ణ మేయది - యద్దాని వినఁగ నిష్టము మాకున్."
1.1.30

ఇత్యాదులందలి తచ్ఛబ్దము ప్రక్రాంతపరామర్శకము. కావున పై ఆశంక నిలువఁజాలదు.

పదము వ్యంజకమగుటకు మఱియొక యుదాహరణము. కర్ణోత్పత్తివలనఁ గన్యయగుకుంతి హృదయమునఁ గలిగిన భావము.

"ఈబాలు నెత్తికొని యింటికిఁ జన్న నన్నున్ నాబంధు లందఱు మనంబున నేమనా;రె
ట్లీ బాలుసూర్యనిభు నెట్టుల డించి పోవం గాబుద్ధిపుట్టు-నని కన్యమనంబు లోనన్."
1.5.29

ఈ పద్యమునందలి అందఱు, ఏమి అనుపదములు కుంతీ శోకమును పరిపోషించుచు నలక్ష్యక్రమమున కరుణరసము నుద్దీపింపఁజేయుచున్నవి. "ఎవరో ఒక్కరి కైనచో ఏదో సమాధానము చెప్పవచ్చునేమో. అందఱు నన్నివైపులను జేరి యొక్కొక్క రొక్కొక్కవిధముగా ననుమానింతురు. వారి యనుమానములు మనస్సులోనే యున్నను ముఖములం దేహ్యభావము తోఁచుచునే యుండునుగదా! పాపమేమి జరిగినదో నలువురితో చెప్పలేక అవస్థపడుచున్నదని జాలిపడరు. అందఱిలో నందఱకు ఒక్కదానను ఏమి చెప్పి నమ్మింతును?" అనురూపమున శోక మిట నంద అనుపదముచే నభివ్యక్తమగును. ఏమి అనుపదమున వినిన వెంటనే వారనుకొను విధముల యానంత్య మొక్కమాఱు హృదయమునకు దోఁచినతన మభివ్యక్తమగును. ఈరెండు పదముల ప్రయోగమును బట్టి కుంతి వృకావలి మధ్యమునఁ జిక్కువడినసారంగిరీతిగాఁ దోఁచి సహృదయహృదయమున శోకము నుప్పొంగఁజేయును. కావున నీ పదము లిట నసంలక్ష్యక్రమవ్యంగ్యమునకు వ్యంజకములు.

భావాభివ్యక్తి పదమున నగుట నీ క్రింది యుదాహరణమున నరయఁదగును.

"బాలవయ్యు నత్యుత్తమ శీల వినయ గౌరవాన్వితవై నిర్వికారవృత్తి
నున్ననీకున్నయునికినసన్నుతాంగిసుతుఁడు పుట్టుటయిదిగడుఁజోద్యమయ్యె."
1.3.180

తనదాసియగు శర్మిష్ఠ కన్యాత్వమును వీడెనని లోకమునకు తెలియకయే ముగ్గురు పిల్లల తల్లియగుట కచ్చెరువడి దేవయాని యామెను ప్రశ్నించిన ఘట్టము నందలి యీ పద్యమున 'ఉన్నయునికిన' అనుపదము వ్యంజకము. ఇది చెవులఁబడిన

వెంటనే పాఠకునకు దేవయానీ హృదయగతశంకాపూర్వకావహేళన మభివ్యక్త మగును. శీలవతి వని నే నింతకాల మనుకొని యెంత పొరపాటు చేసితి! నన్నుభావ మిందభివ్యక్త మగును.

అలక్ష్యక్రమము పదము చేతనే కాక పదైకదేశముచేతను స్ఫురించును. ఉదాహరణము :

కుంతికి ధర్మజభీమార్జునులు దైవ ప్రసాదమువలన నుదయించుట కనియు, గాంధారికి సుతశతజన్మ మయ్యెనని వినియు తనయందు పుత్రజన్మములేమికి వగచి మాద్రి యాత్మగతమున నిట్లు దుఃఖించెను :

"కోరినకోర్కికిం దగఁగఁ గుంతి సుతత్రితయంబుఁ గాంచె, గాం
ధారియు నక్కడన్ సుతశతంబు ముదం బొనరంగఁ గాంచె, నేఁ
బోరచి యాడుఁబుట్టువునఁ బుట్టి నిరర్థకజీవనైతి - సం
సారసుఖావహంబయిననత్సుతజన్మముఁ గానఁబోలమిన్."                1.5.120

ఈ పద్యమునందలి 'ఆడుపుట్టువు' అనుసమాసమునందలి పుట్టువు అను నేకదేశము మాద్రికి నిస్సార మగుతన నింద్య జీవనమువలనఁ గలిగిన అసహ్యాభావమును జక్కగా ప్రస్ఫుటీకరించును. ఇట్లనపత్యయై మనుటకంటె పుట్టకుండుటయే మేలైనది కదా! యను భావము నీపదైక దేశ మభివ్యక్త మొనర్చును. మాద్రికి తనపుట్టువునెడఁ బుట్టినయేహ్యాభావమున కీపదైకదేశము వ్యంజకమని తాత్పర్యము.

ఇఁక వాక్య మలక్ష్యక్రమవ్యంగ్యమునకు వ్యంజక మగుట నరయవలసి యున్నది. వర్ణపదపదైక దేశములకును, వాక్యమునకును వ్యంజకత్వములో కొంత భేదము గలదు. పదాదులు వ్యంగ్యార్థమునకు నిమిత్తరూపమున పనిచేయును. వాక్యము మాత్రము విభావానుభావ వ్యభిచార్యాది సామగ్రి నంతయు చక్కగా ప్రతిపాదించును. కావున నట్టిదానియందు రసభావాదిక మంతయు తప్పక వ్యంగ్యమగును. అనఁగా సారాంశమియ్యది. వర్ణమో, పదమో, పదైకదేశమో ఆ వాక్యమున నుండుటవలన రసాద్యభివ్యక్తి జరుగుచున్నది. వాక్య మఖండముగా రసాదికము నభివ్యక్తము చేయుచున్నది.

వాక్యరూపమగు నసంలక్ష్యక్రమము శుద్ధము, అలంకార సంకీర్ణము - నవి రెండు విధములుగాఁ జూపట్టును. శుద్ధ మనఁగా నలంకారములు లేనిదని భావము.

శుద్ధమగు వాక్యము అసంలక్ష్యక్రమవ్యంగ్యమునకు వ్యంజకమగుట నీక్రింది యుదాహరణమునఁ గానవచ్చును.

"తడయక పుట్టిననాఁడ తల్లిచేఁ దండ్రిచే విడువఁ
బడితి, నిప్పుడు పతిచేతను విడువఁబడియెదనొక్కొ!
నుడువులు వేయు నింకేల, యిప్పాటినోములు తొల్లి
కడఁగి నోచితిని గాకేమి, యంచును గందె డెందమున." 1.4.103

ఇందు శకుంతలా పతిపరిత్యక్తతాస్థితి సముద్భూత శోకము కరుణరసముగా నేర్పడుచున్నది. ఇందు పుట్టిననాఁడ తల్లిదండ్రులచే విడువఁబడితి ననుటచే స్మృతి యనువ్యభిచారి భావమును, పతిచేతను అనుసముచ్చయార్థ కావ్యయసహిత పదముచే దైన్య పూర్వక నైరాశ్యము, విడువఁబడియెదనొక్కొ అనుచోటి సందేహ స్ఫోరకావ్యయముచే విషాదము, నుడువులు వేయు నింకేల అనుదానిచే నిర్వేదము, ఇప్పాటినోములు తొల్లి కడఁగి నోచితిని గాకేమి అనుటచే వితర్కము మున్నగు వ్యభిచారి భావములు స్ఫురించి శకుంతలా హృదయగత శోకమును రసీకరించుచున్నవి. కందుట, తఱువాతి వచనమునఁ జెప్పఁబడిన బాష్ప సముద్గమము మున్నగునవి యనుభావములు. దుష్యంతుఁడు పలికిన " ఇట్టి లోక విరుద్ధంబుల కే మోడుదు మయుక్తంబులైన వలుకులు వలుకక నీయాశ్రమంబునకుఁ బొ" మ్మనిన వాక్యము లుద్దీపకములు. ఇట్లు శకుంతలాలంబకమైన శోకము పైవిభావానుభావసంచారి భావచర్వణచే కరుణముగా వరిణమించి యాస్వాదనీయమగుచున్నది. కథాభాగైకదేశముగా నిది యంతయు నొక వాక్యముగా పరిగణింపఁబడినది. ఇందలంకార మేళన మేమియు లేదు కావున నిది శుద్ధము.

ఈ క్రింది పద్యము విప్రలంభశృంగారమునకు లక్ష్యమగును.

"కలహంస పలికిన పలుకులు గణియించు; వడి దానిపోయినవలను సూచు!;
బలుకదు సఖులతో లలితాంగి; మిన్నక యలయుచునుండుఁ దా ననుదినంబు;
చారువిభూషణాహార విహారశ య్యాసనభోగంబులందు విముఖి
యయిరేయుఁబగలునిద్రయునోర్చునెఱుఁగకదమయంతినలుఁడనుధరణినాథు
నందబుద్ధి నిలిపి కందర్పబాధిత యగుచునున్నయది; ధరాధినాథ!
ధరణిపతుల నొరుల నురుగుణాఢ్యుల విన నొల్ల దెంత విభవయుక్తులైన."
3.2.26

ఈ పద్యమునందలి దమయంతీవర్ణనముచే అభిలాషరూపవిప్రలంభశృంగార చర్వణ సహృదయులకుఁ గలుగుచున్నది. ఇట కలహంసపలుకు లుద్దీపనవిభావము. పలుకులు గణియించుట, దానిపోయినవలను చూచుట మున్నగునవి యనుభావములు.

సఖులతోఁ బలుకకుండుట జాడ్య మనువ్యభిచారి భావమును, అలయుచునుండుట యనునది గ్లానిని, భోగ విముఖత్వము అరతి యనుమన్మథావస్థను వ్యక్తము చేయును. ఈ సమాహారమువలన పాఠకునకు దమయంతీ గతవిప్రలంభ శృంగారము తోఁచి యానందమును గూర్చుచున్నది. ఇందలంకార సాంకర్యము లేదు కావున నిదియు శుద్ధమే.

అలంకారసంకీర్ణమైన అసంలక్ష్యక్రమవ్యంగ్యము వాక్యమునఁదోచుట కుదాహరణము :

"నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి యచ్చునఁ బెట్టిన ట్లందమొంది
చక్రవాకంబులచందంబు గొనివచ్చి కుప్పలుచేసిన ట్లొప్పుమెఱసి
చందురు నునుఁగాంతికం దేర్చికూర్చి బా గునకుఁ దెచ్చినయట్లు కొమరుమిగిలి
యళికులంబులకప్పు కలయంతయును దెచ్చి నారువోసినభంగి నవకమెక్కి
యంఘ్రితలములుఁగుచములు నాననంబుఁగచభరంబును నిట్లున్నరుచిరమూర్తి
యనుపమానభోగములకు నాస్పదంబు గాదె; యీ్రాతిప్పులేటికిఁ గమలవదన!"

ఈపద్యమునందలి యుత్ప్రేక్షాక్రమాలంకార సంకీర్ణమగు వాక్యమునందు కీచక గతాభిలాషరూప విప్రలంభశృంగారాభాసము అసంలక్ష్యక్రమమున ప్రతీయమానమగు చున్నది. నెత్తమ్మిరేకుల మెత్తఁదనము తెచ్చి యచ్చునఁబెట్టుట అనునది లోకమున నసంభవమగుటచే నిది యుత్ప్రేక్షగా సంభావితమైనది. ద్రౌపది రూపలావణ్యములను ప్రత్యక్షముగాఁ గనుఁగొనుచున్న కీచకుని యీవర్ణనమును బట్టి సహృదయహృదయక్షేత్రమున బీజరూపమున నున్నరతి రసస్థితికి వచ్చును. అనురాగ ముభయపక్షనిష్ఠము కాదనుస్మృతివలన దానికాభాసత ఘటిల్లును. రసస్మర్శ యుండుటచే నిదియు నాస్వాదనీయమే యగుచున్నది.

అలంకార సంకీర్ణమై కరుణ రస మలక్ష్య క్రమమునఁ ధోఁచుట కీ క్రింది పద్యముదాహరణము :

"ఎలదీఁగఁ గప్పినలలితపరాగంబు క్రియ మేన మేదినీరేణు వొప్పఁ
జంపకంబున నవసౌరభం బెసఁగెడు కరణి నాసిక వేఁడిగాడ్పు నిగుడఁ
దోయజదళముల తుదిమంచుతొరఁగెడు గతిఁ గన్నుఁగవ నశ్రుకణము లురుల
నిందుబింబముమీఁది కందుచందంబునఁ గురులు నెమ్మొగమున నెరసియుండ
సర్వజనవంద్యయైన పాంచాలి సింహ బలునిచే నివ్విధంబున భంగపాటు
తనకు వచ్చిన నెంతయు దైన్యమొంది యవ్విరాటుని సభ చేర నరిగి నిలిచి."

4.2.138

ద్రౌపద్యాలంబకమగుకరుణ మీ వాక్యమున నసంలక్ష్యక్రమమునఁ దోఁచును.

"ఇష్టజనస్య వినాశా - చ్ఛాపాత్క్లేశాచ్చ బంధనా ద్వ్యసనాత్ -

ఏతై రర్థవిశేషైః కరుణాఖ్యరస స్సముద్భవతి"

అనునాట్యశాస్త్రోక్తినిబట్టి ద్రౌపదికి సింహబలునివలనఁ గలిగిన క్లేశమువలన కరుణము సంభావిత మగుచున్నది. మేన ధూళి, నాసిక యందు వేఁడిగాడ్పు, కన్నుఁగవ నశ్రుకణములు, కురులు చెదరిపడుట మున్నగునవి యనుభావములు. వేఁడిగాడ్పునుటవలన క్రోధము, అశ్రుకణములవలన అర్తి, కురులు నెమ్మొగమున నెరయుటవలన శ్రమదైన్యములు మున్నగువ్యభిచారి భావములు తోఁచుచున్నవి. రాజసభకుఁ జేరుట యనుదానివలన త్రాసము స్ఫురించుచున్నది. ఈ సముదాయము వలన ద్రౌపది యుత్కటమగుశోకము పుష్టమై కరుణ రసమును సహృదయునియం దుద్బుద్ధము చేయుచున్నది. సీసపాదములలోని యువమాలంకార మాయా యవయవముల తత్కాలస్థితిని చక్కఁగా రూపొందించుచు రసము నలంకరించుచున్నది. ఇట్టి దలంకారసంకీర్ణమైన వాక్యగతాసంలక్ష్యక్రమధ్వని విశేషము.

ఇట్లు పదపదైకదేశవాక్యములు వ్యంజకము లగుటను పరిశీలించితిమి. సంఘటనయు వ్యంజకమగును. దానిని గూర్చి విచారింపవలసియున్నది.

సంఘటన యనుదానిని ధ్వన్యాలోకకారుఁ డిట్లు వివరించెను :

"అసమాసా సమాసేన మధ్యమేన చ భూషితా,

తథా దీర్ఘసమాసేతి త్రిధా సంఘట నోదితా." (ధ్వ. తృ 5వ శ్లో.)

సమాసములు బొత్తుగా లేనిది, స్వల్ప సమాసములతో భూషితమగునది, దీర్ఘ సమాసములు గలది యని సంఘటన మూఁడు విధములుగా నున్నది. ఈ సంఘటన యనునది వామనుఁడు కావ్యాత్మగా పేర్కొన్న రీతికి పర్యాయముగా వాడఁబడినది. అతని మతమున మిక్కిలి మృదుపదములు, అలఁతి సమాసములు - లేక సమాసరాహిత్యము అను స్వరూపము గలది వైదర్భీరీతి. పరుషాక్షర బాహుళ్యము, దీర్ఘ సమాసములును గలది గౌడీరీతి. ఈ రెంటికిని నడుమస్థితి - మృద్వక్షర పరుషాక్షర సమ్మేళనము, నాత్యల్ప - నాతిదీర్ఘ - సమాసములు గలగయుండునది- 'పాంచాలీ రీతి' యనఁబడును.

ధ్వనికారుఁడీ రీతిప్రక్రియనే సంఘటనగా భావించి యిదియు నసంలక్ష్యక్రమధ్వనికి వ్యంజక మగునని నిరూపించెను. కాని యీతని వివరణమును బట్టి రీతికిని సంఘటనకును కేవలము తాదాత్మ్యమును సంభావింపఁజాలము. రీతి గుణసమాహారరూప. కావున నీ సందర్భమున గుణములును సంఘటనయు నొకటియా? గుణముల నాశ్రయించి సంఘటన యుండునా? సంఘటన నాశ్రయించి గుణము లుండునా? అను విధమున

వికల్పములు పుట్టును. దీనిని గూర్చి చర్చింపవలసి యున్నది. కరుణము గాని విప్రలంభశృంగారము గాని ప్రతీయమానమగునపుడు మాధుర్యప్రసాదగుణములు పరిపూర్ణముగా నెలకొనవలయును. రౌద్రాద్భుతముల విషయమున ఓజోగుణము మిక్కుటముగా నుండవలయును. తక్కిన వానిపట్టున మాధుర్య ప్రసాదము లుండవలయును" అని గుణములు రసాది విషయములకు నియతములై యున్నవి. ఇట్టినియతి రసవిషయమున సంఘటనకు లేదు. శృంగారమున దీర్ఘ సమాససంఘటన యుండుటయు, రౌద్రాదులయందు సంఘటన సమాసశూన్య యగుటయుఁ గానవచ్చు చున్నది. ఈ క్రింది పద్యములను బరిశీలించినచో నీవిషయము స్పష్టమగును :

"జలధివిలోలవీచి విలసత్కలకాంచి సమంచితావనీ
తలవహనక్షమంబయిన దక్షిణ హస్తమునం దదున్నమ
ద్గళదురుఘర్మవారికణక్రమకరాబ్జముః వట్టి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్." 1.3.144

ఇందలిక్రమకరాబ్జము, కోమలి, ప్రీతితోన్ అను పదములను బట్టియు ఘర్మవారి కణములు సాత్త్వికభావసంజనితములుగా సంభావింపఁబడుటను బట్టియు నిది అభిలాష రూపరతివిశేషము నభివ్యంజించును. కావున నిది శృంగార రసవిషయము. అయినను నిందలి దీర్ఘ సమాససంఘటన దీనికి భంజకము కాలేదు.

"తెక్కలు సించి కంఠమున తేకులు వాపి శిరంబు వ్రచ్చి పే
రుక్కునఁ గ్రౌంచచంద మగునొడ్డు గలంగఁగఁ జేసి భీష్ముఁడే
దిక్కునఁ దానయై దిశలు దీటుకొనన్ శరకోటి నింపఁ గెం
పెక్కినకంటిక్రేవ చెలువెక్కుడుసేయఁగఁ గ్రీడి కృష్ణుతోన్." 6.2.38

భీష్మాచార్యుని మహోజ్జృంభణమును వర్ణించునీపద్యమునందు సమాసరహిత సంఘటనయున్నను వీరరసస్ఫూర్తి కది భంజకమగుట లేదు. కావున సంఘటనలకు రసవిషయమున నియతత్వము లేదనుట యుదాహరణముఖమున స్పష్టమైనది. దీనిని బట్టి గుణములును సంఘటనయు నొకటే యనువికల్పము పరాస్త మగును. అట్లే అనియతమైన సంఘటనకు నియతమైన గుణములకు నాశ్రయాశ్రయిభావము కూడ కుదరదు. అయినచో గుణములు వేని నాశ్రయించి యుండు నను శంక యొకటి పొడమవచ్చును. అవి యంగియగురసాద్యర్థము నాశ్రయించియుండును. ఆరసాదికము కొన్ని యెడల సంఘటనవలన వ్యంజింపఁబడును.

గుణములు సంఘటనను నియమింపఁజాలవనువిషయము పైవికల్పనిరాకరణము మూలమున స్పష్టమైనది. అయినచో 'సంఘటనానియామక

హేతువేది?' యను ప్రశ్న యిట పొడమును. దానికి "తన్నియమే హేతు రౌచిత్యం వక్తృవాచ్యయోః" అనునది సమాధానము.

వక్తయును వాచ్యమును బహువిధములుగా నుండును. కవియు, కవినిబద్ధ వ్యక్తులును వక్త లగుదురు. కవినిబద్ధుఁడు రసభావాదిసమన్వితుఁడగుటయు, కాకుండు టయు గానవచ్చును. కథా నాయకుఁడు ధీరోదాత్తాదులతో నన్యతముఁడు కావచ్చును. అతఁడు కావ్యమున ప్రధానుఁడో ఉపనాయకుఁడో అయి యుండవచ్చును.

వాచ్యము కూడ పలువిధములుగా నుండును. అది రసవ్యంజకమగుటయో, రసాభాసవ్యంజకమగుటయో సంభవించును. అభినేయార్థము కావచ్చును. కాక పోవచ్చును. అట్లే ఉత్తమ మధ్య మాధమ ప్రకృతులలో దేనినో యాశ్రయించి యుండవచ్చును. ఇట్లు వాచ్యము పలువిధములుగా నుండును. వీనిని బట్టియే సంఘటన నియమింపఁ బడును. అనియమన మెట్లుండదగునను సంశ మిట్లు నిబంధింపఁ బడినది.

కవిగాని, కవినిబద్ధవక్తగాని రసభావహీనుఁడగుచో రచన యతనియిచ్ఛ వచ్చినట్లుండవచ్చును. కాక యతఁడు రససమన్వితుఁడైనచో, నా రసాదులును ప్రధానములై ధ్వనివ్యపదేశమును బొందునేని అపుడు తప్పక సంఘటన సమాసరహితయో స్వల్ప సమాసయో కావలయును. ప్రత్యేకించి విప్రలంభశృంగారమునందును, కరుణమునందును సంఘటన యెల్లపుడును సమాసరహితముగానే యుండవలయును. ఈ క్రింది యుదాహరణములం దిది సమన్వితమగును :

> "దేవలోకంబున నీ విప్పు డెవ్వతఁ దీపారుపలుకులఁ దేర్చి కురులు
> పుడుకుచుఁ దగ నన్నుపోలె లోలాత్మఁగాఁ జేయుచున్నాఁడవు; చెలువు నేర్పు
> మెఱయంగ నచ్చరతెఱవలమనమును గలఁచి యాడుదు గాక-యలఁతిఁ బోదె!
> యంగనాగోష్ఠి నున్నపుడు నానడవడి బుద్ధిఁ దలంతె; నిన్నొందఁగాంచి
>
> యాఱునెలలు వోయె; నంతియ యింతియ కాని - లేదె తొంటిమేనఁ జేసి
> నట్టిమేలు మోహనాకార! యభిమన్యువీర! నిర్వికార ! వినుతసార!" 10.2.82

చచ్చిపడినయభిమన్యుసిఁ గాంచి విలపెంచుచున్న యా యుత్తర వాక్యములు కరుణరసస్ఫోరకములై యున్నవి. కావుననే యిందలి సంఘటన అల్పసమాసరూపయై రసవ్యంజకమగుట కానవచ్చుచున్నది.

ఇట్లే పూర్వోదాహృతమగు 'కలహంస పలికిన పలుకులు గణియించు' నిత్యాదిదమయంతీవిరహావస్థ నభివర్ణించు పద్యమునందును విప్రలంభశృంగార

స్ఫోరకముగా సమాసరహిత సంఘటనయే యున్నది. 'చారువిభూషణాహార విహార శయ్యాసనభోగంబులందు' అనుసమానము కొంచెము దీర్ఘమే యయ్యును ఆమెకు జనించిన 'యరతి' యను మన్మథావస్థ గాఢత్వము నది స్ఫురింపఁజేయుచున్నది. ఇట్లు కరుణ విప్రలంభశృంగార నిర్వహణాతత్పరత్వమున రసభావసమన్వితులగు కవులు సమాసముల కూర్పులో సంయమనము పాటించిన తెలుఁగు మహాభారతమున సార్వత్రికముఁగా గానవచ్చును.

సమాస మున్నంతమాత్రమున రసప్రతీతి కది భంజక మెట్లగునని శంకింప రాదు. సమాస కల్పనలో పెక్కువైచిత్రు లుండును. 'జానకీప్రియుఁడు' అను సమాసమునకు జానకి యొక్క ప్రియుడు, జానకి ప్రియంగాఁ గలవాడు అనుషష్ఠీబహువ్రీహ్యర్థములు రెండును సంభావ్యము లగును. అట్టియెడ తదర్థభావనపై సహృదయునిదృష్టి కేంద్రీకృతమై రసస్ఫురణ కొక్కొక్కప్పుడు వ్యవధాన మేర్పడును. ఆనందపర్యాయమగురస మవిచ్ఛిన్నముగ నేకాకారమున ననుభూయమానము కావలయును గాని నడుమ వ్యవధి యుండరాదు. ఎచట సమాసము రసాభివ్యక్తికి ప్రతిబంధకము కాదో యట్టిది యున్నను దోషము లేదు. కావున సుకుమారములైన రసములందు దీర్ఘసమాససంఘటనవిషయమున కవి యత్నమును వీడవలయును.

ఇది శ్రవ్యకావ్యవిషయము. దృశ్యమునందీ విషయమున మఱియు జాగ్రత్త వహింపవలయును. అచట ఉత్తరోత్తరార్థము వెంటవెంట వచ్చిపడుచుండుటచే పూర్వపూర్వార్థమును నిలిచి సమన్వయించుకొనుట కవకాశమే యుండదు. కావున దీర్ఘసమాసభూయిష్ఠరచన రసాదులయందు సర్వథా పరిత్యాజ్యమే యగును. రౌద్రాదు లభినేయము లగునపుడు దృశ్యములందు మధ్యసమాస యగుసంఘటన నాశ్రయింప వచ్చును.

రౌద్రాదులు శృంగారకరుణములవలె సుకుమారములు కావు కావున తద్రస విషయమునను శ్రవ్యములందు ధీరోద్ధతుఁడగునాయకుని వ్యాపారమును వర్ణించు నపుడును, తత్సదృశసందర్భములందును దీర్ఘసమాసయగుసంఘటన దుష్టము కాదు. అచట నది వ్యంజకమే యగును. ఈక్రింద యుదాహరణములు దీనిని స్పష్టపఱచును.

"రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
చయముల సంచలచ్చటులసైనికమత్స్యములన్ భయంకరం
బయి యదువృష్ణిభోజకుకురాంధకవాహినియుం గలంగె ని
ర్దయతఁ గరోషమారుతసతాంతసమీరితమై క్షణంబునన్" 2.2.33

ఇందు ధర్మజసభాక్షోభము భయానకస్ఫూర్తిని కలిగించును గావున నిచటి దీర్ఘ సమాససంఘటన తద్రసమునకు వ్యంజకమే యగును.

"ఆయతకుంతకార్ముకగదాసిపరశ్వథశూలపట్టిసా
ద్యాయుధఘోరహస్తులు కులాచలతుంగతనుల్ ప్రచండతే
జోయుతు లావియచ్చరులు శూరతమై నడతెంచి బల్విడిం
గోయని తాఁకి రుగ్రరణకోవిదులై కురురాజసైన్యమున్." 3.5.391

ఇందు దుర్యోధనునిసేనపై వఱతెంచినగంధర్వవీరులవీరరసస్ఫూర్తి కనుగుణముగా దీర్ఘసమాససంఘటన కూర్పఁబడినది.

"మౌళిస్రక్సంగరంగన్మధుకరపటలీమానసాకృష్టివిద్యా -
శాలిస్ఫారాబ్జరేఖాంజలిపుటఘటనాచారుఫాలస్థలక్ష్మా -
పాలశ్రేణీవిశాలాంబక కుముదవనీబాంధవాయత్తచంద్ర -
శ్రీలీలాగాఢకాంతిస్మితవదనరుచిస్ఫీతు నాగేంద్రకేతున్." 4.3.78

చూపఱకు విస్మయావహమైనదర్శనము గల దుర్యోధనమహాచక్రవర్తి వర్ణనమును తిక్కనామాత్యుఁడు దీర్ఘసమాససంఘటనలో నిబంధించి యద్భుతరసమును స్ఫురింపఁజేయుచున్నాడు.

సర్వరససాధారణమగుప్రసాదభూయిష్ఠరచన యున్నచోట సమాసములున్నను సుకుమారరసములును స్ఫురించుచునే యుండును. ప్రసాదము సర్వవ్యాపి యగుగుణము. సమాసఘటవలన నయ్యెడు రసప్రతిబంధకత్వము నయ్యది నివారింపఁగలదు.

"అలసత యొప్పఁగాఁ దరుణి యమ్మునివల్లభుభ్రమోల నున్నసం
మిళితసుగంధబంధురసమీరవశంబునఁ దూలి బాల పై
వలువెడలన్ బయల్పడియె వల్గకుచంబులుఁ గక్షయుగ్మమున్
లలితకృశోదరంబుఁ దరళత్రివళీయుత రోమరాజియున్." 1.4.44

ఇత్యాదులందు దీర్ఘసమాససంఘటన యున్నను రచన ప్రసాదగుణభూయిష్ఠ మగుటచే రసప్రతీతికి విచ్ఛేదము కలుగుటలేదు.

ఇట్లే ఓజోగుణ ముండవలసినసన్నివేశమున నది లేకున్నచో నాభారమును ప్రసాదగుణము వహించును. ఇట్లు సంఘటనకు గుణములకువలె నైయత్యము సిద్ధించుటలేదు. ఈరసమున కీసంఘటన యని అది నియతవిషయమైనచో సంఘటనలు రసాదివ్యంజకములగుటను బ్రత్యేకముగా చెప్పనక్కరయేలేదు. నియతములు కావు కనుకనే వర్ణపదాదులవలె సంఘటనలును వ్యంజకము లగునని చెప్పుటకు వీలయినది. సారాంశ

మియ్యది : ప్రతివర్ణమును, ప్రతిపదమును వ్యంజకము కాని విధముననే ప్రతిసంఘటనయు వ్యంజకము కాదు. కావున రసభావసమన్వితుడగు కవి రసాదివ్యంజకముగా సంఘటనల నిబంధించుట కానవచ్చును.

మఱియు సంఘటనానియామకములలో కావ్యభేదములకును ప్రధానస్థానము గలదు. కావ్యభేదముల ననుసరించి సంఘటనలు మారుటయుఁ గానవచ్చును.

ముక్తకములు, సందానితకము, విశేషకము, కాలాపకము, పరికథ మున్నగు రచనాభేదము లెన్నియో యున్నవి. ముక్తకాదులలో కవికి రసభావాభినివేశమున్నచో సంఘటన పూర్వము చెప్పినవిధమున పాటింపఁబడుటయు, లేనిచో లేకుండుటయుఁ గానవచ్చును. ముక్తకాదులం దేపద్యమున కాపద్యమే స్వతంత్రముకదా! వానియందును విభావానుభావసామగ్రి యుండునా ? అని శంకింపరాదు. ఏకైకశ్లోకము ప్రబంధశతాయమానమని ప్రసిద్ధి కెక్కినయమరుకము మున్నగువానినిబట్టి ముక్తకాదులయందును రసాదిస్ఫూర్తి యుండవచ్చును.

గద్యవాఙ్మయమునందును ధ్వనికారుఁడు ప్రత్యేకించి సంఘటనానియమమును వక్కాణించెను. వానియందును కవిగాని, కవినిబద్ధవక్తగాని రసభావరహితుఁడైనచో సంఘటన యథేష్టముగా నుండవచ్చును. అట్లుగాక రసభావసమన్వితుఁడైనచో తత్తద్రసానుగుణముగ సంఘటన యుండును. అందు మఱియును విషయౌచిత్యమును గూడ ననుసరింపవలయును. ఆఖ్యాయిక యందెక్కువగా మధ్య సమాస, దీర్ఘసమాస సంఘటనలుండుటవలన గద్యమునకు దీప్తివచ్చును. మఱియు నిట్టి గద్యకావ్యమున రౌద్రరసవ్యంజన మవసరమైనచోటులందు అర్థౌచిత్యము ననుసరించి దీర్ఘసమాస సంఘటన కూర్చవలసివచ్చినను ఉపనాగరికవృత్తినే యవలంబింపవలయును గాని పరుషవృత్తినో, గ్రామ్యవృత్తినో స్వీకరింపరాదు.

చరిత్రప్రధానమగు పరికథయందు రసబంధమున కంతగా స్థాన ముండదు కావున నచట సంఘటన యథేచ్ఛముగా నుండవచ్చును. ప్రాకృతభాషయందు ప్రసిద్ధములైన ఖండకథ, సకలకథ యనువానియందు కులకాదు లధికముగా నుండును గావున దీర్ఘ సమాససంఘటన యున్నను నష్టములేదు.

సర్గబంధమున - రఘువంశమువంటిమహాకావ్యమున - రససాధనమున కవి కభినివేశ మున్నచో నాయారసానుగుణముగ సంఘటన లుండవలయును.

ఇట్లు సంఘటనానియామకములను పరిశీలించి కవి వాని నాదరింపవలయును. అప్పుడే వానికి వ్యంజకత సిద్ధించును.

సంఘటనలు వ్యంజకములయిన కొన్ని యుదాహరణములను మహాభారతము నుండి పరిశీలింతము.

అమృతసంపాదనార్థము యతించుదేవదానవులయుత్సాహాతిశయము నీక్రింది దీర్ఘసమాససంఘటన వ్యక్తముచేయును.

"క్షోణీచక్రభరంబు గ్రక్కదల దిక్కుల్ మ్రోయఁగా నార్చి య
క్షీణోత్సాహసమేతులై రయమునన్ గీర్వాణులుం బూర్వగీ
ర్వాణవ్రాతము నబ్ధిఁ ద్రచ్చునెడఁ దద్వ్యాకృష్టనాగానన
శ్రేణీప్రోత్థవిషాగ్నిధూమవితతుల్ సేసెం బయోదావలిన్." 1.2.12

వాచ్యమున కొంత మార్దవము, కొంత కాఠిన్యము నున్నచో మధ్యమసమాస సంఘటన నెలకొని దానికి వ్యంజకమగును. అట్టిదాని నీక్రిందిపద్యమున నరయఁ దగును.

"ఘనబాహాబలదుర్నివారమహిమన్ గంధర్వవీరుల్ సుయో
ధనుఁ దత్కాంతలఁ దత్సహోదరుల బంధప్రాప్తులం జేసి కై
కొని వేపోవుచునున్నవారదె; ఘనక్షోభంబు గావించి నీ
యనుజవ్రాతముఁ గావవే కరుణ నిండారంగ రాజోత్తమా !" 3.5.402

ఘోషయాత్రలో గంధర్వులచేఁ బట్టువడ్డదుర్యోధనునిదీనస్థితిని సకరుణముగా విన్నవించి ధర్మజుని కార్యోన్ముఖత్వమునం దుత్సాహవంతునిగాఁ జేయుటకు ప్రయత్నించుదుర్యోధనానుచరులయుక్తులందలిశోకోత్సాహముల నీపద్యమునందలి మధ్యమసమాససంఘటన చక్కగా నభివ్యక్తము చేయుచున్నది.

పెక్కుకాల మిడుమలఁబడిన పుత్రకులక్షేమమరయుచునే కృష్ణునితో వారి పరాక్రమాది గుణముల నుగ్గడించుచు ప్రస్తుతము వా రనుభవించుదయనీయస్థితికి వగచెడుకుంతీదేవి పలికెడు నీక్రిందివాక్యములందు వాత్సల్యమృదుకోపదుఃఖములను మధ్యమసమాససంఘటన యెట్లభివ్యక్తముచేయునో యీక్రిందిపద్యమునఁ జూడ వచ్చును.

"దానదయాపరుండయినధర్మతనూభవుసేమ మెట్లు ? పం
చాననవిక్రముండగుబకారికి సేమమె ? యస్త్రశస్త్రవి
ద్యానిపుణుండు క్రీడి సుఖియా ? వినయాభరణుల్ కవల్ సమా
ధానసమేతులే ? యకట! ద్రౌపది సాధ్వి సుఖంబె దానికిన్ ?" 5.3.186

అసమాససంఘటన వ్యంజక మగుట నీక్రిందిపద్యమునఁ గానవచ్చును. తానిచ్చిన గోవునకు మాఱుగా వేలకొలఁది గోవుల నిత్తును, మున్నిచ్చినదానిని వదలుమని ప్రార్థించెడునృగమహారాజుతో విప్రుడు దీనత దోఁపగఁ బల్కిన పల్కులు :

"పాలుగడుఁబెక్కు;దానిసబాములెస్స; పెయ్యకర్మిలిగలదు;మ్రత్రియ సుతుండు
పాల కేడ్చినయపుడ చన్నట్టనిచ్చు నేదిప్రొద్దైన, నట్టి గోవెందుఁ గలదు."13.2.427

ఇందావిప్రుని ప్రార్థనాదైన్యమును, గోవు పరమసాధుస్వభావమును అసమాస సంఘటన చక్కగా వ్యక్తము సేయుచున్నది.

ఇట్లు సంఘటన యననేమొ, తన్నియామకసూత్రము లెట్టివో, యది వ్యంజక మగుట యెట్లో పరిశీలించితిమి. మహాకవి పాండిత్యప్రకర్షాపదర్శనమునకై సమాసకల్పనము చేయఁడు. అందును కవిత్రయమువారు తమరచనలయం దెచటను మెలఁకువను వీడక, చాపల్యమును బ్రదర్శింపక సన్నివేశమునకుఁ దగినసంఘటనలను గూర్చుకొనిరి. కావున నాంధ్రమహాభారతములో సంఘటన వ్యంజక మగుట యెల్ల యెడలను గానవచ్చును.

## 4. ప్రబంధము - వ్యంజకత్వనిబంధనము :-

అలక్ష్యక్రమవ్యంగ్యము ప్రబంధములలో దృశ్యమానమగుట ప్రసిద్ధమే. కాని అట్టి ధ్వనివిశేషము ప్రబంధములలో ప్రకాశింపఁ జేయుటలో కవి కొన్ని నియమములను పాటింపవలసియున్నది. ధ్వనికారుఁ డానియమముల నీక్రిందికారికలలో వివరించెను.

"విభావభావానుభావసంచార్యౌచిత్యచారుణః,
విధిః కథాశరీరస్య వృత్తస్యోత్ప్రేక్షితస్య వా.
ఇతివృత్తవశాయాతాం త్యక్త్వాననుగుణాం స్థితిమ్,
ఉత్ప్రేక్ష్యౌ౽ ప్యంతరాభీష్టరసోచితకథోన్నయః.
సంధిసంధ్యంగఘటనం రసాభివ్యక్త్యపేక్షయా,
నతు కేవలయా శాస్త్ర స్థితిసంపాదనేచ్ఛయా.
ఉద్దీపనప్రశమనే యథావసర మంతరా
రసస్యారబ్ధవిశ్రాంతే రనుసంధాన మంగినః.
అలంకృతీనాం శక్తా వప్యానురూప్యేణ యోజనమ్
ప్రబన్ధస్య రసాదీనాం వ్యఞ్జకత్వే నిబన్ధనమ్".(ధ్వ. తృ. 10, 11, 12, 13, 14.)

(1) ప్రబంధమునం దితివృత్తము పురాణప్రసిద్ధమే యైనను, లేక కవికల్పితమైనను విభావము, భావము, అనుభావములు, వ్యభిచారిభావములు అనువాని యౌచిత్యముతో సొంపునింపవలయును.

(2) ఇతివృత్తవశమున వచ్చినరసభంజకమైనస్థితిని, రసోచితముగా కవి

యూహించి మార్చుకొనవలయును.

(3)సంధిసంధ్యంగఘటనమును కేవలము శాస్త్రస్థితిసంపాదనేచ్ఛతో కాక, రసాభివ్యక్త్యపేక్షతో చేయవలయును.

(4) సమయానుగుణముగ సంగిరసమునకు ఉద్దీపనప్రశమనములను గలిగించుచు నది పూర్తిగా విశ్రాంతమగునపుడు మఱల ననుసంధించుచుండవలయును.

(5) అలంకారనిర్మాణచాతురి కవి కెంతగా నున్నను సముచిత మగు విధముగానే వానిని కూర్పవలయును.

ప్రబంధము రసాదులనభివ్యక్తముచేయుట కియ్యవి ఏర్పాటులు.

మహాభారతమువంటి మహాగ్రంథమున సముదాయంరూపమున నీ నిబంధనముల నన్వయించుట అంతసుకరమైనవిషయముకాదు. కవిత్రయమువారు మహాభారతమును కేవల మితిహాసదృష్టితో కాక, మహాకావ్యముగా తీర్పిదిద్దివలయు నను తాత్పర్యముకలవారేయైనను, ఔచిత్యాదివిషయములపరిరక్షణకై యత్నించుచునే వ్యాసభగవానునిరచనకు విరుద్ధముగా వ్రాయవలసివచ్చినచో సంకోచమును విడనాడలేదు. కావుననే కొన్ని తావులందు పాఠకునిమనస్సున కీఘట్టమున నీవిధముగా లేనిచో బాగుండునేమో యనునభిప్రాయము కలుగుచుండుతావులును క్వాచిత్కములుగాఁ గలవు. నన్నయను 'కృష్ణద్వైపాయనమునివృషభాభిహితమహాభారతనిరూపితార్థమేర్పడు, నట్లుగా మహాభారతమును తెలుఁగున రచింపవలసినదిగా రాజరాజనరేంద్రుఁడు ప్రార్థించినను 'కవీంద్రులు లోనారసి మే-' లనునట్లుగా జగద్ధితబుద్ధితో రచించెను. తిక్కన్నయు 'నాంధ్రావళి మోదముం బొరయు నట్లుగా' రచింతు నని వ్రాకుచ్చెను. సాధుజనహర్షసిద్ధిని ఎఱ్ఱనయు వాంఛించెను. ఇట్లీకవిత్రయంమువారి కవితాలక్ష్యములను పరికింప మూలభారతమున నున్న విషయమును యథాతథముగ ననువదించుటయే వారితాత్పర్యమని తోఁపదు. దీనికి హేతు వేమై యుండును ? పిలయినంతవఱకు రససంపాదనేచ్ఛయే కావలయును. అంతమాత్రమున వ్యాసభగవానునిరచన నీరస మని శంకింపరాదు. అది ప్రధానముగా నితిహాసము కనుక నందు రసదృష్టికంటె విషయనివేదనకే ప్రాధాన్యము హెచ్చు. ఇతిహాసపురాణములు భిషగ్వరులవంటివి. రుగ్ణతానిర్ణయమునకును రోగాపనోదనమునకును వైద్యుఁడు నిస్సంకోచముగా శరీరమునందలి సర్వాంగములను పరిశీలించి చూచినట్లు ఇతిహాసపురాణకర్తలు సర్వవిషయములను సంకోచమును విడనాడి వక్కాణింతురు. అది అభిలషణీయమే కాని పరిత్యాజ్యము కాదు. రససంపాదనేచ్ఛగలకవులు ఇతిహాసాదులనుండి యితివృత్తములను గ్రహించుచు సహృదయహృదయావర్జనమునకై

మార్పులు చేర్పులు చేసికొందురు. ఇదియును నభిలషణీయమే. కావున మూలభారతమునుండి యేవైనమార్పు లుటంకించినచో నీదృష్టి ననుసంధించుకొనుట పాడి.

ఈపూర్వరంగముతో పైనిపేర్కొనిననిబంధనములు భారతమునందలి యొకకథా భాగమున సమన్వయము చేయఁబడుచున్నవి.

ఉదాహరణమునకు నన్నయభారతభాగమునుండి దుష్యంతోపాఖ్యానమును గ్రహింతము. ఇందు ప్రధానరసము ధర్మవీరము. నాయకుఁడగు దుష్యంతునికిని నాయిక శకుంతలకును ధర్మరక్షణతత్పరత్వము మొదటినుండి తుదివఱకు నిందుఁ గన్పట్టుచున్నది. తదనుగుణమగునుత్సాహ మిందు స్థాయిభావము. ఇట నొక శంక యుప్పతిల్లును. దుష్యంతుడు శకుంతలను వంచించెను. అడవిలో నేకాంతముగఁ గానవచ్చినకన్య నేవో మాటలతో వశపఱచుకొని వివాహమాడి, తుదికి పుత్త్రవతియై తనకడకు వచ్చినసతిని విడనాడఁబూనుట ధర్మద్రోహముకాదా ? అన్నచో ఉత్తమ క్షత్త్రియునికి ప్రజారాధనతత్పరత్వముకంటె మిన్నయగుధర్మము లేదని సమాధానము. రామచంద్రుని వాక్యముగా భవభూతిమహాకవి చెప్పినయీక్రిందిశ్లోకము పైవిషయమునకు తార్కాణము :

"స్నేహం దయాం చ సౌఖ్యం చ యది వా జానకీ మపి,
ఆరాధనాయ లోకస్య ముఞ్చతో నాస్తి మే వ్యథా" (ఉ. రా. చ.)

కావున దుష్యంతుఁడు చేయవలసివచ్చినశకుంతలాతిరస్కారము ప్రజారాధన తత్పరత్వముతో చేసిన దనుటలో సందేహము లేదు. సంస్కృతాంధ్రభారతము లందు దీనికిఁ దగినసాక్ష్య మున్నది.

"శృణ్వన్త్వేతద్భవన్త్వ౭ స్య దేవదూతస్య భాషితమ్;
అహ మప్యేవ మేవైనం జానామి స్వయ మాత్మజమ్;
యద్యహం వచనాదేవ గృహ్ణీయా మిమ మాత్మజమ్-
భవేద్ధి శఙ్కా లోకస్య; నైవం శుద్ధో భవే దయమ్" (మహా భా. 1.69.35,36)

ఆంధ్రభారతమునందలి యీక్రిందిపద్యములు పైయర్థమును సంగ్రహించు చున్నవి.

(1) "ఏను నీయింతియును గానియొఱుఁగరన్య లర్థిఁగణ్వమహాముని యాశ్రమంబు నందుగాంధర్వవిధి వివాహమునఁ గరము నెమ్మిఁ జేసినదీనిపాణిగ్రహణము."

1.4.107

(2) "అన్యు లెఱుఁగమిఁజేసి లోకాపవాద భీతి నెఱిఁగియు నిత్తన్విఁ బ్రీతి దప్పి
యెఱుఁగ నంటిని;నిందఱ కిప్పు డెఱుఁగఁ జెప్పెనాకాశవాణియచ్చెరువు గాఁగ."

1.4.108

మఱి గాంధర్వవివాహము చేసికొనఁదలఁచినపుడీ వివేక మేమయినదని ప్రశ్న కలుగును. గాంధర్వ వివాహమునకు నిర్ణయము చేయకముం దామె కణ్వుని యౌరస పుత్త్రికాదని దుష్యంతుడు ప్రమాణీకరించుకొనెను. ఈయంశమును బట్టి యాతఁడు కేవలము వ్యామోహముతో ప్రవర్తిల్లెనని చెప్పఁజాలము. కణ్వమహర్షిని ప్రార్థించి వివాహము చేసికొంద మన్నచో నది దైవాయత్తము. తన కామెపైఁగల యనురాగము ఫలింప వచ్చును; ఫలింపకను బోవచ్చును. ఒకవేళ కణ్వుఁ డనుగ్రహించినను నామె స్వయంవరలబ్ధయో, తదితర క్షత్త్రజాత్యుచిత పద్ధతిని లభించినదియో కాకపోవుటచే ప్రజలకు ప్రమాణీకరించి చెప్పి యొప్పించుటయు కష్టము. ఈ పరిస్థితులలో గాంధర్వరాక్షసములు క్షత్రియో చితములు కావున వానిలో నన్యతరము తన కుపాదేయము. ఇట్టిక్లిష్టసన్నివేశములో కోరికను చంపుకొని యామెయందు ప్రవర్తింపకుండుటయే మేలుకదా అనియు శంకింపవచ్చును. అనపత్యుఁడు కావున ప్రజాతంతువ్యవచ్ఛేదము తనవలన నగుట ధర్మవిరుద్ధము కావున సంతానార్థము యతింపనేవలయును. బహువల్లభత్వము రాజులకు దోషము కాదు. కావున క్షత్రియోచితమగుగాంధర్వము నాతఁడు శకుంతలచే నంగికరింపఁ జేసెను. అయినచో తనతో నామెను గొనిపోవుటయో, యామెను తనకడకు రప్పించుకొనుటయో యాతఁడు చేయవలదా, యన్నచో ప్రధానములైన రెండు చిక్కులు గలవు. (1) కణ్వానుగ్రహము (2) ప్రజాంగీకారము. అట్లయినచో శకుంతలగతి యేమి? తనపురుషార్థసిద్ధికై యామెను బలిగొన్నట్లేకదా! అన్నచో ఆమెసౌశీల్యము, ధర్మతత్పరతయును దన్ను నామెను గూడ కాపాడవలయును. దానికై దుష్యంతుఁడు కాలము గడచుచుండఁగా నిష్క్రియుడై యుండవలసి వచ్చినది.

ఉన్నకథాగతినిబట్టి పరిస్థితుల ఆకళింపువలన నిట్టి యాలోచన కిట నెంతయు నాస్కారము గలదు.

ఇప్పు డీకథలో రసపోషణతత్పరత్వమున నన్నయామాత్యుడు చేసిన మార్పులను కొన్నింటిని గమనింతము.

(1) తన్ను గాంధర్వవిధిచే వివాహమాడు మని దుష్యంతుఁ డడుగఁగా మూలభారతమున శకుంతల పలికినపలుకు లియ్యవి :

"యది ధర్మపథస్త్వేష- యది చాత్మా ప్రభు ర్మమ,
ప్రదానే పౌరవశ్రేష్ఠ : శ్రుణు మే సమయం ప్రభో !

సత్యం మే ప్రతిజానీహి - యత్త్వాం వక్ష్యా మ్యహం రహః;
మమ జాయేత యః పుత్త్రః స భవే త్త్వదనంతరమ్.
యువరాజో మహారాజ ! సత్య మేతద్బ్రవీహి మే;
యద్యేత దేవం దుఃషన్త ! అస్తు మే సంగమ స్త్వయా."

(మహా భా. 1.67.15, 16, 17.)

ఇందు మొదటిమూఁడు పాదములభావము తెలుఁగున రాలేదు. కడమ మూఁడు పాదములభావ మొకచంపకమాలలో రమణీయవ్యంగ్యార్థవైభవముతో రూపుదిద్దుకొనినది.

"నరనుత ! నీప్రసాదమున నాకుదయించిననందనున్ మహీ
గురుతర యౌవరాజ్యమునకుం దయతో నభిషిక్తుఁ జేయఁగా
వరము ప్రసన్న బుద్ధి ననవద్యముగా దయసేయు నెమ్మితో;
నిరుపమదాన ; అట్లయిన నీకును నాకును సంగమంబగున్."1.4.60

ఈరెంటివాక్యధోరణిలో భేదము స్పష్టముగా తెలియుచునేయున్నది. తెలుఁగు రచనమున శకుంతలకు రాజును వివాహమాడవలయు నన్న అభిప్రాయము ప్రతి పదమునను ధ్వన్యమానమగుచున్నది.

(2) శకుంతలాసరససఘట్టమున నున్న యీక్రింద మూలశ్లోకముల భావమును నన్నయ పూర్తిగ వదలెను.

**దుఃషన్తఉవాచ :-**

"న పుత్త్ర మభిజానామి త్వయి జాతం శకుంతలే !
అసత్యవచనా నార్యః; కస్తే శ్రద్ధాస్యతే వచః.
మేనకా నిరనుక్రోశా బంధకీ జననీ తవ,
యయా హిమవతః పృష్ఠే నిర్మాల్యేవ ప్రవేరితా.
స చాపి నిరనుక్రోశః క్షత్త్రయోనిః పితా తవ,
విశ్వామిత్రో బ్రాహ్మణత్వే లుబ్ధః కామపరాయణః,
మేనకా ప్సరసాం శ్రేష్ఠా మహర్షీణాం చ తే పితా,
తయో రపత్యం కస్మాత్త్వం పుంశ్చలీవాభిధాస్యసి.
అశ్రద్ధేయ మిదం వాక్యం కథయన్తీ న లజ్జసే,
విశేషతో మత్సకాశే; దుష్టతాపసి; గమ్యతామ్.
క్వ మహర్షిః సదైవోగ్రః- సాప్సరా క్వ చ మేనకా,
క్వ చ త్వ మేవం కృపణా తాపసీవేషధారిణీ !

అతికాయ శ్చ పుత్త్రస్తే బాలోఽపి బలవానయమ్,
కథ మల్పేన కాలేన శాలస్కంధ ఇ వోద్గతః.
సునికృష్టా చ యోని స్తే; పుంశ్చలీ ప్రతిభాసి మే;
యదృచ్ఛయా కామరాగా జ్జాతా మేనకయా హ్యసి;
సర్వ మేతత్పరోక్షం మే - యత్త్వం వదసి తాపసి
నాహం త్వా మభిజానామి; యథేష్టం గమ్యతాం త్వయా."

(మహా భా. 1.68.72 నుండి 80 వఱకు)

ఈజుగుప్సావహమైన ప్రసంగము నంతటిని గైకొనక నన్నయ యొక్క కందపద్యమును మాత్ర మీసందర్భమున రచించెను :

"ఏనెట; నీవెట; సుతుఁ డెట; ఏ నెన్నఁడు తొల్లి చూచి యెఱుఁగను నిన్నున్;
మానిను లసత్యవచనలు నా నిట్టు లసత్యభాషణం బుచితంబే." 1.4.100

సంస్కృతమునందలి దుష్యంతవాక్యములలోని మేనకావిశ్వామిత్ర దూషణము నాయకుఁడగు దుష్యంతుని శీలమున కుచితమైనది కాదని నన్నయ్యగారి నిష్కర్ష.

పై ప్రసంగమునకు శకుంతల యిచ్చిన సమాధానము కూడ మూలమున సుదీర్ఘముగా నతిపరుషముగా నున్నది. చూతము :

"రాజన్! సర్షపమాత్రాణి పరచ్ఛిద్రాణి పశ్యసి;
ఆత్మనో బిల్వమాత్రాణి పశ్యన్నపి నపశ్యసి.

మేనకా త్రిదశేష్వేవ; త్రిదశా శ్చానుమేనకామ్;
మమైవోద్రిచ్యతే జన్మ దుఃష్యన్త తవ జన్మతః.

క్షితా వటసి రాజంస్త్వ మన్తరిక్షే చరామ్యహమ్,
ఆవయో రన్తరం పశ్య మేరుసర్షపయో రివ.

మహేంద్రస్య కుబేరస్య యమస్య వరుణస్య చ,
భవనాన్యనుసంయామి; ప్రభావం పశ్య మే నృప!

సత్యశ్చాపి ప్రవాదోఽయం యం ప్రవక్ష్యామి తేఽనఘ!
నిదర్శనార్థం - నద్వేషా - త్తచ్ఛ్రుత్వా క్షన్తు మర్హసి;

విరూపా యావ దాదర్శే నాత్మనః పశ్య తే ముఖమ్ -
మన్యతే తావదాత్మాన మన్యేభ్యో రూపవత్తరమ్.

యదా తు ముఖ మాదర్శే వికృతం సోఽ భివీక్షతే,
తదేతరం విజానాతి ఆత్మానం; నేతరం జనమ్.
అతీవ రూపసంపన్నో న కించి దవమన్యతే,
అతీవ జల్పన్ దుర్వాచో భవతీహ విహేఠకః.

మూర్ఖో హి జల్పతాం పుంసాం శ్రుత్వా వాచః శుభాశుభాః,
అశుభం వాక్య మాదత్తే పురీష మివ సూకరః.
ప్రాజ్ఞస్తు జల్పతాం పుంసాం శ్రుత్వా వాచః శుభాశుభాః,
గుణవద్వాక్యమాదత్తే హంసః క్షీర మివాంభసః"(మహా భా. 1.69.1 నుండి 10 వఱకు)

ఈ శ్లోకముల తాత్పర్యము నంతటిని నన్నయ వదలివైచెను. మఱియు నింతకు పూర్వము శకుంతల పలికిన

"యది మే యాచమానాయా వచనం న కరిష్యసి,
దుఃష్యన్త శతధా మూర్ధా తతస్తేఽ ద్య ఫలిష్యతి" (మహా. భా. 1.68.35)

అనుశ్లోక భావమును గూడ నన్నయ స్వీకరింపలేదు. ఇతివృత్తవశాయాత మైన యననుగుణస్థితిని త్యజించుట కియ్యవి లక్ష్యములు.

కొండొకచో మూలములో లేనివానిని గూడ కథోచితముగా మనోహరముగా కవులు కల్పించుటయుఁ గానవచ్చును.

"విపరీతప్రతిభాష లేమిటికి సుర్వీనాథ! యీపుత్రగా
త్రపరిష్వంగసుఖంబు సేకొనుము - ముక్తాహార కర్పూరసాం
ద్రపరాగప్రసరంబుఁ జందనముఁ జంద్రజ్యోత్స్నయుం బుత్త్రగా
త్రపరిష్వంగము నట్లు జీవులకు హృద్యంబే కడున్ శీతమే." 1.4.91

ఈ పద్యమునందలి యుపమానద్రవ్యమంతయు నన్నయ కల్పించినదే. అవధిలేని మాతృవాత్సల్య మీయుపమాన ద్రవ్యజాతముచే చక్కగా నభివ్యక్త మగుచు శకుంతల యుత్తమమాతృత్వమును స్ఫుటీకరించుచున్నది.

ఇట్లు 'రసపోషకములైనవానినిఁ జేర్చుట' యనునిబంధన యుదాహరణ ముఖమున ప్రదర్శింపఁబడినది.

శకుంతల జన్మవృత్తాంతకథనము నందలి మేనకావిశ్వామిత్రుల శృంగారము నకు కవి యుద్దీపనము కలిగింపలేదు. ఏలయన ప్రధానమగు ధర్మవీరము ఆయుద్దీపనమువలన దెబ్బతినును. కావుననే యొండురెండుపద్యములలో నావృత్తాం

తమును ముగించి యచటి రతికి ప్రశమనమును కవి ప్రయత్నపూర్వకముగా సాధించెను. అట్లే దుష్యంతుఁడు శకుంతలను గాంధర్వ వివాహమున కొడంబఱచి యామెను వివాహమాడి 'అభిమతసుఖంబు లనుభవించె'నని మాత్రమే చెప్పెను. కాని ప్రధానమగు ధర్మవీరమునకు విఘాతమగునట్లుగా సంభోగశృంగారమును ఉద్దీప్తము చేయలేదు.

ప్రధానమగుధర్మవీరస్ఫూర్తి కనుగుణముగా సుమా రిరువదిపద్యములలో భార్య యనఁగా నెట్టిది? ఆమెను తిరస్కరించిన నెట్టికీడు వాటిల్లును? సత్య స్వరూప మెట్టిది? మున్నగునంశములను శకుంతలాముఖమున విస్తృతముగా వర్ణించెను. అనఁగా నచట ధర్మవీరమునకు కవి యుద్దేశపూర్వకముగా నుద్దీపనము కలిగించె నని తాత్పర్యము. మఱల నిరాశాజనితదుఃఖమునఁ గుందెడు శకుంతల శోకము నొక్కపద్యము నందును, మఱియొక్క వచనమునందు మాత్ర మభివర్ణించి అంగమగుకరుణమును గూడ ప్రశమితము గావించెను. ఇట్లు అంగరసముల ప్రశమనమును, అంగిరసము నుద్దీపనమును గవి చక్కఁగా గావించి రసస్ఫూర్తికి చక్కనిసామగ్రిని సంతరించెను.

అంగిని క్రమింగివైచి యసహ్యముగాఁ గానవచ్చు నలంకారజాత మేమియు నీకథాంశమునఁ గానరాదు. అట్లని అలంకారసంవిధానమునఁ గవికి శక్తిచాలలేదని సంభావింపరాదు. అవసరమనుకొన్నచోట 'విపరీతప్రతిభాష లేమిటికి' నిత్యాది పద్యములందు వ్యతిరేకాలంకారము మనోహరముగాఁ గూర్పఁబడినది. పుత్రగాత్ర పరిష్వంగసుఖము ననితర సాధారణత్వము నభివ్యంజించుటకు వ్యతిరేకాలంకార మెంతయు సహకారకముగదా!

అట్లే పితాపుత్రసంబంధ పవిత్రత్వాదిధర్మముల నీక్రింది పద్యమునందలి యుపమాలంకారము వైదికధర్మప్రతిపాదనపరముగా నెలకొని అభివ్యంజించు టెంతరమణీయమో చూడుఁడు :

"విను గార్హపత్య మనున య్యనలము విహరింపఁబడి తదాహవనీయం
బున వెలుఁగునట్లు వెలుఁగును జనకుఁడు దాఁబుత్రుడై నిజద్యుతితోడన్."
1.4.87

ఇట్లుదాత్తరమణీయములగునలంకారములను కవిత్రయమువారు రసోచితముగా సందర్భోచితముగాఁ గూర్చుట సార్వత్రికముగాఁ గానవచ్చును. కావున నలంకార నిర్మాణమున వారి శక్తి చాలదని భావించు టపచార మగును.

సంధిసంధ్యంగఘటనవిషయము ప్రధానముగా రూపకపరము. కావున వాని నిట పరిశీలింపవలసినయవసరము లేదు. ఇట్లు ప్రబంధము వ్యంజకమగుటలో

పాటింపవలసిన నిబంధనము లన్నియు నీదుష్యంతోపాఖ్యానమునఁ గాంచితిమి. ఈ కథాంశమువలన ముఖ్యముగా సహృదయున కుపదేశరూపమున వ్యంగ్యమగు నర్థము లెట్టివో పరిశీలింపవలసియున్నది. మానవుఁడు ప్రజార్థము గృహమేధి కావలయును. భార్య త్రికరణశుద్ధిగా నాతనికి వశంగత కావలయును. రాజైనవానికి ప్రజారాధనకు పిమ్మటనే ఆత్మసుఖవిచారణము. భర్త కాలవైపరీత్యమువలన నిరాదరించినచో భార్య యాతనికి తగుహితబోధ గావించి యతఁడు పాపకూపమునఁ బడకుండ నివారించుటకు యథాశక్తి ప్రయత్నింపవలయును. ధార్మిక ప్రవర్తన మేనాటికైనను జయించును. సత్యప్రతిష్ఠాపనమునకు అవసరమైనచో దైవము దిగి వచ్చును. రాజు ప్రజలకు సామమార్గమున నచ్చఁజెప్పవలయునే కాని నిరంకుశముగా తనయభిప్రాయములను వారంగీకరించునట్లు చేయుటకు యత్నింపరాదు. ధర్మమార్గనిష్ఠితులైనదంపతుల కుదయించినపుత్త్రుడు ధర్మేతరముగా ప్రవర్తింపక సుగుణాలవాలమై భరతునివలె చిరస్థాయి యగుకీర్తి నార్జించును. ఇట్టివిశేషార్థము లెన్నియో యీప్రబంధమున ధ్వనించును.

ప్రబంధములందు రసము ధ్వనించుట సాక్షాత్తుగానే కాక పరంపరగా కూడ జరుగును. అనఁగా ప్రబంధము ముందు సంలక్ష్యక్రమమున నొకయర్థవిశేషమును ప్రతీయమాన మొనర్చును. పిదప నాప్రతీయమానమగునర్థవిశేషముచేత రసాదిస్ఫురణ గలుగును. దీని కుదాహరణముగా మహాభారతము శాంతిపర్వమునందలి గృధ్రగోమాయుసంవాదకథ ధ్వన్యాలోకమున నుదాహరింపఁబడినది. అందు మృత శిశుకళేబరమును బగటివేళఁ దినఁ గోరిన గ్రద్ధ బంధుజనమును త్వరగా నటనుండి పంపివేయుటకు ప్రయత్నించును. చీకఁటిపడినపిదపఁ దినఁగోరి గోమాయువు వారిని నిలుపుటకు యత్నించును. ఈరెంటియభిప్రాయములును ప్రకరణాదివశమున సంలక్ష్యక్రమమున వ్యంగ్యములై ప్రధానమగుశాంతరసములో పర్యవసించును. అనఁగా నీరెంటిస్వభావములను ప్రతీయమాన మొనర్చుకొనినసహృదయహృదయమునందు లోకమునందలి సర్వజీవులును తమయాహారసంపాదనమునకై యితరులకు మేలుచేయు చున్నట్లు నటింతు రన్నస్ఫురణ కలిగి హేయమగు నిట్టిప్రవర్తనవలన నిర్వేదరూప వైరాగ్యము కలుగుననితాత్పర్యము.

ప్రబంధము వ్యంజక మగుమార్గ మిట్టిది. ఇ ట్లసంలక్ష్యక్రమవ్యంగ్యమునకు వ్యంజకములైన వర్ణ, పద, పదైకదేశ, వాక్య, ప్రబంధములను ఉదాహరణసమన్వయ పూర్వకముగా పరిశీలించితిమి. ఇప్పటికి లక్షణమున వక్తవ్యము తుదిముట్టినట్లే. అయినను ఈవిషయము సుదృఢమొనర్చుటకై మఱికొన్ని విషయములను ధ్వన్యాలోకకారుఁ డుటంకించెను. వానిని పరిశీలింతము.

5. సుబాదులవ్యంజకత్వము :-

సముచితస్థానమున ప్రయుక్తములైనసుబాదులును అసంలక్ష్యక్రమమును ద్యోతన మొనర్చునని ఈక్రిందికారిక వక్కాణించుచున్నది.

"సుప్తిఙ్వచనసంబంధై స్తథా కారకశక్తిభిః
కృత్తద్ధితసమాసై శ్చ ద్యోత్యోఽ లక్ష్యక్రమః క్వచిత్." (ధ్వ. 3.16)

నామవిభక్తులు, క్రియావిభక్తులు, వచనములు, సంబంధవిశేషములు, కారక శక్తులు, కృత్తద్ధిత విశేషములు, సమాసములు, సముచ్చయార్థకావ్యయముచే నిపాతములు, ఉపసర్గములు మున్నగునవియును అలక్ష్యక్రమవ్యంగ్యమునకుఁ గొండొకయెడ వ్యంజకము లగును. ఇవి యన్నియు పూర్వోక్తములైనవర్ణపదాదుల యేకదేశములో తద్రూపములో యగుటచే వ్యంజకత్వ విషయమున వీనికి వర్ణాదులతో సమానముగ పృథక్పరిగణనము చేయఁబడలేదు. ఈకారికయందుఁ జెప్పినయంశములన్నియు పూర్వోక్తవిషయమునకు వివరణప్రాయము లని తాత్పర్యము. వీని నుదాహరణముఖమున పరిశీలింపవలయును.

ధర్మతనయుఁ డన్నమాట ననుసరించి సంధియే యభిలషణీయ మని భీముఁడు పలుకఁగా నాతని కుడుకెక్కింపఁగోరిన శ్రీకృష్ణుఁడు కొన్ని సూటిపోటిమాటలాడెను. దానికి మృదుకోపమునొంది పరిహాసగర్భితముగా తనభావమును వెలార్చుచు భీముఁడు పలికినపలుకులు :

"ఏమీ పార్థుడు నీవు దండిమగలై యీవచ్చుకౌరవ్యసం
గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీర్పం బెద్దమిట్టెక్కి మి
మ్మేమెల్లన్ వెఱఁగందిచూచెదము గా; కీసారెకుం బోయి రా
భీముం డిత్తఱి రిత్తమాటలకుఁ గోపింపండునూ పెంపఱన్." 5.3.65

ఇం దించుమించు ప్రత్యవయమమును వ్యంజకమే యగుచున్నది.

'ఏమీ !' అనుప్రశ్నార్థకదీర్ఘయుతకిమర్థకసర్వనామము రాఁబోవుయుద్ధమున కృష్ణార్జునులపరాక్రమమే సర్వార్థసాధక మనుటలోని యసంభావ్యత నభివ్యక్తము చేయుచున్నది.

అర్జునునియందు పార్థశబ్దము రూఢమైనప్పటికిని పార్థుఁడే అయినభీముఁడు దానిని ప్రయోగించుటలో మేమును అంతటివారమే సుమా! అనునభిమానము ద్యోతమానమగును.

నీవు అనుసర్వనామమువలన ప్రధానముగా నష్టపడిన మే ముండఁగా నీకేరణ కండూతి యేల ? అనునర్థము ప్రతీయమానమగును.

దండిమగలు అనుచోటివిశేషణ మొకయెత్తిపొడుపు. మీయిరువురికంటె

పరాక్రమవంతు లింక లోకమున నుండరని మీయభిప్రాయము. అదిసరికాదుసుమా! అను నెచ్చరిక దీనివలన తోఁచును.

ఈమూఁడుచోటులందలి ప్రథమయు కర్త్రర్థమున ప్రయుక్తమై 'మీ ప్రయోజకత్వము తప్పమాకు గతిలేదయ్యెనే !' యనునవహేళనము నభివ్యంజించును.

'ఈ' యనునిర్దేశార్థకసర్వనామము యుద్ధము అత్యంత సన్నిహితమగుటను సూచించును. 'ఇదిగో వచ్చుచున్నదికదా ! అందు మా మా పరాక్రమములు చక్కగా వెల్లడి యగునులే' యనునర్థమును స్ఫురింపఁ జేయును.

'వచ్చు' అనుక్రియాజన్యవిశేషణము యుద్ధము అనివార్యత నభివ్యక్తము చేయును.

'కౌరవ్య సంగ్రామక్షోభము' అను సమాసము మనస్సునందలి యనిష్టతను దెలుపును. ఇది నిష్ప్రయోజనమగు క్షోభమే కాని దీనివలన పొందెడు ప్రయోజన మేమియు లేదుసుమా- అను నిర్వేదము నిందలి క్షోభశబ్దము వెల్లడిచేయును. 'కౌరవ్య' అనుదాని తద్ధిత ప్రత్యయ ముభయపక్షములయుఁగుదురును బోధించుచు సంగ్రామవాంఛలోని నైచ్యమును ప్రతీయమాన మొనర్చును. ఎవ్వరు గెల్చినను నెవ్వ రోడినను నందఱు నొక్కవంశము వారే కదా ! అను నభిప్రాయమున కీ యపత్యార్థక తద్ధితప్రత్యయము వ్యంజక మగునని భావము.

'బాహుదర్పమునన్' అనుచోటి కరణార్థక 'న' ప్రత్యయము కృష్ణార్జునుల భుజగర్వపు సాధకతమత్వము నెత్తిపొడుచును.

'పెద్ద' అను విశేషణము దానియందలి ప్రథమాచ్చుపై ఊనికతో నుచ్చరింపబడుచు మిఱ్ఱుయొక్క ఔన్నత్యమును వాచ్యముగా నుటంకించుచు, మీరు యుద్ధము చేయుచుండగా చూపఱు దరిదాపులలో నుండజాలకయు, దిదృక్షను దొలగించుకొనఁ జాలకయు చాల ఎత్తైనప్రదేశమునకుఁ జని కనుగొందురు కావలయు నను వేళాకోళమును సాభినయముగ స్ఫురింపఁజేయును.

'మిఱ్ఱు' అనుద్విరుక్తశకటరేఫము భీమునియుచ్చారణలోనియభినయమును దోఁపఁజేయును.

'ఏము' అను సర్వనామము యుద్ధమున నసమర్థుఁడను నేనొక్కఁడనేనా ? ధర్మజాదు లెల్లరును పౌరుషహీనులై చూడవలసినపరిస్థితిని మీరు కలిగింతు రనుకొందు ననువెక్కిరింతను గమ్యమాన మొనరించును.

'ఎల్లన' అను సర్వనామము పూర్వోక్తధ్వన్యర్థమునకు దోహదముచేయును. మీ యిరువురు కయ్యమొనరించుచుండఁగా నేయొక్కఁడును విక్రమింవ

నవసరముండదుగదా! యనునర్థ మిట వ్యంగ్యమగును.

'వెఱఁగు' అనుపదము భయాశ్చర్యోభయవాచకమై చూచుమాకే అట్లయినచో ప్రతిపక్షులేమయిపోదురోకదా ! అను వ్యంగ్యార్థము నొసఁగును.

'అంది' అనుక్త్వార్థకక్రియ వెఱఁగుతనంతతాను మాకు రాకున్నను దెచ్చి పెట్టుకొందుములే యను పరిహాసమునకు స్ఫోరక మగును.

'చూచెదము' అను క్రియాపదమునందలి భావ్యర్థప్రత్యయము భవిష్యత్తున నేది యెట్టు జరుగునో యెవ్వఁ డెఱుఁగును? మీరుమాత్రము మీ పోటరితనమును విశ్వసించుచున్నారు. అది కానవచ్చినచో చూత మన్న యర్థమును వ్యక్తపఱచును.

'కాక!' అనునిపాత మవహేళనమును ద్విగుణీకృత మొనర్చును.

'ఈసారెకుం బోయిరా!' అనునది పోయి విజయమును సాధించికొనివచ్చిన తఱువాత మాటాడవలయును గాని యిప్పుడీప్రసంగమేల? అనునర్థము నొసఁగును.

'నేను' అని కాక 'భీముఁ' డని తన్నుఁదాను నామనిర్దేశపూర్వకముగాఁ జెప్పుకొనుటలో భీముఁడన నెట్టివాడో లోకమంతయు నెఱుఁగును లె మ్మను నర్థము ధ్వనించును.

'ఇత్తఱిన్' అను పదము 'ఇది పరాక్రమప్రదర్శనాయోగ్యసందర్భము. సమయము వచ్చినపు డాతనిఁ బట్టశక్యము కా' దనునర్థమును వ్యంగ్య మొనర్చును.

'కోపింపండు' అను ప్రథమపురుషక్రియ తనసామర్థ్యము తనకుఁ దెలియు నన్న యభిమానమునకు స్ఫోరక మగును.

'చూ!' నను నవ్యయము తాను జెప్పెడునంశము దార్ఢ్యమును వక్కాణించును.

'పెంపఱన్' అనుక్రియ యుక్తాయుక్తముల నెఱిఁగినతనము నభివ్యంజించును.

ఇట్లు భావించినకొలఁదియు నీ పద్యమునందలి ప్రత్యంశమును వ్యంజకమై భీముని యాక్షేపణమును, అభిమానమును, పరిహాసమునందలి పాటవము నభివ్యక్తము చేయుచున్నది. ఈ సంభావితమగునర్థమంతయు వ్యాఖ్యాతృ ప్రతిభోద్దీపిత మని త్రోసివేయరాదు. 'మహాకవిత్వదీక్షావిధి నొంది యాంధ్రావలి మోదముం బొరయునట్లుగఁ గృతుల రచించెద' నని యాత్మవిశ్వాసమును ప్రకటించిన తిక్కనామాత్యునిమేధాసంపద కందని యర్థవిశేషములు సామాన్యపాఠకునకు స్ఫురించు ననుట పరిహాసప్రాయము.

మఱియొక యుదాహరణము :

**"అనిమిషనాథ సుగుప్త మ యిన యమృతము దెచ్చి మీకు సచ్చరిత నన్మ**
**జ్జననీదాస్యము వాసెను దినకరపవనాగ్నితుహినదీప్తులకరిగాన్."** 1.2.120

గరుత్మంతుఁడు మిక్కిలిప్రయాసతో నమృతమును సాధించి తెచ్చి యురగుల కిచ్చుచుఁ జెప్పిన యీవాక్యములందలి వ్యంజకము లెట్టివో యరయఁ దగును. ఇందలి

'అనిమిషనాథసుగుప్తము' అనుసమాసము దేవేంద్రుని యమృతరక్షాతత్పరత్వము నభివ్యక్తముసేయును. కనుఱెప్పవ్రాల్పక కాపాడఁగలిగిన సామర్థ్యము వారికి సహజసిద్ధము. అట్టివారికి ప్రభువయినదేవేంద్రుఁడు అత్యంతము భద్రముగా కాపాడెడు అమృతమును దెచ్చుట యెంత దుష్కరమో పరిశీలింపుఁ డన్నగరుఁడుని అభిప్రాయమును, తన్మూలమున నాతనిలోకోత్తర కార్యదీక్షాదక్షతయు నభివ్యంజిత మగుచున్నవి. ఈధ్వనికి 'సు' అనునుపసర్గము మిక్కిలిదోహద మొనర్చు చున్నది. 'తెచ్చి' అనుదానిక్త్వార్థక ప్రత్యయము కూడ నాతఁడు పడిన కష్టమును బాగుగా వ్యక్తము చేయుచున్నది. 'మీకున్' అనుచోటి షష్ఠీవిభక్తి సంప్రదానార్థకమయిన 'కొఱకు'నకు బదులుగా నెలకొని యమృతముపై తనకు స్వామిత్వము లేదనునర్థమును ప్రతీయమాన మొనర్చును. 'జననీదాస్యము వాసెను' అనువాక్యమునందలి క్రియాపదము నందలి భూతార్థప్రత్యయమువలన 'మీరడిగిన వస్తువు నిచ్చుటతో నాబాధ్యత పూర్తిఅయినది. ఊరక మీకు చెప్పుటయే కాని మీయనుమతితో పనిలేదు. దాస్యము తీఱలే దని మీ రనఁజాలరు సుమా!' అనుతీరున గరుత్మంతునిధృతి నభివ్యక్తముచేయును. మఱియు నీవాక్యార్థముచే 'మాత్రాజ్ఞాపరిపాలనతత్పరత్వమున నెంతయో శ్రమ కోర్చి అతివిశిష్టమగు నమృతమును సాధించి పరపీడాపరాయణులగు మీ కిచ్చితిని. మాతల్లిదాస్యవిముక్తికై యిదియంతయు చేసితిని. మీరింక నేదో నెపమిడి కాదన్నచో నాశక్తియెఱుఁగుదురుకదా! దేవేంద్రునికే నన్నెదిరించుశక్తిలేనియెడ మీరనఁగా నెంత ? కావున జాగ్రత్తగా మసలుకొనుఁ' డనుతర్జనముకూడ ప్రతీయమానమగును. ఇట్లు గరుత్మంతుని ధృత్యుత్సాహము లీపద్యమునందలియాయాయంశములచే ధ్వనించును.

ధర్మజునికడకు రాయబారమునకు వెళ్లివచ్చినసంజయుఁడు ధృతరాష్ట్రునకు విషయనివేదనము గావించుచుఁ బలికిన యీక్రిందిపద్యమునందును ననేకాంశములు వ్యంజకములై యసంలక్ష్యక్రమధ్వనిని సమర్పించుట కాననగును.

"అనయము పుట్టె జూదమునయప్పుడ యెంతయుఁ జిచ్చువెట్టి కా
ల్చినయది నీయుపేక్షయ, వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మె
త్తనిపులి; యెల్లవారలు నధర్మము నీపయిఁ బెట్టునంతకు
న్వినఁడును గానఁడుం బిదప నీకును నాకు మరల్పవచ్చునే" 5.2.14

ఇందలి 'జూదమునయప్పుడ,' 'ఉపేక్షయ' అనువానియందలి యవధారణార్థకములు, 'ఎంతయుఁన్' అనుచోటి అత్యంతార్థకమగు 'ఉన్' అనునవ్యయమును వ్యంజకములు. 'ఈ కీ డిప్పటిదా? ఎప్పుడో పుట్టినది. పుట్టిన దానిని వెంటనే పోఁగొట్టుప్రయత్నము నీ వేమియుఁ జేయలేదు. ఉపేక్షనే వహించితివి. కావున రానున్నమహాపద

నీయుపేక్షవలననే సిద్ధించినదగుటచే ఆయుపేక్షయే యిందు నింద్యము తదితరము కాదు' అనునభిప్రాయము వ్యంగ్యము. ఎంతయున్ అనుటచే 'చిచ్చేకొంచె మయినను జాలు ననఁగా, చెప్పలేని ప్రమాణమున దానిని రగిలించి యిప్పు డార్పఁజూచినచో నది యాఱునా? ఏదోకొంచె మయినచో నెట్లోయార్పఁగలిగి యుండెడివార మిప్పు డదియసాధ్యము సుమా!' అను నిష్కర్ష అభివ్యక్తమగును. వశీకృతచిత్తుఁడు అనుసమాసమునందలి 'చ్వి' ప్రత్యయము చిత్తము యొక్క అత్యంతావశత్వమును ముందు వక్కాణించి అట్టిదానిని వశము చేసికొన్న మహానుభావుని ధర్మజ్ఞుని యాత్మోన్నత్యము నుగ్గడించు ద్వారమున నట్టివాని కహితమాచరించిన ధృతరాష్ట్రునికుత్సిత స్వభావమును నిందించుటలో పర్యవసించును. మెత్తనిపులియను రూపకము ధర్మజుఁడు చేయుసంహార క్రియలోని యసదృశత నభివ్యక్తముచేయును. మఱియు రూపకముచే ధర్మజుని పులితనము సామ్యము తీవ్రత వ్యజ్యమానమగును. 'ఎల్లవారలు' అనుపదమునందలి బహువచనాంతముపై బహువచన ప్రత్యయము ధృతరాష్ట్రునిపై నధర్మము నారోపించు జనుల అతి బాహుళ్యమును ధ్వనించును. 'వినఁడును కానఁడున్' అనుచోటి సముచ్చయార్థకము యుధిష్ఠిరుని స్థిరనిశ్చయము నుగ్గడించును. 'నీకును' అనునది యర్థాంతరసంక్రమితవాచ్యమై తండ్రివంటివాఁడను, నన్ను ధర్మజుఁ డొప్పరికింపఁడా? యని యూరడిల్లెదవేమో? అట్టిదానికాస్కారము లేదనునర్థమును ప్రత్యాయన మొనర్చును. ఉభయపక్షహితైషి నగునాకును నతని మరల్పశక్యముగా దనునర్థము 'నాకును' అనుపదముచే తోఁచును. మరల్పవచ్చునే అనుక్రియాపదమునందలి ప్రశ్నార్థకైకారము త్రిప్పరానితనము దార్ఢ్యమును వక్కాణించును. ఇట్లీ ప్రతీయమానమగు నర్థసముదాయముచే సంజయుని హృదయమున ధృతరాష్ట్రుని దుర్నయమువలనఁ గలిగిన అసహ్యామర్ష మసంలక్ష్యక్రమమున వ్యంజితమయి యాస్వాదనీయ మగుచున్నది.

ఇట్లు సుబాదులు సామూహికముగా వ్యంజకమగుటను పై పద్యములందు పరిశీలించితిమి. ప్రత్యేకముగా నివి వ్యంజకములగుట నరయుదము.

(1) సుప్పులు వ్యంజకమగుట :

> "అమలినతారకాసముదయంబుల నెన్నను సర్వవేదశా
> స్త్రములయశేషసారము ముదంబునఁ బొందను బుద్ధిబాహావి
> క్రమమున దుర్గమార్థజలిగౌరవభారతభారతీసము
> ద్రముఁ దఱియంగ నీదను విధాతృన కైనను నేరఁబోలునే." 1.1.19

ఇం 'దమలినతారకాసముదయంబుల' ననుచోటి సముదాయార్థకశబ్దముపై నున్న బహువచన ప్రత్యయము తారకలను విడిగా లెక్కించుట కాక రాసులు రాసులుగా

లెక్కిడుటయు నసాధ్యమే యన్నభావమును వ్యక్తపఱచుచు భారత భారతీసముద్రము దఱియంగ నీదుటయందలి విశేషశ్రమ నభివ్యక్తము సేయును. ఇట్లీసమాసమునందలి బహువచన ప్రత్యయము వ్యంజకము.

(2) సంబంధము ప్రత్యేకముగా వ్యంజక మగుట కుదాహరణము :

"అనుడు - నీపుత్రుఁడవినీతుఁ డగుట యెఱిఁగి
యెఱిఁగి వానివశంబున నేలపోయె;
దీవు పాండవులకు నేమి యిచ్చితేని
నడ్డపడ నెవ్వరికి వచ్చు; నధిప! చెపుమ!" 5.3.388

దుర్యోధను నీవైన చక్కదిద్దుమని కోరిన ధృతరాష్ట్రునితో గాంధారి యన్నమాట ఇది. ఇందలి 'నీపుత్రుఁ'డను చోటి షష్ఠీ బోధ్యమగుసంబంధము గాంధారికి దుర్యోధను నుపేక్షించిన ధృతరాష్ట్రునిపై పొడమినయమర్షము నసంలక్ష్యక్రమమున వ్యంగ్య మొనర్చును. ఇన్నాళ్ళు పుత్రవాత్సల్యముతో వాఁ డాడినది యాటగా పాడినది పాటగా సాగించి యిప్పుడు వశపఱచుకొనరానిస్థితిలో నన్నుఁ బిలువనంపినచో నేనేమి చేయఁ గలను? నీ వెప్పటి కప్పుడు వాని నదుపులో నుంచినచో నింతటి యనర్థము రాదు కదా! అను విధమున గాంధారి భావ మిటఁ దోఁచును. దుర్యోధనుఁడు ధృతరాష్ట్రున కెట్లో తనకు నట్లే పుత్రుడైయుండగా నీ పుత్రుఁడనుట యిట్టి వ్యంగ్యార్థభావనకు సహకరించును. ఈ వ్యంగ్యార్థ స్ఫురణము కవ్యుద్దిష్టము కానిచో మనపుత్రుఁ డని యుండవలసివచ్చును.

(3) తిఙ్లులు (క్రియావిభక్తులు) ప్రత్యేకముగా వ్యంజకము లగుట:

"ఏమును వారు పంచుకొని యేలుట గల్గదు; పల్కకుండు మిం
కేమియు; వాఁడిసూదిమొన యించుక మోపినయంతమాత్రమున్
భూమి యొసర్చె పాండునృపపుత్రుల కిత్తునె? యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబు గొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్." 5.3.363

పాండవులకు రాజ్యభాగ మీయనని ఖండితముగాఁ జెప్పు నీ దుర్యోధనోక్తుల లోని 'నిశ్చయించితిన్' అను క్రియాపదమునందలి భూతార్థక ప్రత్యయము వ్యంజకము. 'నిర్ణయ మెన్నఁడో జరిగిపోయినది. ఇంక దానికి పునరాలోచన లేదు. కావున నిశ్చయమున కన్యథాత్వము లేదు. ఇఁక నెవ్వరు నేమియుఁ జెప్పి ప్రయోజనము లేదు'. అను నిట్టి దుర్యోధనుని తాత్పర్యము దీనివలన వ్యంగ్యమగును. ఇట్లు దుర్యోధనుని ధైర్యస్థైర్యము లీప్రత్యయమువలన ప్రతీయమానములగును.

(4) తిఙంతములు ప్రత్యేకముగా వ్యంజకములగుట నీక్రింది యుదాహరణము నందుఁ గాననగును.

"వాఁడిమయూఖములోగలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె; ధేనువుల్
నేఁ డిట వచ్చె నేకతమ; నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
పోఁడిగ వేల్వఁగాఁబడియెఁ; బ్రొద్దును బోయెఁ; గచుండు నేనియున్
రాఁడు; వనంబులోన మృగరాక్షసపన్నగబాధ నొందెనో!" 1.3.112

కచుఁ డింటికి వేళకురాని కారణమున దుఃఖించి పలుకు నీ దేవయానీ వాక్యములందలి 'రాఁడు' అను క్రియ, ఆయాపనులన్నియు కాలాతిక్రమణము లేకుండ యథావిధిగ జరిగిపోవఁగా నీతనిరాక మాత్ర మట్లేల జరుగరాదన్న దేవయానీ హృదయావేదనకు వ్యంజకము.

(5) సంప్రార్థనాద్యర్థమున ననుప్రయుక్తమగు ఏ, ఓ, అయ్య, అమ్మ, వంటివి వ్యంజకములయిన సన్నివేశము :

"చిచ్చఱకన్ను మూసికొని చేతిత్రిశూలము డాచి లీలమై
వచ్చినరుద్రుచందమున వ్రాలుదు వీ; వనిలోన నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టిమగవారికి; నీ కృప నాశ్రయింపఁగా
వచ్చితి; మెవ్విధిన్ గెలువవచ్చు మహాత్మ! యెఱుంగఁజెప్పవే" 6.3.300

భీష్ముని యత్యుగ్రప్రతాపమునకుఁ దట్టుకొనఁజాలక మార్గాంతరము లేక ధర్మజాదులు అతినిగూఢవృత్తి నావగానుతుని మందిరమునకు నరిగి యాతని వధోపాయము నెఱుఁగుఘట్టమునందలి యీ పద్యమున 'చెప్పవే!' అను క్రియాపదము నందలి 'ఏ' అనునదివ్యంజకము. ఇది ధర్మజునకు భీష్మునియందుఁగల చనవును అడుగరాని కోరిక నడుగునప్పటిజంకుగొంకులను, తప్పనిసరి యగుటచే కోరుచున్నా మను ప్రార్థనను, చెప్పనిచో మా కపజయమును, వినాశమును తప్పదది నీ కభివాంఛితము కాదుకదా! యన్నలాలనను, మృదువైన యొత్తిడిని ప్రతీయమాన మొనరించును. 'నిన్నాశ్రయింపఁగా' నని కాక 'నీకృప నాశ్రయింపఁగా' ననుట ధర్మజుని తత్కాలీన శోచనీయావస్థను స్ఫుట మొనరించును. 'మహాత్మ!' యను సంబోధనము అర్థిజనము నభ్యర్థనమును వమ్ముచేయక ప్రాణముల నొసఁగుటకైన వెనుదీయని మహాత్ముఁడవు నీవు కావున ప్రార్థించుచున్నా మనునర్థమును వ్యంజించుచు పైనుడివినవ్యంగ్యార్థమును పుష్టమొనర్చును. ఇట్లీపద్యమునందు ధర్మజుని తత్కాలహృదయగతభావ మంతయుఁ జక్కగా నభివ్యక్తమగుచున్నది.

(6) ప్రత్యయముచే బోధింపఁబడుకాలము వ్యంజకమగుట నీక్రింది యుదాహరణమునఁ గాననగును.

"వారలు శాంతశూరులు, భవచ్చరణంబులు గొల్వఁ బూనియు
న్నా, రటుగాక మీకది మనంబుల కప్రియమేని నింతకుం
బోరికి వచ్చుచుండుదురు; భూవర! రెండుతెఱంగులందు నీ
కారయఁ బథ్య మేదియగు - నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా!" 5.3.284.

ధృతరాష్ట్రమహారాజుతో సంధివచనములను నిష్కర్షగా నుటంకించు శ్రీకృష్ణుని వాక్కులందలి 'వచ్చుచుండుదురు' అనుపదములోని శత్రర్థకచువర్ణము పాండవులు పోరికి వచ్చుటయందలి అవ్యవధానమును వక్కాణించుచున్నది. వారు మిమ్ము సేవించుటకో, లేక పోరుటకో వచ్చుటకు సర్వసన్నద్ధులైయున్నారు. మీరొక మాటచెప్పుటయే తడ విందు అఁకలిగొన్న సింహములవలె దూకుదురు సుమా! అను విధమున పాండవుల ధైర్యోత్సాహముల నుగ్గడించుటయందలి శ్రీకృష్ణుని చిత్తస్థైర్యము నీ చువర్ణకము బోధించుకాల విశేష మభివ్యక్తము సేయును. 'ఇంతకున్' అనుపదము కూడ దీని కుపోద్బలకము.

(7) ప్రకృత్యంశము తెలుపుకాలము వ్యంజకమగుట :

"చిక్కనిపోటుమానిసి; విసీ! వినువారలు నవ్వ నేమిగా
నెక్కుడుమాటలాడెద; వహీనపరాక్రమశాలి యర్జునుం
డొక్కఁడ యార్వురన్ మనల నుగ్రరణంబున గెల్చె నిన్న; నే
డిక్కడఁ బల్కులన్ గెలిచె దీ వతనిన్ మనరాజుకొల్వునన్." 5.1.253

ద్రుపదపురోహితునివలన పాండవుల యోగక్షేమముల నెఱిఁగి వారిని ప్రశంసించుతన పలుకులను ప్రత్యాఖ్యానించు కర్ణుని మాటల కసహ్యపడు భీష్ముని వాక్యములివ్వి. ఇందలి 'నిన్న', 'నేడు' అను కాలబోధకములు భీష్ముని హృదయమునందలి యేవగింపును, అధిక్షేపణమును జక్కగా వ్యంజించును. నిన్న నేటిలో హఠాత్తుగ అర్జునుని మించు సాహస పరాక్రమాదులు నీకు ఎక్కడ నుండి వచ్చె నను వెక్కిరింత ఇందభివ్యక్తమగును. దీనికి పద్యమునందలి తక్కిన వాక్యభాగ మంతయు సహకరించును. 'అర్జునుఁడు నిన్నొక్కని కాక మనయార్వురను భయంకర యుద్ధమున నొక్కఁడై గెలిచెను. నీ విచట నెట్టిప్రమాదమును వాటిల్లుట కవకాశము లేని మన రాజుకొలువులో దేనికిని పనికిరాని పలుకులతో గెలుతువు. ఇది యెంతటి నీచకృత్యమో తలపోయఁజాల' వను నేవగింపుతోఁ గూడిన యధిక్షేపణ మిటఁ దోఁచును. 'చిక్కని పోటుమానిసివి' అను విశేషము దీనికి మఱింతదీప్తి నొసఁగును.

(8) తద్ధితప్రత్యయము ప్రత్యేకముగా వ్యంజకమగుట నీక్రింది పద్యమునఁ గానవచ్చును :

తప్పు తనవలన లేదని చెప్పివిడుచు సుయోధనునితో శ్రీకృష్ణుఁ డాతనితప్పు నిరూపించుచు పలికిన పలుకులు :

"అప్పుడు నీవుఁ గర్ణుఁడును నాడినమాటలు కొల్పులోపలం
జెప్పెడునట్టివే; కులము శీలముఁ గల్గినపుణ్యకాంత క
ట్లొప్పమి చేయుటెల్లఁగని యున్నజనంబులు వించునుండఁగాఁ
దప్పొకయింత లేదనువిధం బది నీక తగుం గుమారకా!" 5.3.368

ఈ పద్యమునందలి 'కుమారకా' అను సంబోధనమున 'క' ప్రత్యయము అల్పత్వ నీచ త్వోభయద్యోతకమై 'నీకు వయస్సువచ్చినది కాని వివేకము రాలేదు. నీచ కృత్యము లాచరించుటయే కాక వానిని సత్కృత్యములుగా నమర్థించుకొనుటకును ప్రయత్నించుచున్నాఁడవు. అంత మాత్రమున నీ నీచత లోకమునకుఁ దెలియకుండునా?' అనురీతిని శ్రీకృష్ణుని క్రోధమును జుగుప్సను నభివ్యక్తము చేయును.

ప్రత్యయాంతరము వ్యంజక మగుట యీ క్రింది యుదాహరణమునఁ జూపట్టును:

"ఈతని వృద్ధని యెఱిఁగి పూజించితే వసుదేవుఁ డుండంగ వసుమతీశ!
..........................................................
..........................................................
భూనాథుఁడనియెడుబుద్ధిఁ బూజించితే
యాదవుల్ రాజులే యవనిమీఁద
.........................................................." 2.2.11.

పితామహునియాదేశానుసారము శ్రీకృష్ణుని కర్చన నొసఁగినధర్మజునిఁ గాంచి నహింపక నిందించు శిశుపాలోక్తులు. ఇందలి 'యాదవ' అనుశబ్దమునందు 'యదు'శబ్దముమీది అపత్యార్థకతద్ధితప్రత్యయము వ్యంజకము. 'ఏయదువు తండ్రి చెప్పినమాట నాదరింపక యాతనిశాపముచే రాజార్హతఁ గోల్పోయెనో యట్టివాని వంశమునఁ బుట్టినవానిని భూనాథుఁ డని నీ వెట్లు భావించితి' వనునర్థము నిది వ్యంజించుచు శిశుపాలుని అసూయ ననంలక్ష్యక్రమమున వెల్లడిచేయును. అసూయయనఁగా గుణములయందు దోషారోపణము చేయుట (*అక్షాంతి రీర్ష్యాసూయా తు దోషారోపో గుణేష్వపి* - *అమరము*).

(9) సంఖ్యావాచకము ప్రత్యేకముగా వ్యంజక మగుట కుదాహరణము:

"చావరు నొవ్వరు పాండవు లేవురు నని నీవు సెప్ప నిప్పలుకులు దుః
ఖావేశకరములై చేతో వృత్తిఁగరంపఁజొచ్చెదుర్భరభంగిన్." 9.1.14

తనవారిలో ననేకులు మడిసి రని సంజయుఁడు చెప్పఁగాఁ బట్టరానిదుఃఖము నొంది ధృతరాష్ట్రుఁ డీమాట లనెను. ఇందలి 'ఏవురున్'అను సంఖ్యావాచకము పాండవులైదుగురినాశనము తన కెంతప్రియమో, అది ఘటిల్లదయ్యెనే. కనీసమేయొక్కరుఁడు చచ్చినను లేదా కొంత నొచ్చినను దనదుఃఖావేశ మింత తీవ్రతరముగాదే-అనురూపమున ధృతరాష్ట్రునిశోకమాత్సర్యములను జక్కగా వ్యంజించును.

(10) నిపాతము ప్రత్యేకముగా వ్యంజక మగుటకు లక్ష్యము:

ఏకలవ్యుని బాణప్రయోగదక్షత తన కసహ్యముకాఁగా ధానుష్కులలోఁ దన్నగ్రేసరునిఁగావింతునన్న గురువాక్యము దబ్బఱ అయ్యెనని తలంచి వెతఁ జెందునర్జునోక్తులలో నిపాతవ్యంజకత గానవచ్చును.

"నాకంటెను మీకంటెను లోకములో నధికుఁడతిబలుండు ధనుర్వి
ద్యాకౌశలమున నాతఁడు మీకుం బ్రియశిష్యుఁడటె యమిథ్యావచనా!" 1.5.240

ఇందలి 'అటె'అనునవ్యయ మర్జునునిహృదయమునందలియీర్ష్యామర్షములను వ్యంజించుటలో ప్రాధాన్యమును వహించుచున్నది. పద్యమునందలితక్కిన పదములను పైభావధ్వనికి స్ఫోరకము లగుచున్నవి. 'మీచే ధనుర్విద్యలో నత్యధికునిగాఁ జేయఁ బడవలసిననాకంటెను, నట్లుచేయవలసినమీకంటెను గూడ నాయెఱుకధికుఁడు. అంతే కాదు; సమస్తలోకములో నాతని మించినవారు లేరు. మఱేదో విద్యలో నాతఁడు ఘనుఁ డైనచో నేనంత చింతింపను. కాని యేధనుర్విద్యాకౌశలమున మీగురుత్వమున మిన్నందవలయునని యాశపెట్టుకొంటినో - యావిద్య యందే యాతఁడు లోకములో నగ్రేసరుఁడయ్యెను. మఱియు వేఱొకగురువెవ్వరైన వాని కీవిద్య ప్రసాదించెనేమో, యామహానుభావుఁడు మీకంటె ఘనుఁడేమో - యని సమాధానపడుటకును వీలులేనిపరిస్థితి వచ్చిపడినది. విచారింపఁగా నాతఁడు మీశిష్యుఁడనియే తెలిసినది. వట్టిశిష్యుఁడు కాడు. మాయందఱకంటెను బ్రియమైన శిష్యుఁడట కదా! అతఁడు దుర్యోధనాదులవలె నాసహపాఠియని తెలిసినచో నొకింత యూఱట యుండెడిది. మీ రెన్నఁడు దానిని తెలియనీలేదే. ఇంతగుట్టుగా వానిని జదివించుటకు వాఁడు మీ కేమిచ్చెను? మీరు అమిథ్యావచనులుగఁ బ్రసిద్ధికెక్కితిరే, ఇట్టిదా మీఅమిథ్యావచనత్వము!' - ఇత్యాదిరూపమున నర్జుననిసంతాపమాత్సర్యాదులీపద్యమున నభివ్యక్తములగును. ఈ యభివ్యక్తి కిందలి 'అటె' అను నిపాతము మిక్కిలి తోడ్పడుచున్నది.

(11) ప్రాదులు ప్రత్యేకముగా వ్యంజకములైన సన్నివేశము:

దేవయాని తన్ను వివాహమాడు మని కోరఁగా యయాతి నిఖిలలోక పూజ్యుఁ

డై నశుక్రాచార్యుడు వచ్చి యిది ధర్మవిరుద్ధము కాదని చెప్పినచో వివాహమాడుదుననెను. అంత దేవయాని తండ్రిని రప్పింపఁగా -

"అతిసంభ్రమమున నవనీ పతి విహితోత్థానుఁడై తపశ్శక్తిఁ బ్రజా
పతినిభుఁడగుభార్గవునకు నతిభక్తిం బ్రణమితోత్తమాంగుం డయ్యెన్"

1.3.166

ఈ పద్యమునందలి అతిసంభ్రమమున, అతి భక్తిన్, ప్రణమిత అను పదములందలి ప్రాదులు (మొదటిరెంటియందును 'అతి'విశేషణము - మూడవదానిలో 'ప్ర'ఉపసర్గము) యయాతికి శుక్రాచార్యునియందుఁగల భక్తిసంభ్రమములవలనఁ గలిగిన ఆవేగాదుల నభివ్యక్తము సేయును.

(12) కొండొకచో పౌనరుక్త్యముగూడా వ్యంజకమగును. సాధారణముగ నిపాతములను, పౌనరుక్త్యమును అర్థవిశేషమునకు సంబంధించినవే. ప్రకృతమున నవి రసాదిపరములగుటను విశేషముగా భావించుట జరిగినది. ఉపసర్గములు ఒకటి కంటె నెక్కువఁగా ప్రయుక్తమైనసన్నివేశము తత్సంబంధిపౌనరుక్త్యముగా భావింపవచ్చును.

(1) నిపాతములపౌనరుక్త్యము:

తనకుమారుఁడు దిక్కులేనివాఁడై యొంటరిగా పాండవులకృపావిహీనవాక్కులచే ద్వైపాయనహ్రదమునుండి యీవలకుతేఁబడి యుద్ధసన్నద్ధుఁడయ్యెనని విన్న యాంబికేయుఁడు సంజయునితో నిట్లనెను:

"సకలధరణికి నాథుఁడై సంపదలకు నెల్లభాజనమగుకౌరవేంద్రుఁ డనద
తనము దోపఁగా గదఁజేతఁగొని వినిశ్చ యమునఁ బోరికి నమరెనే యక్కటకట."

9.2.236.

ఇందలి 'యక్కటకట' అను నిపాతపౌనరుక్త్యము ధృతరాష్ట్రుని హృదయమున గలించునత్యుత్కటశోకము నభివ్యక్తీకరించుటకు మిక్కిలిగా నుపయోగపడుచున్నది.

(2) భావపౌనరుక్త్యము వ్యంజకమగుట కుదాహరణము:

చెలియలివరుసయైన ద్రౌపదిని కామాంధకారవినిహతవివేకుఁడై యెత్తుకొనిపోయి, పాండవులు వెన్నంటి తనవారినెల్ల తుక్కుదూగఁగా గొట్టగా భయపడి పాఱిపోయిన సైంధవునిఁ జంప నుంకించి ధర్మజునసుమతి వేఁడుచున్న పవనతనయుని పలుకులు-

"అతలంబునఁ గ్రుంగిన న ద్భుతముగ దివమునకు నెగసి పోయినఁ బగతున్
హతుఁజేయక మగుడము; వినిహతుఁడుగఁ జేయుదుము - దివిజు లడ్డంబైనన్."

3.6.241.

ఇందు సైంధవునిఁ దప్పక చంపుదు మన్న అభిప్రాయము హతుఁజేయక మగుడము, వినిహతుఁడుగఁ జేయుదుము అనువానిచే ఆవృత్తమైనది. మఱియు 'వి', 'ని' అను రెండు ఉపసర్గములు వాడఁబడినవి. వీనిపౌనరుక్త్యము సైంధవవధ విషయమున భీముఁడు పొందు క్రోధావేగములతీవ్రతను జక్కగా నభివ్యంజించును.

(3) సంబోధనార్థకము ద్విరుక్తమై ప్రత్యాయక మగుట కుదాహరణము:

పై సందర్భమునందే భీమార్జునులు వెన్నంటి రాఁగా ప్రాణరక్షణపరాయణుఁ డై పరువిడుచున్న సైంధవునిఁగని వా రన్న మాటలు:

"వానిఁ జూచి నగుచు వార లోరోరి యిం కెందుఁ బోవవచ్చుఁ బంద నిలువు
మిట్టి కడిమి నమ్మియే ప్రల్లదంబులు సేయఁదొడఁగి తనుచు డాయుటయును."

3.6.244.

ఇందలి సంబోధ్యవాచకరహితమగు 'ఓరోరి' అను సంబోధనార్థకము ద్విరుక్తమై సైంధవునియందు పార్థులకుఁ గల యేవగింపు, చులుకనతనము, వానినిఁ దప్పక సంహరింపఁ గల మన్న ధైర్యోత్సాహములు మున్నగుభావములను ప్రతీయమాన మొనర్చుచున్నది.

(13) సర్వనామములు ప్రత్యేకముగా వ్యంజకము లగుట :

రాయబారమునకై యేఁగుచున్న కృష్ణునితో ద్రౌపది పలికినయీక్రింది వాక్యములం దట్టిది కానవచ్చును.

"అంతలు సేసి పోనడిచి - యక్కట : సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె; యట్టి యూఱట మదిం బ్రియమందె యుధిష్ఠిరుండు; తా
నంతన యూళ్ళు లేవురకు నైదు సుయోధనుఁ డిచ్చు నొక్కొ; యీ
కంత కృపావిహీనమతి నాతఁడు నొంచునె యన్నదమ్ములన్" 5.3.101

ద్రుపదరాజతనయ తనప్రసంగము నారంభించుచునే చేసినదేమో చెప్పక 'అంతలు' అనుసర్వనామమును ప్రయోగించినది. 'వారు మాకొనరించినఅపకారము లొకటియా? రెండా? ప్రమాణము చెప్పఁదగినవియా? నోటితోఁ జెప్పఁదగినవియా? లోకమునకు నీకును దెలియనివియా? అవి మానవమాత్రులకు సహ్యములా? అను విధముగా ద్రౌపదీహృదయమునందు ధార్తరాష్ట్రులవిషయమున జనించిన అసహ్య రోషములను, అంతర్వైక్లబ్యమును వ్యంగ్య మొనర్చుట కీ 'అంతలు' అనుసర్వనామము ప్రయుక్తమైనది. వ్యతిరేకార్థస్ఫోరకముగా ప్రయుక్తమైన 'అంత కృపావిహీనమతిన్' అనునది

వాక్కులతో చెప్పుటకు వీలుకానియంత అనువిధమున నర్థమును దెలుపుచు వానికృపావిహీనమతిత్వమున కవధులు గలవా ? అని దుర్యోధనునియెడఁ బొడమినద్రౌపది అసహ్యమును వెలిఁబుచ్చును. ఈయర్థప్రతీతికి ఇందలి 'అంత' అనుసర్వనామము వ్యంజకము.

మఱియొక యుదాహరణము నీఘట్టమునందలిదే సర్వనామవ్యంజకత కరయుదము.

"ఏ నిటు లంటి నా వలన దింకను నీవును రాజుఁ దమ్ములుం
గా నుచితంబు చూచి మనకార్యము మీ సుజనత్వముం జెడం
గా నొకభంగిఁ జేయక తగం గురువర్గముతోడిసంధి మీ
కైనతెఱంగునన్ వలచినట్టులు చేయుఁడు నేర్పు లేర్పడన్." 5.3.105

ద్రౌపది తనపడినపాటు లన్నియుఁ గృష్ణునికి నివేదించి సంధి యపేక్షితము గాదని నొక్కి వక్కాణించి యుపసంహారమున నన్న యీవాక్యములందు వాచ్యార్థ మాత్రగ్రహణము సంభావ్యము కాదు. ఇన్ని కష్టములు పెట్టినవారికడకు సంధివచనములకై పోవుటయందలియసామంజస్యమును స్ఫురింపఁ జేయుటయే యిందలి తాత్పర్యము. 'నా దే మున్నది. నామాట కొకలెక్కయా? నే నాడుదానను. రాజకార్యములలో నాయభిప్రాయమును మన్నింప నవసరములేదు. మీ కేదితోఁచినచో నదియే చేయుడు. మన మెంతచెడినను మన సుజనత్వము మాత్రము చెడకుండ భద్రముగా కాపాడుడు. మీకదియే కదా అభివాంఛితము. మీయిష్టము. మీరేమిచేసికొన్న నాకేమి?, ఇత్యాదివిధమున స్త్రీ జనోచితమగుదెప్పిపొడుపువైఖరియు, కోపతాపములును నీవాక్యములం దభివ్యక్తము లగును. ఈయభివ్యక్తి కీపద్యమునందలి ఏను, మీ సుజనత్వము అనుచోటి యుష్మదర్థకసర్వనామమును, మీకైన తెఱంగునన్ అనుచోటి యుష్మదర్థకమును వ్యంజకత్వమును భజించుచున్నవి. అనవలసిన దంతయు నని తుదికి ముక్తాయింపువలె ననిష్టస్ఫోరకముగనే యిట్టిమాటలాడుట లోకమున సాధారణముగఁ గానవచ్చును. ఐనతెఱంగునన్, వలఁచినట్టులు, నేర్పులేర్పడన్ మున్నగుపదము లామెసంధివైమనస్యమును జక్కఁగా వ్యంజించును. నేర్పులు అనుచోటిబహువచన ప్రత్యయము 'ఈయొక్క రాయబారమే యననేల? ఎన్ని మాఱు లైనను జేయవలసివచ్చును. అనేక మార్గముల నాలోచింపవలసి రావచ్చును. యాచింపవలసియు

వచ్చును. ఆయన్నింటికిని మీరు సిద్ధముగానే యున్నారు. కానిండు. అట్లే జరుగనిండు'
ఇత్యాద్యర్థమును ప్రతీయమాన మొనరించి యామెకుగల అసహనమును వ్యక్తపఱచును.

ఇట్లు కొన్ని మార్గములను ధ్వనికారులు సోదాహరణముగ నిరూపించిరి. ఈమార్గమున మఱికొన్నిటిని గూడ నూహింపనగునని వారి యభ్యనుజ్ఞ యున్నది. ధ్వన్యాలోకమునఁ జెప్పనియట్టిమార్గములేవైనఁ గలవేమో చూడనగును.

ఛందస్సులోనివైవిధ్యము వ్యంజక మగుట తఱచుగ మహాభారతమునందుఁ గానవచ్చును. కవిత్రయమువారు ఛందోవిషయమున బాటించిన శిల్పరామణీయకమును బ్రదర్శించు పరిశోధనవ్యాసమొకటి ముద్రితమై యున్నది. (ఆంధ్రమహాభారతము - ఛందశ్శిల్పము - డా॥ పాటిబండ మాధవశర్మగారు) అందలి యొండు రెండంశములను దిక్ప్రదర్శనముగా చూతము.

*(1)* వృత్తము వ్యంజకమగుట :

భు జ ం గ ప్ర యా త ము :

"వినీతుండవై ధర్మవేదిత్వబుద్ధిన్ దనర్పొందునీ విట్లు దైన్యాతిరేకం
బునంబొంది శోకాగ్నిఁబొక్కంగఁగుంతీ తనూజాగ్రజుండాత్మఁదాఁ గుందకున్నే?"

**11.1.88**

"పుత్రశోకసంతప్తచిత్తుడై పశ్చాత్తాపజనితమరణవాంఛాధీనుఁడై యున్న ధృతరాష్ట్రుని ఓదార్చుచు వ్యాసమహర్షి పలికినవాక్యమిది. పుత్రహంత లని పాండవులయెడ ధృతరాష్ట్రునకు ద్వేషము కలుగరాదని వ్యాసమహర్షియభిప్రాయము. నిర్వికారచిత్తుడైన వ్యాసమహర్షి చిత్తస్పందగతిని ఈవృత్తగతియం దన్వేషించుట వ్యర్థము. మహాకవి, సర్వజంతుహృదయజ్ఞుఁడైన యామహర్షి వాక్యమున వర్ణ్యవస్త్వవస్థాప్రతిఫలనము సమాలోచింపదగును. ఈవాక్యార్థము ధృతరాష్ట్రుని తత్కాలావస్థ దైన్యముచే నలసము శోకాగ్ని దీప్తమునైన ధృతరాష్ట్రుని చిత్తావస్థ విలంబితారోహణగతియందు సుష్ఠుగా భాసించుచున్నది. కవినిబద్ధవక్త మహాకవి యైనప్పుడు అతనివాక్యమున అర్థానుగుణఛందస్త్వము అత్యంతము సహజమగును గదా!"

(ఛందశ్శిల్పము - పు. 308)

ఛందోగతివర్ణ్యవస్త్వవస్థాద్యోతక మెట్లగునో యీవ్యాఖ్యానమునఁ జక్కగా తెలియవచ్చుచున్నది. ఇట్లే మఱియొకయుదాహరణము :

**మ త్త కో కి ల :**

" 8 అక్షరములలో 10 లఘువులగుటచే దీనియక్షరగతి యించుక ద్రుతము. సప్తమాత్రాకఖండవృత్తియగుటచే తాలాశ్రయమైనలయ విలంబితము. కనుక మధుభావావేశమున హృదయ మించుక త్వరితగతియైనస్థితిని వ్యంజించుట కీవృత్తము తగియున్న దని భావింపవచ్చును." (ఛందశ్శిల్పము పు. 341)

ఈయభిప్రాయమునొక యుదాహరణమున సమన్వయింతును.

"అమ్మునీశునివాసశక్తిఁ దదంగదేశమునందు మే
ఘమ్ము లెల్లవలంకులం గడుఁ గ్రమ్మి సర్వజనప్రమో
దమ్ముగాఁ బ్రభవద్బృహజ్జలధార లొప్పఁగ వృష్టిఁ జే
సెమ్మహానదులున్ మహాసరసీవరంబులు నిండగాఁన్." 3.3.113.

బహుకాల మనావృష్టిపీడితులైన అంగదేశజనులకు ఋష్యశృంగనివాసశక్తిచే నొక్క పెట్టున మహావృష్టి సంభవించుటయు దానివలనఁ గలిగిన వారి హర్షనిర్భరతయు నీమత్తకోకిలయందు వర్ణితములైనవి. వారియానంద విశేషము వాచ్యముగాఁ జెప్పఁబడినను, తదభివ్యక్తికి ఛందోగతి మిక్కిలిగా సహకరించుచున్నది. 'ప్రభవ ద్బృహజ్జలధారలు' అనుచోటివర్ణ విన్యాసము వర్ష సాంద్రతాభివ్యక్తికి దోహదప్రాయము. ఇట్లీపద్యము పీడితజల హఠాదుద్భూద్ధమగు నానందతరంగమునకు వ్యంజకముగా నిబద్ధమైనది.

(2) వృత్తైక్యము వ్యంజకమగుట :

వృత్తైక్యముచే కవిత్రయమువారు వస్తురసభావాదులయందలి యైక్యమును వ్యంజించెనఘట్టములు గల వని డా॥ మాధవశర్మగారు కొన్నింటి నుదాహరించిరి :

(1) "సదృశమహిమాన్వితులగుపదునాఱుగురు మహారాజులవృత్తాంతములను సదృశవృత్తముల నిబంధించి కవిబ్రహ్మ వర్ణ్యవస్తుస్వరూపసాక్షాత్కరణ సమర్థముగ ఛందశ్శిల్పము నిర్వహించెను." (ఛందశ్శిల్పము - పు. 548)

"పదునార్వురును తుల్యమహిమాన్వితులగుటచే సమకక్ష్యయందు ప్రతిష్ఠింపఁ బడి పరిగణింపఁబడిరి. కనుక తిక్కన్న యొక్కొక్కరి నొక్కొక్క సీసమున వర్ణించుట యుచితముగా నున్నది. (ఛందశ్శిల్పము - పు. 549)

ఇచట మఱియొకవిషయముకూడ గుర్తింపఁదగును. మహారాజుల మహత్త్వవర్ణనకు స్వీకరింపఁబడినపద్యముకూడ సుదీర్ఘమైనదియై వారి మహత్త్వఘనత నభివ్యంజించుటకుఁ దోడ్పడుచున్నది.

(2) ఉలూకము కాకముల సంహరించినతెఱఁగును గని ఉపపాండవాదుల సంహారక్రియ నశ్వత్థామ నిర్ణయించెను. కావున తిక్కన ఉలూకము కాకులను సంహరించిన వర్ణనమును, అశ్వత్థామ అశ్వములను సంహరించినవర్ణనమును ఉత్పలమాలయందే నిబంధించి సాదృశ్యమును జక్కగా వ్యక్తపఱచెను.

(1) "కొన్నిటికంఠముల్ నులువుఁ; గొన్నిటికాళులు ద్రుంచు; నుగ్రతం
గొన్నిటిపక్షముల్ నఱకుఁ; గొన్నిటిపొట్టలు వ్రచ్చు లీలమైఁ;
గొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ నుఱుమాడు; నిట్టుల
య్యన్నిటి నయ్యులూకము రయంబెసఁగన్ వధియించె భూవరా :" (10.1.18)

(2) "కొన్నిటిపాదముల్ నఱకుఁ; గొన్నిటిమోరలు సెక్కు లీలమై;
గొన్నిటికంఠముల్ దునుముఁ; గొన్నిటివీఁపులు వ్రచ్చు నుబ్బునం;
గొన్నిటిసర్వగాత్రములు క్రూరవిచేష్టితవిభ్రమంబు దోఁ
పన్నుఱుమాడుఁ బ్రౌఢబలభాసితభూరిభుజావిహారుడై." (10.1.176)

ఈరెంటివృత్తైక్యమువలనను, విశేషించి గతిసామ్యమువలనను అశ్వత్థామ విజృంభణమునం దులూకకృత్యసామ్యము ప్రస్ఫుటముగా ప్రతీయమానమగుచు నాతని హృదయక్రౌర్యమును వ్యక్తపఱచుచున్నది.

శంకయొకటికలిగినప్పటిస్థితియు, దానికి సమాధానముపొందినప్పటిస్థితియు వర్ణింపఁబడవలసినప్పుడు వృత్తైక్యముచేతను, ఎత్తుగడలోనిసామ్యముచేతను దానిని వ్యంజించుట నీక్రిందిపద్యద్వయమునందుఁ గానవచ్చును.

దుష్యంతుడు శకుంతలను జూచి యామె తనకు భార్యకాఁదగుటను శంకించినపద్యము :

"ఇది మునికన్యయేని మఱియేలొకొ యీలలితాంగియందు నా
హృదయము తద్గయుం దవిలె; నిప్పలు కింతను నమ్మనేరన
య్యెద; విజితేంద్రియుం డనఁగ నిమ్మునిఁ బాయక విందు, నంచు దా
నిది కలరూపెఱుంగ నవనీపతి యుత్సుకుఁ డయ్యె నాత్మలోన్." (1.4.30)

ఈ శంక నివృత్తమగునప్పటియాతనిహృదయము నభివర్ణించిన పద్యముకూడ చంపకమాలయే. అంతమాత్రమేకాదు; ఎత్తుగడయు పై దానికివలెనే కలదు.

"ఇది మునినాథకన్య యని యెంతయు నిస్పృహవృత్తి నున్న నా
హృదయము రాజపుత్రి నని యిక్కమలాక్షి నిజాభిజాత్యసం
పద నెఱిఁగించినన్ మదనబాణపరంపర కిప్పుడుండ నా
స్పదమయి సంచలించె నళిపాతవికంపితపంకజాకృతిన్." (1.4.51)

వీనిపై శ్రీ విశ్వనాథవారి వ్యాఖ్యానము :

"రెండు స్వగతములును సదృశతమములయినచంపకములందే నిబంధింపఁబడినవి. మొదటిదానియందుఁ దునిఁగిపోవచ్చినదుష్యంతునిరతి రెండవదానియందతుకుకొని కొనలుసాఁగినది. శకుంతలాదుష్యంతుల ప్రణయకలాపమున కడ్డుగాఁ జొచ్చుకొని వచ్చిన మేనకావిశ్వామిత్రుల శృంగారవృత్తాంతమున కుభయకూలము లందును నిల్చి యీరెండుపద్యములు అవాంతరకథాప్రవాహసేతునిబంధనప్రయోజకములగు రెండుమహా స్తంభములవలె నున్నవి. ఇది ఛందస్సాధనముచే సాధింపఁబడినకథాశిల్పము." (నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి - పు. 162)

ఇట్లు ఛందస్సు వ్యంజకమగుట స్థాలీపులాకన్యాయమున సూచింపఁబడినది.

చంపూరచనలో గద్యపద్యవినియోగము కూడ వ్యంజకము కానగును. కేవలము కథను దొరలించుకొనిపోవలసినప్పుడును, సుదీర్ఘమైనద్వంద్వయుద్ధాదికము వర్ణ్యమైనవుడును గద్యము నాశ్రయించుట కవిత్రయరచనలో - ముఖ్యముగా నన్నయరచనలోఁ - గానవచ్చును. గద్యమునఁ గథాభాగము పరువిడుచుండఁగా నడుమ పద్య మాపతితమగుచుండును. అనఁగా నచట నొక విశేషాంశము కలదు పరికింపుఁడన్నకవియెచ్చరిక యామార్పుచే ప్రతీయమానమగును. ఉదాహరణమునకు ఆదిపర్వము తృతీయాశ్వాసమున నెనుబదియవసంఖ్యగల వచనమున నాయారాజు లేయేయంశమున జన్మించిరో చెప్పఁబడినది. 81, 82, 83, 84 సంఖ్యలు గల పద్యములందు ద్రుపద సాత్యకి విరాటభూపతులయు, విదురునియొక్కయు, కుంతీ మాద్రీదేవులయు, పాండవులయు నంశములు చెప్పఁబడినవి. ప్రవాహరూపవచనము నాపి ఘట్టములవంటి పద్యములఁ జెప్పుటలో వీరికి కథయందుఁగల ప్రాముఖ్యము వక్కాణించినట్టయినది. ఈ వ్యంజకము రసభావాదిరూపముకాకపోయినను కవి హృదయము నభివ్యక్తము చేయును గనుక నిదియు గమనింపఁదగినది.

తత్సమాచ్ఛికపదముల వినియోగమునందలి యాధిక్యన్యూనతలు కూడ కొండొకచో వ్యంజకములగుట కన్పట్టును.

ద్రౌపది యధర్మవిజితయా? ధర్మవిజితయా ? చర్చింపుఁ డని వికర్ణుఁ డనఁగా కర్ణుఁ డాతని నధిక్షేపించిన యీక్రిందిపద్య మట్టిదానికి మేలైన యుదాహరణము :

"ఎల్లవారు నెఱుఁగ నొల్లనిధర్మువు బేల నీకుఁ జెప్పనేల వలసె;
చిఱుతవాని కింత తఱుసంటిపలుకులు సన్నె వృద్ధజనము లున్నచోట."

(4.4.64.)

ఈ పద్యమునందు ధర్మువు, వృద్ధ జనములు అనురెండుతప్ప తక్కినవన్నియు నాచ్ఛికపదములు. ఈ పదముల ని ట్లెన్నుకొనుటలో వికర్ణునియెడ కర్ణునకుఁ గల

యీసడింపు వ్యక్తమగుట కవితాత్పర్యము. లోకమున వెక్కిరించుట, అధిక్షేపించుట మున్నగు సందర్భములలో హల్లులను దీర్ఘగించుట, లేనిచోటులందు మహాప్రాణతను గూర్చుట, గాలి నూఁదినట్లు పలుకుట మున్నగువికారములను జేయుట కానవచ్చును. వ్యాకరణబద్ధముగా రచన చేయుకవి యిట్టిపద్ధతికై శాబ్దిక మైన మఱియొక ప్రక్రియ నవలంబింపవలసి యుండును. పైపద్యమున అచ్చతెలుఁగు పదముల కూర్పు అట్టియీసడింపు నభివ్యక్తము చేయును. ధర్మువు, వృద్ధజనము అనువానియెడల నాకును గౌరవము కలదు సుమా అని తెలుపుటకో యన్న ట్లవి రెండును తత్సమములుగా గ్రహింపఁబడినవి. ఇట్లనుటలో తత్సమపదములు గౌరవాదులను, అచ్చికపదము లవహేళనాదుల నభివ్యక్తము చేయునని సాధారణీకరించుట అభిలషణీయము కాదు. వీనికూ ర్పట్టియభివ్యక్తికి హేతువగునని మాత్రమే తాత్పర్యము.

ఇట్టి సంవిధానమే తిక్కనకవీంద్రుని దొకటి : ఉత్తరుఁడు భీష్మద్రోణ కృపాదిధన్వినికరాభీలమైన కౌరవసేనం గాంచి భీతుఁడై సడియును చప్పుడును లేకుండ నింటికి తిరిగిపోవుట యుత్తమ మని బృహన్నలతో ననుచున్న మాటలు :

"ఒంటిఁ దలపడి కురుసేన నోర్చువాఁడ నే? యిదేటికి వెడమాట లిట్టులాడ;
వారు కానక ముందఱ తేరు దోలుకొని రయంబునఁ బురి కరుగుటయ నీతి."
4.4.64.

ఈపద్యమునందలి బరువులేని యాచ్ఛికపదబాహుళ్యము ఉత్తరుని అసంస్కృత హృదయమును, భీతిచేఁ గలిగినలఘుబుద్ధిత్వమును వ్యక్తము సేయును.

వాక్యమును సాగఁదీయుటయును, చిన్నచిన్న వాక్యములను గూర్చుటయును వ్యంజకములుగా నూహింపఁబడఁదగునని యీక్రిందియుదాహరణములను బట్టి భావింపదగును.

ద్రౌపది రాయబారమున కరుగుచున్న కృష్ణునితో తనపడ్డబన్నములఁ జెప్పుకొనుచు -

"ఈ వెంట్రుకలువట్టి యీడ్చినయాచేయి తొలుతఁగాఁ బోరిలో దుస్ససేను
తను వింతలింతలు తునియలై చెదరిరూపఱియున్నఁగనియుదుకాఱుఁగాక-
యలుపాలఁ బొనుపడునట్టిచిచ్చే యిది; పెనుగదవట్టినభీమసేను
బాహుబలంబును - బాటించి గాండీవ మను నొకవిల్లెప్పుడును వహించు
కవ్వివిక్రమంబు - గాల్పనే యిట్లు బ న్నములు పడినధర్మనందనుండు
నేను రాజరాజుపీనుంగుఁ గన్నారఁ గానఁబడయమైతి మేనిఁ గృష్ణ !" 5.3.117

అనినయీపద్యమునందు మొదటివాక్యము మిక్కిలిగా పొడిగింపఁబడినది. ఈపొడిగింపు దుశ్శాసనునిఁజేయవలసినచిత్రవధస్వరూపమును భావించి భావించి

యుగ్గడించు నామెహృదయమునందలికోపభరము నభివ్యక్తముచేయుటలో వ్యంజక మగుచున్నది. దీనిని 'ఇంతలింతలు' అను నభినయసూచకపదమును, తునియలై, చెదరి, రూపఱి అనునసమాపకక్రియలలోనిక్త్వార్థక ప్రత్యయములును దీప్త మొనరించును. 'కేవలము చంపినచో నేమగును? ముం దాచేయి ముక్కలుముక్కలు కావలయును. వానిపాపకళేబరము ఏకాకృతిగ నుండరాదు. అతిసూక్ష్మములగు తునుకలు కావలయును. ఆ తునుకలు కూడ నొకచో నుండుటయు దుస్సహమే. చెదరి నలుదిక్కులందును బడవలయును. పడుటయే కాదు. వానిస్వరూపమే మిగుల రాదు. అప్పుడుగాని వాఁడు చేసినపాపమునకు నిష్కృతియుండదు. అంతతోఁ గాని నా కోపాగ్ని చల్లారదు.' ఇత్యాది ద్రౌపదీభావపరంపర యంతయు ఈ క్త్వార్థకక్రియలలో నభివ్యక్తమగును. ఇట్లు అసమాపకక్రియలతో వాక్యపు దీర్ఘీకరణము వ్యంజకమై ద్రౌపది కోపతాపముల నసంలక్ష్య క్రమమున సహృదయునిచే నాస్వాదింపఁ జేయుచున్నది.

వాక్యములు చిన్నవిగాఁ దునిఁగి వ్యంజక మగుట నీక్రింది ధర్మజునివిచికిత్స యందుఁ జూడనగును.

"క్షత్రధర్మ మింత కష్టమగునె; పెఱ ధర్మ మాచరింపఁదగటంద్రు;
కాన శస్త్రజీవికయ తగియున్నది; యైన వంశనాశ మనభిమతము." 5.3.15

యుద్ధముచేసి సర్వబంధుసంహారము గావించుటయా? సంధిచేసికొని యిహపరములకుఁ జెడుటయా ? యనువిధమునఁ దెగనివిచికిత్స యుభయకోటు లందును నే యొకవైపునను క్షణము నిలువక సంచరించు ధర్మజుని సందిగ్ధహృదయము నీచిన్ని పద్యమునందలి నాలుగు చిన్నచిన్న వాక్యములు రమణీయముగా నభివ్యక్తము సేయుచున్నవి.

ఇట్లు వ్యంజకము లనంతవిధములుగా నుండవచ్చును. లోకమెంత వైవిధ్యవిలసితమో లోకజ్ఞుడగుకవి వాక్కును అంతవైవిధ్యవిలసితమై యొప్పుచుండును. స్థావరజంగమాత్మకమైన యీజగత్తున దేనికదే విలక్షణము. పై చూపులకు సామ్యము కానవచ్చునే కాని పరిశీలించినచో నెక్కడి కక్కడ వైషమ్యమే హెచ్చు. ఇట్టిలోకవృత్తమును ప్రతీయమాన మొనర్చువిధాన మిదిమాత్రమే, యింక లేదనిచెప్పుట కెవ్వఁడును సాహసింపఁ జాలడు. అట్లే మనఃక్షేత్రమున నిదియింతమాత్రమే పండునని చెప్పుటకు విలులేదు. అయ్యది క్షణములో అసంఖ్యాకములగుభావతరంగముల నుత్పత్తి చేయుమహాసముద్రము. కావున కవి దీనిని భావించెనా? యని శంకింపరాదు. భావించియుండఁడనుటకును ప్రమాణ మేదియు లభింపదు. కావున మూలచ్ఛేదము

కాకుండునంతవఱకు, పూర్వాపరవైరుద్ధ్యము లేనంతవఱకు కవిహృదయభావనలో నెంత దూరము పోయినను దోషము సంభవింపదు. కావుననే వ్యంగ్యవ్యంజకములయానంత్యము సమర్థనీయమగుచున్నది.

ఈ పై నిరూపించినవ్యంజకములలోఁగొన్నింటిని గూర్చి కొన్ని పూర్వపక్షములు బయలుదేరుట కవకాశముగలదు. రసభావాదులు అర్థసామర్థ్యమున నాక్షేపింపఁ బడునవికదా! అట్టియెడ నర్థమును విడిగా వచింపఁజాలనిసుబాదులకు వ్యంజకత్వ మెట్లుకుదురునని యొక యాక్షేపము. వ్యంజకత్వము వాచకత్వము ననుసరించి యుండదు కావున సుబాదు లర్థవాచకములు కాకపోయినను వ్యంజకములగుటలో విప్రతిపత్తియుండదని సమాధానము. కొంద ఱాలంకారికులు శబ్దవిశేషసౌందర్యమును వక్కాణించుటయు జరిగినది. వాని కా సౌందర్యము వ్యంజకత్వమువలననే సిద్ధించును. స్రక్చందనవనితాది శబ్దములు శృంగారరసపరముగా సుందరములు. బీభత్సాదిపరముగా నవి యసహ్యములు. ఇట్లు సౌందర్యము వ్యంజకత్వమువలననే సిద్ధించునని చెప్పినచో నివి యెల్లయెడల సుందరములే కావలయునుగదా! కావున వ్యంజకత్వవివేక మవశ్యముగా పొందవలసియే యున్నది. అది సహృదయతాలభ్యము. రసభావాదులపరిజ్ఞానమునఁ గలనేర్పు సహృదయత. అట్టిసహృదయిసహృదయము నావర్జించు నేస్వల్పాంశమైనను వ్యంజకకోటిలోనికి రాఁగలదు. కావునఁ బైఁజెప్పిన వ్యంజకములనుగూర్చి శంకింపఁబనిలేదు.

ఇట్లానందవర్ధనులు వ్యంగ్యవ్యంజకోభయస్వరూపనిరూపణమును సుష్ఠుగాఁ గావించి ధ్వనిసిద్ధాంతమును ప్రతిష్ఠాపించిరి. మఱియు ననేకశంకలను దామే యూహించి వానినన్నింటిని ఖండించి ధ్వనిమహావృక్షమునకు క్షతిలేనిపుష్టిని కలిగించిరి. ధ్వనిసిద్ధాంత మిట్లు సుప్రతిష్ఠితమైనది.

## గుణీభూతవ్యంగ్యము :-

వాచ్యార్థము తెలిసినపిమ్మట వాచ్యార్థోపస్కృతమగురమణీయార్థభానము కలుగుపద్ధతు లింతవఱకును విశదీకరింపఁబడినవి. ఉపసర్జనీకృతస్వార్థములైన శబ్దార్థములు చమత్కారకారిఅర్థవిశేషావగతి కెచట తత్పరములైయుండునో యట్టి కావ్యవిశేషము ధ్వని యనఁబడుననియుఁ జెప్పఁబడినది. వ్యంగ్యప్రధానమగు కావ్యవిశేషము ధ్వని యనునభిప్రాయమును సోదాహరణముగ నిరూపణకు వచ్చినది.

కొన్నిఁయెడల వ్యంగ్యార్థము తోఁచును. కాని యది ప్రధానమై యుండదు. వాచ్యార్థము వ్యంగ్యార్థప్రతీతికి - వెలుఁగునకు దీపమువలె - తోడ్పడియుండుటయు, వ్యంగ్యార్థమే వక్తృద్దిష్టమై యాస్వాదనీయ మగుటయు వ్యంగ్యార్థప్రాధాన్యమును

ప్రతిపాదించును. కొన్ని యెడల తోఁచినవ్యంగ్యార్థముతో నన్వయించి దాని కెక్కుడుసొగసు కూర్చును. అప్పుడు వాచ్యార్థ మధికచమత్కారము నొదవించుచున్నదిగదా! అట్టిసన్నివేశము లందు వాచ్యార్థప్రాధాన్యము గోచరించును. అనఁగా వ్యంగ్యార్థ మున్నతస్థితికమే యయినను, సేవకునివివాహమున నాతనిపైఁదనకుఁగలప్రేమాదరములచే పల్లకికి ముందు నడుచు ప్రభువువలె నది వాచ్యార్థము కంటె తక్కువస్థితిలో నుండుట తటస్థించును. అట్టివ్యంగ్యార్థాన్వయమువలన వాచ్యార్థప్రాధాన్యము నిరూపితము కాఁగలదు. వ్యంగ్యమున్నది కాని దానికి ప్రాధాన్యము లేకపోవుటచే నట్టి సన్నివేశములను గుణీభూతవ్యంగ్యమందురు. వ్యంగ్యము - గుణీభూతము (అప్రధానము) అయిన దన్నమాట.

పైనిరూపణము ననుసరించి కావ్యములు మూఁడువిధములుగా పరిగణింపఁ బడుచున్నవి. (1) వ్యంగ్యార్థప్రాధాన్యముగల కావ్యవిశేషము - ధ్వని (2) వ్యంగ్యార్థ ప్రాధాన్యములేనికావ్యము - గుణీభూతవ్యంగ్యము (3) వ్యంగ్యవాసనలేనికావ్యము - చిత్రము.

ధ్వనివిశేషము లింతకుముందు నిరూపింపఁబడినవి. ప్రకృతమున గుణీభూతవ్యంగ్యమును పరిశీలింపవలసియున్నది. కావున వీని నుదాహరణముఖమున నరయుదము.

సహృదయహృదయాహ్లాదకమైన ధ్వనిస్వరూపమును గుర్తెఱిఁగినపదప గుణీభూతవ్యంగ్యమును గూర్చి విచారించుటలో నౌచిత్యమేమి ? యని శంకింపఁజనదు. గుణీభూతవ్యంగ్యము ధ్వనికావ్యమంతగా నాస్వాదనీయము కాకపోయినను, వ్యంగ్యార్థ స్పర్శవలన నదియు చారుతానిధానమే యగుచున్నది. కావుననే యిదియు మహాకవులచే నందం దాదరింపఁబడినది. కనుక ఆనందవర్ధనులు దీనిని కూడ వివేచించిచూపిరి.

వస్త్వలంకారరసరూపములయిన మువ్విధములైనవ్యంగ్యములును గుణీ భూతములు కావచ్చును. ధ్వనిప్రభేదములన్నియు గుణీభూతవ్యంగ్యమునకును గోచరింపవచ్చును. కొన్ని యుదాహరణములు.

వ్యంగ్యమగువస్తువును కవి వాచ్యముచేయుటవలన గుణీభూతమగుట నీక్రిందియుదాహరణమునఁ గానవచ్చును :

> "నిండుమనంబు నవ్యనవనీతసమానము, పల్కు దారుణా
> ఖండలశస్త్రతుల్యము జగన్నుత! విప్రులయందు; నిక్కమీ
> రెండును రాజులందు విపరీతము; గావున విప్రుఁ డోపు; నో
> పం డతి శాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపఁగన్" 1.1.101

తనకిచ్చినశాపమును గ్రమ్మఱింపుమని యుదంకుఁడు ప్రార్థింపఁగా నది తానుజేయలే నని చెప్పినపౌష్యునివాక్యమిది. ఇందు "నిండుమనంబు....... రాజులందు విపరీతము" అనునంతవఱకుఁ గలవాక్యముచే శాపము గ్రమ్మఱింపఁగలుగుట, లేకుండుట అనువస్తువిశేషము ప్రతీయమానమగుచునే యున్నది. నిండైనమనము నవ్యనవనీతసమానము కావున దానియందు చోటుచేసికొనిన క్రౌర్యము (శాపప్రదాన రూపమైనది) సులభముగా తీసివేయదగిన దనునర్థము వ్యక్తమగును. పల్కు దారుణా ఖండలశస్త్రతుల్యము - అనుటచే వాక్కెంతకఠోరమయ్యును దానికి హృదయకాఠిన్యసంవాదము లేదు కావున దార్ఢ్యము లేదనునర్థము వ్యక్తమగును. కావున విప్రునిశాపము ఘోరతరమయ్యును హృదయమార్దవముచే నది తేలికగా పరిహరణీయ మగును. ఇవి రెండును రాజులందు విపరీత మనుటచే హృదయకాఠిన్యమువలన నందున్న భావపు చెక్కుచెదరని స్థితి ఉక్తప్రాయమై శాపము క్రమ్మఱింపరాకుండుట ప్రతీయమానమగును. ఇట్లు ప్రతీయమానమైన వస్తువిశేషమంతయు "కావున విప్రు డోపు, నోపం డతిశాంతుఁడయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపఁగన్" అనువాక్యముచే వాచ్యము చేయఁబడినది. ఇట్లు స్ఫురించినవ్యంగ్యార్థము వాచ్యార్థమునకు సహకారకమై యప్రధానమగుచున్నది. కావున నిది గుణీభూత వ్యంగ్యమున కుదాహరణమగుచున్నది.

ఇట్టిదే మఱియొక యుదాహరణము :

"అనవుడు - వీరె తమ్ములను నాప్తులుఁ గృష్ణుఁడు - వీరె తక్కఁగొ<br>
ల్వునఁ గలయట్టిసర్వజనులున్ వినుచుండెద; రయ్య నిన్ను నే<br>
మను మని పంచెఁ - జెప్పు మదియంతయు నేర్పడ; నన్ను ధర్మనం<br>
దను గరువంపుఁ బల్కులవిధంబునకున్ మదిలోన నుల్కుచున్." 5.1.290

సంజయుడు రాయబారమునకు వచ్చి ధర్మజునితో, 'నలువురుతమ్ములు, భవదాప్తులును కృష్ణుఁడును వినుచుండగా నీకుఁ గొలువునఁ జెప్పవలసినమాటలు కొన్ని కలవు విను' మని వలుకగా ధర్మజుఁ డన్నమాట యిది. 'వీరె తమ్ములను' అనునదిమొదలుకొని 'అదియంతయు నేర్పడన్' అనునంతవఱకుఁ గల ధర్మజుని వాక్యములలో నీవెవరెవ రుండగోరితివో వారంద ఱిచటనే యున్నారు. అయ్య చెప్పు మనిన ఆమహావిషయమును సావధానముగా వినుచునే యుండెదరు. నీవు వాకొనుదాని వినుటకు నీవు పేర్కొన్న తమ్ములును కృష్ణుఁడునే కాక సర్వజనులును నిచటఁ గలరు. మాయయ్యసంగతి తెలియనివా రెవరు ? మాసంగతి నెఱుఁగనివారెవరు? దీని కింత యెచ్చరిక యేల? ఆధృతరాష్ట్రునిదౌష్ట్యమును ప్రకటించు నామేలిపలుకు లేవో త్వరగాఁ

జెప్పుము' ఇత్యాదిరూపమున క్రోధము తోడి యెగతాళివైఖరి అభివ్యక్త మగును. ఎదురుగా నున్నవారి నొక్కొక్కరిఁ బేర్కొనుట, వినుచుండెద రని నొక్కిచెప్పుట, 'అయ్య' అనుపరిహాససూచిపదప్రయోగము, ఏ మను మని పంచె ననుటలో నేమైన ననఁగలఁ డన్న అభిప్రాయము, అదియంతయున్ అనుటలో నేమియు దాఁపఁబనిలేదను నెచ్చరికయు, ఏర్పడన్ అనుటయందలి విస్పష్టముగా జెప్పు మనుతాత్పర్యమును పై వ్యంగ్యార్థమును జక్కగా భావింపఁజేయును. మాటకు మాట తెగులన్నవైఖరిగా నున్న యీవ్యంగ్యార్థస్ఫురణము తరువాతి 'ధర్మనందను గరువంపుఁబల్కులవిధంబునకున్ మదిలోన నుల్కుచున్' అనువాక్యభాగముచేత వాచ్యమయినది. కావున నిదియు గుణీభూతవ్యంగ్య మగుచున్నది.

వ్యంగ్యార్థము గుణీభూతమగు దాని స్వరూపప్రదర్శనమునకై యీరెండు దాహరణములు నొసఁగఁబడినవి. ఈరెంటిలో మొదటిదానియందు వ్యంగ్యమగు నర్థవిశేషమంతయు వాచ్యముగాఁ జెప్పఁబడుటయు, రెండవదానిలో వ్యంగ్యార్థము భావనచేయుఁడన్నసూచనయుఁ గలవు.

పూర్వము నిరూపించినధ్వనిభేదము లన్నింటియందును వ్యంగ్యార్థము గుణీభూతమగుట గోచరింపవచ్చును. అందు కొన్ని భేదముల గుణీభూతవ్యంగ్యత యిట వివరింపఁబడుచున్నది.

**అత్యంతతిరస్కృతవాచ్యమునందు వ్యంగ్యము గుణీభూతమగుట కుదాహరణము :**

బ్రహ్మలోకమునకుఁ బోవుచున్నమునులవెంబడి భార్యాద్వయసహితుఁడై సమవిషమప్రదేశములఁ జనుచున్న పాండురాజుం జూచి ఋషు లిట్లనిరి :

"వీర లతిలలితమృదులా కారలు; గిరివిషమగహనగహ్వరముల రా
నేరరు; గావున నిట చను దేరక నిలువుండ; యివియు దేవపథంబుల్."1.5.68

ఇందు పాండురాజు భార్యలతో చనుదేరక నిలుచుటకుఁ జెప్పిన మొదటికారణము యుక్తమే. దానితో నముచ్చితమైన 'యివియు దేవపథంబుల్' అనువాక్యమునకు వాచ్యార్థము పొసఁగదు. వారు మనుష్యశరీరములతోఁ బోవుచుఁ దమ్ముదేవపథములు గావున రావల దనుట యెట్లు ? అను ప్రశ్నకు యోగ్యమగుసమాధాన మిందు లేదు. కావున వాక్యమున స్ఖలద్గతి యేర్పడినది. అప్పుడు 'దేవపథమున వచ్చుటకు మీకు యోగ్యత లేదు' అను లక్ష్యార్థము సిద్ధించుచున్నది. ఈయర్థముచే పాండురాజునకు అనపత్యత యనుదోషమువలనఁ దనకు దేవపథములలో గమించు పుణ్యవిశేషము లే

దనునర్థమును - వ్యంగ్యముగా ఋషులు చెప్పిన దానిని - గ్రహించెను. వారును దుష్కృత విశేషమువలనఁ బాండురాజున కయిన యీ యయోగ్యతను వ్యంగ్యముగనే సూచించుట సముచితముగదా : 'అనపత్యత యనుదోషమువలన మీరు దేవమార్గములయందుఁ జరింప ననర్హులు' అనునది యిట వ్యంగ్యార్థము. ఈయర్థ మునసంతరవాక్యమునఁ గవి వాచ్యముచేసెను.

"అనిన విని నరుల కక్కడఁ జనఁబోలమి యెఱిఁగి పాండుజనపాలకుఁడి
ట్లనియెను - స్వర్గద్వారం బనపత్యులు గాన నోపరటె మునులయ్యున్."1.5.69

ఇట్లు వ్యంగ్యార్థము వివరించిచెప్పఁబడినది కాన నిది గుణీభూత వ్యంగ్యమగును.

అర్థాంతరసంక్రమితవాచ్యము గుణీభూత మగుట నీక్రిందియుదాహరణమున గమనింపనగును :

"వనజభవ ప్రభావుఁడగువాని - వసిష్ఠు - నపత్యశోక మ
న్వననిధిలోన ముంచినయవారితసత్త్వుఁడు; నిన్నుఁ దొట్టియా
యనిమిషు లెల్ల వానికి భయంపడుచుండుదు; రట్టియుగ్రకో
పనుకడ కిప్పు డేఁగు మని - పాడియె- యిప్పని నన్నుఁ బంపఁగాన్."1.4.37

ఇంద్రుడు మేనకను విశ్వామిత్రునితపోభంగము గావించి దేవరాజ్య మహిమను కాపాడు మని యాదేశింపఁగా నామె యిట్లనెను. ఇందు 'నిన్ను దొట్టి యీ యనిమిషులెల్ల' అనునది యర్థాంతరసంక్రమితవాచ్యము. 'ఉత్తమయజ్ఞము లొనర్చియో యుద్ధములో వీరమరణ మొందియో దేవత్వమును సాధించుకొని పుణ్యవిశేషముండునంతదనుక జరామరణజన్మనభయము నొందవలసిన యవసరము లేనియనిమిషులును, వారికిని మూఁడులోకములకును బ్రభువవై యందరకు భయోత్పాదకుఁడవు కావలసిన నీవును భయపడుచుందురు'అనునర్థాంతరమున నీవాచ్యార్థము సంక్రమితమగును. అట్టి మీ రెల్ల భయపడుచుండఁగా 'అట్టియుగ్రకోపనుకడకున్' అనుపదమాయర్థము ననువదించినది. అర్థాంతరసంక్రమిత వాచ్యము గుణీభూతమగుట కిట్టిది లక్ష్యము.

వివక్షితాన్యపరవాచ్యమునందు గుణీభూతవ్యంగ్యమునకు కొన్ని యుదాహరణములు - అందు సంలక్ష్య క్రమమున వస్తువుచే వస్తువు వ్యక్తమగునపుడు గుణీభూతమగుట :

(1) "నీ వలుగులఁ బడుటకు దుః ఖావేశము పొందెనే, నిరర్థకమగుని
య్యేవపుఁబుట్టువు పుట్టిన నావగ పెవ్వరికి నెక్కు నళినదళాక్షీ !"

(2) "నీతోడిపరిచయములే దే; తలపోయఁగ ననింద్య వెందును; నీ వి
ట్లాతుర వగుటకు నామది నేతాపములేదు; నైజ మెఱుఁగవు కంటె."4.3.51,52

కీచకసంహారానంతరము ద్రౌపది యర్జునునితో మాటాడఁబోయెను. అతఁడు కీచకులు సంహరింపఁబడిన విధానమును ద్రౌపదిమాటలతో నెఱుఁగఁగోరెను. అప్పుడామె అభిప్రాయగర్భితముగాఁ దనపడినకష్టము నాతఁడు పట్టించుకొనలేదని యీ క్రిందిపద్యమున నెత్తి పొడిచెను :

"కన్నియల కొటగఱపుచు నున్ననీకు
నకట ! సైరంధ్రి యిప్పుడేమయ్యె నేని
ఖేద మెద నించుకయు లేమిఁగాదె నన్ని
తాననంబుతో నన్నిటు లడుగు టెల్ల !" 4.3.49

అంత నీప్రసంగము సమయభంగమునకు దారితీయు ననువెఱపుతో బృహన్నల యామెను సమాధాన పెట్టుటకై పై మాటలాడెను. ఇందు 'దుఃఖావేశము పొందెనేన్' అనుచోటిఅవ్యర్థకముచే పొందినదుఃఖావేశమెంతటి దైనను పైకిఁ దెలియరానిదిగదా! అనునర్థము స్ఫురించును. 'ఇయ్యేవపుఁబుట్టువు' అనుపదము తన తత్కాలపరాక్రమప్రదర్శనాయోగ్యతను స్మృతికిఁ దెచ్చుచు 'సమయభంగమగునేమో జాగ్రత్తపడుము. ప్రసంగమును సాగఁదీయకు' మనునెచ్చరికను వ్యంగ్య మొనర్చును. 'నావగ పెవ్వరికి నెక్కు' ననుటలో ఇతరులు మనఅభినయ సౌష్ఠవముచే గుర్తింపకున్నను సహధర్మచారిణి వైననీవును నాదుఃఖమును గుర్తింపఁజాల వైతివికదా ! అనునిర్వేదమును ప్రతీయమాన మొనర్చును. 'నళినదళాక్షీ !' అనుసంబోధనము 'అంతంత కనులతో సర్వమును జూచుచుఁ జూడనిదానివలె మాటాడుదు వేల?' అనునభిప్రాయమును వ్యంజించును. అట్లే రెండవపద్యమున 'నీతోడిపరిచయములేదే?' అనుకాకూక్తి యితరులకు స్వల్పపరిచయము కూడ లేదన్న భావమును గలిగించుచు, ద్రౌపదికి తమగాఢపరిచయమును ఉగ్గడించుట ద్వారమున ఆను లక్షింపవలసినబాధ్యత కలవాఁ డే యన్న యభిప్రాయమును వ్యక్త మొనర్చును. 'అనింద్య వెందును' అనుటవలన నీ కీచకవ్యవహారములో 'నీ ప్రవర్తనలో నెట్టి లోపమును లేదుసుమా ! అనునర్థము వ్యంగ్యమగును. మఱియు నెందును ననింద్యవైనదాన విందు పతిదూషణచేసి నింద్యవు కానేల? అనుభావముకూడ నిందు ప్రతీయమానము కావచ్చును. 'నామది నేతాపములేదు' అనుటలో నుండవలసినతాపమంతయు మదిలోనే యణఁచుకొంటిని. ప్రదర్శించినచో ప్రమాదముగదా ! అనునర్థము వ్యంగ్యమగును. 'నైజమెఱుఁగవు' అనువాక్యమున పైకి గనబడునది కృత్రిమము. అంతరమైననిజస్వభావము నెఱుఁగుటకు యత్నింపుము. అది యెఱిఁగినచో నీవు నన్నిట్లు తూలనాడవుగదా!' అనుభావ మభివ్యక్తమగును. 'కంటే'

అనుక్రియాపదము నాయభిప్రాయము నెఱుఁగుమను చోదనము నభివ్యక్తముచేయును. ఇట్లీ పద్యద్వయమున రమణీయమగునర్థవిశేషము ప్రతీయమాన మగుచున్నది. ఈయర్థ మంతయు తఱువాతివచనములోని 'రిపుమర్దనంబు తనకు వెరవుగా కునికి గుప్తసాభిజ్ఞానంబుగాఁ దెలిపిన' అనువాక్యభాగముచే గుణీభూత మయినది.

అర్థశక్త్యుద్భవాలంకారకృతవస్తుధ్వని గుణీభూత మగుటకు లక్ష్యము :

"కాల్పఁడే మహనీయఖాండవం బింద్రుని నమరగణంబుతో విముఖుఁజేసి
బహుదివ్యశరములు వడయఁడే యొక్కటి బవరాన మెప్పించి శివునిచేత;
గంధర్వులకు నోడి కర్ణుండు నీతమ్ము లును బాఱ విడిపించుకొనఁడె నిన్ను;
నిను నను ద్రోణు నాతనిపుత్త్రుఁ గృపుఁగర్ణు గెలిచి విరాటుగోవులఁ గొనండె;
తక్కు పెక్కులెడలఁ బెక్కంద్ర నేమేని సేసె వినమె, యట్టిజెట్టి నిన్ని
దినము లిట్లు దొడరి పెనఁగియు నీచేత నేఁడు వినఁగవలసె వేఁడిపలుకు."

6.3.177

తనవారు పెక్కురు మరణించుచుండఁగా దుర్యోధనుఁడు భీష్మాచార్యుని చిత్తశుద్ధిని శంకించి కర్ణప్రేరణమున 'నీవు యుద్ధముమాని కర్ణుని బంపు' మని కర్ణ శూలాయమానముగాఁబలుకఁగా నొచ్చినమదితో భీష్ముఁడు చేసిన ప్రసంగములోని దీపద్యము. ఇం దర్జునునిపరాక్రమము బహువిధములుగా నుల్లేఖింపఁబడినది. కావున వాచ్యముగా నిట నుల్లేఖాలంకారము సంభావ్యము. ఇది యలంకార మనుట కిందు చమత్కార మేమి కలదని శంకింపఁబనిలేదు. తానర్జునుని నోర్వకుండుటకును, ఇన్నిదినములైన నాతని నిలువరించియుండుటకును హేతువులుమాత్రమే వక్తవ్యమై యుండఁగా నాతని పరాక్రమప్రశంస చేయుట యుక్తివైచిత్రియే కదా ! కావున నిట నుల్లేఖాలంకారము వాచ్యముగా నున్నది. దనివలన అర్జునుని యజేయతయు, నాతనిలోకోత్తరపరాక్రమాతిశయమును వ్యంగ్యముగాఁ దోఁచుచున్నవి. మఱియు 'ఇన్నిదినము లాతని నిలువరించితిని. నాపరాక్రమాదు లావిషయమునకే కీర్తనీయములు. అతఁడొక్కఁడు కాక మఱియెవ్వరును నాముందాగఁజాలరు' అనునర్థము కూడ నిట ప్రతీయమానమగును. ఇట్లు ప్రతీయమానమగు నర్థవిశేష మంతయు కించి ద్వ్యవధానముగా వాచ్యము చేయఁబడినది.

"గాండీవి గెలువరాదు - శి ఖండిని జంపంగ నాకుఁగాదు; వినుము; న
న్నొండుమగలు మార్కొనినం జెండుదు నుగ్రముగ; మున్న చెప్పితి నీకున్."

6.3.180

పై పద్యమున 'గాండీవి గెలువరాదు' మున్నగు వాక్యములు పూర్వపద్యము నందలి వ్యంగ్యార్థమును వాచ్య మొనరించినవి.

అలంకారకృతవస్తువు గుణీభూతమగుటకే మఱియొకయుదాహరణము :

మేనక విశ్వామిత్రునికోపతీవ్రత నింద్రునికి విన్నవించుసందర్భము-

"అమ్ముని యల్గి చూచుడును నాక్షణమాత్రన గోత్రధారుణీ
ధ్రమ్ములు వ్రయ్యు; నయ్యుసుము దక్కఁగ నంబుధు లింకు; మూఁడులో
కమ్ములు దిర్దిరం దిరుగు; గాడ్పు చలింపఁగ నోడు; నుగ్రతం
బమ్మినయట్టికోపపరుపాలికి భామలు వోవనోడరే ?" 1.4.38

ఇందుచెప్పిన గోత్రధారుణీధ్రమ్ములు వ్రయ్యుట మున్నగునవి యతిశయోక్తులు. వీనివలన విశ్వామిత్రునికోపము నతితీవ్రత ప్రతీయమానమగుచుండఁగా నది 'యుగ్రతంబమ్మినయట్టి కోపపరుపాలికిన్' అనువాక్యభాగముచే వాచ్యముచేయఁబడినది. విశ్వామిత్రుఁడతిలోకసామాన్య ప్రభావముగలవాఁ డనుటలో సందియము లేదు కాని అల్గిచూచినంతమాత్రమున నింతప్రళయము సంభవించుట యనునది యథార్థమనుకొనుటకు వీలులేదు. ఏలయన నాతనికి కోపము వచ్చిన సన్నివేశములు గలవు. కాని యింతప్రళయము వచ్చె ననుటకు గ్రంథాధారము లేదు.

వస్తువు గుణీభూతమగుట యుదాహరణముఖమున నిరూపింపఁబడినది. ఇఁక నలంకారవిషయమును పరిశీలింతము. దీపకము, రూపకము, నిదర్శన, వస్తుప్రతివస్తూపమ మున్నగునలంకారములలో నుపమ వ్యంగ్యమగుచునే యున్నది. కాని, దానికంటె వాచ్యమగుదీపకాదికమునకే చారుత్వాతిశయమును, ప్రాధాన్యమును - దృశ్యమానము లగుచున్నవి. దీపకాద్యలంకారవర్గపృథక్పరిగణనమే వాని ప్రాధాన్యనిరూపకమగును. కావున నిట్లు వ్యంగ్యమగునుపమ గుణీభూతమగుచున్నది. ఒక యుదాహరణము : నన్నయభట్టారకుఁడు రాజరాజనరేంద్రునితో భారతరచన దుస్సాధతను వక్కాణించుచు నిట్లనెను :

"అమలినతారకాసముదయంబుల నెన్నను - సర్వవేదశా
స్త్రములయశేషసారము ముదంబునఁ బొందను - బుద్ధిబాహువి
క్రమమున దుర్గమార్థజలగౌరవభారతభారతీసము
ద్రముఁ దఱియంగ నీఁదను - విధాతృనకైనను నేరఁబోలునే!" 1.1.19

ఇందు ప్రకృతము భారతభారతీసముద్రముఁ దఱియంగనీఁదుట. తారకాసముదయముల నెన్నుట, సర్వవేదశాస్త్రములయశేషసారమును బొందుట అనునవి

య్య ప్రకృతములు. ఈప్రకృతాప్రకృతములకు 'విధాతృనకైనను నేరఁబోలునే' అనుదానిచే ధర్మైక్యము చెప్పఁబడినది. వర్ణ్యావర్ణ్యములకు ధర్మైక్యమును జెప్పుట దీపకలక్షణము. కావున నిందు వాచ్యముగా దీపకాలంకారము గలదు. దీనిచే మహాభారతరచనము తారకాసముదయపరిగణనమువలె చతుర్ముఖునికిఁ గూడ నసాధ్యమగునది యనుతీరున ఉపమాలంకారము ప్రతీయమానమగును. కాని దీనికంటె దీపకమే యిచట నధికచమత్కారహేతువు. ఏలయన నుపమాలంకారమున నుపమాన ముపమేయముకంటె తప్పనిసరిగ నున్నతకోటిలో నుండును. సాధారణముగ గొప్పదానితో పోలికచెప్పుటయే యుపేక్షణీయముకదా! కావున నిచట నుపమనే గ్రహించినచో తారకాపరిగణన సర్వవేదశాస్త్రసారగ్రహణములు భారతరచనకంటె నుత్కృష్ట తరములు కావలసివచ్చును. అప్పుడు వక్తవ్యమగుభారతరచనామహత్త్వమున కొకింత హైన్యము ఘటిల్లును. దీపకమునం దన్ననో యివియన్నియు సమానకోటిలోనికిఁ జేరి న్యూనతాధిక్యముల జ్ఞానమే పరితకుఁ గల్గదు. అపుడు మహాభారతరచన క్లేశసాధ్యత్వము నిరూపితమగును. కావున వాచ్యమగుదీపకమునకే యిందు ప్రాధాన్యము. అదియే చమత్కారము. ఇట్లు వ్యంగ్యమగు నలంకారము గుణీభూత మగుచున్నది.

సాధారణముగఁ గొన్నియలంకారము లుపమాగర్భితములు. మఱికొన్ని వక్రోక్తిగర్భితములు. వేఱుకొన్ని అతిశయోక్తిగర్భితములు. కొన్ని శ్లేషమూలములు. ఇందువలననే యుపమ సర్వాలంకారబీజభూతమనియుఁ, గా దట్టి దతిశయోక్తి యనియు నిత్యాదివిధముగా నాలంకారిక మతభేదము లేర్పడినవి. దీనిని బట్టి యలంకారము లన్నియు గుణీభూతవ్యంగ్యములే యగును. ఉపమాద్యన్యతమము సర్వాలంకారము లందును ప్రతీయమానము కావలసినదే కదా! స్వభావోక్తి స్వచ్ఛమైనదియే కదా అన్నదానిని చాలమందియాలంకారికులు అలంకారముగనే పరిగణింపలేదు. కావుననే 'వ్యంగ్యమాత్రగర్భితమే యలంకార'మని అలంకార సామాన్యలక్షణముగా ధ్వన్యాలోకమునఁ జెప్పఁబడినది. ఇట్లలంకారమార్గమంతయు గుణీభూతవ్యంగ్యమునకే లక్ష్యమగుచున్నది.

అలంకారాంతరము వ్యంగ్యమగుటలేని అప్రస్తుతప్రశంస, రసవంతము - మున్నగువానియందు ఈపైఁజెప్పినసిద్ధాంతము సరిపడదుకదా! యని శంకింపఁబనిలేదు. వీనియం దలంకరము వ్యంగ్యము కాకున్నను, వస్తువో, రసమో వ్యంగ్యమగును. అట్లు వ్యంగ్యమైన దలంకారము ననువర్తించుటచే దానికి గుణీభూతత్వము సిద్ధించును. ఇట్లలంకారవర్గమున గుణీభూతవ్యంగ్యము నిరూపితమైనది.

ఇఁక మూఁడవది యగు రసాదిక గుణీభవనమెట్టిదో చూడనగును. రసభావతదాభాసాదులు ప్రధానమగువాక్యార్థమున కెక్కడనైన అంగత్వమును భజించినచో నవి రసవదాద్యలంకారము లగును. అనఁగా కొండొకయెడ రసాదికము కంటెను భిన్నమైనది ప్రధానమగుచుండును. అట్టిరసాదులే రసవదాద్యలంకారములుగా పరిగణింపఁబడినవి.

1. ఒక భావమునకుఁ గాని రసమునకుఁ గాని మఱొకరస మంగమయ్యె నేని రసవదలంకార మగును.

2. ఒక రసమునకు భావము గాని యొకభావమునకు మఱొకభావము గాని యంగమయ్యె నేని ప్రేయోఽలంకారము.

3. భావమునకు రసాభాసభావాభాసము లంగ మయ్యె నేని ఊర్జస్వ్యలంకారము.

4. రసమునకు భావశాంతి యంగమగునేని సమాహితాలంకాము (నిర్వచనములు శ్రీ సన్నిధానంవారి కావ్యాలంకారసంగ్రహవ్యాఖ్య 423, 424, 425, 426 పుటలనుండి యుద్ధరింపబడినవి.)

ఇట్లు వీనియందు రసభావాదు లంగత్వమును భజించుటచే రసము గుణీభూతమగుచున్నది. ఉదాహరణముల నరయుదము.

ఎఱ్ఱాప్రెగ్గడ మహాభారతరచనాప్రారంభమునఁ గావించినశరద్వర్ణనలోని యీపద్యమున రసవదలంకారము సంభావితమగును.

"అతిగాంభీర్యవిభూతి నేకచుళుకాహంకారనిశ్శేషశో
షితపాథోధిపయస్కుఁడైనముని తేఁజెం బుణ్యతేజోమయా
కృతి నయ్యామ్యదిగంతవీధిఁ బ్రకటక్రీడాకళాగర్వగ
ర్జితమండూకకళంకితాంబుశుచితాసిద్ధిప్రదాచార్యుఁడై." 3.4.146

ఇందు ప్రకృతము శరద్వర్ణనము. కవికిఁ గల శరద్వర్ణనాభిలాష మను భావమునకు అగస్త్యకృతపాథోధిశోషణము, అంబుశుచితాసిద్ధి మున్నగు విషయములచే ద్యోతమానమగునద్భుతరసము అంగమగుచున్నది. ఇటఁ దోఁచునద్భుతరసము శరత్స్వరూపనిరూపణ పర్యవసాయియేకదా! కావున నద్భుతరస మంగ మయ్యె ననుటలో నాక్షేపము లేదు. "అపూర్వవస్తుదర్శనాచ్చిత్తవిస్తారో విస్మయో మతః" అను ప్రతాపరుద్రీయోక్తినిబట్టి 'ఏకచుళుకాహంకారనిశ్శేషశోషితపాథోధిపయస్కత' యనునపూర్వవిషయము విస్మయాధాయకమై సహృదయునిచే అద్భుతరసము నాస్వాదింపఁజేయుచున్నది. కాని యిదియంతయు శరద్వర్ణనాభిలాష గల కవి చిత్తవృత్తి కంగమై యప్రధానమగుచున్నది. కావున నిట భావమునకు రస మంగమయి రసదదలంకారముగా పరిణమించినది.

రసము రసాంతరాంగ మగుట కీక్రిందిపద్య ముదాహరణము :

ఉత్తర యిక్కుమారోత్తము నురమున వ్రాలి మోమునఁ దనవదనకమల మందంద నేడ్చుచున్నది; మున్ను గన్నంత మెలఁగంగ నేరక చెలులమాటు గొనుసిగ్గు పెంపున వనటనిట్లయ్యె, ని ప్పుడు మాటిమాటికిఁ బొలఁతి ప్రియునిఁ గనుఁగొని బిగియారఁ గౌఁగిలించుచు శిర మూరుతలంబున నునిచి పాణి పల్లవంబున నానన మల్లనల్ల దొడయుచును నిన్నుఁ జూచుచుఁ దోడుతోడఁ బొడము పెల్లునఁ గన్నీరుదుడిచికొనుచు నలఁత పెనువెల్లిఁదేలెడు నంబుజాక్ష!"

11.2.75

గాంధారి పొలికలనున నుత్తర స్థితి నభివర్ణించి కృష్ణునకుఁ జూపించు నీపద్యమున ప్రధానముగాఁ బ్రతీయమానమగునుత్తరాలంబకమైనకరుణరసమునకు, బిగియారఁ గౌఁగిలించుట, శిర మూరుతలంబున నునుచుట, పాణిపల్లవంబున నానన మల్లనల్ల దొడయుట మున్నగు ననుభావములచే ప్రతీయమానమగుశృంగారము అంగ మగుచున్నది. పతిపునర్జీవితాశ కిట నాస్కారము లేదు కావున నిది విప్రలంభముగా భావించుటకు వీలులేకపోయినను, ఆ యా యనుభావము లొకప్పటి వారి సంభోగ శృంగారమునకు స్మారకముగా నుండుటచే నిది సంభోగశృంగారముగా సంభావింపదగినది. అది యిట్లంగమగుటయు నీసందర్భమున కెంతయు సముచితము. ఏలయన 'నిట్టి మహోదాత్తదాంపత్యసుఖము ననుభవించినయీజంటలో నొకవ్యక్తి మరణించెను; ఇఁక మిగిలినవ్యక్తిశోక మత్యుత్కటముగానుండు'నని సహృదయునకుఁ దోచి కరుణరసమునకు మఱింత దీప్తి నొసఁగును. ఇట్లు శృంగార మిట కరుణమున కంగమై గుణీభూతమగుచున్నది. ఇదియే రసవదలంకారము.

ప్రేయోఽలంకారస్వరూపమును పరిశీలింతము.

అభిమన్యుమరణమునకు వగచునర్జునునియనుభావాదులను, వాగ్వైఖరిని ప్రతిపాదించు -

"అత్యంతశోకాక్రాంతస్వాంతుం డగుచు సుభద్రాకాంతుండు గద్గదకంఠంబు తోడం దోడంబుట్టువుల కిట్లనియె :

మనసిజమూర్తి యైనయభిమన్యుని మాటలు వీనులార నే
వినవలతుం; దదీయమృతి వేడ్క నొనర్చినవారు గ్రక్కునం
జని తగవానిఁ గాంచి సుఖసంగతియైఁ జరియించునట్లుగా
ననిచెద; నేటిపోరు దెలియంగలభంగియు మీరు సెప్పుడా." 7.2.259, 260

అనువీనియందు వచనమునఁ జెప్పఁబడినశోకాక్రాంతత గద్గదకంఠత్వమును మున్నగునవి యర్జునాలంబకమగుకరుణరసమును ప్రతీయమాన మొనరించుచున్నవి. పద్యమునందలి "తదీయమృతి వేడ్కనొనర్చినవారు గ్రక్కునం జని తగవానిఁ గాంచి సుఖసంగతియై జరియించునట్లుగా ననిచెద" ననువాక్యముచే తదాలంబక మగుశత్రుమారణోత్సాహ మను భావము తోఁచుచున్నది. ఇది యనుభావాదులచే పుష్టము కాకుండుటచే రసస్థితికి రాలేదు. కావున భావపరిధిలోనే నిలిచిపోయినది. అయ్యది ప్రధానమగుకరుణరసమున కంగముగా నయి దానికి శోభను గలిగించు చున్నది. కావున నది ప్రేయోఽలంకార మగును.

భావము భావమున కంగమగుటయు ప్రేయోఽలంకారమే యగును. దాని నీక్రిందియుదాహరణమున నరయఁదగును.

"మహితసముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యు లంగనా
సహితము గాఁగ నేమిగతి సమ్యగుపాయనిరూఢవృత్తిమై
నహితుల కప్రభేద్యముగ నాపదుమూఁడగునేఁడు మత్పితా
మహులు చరించి; రంతయుఁ గ్రమంబున నా కెఱుఁగంగఁజెప్పుమా" 4.1.44

ఇది పాండవులయజ్ఞాతవాసమునుగూర్చి జనమేజయునిప్రశ్న. ఇందు మహితసముజ్జ్వలాకృతులు మున్నగు విశేషణములు అజ్ఞాతవాసనిర్వహణమునందలి అనల్పశ్రమ నభివ్యక్తము చేయుచున్నవి. మహితసముజ్జ్వలాకృతులు కావున వారి యాకృతియే వారిని పట్టియిచ్చును. మానధనులు కావున నెపుడైన మానసంరక్షణ తత్పరత్వమున తామే బయల్పడుప్రమాదము గలదు. జనమాన్యులు కావున వారిని జనులు వదలి యుండలేరు. అట్టిచో నజ్ఞాతవాసచర్య మఱియు నసాధ్యము. అంగనా సహితముగా నుండుటవలన తా మైదుగురు, నొక్క భార్యయు - వీరు పాండవులన్న అభిజ్ఞను గలిగించును. మఱియు పురుషునికున్న లాఘవపరాక్రమాదులు స్త్రీల కుండవు. కావున నొకవేళ తప్పించుకొనవలసివచ్చినచో చాలకష్టము. అంతేకాక ఆమె అంగన-పరమసుందరమైన శరీరము గలది. ఆమె యొంటరిగా వారి అండదండలు లేనిచోట గుప్తముగా నొక్కసంవత్సరము గడపుట సుసాధము కాదు. ఇట్లు వారి యజ్ఞాతవాస పాలనము బహుశ్రమతో గూడినదని. ఈవిధముగా నీవిశేషణములలో అజ్ఞాత వాసమునందలి 'శ్రమ' యనెడిభావము ప్రతీయమానమగుచున్నది. అది యంతయుఁ దదనంతరవాక్యమునందలి "మత్పితామహులు చరించి రంతయుఁ గ్రమంబున నా

కెఱుఁగంగఁ జెప్పుమా" అనుదానిచే నభివ్యక్తమగుజనమేజయుని యౌత్సుక్యమునందు పర్యవసించుచున్నది. 'వా రెవరో అయినచో నాకంత కౌతుక ముండనక్కరలేదు. వారు మా పితామహులు కావునఁ దెలియఁగోరితిని. ఏదో కొంత వచించుట కాదు. అంతయును జెప్పవలయును. క్రమభంగ మయినచో రుచింపదు. కావున క్రమముగాఁ జెప్పుము. అంతేకాదు, నాకు సంపూర్ణముగాఁ దెలియునట్లు దయచేసి చెప్పుము' ఇత్యాదిరూపమున జనమేజయుని జిజ్ఞాసయందలి దార్ఢ్యమిందు ప్రతీయమానమగును. పూర్వోక్తమగుశ్రమ మనుభావము ఈయౌత్సుక్యమున కంగప్రాయమగుటచే నది గుణీభూతమగుచున్నది. కావున నిదియు ప్రేయోఽలంకారమున కుదాహరణమగును.

ఊర్జస్వ్యలంకారము నీక్రిందియుదాహరణమునఁ గాననగును.

ఉత్తరగోగ్రహణవార్త విని యుద్ధమున కాయత్తుఁడగుచున్నయుత్తరుని వాక్యములు-

"కురుపతిభీష్మకర్ణకృపకుంభజముఖ్యులు మత్సముద్యమ
స్ఫురణము చూచి పార్థుఁ డనుబుద్ధిఁ గలంగఁగ బెట్టుగిట్టి సం
గరమున నోర్చి యేఁ బసులఁ గ్రమ్మఱఁ దేరకయున్న నన్ను భూ
వరుఁడు సుహృజ్జనంబుఁ బరివారముఁ జిత్తములందు మెత్తురే?" 4.4.11

ఇందు ప్రధానముగా నుత్తరునిగర్వము ప్రతీయమానమగుచున్నది. స్వపరతారతమ్య మెఱుఁగక యలవుమాలినపనిచేయఁగల ననుకొనుటయే యిట గర్వము. దీని కాతఁడు భావించు భీష్మాదిమహావీరుల పరాజయకారిత్వమునందలి యుత్సాహము అంగము. అనుచితసందర్భమున ప్రయుక్తమైనభావ మాభాసతను బొందుచున్నది. కావున నిందు గర్వమనుభావమునకు ఉత్సాహాభాస మంగమై 'యూర్జస్వి'ని రూపొందించు చున్నది.

భావశాంతి రసాంగమైనచో సమాహితాలంకారమగును. దాన భావశాంతి ప్రాధాన్యమును గోల్పోవును. అప్పుడది గుణీభూతవ్యంగ్య మగును.

[illegible]ణము :

[illegible]పాలుఁడు కృష్ణుని కర్ఘ్యప్రదానవిషయమును సహింపక విజృంభించుచుండఁ
[illegible]ప ప్రదర్శించిన యౌద్ధత్యము -

[illegible]వక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి; మిచ్చిన దీనికిం'దొడం
బడ' మని దుర్జనత్వమునఁ బల్కెడువీరులమస్తకంబుపై
నిడియెద; నంచుఁ దాఁ జరణ మెత్తె సభన్ సహదేవుఁ; డట్టిచో
నుడిగి సభాసదుల్ పలుకకుండిరి తద్దయు భీతచిత్తులై." 2.2.30

ఇందు సహదేవాలంబనకమగురౌద్రరసమునకు సభాసదుల తత్కాలమాన సాందోళనోపశాంతి యంగముగా ఏర్పడినది. శిశుపాలునివిజృంభణము, భీష్మాచార్యునిమందలింపు, ధర్మరాజుననునయము, శిశుపాలుని ప్రగల్భోక్తులు మున్నగు వానివలన నేర్పడిన జనహృదయాందోళనమునకు సహదేవునిరౌద్ర ముపశమనము కల్గించినది. ఇట్లిందు భావశాంతి రసాంగముగా నిలిచినది. గావున నిది సమాహితాలంకారమగును.

భావసంధి భావశబలతాదులు గూడ భావాదుల కంగములగుచో వానికి ప్రత్యేక నామ మేదియు లేదు. కావున భావసంధ్యలంకారము మున్నగువిధముననే వ్యవహరింపవచ్చును. ఇట్లీ యన్నింటియందును రసాదిక మంగముగా నిబద్ధమగుటచే ప్రాధాన్యమును గోల్పోయి గుణీభూతవ్యంగ్యకోటిలోనికిఁ జేరుచున్నది.

ఇట్లు త్రివిధధ్వనిభేదములును గుణీభూతములగుటను పరిశీలించితిమి.

రసవిషయగుణీభూతత్వమునఁ గొందఱు వేఱొకవిధముగా నుటంకింతురు. రసము వాచ్యమైనచో గుణీభూత మగునని వారియభిప్రాయము. వారిదృష్టిలో రసము వాచ్యమగుట యనఁగా స్వశబ్దనివేదిత మగుట. కాని యీయభిప్రాయము సరికాదు. ఏలయన శృంగారాదిరసవాచకపద మున్నంతమాత్రమున రసస్ఫురణ కలుగుట లేదు. విభావాదిసామగ్రి సమకూడినచోటనే రసవ్యపదేశము. అట్టియెడ రసము వాచ్యమగుట అసంభవమే యగును. ఎందైన విభావాదిసామగ్రి పుష్కలముగా నుండుచోటను కవి శృంగారాదిపదమును వాడుటవలన సౌందర్యమునకు కొంత యపకర్ష ఘటిల్లవచ్చును గాని యది రసభంజకము కానోపదు. మమ్మటాదులు రసనామగ్రహణము వమనదోష మని చెప్పుట అంత సముచితముగాదు. ఏలయన నదియే ప్రమాణమైనచో నీదోషము లేనిమహాకవి యుండఁడు. సంస్కృతమున భవభూతి, తెలుగున తిక్కన మున్నగుమహాకవీంద్రులు విభావాది సామగ్రిబలమున రసప్రతీతి నొదవించియు పలుమాఱులు రసాదినామములఁ బ్రయోగించియున్నారు. "నానారసాభ్యుదయోల్లాసి" (4.1) "*నీయుత్తమనాయకత్వమెఱింగి నిన్నుఁ గొని యాడ నేనెంతదాన ! మహితవిస్మయా నందనిర్మగ్ననైతి*" (4.2.360) "*ఒక్క యున్నతావనీజంబు పెరికి రౌద్రాతిరేక మదర భుజశిఖరంబునయం దమర్చి*" (4.3.24) మున్నగునవి యుదాహరణములు. కావున రసవాచకపదమున్నంతమాత్రమున రసము వాచ్యమైన దనికాని, తత్పదగ్రహణము దోష మని కాని చెప్పుట ప్రమాదము. రసాదికము గుణీభూతమగుటకు ప్రాధాన్యము లేకపోవుటయే కారణము కాని తదన్యముకాదని సారాంశము.

వ్యంగ్యము గుణీభూతమగుటకు మఱియొకమార్గము కూడఁగలదు. ఎందైన ప్రతీయమానార్థము కాక్వాక్షిప్తమైనచో నాసందర్భము కూడ గుణీభూతవ్యంగ్యమే యగును. 'కక-లౌల్యే' యనుధాతువునుండి కాకుశబ్ద మేర్పడినది. దీనిని శ్రీతిరువేంగళాచార్యులుగారిట్లు వివరించిరి-"శోకము, భీతి మొదలగుభావ విశేషములవలనఁ గంఠస్వరమున నేర్పడు లౌల్యాదిరూపమగునొక విధపువికారము 'కాకు' పదమున కర్థము." (అం.ధ్వ.పు 581). అభినవగుప్తపాదులు మఱియొకవ్యుత్పత్తినిఁ గూడఁ బ్రదర్శించిరి. "యది వా ఈషదర్థే కుశబ్ద స్తస్య కాదేశః. తేన హృదయస్య వస్తుప్రతీతే రీషదర్భూమిః కాకుః" = "హృదయమునందలి యర్థము ప్రతీతమగుటకు కొంచెము చోటు." హృద్గతమైన హర్షశోకావేగాదులను అభివ్యక్తము చేసెడు విధముగా పదవాక్యావసానములందు ఉచ్చారణమాత్రమున తెలియు ధ్వనివిశేషము కాకు వని తాత్పర్యము. లేఖనములో దానికి ప్రత్యేకచిహ్నము లేక పోయినను సందర్భవశమున నదిగుర్తింపఁబడుచునే యుండును. దానివలన నర్థాంతరావగతి గలుగుట ప్రసిద్ధమే. ఏలయన వక్త తదభివ్యక్తి కరణతాత్పర్యముతోడనే యట్లుచ్చరించుచున్నాఁడు గదా! ఇట్లు కాకువుచేత ప్రతీయమానమగునర్థవిశేషము గుణీభూతమే యగుచున్నది. కారణ మేమన కాకువుచే నది వాచ్యప్రాయమైపోవును. ఉదాహరణము నరయుదము. అర్జునుఁడు కట్టితెచ్చినద్రుపద మహారాజును జూచి నగుచు ద్రోణుఁ డిట్లనెను.

"వీరెవ్వరయ్యా ! ద్రుపదమహారాజులె ! యిట్లు కృపణులయి పట్టువడన్
వీరికి వలసెనె ! యహహ ! మహారాజ్యమదాంధకార మది వాసెనొకో !"

1.6.90

పై పద్యమునందు 'అయ్యా, రాజులె, వలసెనె, పాసెనొకో' అనువాని తుది వర్ణములయందు వక్త కంఠస్వరవిశేషము కాకువును ప్రతిపాదించుచున్నది. అది యర్థాంతరావగమనము చేయుట ప్రసిద్ధమే. 'వీ రెవ్వరయ్యా !' అనుటలో ఎవ్వఁడు నన్నవమానించెనో వానికే యిట్టిగతిపట్టెనా ? అనునవహేళనము వ్యంగ్యమగును. 'ద్రుపదమహారాజులె !' అనుటచే నీ వెంత మహారాజవైననేమి ? నాకు పట్టువడితివి కదా యనుమెక్కిరింత ద్యోతక మగుచున్నది. 'ఇట్లు పట్టువడన్ వీరికివలసెనె !' అనుట పట్టుపడక తప్పదనునర్థమును వ్యంజించును. 'మహారాజ్య మదాంధకారమదివాసెనొకో!' అనుదానివలన పాయక యేమగుననన్నభావము ప్రతీయమానమగును. ఈయర్థవిశేష మంతయు వాక్యావసానములందలికాకువుచే నుక్తప్రాయమై గుణీభూతమగుచున్నది.

వ్యంగ్యార్థప్రతీతికి వాక్యాదికమున యుక్తిసాహాయ్య మున్నచో నది కూడ గుణీభూతవ్యంగ్యమే యగును. ఈక్రింది పద్యము దాని కుదాహరణము కాఁగలదు :

"అనుడుఁ-చిన్నన వ్వోలయఁగ నస్త్రగురుఁడు
నరునిపైఁ జూడ్కి నాటించి 'నన్ను గెలువ
కెట్లు సైంధవుఁ జేరె' దంచేసె రథ్య
ములును హరియును నతఁడు నమ్ముల మునుంగ." 7.3.50

ఇందలి 'పిన్ననవ్వోలయ' అనుపదముచే ద్రోణునితత్కాలసంరంభ మళీకమైన దనునర్థము వ్యక్తమగును. ఈయభివ్యక్తికి పిన్ననవ్వోలయుట యనునది యుక్తిగా నిబద్ధమైనది కనుక నిట్టిదియు గుణీభూతవ్యంగ్యమే యగును.

ఇట్టిదానికి ధ్వన్యాలోకము చూపిన యుదాహరణము :

"పత్యుః శిరశ్చంద్రకలా మనేన స్పృశేతి సఖ్యా పరిహాసపూర్వమ్,
సా రంజయిత్వా చరణౌ కృతాశీ ర్మాల్యేన తాం నిర్వచనం జఘాన."

ఇందు 'పతి శిరోభూషణమగుచంద్రకళను ఈపాదముచే స్పృశింపు' మనునీవాక్యార్థముచే 'ప్రియుఁడు నీపాదములను దలతో స్పృశించువఱకు నతని యిష్టానుసారము ప్రవర్తింపకుము' అనునర్థము సఖ్యుపదేశరూపమున తోఁచుచు పార్వతి నిర్వచనముగా మాలతో నామెను తాడించె ననుటచే నామె సాధ్వసాభిమానాదులు ప్రతీయమానములైనను నయ్యవి కన్యకాజనోచితవృత్తి కుపస్కారమగును. ఇందలి 'నిర్వచనమ్' అనువదముచే హృదయమునఁ బుట్టినభావములను కొంచెము విప్పిచెప్పినట్లయినది. కావున నిట్టిదియు గుణీభూతవ్యంగ్యమున కుదాహరణమే యగుచున్నది.

పైఁ జెప్పినగుణీభూతవ్యంగ్య మెచట నైన రసభావాదిపర్యాలోచనమున తద్వ్యంజకసామగ్రి కలదై యున్నచో ధ్వనియే యగును.

దుర్యోధనమరణవార్త మోసికొని కురుక్షేత్రమునుండి కరిపురి కరుగుదెంచు సంజయునవస్థ యీక్రిందిపద్యమునం దభివర్ణితమైనది :

"పొరిఁబొరి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁడై
చరణయుగంబు దొట్రువడ సంభృతశోకత రాజవీధి నె
వ్వరిఁ గనియైన - హా మహితవైభవ ! హా ధృతరాష్ట్రపుత్త్ర ! హా
కరిపురనాథ ! యం చెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచున్." 9.1.6

దుర్యోధనమరణజనిత దుర్భరశోకవేదనచే నున్మత్తప్రాయుఁడైన సంజయుని అనుభావవిశేషములను బట్టి యీపద్యముచే పరితృహృదయమున కరుణరస మావిర్భూతమై యాస్వాదింపఁబడుచున్నది. ఇందు దుర్యోధనమృతివిషయము

వ్యంగ్యముగాఁ దోఁచును. కాని తఱువాతి పద్యమున నది వాచ్యమైపోయినది.

"జననయనచకోరానం దనుఁడగునృపచంద్రుఁ డనుచితంబయినవిధం
బున నస్తమించె - నంచుం దనుడోలనభరితభూరిదైన్యం డగుచున్." 9.1.7

ఇట్లు సంజయాలంబకమగుశోకహేతువు వాచ్యమగుటచే నిది (పైపద్యార్థము) గుణీభూతవ్యంగ్యముగా సంభావింపఁదగినదే యైనను మొత్తము మీఁదఁ గరుణరసస్ఫోరకమైనవ్యంజకసామగ్రియగు బాష్పపూరము గ్రమ్ముట, నూర్ధ్వబాహుఁడగుట, చరణయుగంబుతొ్ట్రుపడుట మున్నగుననుభావములచేతను, 'ధృతరాష్ట్రపుత్ర!' ఇత్యాదిసంబోధనములనుబట్టి యూహింపఁదగినస్మృత్యాదివ్యభిచారిభావములచేతను రసస్ఫురణ మిట ప్రాధాన్యము వహించుచున్నది. వాచ్యమయిన దుర్యోధనస్మృతి విషయము ప్రకృతమగుశోకమున కుద్దీపకమే యుగుటచే నిందు గుణీభూతవ్యంగ్యత యున్నను ఇది ధ్వనివిషయమే యని సంభావింపఁదగును.

ఇట్లు సందర్భాదివివేకమువలన ప్రాధాన్యవివక్షనుబట్టి ధ్వని గుణీభూతవ్యంగ్య-నిర్ణయము గావింపవలయును.

ఇంతవరకు చేసినచర్చచే తేలినవిషయ మేమన వ్యంగ్యార్థమున కెచట ప్రాధాన్యముండునో యది ధ్వనికావ్య మనియు, నట్టిప్రాధాన్యములేక వాచ్యోపస్కారముగా వ్యంగ్యార్థ ముండుతావు గుణీభూతవ్యంగ్య మనియు రెండు తెఱఁగుల కావ్యవిశేషములు గలవు. అందు మొదటిది పరమోత్తమజాతికిఁ జెందినది. రెండవదియు వ్యంగ్యస్పర్శచే నాదరణీయమే యగుచున్నది.

ఇఁక రసాదితాత్పర్యము లేనిదియు, వ్యంగ్యార్థవిశేషమును బ్రకాశింప జేయలేనిదియు నగురచన కేవలవాచకములవైచిత్ర్యము నవలంబించి, రంగులతో కనులకు ఆకర్షకముగా నుండుచిత్రము వలె శబ్దార్థాలంకారప్రధానమై యుండు నదియుఁ గలదు. అట్టిదానినే చిత్రకావ్య మందురు. ధ్వని-గుణీభూతవ్యంగ్య నామకముఖ్యకావ్యజాతమునకు ప్రతికృతి వలె నుండుటచే దీనికి చిత్రనామము సార్థకమే. ఇది యమకాదిశబ్దవైచిత్రి నాశ్రయించి శబ్దచిత్ర మనియు, నుత్ప్రేక్షాదిరూపార్థవైచిత్రి ననుసరించి యర్థచిత్రమనియు ద్వివిధమై యొప్పును.

ఇట నొక యాక్షేపము పుట్టవచ్చును. ప్రతీయమానార్థము వస్తువు, అలంకారము, రసాదికము నని మువ్విధములుగా నుండును గదా! అందుమొదటి రెండును వ్యంగ్యములు గానిచోటులను చిత్రమని వ్యవహరించినను దానికి కావ్యత్వ వ్యవహారముండదు. ఇఁక నచట రసప్రతీతి యున్నదా? లేదా? అనుప్రశ్నకు ఉన్నదని సమాధానమైనచో నది

ధ్వనియే యగును. లే దన్నచో కావ్యమే కాదు. ఏదో యొక వస్తువు సంస్పర్శ లేనికావ్యము సంభవింపదు. వస్తుసంస్పర్శ యున్నచో నది తప్పక విభావాదిరూపమున రసాంగమే యగును. వస్తుభావనా విశేషమున నేర్పడుచిత్తవృత్తివిశేషములనే రసము లందురు. కవి ప్రతిభాగోచరమై కావ్యమున నిబద్ధమగు ప్రతివస్తువును చక్కగా భావింపఁబడి రసభావాద్యాత్మకమగు కావ్యమే కాజాలదని స్పష్టమగుచుండఁగా చిత్రకావ్యమనువ్యవహార మెట్లు పొసగు ననునాశంక యిట నుత్పన్నమగుచున్నది.

దీనికి సమాధాన మియ్యది : రసాదిస్ఫురణము లేనిచో కావ్యము కాదనుట నిజమే యయినను కవి రసభావాదివివక్షారహితుఁడై శబ్దార్థాలంకారనిర్మాణమున నభినివేశము చూపుట యందందు గోచరించును. వ్యంగ్యస్ఫురణము వివక్షావశముననే కదా జరుగును. అట్లు రసభావాదివివక్షారహితుడై శబ్దార్థాలంకారప్రవీణతను కవి యెందు జూపునో యట్టిది రసాదిశూన్యమని చెప్పక తప్పదు కదా ! కొండొక యెడ కవివివక్ష లేకున్నను వాచ్యములు స్వసామర్థ్యవశమున రసాదిప్రతీతి నొదవించినను నది గ్రుడ్డివానిచేతిరాయి వలె యాదృచ్ఛికమే యై శోభావహము కాజాలదు. స్ఫుటప్రతీతి హేతువగు కవివివక్ష లేకపోవుటయే దీనికి హేతువు. ఈ విధముగా కావ్యము నీరస మగును. అట్టిదానిని చిత్ర కావ్యమని వ్యవహరింప నగును.

చిత్రకావ్య మనువిభాగకల్పనమువలన ప్రయోజన మేమి? అనఁగా నిజమున కేమియు లేదు. కాని లోకమునఁ గొందఱు రసభావాదితాత్పర్యము లేక కేవలము శబ్దార్థవైచిత్రిని ప్రకటించియుండుటచే నదియు నొక విభాగము చేయవచ్చునని చెప్పుట మాత్రమే ప్రయోజనము. రసాదిప్రత్యాయనసామర్థ్యమున్నకవులు కూడ కొందఱందందు చాపలము వహించి యమకము, నిరోష్ఠ్యరచన, అచలజిహ్వము, ద్వ్యర్థి, త్ర్యర్థి మున్నగువానిపై వ్యామోహము చూపకపోలేదు. ఈ వ్యామోహము మాఘకాళిదాసాదులను గూడ స్పృశింపకపోలేదు. అంతమాత్రమున వారి ఘనతకు లోప మాపాదింపఁ బనిలేదు. అవి యాదరింపఁబడినచోట వారికి రసాదితాత్పర్యము లేదని మాత్రమే చెప్పనొప్పును. ఇట్లు చిత్రకావ్యమననేమియో తెలిసికొనుటయు నవసరమగుచున్నది. కవితాభ్యాసము చేయువాని కట్టి దుపాదేయము కాదని నిరూపించుటకును నీప్రభేదకల్పనము పనికివచ్చును. ఈ త్రివిధవిభాగములును కవివివక్ష ననుసరించియే యేర్పడును. కావుననే యీ క్రింది శ్లోకములు చెప్పఁ బడినవి.

"అపారే కావ్యసంసారే కవి రేవ ప్రజాపతిః;

యథాస్మై రోచతే విశ్వం - తథేదం పరివర్తతే.
శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్;
స ఏవ వీతరాగ శ్చే న్నీరసం సర్వ మేవ తత్.
భావా నచేతనానపి చేతనవ - చ్చేతనా నచేతనవత్ -
వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా." (ధ్వ.పు.278)

## సంకీర్ణము - సంసృష్టి :-

ఇంతవఱకు శుద్ధములగు ధ్వనిభేదములను ఉదాహరణసమన్వయపూర్వకముగా చూచితిమి. అట్లే గుణీభూతవ్యంగ్యస్వరూపమును కూడ దిఙ్మాత్రముగా అరసితిమి. ఈ భేదము లన్నియు నొకదానితో నొకటి కాని అనేకములు గాని కూడియు గోచరింపవచ్చును. అట్లొకదానితో నొకటి కలియుటలో ద్వైవిధ్యము కలదు. ఒక సన్నివేశమున రెండు ధ్వనిభేదములు గోచరించునపుడు వివిక్తముగా నిది యిది యని యేర్పఱించి చూపుటకు వీలైనచో నట్టి దానిని సంసృష్టి యందురు. అనఁగా నందు తిలతండులన్యాయము వర్తిల్లు నన్నమాట. అట్లు కాక విభజించి చూపుటకు వీలులేక క్షీరనీరన్యాయమున రెండు ధ్వనిభేదములు కలిసియున్నచో నట్టి దానిని సంకర మందురు. ఇంతకు పూర్వము నిరూపించిన ధ్వనిభేదము లన్నియు, - నట్లే గుణీభూతవ్యంగ్యభేదము లన్నియు - నీ సంకరసంసృష్టులచే బహుసంఖ్యాకములుగా నేర్పడుటకు వీలున్నది. ముప్పదియైదు విధములగు ధ్వని భేదములు గలవని యింతకు పూర్వము చెప్పుకొంటిమి. వీని క్రిందివిధముగా నామము లేర్పడినవి.

### (అ) లక్షణామూలము :-

(1) పదగతార్థాంతరసంక్రమితవాచ్యధ్వని
(2) వాక్యగతార్థాంతరసంక్రమితవాచ్యధ్వని
(3) పదగతాత్యంత తిరస్కృతవాచ్యధ్వని
(4) వాక్యగతాత్యంతతిరస్కృతవాచ్యధ్వని

= 4 భేదములు

### (ఆ) అభిధామూలము - సంలక్ష్యక్రమము :-

(1) పదగతశబ్దశక్తిమూలధ్వని
(2) వాక్యగతశబ్దశక్తిమూలధ్వని

(3) పదగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని
(4) పదగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతాలంకారధ్వని
(5) పదగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతవస్తుధ్వని
(6) పదగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాంకారకృతాలంకారధ్వని
(7) వాక్యగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని
(8) వాక్యగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతాలంకారధ్వని
(9) వాక్యగతకవి ప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతవస్తుధ్వని
(10) వాక్యగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతాలంకారధ్వని
(11) పదగతకవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని
(12) పదగతకవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతాలంకారధ్వని
(13) పదగతకవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతవస్తుధ్వని
(14) పదగతకవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతాలంకారధ్వని
(15) వాక్యగతకవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని
(16) వాక్యగతకవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతాలంకారధ్వని
(17) వాక్యగతకవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతవస్తుధ్వని
(18) వాక్యగతకవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతాలంకారధ్వని
(19) పదగతస్వతస్సిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని
(20) పదగతస్వతస్సిద్ధార్థశక్తిమూలవస్తుకృతాలంకారధ్వని
(21) పదగతస్వతస్సిద్ధార్థశక్తిమూలాలంకారకృతవస్తుధ్వని
(22) పదగతస్వతస్సిద్ధార్థశక్తిమూలాలంకారకృతాలంకారధ్వని
(23) వాక్యగతస్వతస్సిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని
(24) వాక్యగతస్వతస్సిద్ధార్థశక్తిమూలవస్తుకృతాలంకారధ్వని
(25) వాక్యగతస్వతస్సిద్ధార్థశక్తిమూలాలంకారకృతవస్తుధ్వని
(26) వాక్యగతస్వతస్సిద్ధార్థశక్తిమూలాలంకారకృతాలంకారధ్వని

= 26 భేదములు

**(ఇ) అభిధామూలము - అసంలక్ష్యక్రమము :-**

(1) వర్ణగతాసంలక్ష్యక్రమధ్వని
(2) పదగతాసంలక్ష్యక్రమధ్వని

(3) వాక్యగతాసంలక్ష్యక్రమధ్వని

(4) సంఘటనాగతాసంలక్ష్యక్రమధ్వని

(5) ప్రబంధగతాసంలక్ష్యక్రమధ్వని = 5 భేదములు

మొత్తము 4+26+5=35 భేదములు.

కొందఱిమతమున శబ్దశక్తిమూలవస్తుధ్వనియుఁ గలదు. అది పదవాక్యగతముగా మఱి రెండుభేదములను బొందుచున్నది. అర్థశక్తిమూలభేదము ప్రబంధగతముగా మఱియు పండ్రెండువిధము లగుచున్నది. ఆ మతమున ధ్వని భేదములు (35+12+2=49) నలువదితొమ్మిదగును. వీనితోపాటు అసంలక్ష్యక్రమమున పదైక దేశమనుభేద మొకటియు, వాక్యగతోభయశక్తిమూలమనుభేదమొకటియు ననంతరలాక్షణికులు కల్పించినవి కలవు. వీనితోఁగూడి మొత్తమేఁబదియొక్కభేదము లేర్పడుచున్నవి.

ఈ భేదము లన్నియు గుణీభూతవ్యంగ్యములకును గలవు. ఇట్లు ధ్వన్యాలోకముఁ (లోచనము) చూపిన ముప్పదియైదుధ్వనిభేదములును, ముప్పదియైదు గుణీభూతవ్యంగ్యభేదములును, అనంతములగుటచే నొకేభేదముగా పరిగణింపఁబడిన యలంకారవర్గమును గూడి మొత్తము డెబ్బదియొక్కభేదము లేర్పడుచున్నవి.

సంకరము అనుగ్రాహ్యానుగ్రాహకభావరూపము, సందేహరూపము, ఏకవాచకాను ప్రవేశరూపము నని మూఁడువిధములు. సంసృష్టి యొకవిధము. ఈనాల్గింటినిబట్టి పైఁ జెప్పిన యొక్కొక్కభేదము నాలుగేసి విధములు కాఁగా మొత్తము (4×71) రెండువందలయెనుబదినాలుగుభేదము లేర్పడును. ఈభేదము లన్నియు పైపేర్కొనిన ముప్పదియైదింటిలో నొక్కొక్కదానితో సమ్మిశ్రితములై మొత్త మేడువేలనాలుగువందల యిరువదినాలుగుభేదము లేర్పడును. ఈ విషయమంతయు లోచనకారునిచే ధ్వన్యాలోకతృతీయోద్యోతమున (పు. 280) ప్రతిపాదితమైనది. దీనిస్వరూప మంతయు నుదాహరణముఖమున నిరూపించుట సులభసాధ్యము కాదు కావున ధ్వన్యాలోకమున కతిపయోదాహరణములు చూపఁబడినవి. తదనుసారముగా సంకీర్ణ - సంసృష్టి-ధ్వనిభేదములకు మహాభారతమునుండి కొన్ని యుదాహరణము లిటఁ జూడనగును.

అసంలక్ష్యక్రమధ్వనికి సంలక్ష్యధ్వనితోడి సాంకర్యము నీక్రిందియుదాహరణ ములన నరయఁదగును.

"కచుండు శుక్రునకుం బ్రియశిష్యుండై యున్న నెఱింగి దానవులు సహింపనోపక బృహస్పతితోడియలుక నక్కచు నొక్కనాఁడు హోమధేనువులం గాచుచు

వనంబున నేకతంబ యున్నవాని వధియించి విశాలసాలస్కంధంబున బంధించి చని; రంత నాదిత్యుండస్తగిరిశిఖరగతుం డగుడు-మగుడి హోమధేనువు లింటికి వచ్చిన - వానితోడన కచుండు రాకున్న-దేవయాని తనమనంబున మలమల మఱుంగుచుం బోయి తండ్రి కిట్లనియె." 1.3.111

ఇందు కచుండు రాకుండుటకు దేవయాని మలమలమఱుగుచుం బోయినదనుటచే మొదట సంలక్ష్యక్రమమున నామె హృదయమునందలి శోక మభివ్యక్తమగుచున్నది. శోకము దేవయానీహృద్గతకచవిషయకాభిలాషశృంగారము ననుగ్రహించుచున్నది.ఇట్లిందు ప్రథమమున అనసురణ రూపమున స్ఫురించిన శోక మనుసంచారిభావము విప్రలంభశృంగారమునకు అనుగ్రాహకముగా నుండుటచే నిది సంలక్ష్యాసంలక్ష్యక్రమవ్యంగ్యముల అనుగ్రాహ్యానుగ్రాహకరూపసంకరమునకు లక్ష్యమగుచున్నది. ఇందు సంచారిభావవిప్రలంభశృంగారములస్ఫురణము దేని కదిగా విడదీసిచూపుటకు వీలులేక క్షీరనీరన్యాయమున వర్తిల్లుటచే నిది సంకరమగును.

ధ్వనిప్రభేదములు రెండొకచోట నుండ యేదో యొక్కటియే గ్రాహ్యమని నిర్ణయించుటకు వీలులేకుండుట సందేహసంకరము.

రాయబారమునకు వచ్చినశ్రీకృష్ణునిమాటలు పెడచెవి నిడుటయే కాక యాతని బంధించి తులువతనము చూప నెంచినదుర్యోధనాదులను గాంచి యాంబికేయు నుద్దేశించి శ్రీకృష్ణుఁ డిట్లనెను :

"రోషము నాపయింగలిగి క్రూరతఁ గౌరవు లింతసేఁత సం
తోషమ; నీవుప్రాభవముతోఁ దగ నాకు ననుజ్ఞ యిమ్ము; ని
ర్దోషత నేను నోపుగతి దోర్బలదుర్జయులైనవారి వి
ద్వేషముఁ జక్కఁబెట్టి జగతీవర! యంతకు పోయివచ్చెదన్." 5.3.400

ఇందు,శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రుననుమతిని వేఁడుట ప్రధానముగా దుర్యోధనాది దుర్జనవధమునకే యనునది స్ఫురించినను - ప్రాభవముతో, నిర్దోషతన్, ఓపుగతిన్, దోర్బలదుర్జయులైనవారిద్వేషముఁ జక్కఁబెట్టి - యనుమాటలవలన సామాద్యు పాయములతో నింకను ప్రయత్నింతు ననునర్థము స్ఫురించుటకు వీలు లేకపోలేదు. ఇట్లు కృష్ణుడు చేయుననుమతిప్రార్థనములో దుర్యోధనాదుల వధించుటకా, సంధి కూర్చుటకా? యను రెండంశములకు నవకాశమున్నది. ఇంతేకాక, తదనంతర కథితవిశ్వరూప సందర్శనాదికమువలన మహత్త్వప్రతిపాదనరూపమున భయపెట్టి వశీకరించుకొను తాత్పర్యము కూడ కృష్ణునకు లేకపోలేదని భావించుటకు నవకాశము

కలదు - కావున వధించుటకే యనుమతి నిమ్మని యడిగెనని నిర్ణయించుటకు వీలులేదు. ఇట్లీ పద్యమున సందేహసంకరము గోచరించును.

రెండు ధ్వనిభేదము లొకేవ్యంజకపదమువలన స్ఫురించినచో నట్టిదాని నేకవ్యంజకానుప్రవేశసంకర మనివ్యవహరింతురు. ఈ క్రింది లక్ష్యమున నట్టిదాని నరయఁ దగును :

"ఇమ్మది వెఱ్ఱి వీనిఁ బరమేశ్వరుఁగాఁ గొనియాడె; ధర్మత
త్త్వమ్ములు పాండవేయులును దానును గాని యెఱుంగరట్టె; సా
మమ్మున నెల్లవారి నవమాన్యులఁజేసె నమాన్యుఁ; డంచు రూ
క్షమ్మున భీష్ముఁ జూచి ఖలగర్వితుఁ డిట్లని పల్కె నల్కతోన్." 2.2.39.

రాజసూయ యాగమున కృష్ణునిఁ బూజింపుమని యాతనిఘనతను వక్కాణించిన భీష్మునిపై కోపించి శిశుపాలుఁడు ధర్మరాజుతో నాతనియవివేకము నుగ్గడించు సందర్భమునందలి యీ పద్యమున 'వీనిన్' అనుపద మర్థాంతర సంక్రమిత వాచ్యరూపమున గుణహీనుని, పూజార్హతలేనివానిని, నీచుని నిత్యాది రూపముగా కృష్ణునియందన్వయించుచు నాతనిపై శిశుపాలునకుఁ గల క్రోధాసహ్యాభావముల నసంలక్ష్య క్రమమున వ్యక్తపఱచుచున్నది. ఇట్లర్థాంతరసంక్రమితవాచ్యధ్వనికిని, అసంలక్ష్య క్రమ భావధ్వనికిని 'వీనిన్' అనుపదమొక్కటియే వ్యంజకమగుటచే నిట్టి దానిని ఏకవాచకా (వ్యంజకా) ను ప్రవేశ సంకరమందురు.

ఇట్లు ధ్వనికి స్వప్రభేదములతోడి త్రివిధమగు సంకరము నుదాహరణ ముఖమున నరసితిమి. ఎందేని రెండు గాని అంత కెక్కుడు గాని ధ్వనిభేదము లొకదానితో నొకటి సంబంధము లేక సమావిష్టము లైనచో నట్టిదానిని సంసృష్టి యందురు. దాని కొక యుదాహరణము :

"ఘనజవసత్త్వచారుతురగంబులఁ బూనినయల్ల విస్ఫుర
త్కనకరథంబుపై నతులకాయుఁడు సాలమహీరుహంబు చా
డ్పునఁ దనరారుచున్ వెలయుభ్రూకుటియున్ దశనోష్ఠపీడనం
బును నయి యున్నవాఁ డనిలపుత్రుఁడు భీముఁడు - భీముఁడాజులన్."

3.6.209

తన్ను బలాత్కారముగా నెత్తుకొనిపోవు సైంధవునితో, వెన్నంటి వచ్చు పాండవులతో భీమునిఁగూర్చి ద్రౌపది యుగ్గడించు సందర్భము నందలి దీపద్యము. ఇందు 'సాలమహీరుహంబు చాడ్పునన్' అనునుపమాలంకారమువలన భీమసేనుని

యౌన్నత్యము, అప్రకంప్యతయు, దార్ఢ్యకాఠిన్యములు నభివ్యక్త మగుచున్నవి. కావున నర్థశక్త్యుద్భవ అలంకార కృతవస్తుధ్వని యిట సంభావ్యము. 'భీముఁడు భీముఁ డాజులన్' అనుచోట రుద్రునివలె నమిత భయంకర ప్రళయమూర్తి యనునర్థము సిద్ధించును. 'వ్యోమకేశో భవోభీమః స్థాణూ రుద్ర ఉమాపతిః' అను నమరకోశమును బట్టి భీమ శబ్దమునకు శివుఁడనియు నర్థము గలదు. దానివలన 'రుద్రునివలె భయంకరుఁడై శత్రుసంహారము గావించును. ఎవ్వరికిని తప్పించుకొన శక్యముగా' దను నర్థము ప్రతీయమానమగును. ఈ ప్రతీతికి భీమ శబ్దమునకుఁ గల యర్థద్వయము హేతువగుటచే నిది శబ్దశక్త్యుద్భవాలంకార ధ్వని యగును. ఇట్లిందుఁ గల రెండు ధ్వనులకును పరస్పర సంబంధము నియతముగా లేకపోవుటచే నిది స్వప్రభేద సంసృష్టి కుదాహరణము.

ఇంతదనుక ధ్వని ప్రభేదముల సంకరసంసృష్టులు వక్కాణింపఁబడినవి. ధ్వని భేదము గుణీభూత వ్యంగ్యభేదముతో సంకీర్ణమగుట నొక యుదాహరణమునఁ జూడనగును.

రాయబారమునకై పాండవుల కడనుండి హస్తిపురమునకు వచ్చు శ్రీకృష్ణునిఁ గాంచి అంగనాజన మాతని ననేక విధములుగా నుల్లేఖించిన ఘట్టము :

"ప్రాణంబుతోఁ గూడ రక్కసిచన్నుల పాలుద్రావిన ప్రౌఢబాలుఁ డితఁడె;
వ్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మెచ్చించిన యాజగజెట్టి యితఁడె;
దుర్వృత్తుఁడగుకంసుఁ దునిమి యాతనితండ్రిఁ బట్టంబుఁగట్టిన ప్రభు వితండె;
సత్యభామకుఁ బారిజాతంబుపైఁ గల కోర్కి దీర్చినరసికుం డితండె;
వెన్నలును గోపికాచిత్తవృత్తములును నరసి ముచ్చిల నేర్చిన హరి యితండె;
శ్రుతిశిరోభాగములఁ దనసుభగచరణ సరసిజామోదమును గూర్చు చతురుఁ డితడె."

5.3.175

ఇందుఁజెప్పఁబడిన పూతనాప్రాణహరణము, చాణూరమర్దనము, కంసవధ అను నంశములవలన శ్రీకృష్ణుని దుష్టశిక్షణ సామర్థ్యమును, ఉగ్రసేనునికి పట్టము గట్టుట యను నంశముచే శిష్టరక్షణ తాత్పర్యమును, సత్యభామ కోర్కిదీర్చిన రసికుఁ డనుటచే భక్తాభీష్ట ప్రదాతృత్వమును, వెన్నలును, గోపికాచిత్త వృత్తములును, నరసి ముచ్చిలనేర్చిన హరి యనుటచే సర్వజ్ఞత్వసర్వస్వామిత్వములును, శ్రుతి శిరోభాగములయందు చరణపద్మామోదమును గూర్చు చతురుఁ డనుటచే వేదాంతవేద్యతయు నభివ్యక్తములై శ్రీకృష్ణుని పరమేశ్వరత్వము ప్రతిపాదితమగుచున్నది. కావున నిం దర్థశక్తికృత వస్తుధ్వని గలదు. వాచ్యార్థము కూడ రమణీయముగా నుండుటచే, వ్యంగ్యరూపార్థము వాచ్యార్థమునే యలంకరించు ననుట కవకాశముండుటచే గుణీభూత వ్యంగ్యము కూడ సంభావ్యమే.

ధ్వనియే యని గాని, గుణీభూత వ్యంగ్యమే యనుటకుఁ గాని వినిగమకము లేదు గావున నీరెంటికిని సందేహ సంకరము భావింపవలసి యున్నది.

ధ్వని గుణీభూత వ్యంగ్యముల సంసృష్టి కీ క్రింది పద్య ముదాహరణమగును:

"శ్రవణపుటంబులు వ్రయ్యంగఁ దాఁకి సం
క్షోభంబు గావించె గుణమ్ము మ్రోఁత
బ్రహ్మాండభాండంబు పగిలించి భూతని
శ్చైతన్య మొనరించె శంఖరవము
గగనభాగం బెల్లఁ గప్పి క్రాలుచు బెగ
డడరించె న్యగ్రంపుఁబడగపఱపు
మిఱుమిట్లుగొనిచూడ్కి పఱివోవ వెలిఁగి ప
రిభ్రాంతిచేసెఁ గిరీటకాంతి

తెల్లమిది గాండివంబును దేవదత్త మును గపిధ్వజమును వాసవునివరమునఁ
గన్నమకుటంబు నగు వేఱ కొన్నియైన నుజ్జ్వలాద్భుతభంగులై యున్నె యిట్లు."

4.4.180

ఉత్తరుని సారథ్యమున కాయత్తపఱచుకొని తమ సేనమీఁదకు వచ్చుచున్న అర్జుననిఁ గాంచి ఆచార్యుఁడు దుర్యోధనునితో నన్నమాట యిది. ఇందు శ్రవణ పుటంబులు వ్రయ్యంగ, బ్రహ్మాండభాండంబు పగిలించి అనువానియందు లక్షణా మూలధ్వని చెప్పఁదగియున్నది. గుణము మ్రోఁతయును, శంఖరవమును మహా భయంకరములై యున్నవనుట నీలాక్షణికార్థము సమకూర్చును. ఇంక గీతపద్యమున గాండివ దేవదత్తాదివస్తు సంచయము లోకోత్తరమైనది కనుక వాని ధ్వన్యాదుల యద్భుత భంగులు ప్రతీయమానములే యగుచుండఁగా "వేఱకొన్నియైన నుజ్జ్వలాద్భుత భంగులై యున్నె యిట్లు" అను వాక్యమున నవి వాచ్యము చేయఁబడినవి. పైని పేర్కొనిన లక్షణామూలధ్వనికిని, ఈ గుణీభూత వ్యంగ్యమునకు అన్యోన్యాధారాధేయ భావము లేదు కావున నిది ధ్వని గుణీభూత వ్యంగ్యముల సంసృష్టి యగుచున్నది.

శ్రవణపుటములు వ్రయ్యుట, బ్రహ్మాండభాండము పగులుట అనునది వాచ్యమగు నతిశయోక్త్యలంకారముగా భావించుటకు నవకాశము కలదు. అట్టిచో నలంకారమే యనుటకుఁ గాని ధ్వనియే యనుటకుఁ గాని నిర్ణాయకము లేదు కావున వాచ్యాలంకార ధ్వని ప్రభేదముల సందేహసంకరము కూడ నిట సంభావ్యమే. అలంకారమే

యను పక్షమున దానికిని మున్ను వక్కాణించిన గుణీభూత వ్యంగ్యమునకును సంసృష్టి.

ఇట్లు ధ్వని గుణీభూత వ్యంగ్య వాచ్యాలంకార సంకీర్ణతా సంసృష్టతలు స్థాలీపులాక న్యాయమున నుదాహరింపఁబడినవి.

ధ్వని ప్రస్థానయు, ధ్వనికి తదితరగుణాలంకారాదులతోఁ గల సంబంధమును, ధ్వనిప్రభేద నిరూపణమును, వ్యంజక ముఖమున ధ్వని స్వరూప నిర్ణయమును, గుణీభూత వ్యంగ్యమును, సంకర సంసృష్టులును - ఇట్లు ధ్వని లక్షణ కథనము యథామతి చేయబడినది. 'లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ' మని కొనియాడిన మహా భారత మీసిద్ధాంతవ్యాసమున లక్ష్యముగా గ్రహింపఁబడినది. తద్గ్రహణము నందలి యౌచిత్య పరీక్షకై యాంధ్రమహాభారతపు కావ్యత్వ గౌరవాదుల నిరూపింప వలసి యున్నది.



ఓమ్

# భారత ధ్వని దర్శనము

## పంచమాధ్యాయము

## శ్రీమహాభారతము

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసమచ్చ యం బని మహిఁ గొనియాడుచుండ

వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండఁ జేసె భారతంబు." 1.1.32

"వేదములకు నఖిలస్మృతి వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైనచోటులను దా మూదల ధర్మార్థ కామ మోక్ష స్థితికిన్." 4.1.4

నన్నయతిక్కనల యీ రెండు పద్యములును శ్రీమహా భారత ప్రాభవ పరమార్థములను మనోజ్ఞముగా వక్కాణించుచున్నవి. మహాభారతము భారత దేశమునఁ బరమ పవిత్ర గ్రంథము. లేఖ్య మగునామ్నాయము కావున సర్వ జనులకు సుపాస్యము. శ్రద్ధా సక్తులున్నచో నెవ్వఁడైన దీని కధికారి కాఁగలుగును. ఈ గౌరవము దీనికి దేనివలనఁ గలిగినది? భగవద్గీతాద్యాధ్యాత్మిక సంపద నిండిన కారణముననా? పాండవోత్తముల పరమోదాత్త చరిత్ర నిబంధింపఁబడుటవలననా? శ్రీవాసుదేవుని మహిమాను కీర్తన మిం దంతర్వాహినిగా బుద్ధి గోచర మగుట వలననా? కృష్ణద్వైపాయనుని కథా నిర్మాణ చాతుర్య మద్భుతావహమై యానందదాయక మగుటవలననా? - ఇట్టి ప్రశ్నలు భావించినకొలఁ దియు బహుసంఖ్యాకములై యుప్పతిల్లును. నిజమునకుఁ బైఁ బేర్కొన్న యే యొక్క కారణమైనను భావించిన గౌరవ సంభావనకుఁ జాలును. ఇఁక వాని సమవాయ మున్నచోఁ జెప్పనేల? అన్నింటికి మించి యిది పంచమవేదము. వేద వేదాంతసార మిందు రాశీభూత మైనది.

"ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ!
య దిహాస్తి త దన్యత్ర య న్నేహాస్తి న త త్క్వచిత్." 18.5.38

అని వేదవ్యాసుఁడే యుద్ఘాటించె నన్నచో దీని గౌరవమును వేఱ వక్కాణింపఁ బనిలేదు.

ఇందలి వస్తు వొకనాటిది కాదు. ఒక వ్యక్తిది కాదు. పరిపూర్ణమైన యొక జీవితమునకు సంబంధించిన దనుటయుఁ జాలదు. ఒక యుగ ప్రమాణకాలమునఁ బఱచుకొనిన వృత్తాంత మిందు నిబంధింపఁబడినది. అంతేకాదు ప్రాస్తావికముగా తక్కిన యుగములయు - మన్వంతరములయుఁ - బ్రసంగ మిం దందందుఁ దోఁచుటచే నిది యనంతమైన కాలమునకు సంబంధించిన కథ.

అట్లే యిది యేదేశమునకు సంబంధించిన కథ యన్నచో నిందు మర్త్యమునఁ గల దేశములన్నియు నించుమించుగా స్పృశింపఁబడినవి. అంతేకాదు. ఇటు పాతాళ మటు స్వర్గముగా సర్వదిక్కులును నిందు చోటుచేసికొన్నవి. కావున నిది సార్వదేశికము.

ఇంక నిందలి వ్యక్తులన్ననో - యవి మానవజాతికిఁ బరిమితము కాలేదు. స్వర్గ మర్త్య పాతాళము లందలి వ్యక్తుల కిందుఁ బ్రవేశము కలదు. దిక్పాలకుల యంశము లిందు మూర్తిఁదాల్చినవి. మానవకోటియే కాదు. శునకాది తిర్యక్కోటియు నిందుఁ బొడకట్టును. పిపీలికాది బ్రహ్మపర్యంతము దానయై నడుపు విరాట్పురుషుఁడు వాసుదేవుఁ డై కథలోఁ బ్రధాన పాత్రమును వహించుటచే మహాభారతమునకుఁ గావ్యవిరాట్స్వరూపము సిద్ధించినది.

ఇట్లు దేశకాల పాత్రములతో అప్రమేయపరిధిగల శ్రీమన్మహాభారతము విశ్వజనీనమై యలరుటలో నాశ్చర్యము లేదు.

ఇందలికథ రమణీయము. కథనము రమణీయతరము. ఆ రెంటివలనను బాఠకునకుఁ గలుగు నానంద విశేషము రమణీయతమము. ఈ రామణీయకము పవిత్ర తావాసితమై పురుషార్థ సిద్ధ్యుపాయభూతమై గ్రంథమును సర్వజనోపాస్య మొనర్చినది. ఆ యుపాయము లిందు లలితముగా కాంతాసమ్మితముగా హేతువాద పురస్సరముగా నిరూపింపఁ బడుటచే నీ యితిహాస మెట్టివానికి నపరిహరణీయమై యలరుచున్నది. ఇందుఁ జెప్పఁబడని ధర్మము లేదు. సర్వాంగసౌష్ఠవము గల రాజనీతి యిందు పుష్కలముగాఁ గలదు. తృతీయ పురుషార్థము పరమోదాత్తముగ నిందు నిబంధింపఁ బడినది. తురీయ పురుషార్థము సారతమార్థముగ నెలకొల్ప బడినది. కావుననే యభిమానముతో నేవిషయమును జూడఁదలఁచిన నా విషయమే యిందుఁ బ్రధానాంశమై గోచరించుచు 'ధర్మతత్త్వజ్ఞు' లిత్యాదిపద్యమును స్వభావోక్తి చేయుచున్నది.

కార్యాకార్యవ్యవస్థితి యందు శాస్త్రమే ప్రమాణమని గీతానుశాసనము. శాస్త్రముల నాకళించు కొనుటయుఁ దదుక్తవిధానమునఁ బ్రవర్తించుటయు మానవునకుఁ

బరమకర్తవ్యములు. కాని యధీతిబోధాచరణ ప్రచారణము లనునవి యంత సులభములు కావు. ధర్మ మెఱిగినవాఁడెల్ల దానియందుఁ బ్రవృత్తిని, తదితరము నందు నివృత్తిని సాధింపలేఁడు. అట్టి సాధనకు వాని హృదయము సంస్కారవంతము కావలయును. ఉత్తమ కావ్యమునందలి నాయకాదులు పర్యవసానమునఁ బొందు నుత్తమగతులను, బ్రతినాయకపక్షము పొందు నధోగతులను మఱల మఱల భావించుటవలనఁ గలుగు సంస్కార విశేషము 'నీరసము' లైన ధర్మ శాస్త్రాదుల వలనఁ గలుగనేరదు. మ్రొక్కుబడి చెల్లించినట్లు నేర్చు విద్యకంటె నేర్చుకొనుచున్నా మను తలఁపు కూడ రానీక కావ్యపఠనాదికమువలనఁ దనంతఁదా వచ్చు విద్య మానవుని హృదయమునఁ జెఱుఁగక, తఱుఁగక పీటవెట్టికొని శాశ్వతముగాఁ గూర్చుండును. సర్వార్థములను దనలోఁ గూర్చుకొనిన విశ్వ విజ్ఞానమయ కోశము శ్రీ మన్మహాభారత మట్టిస్థితికిఁ బరమాధారము. సూక్ష్మాతి సూక్ష్మ ధర్మ సందేహముల కిందుఁ బరిష్కారములు సూచింపఁబడినవి. తక్కిన పురుషార్థముల విషయమునందును నది యట్టిదియే. మఱియు నిది యనుశీలించినచో వేదముల, నఖిల స్మృతి వాదములను, బహుపురాణ వర్గంబును జదువఁ బనిలేదు. ఆ యన్నింటిలోఁ జెప్పఁ బడిన యంశము లిందుఁ గ్రోడీకరింపఁ బడినవి. స్థూలముగాఁ జూచినచో నొక పురాణమునకును మఱియొక దానికిని బొత్తు కుదరదు. ఒక స్మృతికిని మఱియొక స్మృతికిని సంతనపడదు. ఒక వేద మింకొక వేదమును సమర్థింపక పోవచ్చును. అట్టి పరిస్థితులలో నేది గ్రాహ్య మేది త్యాజ్య మను నిర్ణయము లేక మానవునికి చికాకు కలుగుచుండును. దానితో వానియందు వైముఖ్యము కూడఁ బుట్టవచ్చును. అట్టి గజిబిజి లేక యన్నింటిని సమన్వయపఱచి యిట్టిట్టు ప్రవర్తింపు మిట్లు వలదని నిష్కర్ష చేసి చప్పఁగల యద్భుత బోధ దీనియందుఁ గానవచ్చును. కావుననే ధర్మార్థకామ మోక్షస్థితి **కిది మూదల.** ఇట్లిది యప్రమేయ ప్రభావగుణ గరిష్ఠమై వాఙ్మయశిరోమాణిక్యమై యలరారుచున్నది.

రసదృష్టితోఁ జూచినచో నిందు లేని రసము లేదు. ప్రతిపర్వమునందు నేదో యొక రసమో రససమాహారమో యనుభూయమాన మగుచునే యుండును. ఇట్లిది మానవునకుఁ గావలసిన సన్మార్గోపదేశమునే కాక యాతఁడు సర్వకాలముల నపేక్షించు నానంద విశేషమును గూడ సమకూర్చుచుఁ గావ్య పరమ ప్రయోజనములను సంపూర్ణముగా సాధించుచున్నది.

ఇట్టి మహోత్కృష్ట గ్రంథమునకుఁ గర్త శ్రీకృష్ణద్వైపాయనుఁడు. అతఁడు 'భారతభారతీశుభగభస్తిచయముతో ఘోరసంసారవికారసంతమసజాల విజృంభము వాపి

సూరివేతోరుచిరాబ్జ బోధనరతుఁ డైన యంభోరుహమిత్రుఁడు'. 'ముని పూజితుఁడు', 'విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుఁడు'. లోకహిత నిష్ఠతో భారతాఖ్య మగు లేఖ్యమైన యామ్నాయమును గావించిన చరితార్థ జీవనుఁడు. తన తపోమహత్త్వముచే అష్టాదశ పురాణములును, నీతి ధర్మశాస్త్రార్థతత్వంబులును, జతుర్వేద వేదాంతాభిప్రాయంబులును, జతుర్వర్గ వర్గాను బంధబంధుర కథేతిహాసంబులును, జతుర్యుగ మహర్షి రాజవంశ చరితంబులును, జతుర్వర్ణాశ్రమ ధర్మ క్రమంబులును, జతుర్ముఖ ప్రముఖ నిఖిలసుర మునిగణ పూజితుం డైన శ్రీకృష్ణుని మాహాత్మ్యంబును బాండవాది భారత వీరుల మహాగుణంబులును దన విమల జ్ఞానమయవాగ్దర్పణంబున వెలిగించు కొనిన మహామనీషి. ఇంతటి వెలుఁగును గేవలలోకహితనిష్ఠతో భారతామ్నాయ నిర్మాణమునకు నిర్వ్యాజముగ నుపయోగించిన యుదార చరితుఁడు. 'వ్యాసో నారాయణో హరిః' అను కీర్తికి పట్టయినవాఁడు. "యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా; తత్తదే వావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్" అనియే కాక సాక్షాత్తుగా "మునీనామ ప్యహం వ్యాసః" అనియు వక్కాణించిన గీతావాక్యము ననుసరించి యీ భవ్యమూర్తి విష్ణ్వంశసంభూతుఁ డనుట నిశ్చప్రచము.

ఈ మహానుభావునకు భారత కథా వృత్తము సమకాలికము. అంతేకాదు ఆ కథతో గాఢమైన సంబంధము కలదు. నియతి బలవత్తరత యెఱిఁగియు వంశనాశము కాకుండఁ కాపాడుటకై శక్తి యుక్తులను వినియోగించిన కర్మయోగి. తాను జేసిన యత్నములు ఫలవంతములు కానిచోఁ గ్రుంగుటయు, నైనచోఁ బొంగుటయు లేని స్థిత ప్రజ్ఞుడు. కామక్రోధాద్యరిషడ్వర్గమును సమూలముగా ఛేదించిన జ్ఞానయోగి. గీతార్థ సంగ్రహణము చేసిన తత్త్వజ్ఞుఁడు. ఆధిభౌతికా ధ్యాత్మికాధిదైవిక రహస్యముల నన్నింటిని క్షుణ్ణముగా నెఱిఁగి బోధింపఁగల ఉత్తమ దేశికుడు. సర్వ మానవ హిత సంధానమే పరమ లక్ష్యముగాఁ బెట్టుకొన్న కారుణ్యాంచిత మూర్తి. శ్రీ కృష్ణ నిర్యాణ వార్త విని కలఁత చెందిన యర్జునుని ప్రసన్న మధుర వాక్యములతోఁ దేర్చి కర్తవ్యము నుపదేశించిన ధీరస్వాంతుఁడు. ఆటుపోటులు లేని నిశ్చల చిత్తవృత్తిత్వ మాతని సొమ్ము. 'సద్యోగర్భంబున నహిమద్యుతి తేజముతో వేదమయుఁడును నఖిలమునీంద్రాద్యుఁడు నై యుద్యద్జ్ఞానముతో నుదయించిన' పుణ్యమూర్తి.

ఇట్టి విశిష్ట వ్యక్తి శ్రీవేదవ్యాస భగవానుఁడు సమాహిత చిత్తముతో రచించిన శ్రీ మన్మహాభారతము జనుల కారాధ్య మగుటలో నాశ్చర్యము లేదు. ఈ గ్రంథము పురాణేతిహాస కావ్యాది విభాగములలో నేదృష్టితోఁ జూచిన నదియే యగును. సర్గము,

ప్రతిసర్గము, వంశము, వంశానుచరితము, మన్వంతరములు నను పురాణ లక్షణ పంచక మిందుఁ, గ్రమముగా గాకపోయినను, గోచరించును. ముఖ్యముగాఁ జంద్రవంశము, తద్వంశానుచరితము నిందు సమగ్రముగా వర్ణింపఁబడినవి. ఆ దృష్టితో నిది పురాణ జాతికిఁ జెందవచ్చును.

"ఇతి హ అస్మి న్నస్తీ తీతిహాసః" అని యితిహాస శబ్దవ్యుత్పత్తి. అనఁగా పూర్వరాజాదుల చరిత్రమును దెలుపు గ్రంథ మితిహాసమని తాత్పర్యము. ద్వాపరాంత మున కలియుగారంభమునకుఁ గొంచెము ముందుగా జరిగిన యాదవ పాండవ ధార్త రాష్ట్రుల చరిత్ర మిందు సవిస్తరముగా వర్ణింపఁ బడినది. ఇది యితిహాసమనుటను గొందరు శంకింతురు. ఈ క్రింది యుపపత్తులను బట్టి భారత ప్రధాన కథ జరిగియేయుండు ననుట సంభావ్య మగును.

(1) కథలో నేయే యంశము లే యే కాలములో జరిగినవో విస్పష్టముగాఁ జెప్పబడినది. ధర్మరా జెన్ని సంవత్సరము లెచ్చట గడపెనో లెక్క చూపఁ బడినది. కేవలకల్పనాకథ యైనచో నిట్టి సూక్ష్మాంశములతోఁ బనిలేదు.

(2) మహాభారతయుద్ధము జరిగి సుమారు 6000 స॥ లయ్యెనని గ్రంథస్థ ప్రమాణములనుబట్టియు, జ్యోతిషగ్రహసంచారాదుల బట్టియు విజ్ఞలోకము నిర్ణయించు చున్నది.

(3) ఇప్పటి కాలమానపరిస్థితులనుబట్టి యసంభావ్యము లని యూహింపఁ దగిన స్వర్గాద్యన్యలోకగమనము, అస్త్రప్రయోగములు, శ్రీకృష్ణుని యతిలోక మహిమ మున్నగు కొన్ని యంశములను వదలినచో తక్కినదంతయు వాస్తవగాథ యనుకొనుట కెవ్వరికి నభ్యంతర ముండదు.

(4) గ్రంథకర్తయు కథాసంబంధవ్యక్తులలో నొక్కఁ డుగాఁ గానవచ్చుటయు దీని వాస్తవత్వము నుపపన్న మొనర్చును.

(5) కేవలకల్పితకథ యైనచో నీరసములైన వంశవృక్షముల వర్ణనమున కంతగాఁ బ్రాధాన్య ముండనక్కరలేదు.

(6) కల్పితకథయే యైనచో సాధారణముగ నాయకపక్షమును సర్వోత్కృష్టముగఁ బ్రతినాయక పక్షమును సర్వదుష్టతానిధానముగ నిరూపించుట గోచరించును. కాని యిందు నాయకుఁ డగు ధర్మరాజు నందును గొన్నిస్ఖాలిత్యములు ప్రసక్తములైనవి.

(అ) భీష్మద్రోణాదులను వంచనతోఁ జంపుట (ఆ) శల్యుని కర్ణవంచనమునకై ప్రార్థించుట (ఇ) కర్ణునిచే నవమానితుఁడై సహనముఁ గోల్పోయి యర్జునుని, గాండీవమును

దూలనాడుట మొదలగునవి. అట్లే దుర్యోధనుని యుత్తమగుణ ప్రశంసయు నిందు సమయోచితముగఁ జేయఁ బడినది. (అ) కర్ణుని కంగరాజ్య మిచ్చుట (ఆ) యుద్ధమునఁ జచ్చుదనుక పశ్చాత్తాపముగాని వెఱపుగాని లేక పోరుట (ఇ) స్వర్గమును బొందుట మొదలగునవి. ఇట్టివి యిది కేవలము కాల్పనిక కథకాదను నంశమునకు సమర్థకములు.

(7) అప్పటిస్థలములు, పట్టణములు మున్నగునవి కొన్ని యా నామములతోనే నేటికిని వ్యవహరింపఁ బడుచున్నవి.

ఇట్టి హేతుపరంపరచే మహాభారతకథ జరిగియే యుండు ననుట సంభావ్యమగుచున్నది. ఇట్లిది యితిహాస మనుకొనుట కెంతయు నవకాశము గలదు.

భారత మితిహాసమే కాదు. అది యొక శాస్త్ర గ్రంథముగాఁ గూడఁ బరిగణింప వీలున్నది. ఇందు వ్యంగ్యరూపమునఁ దోఁచు నీతు లనేకము లట్లుండ సూటిగాఁ బెక్కు విషయములును శాసింపఁబడినవి. అవి యన్నియు మానవుని సద్గతికి నూఁతలు. కావున దీనిని ధర్మశాస్త్రగ్రంథ మనుటయు సముచితమే.

ఇమ్మహాగ్రంథము 'యుధిష్ఠిరాదివ ద్వర్తితవ్యమ్, న తు దుర్యోధనాదివత్' అనురూపమున వ్యంగ్యముగా నుపదేశము గావించున దగుట చేతను, సహృదయమున కిందు రసానందము సమృద్ధిగా లభించుటచేతను, రమణీయార్థప్రతిపాదక మగుట చేతను మహాకావ్యముగాఁ గూడ రూపొందుచున్నది.

ఇట్లు శ్రీమన్మహాభారతము 'పురాఽపి నవమ్' అను వ్యుత్పత్తి ననుసరించి ప్రాఁత దయ్యు నిత్యనూతనమై పురాణవిభాగమునకును, ప్రాచీన మహారాజుల వంశచరితమును వక్కాణించుచు నితిహాసశాఖకును, పురుషుఁడు పురుషోత్తముఁడగుటకు వలయు నీతి ధర్మముల ననుశాసించుచు శాస్త్రజాతికిని, కాంతాసమ్మితమై సదుపదేశ రసానందములఁ బరితృజనమున కొనగుచు మహాకావ్యకోటికిని జెందుచున్నది. ధర్మతత్త్వజ్ఞులిత్యాదిపద్యము దీనివలన వక్రోక్తి కాక సత్యోక్తియే యగుచున్నది.

## ఆంధ్ర మహాభారతావిర్భావము :-

శ్రీకృష్ణద్వైపాయనోద్యానజాత మహాభారత పారిజాతము జనులందఱకు నిష్టార్థదమై యొప్పుచున్నది. సంస్కృతభాష ప్రాచీన కాలమునుండియు జనాదరణ పాత్రమే యయ్యు సర్వజనసులభము కాలేదు. అది యమరవాణిగా నేకొందఱకో మాత్రమే యందుబాటులో నుండినది. విద్వాంసులు దానియందు నిష్ణాతు లైనంత మాత్రమున దన్నిక్షిప్తజ్ఞానభండారము సర్వజనవేద్యము కానోపదు. అందును రమణీయ వైఖరీవిలసితమగు కావ్య మేకొందరకో యగుట విచారణీయముకదా? ముఖ్యముగా

భారతమువంటి సర్వజనీనమైన కావ్యము భాష కారణముగాఁ గొందఱకుఁ జేజాఱిపోవుట వాంఛనీయము కాదు. భారతబద్ధస్పృహులగువారి కది యందని పండగుట మఱియును విచారకరమైన విషయము.

రాజమహేంద్రవరము రాజధానిగా వేంగీదేశమును బరిపాలించిన చాళుక్య భూపతియగు రాజరాజనరేంద్రున కీవిషయము మఱియు బాధాకరమైనది. తెలుఁగు నాటఁ దెలుఁగు వానినోట భారతపరమార్థము నిలఁద్రొక్కుకొని స్థావర మేర్పఱచుకొని నిత్యమై విలసిల్లవలయునను సంకల్ప మాతనికి కలిగినది. అప్పటికే యిరుగుపొరుగుభాషలలో భారతము రచింపఁబడినది. తనతెలుఁగునకు మాత్రమేల ఆపున్నెము పండరాదని యాలోచించి యామహారాజు శ్రీమద్భారతమును దెలుఁగున రచియింపఁజేయ సంకల్పించెను. ఆకాలమునాటి మతపరిస్థితులు కూడ నాతని యీ సంకల్పమునకుఁ బ్రేరకములని విమర్శకుల తలంపు. దీనికంటెను దద్గత రుచియే రాజరాజనరేంద్రునకు మెం డనుట స్పష్టమే. ఆమహారాజునకు "*భూదేవకులాభితర్పణమహీయః ప్రీతియు, భారతశ్రవణాసక్తియు, పార్వతీపతిపదాబ్జధ్యాన పూజామహోత్సవమును, సంతతదాన శీలతయు, శశ్వత్సాధుసాంగత్యమును సంతతము నెడఁబాయక కరమిష్టములై యుండు*" పంచమహాపుణ్యములు. అందును నాతనిచిత్త మనిశము భారతకథా శ్రవణప్రవణమే. అట్లగుటకు మఱియొక హేతువును గలదు. అది తదీయవంశమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవోత్తముల యమలచరిత్ర మగుటయు సంభవించినది. అంతేకాదు. బహుభాషల, బహువిధముల, బహుజనములవలన భారతబద్ధస్పృహుఁడై యాతడు విని యుండనోపును. కాని తృప్తినొందఁజాలడయ్యెను. '*మహాభారతబద్ధ నిరూపితార్థము తెలుఁగున*' రచింపఁబడఁగా విన నిచ్చగించెను. దీనికి సమర్థులెవ్వరా? యని యొక్క మాఱు తనయాస్థానమునంతటిని గలయఁజూచెను. అది యపారశబ్దశాస్త్ర పారగులైన వైయాకరణులతో, భారతరామాయణాద్యనేక పురాణప్రవీణులైన పౌరాణికులతో, మృదుమధురరసభావభాసురనవార్థవచనరచనావిశారదులైన మహాకవులతో, వివిధ తర్కవిగాహితసమస్తశాస్త్ర సాగరసారగరీయః ప్రతిభులయిన తార్కికులతో వైణిక గాయకులతోఁ గలకలలాడుచు మూర్తీభవించిన వాగ్దేవతయో యన్నట్లు విరాజిల్లెను. అందుఁ దనకంటికి ప్రభాకరునివలె గోచరించిన నన్నయభట్టారకునిపై నీభారము నాతఁడు నిలిపెను. ఆసుమూహూర్తమున నాంధ్రమహాభారతరచనమునకు శ్రీకారము చుట్టఁబడెను.

## నన్నయ భట్టారకుఁడు :-

నన్నయభట్టారకుఁడు రాజారాజనరేంద్రునకు కులబ్రాహ్మణుడే కాదు. అనురక్తుఁడును, అవిరళజనహోమతత్పరుఁడునై బాహ్యాభ్యంతరశుచిత్వమును సాధించిన పవిత్రశీలుఁడు. విపులశబ్దశాసనుఁడై మహాకావ్యరచనకుఁ గావలసిన భాషాపాటవమును సంతరించుకొనెను. సంహితాభ్యాసుఁడై వాక్పావిత్ర్యము నందెను. బ్రహ్మాండాదినానా పురాణవిజ్ఞాననిరతుఁడై వ్యుత్పత్తిని నింపుకొనెను. సద్వినుతావదాతచరితుఁడై త్రికరణశుద్ధి నంది దేశికార్హతను బొందెను. అతని లోకజ్ఞత మహాకావ్యసృష్టి కెంతయుఁ దోడ్పడును. అంతకుమున్న ఉభయభాషాకావ్యరచనాభిశోభితుఁడై కావ్యకరణాభ్యాసమున సమగ్రతను సాధించెను. నిత్య సత్య వచనతయు, మత్యమరాధిపాచార్యతయు నాతని కావ్య నిర్మాణదక్షతకు మెఱుఁగులు పెట్టు గుణములు. ఇట్టివాడు తెలుగున మొదటి మహాకావ్యరచనకుఁ గడంగుట ముదావహము. ఈమహాకవికి, భారత ఘోరరణమున నరునకు నారాయణునట్లు, అష్టభాషావిశారదుఁడును నిష్టుఁడును సహాధ్యాయుడు నైన నారాయణభట్టు అభిమతంబుగఁ దోడయి భారతరచనను నిర్వహించెను. ఈసమాగమమును ఆయుద్భోధయు హేతువులుగా నాంధ్రమున శబ్దమాధుర్యము సర్థగౌరవమును మేళగించిన కవితామృతప్రవాహము జాలువాఱినది. సారమైనమతితో కవిశ్రేష్ఠులు లోతుగా నారసి మేలనవలసిన ప్రసన్న కథాకలితార్థయుక్తియు, సుమధురనాద బ్రహ్మసాక్షాత్కరణ సమర్థక మగు నక్షరరమ్యతయు, మానవునకు సర్వకాలసర్వావస్థలలో మార్గదర్శకములైన రుచిరార్థసూక్తులును త్రివేణీసంగమమువలె నీమహితాత్ముని కవితాస్రవంతిలోఁ గలసిమెలసి సాక్షాత్కరించును.

భట్టారకునివాక్యములు వేదమంత్రములవలె మధురనాదగుణసంభరితము లగుటచేతను పవిత్రభావనాసముపేతము లగుటచేతను, గంభీరార్థమాణిక్య పేటిక లగుటచేతను నవి ఋషివాక్యము లనిపించును. సంస్కృతమునఁ గాళిదానువలెఁ దెలుఁగున నీతఁడు కవికులగురువు. ప్రాచీనాంధ్రమహాకవు లనేకులాతనిఁ బ్రస్తుతించుచు నాతని యడుగు జాడలలో నడచిరి. కవిబ్రహ్మయగు తిక్కనామాత్యుఁడీతని నాంధ్రకవిత్వ విశారదుఁడనియు, విద్యాదయితుఁ డనియు, మహితాత్ముడనియు కీర్తించెను. ఎఱ్ఱయ సకలలోకైక విదితుఁ డైన యాతని సరససారస్వతాంశప్రశస్తినిఁ దనలో జీర్ణించుకొని తానందు లీనుఁడై పోయెను. కావుననే కవీంద్ర కర్ణపుటపేయముగాఁ దా నారణ్యపర్వశేషమును బూరించితి నని ధీరవిచారుఁడై చెప్పుకొనెను. మఱియును:

"ఉన్నతగోత్రసంభవము నూర్జితసత్త్వము భద్రజాతిసం
పన్నము నుద్ధతాన్యపరిభావిమదోత్కటము న్నరేంద్రపూ
జోన్నయనోచితంబు నయి యొప్పెడు నన్నయభట్టకుంజరం
బెన్న నిరంకుశోక్తిగతి నెందును గ్రాలుటఁ బ్రస్తుతించెదన్."

(హరివం. పూ. భా. 1.8)

అని నివాళి పట్టెను.

కవి సార్వభౌముడు శ్రీనాథుడు నన్నయకవితలోని యుభయవాక్ప్రౌఢిని దనకవిత కొక రసాయనముగా స్వీకరించెను. ఇంకను బూర్వకవులు పలువు రాతని కవితాగుణములఁ గొనియాడిరి. వారివారి యాయా ప్రశంసోక్తు లన్నియు సూత్ర ప్రాయముగా నీతని కవితారామణీయకమును వక్కాణించును. ఆధునిక కాలమున కవి సమ్రాట్టులు శ్రీ విశ్వనాథసత్యనారాయణగారు, ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు మున్నగువారు ఆ సూత్రములకు విపులము లైన వ్యాఖ్యానములా యనదగు గ్రంథములను విరచించి తత్తత్త్వమును తెలుఁగువారికిఁ దెల్లము చేసిరి.

నన్నయ తనకవితాగుణములుగాఁ బేర్కొనిన ప్రసన్నకథాకలితార్థయుక్తి మున్నగు వానికి స్థాలీపులాకన్యాయముగా వివరణ మిటఁ జూడఁదగును :

శ్రీ విశ్వనాథవారు ప్రసన్నకథాకలితార్థయుక్తి యను సమాసమునకు ప్రసన్నమైన కథతోఁ గూడిన యర్థముల యోజన యను విగ్రహమును జెప్పి "అచ్చట నున్న యర్థములను చక్కగా పరిశీలించినచో కథ పాఠకునకు ప్రసన్న మగును." అని వివరించిరి. కథ ప్రసన్నమగుట యనఁగా నేమి? ఏల ప్రసన్నము కావలయును? ప్రయోజన మేమి? యను నంశము లిటఁ జర్చనీయము లగుచున్నవి. కథ ప్రసన్నమగుట యనఁగా రచనా సమకాలమునఁ గవి తన హృదయమున నేయే భావములను నిక్షేపించుకొనెనో యవి యన్నియు విస్పష్టముగా భావుకుఁడైన పాఠకునకుఁ దోచుట. అట్లు తోఁపనిచో బాహ్యములగు శబ్దార్థములు మాత్రమే కానవచ్చును గాని కావ్యాత్మ యేదో యాతనికి బుద్ధిగోచరము కానేరదు. కథ ప్రసన్నమైనచో కావ్యమువలనఁ బాఠకుఁ డపేక్షించు నానందోపదేశములు లభింపగలవు. ఇట్లు ప్రసన్నకథాకలితార్థయుక్తి యనునది ధ్వని మార్గముతో సంవదించుచున్న దనియే కవివిశ్వనాథులతీర్పును.

ఆచార్య దివాకర్లవారు ప్రసన్నకథాకవితార్థయుక్తి యను పాఠాంతరమును గూర్చి క్షుణ్ణముగాఁ జర్చించి దానికంటె 'కలిత' యను లకారఘటితపాఠమే సమంజసమై యొప్పునని తీర్మానించిరి. ప్రసన్నమైన కథలయందుఁ గూర్చబడిన యర్థముల యుక్తి

యను నర్థమును స్వీకరించి ప్రసన్న మనఁగా ప్రసాదగుణ భూయిష్ఠమని వారు వక్కాణించిరి.

"అప్యనుక్తో బుధై ర్యత్ర శబ్దార్థోవా ప్రతీయతే -
సుఖశబ్దార్థసంయోగా త్ప్రసాదః స తు కీర్త్యతే." (నా.శా. 16.99)

అనునాట్యశాస్త్ర శ్లోకము ప్రసాదమన నేమో వివరించుచున్నది. ఆచార్య వెంకటావధానిగారు లాక్షణికుల నిర్వచనములనుబట్టి ప్రసిద్ధార్థములు, ఝుటిత్యర్థన మర్పకములు, స్వప్రయోజనములు నైన పదములు గలిగియుండుటే ప్రసాద గుణమని వచించి నన్నయప్రసన్నకథాకలితార్థయుక్తి నిట్లు వివరించిరి: "ఆయా సందర్భములందు స్వప్రయోజనములైన విషయములను మాత్రమే చెప్పుచు నేకవారశ్రవణ మాత్రముననే లోని యర్థమును వ్యక్తముచేయుట యాతని ప్రసన్నతకు లక్షణ మని చెప్పవచ్చును. ఈయర్థమునే కథలవిషయమునఁ గూడ నన్వయించినచోఁ గథాప్రసన్నత, లేక ప్రసన్నకథాత్వము అనఁగా నేమో తెల్లమగును. ఏవైన కథలను రచించునప్పుడు ప్రధానకథతో వానికిఁ గల సంబంధమును, అందు వానికిఁ గల స్థానమును వివరించుచు, ప్రయోజనరహితము లైన సందర్భముల నుజ్జగించుచు, విన్నంతమాత్రమున నందలి తత్వమును స్ఫురింపఁజేయుట యా కథాప్రసన్నతకు లక్షణము."

(నన్నయ భారతము. పు. 706)

మొత్తముమీఁద నీవివరణ మంతయును వాచ్యార్థముకంటె భిన్నము, రమణీయము నగు నర్థాంతరస్ఫూర్తిని బ్రతిపాదించుచునే యున్నది. కావున నిది ధ్వని మార్గమునకు సన్నిహితమే, అథవా ధ్వనిమార్గమే యనుటలో విప్రతిపత్తి లేదు. ఈ యభిప్రాయమునకు ఆచార్య దివాకర్ల వారి సమ్మతియు భంగ్యంతరముగాఁ గలదు. "ప్రసాదము రసగుణ మగుటచేతను, అది సర్వరససాధారణ మగుటచేతను, బ్రసన్నమైన కథ లనునప్పుడు నానారసమయములైన కథలని స్ఫురించుచున్నది. ఈవిధముగాఁ 'బ్రసన్నకథాకలితార్థయుక్తి' యను సమాసమును నన్నయ రసదృష్టితోఁ బ్రయోగించె నని వ్యక్త మగుచున్నది."(న.భా.పు. 707) అను నీవాక్యములు నన్నయరచన ధ్వనిమార్గ సంపూర్ణమను నభిప్రాయమునకు సహకారము లగుచున్నవి. వాచ్యార్థము ప్రసన్నముగా నుండఁగా మనోహరములగు వ్యంగ్యార్థముల యోజన పాఠకుని హృదయమునకు గోచరించుటయే ప్రసన్నకథాకలితార్థయుక్తి యనుదాని తాత్పర్యము. దీని కొండు రెండుదాహరణము లిటఁ బ్రదర్శింపఁ బడుచున్నవి :

(1) ఒకాకొకపదమును సందర్భమునందలి యనేకవ్యక్తుల మనోభావములను

వ్యంజించునట్లుగా నిబంధించు విశేషార్థమును యోజించుట. తన యాస్థానమునకు శకుంతల సపుత్త్రయై వచ్చి భర్తచే తిరస్కృతయైన సన్నివేశమున -

"కొనకొని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు చే
కొని భరియింపు మీతని శకుంతల సత్యము వల్కె సాధ్వి స
ద్వినుత మహాపతివ్రత వివేకముతో నని దివ్యవాణి దా
వినిచె ధరాధినాథునకు విస్మయమందఁగఁ దత్సభాసదుల్." 1.4.105

"ఇట్లెల్ల వారలకు నతిహర్షంబుగా శకుంతలపతివ్రతాత్వంబును సత్యంబును భరతోత్పత్తియుఁ బ్రశంసించు వేలుపుల పలుకు లతివ్యక్తంబులయి యాకాశంబువలన వీతెంచిన విని దుష్యంతుడు సభాసదులు విన నిట్లనియె." *1.4.106*

ఈ వచనమునందలి "యెల్ల వారలకు నతిహర్షంబుగా" నను వాక్యభాగము మెలఁకువతో గమనింపఁదగినది. నిజమున కిట ప్రధానవ్యక్తులు ముగ్వురు - దుష్యంతుడు, శకుంతల, భరతుడు. ఇందు భరతుడు ముగ్ధబాలకుఁ డనుకొన్నచో దివ్యవాణివలన నతిహర్షము పొందవలసినది ముఖ్యముగా శకుంతలయు దుష్యంతుడును. అట్టిస్థితిలో నెల్లవారలకు నతిహర్షము గలిగె ననుటలోఁ గవితాత్పర్య మేమైయుండును? శకుంతల పుత్త్రసహితయై సభకు వచ్చినదిమొదలు కొని జరుగుచున్న విషయ మంతయు సభాసదులకు పరమవిచిత్రముగా నున్నది. ఆమె నేను నీభార్య ననుచుండ నీతఁడు గా దనుచుండెను. ఈయిరువురిలో నెవ్వరిని వంచకస్థానమునఁ బ్రతిష్ఠించుటకు నవకాశము గానరాకుండెను. ఇట్టిస్థితిలో దోష మెవరిది? పర్యవసాన మేమగును? ఎట్టి యకార్యము సంభవింపనున్నది? యిత్యాది విచికిత్సచే నందున్న వారందఱహృదయములు నాందోళితములై యున్నవి. ఈ సమస్యకుఁ బరిష్కారము లభించినఁగాని వారి గుండెలలోని యుత్కంఠాభారము తగ్గదు. ఇట్లు సంక్షుభితములైన వారిమానసములు ప్రసన్నము లయిన వెంటనే వారిచిత్తములు హర్షనిర్భరము లగుట సంభవించును. దివ్యవాణి అట్టి స్థితికి హేతువైనది. కావుననే ప్రధానవ్యక్తులతోపాటు ప్రేక్షకులు గూడ నతిహర్షమును బొందిరి. కథాదృష్టిలో నీయంశమున కంతప్రాధాన్యము లేదు. కాని కావ్య కళాదృష్టితో నిది యత్యంతప్రధానమైన విషయము. ప్రసన్నముగా సాగిపోవు కథతో మహార్థముల యోజన యనఁగా నిట్టిది.

(2) శంతనుఁ డేకాంతమున సత్యవతినిఁ గాంచి యామెయం దనురక్తుఁ డాయెను. దాశరా జామె కాతనివలనఁ బుట్టిన సంతానమునకు రాజ్యాధికారము కావలయునని కోరెను. గాంగేయుని స్మరించి యిట్టి యుంకు వీనోపక శంతనుఁడు గృహ

మేఁగి సత్యవతిన తలంచుచుఁ జింతాక్రాంతుడై వీతకార్యావసరుఁడాయెను. తండ్రి దుః ఖ మేమో యరసి ప్రతివిధాన మాచరించు తలఁపుతో గాంగేయుఁ డాతని సమీపించి యిట్లు పలికెను :

"భవదభిరక్షితక్షితికి బాధ యొనర్పఁగ నోపునట్టి శా
త్రవనివహంబు లేదు; వసుధాప్రజ కెల్ల ననంతసంతతో
త్సవముల; రాజు లెల్ల ననిశంబు విధేయుల; నీకు నిట్టు మా
నవవృషభేంద్ర! యేలొకొ మనః పరితాపముఁబొంది యుండఁగాన్."

వ॥ "అనిన విని పెద్దయుం ప్రొద్దు చింతించి శంతనుండు కొడుకున కిట్లనియె."

"వినవయ్య; యేకపుత్రుఁడు నవపత్యుఁడు నొక్క రూప యని ధర్మవులన్
విని నీకుఁ దోడు పుత్రుల ననఘా! పడయంగ నిష్ట మయినది నాకున్."

"జనవినుత! యగ్నిహోత్రం బును సంతానమును వేదములు నెడతెగఁగాఁ
జన దుత్తమవంశజులకు ననిరి మహాధర్మనిపుణులైన మునీంద్రుల్"

"నీ వస్త్రశస్త్ర విద్యా కోవిదుఁడవు; రణములందుఁ గ్రూరుడ; వరివి
ద్రావణసాహసికుండవు; గావున నీయునికి నమ్మఁగానోప నెడన్."

వ॥ "బహుపుత్రార్థంబు యత్నంబు సేయవలయు; వివాహం బయ్యెద."

**1.4.178, 179, 180, 181, 182, 183.**

ఈ ఘట్టమును సాధారణముగఁ జదువుకొనిపోయినచో విశేష మేమియు లేదు. కాని నిలిచి పరీక్షించినచో గొన్ని యర్థవిశేషము లిట భాసిల్లును. దేవవ్రతుడు తండ్రిమనోవ్యథకుఁ గారణములఁ గొన్నింటి నూహించెను. అతని దృష్టిలో నుత్తమచక్రవర్తికి రాజ్యము, ప్రజలు ముఖ్యము. ఈయంశములలో వారికి నేదేని వైపరీత్యము కలిగినపుడే యాతఁడు దుఃఖపడును. అతని క్షత్రియధర్మదీక్ష యసదృశము. అట్టివాడు ప్రస్తావించిన యంశములలో నొక్కటియుఁ దన దుఃఖమునకు హేతువు కాకపోవుటయు, నైనది యట్టివానితో నోరువిడచి చెప్పుటకు వీలులేని దగుటయుఁ, జెప్పినచో నది యుభయులకును బాధాహేతువు కావచ్చునేమో యనుశంక యాతనిహృదయమునఁ బుట్టుటయుఁ గారణములుగా సమాధానము చెప్పుటకుఁబెద్దయుంబ్రొద్దు చింతింపవలసివచ్చినది. ఆ సమాధాన మెంత హేతుపూర్వకముగా నున్నను విస్పష్టముగా దనహృదయమును విశదపఱచునది కాదు. దేవవ్రతుఁడు తండ్రివలన విన్నదానినుండి కొన్ని విషయముల నూహించి గ్రహింపవలసివచ్చెను. "బహుపుత్రార్థంబు యత్నంబు సేయవలయు వివాహ

మయ్యెద" ననుటలో తనతో ముడిపడియున్నసమస్య యొకటి తండ్రిని పీడించుచున్నదని యాఁతడు సంభావింప వలసివచ్చినది. ఏలయన రాజు వివాహమాడి సంతానముఁ బొందఁగోరినచో నానాటి సంప్రదాయములప్రకార మింతఁగా విచారింపఁ బనిలేదు. "రాజానో బహువల్లభాః" అనికదా సూక్తి. ఇందేదో కీలక మున్నదని యనుమానించిన గాంగేయుడు వెంటనే వృద్ధామాత్యపురోహితసుహృజ్జనములతో విచారింపఁగా రాజుదుఃఖమునకు హేతువు అవగతమయినది. తా నొకనిశ్చయమునకు వచ్చి యనేకరాజన్యసైన్యసమేతుఁడై దాశరాజుకడ కరిగెను. ఈ పదముగూడ గంభీరార్థయుక్తము. దాశరాజును బలప్రయోగముతో లొంగఁదీయుటకుఁగా దీరాజన్యసైన్యములు. తాను సాధింపబోవు భవిష్యన్మహారాజ్ఞికి లాంఛనప్రాయములు మాత్రమే. ఇట్లీ కథనములో నొక క్లిష్ట సమస్యలో నుదాత్తవ్యక్తుల ప్రసంగములు, వానిచేఁ బ్రతీయమానములగు మనోభావములు మున్నగునవి ప్రసన్నమగు కథతోఁగూడి పాఠకున కానందసంధాయకము లగుచున్నవి. ప్రసన్నకథాకలితార్థయుక్తి యనఁగా నిట్టిది. ఇది మహాగంభీర మయిన విషయము కావుననే కవీంద్రులు సారమతితో లో నారసి మేలనవలయునని కవి వ్రాకుచ్చెను.

నన్నయ కవితలోని మఱియొక గుణ మక్షరరమ్యత. రసభావానుగుణాక్షర విన్యాసము అక్షరముల రమ్యత యనినచో నన్నయకవితయెల్ల దాని కుదాహరణమే యగును. అక్షరములకూర్పువలన నయ్యెడు సౌందర్యమే స్థూలముగా నక్షరరమ్యత యని చెప్పవచ్చును. దీని నీక్రింది యుదాహరణములయందుఁ జూడనగును.

(1) కద్రువ చేసిన ఇంద్రప్రార్థనము :

"నరసురసిద్ధకింపురుషనాగనభశ్చర్యముఖ్యులెల్ల నీ
కరుణయ వేచి మంద్రు త్రిజగంబులు నీ కులిశాభిరక్షణ
స్ఫురణన చేసి సుస్థిరతఁ బొందుఁ బురందర! సర్వలోకసుం
దర! శరణంబు నా కగుము దానవసూదన ! పాకశాసనా!" 1.2.47

తన పుత్రులందఱు సూర్యతాపమునకుఁ గంద పపశుల్ల పడియున్న సందర్భమునఁ గద్రువ యమృతవృష్టి నపేక్షించి ఇంద్రు నిట్లు ప్రార్థించెను. ఇందలి రేఫాక్షరబాహుళ్యము శోకమును వ్యంజించును. నర, సుర, పురు ఇత్యాద్యనుప్రాసము ప్రార్థనచేయునప్పటి హృదయలాలిత్యము నభివ్యంజించును. 'పురందర సర్వలోకసుందర, దానవసూదన, పాకశాసనా' అను సంబోధనములందలి యంత్యానుప్రాసము దేవేంద్రునికే కాక పాఠకునకును సమ్మోహకము.

(2) ఈ క్రింది వసంతర్తువర్ణనపద్యము కూడ రమణీయాక్షరవిన్యాస శోభితమై

భారత ధ్వని దర్శనము
రమ్యత నొందుచున్నది :

"చందనతమాలతరులందు నగరుద్రుమములందుఁ గదళీవనములందు లవలీమా
కందతరుషండములయందు ననిమీలదరవిందసరసీవనములందు వనరాజీ
కందళిత పుష్పమకరందరసముం దగులుచుం దనువు సౌరభము నొంది జనచిత్తా
నందముగఁ బ్రోషితుల డెందము లలందురఁగ మందమలయానిలమమంద గతి వీచెన్."
1.5.139

ఈపద్యమునందలి యక్షరముల కూర్పు మధుమాససౌందర్యము నర్థవిచారణా నపేక్షముగనే నిరూపించుచున్నది.

ఇట్టి యక్షరముల రమ్యతవలన నక్షర యగు రమ్యత రూపొంది పాఠకునకు అక్షరమైన యానందము నావహించును. కావుననే పండితులు కొందఱిది యక్షరయైన రమ్యత యనియు సంభావింతురు.

ఇఁక మూఁడవ లక్షణము నానారుచిరార్థసూక్తినిధిత్వము. సూక్తియనగా మంచిమాట. అది మానవుని మంచితనమునకుఁ జక్కని రాచబాట. రుచికరమైన యర్థములతోఁ గూడిన సూక్తులు మధురములైన యౌషధములవంటివి. అవి గ్రహింపఁ బడునప్పుడుగాని సేవించినపిమ్మటఁగాని యెట్టివికారమును బుట్టింపక మానసారోగ్యమును బరిరక్షించి మానవునకు సౌమనస్యమును సంధానించును. ఇట్టివి తన కవితలో బహుసంఖ్యాకముగాఁ గలవని నన్నయ వచించెను. మచ్చున కొకటిరెండు :

(1) "అలిగిన నలుగక యెగ్గులు వలికిన మఱి విననియట్ల ప్రతివచనంబుల్
పలుకక బన్నమువడి యెడఁ దలఁపక యున్నతఁడ చూవె ధర్మజ్ఞుఁ డిలన్."
1.3.147

(2) "మతిఁదలఁపగ సంసారం బతిచంచల మెండమావులట్టులు సంప
త్ప్రతతు లతిక్షణికంబులు గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్." 1.5.159

ఇట్టి వనేకములు. ఇట్లు సూటిగాఁ జెప్పు సూక్తులే కాక వ్యంగ్యముగా రూపొందునవియు నీతని కవిత్వమునఁ జాల గలవు. ఒక యుదాహరణము:

"నరుఁ డస్త్రశస్త్ర విద్యా పరిణతి నధికుఁ డయి వినయపరుఁ డయి శశ్వ
ద్గురుపూజాయత్నంబునఁ బరఁగుచు సంప్రీతుఁ జేసె భారద్వాజున్." 1.5.226

ఇందు సచ్ఛిష్యుని లక్షణము లేవియో వ్యంగ్యముగాఁ జెప్పఁబడినవి. వినయ పరత్వము, శశ్వద్గురుపూజాయత్నము అనునవి విద్యాపరిణతికి మిక్కిలి సహకారకములను సూక్తి యిందుదాహరణసమన్వయపూర్వకముగా నిబంధింపఁబడినది.

నన్నయకవితలో విశేషములు మఱి యెన్నియో కలవు. రసభావానుగుణ ఛందః ప్రయోగౌచిత్యము, వచనమునకుఁ బద్యమునకు విషయభేదమును బాటించుట, సంబోధనములను విశేషణములను నభిప్రాయగర్భితముగాఁ బ్రయోగించుట, వర్ణనములు ప్రయోజనాత్మకముగా ననుసంధించుట, ఉపాఖ్యానాదుల ప్రాధాన్యాప్రాధాన్యములనుబట్టి పెంచియో సంక్షేపించియో రచించుట, పాత్రముల స్వభావమును మొదటినుండి తుదివరకు నొకేవిధముగా తీర్చుట, తత్సమాచ్ఛికపదబాహుళ్యప్రయోగమును వివక్ష ననుసరించి చేయుట, పవిత్రోపమానములు, అలంకారప్రయోగౌచిత్యము మున్నగునవి యనేకములు పరిశీలింపఁదగియున్నది. ఇట్టికవితావైచిత్రితోఁ గొన్ని కొన్ని యంశములు కొందఱకుఁ గొందఱకు నచ్చి తఱువాతివారనుకరింప యత్నించిరి. కావుననే నన్నయ యాంధ్రకవిత్వవిశారదుఁ డే కాక ఆంధ్రకవికులగురు వనియుఁ జెప్పనొప్పినవాఁడు. భాషావిషయమున నాతఁడే వైయాకరణులకు ముఖ్యముగా ప్రామాణికుఁ డయ్యెను. దీనిచే నాతని శబ్దశాసనత్వము సార్థక మగుచున్నది. సంస్కృతకావ్యములఁ దెలుఁగున రచియించుట కాయన పెట్టిన ఒరవడి యనుపమాన మైనది. ఇట్టి యీ మహనీయుని భారతరచన కాలదైవవశమున అరణ్యపర్వములోఁ జతుర్థాశ్వాసమునఁ గొంత నడచి నిలిచినది. దానివలన నొకవిధముగా లాభమే కలిగినది. అంతయు మన మేలునకే కదా!

## తి క్క నా మా త్యుఁ డు :-

నన్నయకవిత యారణ్య మధ్యమున నాగిపోవుటవలనఁ గలిగిన లాభమేమనఁ గా నాంధ్రులకు మఱియొక మహాకవి లభియించుట. తెలుఁగువారి పున్నెముల పంటను గవితారూపమున బండించిన యా పుంభావసరస్వతి తిక్కన. అత డుభయకవి మిత్రుడు. అనఁగా సంస్కృతాంధ్రకవులకు ప్రభాకరసదృశుఁడు. ఆతఁడు వ్రాసిన సంస్కృత కావ్యములు ప్రసిద్ధములై కానవచ్చుటలేదు గాని -

"కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్?
కిం కాలకూటః కిము వా యశోదా స్తన్యం తవ స్వాదు వద ప్రభో ! మే."

అను శ్లోక మొక్కటియు నిర్వచనో త్తరరామాయణప్రార్థనాశ్లోకమును మాత్రము సంస్కృతమునఁ గానవచ్చుచున్నవి. రమణీయార్థప్రతిపాదక మొక్క శబ్దమైనఁ గావ్య మగు నన్నచో శబ్దసమవాయరూప మీపై శ్లోకము కావ్య మేల కాఁజాలదు? ఇది యాతని హరిహరాద్వైతభావనాసిద్ధికిని, తన్మూలమునఁ బరమాత్మనొక్కనినే మానవులు రుచిభేదము ననుసరించి భిన్నభిన్నస్వరూపములఁ గల్పించు కొందురను తాత్త్వికార్థమునకును, సర్వజగద్రక్షణతత్పరుఁడగు స్వామికి కాలకూటభక్షణము, పసిబాలునికి మాతృస్తన్యమువలె

పరమానందదాయక మనురూపమున భగవత్కారుణ్యమునకును, భగవంతుడు స్వయంభువై మహత్తుకంటె మహనీయుఁడగుచు, పసిబాలుఁడై యణువులకంటె నణీయుఁడగు నను నౌపనిషదార్థమునకును, అస్థికౌస్తుభములకును, గాలకూట యశోదాస్తన్యములకును లోకదృష్టిలో మహాంతర మున్నను తాత్త్వికముగా భేదములే దను నంశమునకును, పరిష్క్రియ యను బాహ్య లక్షణము నొకదానిని రుచికి సంబంధించిన యంతర్లక్షణము నొకదానిని నుపలక్షణముగా స్వీకరించుటచే భగవంతుడు బాహ్యాభ్యంతరముల నిర్వికారుఁ డనురూపమున నేర్పడు వేదాంతార్థమునకును, అస్థిమాలాదిగ్రహణములవలన సాధకునకు సాకారార్చన యుపాదేయమను నుపాయజ్ఞానమునకును, 'వద' యను విధ్యర్థక క్రియచే నంభావింవనగు భక్తిపారవశ్యస్థితికిని, ప్రభుశబ్దప్రయోగముచే ననుమేయమగు కవియాత్మార్పణ తాత్పర్యమునకును - ఇట్టి మఱికొన్ని యర్థములకును నీశ్లోకవాచ్యార్థము వ్యంజకము. ఇట్టిది చక్కని సంస్కృతకావ్యముగాఁ బరిగణనీయమై యాతని యుభయకవిమిత్రతను బ్రమాణీకరించుచున్నది.

ఈ మహానుభావుఁడు వైదిక మార్గనిష్ఠ మగు వర్తనమును జక్కగా నిర్వహించు నుత్తమవైదికుడు. సతతము భేదములేని భక్తితో నిర్మలమగు చిత్తవృత్తిని సంధానించు భగవత్పాదనిరంతరస్మరణతత్పరభావము గలిగి యాత్మ నంమోదము నొందఁగా గావ్యరసమును గొనియాడు నుత్తమరసికుఁడు. యజ్ఞము చేసి త్రికరణశుద్ధిని సాధించిన యుత్తమసాధకుఁడు. ఇది పారమార్థికముగా నాతఁడు పండించుకొన్న గొప్పపంట. ఐహికముగాఁ జూచినచో మంత్రియైం రాజకార్యముల నిపుణముగా సాధించిన రాజనీతిజ్ఞుడు. తన్నందినవారు తనంత యన్న సామెతకుఁ బ్రమాణమో యన్నట్లు సత్కావ్యనిర్మాణధురంధరులగు సచ్ఛిష్యుల శిక్షించిన గురూత్తముడు. అటు రాజునకును నిటు ప్రజకును సమానముగా నాదరణీయమైన సత్స్వభావము గలధీరోన్నతచిత్తుఁడు. విశాలమహాంధ్రసామ్రాజ్యమును నిర్వక్రపరాక్రమముతో నేలిన కాకతీయగణపతిదేవచక్రవర్తి మన్నన లందిన మనీషిశిరోమణి. ఇట్లిహపరసుఖముల రెంటిని స్వాయత్తము గావించుకొన్న ధన్యజీవుఁడు.

ఇఁక నీతని కవితావ్యక్తిత్వమును గూర్చి కొన్ని మాటలు - ఈతడు బుధారాధనచే విరాజిల్లు పుణ్యమూర్తి. నన్నయ వ్రాసి విడిచిన మహాభారతమును 'దుదిముట్టన్ రచియించు టొప్పని సంకల్పించి తుదిముట్టిన సంకల్పసిద్ధుఁడు. మహాకవిత్వ దీక్షావిధి నొంది లోకహితకాంక్షతో సాహిత్యసోమరసమును దాను గ్రోలి యాంధ్రావళి మోదముం

బొరయునట్లుఁ గర్ణపుటంబుల నారఁగ్రోలఁజేసిన పరమోదారవ్యక్తి. కావ్యరచనయే యొక యారాధనా విశేషముగా నెంచి కైవల్యము నర్థించిన స్థిరచిత్తుడు. 'కవితారూపతపస్సు' చే నిష్టసిద్ధినొందిన మేధాఘనుఁడు. కవిత్వముచేఁ బుట్టువును గృతార్థ మొనరించుకొనిన ధన్యజీవి. అతనికవిత్వము నలవోకగా నిర్లక్ష్యముగా జదువరా దనునంశమును నొక్కి చెప్పుటకే ఇంతఁగా నిట వ్రాయుట. ఇట్టివాఁడు కావుననే యాతని నెఱ్ఱాప్రెగ్గడ కవిబ్రహ్మ యనుచు నిట్లు స్తుతించెను :

> "తనకావించిన సృష్టి తక్కొరులచేతం గాదు నా నేముఖం
> బునఁ దాఁ బల్కిన వల్కు లాగమములై పొల్పొందు నా, వాణి భ
> ర్తను నీతం డొకరుండ నాఁ జను మహత్త్వాప్తిన్ గవిబ్రహ్మ నా
> వినుతింతున్ గవి తిక్కయజ్వ నఖిలోర్వీ దేవతాభ్యర్చితున్"

(హరి. వం. పూ. భా. 1.9)

ఇం దాతఁడు తిక్కనను సృష్టికర్తయగు బ్రహ్మతో నభిన్నునిగా వక్కాణించెను. బ్రహ్మసృష్టివలె నాంధ్రకవిత్వమున నీతఁ డొనర్చిన సృష్టి మఱి యెవ్వడును గావింపలేడు. ఏవిధమైనను నీతనివాక్కు వేదవాక్సదృశమై పొల్పొందును. కవిత్వమున కీతఁ డొక్కఁడే యని వాణి భర్త యనుననఁజను మహత్త్వాప్తిచే నీతఁడు కవిబ్రహ్మయై యొప్పను. అఖిలోర్వీదేవతాభ్యర్చితత్వము తన వ్యక్తిత్వగౌరవముతో సాధించిన పుణ్యమూర్తి యాతడు. ఇది యెఱ్ఱయ భావించిన తిక్కనమూర్తి.

నిజమునకుఁ దిక్కన కావించిన సృష్టి యెట్టిది? అతఁడు కథను సృజింప లేదు. అది వ్యాసభగవానుని సృష్టి. తెలుఁగున కవిత్వము నాతఁడు సృజింపలేదు. ఆప్రశంస కొకవేళఁ బ్రాతత నన్నయకుఁ గలుగవచ్చును. మఱి యాతఁ డతినూత్నముగా ననుకరణసాధ్యము కానివిధముగాఁ జేసిన సృష్టి యెట్టిది? అది భారతరచనావిధాన మనఁ దగును. ప్రత్యక్షరమును మెలకువతో సార్థకముగా మహాశిల్పి పరమసూక్ష్మాంశముల యందును బహుజాగరూకత వహించి ప్రతిమను జెక్కు విధమున, కావ్యశిల్పమును దీర్చిదిద్దుట ఈతని ప్రత్యేకత. అదియే యన్యసాధ్యము కాని యాతని సృష్టి. కొన్ని వేలపద్యములఁ జెప్పునప్పు డిట్టి నిశితమైన యవధానగరిమ యత్యాశ్చర్యకరమైన విషయము. కావుననే తిక్కన, తన దృష్టిలో వేద వ్యాసునివలె, మనదృష్టిలో భవ్యకవితావేశుఁడు. ఆ యావేశము విద్వత్సంస్తవనీయము. నిర్వచనోత్తర రామాయణమునఁ జెప్పుకొనిన **"అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడన్"** అనుమాట ప్రత్యక్షర సత్యము. శిల్పి మనినవెంటనే నైపుణ్యము, జాగరూకత, సౌందర్యదృష్టి, శాస్త్రజ్ఞత, లోకజ్ఞత మున్నగు లక్షణము లెన్నియో మేళగించి

యుండవలయును. అప్పుడే యది సర్వజనుల హృదయముల నాకట్టుకొని యందానందరసాంబుధిని నింపఁ గలుగును. తిక్కన నిర్వహించిన కావ్యశిల్ప మట్టిది.

తిక్కనామాత్యుని కవితాగుణముగా శ్రీనాథమహాకవి రసాభ్యుచితబంధమును వక్కాణించెను. రసమునకుఁ దగిన బంధ మను నీలక్షణమున బంధశబ్దమునకుఁ 'గూర్పు' అను నర్థమును గ్రహింపవచ్చును. రసానుగుణమగు శబ్దార్థముల కూర్పితని కవితాప్రధాన లక్షణ మని శ్రీనాథుని తాత్పర్యమై యుండును. తిక్కన కవితలో నర్థగౌరవము మెండు. అర్థగౌరవ మనఁగాఁ దఱఁచినకొలదియు విశేషార్థప్రతిపత్తి కలుగుచుండుట. ఆయర్థము ముఖ్యముగా రసభావాదిక మైనచో, నీబంధము రసాభ్యుచిత మైనచో నీతనికవిత ధ్వని మార్గభూషిత మనియే చెప్ప నొప్పును గదా! కావున నీతనికవిత పరమోత్తమకావ్యకోటిలోనికిఁ జేరుచున్నది. ఈ రసనిర్వహణవిషయమున తిక్కన తనసామర్థ్యమును దా నెఱిఁగినవాఁడు. కథాగమనమున విభావాదిసామగ్రి సమగ్రముగాఁ గూర్చి రసోత్పత్తిని గలిగించుటయే కాక 'ఇదిగో యిట ఈ రస మున్నది గమనింపుఁ' డను సూచనయుఁ జేయు చుండును. లాక్షణికులు చెప్పిన వమనదోష మిట నేర్పడదా? యని శంకింపఁ బనిలేదు. విభావాది సామగ్రి లేనిచోట రసనామస్వీకారము చేసినప్పు డట్టిది సిద్ధమగును గాని యితర సన్నివేశములందుఁ గాదు. ఈతని రసాభ్యుచితబంధమునకు రెండుదాహరణములు :

(1) వలలవేషమున నున్న భీమసేనుఁడు తన కనులయెదుటఁ దమ మనోవల్లభకు సింహబలునివలనఁ గలిగిన యవమానమును, వాని విజృంభణమును -

"కనుగొని, కోపవేగమునఁ గన్ను నిప్పులు రాల, నంగముల్
గనలగ, సాంద్రఘర్మసలిలంబులు గ్రమ్మ, నితాంతదంతపీ
డనరటదాస్యరంగవికటభ్రుకుటీచటులప్రవృత్తన
ర్తనఘటనాప్రకారభయదస్ఫురణాపరిణద్ధమూర్తియై" 4.2.133

కన్పట్టెను. సాధారణముగ నలఁతియలఁతి తెలుఁగుపదములఁ బ్రయోగించు తిక్కన యిట నీసుదీర్ఘసమాసమును ఓజోగుణసంభరితముగాఁ బ్రయోగించుట తత్కాలరౌద్రమునకు వ్యంజక మగుటకే యనుట సువిదితమే. 'వికటభ్రుకుటీచటుల'ఇత్యాది పదములందలి పరుషాక్షరావృత్తి దంతపీడనరటనమును దలపింపఁ జేయును. 'స్ఫురణా' అనుదాని యందలి దీర్ఘము హ్రస్వము పైకెత్తి సుదీర్ఘముగా నెత్తుటను, 'పరిణద్ధ' అనుచోటి 'ణ' కారముమీఁది యొత్తిడి గ్రుద్దుటయందలి బలప్రయోగమును, ద్విరుక్తధకారము పడిన వ్రేటు శబ్దమును వ్యంజించుచు భీముఁ డేమి చేయఁదలచెనో దాని నర్థవిచారాపేక్ష లేకయే పాఠకునకు బోధించుచున్నవి. రసాభ్యుచితబంధ మనఁగా నిట్టిది.

(2) మౌర్ఖ్యమువలనఁ గౌరవసేన యననేమో యెఱుఁగక బృహన్నలా

సారథికముగాఁ బోర వచ్చిన యుత్తరుఁడు దానిం గాంచి భీతుఁడై తేరు మరల్పు మని ప్రార్థించుచు నిట్లనెను :

"ఒంటిఁ దలపడి కురుసేన నోర్చువాఁడ నే? యి దేటికి వెడ మాట లిట్టు లాడ?
వారు గానక ముందఱఁ దేరు తోలు కొని రయంబునఁ బురి కరుగుటయ నీతి."
4-4-64

ఇందలి పదములకూర్పు హాస్యరసానుగుణ మగుట స్పష్టమే. తుదిపాదము నందలి లఘ్వక్షరబాహుళ్యము ద్రుతగతిని బోధించుచు వెనుదిరిగి పాఱిపోవుటలోని వేగవైఖరిని, తొందరపాటును జక్కగా వ్యంజించుచున్నది. ఇట్టిబంధ మీతని కవిత్వమున సార్వత్రికమై కానవచ్చును.

తిక్కనకవితలోఁ బ్రధానముగాఁ బేర్కొనఁదగినది రచనాశిల్పము. అతివిస్తృతముగాఁ బెరిగిన సంస్కృతాలంకారశాస్త్రమునఁ బ్రసిద్ధముగాఁ బేర్కొనఁబడని యొక వినూతన ప్రక్రియ యియ్యది. సంస్కృతకవిత్వమున నది లేదని చెప్పఁజాలము కాని దాని గుర్తింపునకు సూచన యందు దృశ్యమాన మగుటలేదు. ఈగుర్తింపువలనఁ దెలుఁగుకవిత్వమున కొక విశేషగౌరవము కలుగుచున్నది. శిల్పమనగా నిపుణకర్మ మని స్థూలముగా నర్థము. చెప్పదలచిన యర్థమును రమణీయముగా శ్రోతృపఠితృజనమునకు హృదయాహ్లాదము కలుగునట్లుగా 'ఆహాపుట్టించు'నట్లుగా తీర్చిదిద్దుటయే కావ్య శిల్పమని చెప్పనొప్పును. దీనివలనఁ బాఠకునకుఁ గావ్యమునం దాభిముఖ్యము కలిగి పునఃపునః పఠనాసక్తి పెంపొందును.

తిక్కనకావ్యశిల్పమును గూర్చి గ్రంథములు, వ్యాసములు వ్రాసిన విమర్శకు లనేకులు. భిన్నదృక్పథములతో నీతని కవితాశిల్పము బహువిస్తృతముగా ననుశీలింపబడినది. ఈశిల్పము నొండురెండుదాహరణములతో సమన్వయించి చూపుదును:

(1) విరాటనగరమునఁ బ్రవేశించిన ద్రౌపదిని, సుధేష్ణమందిరమునఁ బ్రవేశించుచున్న ద్రౌపదిని తిక్కన రెండు సీసపద్యములలో నిట్లు వర్ణించెను :

(1) "పఱిమొయిల్ గప్పినఁ బాడఱి నునుఁగాంతిఁ గదలినయమృతాంశుకలయుఁబోలెఁ
బెనుమంచుమీఁద బర్విన వికాసము తప్పి చెలువు కుందిన సరోజినివిధమున
ధూమంబు పొదివినఁ దుఱఁగలి మెఱుఁగులు నలఁగి మాసిన దీపకళికపగిది
ధూళిపైఁ బొరసినఁ దొంగలించుట మాని లావణ్య మెడలిన లతికభంగి
గంధకారికావేషంబుకతన మూర్తి యుజ్జ్వలత్వంబు మఱువడి యుండఁ బాండు

తనయ మహిషి యంచిత గతిఁ జనఁగ రాజ వీధిఁబౌరజనంబులవ్వేలఁదిఁ జూచి"

4.1.294

(2) "పదతలంబుల కెంపు పరఁగిన తలము కుం కుమలిప్త మైనచందము వహింప
నంగంబు నునుగాంతి యడరిన గోడలు వేదులు మణిమయవిధము నొందఁ
గనుఁగవమెఱుఁగులు కదిరిన ముందర పుష్పోపహారంబు పొలుపుఁ దాల్ప
వేనలికప్పు పర్వీన మీఁదు నీల దు కూలంబు మేల్కట్టుకొమరు వడయఁ
దాను జొచ్చినకతన మత్స్యక్షితీశు నింట నిమ్మెయిఁగ్రొత్తయొ ప్పెసనక మెసగ
న మ్మహాదేవి యున్నెడ కల్ల నల్లఁ బాండురాజతనూభవపత్ని యరిగె."

4.1.308

కించిద్వ్యవధానముగా నున్న యీ రెండు పద్యములలోఁ గొంచెముగాఁ బరస్పరవైరుద్ధ్యము గానవచ్చుచున్నది. మొదటిపద్యమున నామెసౌందర్య ముజ్జ్వలత్వము మఱువడి యుండగా రెండవ పద్యమున నామె మేని ధాళధళ్యము సోకిన భవనభాగములు గూడఁ దళతళలాడుచున్నట్లు వర్ణింపబడినది. ఇంతలో నింత మార్పెక్కడినుండి వచ్చెను?- ఈవర్ణనముల నిట్లు చేయుటలోఁ గవితాత్పర్యమేమి? - భావన చేయవలసియున్నది. ద్రౌపది, పురవీథినుండి సుదేష్ణయున్నచోటికి వచ్చులోపలఁ, దనమాసినతనమును గొంత మాపుకొని యుండవలయును. సాధారణముగ మాననీయులకడ కరుగునప్పుడు జనులు కొంతకుఁగొంత సంస్కారము గావించుకొనుట పరిపాటి. కావుననే "ఉన్మత్తవేషిణి యైన లచ్చికరణి" మొదటి పద్యమున వర్ణితయగు ద్రౌపది పులుగడిగినమాణిక్యమువలె రెండవపద్యమున వర్ణింపబడినది. ఆమె చేసికొన్న శరీరసంస్కారము నిట్లు వ్యంజించుట మహాశిల్ప మని భావింపనక్కరలేదు. కాని తన్మూలమున సాధించిన ప్రయోజనములు మాత్రము శిల్పపరిధిలో సంభావ్యములు కాఁగలవు. ఇప్పటి ఈ వర్ణనము విరాటపర్వకథ కంతటికిని బీజప్రాయము. ఈ సౌందర్యమువలననే కీచకవధ జరిగినది. దానిని బట్టియే పాండవుల విరాటనగరవాసమును దుర్యోధను డనుమానించెను. దానితో దక్షిణోత్తర గోగ్రహణముల కథ సాగెను. ఉత్తర గోగ్రహణమున నర్జునుడు విరాటునకుఁ జేసిన యుపకారమునకుఁ గృతజ్ఞతా రూపముగా ఉత్తరావివాహకథ యనుసంధింపఁబడెను. దీనిని బట్టి యీ వర్ణనముల కెంత ప్రాధాన్యము గలదో తెలియుచున్నది. కావుననే కవి వాచ్యముగా ద్రౌపది చొచ్చినకతన మత్స్యక్షితీశునింటఁ గ్రొత్తయొ ప్పెసక మెసగె నని భవన వికాసమును నుడివి తన్మూలమున భవిష్యమాణకీచకవధ, ఉత్తరావివాహముల వలన నగు శాశ్వతశోభను పరమోదాత్తముగ వ్యంజించెను. ఇట్టి పద్యద్వయమును పర్వప్రమాణముగాఁ బఱచుకొనిన కథాభాగమునకు దీపకళికగా నిబంధించుటయే శిల్పము.

(2) వర్ణనములను సాభిప్రాయముగాఁ గూర్చుటయు నొక శిల్పధర్మము.

గడచినవి. కీచకునిచే ఘోరావమానము నంది నిదురపట్టక వేగివేగి తుదకు భీమసేనునితో నాలోచించి కార్యవినిర్ణయము గావించుసరికి నామెకు మిక్కిలి బరువుగాఁ దెల్లవాఱినది. సంజయుఁడు పాండవుల కడకేఁగి దౌత్యము నెఱపి తనకడకు వచ్చి విషయమును పూర్తిగాఁ జెప్పక తన్ను దూషించి మిగిలిన సంగతులు మఱునాఁడు నివేదింతు నని చనఁగా ధృతరాష్ట్రునకా రేయి తెల్లవాఱునా యనిపించునంతటిదై గడచినది. వీరిరువురి యెడఁదలలోని బరువు, కథాగమనములోని బరువు, పాఠకుల హృదయములందలి యుత్కంఠాభారమును కట్టపైయంచులను దాఁకునట్లుగా నిండిన చెఱువు భారమువలె నేక్షణమున నేమగునా యన్నట్లున్నవి. దీనికొక పరీవాహము కావలయును. ఈ బరువు దిగవలయును. దానికి మధురమైన వర్ణన మొకటి కావలయును. కాలానుగుణముగ ప్రాతః కాలవర్ణనముకంటె సముచితమైనది మఱే ముండును? ఈ దృష్టితో నీవర్ణనముల నీమహాకవి యీ సందర్భములందుఁ గూర్చెను గాని చాపలముతోఁ గాదు. ఇట్టి వర్ణనములు కథలో కీలకస్థానమున నెలకొని శిల్ప పరిధిలోనికిఁ జేరుచున్నవి. (ఈ యభిప్రాయమును శ్రీ శ్రీరాం భుజంగరాయశర్మగా రొక యుపన్యాసమున సూచించిరి.)

తిక్కన కావించిన వర్ణనము లన్నియు నిట్లే కథాగమనముతో ముడివైచుకొని రమణీయార్థములఁ బ్రతిపాదించుచుండును.

(3) ప్రసిద్ధములగు నుపమానములనే స్వీకరించియు వానివలన సందర్భమున కెంతయు దీప్తిని దెచ్చుటయు శిల్పవిశేషముగా భావింపనగును. రాయబారమున కరుగు కృష్ణునితోఁ గొన్ని మాట లాడి యనంతరము -

**"ద్రోపది బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మున విడ్చి వెండ్రుకల్**
**దా వలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో**
**నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగు విషాదరోషముల్**
**గావగలేక బాష్పములు గ్రమ్మన దిగ్గన లేచి యార్తయై."** 5.3.114

సాధారణముగా కేశపాశమునకు సర్పసాదృశ్యము చెప్పఁబడుచునే యుండును. కాని యీ సందర్భమున నది యెంత చిత్రముగా నదికినదో, దానిచే ద్రౌపది కోప మెంత యుద్దీప్తత చెందినదో గమనింపవలయును. ఇట్లలంకారముల నుస్థానపతితములఁ జేయుటయు నొక శిల్పమర్మమే.

(4) పద్యసంఖ్యయు నొక్కొకచో విశేషాంశద్యోతక మగును. అశ్వమేధ పర్వతృతీయాశ్వాసమున శ్రీకృష్ణుఁడు మృతజాతుఁడైన పరీక్షిత్తును బ్రదికించు సందర్భమున నైదుపద్యములలోఁ బ్రతిజ్ఞలు చేసెను. పంచప్రాణముల రాక నట్లు పద్య

పంచకముతో సూచించు టొక శిల్పము.

శిల్ప విశేషము లింకను ననంతముఖముగా నుండవచ్చును. తిక్కన రచనలోని మహాగుణముగా విమర్శకులు వక్కాణించునది నాటకీయత. వ్యక్తులు, వారి యభినయవిశేషములు, సంభాషణమునందలి వైఖరులు, ప్రవేశ నిష్క్రమణాదులు మున్నగునవి చదువునప్పుడు, చూచునప్పుడువలె, మనోనేత్రమునకుఁ గట్టునట్లు వర్ణించుటయే నాటకీయత. ముఖ్యముగా దీనిని సంజయశ్రీకృష్ణులు నిర్వహించిన దౌత్యములందుఁ గాననగును.

'అల్పాక్షరముల ననల్పార్థ రచన' యనునదియుఁ దిక్కన కవితాగుణములలో నొకటి. భంగ్యంతరముగా ధ్వని మార్గమునకు ఇది మఱియొక నామము. దీని కనేకోదాహరణములు అష్టమాధ్యాయమునఁ జూపబడుచున్నవి.

తిక్కన శైలి యెక్కువగా నాచ్ఛికపదములతో నిండి యుండును. నన్నయ కవితలోవలె దీర్ఘములైన సమాసము లితనిలో నంతగాఁ గానరావు. కావున సాధారణ పరిజ్ఞానము కలవారికిని నిది సన్నిహిత మైనట్లు కానవచ్చును. తిక్కన యంతకుముందు కావ్య వ్యవహారములో నంతగా లేని అనేకాచ్ఛిక పదములను వాడి వానికి గతి కల్పించెను. లంచము, బలే మున్నగు పదము లట్టివి.

తుది కొక మాట. కవులలో నావేశ మెక్కువపాలు గలవా రుందురు. నిగ్రహమును వీడనివా రుందురు. మొదటితెగకుఁ బోతనామాత్యునివంటివారిని గ్రహింపవచ్చును. రెండవ తెగలో నగ్రేసరుఁడు తిక్కన. పదునైదు పర్వముల భారత రచనలో నొకేవిధముగ నొక భాగమునం దాదరముగాని మఱియొకయెడ నుపేక్షగాని లేక యేకాకారముగఁ దీర్చిదిద్దుట అనన్యసాధ్యము. దీనికిఁ గవి నిగ్రహముగలవాఁడై యుండవలయును. కవితావేశము భవ్యమగుట యనఁగా నిగ్రహమే యని నా యభిప్రాయము. పదముకొఱకో, వర్ణనము కొఱకో, సమాసప్రయోగముకొఱకో కక్కుఱితిపడుట తిక్కనయందే యననేల? కవిత్రయములో నెవ్వరియందును సాధారణముగఁ గానరాదు. ఎచట నేది యెట్లు చెప్పినఁ బాఠకునకు రసానుభూతి కలుగునో యచట దాని నట్లు తూచితూచి వాడుటలో తిక్కన సిద్ధహస్తుడు. ఇంత విస్తృతమగు గ్రంథభాగమున నట్లు తుదిముట్ట నిర్వహించుట సుసాధ్యము కాదు. కాని దాని నీతఁడు సాధించెను. కావుననే యాతనికవిత శిరోధార్యమై యాంధ్రావళికి మోదముఁ గూర్చుచున్నది.

## ఎఱ్ఱాప్రెగ్గడ :-

కవిత్రయములో మూఁడవవాఁడును, కావ్యభాగమును బట్టి రెండవవాఁడు నగు ఎఱ్ఱాప్రెగ్గడకు ప్రబంధపరమేశ్వరుఁడను బిరుదము గలదు. అరణ్య పర్వశేష రచనమును బట్టియే యాతనికా బిరుదము వచ్చిన ట్లీ క్రింది నృసింహపురాణ పద్యమును బట్టి తెలియుచున్నది :

"ఉన్నతసంస్కృతాదిచతురోక్తిపదంబులఁ గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వశే
షోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించి తా
నన్నయభట్టతిక్కకవినాథుల కెక్కిన భక్తి పెంపునన్." (నృసి. పు. పీ. 17)

అరణ్యపర్వశేషమును బ్రత్యేకముగా నొక ప్రబంధమని చెప్పఁజాలము. అట్టియెడఁ దత్కర్తృత్వముచే నీతనిఁ బ్రబంధపరమేశ్వరుఁ డనుట యెట్లు పొసఁగును? ప్రబంధమనఁగా నేమి? ఒకజాతి కావ్యపరముగా నీశబ్ద మితీవల కాలమున వాడుకలోనికి వచ్చెను. కాని యెఱ్ఱయ కాలమున లేదు. కావున నీబిరుదమున కొక విశేషమైన యర్థము చెప్పుకొనవలయును. ప్రబంధమనఁగా జక్కనికూర్పు - సంధానము. ఎఱ్ఱయ, నన్నయ తిక్కనలు వ్రాసిన భారతభాగమునకుఁ జక్కని సంధానము గావించెను. భారత రచనకు 'ఇతిశ్రీ'కారము పెట్టుటచేతను, నన్నయ తిక్కనలకు విష్ణు - పరమేష్ఠి - సాదృశ్యము లుండుటచేతను నీతఁడు ప్రబంధపరమేశుఁ డను టెంతయు నొప్పును.

ధీరవిచారుఁడగు నెఱ్ఱయ 'నన్నయ కవితారీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయకా నారణ్యపర్వశేషమును బూరించె'ను. ఇది యాతని వినయగరిమను మహానుభావతను వెల్లడించును. 'ఇటనుండి యెఱ్ఱాప్రెగ్గడకవిత్వము' అను వాక్యమును, పర్వాంతమునందలి యెఱ్ఱయరచనను బ్రతిపాదించు మూఁడు పద్యములును లేనిచో నీభాగ మన్యకర్తృక మను నభిప్రాయము స్థూలముగా సిద్ధింపదు. హరివంశ నృసింహపురాణములందలి శైలికంటె మహాభారతమునందలి యాతని శైలి విలక్షణము. ఇట్లు పూర్తిగాఁ దన కవితాశైలిని పెడఁద్రోసి మఱియొక కవిశైలితో సుమారు పదునాఱువందల పద్యములు వ్రాయుట సాధారణ విషయము కాదు. కావుననే శ్రీ విశ్వనాథవారు 'ఎఱ్ఱన్న సర్వమార్గేచ్ఛావిధాత్రుం' డని కొనియాడిరి.

కొంద ఱారణ్యపర్వశేషము నెఱ్ఱయ రచింపలేదు. అదియు నన్నయచేతనే రచితమైయుండ నందుఁ గొన్ని పదములు, వాక్యములు, పద్యములును లుప్తములు కాఁగా వానిని మాత్రమే ఎఱ్ఱయ యుతికె'నని చెప్పుదురు. శ్రీమాన్ వేదాల

తిరువేంగళాచార్యులుగా రీ యభిప్రాయముననేకోపపత్తులతో బాగుగా సమర్థించిరి. నిజమునకు వారు చెప్పిన ట్లిది లుప్తపూరణమే యన్నచో నది యెఱ్ఱయ గౌరవము నినుమడింపఁ జేయునే కాని తగ్గింపదు. ఎవ్వరో వ్రాసిన గ్రంథమున సుమారు పదునాఱు వందల గద్య పద్యములలో నక్షర పద వాక్యపద్యాదిలోపములను సవరించి యతుకులు పెట్టుట మహాకార్య మని చెప్పనొప్పును. కాని సీస పద్యమునందలి నియమములు, మధ్యాక్కరలో యతిస్థానము మార్పు, సూక్ష్మముగాఁ బరికింపఁ దోఁచు శైలీభేదము మున్నగు విశేషములను బట్టి యారణ్యపర్వశేష మెఱ్ఱయ స్వీయరచనమే యని విజ్ఞులు తీర్మానింతురు. మఱియు తత్కవితారీతియు కొంత తోఁచె నని యెఱ్ఱయ చెప్పెను. గాని తత్కవితయే తోఁచెనని చెప్పలేదు. ఇదియు గమనింపఁదగిన యంశము.

ఎఱ్ఱాప్రెగ్గడ *"గిరిశపదభక్తి రసతత్పర భావముకలిమి శంభుదాసుఁ డనంగాఁ బరగియు గోవిందగుణాదరసంభృత సౌమనస్యధన్యుఁడు"*. కావుననే యాతని రచన లన్నియు గోవిందగుణాదరసంభృతములే యగుచు నాతని హరిహరాద్వైత భావనను జెప్పక చెప్పుచున్నవి. గురుభజన పరాయణుఁడై, సరసబహుపురాణ ధర్మ శాస్త్ర కథా విస్తరవేది యయ్యు వినయోదయభరితుఁ డగుటచే నతులానుభావభవ్యుఁడై ప్రబంధరచనా ప్రావీణ్యము సహజపరిణతసిద్ధముగా వెలయించుకొనిన మహితాత్ముఁడు ఎఱ్ఱయ. అందఱు ప్రతిభాదికము కావ్యహేతువుగాఁ బేర్కొనుచుండఁగాఁ గేవలగురుదైవానుగ్రహమే యీతఁడు పేర్కొనుట గమనీయము. అది యాతని విశిష్ట వ్యక్తిత్వమును వెల్లడిచేయును. హరివంశ కృతిపతి శ్రీ వేమభూపాలుఁ డీతని నిట్లు ప్రశంసించెను :

> **"సకలభాషాకవిత్వవిశారదుఁడవు సాధుసమ్మతుఁడవు నిత్యసౌమ్యమతివి**
> **భవ్యుఁడవు గాననీమీఁదఁబరఁగఁ బక్ష మేను గలిగియుండుదునెప్పు డెఱ్ఱనార్య!"**
> **(హరి వం. పూ. భా. 1.38)**

ఇందుఁ బేర్కొన్న సాధుసమ్మతత్వాది లక్షణములు సత్యదూరములు కావు. ఎఱ్ఱయ తన హరివంశము నందు **"నన్నయ భట్టతిక్కకవినాథులు చూపిన త్రోవ పావనం"** బని (హరి వం.పూ.భా.1.42) వ్రాకుచ్చెను. కావున నాతని మార్గము వారి పద్ధతులలోనే ప్రవర్తించె ననుట స్పష్టము. అతఁడు వారి మార్గములను క్షుణ్ణముగా నవగాహన చేసికొని వారి యడుగు జాడలలోనే నడచెను. కావున వారి కవితాగుణములను బరిశీలించిన పిమ్మట నీతని కవితా గుణముల ననుశీలించుట చర్విత చర్వణమే యనఁదగును. ఈతని వనఁదగిన ప్రత్యేకతలు గూడ లేకపోలేదు. వానినిఁ బేర్కొని యాతనికిని నీరాజన మిచ్చుట కర్తవ్యము.

ఎఱ్ఱయ వర్ణనాప్రియుడు. ఈతని వర్ణనములందుఁ జక్కని భావుకత గోచరించును. తఱువాతివా రభ్యసింపఁదగిన యాలంకారికరచనావిధాన మీ వర్ణనములలో బాగుగా గోచరించును. ఈ క్రింది శరదృతువర్ణనపద్యము నిట నుదాహరణగా గ్రహింపవచ్చును.

"దానాంభఃపటలంబునం బృథుపయోధారావళిం గప్పి గ
ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్ప్రయో
దానికంబు శరద్భయంబున నిగూఢాకారతం డిగ్గె నా
గా నొప్పారె మదోత్కటద్విరదసంఘంబుల్ వనాంతంబునన్." 3.4.144

ఏనుఁగులకు మేఘసామ్యమును జెప్పుట సాధారణము. ఇందది హేతు గర్భితముగా నుత్ప్రేక్షాశోభితముగా నెలకొనుట విశేషము.

ఈ క్రింది పంపాసరోవర వర్ణనము అతిథి జనకమునకే కాక పాఠకునకును బ్రమదాపాది యగుచున్నది :

"కమనీయకమలినీకహ్లారదళకేస రాన్వితజలముల నర్ఘ్యవిధియుఁ
దరళతరంగహస్తములఁ బాద్యంబు, ను న్మదచక్రసారసమధుపహంస
రుతులఁ బ్రియోక్తులు, రుచిరవానీరని వేశనచ్ఛాయల విశ్రమంబు,
మందసంచారితమారుతంబుల నురు తాపనోదనమును దగిలి యెపుడు
నాచరించుచును సమంచితాతిథిజన సేవనమునఁ దనదుజీవనంబు
ఫలము నొంద నొప్పు పంపాసరోవరం బెదురఁ గాంచి రన్నరేంద్రవరులు." 3.6.364

ఈ వర్ణనము రమణీయభావోదాత్తము. ఇందలి జీవన, ఫల శబ్దములు శ్లేష బలమువలనఁ బద్యమునకు దీప్తి నొసఁగుచున్నవి. ఈ పద్యమునకు క్రింది నన్నయ పద్య ముద్బోధకమై యుండనోపును :

"అతిరుచిరాగతుం డయిన యాతనికిన్ హృదయప్రమోద మా
తతముగ నవ్వనంబున లతాలలనల్ మృదులానిలాపవ
ర్జితకుసుమాక్షతావలులు సేసలువెట్టినయట్టి రైరి సం
పతదళినీనినాదమృదుభాషల దీవన లొప్ప నిచ్చుచున్". 1.4.17

ఇట్టి రమణీయము లగు వర్ణన లెఱ్ఱన కవితలో సందర్భోచితముగాఁ గాన వచ్చుచుండును.

బరువైన భావములను ప్రసన్నములగు పదముల కూర్పుతో మంచి ధారాశుద్ధితో హృదయమునకు హత్తుకొనునట్లు చెప్పునే ర్పెఱ్ఱయకుఁ గలదు.

"చవులకుఁ బ్రేముడించు ననిశంబును నాలుక; దాల్మి పెంపు ధ
ర్మువును శమంబు ద్రెక్కొను సముద్ధతి నాఁకలి; వీని రెంటనుం

దవులవు; జీవితస్థితికిఁ దావల మన్నము; నీవు జీవితే
చ్ఛ విడిచి; తిప్పు డేమని ప్రశంస యొనర్తు నినుం దపోనిధీ!" 3.6.123

ముద్గలుఁ డను మహర్షి యుంఛవృత్తిపరాయణుఁడై కృచ్ఛ్రవ్రతముల సలుపుచుండఁగా నాతనిఁ బరీక్షింపఁ గోరి వచ్చిన దుర్వాసుఁ డెందును దోసము వీస మేనిఁ గానక తుది కిట్లు ప్రశంసించెను. ఈ పద్యమునందలి భావ ముదాత్తము. తదనుగుణముగా నిట రచనయుఁ బరమోదాత్తమై హృదయాహ్లాదకమై యలరారుచున్నది.

నీరు తేరఁబోయి తిరిగి రాక కొలనికడఁ బడియున్న తమ్ములఁ గని ధర్మజుఁ డిట్లు దుఃఖించెను :

"పుడమియు సర్వసంపదలుఁ బొల్పఱ వైరులపాలు చేసి యీ
యడవికి వచ్చి భీకరమృగావలిపొత్తున నున్న వీరి నె
న్నడికొని యిట్లు సేసెనె యనాథులఁబోలె విధాత్రుఁ డింక నె
క్కడఁ జనువాఁడ నేది గడఁగాఁ దరియింతు దురంతదుఃఖముల్" 3.7.412

ఇందలి వాక్యవైఖరియుఁ బదములును ధర్మజాలంబక మగు శోకమును రసీభవింపజేయుచున్నవి.

చక్కని వ్యంగ్యార్థవైభవముతో వక్రముగా నభిప్రాయ ప్రకటనము గావింప వలసిన తావులం దెఱ్ఱన యెట్టి వాక్యములఁ బ్రయోగించునో యీక్రింది పద్యమునఁ గాననగును :

"అనునెడ నింద్రుఁ డిట్లనియె: నట్లయినం గడు లెస్స దేవ! నీ
వనిమిషనాయకత్వమునయం దభిషిక్తుఁడవై ముదంబుతో
ననుఁ బనిగొమ్ము నీదుకరుణన్ దొసఁగెల్లను దీఱియుండెదన్
ఘనతరశౌర్యసారుఁడవు గావున నర్హుఁడ వింద్రలక్ష్మికిన్." 3.5.226

తనయెదుట మహామును లందఱు స్కందునిఁ బెద్దఁజేసి యింద్రపదవిఁ జేకొనుమని ప్రార్థించుచుఁ గర్తవ్య ముపదేశించుచుండఁగాఁ దా నింతవఱకుఁ దాల్చినదానిని వీడలేక, కాదనుటకు శక్తి చాలక కష్టపడు నింద్రుని యీవాక్యములు, తాదృశసన్నివేశము లందు సాధారణముగ జనులుపయోగించు వైఖరి కతిసన్నిహితములై యున్నవి. పదవి చేజాఱిపోవుట యిష్టములేనితన మిందుఁ జక్కగా వ్యంజింపఁబడినది.

ఎఱ్ఱయ, నన్నయ తిక్కనల మార్గములలోనే తన రచన సాగించె ననుట కనేకో దాహరణములు గలవు.

(1) సాధారణముగ నన్నయ యేదేని ఉపాఖ్యానమును బ్రారంభించునపుడు కథాప్రధానాంశము సూచించుచు నొక చిన్న పద్యము వ్రాయును. ఉదాహరణ కుదంకోపాఖ్యానారంభము నందలి -

"పంకజభవసన్నిభుఁ డఘ  పంకక్షాళనమహాతపస్సలిలుఁ డనా
తంకమతి పైలశిష్యుఁడు  దంకుం డనుమునివరుండు దద్దయు భక్తిన్."
1.1.93

అనుపద్యమును గైకొనవచ్చును. ఎఱ్ఱనయు నిట్టిమార్గము నవలంబించెను. వ్యాసుఁడు ధర్మజునకు వ్రీహిద్రోణాఖ్యానమును జెప్పుచు నారంభమున -

"అతిథిప్రియుఁడు విశిష్ట  వ్రతుఁడు విమత్సరుఁడు సత్యవచనుండు. విని
ర్జితవిషయేంద్రియుఁడు సము  న్నతపుణ్యుఁడు ముద్గలుఁడు సనాతనబుద్ధిన్."
3.6.114

ఇట్టి కథారంభ మొక తాత్పర్యముతోఁ జేయఁబడినట్లు తోఁచును. రానున్న కథావిశేషమున కంతటికి నిది సూత్రప్రాయము. తఱువాతి కథ యంతయు నీసూత్రమునకు వ్యాఖ్యానప్రాయము. ఇందలి విశేషణముల యర్థమంతయు భవిష్యత్కథలో ననుసంధింపఁబడుట చూడనగును.

(2) నన్నయపలుకుబడియుఁ బదసమాసాద్యనుకరణమును నెఱ్ఱయలో గోచరించుటకు రెండుదాహరణములు :

"ఓరి దుష్టాత్మ! యే నిట్లు పోరఁ బెక్కు  మాఱు లెగువంగ సిగ్గఱి పాఱుచుండు
నట్టి నీ కున్నయునికిన యిట్టలముగ  నిట్టిబీర మెక్కడనుండి పుట్టెఁ జెపుమ."
3.6.375

ఇందలి 'యున్నయునికిన' యను నుడికారము- నన్నయది - యీక్రింది పద్యమునఁ గానవచ్చును :

"బాల వయ్యు నత్యుత్తమశీలవినయ గౌరవాన్వితవై నిర్వికారవృత్తి
నున్ననీ కున్న యునికిన సన్నుతాంగి! సుతుఁడు పుట్టుట యిది గడుఁ జోద్య మయ్యె." 1.3.180

అరణ్యపర్వషష్ఠాశ్వాసమునందలి యొక పద్యమున రెండు పాదములు సంపూర్ణముగా నన్నయవి :

"రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
చయములఁ జంచలత్తురగసైనికమత్స్యములన్"  2.2.33, 3.6.58

ఇట్టివి మఱియు ననేకములు గలవు.

నన్నయసరససారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ జెందెనని యెఱ్ఱయ చెప్పియున్నను నాతనిలోఁ దిక్కనయనుకరణము కూడ నెంతయో కనుపట్టును. పద్యముల యెత్తుగడలో,

పద ప్రయోగవైఖరిలో, సంభాషణల నడపుటలో యుద్ధ వర్ణనములో నీ యనుకరణము బాగుగా దృశ్యమానమగును.

(1) "ఇటు తగునే సుయోధన! మహీవలయంబున నిట్టి దైన్య మె
చ్చట వినఁజూడఁ గల్గెనె? యసంఖ్యులు రాజులు నీకుఁ గాఁగఁ జ
చ్చుటయును బంధుమిత్రులు విశుద్ధచరిత్రులు పోరనట్లు క్రుం
గుటయును జూచి తేమిటికిఁ గ్రుంకితి నీళ్ళను, జావుదప్పునే" 9.2.54

అను శల్యపర్వమునందలి తిక్కన పద్యముతో నీ క్రింది యెఱ్ఱయపద్యమును బోల్చిచూడవచ్చును :

"ఇది దగునే దశానన! మహేంద్రుఁడు లోనగు దేవతాతతిం
గదనములో జయించి త్రిజగంబులఁ బేర్కొనియున్న నీకు ని
మ్మదిత వధింతు నంట గడుమోసము గాదొకొ: యోపుదేని నే
పొదవఁగ రాఘవున్ గెలుపు ముగ్మలిఁ జంపినఁ బెంపు గల్గునే." 3.7.140

అను పద్యమునందలి యలఁతిపదములు తిక్కన పదప్రయోగవైఖరిని దలపింపఁజేయును.

(3) "ఒడలెల్లఁ బిండి కూడుగఁ బొడిచి యెగయ నెత్తి త్రిప్పి భూస్థలిమీఁదన్
బడవైచి యురము మొగమును నడిచెను వడముడి తలప్రహారకుశలుఁడై." 3.6.248

సైంధవుడు చేసిన ద్రోహమునకుఁ గోపావిష్టుఁడైన భీమసేనుని యీవిజృంభణమును వర్ణించునప్పు డెఱ్ఱయహృదయమునఁ గీచకవధ ఘట్టము మెదలియుండ వలయును.

ఘోషయాత్రలో దుర్యోధనుఁడు ఘోరపరాభవము ననుభవించి ప్రాయోపవిష్టుఁడైన సందర్భమునఁ గర్ణశకుని దుశ్శాసనులు చేసిన హితబోధలు తిక్కన సంభాషణా చాతుర్యమును బుణికి పుచ్చుకొన్నవివోలెఁ గనిపించును.

నన్నయ తిక్కనలయందుఁ దనకుఁగల గౌరవాతిశయము నిట్లు ప్రదర్శించిన యెఱ్ఱయ తానుగూడ శ్రీనాథపోతనాది మహాకవులకు మార్గదర్శకుఁ డగుట గాన వచ్చును. క్రియాపదముతో నారంభించి కర్తృపదమును దఱువాత నిడి కర్మ విశేషణములను గర్మవాచకమును నటుపైభాగమున నింపు నొక పద్యరచనా శైలి యెఱ్ఱయతోనే యారంభమైనది. దీనినిఁ దఱువాతికవు లనేకు లనుకరించిరి.

డా॥ పాటిబండ మాధవశర్మగా రీతని మనోజ్ఞశైలి కొక పద్యమును జూపియిట్లు వ్యాఖ్యానించిరి :

"ప్రీతుండై చనుదెంచె నాశ్రితజనాభీష్టక్రియాశీలుఁ డు
ద్గీతామ్నాయుడు, నిర్విధూతదురితక్లేశుండు, యోగామృత

స్ఫీతస్వాంతుఁ డనంతసంతత సమావిర్భూతకారుణ్యధా
రాతోయస్నపనైక శీలుఁడగు పారాశర్యుఁ డచ్చోటికిన్." 3.6.103

"ఈపద్యమునందలి ధార నన్నయదివి, విఱుపులు తిక్కనవి. పదము లిరువురివి, కూర్పు ఎఱ్ఱనది. ఈ పద్యమున కవిత్రయ మున్నది. కవిత్రయమున కాశ్రయమైన వేదవ్యాసుఁ డున్నాఁడు." (అరణ్యపర్వము - అకాడమీప్రతి - పు. 64)

కవిత్రయము వారి కవితావ్యక్తిత్వము లిట రేఖా మాత్రముగఁ బ్రదర్శింపఁ బడినవి. ఈ చెప్పిన యంశమును బట్టి యిమ్ముువ్వురును భారత రచనావిషయమున నేకాత్ములుగా గోచరింతురు. వారు మూలభారతము ననుసరించుటలో నించుమించొకే పద్ధతి నవలంబించిరి. వ్యాసునిది ప్రధానముగ నితిహాసదృష్టి. అందుచితానుచిత విచారణమున కంతగాఁ దావులేదు. ఏలయన నితిహాస కర్తలు శస్త్ర చికిత్సకుల వంటివారు. మానవమస్తిష్కములకుఁ బట్టిన జాడ్యముల వదలించుటలో వా'రిది గ్రాహ్య మిది త్యాజ్య' మని విచారింపరు. సంకోచము లేక యే విషయము నైనను వారు విస్పష్టముగా వచింతురు. కావుననే సంస్కృతభారతమున నెక్కువపాళ్లితిహాసదృష్టియుఁ దక్కువ పాళ్లు కావ్యదృష్టియు గోచరించును.

ఇతిహాస పురాణము లితరభాషలలో రచింపఁబడునపుడు కథకంటెఁ గథనము నకును, యథార్థస్వరూప నిరూపణముకంటె రసప్రసరణ ధోరణికిని, సత్యముకంటె నౌచిత్యమునకును బ్రాధాన్య మీవలయును. అట్టి రచనలలో నితిహాస దృష్టికంటెఁ గావ్య దృష్టికిఁ బ్రాధాన్య మెక్కువ. కవిత్రయమువారి యాంధ్రమహాభారత రచనలో నట్టి కావ్యదృష్టి బాగుగా గోచరించును. కావుననే మూలమును గొన్ని యెడల రసాద్యనుగుణముగ మార్చుట, సంగ్రహించుట, పెంచుట మున్నగునవి యాంధ్ర మహాభారతమునఁ గానవచ్చును. కావ్యదృష్టి యధికముగాఁ గలదు కనుకనే యాంధ్రమహాభారతమున ధ్వని సిద్ధాంత సమన్వయము చేయుట కవకాశము కలిగినది.

ఈ గ్రంథము తృతీయ చతుర్థాధ్యాయములలో ధ్వని సిద్ధాంతముల కాంధ్ర మహాభారతమునుండి యనేకోదాహరణములు చూపఁబడినవి. షష్ఠ సప్తమా ష్టమాధ్యాయములం దింకను ననేకములు చూపఁబడుచున్నవి. ఈ యుదాహరణములు మహాభారతపు పరమోత్తమ కావ్యత్వమును నిరూపించుచున్నవి. ఇట్టి మహోత్కృష్టగ్రంథ మగుటచేతనే దీనికిఁగల ప్రశస్తి తెలుఁగున మఱియొక గ్రంథమునకు రాలేదు. ఇట్టి విశిష్ట కావ్యమునందలి ధ్వని విశేషములను కవిత్రయ ప్రతిభాస్ఫోరకము లనఁదగిన వాని నిటుపై పరిశీలింతము.

ఓమ్

# భారత ధ్వని దర్శనము

## షష్ఠాధ్యాయము
## భట్టారకుని భవ్యవాణి



ధ్వని లక్షణనిరూపణ సందర్భమున శ్రీమదాంధ్రమహాభారతమునందలి యనేక పద్యములు లక్షణస్వరూపావగతికై యుదాహరింపఁబడినవి. ఇంకను నెన్నియో రమణీయార్థప్రతీతిగల సన్నివేశము లామహాగ్రంథమున ననల్పసంఖ్యలో గోచరించుచునే యున్నవి. సహృదయహృదయావర్జకములైన ధ్వన్యర్థములు కొన్ని గ్రంథానుక్రమమున నిటుపై వివరింపఁబడుచున్నవి. సన్నివేశమునకు దీప్తి నొసఁగుచు ముఖ్యార్థమునకు పోషకముగా నుండునర్థసంపద యంతయు కవిప్రతిభోద్దీపితమని భావించుటయే లెస్స. కావున నికముందు వివరింపఁబడు ధ్వనివిశేషములన్నియు నా తాత్పర్యముతోడనే భావింపఁబడినవని గ్రహింపఁదగును. ఆయాయుపాఖ్యానాదులలోని రసభావాదిక మంతయు-తదంతమున సూక్ష్మముగా సూచింపఁబడును. అం దం దుపాఖ్యానాది పరముగా పరిమితకథాభాగదృష్టితో నంగిరసములుగా నిరూపింపఁబడునవన్నియు ప్రధానకథాదృష్టితో పార్యంతికముగా నంగరసములుగనే పరిణమించును. కావున నంగాంగి సంబంధ నిర్ణయము సమగ్రముగాఁ జేయనిచోటులం దెల్ల రసభావాదుల కంగత్వమే సంభావ్యము.

ఇపుడు పర్వాశ్వాసానుక్రమమున నాంధ్రమహాభారతమునఁ గానవచ్చు ధ్వని విశేషములను వరిశీలింతము. అందు ముందు నన్నయభట్టారకుని భవ్యవాణి నీయధ్యాయమునఁ జూడనగును.

**ఆదిపర్వము - ప్రథమాశ్వాసము :-**

ఆంధ్ర మహాభారతరచనచేయు మనిన రాజరాజనరేంద్రుని యభ్యర్థనకు నన్నయభట్టారకుఁడు చెప్పిన సమాధానము :

"అమలినతారకాసముదయంబుల నెన్నను - సర్వవేదశా
స్త్రములయశేషసారము ముదంబునఁ బొందను - బుద్ధిబాహువి
క్రమమున దుర్గమార్థజలగౌరవభారతభారతీసము
ద్రముఁ దఱియంగ నీదను - విధాతృనకైనను నేరఁబోలునే." 1.1.19

ఇందు వర్ణ్యము దుర్గమార్థజలగౌరవభారతభారతీసముద్రము దఱియంగ నీదుట. తారకాసముదయగణనము, సర్వవేదశాస్త్రములయశేష సారగ్రహణము అనునవి యప్రకృతములు. ఈ మూటికిని 'విధాతృనకైనను నేరఁబోలునే' యను దానిచే ధర్మైక్యము చెప్పఁబడినది. ఇట్లు వర్ణ్యావర్ణ్యములకు ధర్మైక్యము చెప్పుట యను దీపకలక్షణ మిందు వాచ్యముగా గోచరించును. దీనిని బట్టి ఆంధ్రభారతరచన తారకాసముదయముల నెన్నుటవలెను, వేదశాస్త్రములయశేషసారమును బొందుట వలెను బహుక్లేశసాధ్యమైన కార్యవిశేష మనునుపమార్థము వ్యక్తమగును. వ్యంగ్యమగు నీ యుపమ వాచ్యమగు దీపకముకంటె నధికచమత్కార సంపాదకము కాదు. కావున నిట నలంకార కృతాలంకారవ్యంగ్యము గుణీభూత మగుచున్నది. మొత్తము మీఁద పద్యార్థము భారతరచన దుష్కరత్వమును ప్రతీయమాన మొనర్చుచున్నది. కావున నలంకార కృతవస్తుధ్వని యిటఁ గలదు.

'అమలినతారకాసముదయంబుల' ననుచోట నక్షత్రములను ఒక్కొక్కటిగా లెక్కిడుట యెట్లును సాధ్యము కాదు. అందు మలినములు కానివై స్పష్టముగా ప్రకాశించువానిని సముదాయములుగా నేర్పఱచుకొని లెక్క పెట్టుటయు దుష్కరమే యను నర్థము స్ఫురించి భారత రచనయందలి శ్రమాధిక్యమున కనుగ్రాహముగా నెలకొనును.

'సర్వవేదశాస్త్రములయశేషసారము ముదంబునఁ బొందను' అనుటలో కొన్నింటి కొంత కొంత జ్ఞానము నెవఁడో యొక్కఁడు పొందవచ్చును గాని అదిసులభసాధ్యము కాదు. ఒకవేళ నెవఁడేని చతుర్ముఖునంతటి వాఁడు పొందినను వాఁడెంతో శ్రమతోఁ బొందవలయునే కాని ముదమునఁ బొందఁజాలఁ డనునర్థము సిద్ధించి దీనితో ధర్మైక్యము గల ప్రకృతమగు భారత రచన కష్టసాధ్యతను దృఢ మొనరించును. మఱియు భారతము సర్వవేద శాస్త్రముల యశేషసార మనునర్థమును నిందు ధ్వనించును. ఈరెంటియందును అర్థశక్త్యుద్భవానుస్వాన వ్యంగ్యము గలదు.

'బుద్ధిబాహువిక్రమముననన్' అను కవిప్రౌఢోక్తి సిద్ధ రూపకమువలన సముద్ర మీదుట కెంత బాహువిక్రమము గావలయునో, భారత రచన కంతటి బుద్ధి విశేషము కావలయుననునర్థము ప్రతీయమానమగును. ఇట్టిది కవి ప్రౌఢోక్తి సిద్ధాలంకారకృత వస్తుధ్వని.

పైని భావించిన ధ్వని విశేషములు నన్నయ భట్టారకుని హృదయమునందలి భారత రచన స్వీకరణ సంబంధమైన త్రాసము, శంక, భారతగౌరవ స్మరణము మున్నగు వ్యభిచారిభావములను పాఠకునిచే నాస్వాదింపఁజేయును.

నన్నయ తన రచనలోని గుణ విశేషముల నిట్లు పేర్కొనెను :

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్." 1.1.26

'ప్రసన్నకథాకలితార్థయుక్తి' యను తన కవితలోని విశిష్ట గుణము సర్వజన సంవేద్యము కాదు. 'విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్' అను న్యాయము ననుసరించి కవులే దాని నారయవలయును. (సంస్కృత భారతమున కవి శబ్దము 'మేధావి' అను నర్థమున పలు పర్యాయములు ప్రయుక్తమై యున్నది) అందును కవి శబ్దవాచ్యున కెల్ల నది గోచరము కాదు. ఉత్తమ శ్రేణికి చెందిన కవీంద్రులే దాని నరయుటలో సమర్థులు. వారైనను అరకొర బుద్ధితో చూచినఁ జాలదు. సారమతితో పరిశీలింపవలయును. పైపైపరిశీలనమున కది యందదు. లోన్ - లోతుగా మిక్కిలి శ్రద్ధతో ననుశీలింపవలయును. ఇంతపని చేసినచో వారు తప్పక మేలనఁగలరు. ఇట్లు ప్రసన్నకథాకలితార్థయుక్తి పరమ గాంభీర్య మీ వాక్య భాగమున ప్రతీయమానమగును.

పరిమిత సంఖ్యలో నుండుకవీంద్రులకే యీగ్రంథ ముద్దిష్టమా? యన్నచో కాదు. ఆ లోతులకు పోలేనివారికి గంగాలహరివలె నాహ్లాద మొదవించునక్షర రమ్యతయు నిందుఁగలదు. ఎల్లవారికి పనికివచ్చు నానారుచిరార్థసూక్తులు నిందుఁ గలవు అనురూపమున నధికారతారతమ్య మిందు వ్యంగ్యముగా వక్కాణింపఁబడినది. ఇట్లు కవితా విషయమున నన్నయకుఁ గల ఆత్మవిశ్వాస మీ పద్యమున ధ్వనించుచున్నది.

యాగదీక్షితుఁడైన జనమేజయునితో సరమ యనుదేవశుని యాతనితమ్ముల యపరాధము నీక్రింది విధముగా నుగ్గడించెను :

**"క్షితినాథ! కడు నకరుణా న్వితులై నీతమ్ము లతివివేకవిదూరుల్**
**మతిఁదలఁపక నాపుత్రకు నతిబాలకు ననపరాధు నడిచిరి పెలుచన్."1.1.85**

ఇందలి 'నీతమ్ము'లనుచోటి సంబంధార్థకము వారి పుణ్య పాపములకు నీవుకూడ భాగస్వామి వనునర్థమును వ్యక్తపఱచును. 'పుత్రకున్, అతి బాలకున్' అనువాని యందలి 'క' ప్రత్యయమును, 'అతి' అనునిపాతమును సరమ దుఃఖమును జక్కగా

నభివ్యంజించుచు నట్టివానినిఁ గొట్టుటయందలి యవివేకమును నొక్కి వక్కాణించును. 'అనపరాధున్' అను పదము 'సాపరాధుఁడైనచో దండించుట సమంజసమే. నిరపరాధుని దండించు టెంత నీచకర్మమో నీవే యూహించుకొను' మనునభిప్రాయమును ధ్వనించును. 'పెలుచన్' అను పదము బాధాతిశయవ్యంజకము. 'క్షితినాథ!' అను సంబోధనము సాభిప్రాయము. ప్రజలయందు వినయాధాన మొనర్చి రక్షణ భరణతత్పరుఁడవు కావలసిన నీ తమ్ములే యిట్లు చేయుట న్యాయమా? అను నధిక్షేపణము గాని మాకుఁజేయఁబడిన యపకారమునకు ప్రతి క్రియ చేయవలసినవాఁడ వను కర్తవ్య బోధగాని యిం దభివ్యక్తమగును. ఇట్లిందు సంలక్ష్యాసంలక్ష్య క్రమ వ్యంగ్యములు సంకీర్ణములై యున్నవి.

సరమయే మఱియు నిట్లనినది :

"తగు నిది తగదని మదిలో వగవక సాధులకుఁ బేదవారల కెగ్గుల్
మొగిఁజేయు దుర్వినీతుల కగు ననిమిత్తాగమంబులైన భయంబుల్." 1.1.86

ఇందు వక్ష్యమాణమహాభారత మూలకథా సారాంశమంతయు నభివ్యక్తమగుచున్నది. సాధువులైన ధర్మజాదులకు దుర్వినీతులైన ధృతరాష్ట్రులు నిరపరాధముగా నెగ్గు లొనరించి సర్వవినాశరూపమగు భయమునందుట యనునంశ మిట ప్రతీయమాన మగును. రుచిరార్థసూక్తి ప్రబంధార్థమును ధ్వనింపఁజేయుట యిందు విశేషము.

కుండలము లిమ్మని యుదంకుఁడు పౌష్యమహారాజును ప్రార్థించెను. దేవి నడిగి తెచ్చుకొమ్మని రాజు పలికెను. ఉదంకుఁ డంతఃపురమునకుఁ బోయి యామెను గానక తిరిగి వచ్చెను. అప్పుడు రాజిట్లనెను :

"భూవినుత! నిన్నుఁ - ద్రిభువన 'పావను - 'నశుచి' వని యెట్లు పలుకఁగనగు న
ద్దేవి పవిత్ర పతివ్రత గావున నశుచులకుఁ గానఁగా దనవద్యా!" 1.1.96

ఒక మాననీయునియం దొక దోషము కానరాఁగా దానిని జెప్పక తప్పని పరిస్థితి వచ్చినప్పుడు దానిని స్ఫురింపఁజేయు వ్యక్తి మనోభావ మీ పద్యమున నభివ్యక్తగును. పౌష్యన కుదంకునియందు గౌరవము కలదు. అతఁడు పవిత్రుఁడనియే యాతని సంభావన కాని పరిశుద్ధులకే కానవచ్చు తనసతి యాతనికిఁ గానరాలేదన్నచో అతఁడశుచి యనుట స్పష్టమేకదా! ఈ విషయము నాతనికిఁ దెలియఁజేయవలయును. వాచ్యముగాఁ జెప్పినచో నాతఁడు కోపోద్రిక్తుఁడు కావచ్చును. కావున దానిని వ్యంగ్యముగాఁ జెప్పెను. 'భూవినుత, అనవద్యా!' అను సంభోదనము లాతని ప్రసన్నతను సాధించుటకు

ప్రయుక్తములైనవి. దీనివలన 'నేను నీయందు దోషారోపణ చేయుటలేదుసుమా!' అను నర్థము ప్రతీయమానమగును. 'అశుచులకుఁ గానఁగాదు' అని సామాన్యముగాఁ జెప్పినను నది ప్రకృతమున వివక్షితము గాక అశుచివైన నీకుఁ గానరాలేదు అను నర్థమును వ్యక్తము చేయును. ఇట్లిందర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని వాక్యమున గోచరించును. మఱియు నుదంకుని పావిత్ర్యమును గూర్చి కలిగిన యనుమానమును వ్యక్తము చేయఁజాలని పౌష్యుని సంకోచము కూడ నిందభివ్యక్తమగును.

ఈయుదంకోపాఖ్యానమునం దుదంకాలంబకమైన ధర్మాచరణోత్సాహము, తన్నిర్వహణమునకై యాతఁడు పడిన పాటులు, ఎట్టకేలకు గురుదక్షిణ కొనిరాఁగలుగుట, నడుమ చేపట్టిన కార్యమును విడువకుండుట మున్నగునంశముల మూలమున పాఠకుని హృదయమున ధర్మవీర మాస్వాద్యమానమై గుర్వారాధన తత్పరత శిష్యునకు ఉత్తమధర్మ మనునుపదేశము నొసఁగును.

ప్రమద్వర సర్పదష్టయై మరణింపఁగా నామె పునర్జీవిత యగుటకు యతించురురుని ప్రార్థనము :

"అపరిమితాజ్ఞఁజేసియు మహాపురుషుల్ విషతత్త్వసంహితా
నిపుణులు మంత్రతంత్రములు నేర్చి విధించియు దీనికిన్ విష
వ్యపగతమైన జీవమిది వచ్చు నుపాయము సేయరొక్కొ; నా
తపముఫలంబు నధ్యయనదానఫలంబులు నిత్తు వారికిన్." 1.1.150

ఇందు చేసియున్, విధించియున్ అనువాని యందలి సముచ్చయార్థకము ఏవిధముగానైనను నాప్రమద్వర బ్రదుకవలయు నన్నరురుని గాఢాభిలాష నభివ్యక్తము చేయును. 'చేయరొక్కొ' అనుదానియందలి నిపాతము ప్రార్థనాదీనత్వము నభివ్యక్తము చేయును. ' నా తపముఫలంబు.... నిత్తువారికిన్' అనుటచేఁ దన కత్యంతానురాగ పాత్రమగు ప్రమద్వరకొఱకై, తాను బహుకాలము శ్రమించి సాధించిన మహాధనము నిచ్చుటకైన వెనుదీయని ధృతిని ప్రతీయమాన మొనర్చును. ఇట్లీ పద్యమున నసంలక్ష్య క్రమమున రురునికి ప్రమద్వరయందుఁగల గాఢానురాగము ప్రతీయమానమై యుత్తమదాంపత్యాదర్శప్రాయస్థితిని వక్కాణించును.

తన ప్రియభామ కెగ్గొనరించె నని రురుఁడు కనఁబడిన పామునెల్ల చంపుచుండఁ గా నొకయెడ డుండుభ మను మహాహి యాతని వారించి యిట్లు పలికెను :

"ఏమికారణమయ్య పాముల కేల యల్గితి వీవు; తే
జోమయుండవు, బ్రాహ్మణుండవు, సువ్రతుండవు; నాపుడుం
బాము లెగ్గొనరించె మత్ప్రియభామ; కేను రురుండ; ను

ద్దామసత్త్వుఁడ; నిన్ను నిప్పుడ దండతాడితుఁజేసెదన్." 1.1.154

ఇందు తేజోమయుండవు; బ్రాహ్మణుండవు; సువ్రతుండవు; అనువాని యునికి వలన వాచ్యముగా సిద్ధించు ప్రయోజన మేమియు లేదు. ఏలయన పాముల కలుగుటలో నివి ప్రతిబంధకములు గానక్కరలేదు. ఇట్లివి యవివక్షిత వాచ్యములగుచున్నవి. కావున నిట నర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని సంభావింపఁదగియున్నది. తేజోమయుఁడవు కావున నీ కెవ్వరు నపకృతిఁ గావించుటకు సిద్ధపడరు. తేజోమయుఁడవు కావుననే హీనసత్త్వములగు పాములవలన నీవు భయపడనవసరము లేదు. ఇట్టి యెడ పాముల కలిగి చంపనేల? కాదిది స్వభావ సిద్ధగుణ మందుమా? అట్లనుటకు నవకాశము లేదు ఏలయన అహింస పరమధర్మ మనుసూక్తి నధ్యయనము చేయవలసిన బ్రాహ్మణుడవు నీవీ హింసకుఁ బూననేల? జన్మమువలన మాత్రమే బ్రాహ్మణుడవు అని తలంచుటకు వీలులేదు. నీ స్వరూపాదికములు పరిశీలించినచో యోగ్యమైన వ్రతాచరణము గలవానివలెఁ గన్పట్టుచున్నావు. ఇట్టియుదాత్త శీలముగల నీవు పాముల కేల యలిగితివి? ఇత్యాద్యర్థమిట ప్రతీయమానమై రురుఁడు పాములఁజంపుటలోని యసమంజసతను వక్కాణించుచున్నది. ఇట్లిందర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని వాక్యమునఁ బ్రకాశించు చున్నది. ఉత్తరార్థమున రురుని సర్పహననోత్సాహము అసంలక్ష్యక్రమమునఁ దోచుచున్నది. 'ఉద్దామసత్త్వుఁడన్' అనుపదము దానికి వ్యంజకము. ఈ ధ్వనికి పైదానితో సంబంధము లేదు కావున నీరెంటికిని సంసృష్టి.

ఈ రురూపాఖ్యానము ప్రాస్తావికముగా భారతమునఁ జెప్పబడినది. జనమేజయుడు చేయు సర్పయాగమును, రురుఁడు చేయు సర్ప ఘాతమును సహస్ర పాదుఁడుడిగించినట్లు, ఆస్తీకుఁ డుడిగించెనని దృష్టాంతముగా సూతుఁడీ కథను జెప్పెను. ఇందు ప్రధానాంశము సర్పమారణవారణమే కాని రురునకు ప్రమద్వరయందుఁ గల ప్రేమాతిశయము చక్కగా వ్యక్తము చేయఁబడినది. అతఁడు సహజముగా నుదాత్తశీలుఁ డేయయ్యును, తన ప్రియురాలికి జరిగిన యెగ్గువలన నకార్యాచరణమున దీక్ష వహించెను. తుదికది యొకానొక సద్బోధవలన విరమింపఁబడెను. ఈ కథను దృష్టాంతముగా జెప్పుటలో 'జనమేజయుని సర్పయాగదీక్షయు నిట్టిదియే. తండ్రి మరణమునకు హేతువైన యొక సందర్భమును బట్టి జాతినాశనమునకు జనమేజయుఁడు కూడ సిద్ధపడెను. తుదికొక సత్పురుషుని హితబోధచే నాతఁడును దనదీక్షను విరమించెను. కావున సజ్జనుఁడు దుష్టప్రేరణముచే నకార్యకరణమునకు దొరకొనినను సాధుజనహిత బోధచే మఱల స్వస్థచిత్తులగుదురు' ఇత్యాద్యుపదేశ మిట నభివ్యక్తమగును. రురుని భార్యా విషయక

ప్రేమాతిశయమును, జనమేజయుని పితృగౌరవమును నిందు వ్యంగ్యముగాఁదోఁచుచు లోకమున కుపదేశము నొసఁగుచున్నవి.

## ఆదిపర్వము - ద్వితీయాశ్వాసము :-

కద్రూవినతలు పన్నిదము సఱచుటకు మూలహేతువైన ప్రసంగము :

"కని కద్రువ వినతంజూచి 'చూడవె; యల్ల యతిధవళంబైన యశ్వంబునందు సంపూర్ణచంద్రునందు నల్లయుంబోలె వాలప్రదేశంబునందు నల్లయైయున్నది;' యనిన విని వినత నగి 'నీ వేకన్నులంజూచితే యక్క!; యెక్కడిది నల్ల; యీ యశ్వరాజమూర్తి మహాపురుష కీర్తియుంబోలె నతినిర్మలంబై యెప్పుచున్నయది' యనిన విని నవ్వి వినతకుఁ గద్రువ యిట్లనియె."

ఇందుచ్చైశ్రవమున కిరువురు రెండుపమానములను జెప్పిరి. వానివలన వారిరువురి స్వభావములును వ్యక్తములగుచున్నవి. కద్రువ కుటిలబుద్ధి, సర్వజన సమాహ్లాదనకరుఁడగు చంద్రునియందు ప్రయత్నపూర్వకముగా మచ్చను బట్టిచూచు స్వభావము గలది. అనఁగా నామె దోషైకదృక్కని భావము. మఱియు నామె అశ్వమునందు పైకిఁ గనిపించు ధావళ్యమును మాత్రమే పేర్కొనినది. ఈ యంశములను బట్టి యామె సుధీగుణమును దురితారూఢము చేయు క్రూరచిత్త యనునంశము ప్రతీయమాన మగుచున్నది.

వినత సాధుస్వభావ, అమె గుణగ్రహణపారీణ, కావుననే యుపమానముగా నీరూపమైన మహాపురుషకీర్తిని గ్రహించినది. తదనుగుణముగ కద్రువ మాటలలో లేని 'రాజు' అను శ్రేష్ఠతావాచక ప్రయోగముకూడ చేసినది. కద్రువ ధావళ్యమును బేర్కొఁనగా వినత నైర్మల్యమును వక్కాణించినది. మలరాహిత్యమును జెప్పుటవలన నల్లయుండుట కాస్కారమే లేదనునర్థము నొక్కి వక్కాణించినట్లయినది. ఇట్లీమె గుణమును శిరసావహించి శ్లాఘించు నుత్తమశీలము గలది.

ఇట్లీవాక్యమున కద్రూవినతల స్వభావతారతమ్య మనంలక్ష్యక్రమమున ధ్వనించుచున్నది.

ఇందు 'నగి' 'నవ్వి' అనుపదముల ప్రయోగము కూడ వ్యంజకమే. వినతనగవు సరళమై నిర్మలమైనది. కద్రువనవ్వు స్థిరమై బరువై యభిప్రాయ గర్భితమైనది. ఈ పదములు కూడ వారి స్వభావ తారతమ్య కథనమునకు వ్యంజకము లగుచున్నవి.

'ఏకన్నులంజూచితే' అను వాక్యమునకు వాచ్యార్థము పొసఁగదు. సాధారణముగ నెవ్వరికైనను దేనిని చూచుటకైనను నుండునది నేత్రద్వయమొక్కటియే. కావున నిట

వాచ్యార్థ మత్యంతము తిరస్కృతమగుచున్నది. 'నీహృదయమునందలి దుష్ట స్వభావమును గనుల ద్వారమున వెలిగ్రక్కుచున్నా'వను నర్థమిట ప్రతీయమాన మగును. కావున నిందు అత్యంత తిరస్కృత వాచ్యధ్వని గలదు. ఈరెండు ధ్వనులకును పరస్పరాధారాధేయ భావము లేదు కావున సంసృష్టి.

గరుత్మంతుఁ డతి ప్రయత్నమున సాధించిన యమృత కలశము నురగులకుఁ జూపి యిట్లు పలికెను :

"అనిమిషనాథసుగుప్తమ యిన యమృతముఁ దెచ్చి మీకు నిచ్చితి; నస్మ
జ్జననీదాస్యము వాసెను - దినకరపవనాగ్నితుహినదీప్తులకరిగాన్." 2.2.120

'అనిమిషనాథసుగుప్తము' అను విశేషణము గరుత్మంతుని సామర్థ్యమును, అమృతమును సాధించుటలో నాతఁడు పడిన శ్రమాధిక్యమును జక్కగా నభివ్యక్తము చేయుచున్నది. అమృతరక్షకు లనిమిషులు. అమృత సంరక్షణ విషయమున ననిమిషత్వము వారికి దైవదత్తమగు విశిష్ట లక్షణము. వారికి నాథుఁడగు నతఁడు సహస్రాక్షుడు. అతఁడు దానిని మిక్కిలి భద్రముగా గుప్తము చేసెను. 'సు' అను నుపసర్గ మిచట వ్యంజకము. 'గుప్తము' అనుపదమునందలి ధాత్వర్థమును (గుపూ. రక్షణే) 'క్త' అను కర్మార్థక ప్రత్యయమును అమృతము దేవతల కీప్సితతమ మను నర్థమును వ్యంజించును (కర్తు రీప్సితతమం కర్మ, పాణి. సూ). అట్టిదానిని దెచ్చుట యెంత శ్రమాపాదకమో, యెంతటి సమర్థున కది సాధ్యమగునో యూహింపుఁ డనుతీరున వైనతేయుని సామర్థ్యాదిక మిట నభివ్యక్త మగుచున్నది. ఇది భావధ్వని.

'మీకున్' అనునది 'అకారణముగా వంచించి మాతల్లిని దాసిగాఁ జేసికొని సుఖమనుభవించుచున్న కుటిలబుద్ధులగు మీకు' ననునర్థాంతరమున సంక్రమిత వాచ్యమగుచున్నది.

'ఇచ్చితిని' 'పాసెను' అనుక్రియలయందలి భూతార్థక ప్రత్యయములవలన 'నాపని అయిపోయినది. ఇఁక మాబాధ్యత యేమియు లేదునుమా!' అను నిష్కర్ష వ్యంజితమగును.

'ధర్మవిరోధము కాకుండ నిది సాధించితిని. ఇంకను మీ రేవేని కుయుక్తులు పన్నినచో నా పరాక్రమముముందు అనిమిష నాథుఁడే చాలలేదు, మీరన్న నొక లెక్కయా? కాన నిటుపై మాయందుఁ గౌటిల్యము నెఱపకుఁ' డన్న తర్జనము కూడ నీ వాక్యార్థముచే ప్రతీయమానమగును.

దినకరపవనాగ్ని తుహినదీప్తులను సాక్షులనుగాఁ బేర్కొనుటచే 'నాపూన్కి దేశకాలాబాధితము. కావున నెందును మీరింక నాపై నెపము పెట్టఁజాల' రను నర్థము వ్యక్తమగును.

'అస్మజ్జననీ' అనుసమాసమునకు తత్పురుషార్థమును, ద్వంద్వార్థమును రెండును భావింపనగును. తత్పురుషార్థమువలన 'నిజమునకు పన్నిదము సఱచి మాయమ్మమాత్రమే దాసియై యుండఁగా మీయమ్మ ప్రభుత్వ మేర్పడ నన్నును దాసునిగాఁ జేసికొనినది. నేను మా యమ్మ క్షేమమునకై దాస్య మొనరించితిని. కావున నామె దాస్యమును బోఁగొట్టుటయే కర్తవ్య' మనునర్థము స్ఫురించును. ద్వంద్వార్థమువలన నేనును దాసుడనే యని మీరనుకొన్నచో నదియుఁదీఱిన' దను నర్థము సిద్ధించును. ఇట్లే పద్యమున భావించిన కొలఁదియు ననేక విశేషార్థములు స్ఫురించుచుండును.

సర్పయాగప్రసంగమును బట్టి ప్రాస్తావికముగా గరుత్మదుపాఖ్యానము చెప్పఁబడినది. ఇందు ప్రధాన రసము ధర్మవీరము. మాతృదాస్య నిరాసార్థము వైనతేయుఁ డొనరించిన మహాద్భుత కృత్యముల యుత్సాహ మిందు స్థాయిభావము. తల్లి దాస్యమును బట్టి సమర్థుఁడయ్యుఁ దాను నురగులకు దాస్యము చేయుట, దాస్యము పాయు నుపాయ మురగుల నడుగుట, వారు చెప్పిన యతిదుష్కరకార్యమును జేయఁబూనుట, అమృతమును సాధించుట మున్నగు నంశములన్నింటిని బట్టి యాయుత్సాహము వీరరసముగా నాస్వాద్యమానమగుచున్నది. గజకచ్ఛపగ్రహణము, అమృత రక్షణము చేయునురగుల నణఁగఁద్రొక్కుట మున్నగు విస్మయహేతు విషయములను బట్టి యేర్పడు నద్భుతరసమును, దేవతలతో యుద్ధము చేసినప్పటి యుద్ధోత్సాహమువలన నగు యుద్ధవీరమును, వాలఖిల్యాదిమునులను పరిరక్షించుట, మ్రింగినవిప్రుని నిషాదితోఁగూడ వెడలఁగ్రక్కుట మున్నగు విషయములను బట్టి యేర్పడు దయావీరమును మున్నగునవి అంగియగు ధర్మవీరమున కంగములై దానిని పోషించుచున్నవి. మాతృసేవా తత్పరతయు, తదానంద సంధాయకతయు మానవుని పరమోన్నతస్థితికి హేతువు లను ధర్మ మీయుపాఖ్యానమువలన సహృదయ హృదయనిష్ఠితమగును.

వాసుకి సర్పకులమునకు రానున్న ప్రళయమును దలఁచి విషణ్ణహృదయుఁడై తనవారితో నిట్లు పలికెను:

> "చిరముగ బ్రహ్మకుం దపముసేసి యనంతుఁ డనంతధారుణీ
> భరగురుకార్యసక్తుఁడయి పన్నగముఖ్యులపొత్తువాసి చె
> చ్చెరఁ దనయంతనుండి మదిఁజేర్చి తలంపడ యొక్కనాఁడు దు
> ర్భరతరదందశూకకులభావిభయప్రవిఘాతకృత్యముల్." 1.2.129

ఇంద కుటుంబమున కంతటికిని పెద్దవాఁడయి మేలుగీ ళ్ళరయవలసినవాఁడు సంసారభారమును వహింపక తనదారిఁ దాను జూచుకొనఁగా నాతనియందు తక్కిన వారికిఁ గలిగెడు నొకవిధమగు నమర్షమును, అందు సమర్థుడు కార్యభారము తనపై

మోపుకొనుటకై తక్కినవారి యంగీకారమును సంపాదించుటకుఁ జేయు ప్రయత్నమును నసంలక్ష్యక్రమమున వ్యక్తములగును. ఇట్లని వాసుకి చిత్తశుద్ధి నిట శంకింపఁబనిలేదు. అనంతుని యుదాసీనభావమువంటిది తనకు లేదని చెప్పుటయే యాతని తాత్పర్యము. 'అనంతుఁడు బహుకాలము పరమేష్ఠినిగూర్చి తపమొనర్చి చాల మంచిపదవియే సంపాదించెను. సంతోషమే, కాని తల్లియుఁదమ్ములు నేమైరో యని కొంచెమేనియుఁ బట్టించు కొనెనా? పట్టించుకొనకపోవుటయే కాదు, వారి పొత్తే వానికి పడదాయెను. ఏమేని చేయకపోయినను మనసునందైన నొక్కనాఁ డైన తనవారలకగు ప్రళయమును దలఁ చెనా? పోని మ్మిదియేదో స్వల్పమైన కీడని యూరకుండెనందమా? కాదుకదా? రానున్న ఆపద దుర్భరతరము. ఒకరిద్దఱకా? కాదు కులమునకంతటికిని సంబంధించినది. ఎంతకష్టమైనను గడచి గట్టెక్కితి మనుటకు వీలులేదు. అది భవిష్యత్తున జరుగనున్నది. ఒక మహాపద రానున్నదని తెలియుట అనుక్షణమును గుండెను పిండిచేయునుకదా: ఇంతటి ఘోరవిపత్తు నాతఁడు పట్టించు కొనక యెట్టున్నాఁడోకదా! ఇత్యాద్యర్థము కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తి మూల వస్తుధ్వనిగా వాక్యమునఁ బ్రకాశించి పైనుటంకించినయమర్షాదిభావధ్వని కనుగ్రాహకముగా నెలకొనును. ఈపద్యమునందలి 'చేసి, పాసి, ఉండి' అను క్త్వార్థకక్రియల బాహుళ్యము శేషుని యుదాసీనభావము నైశ్చల్యమును జక్కగా వ్యంజించుచు వాసుకి యధిక్షేపణమునకు సహకరించుచున్నది. 'చెచ్చెరన్, తనయంతనుండి, మదిఁజేర్చి, ఒక్కనాఁడు' అనుపదములు వ్యజ్యమానమగు నమర్షమున కుద్దీపకములు.

మహాభారత కథాశ్రవణ కుతూహలము నిండారిన జనమేజయుని జీవనము నందలి కీలకఘట్ట మనఁదగిన నర్పయాగ వృత్తాంతము ఆదిపర్వ ప్రథమ ద్వితీయాశ్వాసముల యందు పఱచుకొని యున్నది. సర్పముల దురాగతముచే ప్రాణములు కోల్పోయి 'దివిజాధిపలోక నివాసుఁ'డైన తన జనకునకును, గురుకార్యనిరతుఁడై సర్పముచే నపకృతిఁబొంది తన్నాశ్రయించిన యుదంకునకును సాధుమతంబుగఁ బ్రీతిఁజేయుటకై జనమేజయుఁడు సర్పయాగము చేయఁబూనెను. పితృదేవతా భూదేవతా పరితృప్తియను లక్ష్యముచేఁ జేయఁబడినదగుటచే నిందును ధర్మవీరమే సంభావ్యము. ఆస్తీక ప్రార్థనముచే యజ్ఞము నడుమన ఉపసంహరించుటయు నాతని ధర్మపరిరక్షణోత్సాహమునే యుగ్గడించును. సర్పముల శోకము, అవి యగ్నియందుఁ బడుటచేఁ గలుగు విస్మయము మున్నగునవి యీధర్మవీరమున కంగములు. ఉదంకుని ప్రేరణ ముద్దీపకము, శమీకపుత్రుఁడగు శృంగిచేఁ బ్రేర్యమాణుఁడైన తక్షకుఁడు కాశ్యపుని మరలించుట,

ఉపాయముచే పరీక్షిత్తునిఁ జేరుట మున్నగు నంశములు వినుటకూడ జనమేజయుని యాగకరణోత్సాహమున కుద్దీపకమే. ఇట్లిందు ధర్మవీరము ప్రధానముగా నాస్వాద్య మగును.

## ఆదిపర్వము - తృతీయాశ్వాసము :-

## వ్యాసభగవానునియవతారకథనము :

"పరమేష్ఠికల్పుఁడగు న ప్పరాశరు సమాగమమునఁ బరమగుణైకా
భరణకు ననవద్యమనో హరమూర్తికి సత్యవతికి నమ్మునిశక్తిన్."

"సద్యోగర్భంబున నహి మద్యుతితేజుండు వేదమయుఁ డఖిలమునీం
ద్రాద్యుఁడు వేదవ్యాసుం డుద్యద్జ్ఞానంబుతోడ నుదితుం డయ్యెన్."

1.3.43, 41

ఈపద్యములందు నత్యవతీపరాశరులకును, తత్సమాగమోదితుఁడైన వేదవ్యాసునకును గల విశేషణములు విశిష్టార్థవ్యంజకములు. పరాశరుఁడు పరమేష్ఠి కల్పుఁడు. కావుననే నత్యవతియందు కామవ్యామోహితుఁడయ్యును అఖిలదృష్టి పథరోధినీహారతిమిరమును సృజించుటయు, కన్యాత్వము చెడకుండున ట్లనుగ్రహించు టయు, వేదమయుఁడైన పుత్రుని సద్యోగర్భమున నుత్పాదించుటయు సంభవములైనవి. సత్యవతి పరమగుణములే యాభరణములుగాఁగలది. అనఁగా కృత్రిమసౌందర్యము లేని సద్గుణవతి యని తాత్పర్యము. ఎందును దోషములేని అత్యంత మనోజ్ఞమైన మూర్తి కలది. అనఁగా నామె యంతర్బహిస్సౌందర్యములు జితేంద్రియుఁడైనమునికిని మోహజనకములగుటయందలి యౌచిత్య మీరెండు విశేషణములను బట్టియు ప్రతీయమానమగుచున్నది. ఇట్టి పరమపవిత్రశీలుర నమాగమమువలనఁ బుట్టినవాఁ డు తల్లి అనవద్యరూపమునుబట్టి అహిమద్యుతి తేజుఁడగుటయు; పరమేష్ఠి కల్పుఁడగు తండ్రి శక్తివలన వేదమయుఁడు, నఖిలమునీంద్రాద్యుఁడు నైయుద్యద్ జ్ఞానముతో నుదయించుటయు విస్మయహేతువులు కానోపవు. ఇట్టి పుత్రరత్నమువలన సత్యవతీ పరాశరుల నమాగమము తదితరాక్రమ స్త్రీపురుష సమాగమమువలె లోకనింద్యముకాదను కవిఅభిప్రాయ మిట వ్యంగ్యమగును.

హోమధేనువులఁ గాచుటకు వనమేఁగిన కచుఁడు తిరిగి రాకుండుటకు 'దేవయాని తనమనంబున మలమల మఱుంగుచుఁ' దండ్రికడకుఁ బోయి యిట్లు పలికెను.

"వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁగ్రుంకె; ధేనువుల్
నేఁ డిటవచ్చె నేకతమ; నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్

పోఁడిగ వేల్వఁగాఁబడియెఁ బ్రొద్దునుబోయెఁ; గచుండు నేనియున్
రాఁడు; వనంబులోన మృగరాక్షసపన్నగబాధనొందెనో." 1.3.112

ఇందు కచుఁడు రాలేదన్నశోకము, ఆ విషయము తండ్రి పట్టించుకొనలేదన్నబాధ, దానితోఁ దండ్రియెడఁ గలిగిన మృదుకోపము, అతని కేమి బాధకలిగెనో యన్న శంకాదైన్యములు మున్నగునవి యసంలక్ష్యక్రమమున ప్రతీయమానములగుచు దేవయానికిఁ గచునిపైఁగల అభిలాషరూపరతి అభివ్యక్తమగుచున్నది. 'వాఁడిమయూఖముల్ గలుగువాఁడు' అనుపదముచే 'కచుఁడు రాకయే సూర్యుఁ డస్తమింపనేల?' అను భావము వ్యక్తమగును. ఈ ప్రతీతికి 'కలుగు' అను తద్ధర్మార్థక విశేషణము వ్యంజకము. 'అపరాంబుధిఁ గ్రుంకెన్' అనుటలో అస్తమయము సంపూర్ణముగా నయినది. చీఁకటులు క్రమ్ముచున్నవి. పాప మాతఁడెట్లు వచ్చునో యనుజాలి వ్యక్తమగును. 'ధేనువుల్ నేఁడిట వచ్చె నేకతమ' అనుటచే తమతో కలసి వనమున కేఁగినవాఁడు రాకుండ నివి మాత్ర మేలరావలయును? సహచరునితోఁ గూడి రావలయునన్న వివేకము వీనికి లేకపోయినదిగదా! యను నిర్వేదము స్ఫురించును. కామార్తులవలె శోకార్తులును చేతనాచేతనములయందును పశుపక్షిమనుష్యాదులయందును ప్రకృతి కృపణత్వము కలిగియుండుట సహజమే కావున కామశోకార్తయైన దేవయాని యిట్లు సంభావించె ననుట కృతకము కానోపదు. 'నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్ పోఁడిగ వేల్వఁగాఁబడియెన్' అనుటలో నీకు నీ అగ్నిహోత్రములపై నున్న అభిమానము పాపమా పిల్లవానియందు లేదుకదా! పరులబాలకుఁడు, నన్నాశ్రయించినవాఁడు ఏమాయెనో యేమో యన్న దిగులులేక నీ అగ్నిహోత్రసమర్చనము చెదరని మనస్సుతో(నిష్ఠమెయిన్) యథావిధిగ తన్మయత్వముతో నొకింతయు లోపము లేకుండునట్లు (పోఁడిగ) చేసికొంటివి' అను నార్తియు నధిక్షేపణమును వ్యంగ్యములు. ఇచట కర్మార్థక ప్రయోగము కూడ వ్యంజకమేయై శుక్రాచార్యునికి అగ్నిహోత్రార్చనవే యీప్సితతమ మన్న అభిప్రాయమును వ్యంగ్యమొనర్చుచు దేవయానీదుఃఖము నినుమడింపఁ జేయుచున్నది. 'కచుండునేనియున్ రాఁడు' అనుచోటి 'నేని' యనునిపాతము లోకములో సర్వవ్యాపారములును, యథాకాలముగ సాగి పోవుచున్నవి కాని కచుఁడు మాత్రము కాలానుగుణముగ రాలేదు అనునర్థమును వ్యంజించుచు 'మృగరాక్షసపన్నగబాధ నొందెనో' యను శంక కుపస్కారక మగుచున్నది. ఇట్లీపద్యమున దేవయాని నిర్వేదము, ఆర్తి, శంక, దైన్యమున్నగు వ్యభిచారి భావములు స్ఫురించి అభిలాషరూప విప్రలంభశృంగారమును, సోదరప్రాయుఁడగు వానియందు ప్రవృత్తమగుటచే ననుచితమై యాభాసత నొందిన దాని నభివ్యక్తము చేయుచున్నది.

కచుని రెండవమాఱు రాక్షసులు చంపి యాతనిబూది శుక్రాచార్యునిచే త్రావింపఁ

గా దేవయాని విషయమెఱుఁగక దుఃఖించుచుండెను. అతనికి సుగతి కలుగును. నీవు విచారింపనేల? యని తండ్రి పలుకఁగా దేవయాని తండ్రితో నిట్లనియెను :

"మతి లోకోత్తరుఁడైన యంగిరసుమన్మం, డాశ్రితుం డా బృహ
స్పతికిం బుత్త్రుడు; మీకు శిష్యుఁడు; సురూపబ్రహ్మచర్యాశ్రమ
వ్రతసంపన్నుఁ; డకారణంబ దనుజవ్యాపాదితుండైన న
చ్యుతధర్మజ్ఞ! మహాత్మ! యక్కచున కే శోకింప కెట్లుండుదున్". 1.3.118

ఈ పద్యమునందలి 'బృహస్పతి', 'మీకు' అనుపదము లర్థాంతర సంక్రమిత వాచ్యములు. 'ఎవ్వఁడు త్రిలోకాధిపతి యగు దేవేంద్రునికి గురువై యాతని యోగక్షేమము లరయుచు బుద్ధిమద్వరిష్ఠుఁ డని కీర్తినొందెనో యాబృహస్పతికి పుత్రుఁడు - ఎవఁడు మృతసంజీవనీవిద్యాబలమున రాక్షసరాజునకు మంత్రియై తన శక్తియుక్తులచే రాక్షసుల కెట్టిబాధలు రాకుండ కాపాడు సామర్థ్యము కలవాఁడో, ఎవ్వనిబుద్ధి కుశలత దేవతలకుఁ గూడ భయకారణమో యట్టిమీకు శిష్యుఁడు' - అను నర్థము లిట వ్యంగ్యములు.

అంతటివారికి సంబంధించిన వాఁడిట్లకారణముగ మృతిచెందుటయా? పోనీ, వాని పూర్వులును, గురువును గొప్పవారే కావచ్చును. వాని యోగ్యత సరిగానుండవలయును గదా! అందువేమో, దానికేమి లోపము. అతఁడు సురూపబ్రహ్మచర్యాశ్రమవ్రత సంపన్నుఁడు, ఇష్టుఁడో, కష్టుఁడో తానెఱిఁగినవాఁడు మరణించినను శోకము పుట్టునే, సురూప బ్రహ్మచర్యాశ్రమ వ్రతసంపన్నుఁడై, ఆశ్రితుఁడైన వాఁడు మరణింపఁగా నదియు నకారణముగా క్రూరాత్ములచే సంభవింపఁగా శోకింపకుండు టెట్లు అను వస్తు విట ప్రతీయమానమగును.

'అచ్యుతధర్మజ్ఞ!' 'మహాత్మ!' అను సంబోధనములలో ఇట్టివాఁడు మరణింపఁగా నుపేక్షచేసిన నీవు అచ్యుత ధర్మజ్ఞుఁడ వెట్లగుదువు? మహాత్మత నీయం దూహింపనగునా? అను కోపముతోఁ గూడిన యధిక్షేపణముగాని, అచ్యుత ధర్మజ్ఞుఁడవు గావునను మహాత్ముఁడవు గావునను కచుఁడేమాయెనో విచారించి యాతనిఁ దెచ్చి నాశోకము నపనయింపు మనుప్రార్థనముగాని అభివ్యక్తమగును. ఇందన్యతరమును ప్రమాణీకరించుట కుపాయములేదు గావున నీ రెండు ధ్వనులకు నిట సందేహసంకరము.

'శోకింప కెట్లుండుదున్' అనుదాని యందలి తాచ్ఛీల్యార్థక ప్రత్యయముచే కచుఁడు కానవచ్చువఱకుఁ దనదుఃఖ మిట్లే యుండునను నభిప్రాయము వ్యజ్యమానమగును. దీనికిఁ బైఁజెప్పినధ్వనులతో సంసృష్టి.

శర్మిష్ఠతో కలహించి యామెచే నూతఁదోయఁబడిన దేవయాని యాదృచ్ఛికముగా నటకు వచ్చిన యయాతిమహారాజుఁ గాంచి సంప్రశ్నితయై యిట్లు పలికెను :

"అమరసన్నిభ! యేను ఘోరసురాసురాహవభూమి న
య్యమరవీరులచేత మర్దితులైన దానవులన్ గత
భ్రములఁగాఁ దనవిద్య పెంపునఁ బ్రాప్తజీవులఁ జేసి య
త్యమితశక్తి మెయిన్ వెలింగిన యట్టిభార్గవుకూఁతురన్."    1.3.142

దేవయాని వచ్చినవాఁడు యయాతిమహారాజని యెఱిఁగినది. కచునిశాపము వలన తన కెట్లును బ్రాహ్మణేతరునితో వివాహము తప్పదు. అట్టియెడ నీమహారాజు కంటె తనకు వరణీయుఁడెవ్వఁడు? కావున నేకాంతమున నాతనికిఁ దనవైభవముఁ దెలిపి వశీకరించుకొనవలయును. ఈ తాత్పర్యము దేవయానిదగు నీ వాక్కునఁ గలదు.

'అమరసన్నిభ' అను సంబోధనమే యాతని రూపైశ్వర్యాదిలక్షణములను బ్రశంసించి యాతనియందుఁ దన కుదయించుచున్న యనురాగమును దెలుపుటకుఁ బ్రయుక్తమైనది. అథవా, నేనింతకుముం దమరుని వరించితి నది విఫల మాయెను. కావున తత్సదృశుఁడగు నీతని నైన లోఁగొనవలయు ననునాలోచనమునైన నిది యభివ్యక్తము చేయును. తక్కిన వాక్యమంతయు శుక్రాచార్యుని ఘనత నుగ్గడించుచున్నది. తన్మూలమునఁ దన ఘనతయు నభివ్యక్తము కావలయును. 'మాతండ్రి యెట్టివాఁడో తెలియునా? చచ్చినవారిని బ్రదికించుసామర్థ్యము గలవాఁడు. అందును రాక్షసులను బ్రదికించును. వారును జరారోగములచే మృతిఁజెందినవారు కారు. ఘోరమైన దేవదానవుల యుద్ధము జరుగుతావున సుప్రసిద్ధులైన అనేకదేవతా వీరుల చేత నుగ్గునూచఁగా గొట్టబడి (మర్దితులై) మరణించిన రాక్షసులను బ్రదికించును. అనఁగా నేమో తెలియునా? వారి అవయవములు చెల్లాచెదరై పుట్టకొకటి గట్టుకొకటిగాఁ బడియుండ, కొన్ని లభింపక, యేది యెవ్వరిదో తెలియక గజిబిజిగా నున్న స్థితిలోఁ గూడ వారిని బ్రదికించు శక్తి మానాయనకుఁ గలదు. అంతేకాదు, బ్రదికిన వెంటనే వారికి శరీరబాధ యేమియు నుండదు. వారు గతభ్రములగుదురు. ఇదియంతయు నాయునకుఁగల యొక అపూర్వ విద్యామాహాత్మ్యము. ఆ విద్యతో నాతఁ డత్యద్భుత శక్తిగలవాఁడై దేదీప్యమానముగా వెలుఁగు చుండును. నీవును మహారాజవు గదా! యుద్ధములలో దఱచు పాల్గొనుచుందువు గదా! నీకీవిద్య యవసరమగునేమో యాలోచింపుము. అతని వంశము కూడ చాల ప్రశస్తి వహించిన భృగు వంశము. అట్టి మహానుభావుని కూఁతురను' - ఇత్యాదివిధముగ తన యాభిజాత్యగర్వమును వెలయించుటయును, అతని రూపసంపద నుగ్గడించుటయును, నాతనిని ప్రలోభపెట్టుటకు ప్రయత్నించుటయు మొదలగు నంశము లిందభివ్యక్తమగును. కావుననే శర్మిష్ఠతోడి తన కలహమును పేర్కొనక ప్రమాదవశంబున

నిన్నూతఁ బడితి నని మాత్రమే చెప్పెను. దీనినిబట్టి యయాతియం దామెకుఁ గలిగిన యభిలాషము ప్రతీయమానమగును.

యయాతి దేవయాని నుద్ధరించిన విధము :

"జలధివిలోల వీచివిలసత్కలకాంచినమంచితావనీ
తలవహనక్షమం బయిన దక్షిణహస్తమునం దదున్నమ
ద్గళదురుఘర్మవారికణక్రమకరాబ్జమువట్టి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్." 1.3.144

ఈ పద్యమునందలి యయాతిదేవయానుల హస్తములకుఁ గల విశేషణములను బట్టియు, 'ప్రీతితోన్' అనుపదమును బట్టియు పరస్పర పాణిసంసర్గము వలన వారిరువురియం దుద్బుద్ధమయిన రతి యభివ్యక్తమగుచున్నది. 'జలధి.... క్షమము' అను యయాతి హస్తవిశేషణమును బట్టి పైకి లాగినపు డామె దానిని భావించువైఖరి యిదియని చెప్పనొప్పును. ఇట్లిది దేవయాని రతి కుద్దీపకము. తదున్నమద్గళదురుఘర్మ వారికణక్రమకరాబ్జము' అను దేవయానీహస్త విశేషణమువలన నామెకుఁ గలిగిన స్వేదోద్భవమను సాత్త్వికభావము చెప్పఁబడినది. స్వేదమిట శ్రమ సంభూతము కాదనుటకు క్రమశబ్దము, అబ్జసాదృశ్యమును ప్రమాణములు. 'కోమలి' అను విశేషణముచే యయాతి హస్తసంసర్గమువలన నామె యానంద పరవశయై పరమసుకుమార దేహము గలదియై లఘుత్వమును భజించెనన్న యర్థము గమ్యమాన మగును. ఇట్లు వారియువురకెఁ దత్కాలమున జనించిన యభిలాష మీపద్యమున వ్యక్తమగుచున్నది. భావోదయ ధ్వనిగా దీనిని పరిగణింపనగును. తదనంతరకథాభాగమున దీనికి పుష్టి యేర్పడకుండుటచే నిట్లు సంభావించుటయైనది.

శర్మిష్ఠాదికన్యకావరివృతయై యున్న దేవయానికడకు యయాతి యాదృచ్ఛికముగా వచ్చెను. అతఁడు దేవయాని నింతకుమున్న యెఱుఁగును. కాని 'అతిశయరూపలావణ్యగుణసుందరి' యైన శర్మిష్ఠ నెఱుఁగఁడు. ఆమె నెఱుఁగ వేఁడి యందఱ కులగోత్రనామంబు లడిగెను. దానికి దేవయాని చెప్పిన సమాధాన మియ్యది :

"నన్ను మున్న యెఱుంగు-దిన్నాతి నాకు దాసి-వృషపర్వుఁడను మహాదానవేంద్రు
కన్య-నాయొద్ద నెప్పుడుఁగదలకుండు ననఘ! మఱి దీని శర్మిష్ఠ యండ్రు జనులు."
1.3.159

యయాతి శర్మిష్ఠనే యెఱుఁగవేఁడె నన్నవిషయమును దాను గుర్తించితినని చెప్పుటయు, నది తనకు (యయాతికి) సముచితముగాదని యధిక్షేపించుటయు నీపద్యమునందు దేవయాని వ్యంగ్యముగా సాధించినది. 'నన్ను మున్న యెఱుంగుదు'

వనుటచే నీ వందఱకులగోత్రనామములడుగుట యిచ్చకముసుమా! శర్మిష్ఠను మాత్రమే నీ వెఱుఁగఁగోరితివి, ఆ మాత్రము గుర్తింపఁజాలనా? అను నీర్ష్యతోడి యమర్షము ప్రతీయమానమగును. ఇఁక నీవెవ్వరి నెఱుఁగఁదలఁచితివో దానిసంగతి చెప్పెదను వినుము. అది యెంత తళతళలాడిననేమి, నాకు దాసి. వృషపర్వుఁడను మహాదానవేంద్రుని కూఁతురయ్యు నవివేకముగాఁ బ్రవర్తించి పాప మిప్పుడు దాస్యము ననుభవించుచున్నది. కావున దీనిపై నిప్పుడు నీ వాశపెట్టుకొనకుము! అను నవహేళనముతోడి హెచ్చరిక వ్యంగ్యము. నా యొద్ద నెప్పుడుఁ గదలకుండు ననుటలో దీనికి స్వాతంత్ర్యము లేదు. ప్రతివిషయమునందును నిర్ణయము నాది సుమా! అనునర్థము గమ్యము. అథవా, నన్ను వివాహమాడినచో నీమె నాకడనేయుండును గావున నీ కుపభోగ్య కావచ్చు నను నర్థము కూడ సంభావ్యమే. సాధారణముగ నేస్త్రీ కూడ నిట్లు తనతోపాటింకొక స్త్రీ నెఱపెట్టి మాటాడదు గాని,

"నన్ను వివాహమై నహుషనందన! యీలలితాంగి! దొట్టి యీ
కన్నియ లందరున్ దివిజకన్యలతో నెనయైనవారు నీ
కున్నతిఁబ్రీతిసేయఁగ నృపోత్తమ! వాసవుఁబోలి లీలతో
ని న్నరలోకభోగము లనేకము లందుము నీవు; నావుడున్." 1.3.161

అను వక్ష్యమాణపద్యార్థములచే తన కోరిక తీర్చుకొనుటకు దేవయాని యిట్లాసపెట్టుటకును సంకోచింపని స్వభావముగలదని సంభావింపవలసియున్నది. 'అనఘ'! అనుసంబోధన మెత్తిపొడుపు. ప్రధానవ్యక్తిని, పూర్వపరిచితను నగు నన్ను వదలి నాదాసిని గూర్చి అడుగుచున్నాఁడ వెంతపుణ్యాత్ముఁడవు? అను నధిక్షేపణ మిందు వ్యంగ్యము. ఇట్లీ పద్యమున దేవయాని యహంకారము, అసూయ, ప్రలోభ పెట్టు లక్షణము, మున్నగుభావము లభివ్యక్తము లగుచున్నవి. ఈ వ్యంగ్యార్థము నాలోచించుటకు, అడిగిన కులగోత్ర నామములకు సంబంధింపని విషయములను ప్రస్తావించుట, తన యతిశయంమును మాత్రమే యుగ్గడించు తాత్పర్యము గోచరించుటయు మున్నగునవి హేతువులు. దేవయాని స్వభావమిట్టిదే యనుటకు పూర్వము పేర్కొన్న 'అమరసన్నిభ' అను పద్యము కూడ ప్రమాణము.

పైసందర్భమునందలిదే మఱియొక పద్యము :

"నిగ్రహమేది నన్నుఁ దరణిప్రభకూపము వెల్వరించునాఁ
డుగ్రమయూఖసాక్ష్యముగ నున్నతదక్షిణపాణిఁజేసి భూ
పాగ్రణి నాదు దక్షిణకరాబ్జము వట్టితి కాన మున్ను పా
ణిగ్రహణంబుసేసి తది నీయెడ విస్మృతిఁ బొందఁ బాడియే." 1.3.160

ఇందొకవైపు రాజునకు ముంగాళ్లబందము వైచుచు వేఱొకవైపు శర్మిష్ఠను వంచనచే తర్జించు దేవయానీహృదయ మభివ్యక్తమగును. నిజమునకుఁ దనప్రార్థనచేఁ దన్ను రక్షించుతాత్పర్యముతోఁ దాను నోరారఁ బ్రార్థింపఁగా యయాతి కరుణతో నామెను జేయిపట్టి యుద్ధరించెను. ఇప్పుడీమె 'యుగ్రమయూఖసాక్ష్యముగ నీదక్షిణపాణితో నా దక్షిణకరాబ్జము పట్టితి' వని దోష మాతనిదన్నట్లు పలుకుచున్నది. అంతేకాక తన్నుద్ధరించుటలో నాతఁడు నిగ్రహమేదెనట. తాత్పర్యమేమి? నే నేదోయడుగఁగా 'నీవు కన్యవు. నేను నిన్ను దాకుట న్యాయ్యముకాదు' అని చెప్పక ఏకాంతమునందు జవరాలు ప్రమాదస్థితిలో కానవచ్చెనని నిగ్రహమును వీడి యుద్ధరించు నెపముతో పాణిగ్రహణము చేసితివి. అది నీ మదిలో మఱచుట పాడియా? అని ఏకాంతమున జరిగిన వృత్తాంతమునకు వక్రభాష్యమొనర్చి పలువురి యెదుటఁ జెప్పినది. ఇట్లు చెప్పుటలో యయాతిని నిర్బంధించుటయే కాక మఱియొక ప్రయోజనము కూడ నామె సాధించినది. యయాతి శర్మిష్ఠ యెవ్వరో యెఱుఁగవేఁడెను. బహుశః సాభిలాషములైన చూపు లామెపైఁ బఱపియుండవచ్చును. ఫలితముగా మహారాజైన యయాతి తనకు దక్కకపోవుటయే కాక చేఁజిక్కిన శర్మిష్ఠయు జాఱి పోయెడు ప్రమాదము గలదు. కావున నొకపాచిక వైచి శర్మిష్ఠను గ్రుంగఁదీయవలయును. 'కూపము వెల్వరించునాఁడు' ఇత్యాది వృత్తాంతముచే శర్మిష్ఠ తానొనర్చిన అకార్యమును స్మరించుటయే కాక 'అయ్యో! నేను జేసిన పాడుపని మహారాజునకుఁ గూడఁ దెలిసిపోయెనే. మఱియు నాతఁ డనురాగముతో నీమెను పాణిగ్రహణ మొనర్చెనట. ఇంక నాకేమి శిక్ష యొసంగునో!' అనురీతిని బాధపడవలయును. ఆ బాధ ముఖమున నెట్లో సూచింపఁబడకపోదు. రాజది కనిపెట్టి యామె శీలమును దప్పక శంకించును. అది తన కనుకూలము. దేవయాని యీవంచన మంతయు నీపద్యమునఁ బ్రతీయమానమగును. ఇదియంతయు నాతని వివాహమాడుయత్నమును వ్యక్తమొనర్చును గావున నామె యభిలాషయు సంలక్ష్యక్రమమున ధ్వనించును. శర్మిష్ఠ యందలి యీర్ష్య, గర్వము, వంచన, తన్నాతఁడు తిరస్కరించునేమో యను శంక, త్రానము మున్నగు వ్యభిచారిభావములు నిందు గోచరించి యామె యభిలాష రూపవిప్రలంభ శృంగారమును వ్యక్తము సేయును.

'పతిఁబడసి సుతులఁబడసిన' దేవయానిసౌభాగ్యము తనకు లేకపోయెనని శర్మిష్ఠ దుఃఖపడుచు నిట్లు తలఁచెను :

"అసుౘృశయౌవనం బిది యనన్యధనంబగు నొక్కొ, నాకు ని
క్కుసుమసముద్గమంబును నగోచరదుర్గమదుర్గవల్లరీ

కుసుమసముద్గమం బగునొకో పతిలాభములేమిఁజేసి; యొ
ప్పెసఁగఁగ దేవయాని పతి నేమితపం బొనరించి కాంచెనో." 1.3.170

ఇందలి 'అనన్యధనంబగునొక్కొ' అనుచోటి ఒక్కొ అనునిపాతము శంకయను సంచారిభావమును, 'సముద్గమంబగునొకో' అను తావునందలి నిపాతము నిరాశాజనితనిర్వేదమును. 'కాంచెనో' అనుదానియందలి 'ఓ' అనునది ఈర్ష్యను నభివ్యక్తము చేసి శర్మిష్ఠాలంబకమగు శోకము కరుణముగాఁ బరిణతమై యాస్వాదనీయమగును. 'అగోచరదుర్గమదుర్గవల్లరీకుసుమ సముద్గమంబగునొకో!' అనుటవలనఁ దన దాస్యము, తన ఏకాంత జీవనము మున్నగునవి స్మరింపఁబడి దుఃఖమున కుద్దీపకములగును. 'దేవయాని పతి నేమితపం బొనరించి కాంచెనో' యనుటచే నామెకు, భర్తృలాభము మహాతపఃఫలమునఁ గాని సిద్ధింప దన్నభావమును స్ఫురింపఁజేసి యట్టిది తనకు లేని కారణమున తనది దౌర్భాగ్యజీవిత మయ్యె నన్న నిర్వేదమును బుట్టించును.

ఏమైనను యయాతిని బతిఁగావించుకొన నిశ్చయించుకొని శర్మిష్ఠ యొకనాఁ డశోక వనికాలోకనతత్పరుఁడై వచ్చిన యాతనితో నేకాంతమున నిట్లాడెను :

"నీలగళోపమాన! కమనీయగుణోన్నతిఁ జెప్పఁజాలు న
న్నేలినదేవయానికి నరేశ్వర! భర్తవు; గాన నాకునుం
బోలఁగ భర్త వీవ; యిది భూనుత! ధర్మపథంబు; నిక్కువం
బాలును దాసియున్ సుతుఁడు నన్నవి వాయని ధర్మముల్ మహిన్." 1.3.174

ఇందలి నీలగళోపమాన! అను సంబోధనము సాభిప్రాయము. నేను యాచించునది విషమువలె నీకు మచ్చఁదెచ్చునది యైనను గ్రాహ్యమేనుమా! అనునభిప్రాయ మిట వ్యంగ్యము. మఱియు నీవు నీలగళుఁడైన పరమశివునితోఁ బోలిన వాఁడవు గావున గంగవంటి దేవయానితోపాటు నీకై యిన్నినాళ్లుగా తపించుచున్న గౌరివంటి నన్నుఁ గూడ భార్యగాఁ జేకొను మను ప్రార్థన అభివ్యక్తమగును. అట్లే 'నరేశ్వర!' అను సంబోధనముకూడ సాభిప్రాయము. నీవు రాజవు. 'రాజానో బహువల్లభాః' అను న్యాయము ననుసరించి నన్ను వివాహమగుట ధర్మేతరము కాదునుమా! అను నభిప్రాయము వ్యంగ్యము. భర్తృశబ్దమున కిట యోగమును బట్టి భరించువాఁ డనునర్థమును, రూఢినిబట్టి మగఁడు అనునర్థమును రెండును సంభావ్యములే యగును. దానివలన నీ విన్నినాళ్ళు నన్ను భరించుచు పతివే యైతివను నభిప్రాయము ద్యోతకమగును. 'భూనుత!' అను సంబోధనము నన్ను స్వీకరించిన కారణమున నీకీర్తికి భంగమురా దనునర్థమును ధ్వనించును. 'నిక్కువ' మనుమాట యెుత్తిడి

నభివ్యంజించును. 'ధర్మపథ' మనుటచే నాయభ్యర్థనముఁ ద్రోసివేసినచో నీకు పాపము సంభవించు నన్నభావము వ్యంగ్యమగును. 'అలు, సుతుఁడు' అనువాని మధ్య 'దాసి' అనుపదమును జేర్చుటలో నేనిప్పుడు నీభార్యాపుత్రులతో సమానకోటిలోనికి రావలసినదాన ననునభిప్రాయము వ్యంగ్యము. 'పాయనిధర్మముల్' అనుటలో నీవిది త్రోసివేయరాదని బలవంతము చేయుట స్ఫురించును. ఇట్లీపద్యమున శర్మిష్ఠ జాలితోఁ గూడిన ప్రార్థన మభివ్యక్తమగును.

తనకు యౌవన మిచ్చి తన ముదిమి గొన్న శర్మిష్ఠాతనయుఁడు పూరునికి రాజ్య మీ నెంచిన యయాతితో సర్వప్రకృతిజనంబు లిట్లనిరి :

**"అవిచారంబని పల్కనోడెదము ధర్మాభిజ్ఞ!; నీ యగ్రసం**
**భవుఁ డత్యున్నతశక్తియుక్తుఁడు, మహీభారప్రగల్భుండు, భా**
**ర్గవదౌహిత్రుఁడు, పాత్రుఁ డీయదుఁడు లోకఖ్యాతుఁ డుండంగ నీ**
**భువనేశత్వభరంబుఁ బూన్పఁదగునే పూరున్ జఘన్యాత్మజున్."** 1.3.196

పాలితులు మహారాజునకుఁ దెలుపవలసిన యర్థమును సుకుమారముగాఁ దెలుపు విధానమిం దభివ్యక్త మగును. 'ధర్మాభిజ్ఞ!' అను సంబోధనము, ధర్మము నీకుఁ దెలియదని మేము చెప్పుట కాదు. దానిని బాగుగా నెఱిఁగిన నీవే తద్విరుద్ధముగా ప్రవర్తించుట న్యాయమా అను మృదువైన మందలింపు నభివ్యంజించును. అగ్రసంభవుఁడు, అత్యున్నత శక్తియుక్తుఁడు, మహీభారప్రగల్భుఁడు, పాత్రుఁడు, లోకఖ్యాతుఁడు అను విశేషణములు యదువునకు రాజ్యమీకుండుటలోని యనౌచిత్యమును స్ఫురింపఁజేయును. భార్గవదౌహిత్రుఁ డనుటలో నాతనికి రాజ్యమీనిచో భార్గవ దుహిత దేవయానియు భార్గవుఁడును కోపింతురేమో విచారించితివా? యను నెచ్చరిక ప్రతీయమానమగును. లోకఖ్యాతుఁ డనుటచే ప్రజలంద ఱాతని యందే యభిప్రాయము గలిగియుండి రను భావము ధ్వనించును. జఘన్యాత్మజుఁడు అనుటలో శర్మిష్ఠ జఘన్య, ఎన్నడో దేవయానికి ముగ్గురు పిల్లలు పుట్టిన తరువాత ధర్మేతర మార్గమున నీకు భార్య యయినది. అట్టి యామె పుత్రున కింత ప్రాధాన్యమా? అను ననిష్ట సూచిలాఘవ ధోరణి వ్యంగ్యము. ఇట్లిం దర్థశక్తిమూలవస్తుకృత వస్తుధ్వని గోచరించును.

ఈయయాతికథయందు మొదట కచదేవయానులకు సంబంధించిన కథాభాగమున దేవయానియనురాగ మేకపక్షాశ్రితమగుటచేతను, తండ్రికి శిష్యుఁడై సోదర ప్రాయుఁడైనవానియం దనుచితముగా ప్రవర్తిల్లుట చేతను శృంగార రసాభాసము ప్రతీయమానమగును. మిక్కిలి గారాబముగఁ బెంపఁబడి కోరినదెల్ల సిద్ధింపఁజేసికొనఁ

గల నన్న దురభిమానముగల దేవయానికి కచవిషయకమైన ప్రేమ విఫలమగుట యొక పెద్ద ఆఘాతము. దానివలనఁ దఱువాతి యామెప్రవర్తన మంతయు విలక్షణముగనే సాఁగినది. శర్మిష్ఠను దాసిగాఁ జేసికొనుట, యయాతిని బలవంతముగా వివాహమున కంగీకరింపఁజేయుట, శర్మిష్ఠ నాదరింపకుండుట, యయాతి యామెకుఁ బుత్త్రదానము చేయుటచే నలిగి తండ్రిగృహ మేఁగి భర్తను శపింపఁజేయుట మున్నగున వన్నియు నామె దురభిమానపు దుష్ఫలితములు. వీనికి వన్నెఁబెట్టినట్టిది తనపుత్రునకు రాజ్యమురాకుండుట. ఇట్లు దేవయాని స్వయం కృతాపరాధముచే దుఃఖము ననుభవింపక తప్పలేదు. దీనినిబట్టి యదృష్టవిశేషమువలన మానవుఁ డెంతటి యున్నతస్థితిని బొందినను నవినయ దుష్ఫలితముల ననుభవింపక తప్పదను నీతి ప్రతీయమానమగును.

యయాతి ధర్మాత్ముఁడు. ఆపదలో నున్నవారి నుద్ధరించుటయు, పెద్దవారి యుపదేశమును దిరస్కరింపకుండుటయు, అతిశయరూపలావణ్య గుణసుందరియైన వనిత తన్ను వలఁచినను ధర్మభంగభీతిచే నొడఁబడఁకుండుటయు, పరిస్థితుల నాకళింపు చేసికొని యొక యువతిబ్రదుకు బండలుగాకుండ కాపాడుటయు, దానివలన నైనకష్టము నుపాయముచేఁ దొలఁగఁద్రోసికొనుటయు, నిచ్చినమాట చొప్పున ప్రజాభిప్రాయమునకు భిన్నముగా కనిష్ఠునకు రాజ్యమిచ్చుటయు, ఇహసుఖముల ననుభవించి పుణ్యవిశేషమున నుత్తమలోకములకుఁ జనుటయు, దురదృష్టవశమున స్వర్గలోకపరిభ్రష్టుఁడయ్యును దానొనర్చిన యుత్తమావమాన మనుదోషము నంగీకరించుటయు, తన దౌహిత్రులైన యష్టకాదులకు సకల ధర్మాధర్మంబులు, సుగతిదుర్గతి స్వరూపంబులు, జీవుల గర్భోత్పత్తి ప్రకారంబుళ్ళు, వర్ణాశ్రమ ధర్మంబులు వివరించుటయు మున్నగు నంశములచేత తదాలంబకమగు ధర్మానుష్ఠానోత్సాహము వీరముగా బరిణమించి యనుభూయ మానమగును.

శర్మిష్ఠ విధివంచిత. చేసిన చిన్నదొసఁగువలన మహాకష్టము ననుభవించిన మానవతి. నిజమునకు యయాతికిఁ దనపై ప్రీతికలదని యెఱిఁగియు తన స్వామిని యగు దేవయానికి లోఁబడి ఆశలు పెంచుకొనక, యాతనికి పెంపక దైవనిర్ణయమును శిరసావహించినది. స్త్రీ సాధారణ మగు సంతానేచ్ఛ పైకొనఁగా తనయందనురాగము గల యయాతిని మార్గాంతరమున వివాహమాడి యుత్తమసంతానము నొంది భర్తకు బహుమతయైనది. కావుననే "యయాతే రివ శర్మిష్ఠా భర్తు ర్బహుమతా భవ, సుతం త్వ మపి సమ్రాజం చక్రవర్తినమాప్నుహి" యని కాళిదాసు శకుంతలను కణ్వునిచే నాశీర్వదింపజేసెను. ఇట్టి యుత్తమశీల కావుననే మొదట కష్టము లనుభవించినను

దుదికి రాజమాత కాఁగలిగినది. స్త్రీకి ఉత్తమశీలమే యాభరణము. దానివలన నామె మహోన్నతస్థితి నందఁగల దని యీమె ప్రవర్తనము నిరూపించుచున్నది.

## ఆదిపర్వము - చతుర్థాశ్వాసము :-

కణ్వమహర్షి యాశ్రమమునకు వచ్చిన దుష్యంతుని శకుంతల యాన నార్ఘ్యపాద్యాది విధులం బూజించినపిమ్మట నాతఁడు కణ్వునిగూర్చి పృచ్ఛసేయు టయు నామె సమాధానము చెప్పుటయు నిందు వర్ణితములు :

"క్రచ్చఱ వేటవచ్చి యిటఁ గణ్వమహామునిఁ జూచిపోవఁగా
వచ్చితి; మెందుఁ బోయిరొకొ వా; రనినన్ విని యాలతాంగి - వా
రిచ్చట నుండి యీక్షణమ యేఁగిరి కానకుఁ బండ్లుదేర; మీ
వచ్చు టెఱింగిరేని - జనవల్లభ! వారును వత్తు రింతకున్." 1.4.24

ఈ పద్యార్థమును బట్టి శకుంతల లజ్జాపరవశయై కర్తవ్య విస్మరణముగావించిన ముగ్ధ యనిపింపదు. వచ్చినవాఁడు రాజని యెఱిఁగి యాతనికిఁ దండ్రిచేత నతిథి సపర్యచేయించు తాత్పర్యము గలదివోలెఁ గన్పట్టును. 'మీవచ్చు టెఱింగిరేని జనవల్లభ! వారును వత్తురింతకున్' అను వాక్యముచే మాతండ్రిగారికిని మీరన్న నాదరముగలదు. కాన మీరు వారు లేరని వెంటనే ప్రయాణోన్ముఖులు కావల దను ప్రార్థన గృహస్థజనోచితమైనది ప్రతీయమానమగును. 'జనవల్లభ!' అను సంబోధనము సాధారణముగ రాజపరముగా ప్రయుక్తమైనను మీవాల్లభ్యము మాయందుఁ జెడ కుండుఁగాక అను నాత్మాభిలాషము స్ఫురింపఁజేయుటకు సహకరించును.

ఇందు మఱియొక విధమైన ధ్వనిని భావించుటకును నాస్కారము గలదు. 'ఈ క్షణమ యేఁగిరి.' అనుటలో వారిప్పటిలో రారు అను నర్థమును, 'మీవచ్చు టెఱింగిరేని' అనుటచే మీరాకను వారెఱుఁగ రను నర్థమును స్ఫురించి మన యేకాంతసంభాషణమున కిది యనుకూల సమయ మని రాజున కెఱిఁగించు శకుంతలాభిప్రాయము వ్యంగ్యమగును. ఈయర్థ భావనము కేవలము నిరాధారము కాదు. ప్రథమ దర్శనముననే వారిరువురికిని పరస్పరానురాగ మంకురించె ననుటకు గ్రంథమునం దాధారముగలదు. "అదియును ననంతవిలాసంబున జయంతుండపోని దుష్యంతు నెఱింగి యతి సంభ్రమంబున నాసనార్ఘ్య పాద్యాదివిధులం బూజించి కుశలంబడిగి యున్న నక్కన్యకం జూచి" అను పూర్వ వచనము నందలి 'జయంతుండపోని' 'కన్యక' యనుమాట లనురాగోదయమును సూచించును. తఱువాతి వచనము "అక్కోమలివినయంబునకును వృ్పదం

మధురవచనంబులకును" అనుదాని యందలి కోమలి, మృదుమధుర వచనములు అనునవియు పైయభిప్రాయమునకు దోహదములు.

ఇట్లీ రెండు విధములగు ధ్వనులకును సంకరము.

తన జన్మవృత్తాంత మెఱిఁగి క్షత్రియకన్యకగా నిశ్చయించుకొని గాంధర్వవిధిని వివాహమాడుమని యడిగిన దుష్యంతునితో శకుంతల యిట్లు పలికెను :

"కరుణానిరతులు ధర్మ స్వరూప లింతకు మదీయ జనకులు సనుదెం
తురు; వారువచ్చి నీ కి చ్చిరేని పాణిగ్రహము సేయుము నన్నున్." 1.4.56

ఈపద్యార్థముచే శకుంతల శీల సంపద వ్యక్తమగును. ఆమె స్థిరోన్నత చిత్తత ప్రతీయమానమగును. వైరాగ్యసంపద్విలసితమగు మునిపల్లె యందుండి, మహారాజు వచ్చి వివాహమాడుదు నని కోరఁగాఁ దన కాతనియందనురాగ మున్నను తండ్రివచ్చి యిచ్చినచో వివాహమాడుదు ననుట యామె ధీరత నభివ్యక్తము సేయును. "మదనాతురుండయి దుష్యంతుండు దనయందక్కోమలి యనురాగం బుపలక్షించి" (52) "నీకును నాకును నెమ్మిఁ బరస్పర ప్రేమంబు గాముండు పెంపఁగొడఁగెఁ... ..... అనిన లజ్జఁజేసి యవనతవదనయై యాలతాంగి యిట్టు లనియెఁ బతికి" (55) అనునవి శకుంతలకును దుష్యంతునియం దనురాగ మున్న దనుటకు ప్రమాణములు. 'కరుణానిరతులు' అనుటచే కణ్వులు నాయందు మిక్కిలి కరుణకలవారు కావున మన మనోభావముల నెఱిఁగి తప్పక నీకు నన్నిత్తు రను స్ఫురణము కలుగును. ధర్మస్వరూపులు కావున అన్యోన్యానురాగము కలిగి యితర దోషములు లేని అనుగుణ యువతీయువకుల ప్రార్థనా నిరసనము వారు చేయ రను తాత్పర్య మభివ్యంగ్యమగును. దీనివలన 'నీవు కోరిక తిరస్కృత మగునని శంకింపఁబనిలే' దను శకుంతల యభిప్రాయము వ్యంగ్యమగును. 'ఇంతకుఁ జనుదెంతురు' అనుటచే నెక్కువ కాలవిలంబనము కాదన్న సూచన స్ఫురించును. నన్ను జన్మమాదిగఁ బెంచి బుద్ధియుక్తులఁగఱపిన తండ్రి యనుమతి లేకుండ జీవితమున నత్యంత ప్రముఖ విషయమైన వివాహమున త్వరపడుట సముచితము కాదన్న వినయరక్షణ తత్పరత్వము 'ఏని' అను చేదర్థకావ్యయమువలనఁ బ్రతీయమానమగును. 'మదీయ' అను తద్ధితాంతముచే కణ్వునియందుఁ దనకుఁగల ఆత్మీయంభావము స్ఫురించును. ఇట్లర్థ శక్త్యుద్భవవస్తుకృతవస్తుధ్వని కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధమై యిందు గోచరించును.

గురునాశ్రమమున మున్నరుదుగఁ బతివలన గనిన యాదరాదులను స్వయము

గాఁ దానువచ్చియుఁ గానక శకుంతల రాజుతో నిట్లు పలికెను :

"జననాథ! వేటనెపమునఁ గొనకొని కణ్వాశ్రమమునకున్ వచ్చి ముదం
బున నందు నాకు నీ యి చ్చిన వరముఁ దలపవలయుఁ జిత్తములోనన్." 1.4.74

ఇందు 'జననాథ!' అను సంబోధనము రాజుగా నీవు వంచన పరుడవు కారాదను నెచ్చరికను ప్రతీయమానమొనర్చును. 'వేటనెపమునన్' అనుమాట కోపముతోడి శోకము నభివ్యక్తము చేయును. నిజమునకు రాజు వెళ్లినది వేట కొఱకే. కాని శకుంతల రాజుననాదరముచే నాతఁడు తనకొఱకే వచ్చి వేటకు వచ్చితినని యబద్ధమాడి తన్ను వంచించెనని పలుకుచున్నది. ఇట్టిది యాలోచింపనీని దుఃఖమును వ్యంజించును. 'ముదంబునన్' అనుపదము నీవు వరమును నాయొత్తిడికి లొంగికాక సంతోషపూర్వకముగానే యిచ్చితివనుట స్మరింపు మన్న భావము నభివ్యంజించును. లేదా ఆ వరము వాగ్రూపమున నిచ్చునప్పటి ముదము తీర్చునాఁడేల చెడవలయు నన్న అధిక్షేపణముకూడ నిందు వ్యంగ్యము కావచ్చును.

శకుంతల మాటలు విని కలవరపడిన దుష్యంతుని వాక్యములు :

"ఏనెఱుఁగ నిన్ను; నెక్కడి దానవు? మిన్నకయ యనుచితంబులు పలుకం
గా నేల? యరుగు మంబురు హానన! యెందుండి వచ్చి తందులకు వడిన్." 1.4.77

ఈ పద్యమునందలి వాగ్విన్యాసము దుష్యంతుని కలవరపాటును, ఎఱిఁగియే యెఱుఁగనట్లు నటించుటను సూచించును. నిజముగా శకుంతలా వివాహాదికము నెఱుఁగనివాఁ డైనచో సంభ్రమము, ఆశ్చర్యము, ఏమి పలుకవలయునో యెఱుఁగ రాని స్థితియు నుండవలయును. శాకుంతలనాటకసన్నివేశముతోఁ బోల్చిచూచినచో నీయంశము స్పష్టము కాఁగలదు. అందు శార్ఙ్గరవుఁడు దుష్యంతునితో "యన్మిథస్సమయాదిమాం మదీయాం దుహితరం భవానుపాయంస్త - తన్మయా ప్రీతిమతా యువయోరనుజ్ఞాతమ్ కుతః -

"త్వమర్హ తాం ప్రాగ్రసరః స్మృతోఽ సి నః; శకుంతలా మూర్తిమతీవ సత్క్రియా;
సమానయం స్తుల్యగుణం వధూవరం చిరాయ వాచ్యం న గతః ప్రజాపతి."

తదియ మాపన్నసత్త్వా ప్రతిగృహ్యతాం సహధర్మాచరణాయ" అనిపలికి నపుడు నిశ్చేష్టుఁడైన రాజు ప్రయత్న పూర్వకముగా "కిమిద ముపన్యస్తమ్!" అని మాత్ర మనఁ గల్గెను. ఇచట నట్లుగాక మొట్ట మొదట 'ఏ నెఱుఁగ నిన్ను' అని, 'ఎక్కడ దానవు', 'మిన్నకయ' 'అనుచితంబులు పలుకంగానేల' 'ఎందుండివచ్చితివో యందులకు వడిగా నరుగుము' అనువాక్యసముదాయమును సావధానముగా ప్రయోగించెను. ఇట్లు పలుకుటలో నాతని సంభ్రమము వ్యక్తమగుచునేయున్నది. కాని అది శకుంతల అవిజ్ఞాత

యగుటవలనఁగాదు. ఆమె యి ట్లాస్థానమునకు వచ్చి నలుగురియెదుట మాటాడునని యూహింపనికారణమునఁ గలిగిన సంభ్రమము. 'అంబురుహానన!' అనునది యొకవెక్కిరింత. మొగ మొకింత దర్శనీయముగా నున్నంతమాత్రమున మహారాజును మరుగొలుపు ప్రయత్న మీకాంత చేయుచున్న దనుభావము సభాజనులకుఁ గలిగి తన్ను వారు శంకించు ప్రమాదము లేకుండఁ జూచు కొను తాత్పర్య మిందభివ్యక్తమగును. 'వడిన్' అనుటచే నామె యిచటనే జాగొనరించి యింకను నేమేని మాటాడినయెడల తనగుట్టు బయలుపడునేమో అనుభీతి స్ఫురించును.

లేదా 'ఏకాంతముననైన మనవివాహవృత్తాంతమును జనుల కెఱుకపఱచుట కిది సమయముకాదు. కావున దయచేసి ప్రస్తుతమునకు కణ్వాశ్రమమునకుఁ బొమ్ము. పరిస్థితు లనుకూలించునపుడు నిన్ను తెత్తును' ఇత్యాదిభావముకూడ నిందు ప్రతీయ మానమగుట కవకాశము గలదు.

తన్నుఁ దనపుత్రుని నిరాకరించుచున్న రాజుతో శకుంతల అన్న వాక్యము:

"విపరీత ప్రతిభాష లేమిటికి నుర్వీనాథ!; యీ పుత్రగా
త్రపరిష్వంగసుఖంబు సేకొనుము; ముక్తాహార కర్పూర సాం
ద్రపరాగప్రసరంబుఁ జందనముఁ జంద్రజ్యోత్స్నయుం బుత్త్రగా
త్రపరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కడున్ శీతమే." 1.4.91

పుత్రగాత్రపరిష్వంగసుఖము లక్షణము చెప్పి 'యిది చేకొను' మని విధించుటలో నింతకంటె వేఱొక ప్రమాణ మిట్టి సందిగ్ధాంశములం దుండదు, ఒకమాఱీ బాలునిఁ బరిష్వంగము చేసికొన్నచో వీఁడు నీపుత్త్రుఁడో, కాఁడో నీకే తెలియును. అట్టి అపరిహార్యమైన ప్రమాణ విశేషముండఁగా పరస్పరవిరుద్ధములైన మాటలేల? అను శకుంతలాభిప్రాయ మిట వ్యంగ్యము. 'హృద్యమే కడున్ శీతమే' అనుటచే నీతఁడు నీపుత్త్రుడన్న ప్రత్యయములోనున్న హృదయమునకును, వెలుపలి శరీరమునకును సమకాలములోఁ దెలియు నన్న భావము స్ఫురించును. 'జీవులకు' అనుటచే నిది మానవులకు మాత్రమే పరిమితమైన విషయముకాదు, సర్వజంతు సాధారణము. కావున పిపీలికాదులకును నవగతమగు నీవిషయము మానవుఁడవై, ఉర్వీనాథుఁడవై, జనులందఱకంటె నుత్కృష్టవ్యక్తిత్వముగల నీకుఁ దెలియకుండునా? అనునర్థము ప్రతీయమానమగును. ముక్తాహారాదికము పుత్త్రగాత్రపరిష్వంగమువలె హృద్యముకా దనుట వలన వ్యతిరేకాలంకారము సిద్ధించి పుత్రగాత్ర పరిష్వంగ సుఖమున కదియేసాటి యను నన న్వయాలంకారము ధ్వనించి శకుంతల మాతృవాత్సల్యమును సువ్యక్త మొనర్చును.

శకుంతలోపాఖ్యానమునకు సంబంధించిన విస్తృతచర్చ ప్రథమాధ్యాయమున జేయఁబడియుండుటచే నిచట మానఁబడినది.

యమునానది నోడ గడపుచున్న సత్యవతినిఁజూచి శంతనుఁ డామెతో నిట్లనియెను:

"ఎందులదాన; వేకతమ యియ్యమునానది నోడసల్పుచున్
సుందరి! నీకు నున్కియిది చూడంగఁ దానుచితంబె; నావుడున్
మందమనోజ్ఞహాసముఖమండల మెత్తి మృగాక్షి చూచి సం
క్రందనసన్నిభున్ నృపతిఁ గన్యక యిట్లని పల్కెఁ బ్రీతితోన్." 1.4.173

ఇందు శంతనుని ప్రశ్న అభిప్రాయగర్భితము. 'ఏకతమ' అనుపదముచే ఇతరు లేమనుకొందురో యను లజ్జాశంకాదికమున కాస్కారములేని యేకాంత మియ్యది. కావున సంకోచమును వీడి చక్కగా ప్రసంగింపు మను నర్థము ప్రతీయమానమగును. 'సుందరి!' అను సంబోధనము నీసౌందర్యమునకు నేను మోహపడితి నన్నభావమును స్ఫుటముచేయును. 'ఇది చూడఁగ దానుచితంబె' అనుటచే నీవొక మహారాజునకు భార్యవై మహారాజ్ఞీత్వమును బొందఁజాలినదాన వీ యలుపపుఁబనిచేయనేల? నన్ను వరించి యాసౌభాగ్యము నొందరాదా? అను భావము స్ఫురించును. 'నీకున్' అనునది యర్థాంతరసంక్రమితవాచ్యరూపమున మహారాజ్ఞి కాఁదగిన లక్షణములుగల నీకు ననునర్థమును వ్యంజించును. ఇట్లర్థశక్త్యుద్భవమైన యీవస్తు విశేషమంతయును శంతనుని యభిలాషమునకు స్ఫోరకము. సత్యవతియు మహారాజదర్శనముచే నంకురితానురాగ యయినది. అతని వాక్కులయందలి వక్రత్వ మామెకు రుచించినది. కావుననే మందమనోజ్ఞహాసముఖమండల యైనది. ఇందలి 'మంద' అను పదైకదేశముచే లజ్జాభరమును, 'మనోజ్ఞ'పదముచే గాఢానురాగమును, 'హాస'పదముచే కలిగిన యనురాగమును లోనణచుకొనలేనితనమును, 'ముఖమండల' పదముచే చంద్రబింబ స్ఫురణము కలిగి ద్యోతమానమగు వికాసమును స్ఫురించి యామె హృదయమునందలి యభిలాష మసంలక్ష్యక్రమమున ప్రతీయమానమగును. సిగ్గుతో సూటిగా నిలిచిచూడఁ జాలని కనుల తారళ్యమును 'మృగాక్షి' శబ్ద మభివ్యంజించును. 'ఎత్తి', 'చూచి' అనుక్త్వార్థక క్రియలచే ముఖమెత్తుటయందలి ప్రయత్నము తోఁచి లజ్జాను రాగములస్ఫూర్తి బల పడును. 'సంక్రందనసన్నిభున్' అనుపదము కవివాక్కే యయినను నాతనిఁ జూచుటతోడనే యామె హృదయమున దేవేంద్రస్ఫురణము గలిగి యిట్టివానినిఁ బతిగానొందుట యెవ్వరి కిష్టముగాకుండుననుఁ తలఁపభివ్యక్తమగును. ఇట్లీపద్యమున సత్యవతీశంతనుల

శృంగారము పరమోదాత్తముగా ప్రతీయమానమగుచున్నది. ఇది రసాదిధ్వని.

దాశరాజుచే ప్రతిహతమనోరథుడైన శంతనుడు సత్యవతినే తలంచుచు వీతకార్యావసరుఁడయి యుండగా గాంగేయుఁడైన దేవవ్రతుఁ డాతనిపాలికిఁ జను దెంచి యిట్లు పలికెను:

"భవదభిరక్షితక్షితికి బాధయొనర్పఁగనోపునట్టి శా
త్రవనివహంబులేదు? వసుధా ప్రజకెల్ల ననంతసంతతో
త్సవముల; రాజులెల్ల ననిశంబు విధేయుల నీకు; నిట్లు మా
నవవృషభేంద్ర! యేలొకొ మనఃపరితాపముబొంది యుండఁగన్."

దేవవ్రతుఁడు తండ్రి మనోవేదన నెఱుంగగోరి పేర్కొన్న యీమూఁడంశముల చేతను ఉత్తమరాజలక్షణము లభివ్యక్తములగుచున్నవి. ఉత్తముఁడైన ప్రభువు తాను పాలించుభూమికి శత్రుబాధకలిగిపుడును, ఈతిబాధలు నంభవించినపుడును, సామంతరాజులు కుట్రలువన్ని కూలఁద్రోయుటకుఁ బూనినవుడు మాత్రవే తీవ్రవేదనాకులితుఁ డగును. ప్రజాపీడాకరములైన యీమూఁడంశములే గ్రహింపఁబడుటచే తదితరవైయక్తికకారణములు రాజునకంత విచార్యములు కావను భావము ప్రతీయమానమై దేవవ్రతుని ప్రజాహితరతి మతికెక్కును.

ఇందలి 'అభిరక్షిత' అనుపదముచే శంతనుఁ డన్నివైపులనుండి రాఁదగిన పీడలను ముందే కనిపట్టి తన సామర్థ్యముచే వారించుచుండెనను నర్థము సిద్ధించును. బాధయొనర్చునట్టి అనికాక 'బాధ యొనర్పఁగ నోపునట్టి' అనుటచే చేసెడువారెవ్వరు లేకపోవుటయే కాదు. చేయనెంచు సామర్థ్యము కూడ నెవ్వరికిని లేదను నర్థము తోఁచును. 'నివహము' అనుటచే నొక్కరొక్క రేమియుఁ జేయలేకపోవుట విదితమే కాని యందఱు సముదాయముగా నేర్పడియు నీక్షితికి బాధచేయనోప రను నర్థము వ్యక్తమగును. 'ప్రజకెల్ల' అనుటచే భిన్నరుచియైన లోకమున నందఱకు ప్రీతి ఘటించుట మహానమర్థునకుఁ గాని సాధ్యము కాదు. అట్టిదానిని నీవు సాధించితివను ప్రశంస వ్యక్తమై శంతనుని పరిపాలనాసామర్థ్యము ప్రతీయమానమగును. 'అనంత', 'సంతత' అను పదైక దేశములును, 'ఉత్సవముల' అనుచోటి యవధారణార్థకమును వ్యంజకములే. ప్రజల సుఖ మొక్కనాటిది కాదు. అది నిత్యనూతనమై యానుక్షణికమై విలసిల్లుచున్నదను రూపమున దేవవ్రతుని పితృనురాగము వ్యంజితమగును. 'అనిశము' అను పదము 'ఎల్లవేళల' నను నర్థమున రూఢమేయయినను "నాస్తి నిశావిచ్ఛేదకాలః యస్మిన్" అను యోగార్థమును బట్టి జాగ్రదవస్థయందేకాక స్వప్నసుషుప్త్యవస్థల యందును సామంతులు

నీకు విధేయులే యనునతిశయోక్తి రూపమైన యర్థము మనసునకుఁ దట్టును. సుషుప్తిలో మనోబుద్ధులు క్రియావంతములుకాని వగుటచే నతిశయోక్తి సంభావింపఁబడినది. ఇట్లీపదమున దేవవ్రతుని వాక్యములందు శంతనుని రాజ్యపరిపాలనాదక్షతయు దానిచే దేవవ్రతుని హృదయమునందలి తండ్రియెడఁగల ప్రీతివిశేషమును చక్కగా వ్యంజితము లయినవి.

శకుంతలోపాఖ్యానము ముగిసిన వెనుక నీయాశ్వాసమున నొక ప్రత్యేక భాగముగాఁ గైకొనఁదగినది భీష్మచరితము. ఇందు మహాభారతకథలో ప్రాముఖ్యముగల భీష్ముని యుదాత్తచరితము ప్రధానముగాఁ జెప్పఁబడినది. గంగాశంతనుల వృత్తాంతము ఈ మహావీరుని యుదయమునకు సంబంధించినది. సత్యవతీ శంతనుల పరస్పరాభిలాషాదికము, వారి వివాహమును ఈ మహనీయుని పరమోదారత్యాగగుణ నిరూపణ పరములు. తమ్మునికై కాశిరాజదుహితలఁ దేఁగోరుట, స్వయంవరమున కేఁగుట యనునవి "పితృసమో జ్యేష్ఠః" అనున్యాయము ననుసరించి యాతని పితృ సమత్వమును, సపత్నీ పుత్ర మాత్సర్యరాహిత్యమును ద్యోతమొనర్చును. ఒక్కఁడై స్వయంవరమున మూఁగివచ్చిన రాజలోకమునంతటిని నిలువరించుటలో, సాల్వుని పరాజితునిఁ జేయుటలో నాతని యుద్ధవీరము చక్కగా ప్రభాసిల్లును. అన్యసక్తయని యెఱిఁగి యంబను సాల్వునికడ కంపుటలో నాతని ధర్మానురక్తి వ్యక్తమగును. విచిత్రవీర్యుఁడు మరణింపఁగా తల్లి సత్యవతి తన్ను వివాహమునకుఁ బ్రోత్సహింపఁగా నంగీకరింపక మార్గాంతర మన్వేషించి వంశనాశము గాకుండఁ బరిరక్షించుటలో నాతని ధర్మనిర్వహణదార్ఢ్యము అక్షతశీలము నభివ్యక్తము లగుచున్నవి.

ఇట్లు భీష్మాలంబనకమగు ధర్మపరిపాలనోత్సాహ మిం దనేకాంశములచే రసీభవించి పాఠకుని హృదయమున ధర్మవీరరసము ననుభవింపఁజేయును. యుద్ధ వీరము, దీర్ఘతముని వృత్తాంతమునందలి యద్భుతరసము, సత్యవతీ శంతను సమాగమమునందలి శృంగారము, దేవరన్యాయ విధానమునందలి యద్భుతము మున్నగునవి యీధర్మవీరమున కంగములు.

ఆశ్వాసాంతమునందలి యాణిమాండవ్యోపాఖ్యానము అద్భుత రసావహము. చోరులు వస్తువులు తన యొద్ద పాఱవేయఁగా మాండవ్యుఁ డులుకకుండుట, రాజ భటులు వచ్చి యడుగఁగాఁ బలుకకుండుట, భయంకరమైన శిక్షను ప్రగల్భముగా ననుభవించుట, కొఱ్ఱునునుండియు శరీరదుఃఖము తలఁపక తపము చేయుట, శిక్షానుభవము ముగిసిన పిమ్మట లోకములన్నియు గమించి, యమపురి కరిగి యాతనిఁ దనశిక్షాహేతువు నడుగుట, శాపమిచ్చుట మున్నగునవి యన్నియు విస్మయ హేతువులై యద్భుత రసానుభవమునకు దోహదమొనర్చుచున్నవి.

**ఆదిపర్వము - పంచమాశ్వాసము :-**

పాండురాజు మరణానంతరము పాండవులఁ దోడ్కొనివచ్చిన మహర్షులు గాంగేయాది రాజవంశ్యులకును, ఇతర జనులకును వారిని గూర్చి యిట్లు వక్కాణించిరి:

"భానునిభుండు పాండుజనపాలుఁడు ఘోరతపంబుసేసి ధ
ర్మానిలవాసవాశ్వినులదైన వరంబున శక్తిపేర్మితో
నీనరనాథనందనుల నేవుర వంశవివృద్ధిపొంటెఁ బం
చాననసత్త్వులం బడసె నా శతశృంగమహానగంబునన్." 1.5.153

ఇందు పాండురాజు యొక్కయు, తత్పుత్త్రులయు గౌరవమునకు భంగమురాకుండ కాపాడవలయునను మహర్షుల తాత్పర్య మభివ్యక్తమగును. 'భానునిభుఁ డనుటచే నాతఁ డరణ్యములో తపోవిశేషముచే దేదీప్యమానుఁడై వెలిఁగె నను నర్థము స్ఫురించును. సంతానప్రాప్తి కవరోధమైక శాపము గలవ్యక్తి కిట్టి దీప్తి విశేషముగల బాలురెట్లు జన్మించి రని సందేహింపవలదు. ధర్మానిలవాసవాశ్వినులదైన వరంబున శక్తిపేర్మితో పాండురాజు వీరినిఁ బొందెనను శంకానివారణాభిప్రాయము వ్యక్తమగును. వారీతని కూరక ప్రసన్నులు కాలేదు. ఈతని ఘోరమైన తపోవిశేషమునకుఁ బ్రసన్నులై కుంతీమంత్ర ప్రయోగశక్తినిమిత్తముగా వీరిని ప్రసాదించి రను నర్థము 'ఘోరతపంబుసేసి' యనుదానిచే భాసిల్లును. 'ఈనరనాథనందనుల నేవురన్' అనుటవలన నీయైదుగురును ధర్మమార్గము ననుసరించి రాజకుమారులే యగుటలో నాక్షేపణములే దనునర్థము తోఁచును. ఇట్టి సంతానము నాతఁడేల పడయవలయు ననుదానికి సమాధానముగా 'వంశవివృద్ధిపొంటెన్' అనునది చెప్పబడినది. 'పంచాననసత్త్వులన్' అనుటవలన బాల్యమునందలి ఇంతటి సింహపరాక్రమము వీరు దైవశక్తిచేఁ బ్రభవించినవారని నిరూపించును గదా! యనుభావము స్ఫురించును. 'ఆశతశృంగమహానగంబునన్' అనుపదము పాండుని పుత్ర ప్రాప్త్యాదికమునకు వేమెల్లరము సాక్షులమను నభిప్రాయమును వ్యంజించును. 'పడసె' నను కర్త్రర్థకక్రియచే ధర్మశాస్త్ర మర్యాద ననుసరించి వీరు పాండవులే యనుటను శంకింపఁబనిలే దనునర్థము ప్రతీయమానమగును. ఇట్లు శంకాస్పదమైన విషయమును నిశ్శంక మొనర్చి హేతుబద్ధముగాఁ బ్రతిపాదించు మహర్షుల తాత్పర్య మిందభివ్యక్తమగును.

బాల్యక్రీడలందు భీముని యౌద్ధత్యమునకుఁ దాళఁజాలక దుర్యోధనుఁడు శకుని దుశ్శాసనాదులతో విచారించి యిట్లు నిశ్చయించెను :

"ఉపాంశువధఁజేసి మధ్యము మదోద్ధతుం జంపి ని
స్సపత్నముగ ధర్మనందను నశక్తు బంధించి యే

నపాండవముగా సముద్రవలయాఖిలక్షోణి మ
త్కృపాణపటుశక్తి నత్యధికకీర్తి నై యేలెదన్." 1.5.168

ఈ పద్యమునందు దుర్యోధనుని క్రౌర్యము, అసద్వృత్తిత్వము మున్నగు లక్షణములు ప్రతీయమానములగుచున్నవి. ఇది బాల్యము. భీముని యౌద్ధత్యమునకు వట్టిదేహబల ప్రదర్శన తాత్పర్యమే తప్ప వేఱొక యుద్దేశ్య మేదియుఁ గానరాదు. ఇందవివేకమే కాని క్రౌర్యము శంకితవ్యము కాదు. మహాబలుఁడైన మహాబలనందనుఁడు దుర్యోధన సోదరులఁ బీడించె ననఁగాఁ బెద్దవారికిఁజెప్పి సరిచేయింపవచ్చును. కాని దుర్యోధనుఁ డీ బాల్యక్రీడా సందర్భమునందలి భీమపరాక్రమము నధికదీర్ఘ వైర వృత్తికి బీజముగాఁ దన హృదయ క్షేత్రమున నిలుపుకొనెను. ఉపాంశువధచేసి కాని మదోద్ధతుడై నభీముని సాధింపఁజాలఁడు. దీనితో భీముఁడన్నచో నాతని భీతి యెట్టిదో తెల్లమగును. భీముఁడు చంపఁబడినచో తన కింక శత్రు వుండఁడు. భీమునికంటె నితరుఁడు తన్నెదుర్కొనఁజాలువాఁడు లేఁడని యాతని యాత్మవిశ్వాసము. భీమునిపై నతనికిఁ గల కోపము పాండవు లందఱియందును వ్యాపించి నది. కావుననే అశక్తుఁడని తాను భావించిన ధర్మనందనుని బంధింపనెంచెను. అంతేకాదు. భువి నపాండవము చేయఁ దలఁచెను. పాండవులు గలుగునంతవరకుఁ దన కత్యధిక కీర్తి కలుగదనియు నతనినమ్మకము. ఇట్లీతనికిఁ బాండవుల యెడఁ గల భీతి, యీర్ష్య, క్రోధము మున్నగుభావము లీపద్యమునఁ బ్రతీయమానము లగును. పిల్లల ఆటలలోని తన యశక్తతవలన భీమునిఁ జంపనెంచుట, వాని యన్నను బంధించుట, వాని సోదరులను రూపుమాపుట అనువానికై దుర్యోధనుఁడు ప్రణాళికను సిద్ధము చేసికొనె ననఁగా నాతని క్రౌర్య మెంతటిదో యయూహ్య మను నర్థమిందుఁ దోఁచును. దుర్యోధనాదుల యీస్వభావమును గృష్ణ ద్వైపాయనుఁడు ముందే భావించి సత్యవత్యంబికాంబాలికలకు నివేదించెను :

"క్రూరులు విలుప్తధర్మా చారులు ధృతురాష్ట్రసుతు లసద్వృత్తులు ని
ష్కారణవైరులు వీరల కారణమున నెగ్గుపుట్టుఁ గౌరవ్యులకున్." 1.5.160

ఈయాశ్వాసమునఁ బ్రధానముగా కౌరవ పాండవుల జన్మవృత్తాంతమును, విద్యాభ్యాసమును జెప్పబడినవి. ఇందధిక భాగము పాండురాజు చరిత్రము. పాండురాజు వేఁటాడఁబోవుట, కిందముశాపము, సంతానప్రాప్త్యవరోధము, దుర్వాసో మహర్షి యిచ్చిన మంత్రశక్తినుపయోగించి భర్త్రనుమతిచేఁ గుంతి తనకును మాద్రికిని సంతానముఁ బడయుట, శాపము ప్రేరేపఁగా పాండురాజు మాద్రియందు రమించి మరణించుటయు నిందుఁ బ్రధానాంశములు. మహాసమర్థుఁడైన పాండురాజు జైత్రయాత్ర యొనరించి సాధించినదెల్ల ఫలాపేక్ష లేకుండ నన్నకు నివేదించుటలో నాతని భ్రాతృభక్తియు

ధర్మానురక్తియు వ్యక్తములగును. కర్మవశమున శావము నొందిన పిమ్మట వైరాగ్యసంపద్విలసితుఁడై తపమాచరించుటయు నాతని యాత్మోన్నతిని వక్కాణించును. భార్యాసహితుఁడయ్యు బహుకాల మింద్రియ నిగ్రహమును - శాపభయముచే నైనను - పాటింపగలుగుట యాతని ధైర్యమును నిరూపించును. సంతానాపేక్ష "ప్రజాతన్తుం మావ్యవచ్ఛేత్సీః" అను శ్రుత్యక్తధర్మసంరక్షణ తాత్పర్యము నభివ్యక్తము చేయును. దేవరన్యాయము నంగీకరింపుమని బహువిధములుగాఁ బ్రార్థించుటలో నాతని సంతానదర్శనేచ్ఛ ప్రతీయమానమగును. వేఁటలో పెంటితోఁ గూడి యున్న మృగమును వధించుటయు, మాద్రీ సౌందర్యమునకు వశుఁడై ప్రాణములు కోల్పోవుటయు నీతని కర్మవిపాకఫలితములు. మొత్తము మీఁద నాతనిచరిత్రము నందుఁ బ్రాయికముగా ధర్మమే తలయెత్తికొనును.

తఱువాతిదగు కుమారుల బాల్యవిద్యాభ్యానవృత్తాంతము రాఁబోవు మహానర్థమునకు బీజములు వేసినది. ఇందుఁ బ్రధానముగా భీముని యౌద్ధత్యమును, దుర్యోధనుని క్రౌర్యమును ప్రతీయమానములగును.

ఏకలవ్యుస యసాధారణ ప్రజ్ఞాపాటవ మొందలదయె. లక్ష్యము గట్టిదైనచో గురువిరహితముగనే విద్యనేర్చుట దుష్కరము కాదను నంశమిం దభివ్యక్త మగును. ఆనాటి రాజనీత కేకలవ్యుఁడు బలియైనను అట్లగుటయే యాతనికీర్తిని కలకాలము నిలుపఁగలిగినది. ఇందును ఏకలవ్యాలంబనకమగు గురుభక్తితాత్పర్య రూపధర్మవీరమే సహృదయునిచే నాస్వాద్యమగును.

## ఆదిపర్వము - షష్ఠాశ్వాసము :-

కుమారాస్త్రవిద్యా ప్రదర్శనసందర్భమునఁ దన సామర్థ్యమును బ్రదర్శించు చున్న యర్జునునిఁ గాంచి కర్ణుఁడిట్లాడెను :

"నీవ కడునేర్పుకాఁడవు గావలవదు వీనిఁ గొన్ని గఱచితి మేమున్;
నీవిద్యలెల్లఁ జూపుదు మే వీరులు సూచి మేలుమేలని పొగఁడన్" 1.6.33

ఇందలి 'నీవకడునేర్పుకాఁడవు గావలవదు' అను వాక్యముచే నీకంటె నేను జాల గొప్పవాఁడ ననుకర్ణుని యభిప్రాయము వ్యంగ్యము. 'కొన్ని' అనుపదము హేళనాద్యోతకము. ఏవో కొన్ని నేర్చి గొప్పవాఁడ ననుకొనుచున్నావు. మా కంతకంటె నక్కువ విద్యలే వచ్చునులే యను భావము వ్యక్తమగును. నీవిద్య లనుట వక్కరంత. ఏవిద్యను నాకంటె నేర్చినవారులేరని నీవు భావించుచున్నావో యావిద్యలు మాకును వచ్చు ననునర్థమిట స్ఫురించును. 'ఎల్లన్' అనుటలో నీవు ప్రదర్శించిన విద్యలలో నాకు రానిది లేదు సుమా! అను భావము తోఁచును. 'వీరు' లను పదము విశేషార్థద్యోతకము.

నీవు సామాన్య జనులప్రశంసనలకే యుబ్బితబ్బిబ్బవు చున్నావు. నేను వీరు లనేకులు ప్రశంసించునట్లుగా విద్యా ప్రదర్శనము చేయఁగలనుసుమా! అనునర్థము వెల్లడియగును. (దీని కుపస్కారకముగా నర్జున ప్రశంసా సందర్భమున 20, 22, 23 పద్యములందుఁ గేవల జనశబ్దమే ప్రయుక్తమైనది) మేలుమేలు అనునావృత్తిలోఁ దన సామర్థ్య మనల్పమను భావము స్ఫురించును. ఇట్లిందు కర్ణుని స్పర్ధయు, గర్వమును, విద్యాప్రదర్శన కుతూహలమును అభివ్యక్త మగును. అతని కర్జునుని యెడఁగల యసహనముకూడ నిందభివ్యక్తమగును.

దుర్యోధనుఁడు కర్ణుని దొరఁ జేయుటకై యంగరాజ్య మీఁగా భీముఁడు "మంత్రపూతమై గురుయజమానభక్ష్యమగు పురోడాశ మది గుక్క కర్హమగునే" యని యాక్షేపించెను. దుర్యోధనుఁడది సహింపక యిట్లాడెను :

"అనిలజ! నీకిట్లనిప ల్కను దలఁపను నగునె - లేడికడుపునఁ బులి పు
ట్టునె - యిట్టి దివ్యతేజం బనవాఁ డధమాన్వయమునఁ బుట్టునె - చెప్పుమా!" 1.6.59

ఈపద్యమునందలి 'అనిలజ!' అను సంబోధనము వలన 'కర్ణుని జన్మమును వెక్కిరించు నీవెట్లు పుట్టితివో యాలోచింపుము. నీవు గాలికిఁ బుట్టినవాఁడవు గదా! నీదోషము నీ వెఱుఁగక యితరుల నిందింతువా!" అను నాక్షేపణము ద్యోతమగును. 'నీకున్' అనునదియుఁ బైవ్యంగ్యార్థమునే ధృఢ మొనర్చును. ఎవని పుట్టుకలో దోషము లేదో వాఁడొకవేళ నధిక్షేపించినను సమంజసమేయగును గాని ఎవనికో పుట్టిన నీకిట్లాడఁ దగునా? యను ధిక్కారమిట వ్యంగ్యము. 'తలఁపను నగునె' అనుటచే హృదయమున భావించుటకుఁ గూడ నసహ్యమైన విషయమును నీవు సిగ్గులేక వాకొనుచున్నావు. ఇది వివేకమా! అను మందలింపభివ్యక్తమగును. 'లేడి కడుపునఁ బులిపుట్టునె' అనుటచే మీరు 'ఆకృతివిశేషమును బట్టి యౌన్నత్యమును గుర్తింపఁజాలని మూర్ఖులు కానిచో నీతని గుర్తింపఁగల' రనునర్థము తోఁచును. ఇట్లీ పద్యమువలన దుర్యోధనుని కోపము, కర్ణనిందవలన పడినబాధయు నభివ్యక్తములగును.

ఆ సందర్భముననే కోపము పెల్లురేగి దుర్యోధనుఁ డింకను నిట్లు పల్కుచున్నాఁడు :

"శూరులజన్మంబు సురలజన్మంబును నేఱులజన్మంబు నెఱుఁగనగునె?
మొగిని దధీచి యెమ్ముకఁ బుట్టదయ్యెనే వాసవాయుధమైన వజ్ర మదియు!
గాంగేయుఁడవ మతీకార్తికేయుం డన నాగ్నేయుఁ డన రౌద్రుఁడనఁగ శరవ
ణోద్భవుం డన గుహుం డుద్భవిల్లఁడె? శర స్తంబజన్ముఁడు గాఁడె ధర్మవిదుఁడు
కృపుఁడు? ఘటసంభవుఁడుగాఁడె కీర్తిపరుఁడు వరుఁడు ద్రోణుండు? విప్రులవలనఁ బుట్టి
రైరె సత్క్షత్రియప్రభు లవనిఁ గావఁ గడఁగి? మీజన్మములు నిట్ల కావె వినఁగ?" 1.6.60

ఇందు మొదటిపాదమువలనఁ గర్ణుఁ డవిదితజన్ముఁ డైనంతమాత్రమున నీచజన్ముఁడని సంభావింపరా దనునర్థమును, సురల జన్మమువలె నేఱులజన్మము వలె శూరుఁడైన యితనిజన్మము కూడఁ దెలియకపోయినను బవిత్రమే యగు ననునర్థమును స్ఫురించును. రెండవ పాదమువలన నొకవేళ జన్మహేతువు నింద్యమే యైనను పుట్టినవానికి నింద వర్తిల్ల దనునర్థము వ్యక్తమగును. మూఁడు నాలుగు పాదముల వలన పగత్పితరులైన పార్వతీ పరమేశ్వరుల సంతానమై దేవసేనాపతి యగు కుమారస్వామి యంతటి వానికే జన్మవిషయమున నిందతప్పనిచో నిఁకజెప్పెడిదేమి? అతఁడు నింద్యుఁడైనచో నీతఁడు నింద్యుఁ డగు లెమ్మనునర్థము తోఁచును. అర్జునునితో కర్ణుడు పోరుచుండఁగా నే 'ధర్మవిదుఁ డు' ధర్మ ప్రసంగము! దెచ్చెనో, దేనివలన నింతటిరభస పుట్టెనో యామహానుభావుఁడు కృపాచార్యుఁడు పుట్టినదెక్కడ? జెల్లుగడ్డిలోఁగదా! అతను శూరాగ్రణియైన కర్ణునిఁ దెగనాడుచుండఁగా నుపేక్ష వహించిన మహాకీర్తి పరుఁడు శ్రేష్ఠుడు నైన ద్రోణాచార్యుఁడు జన్మించినది కుండలోఁగదా! ఇత్యాది విధముగా ధర్మపరుఁడు, మహా కీర్తిపరుఁడు, వరుఁడు అను కృప ద్రోణ విశేషణములు దుర్యోధనుని వెక్కిరింతకు వ్యంజకములు. ఇంతకు నవ్వరవ్వరనో పేర్కొననేల? ఉత్తమ క్షత్రియుల మనుకొనుచున్న మీ జన్మములు మాత్రము శుద్ధమైనవా? అట్టి మీ రీతనిని నిందించుట యెంత అవివేక మనునర్థము తుదిపాదమున! దోఁచును. ఇట్లు దుర్యోధనుని గర్వామర్షము లిందు ప్రతీయమానములగును.

ఇట్లే కుమారాస్త్ర విద్యా ప్రదర్శన కథాభాగమున నతిలోకవిద్యా ప్రదర్శన సందర్భమునందును, గర్ణుని ప్రవేశము, పాండవులు దానిని సహింపకుండుట, దుర్యోధనుఁడు దొరనుజేయుటకై కర్ణున కంగరాజ్య మిచ్చుట, కర్ణార్జునుల మాత్సర్యోదయము మున్నగు నంశములు ప్రాయికముగా విస్మయహేతువులై యద్భుత రసావహము లగుచున్నవి. దీనికి కర్ణార్జునాలంబనక యుద్ధవీర మంగము.

తఱువాత ద్రుపదరాజయ వృత్తాంతమున ప్రధానముగా అర్జునాద్యాలంబ నకమగు యుద్ధవీరము ప్రతీయమానమగును.

ధృతరాష్ట్రుఁడు ధర్మజుని యువరాజుఁ జేయఁగా నీసువహించిన దుర్యోధనుఁ డు తండ్రితో నిట్లు పలికెను :

"వీరులని పాండుసుతులకు వెఱతు నేను; వెఱచుటకుఁదోడుగా నిష్ట విభుఁడ వీవ
పాండవజ్యేష్ఠునకుఁ బ్రీతిఁ బరమయొవ రాజ్యమిచ్చితి కురువృద్ధరాజులొద్ద" 1.6.121

ఇందు దుర్యోధనునకు తండ్రియెడఁ బుట్టిన యమర్షమును, యుధిష్ఠిరునకు రాజ్యమిచ్చుటచేఁ బొడమినశోకమును బ్రతీయమానములగును. తండ్రి నధిక్షేపించు టయు నిందు వ్యంగ్యము. 'విభుఁడ నీవు' అనుటలో నీ ప్రభుత్వమును సరియే, నీవును సరియే.

తన కొడుకులను గాదని యెవ్వఁడైన నితరుని కొడుకులకు రాజ్యమిచ్చు ప్రభువు లుందురా? అనునర్థము వ్యంగ్యము. 'పాండవజ్యేష్ఠునకున్' అనుటవలన నీజ్యేష్ఠ పుత్రునిగతి యేమిచింతించితి వను ప్రశ్న వ్యంగ్యముగా నుదయించును. 'ప్రీతిన్' అనుపదముచే నీవు వానికి రాజ్య మిచ్చుట యెవ్వరి యొత్తిడికో లొంగినందు వలనఁ గాదు. నీకుమారులయం దిష్టము లేక కోరి ప్రీతితో వానిని యువరాజుఁ జేసితి వను నర్థము న్ఫురించును. 'కురువృద్ధరాజులొద్ద' ననుట వలన పెద్దవారందఱు సాక్ష్యముండునట్లుగా నిపుడు కాదనుటకుఁగూడ వీలులేని విధముగా మిక్కిలి నిపుణముగా నాతనికి యౌవరాజ్య మిచ్చితివి. ఆహా నీ పుత్ర ప్రేమ కొనియాడఁదగినదిసుమా? అను వెక్కిరింత స్ఫురించును. ఇదియంతయు దుర్యోధనుని మనోవేదన నభివ్యంజించుటకుఁ జక్కగానుపకరించును.

పుత్రుని దుర్బోధలకు లొంగి ధర్మజాదులను హస్తిపురినుండి పంపివేయ నుంకించిన ధృతరాష్ట్రుని చేష్టాదిక మిందు వర్ణింపఁబడినది :

"పాండుకుమారులం బిలువఁబంచి సుహృన్నివహంబునొద్ద న
ప్పాండుఁ దలంచి నిర్గళితబాష్పకరాళకపోలయుగ్ముఁడై
పాండుమహీశుకంటె నతిభక్తుల మిమ్మొకఁ డేను బంచెదం
బాండుయశో ర్థులార; యిది పథ్యమకాఁగఁ దలంపుఁ డాత్మలోన్."1.6.133

ఈ పద్యమునందుఁ జెప్పఁబడిన పాండుఁదలంచుటయు, నిర్గళిబాష్పకరాళ కపోలయుగ్ముఁడగుటయు ధృతరాష్ట్రుని కౌటిల్యమును వ్యక్తపఱచును. కోసితినుటకు ముందు మేకను చక్కనివచ్చికతెచ్చియిచ్చి మేపుటవంటి దీయభినయము. మీ నాయనకంటె మీరే నాకెక్కువ భక్తు లనుటలో తన యాజ్ఞ నుల్లంఘింపరాకుండఁ జేయు ప్రయత్న మభివ్యక్తమగును. 'పాండుయశోఽర్థులార!' అనునంబోధనముచే మీకు రాజ్యమునందుఁగంటెను యశస్సునందే కోరిక యధికము కావున కీర్తినే యపేక్షించి నాయాజ్ఞను బాలింపుఁ డనునర్థము తోఁచును. మఱియు పాండు శబ్దమునకుఁగల అర్థద్వయసమర్పణశక్తినిబట్టి మీ తండ్రికీర్తివంటి స్వచ్ఛమైనకీర్తి నభిలషించువా రనునర్థ మిట సంభావించినచో శబ్దశక్త్యుద్భవాలంకారధ్వని సిద్ధించును. ఇదియు ధృతరాష్ట్రుని వంచనమునకు మిక్కిలిగా సహకరించును. 'ఇది పథ్యము కాఁగఁదలంపుఁ డాత్మలోన్' అనువాక్యార్థము అది యెట్లును పథ్యము కాదను ధృతరాష్ట్రునియంతరాత్మఘోషము నభివ్యక్తముచేయును. లేదా ధృతరాష్ట్రుఁడు పాండునిఁ దలఁచుట, బాష్పసముద్గమము మున్నగునవి నిజముగా నాతనికిఁ బాండునిపై, పాండవులపైఁ గల ప్రేమమునే యభివ్యంజించునవనియుఁ జెప్పుకొనవచ్చును. పుత్రుని మాట కెదురుచెప్పఁజాలక యాతఁడు చెందు వ్యథ నిది వ్యంజించుననియు నూహింపవచ్చును. ఇట్లిట రెండు ధ్వనులకును

సందేహసంకరము, శబ్దశక్త్యుద్భవధ్వని ధృతరాష్ట్రునివంచనమునకో, దుఃఖమునకో యను గ్రాహకము.

ఈయాశ్వాసమునఁ గుమారాస్త్రవిద్యాప్రదర్శన, ద్రుపదపరాభవఘట్టము లైనపిదప ధృతరాష్ట్రుడు ధర్మజుని యువరాజుఁ గావించుటయు, దానికి సహింపని దుర్యోధనుఁడు ధృతరాష్ట్రుని లొంగదీసికొని పాండవుల వారణావతమునకుఁ బంపుటలో సఫలప్రయత్నుఁ డగుటయు, లాక్షాగృహదహనము, పాండవులు దైవవశమున ప్రమాదమునుండి తప్పించుకొని యడవులపాలగుటయు, హిడింబాసురవధయు, ఘటోత్కచోత్పత్తియు, బకాసురవధయు ననునంశములు కలవు. ఈవృత్తాంతము లందు ప్రాయికముగా పాండవుల ధర్మానురక్తియు, ధార్తరాష్ట్రుల యధర్మాసక్తియుఁజక్కగా ప్రతీయమానములగుచున్నవి. ఇచ్చిన యౌవరాజ్యమునకు చేసేతుల విఘాత మొనరించిన ధృతరాష్ట్రునియెడ ధర్మజున కుదాసీనభావమే యుండుటయు, ఆతనియాజ్ఞఁ దలఁ దాల్చి వారణావతమున కరుగుటయు ననునంశము లాతని ధర్మాత్మత నభివ్యంజించును. లాక్షాగృహదహనము మొదలుకొని జరిగిన వృత్తాంతమునకు నాయకుఁ డు భీముడు. అందు తదాలంబక మగు నద్భుతరసము చక్కగాఁ రూపొందినది. దహనక్రియకు సన్నద్ధుడై వచ్చిన పురోచనునిఁ దదాశ్రితులను గృహముతోపాటు దహించివేయుటయు, సురంగమార్గమునఁ దల్లిని సోదరులను మోసికొని సురక్షిత ప్రదేశమునకు వెలువడుటయు, నిద్రావశులై యున్నవారికి నిద్రాభంగముకానీకయే హిడింబాసురుని వధించుటయు, ఏకచక్ర పురమున బకాసురవధ గావించుటయు విస్మయకరవృత్తాంతములు. వినిచే నద్భుత రసమాస్వాద్య మగుచున్నది. హిడింబానురాగవృత్తాంతమునందలి శృంగారమును, విప్రగృహమునందు జరిగిన కుంతీవిప్రసంవాదమునందలి ధర్మప్రసంగమును అంగములు. విప్రబాలకుని ముగ్ధవచనములు హాస్యరసావిర్భావమునకు దోహదములు. అదియుఁ బ్రధానమగు నద్భుతమున కంగమే. భీమహిడింబులయు, భీమ బకులయు పోరాటమున నుదయించు యుద్ధవీరముకూడ నద్భుతరసమున కంగప్రాయమే. ఇట్లీ యాశ్వాసమునఁ బ్రాయికముగా నద్భుతరసము పోషింపఁబడినది. ప్రధానకథానాయకులగు పాండవులప్రారంభవృత్తాంత మద్భుతరసాన్వితమై యుండుట యనంతరకథావృత్తాంతశ్రవణకుతూహలమునకు దోహదికారి కావున నిం దద్భుతరసము నూహించుట సముచితము.

## ఆదిపర్వము - సప్తమాశ్వాసము :-

కుంతీదేవి కోడలికిఁ గొడుకులు తెచ్చిన యాహారములవిభాగక్రమము నిట్టని వివరించెను :

"వెడఁదయురంబును నన్నువ  కడుపును దృఢకఠినతనువు గల యాతనికిం
దడర నొకపాలు పెట్టుము  వడి నాగాయుతబలంబువాఁ డతఁ డబలా!"1.7.224

ఏడుగురు మొత్తము పంచుకొని తినవలసియన్నములో నగ మొక్కని కిడుటయు, మిగిలినసగము తక్కినవారు పంచి కుడువవలయుటయు ననుదానికిఁ గారణ మిందు వ్యంగ్యముగాఁ జెప్పఁబడినది. భీముని యాకారవర్ణనము చేయుటలో నింతప్రమాణములో నాహార మిడుటయందలి యౌచిత్యము వ్యక్తమగును. 'వడినాగాయత బలంబువాఁ డతఁడు' అనుటచే 'నీతడు కేవలము తిండిపోతని భావింపకుము. మహా బలవంతుఁడు. అతనిబలము మనకు పెన్నిధానము' అనునర్థము వ్యంగ్య మగును. దీనివలన ద్రౌపదికి సంసారజీవితములో నేకష్టపాటువచ్చినను వారించి రక్షింపఁగల మహాబలుఁడు తనపతులలో నొకఁడు గలఁ డను ధైర్యము కలిగించు కుంతీదేవి తాత్పర్యమును, అమె వాత్సల్యమును ప్రతీయమానములగును.

పాంచాలి పంచభర్తృక యగుటను వారింపఁదలచిన ద్రుపదుఁడు వ్యాస భగవానునితో నిట్లనుచున్నాఁడు :

"విమలమతి : యన్యులకు విష  యమె ధర్మాధర్మనిర్ణయము సేయఁగ ది
వ్యమునీంద్ర : దీని సువిచా  రముసేయుము ధర్మసంకరము గాకుండన్."
1.7.250

ఇందు ధర్మజుని వ్యంగ్యముగాఁ దప్పుపట్టు ద్రుపదుని యభిప్రాయము గమ్యమానమగును. 'విమలమతి' అనుపదముచే ధర్మాత్ముఁడేయయ్యు ధర్మజుఁడు ప్రకృతమున కామదోషదూషితుఁడై విమలమతిత్వమును గోల్పోయి మాటాడుచున్నాఁ డను భావము వ్యక్తమగును. 'అన్యులకు' అనుపదమర్థాంతరసంక్రమితవాచ్యమై పక్షపాతరహిత బుద్ధివై లోకమును ధర్మమార్గమున నడపింపఁగల నీకంటె నన్యుల కనునర్థమును బోధించును. 'దివ్యమునీంద్ర!' అనుసంబోధనము నీయుపదేశ మీధర్మజునకు ననుల్లంఘ్యము కావున నాతనికిఁ దగిన హితోపదేశమును ప్రార్థనమునభివ్యక్తము సేయును. సువిచారము సేయుము' అనుటలో నీధర్మజుడు యుక్తాయుక్తములు బాగుగా విచారింపక యిట్టి నిర్ణయమునకు వచ్చెను. ఆతనికిఁ దెలియఁ జెప్పుటకై నీవు బాగుగా విచారింపు మనునర్థము తోఁచును. 'ధర్మసంకరము గాకుండన్' అనుటచే నీవిప్పుడు సరియైన నిర్ణయము చేయనిచో ఈధర్మరాజువలన ధర్మమునకు సాంకర్య మేర్పడుచున్నది. అది వాంఛనీయము కా దన్నభావము ధ్వనించును.

ఇట్టి యర్థవిశేషము సంభావితమైనది కావుననే వెనువెంటనే ధర్మజుఁ డొకింత కోపముతో "కృష్ణద్వైపాయనునసమక్షంబున" ద్రుపదునితో నిట్లనియెను :

"నగియును బొంకునందు వచనంబు, నధర్మువునందుఁ జిత్తముం
దగులదు నాకు నెన్నఁడును ధర్ము వవశ్యము; నట్ల కావునన్
వగవగ మాకు; నేవురకు వారిజలోచనఁ గృష్ణ నీఁదగుం
దగదను నీవిచారములు దక్కి వివాహ మొనర్పు మొప్పుగన్."1.7.252

ఈయాశ్వాసమున ధృష్టద్యుమ్నద్రౌపదీసంభవకథనంబును, పాండవులు కృష్ణద్వైపాయనుని సందర్శించుటయు, గంగాతీరమున నర్జునుఁడు అంగారపర్ణు జయించుటయు, తపతీసంవరణోపాఖ్యానమును, వసిష్ఠౌర్వోపాఖ్యానములును, ద్రౌపదీస్వయంవరమును, పంచేంద్రోపాఖ్యానమును, ద్రౌపదీవివాహము నను నంశములు గలవు. ఇందు ధృష్టద్యుమ్న ద్రౌపదీసంభవకథనమున అద్భుతరసము నెలకొనును. ద్రుపదుఁడొక ప్రత్యేక ప్రయోజన మపేక్షించి యజ్ఞము చేయనెంచుట, యాజోపయాజుల వృత్తాంతము, యజ్ఞనిర్వహణము, యజ్ఞకుండమునుండి జ్వాలాభీలాంగుఁడు, కరవాలబృహచ్చాపధరుఁడు, వరవర్మకిరీటాలంకారుఁడు, రథారూఢుఁడు నగు నొకపుత్రుఁడు పుట్టుటయు, సర్వావయవ సౌందర్యవిలాసముతో నొక్కకుమారి యుదయించుటయు నాశ్చర్యకరములైన విషయములు. అంగారపర్ణవృత్తాంతమునందర్జునాలంబకమైన యుద్ధోత్సాహముచే వీరరసస్ఫూర్తి గలుగును. తపతీ సంవరణోపాఖ్యానమున శృంగారరస ముప్పతిల్లును. వశిష్ఠ కథ అద్భుత రసోత్పాదకము. ఎడనెడ కరుణము దాని కంగము. కల్మాషపాదుఁడు రాక్షసుఁడగుట, ఆసందర్భమునందలి యాతని ప్రవర్తనమును భయానకరసము ననుభవింపఁజేయును. ఔర్వోపాఖ్యానమునందును భయానకాద్భుత రసములు ప్రతీయమానములగును.

స్వయంవరకథయందు మత్స్యయంత్రభేదన మాశ్చర్యావహము. తన్మూలమున జనించిన యుద్ధమునందలివీర మద్భుతరసమున కంగము. పాండవులు ద్రౌపదిని దల్లికి సమర్పించుటయు నామె మీరేవురు నుపయోగింపుడని నియోగించుటయు నాదిగా ప్రవృత్తమైన ద్రౌపదీపంచభర్తృకతాకథ యంతయు విస్మయ కారకమై యద్భుతరసమునఁ బాఠకుని ముంచియెత్తును. ఎడనెడ ధర్మవీరము దీనికంగము. పంచేంద్రోపాఖ్యానము కూడ విస్మయజనకమే. ఇట్లీ యాశ్వాసమున ప్రాయికముగా పాఠకుఁ డద్భుతరసనిమగ్నుఁ డగుట గానవచ్చును.

## ఆదిపర్వము - అష్టమాశ్వాసము :-

పాండవులపై దండెత్తి వారిని లోఁగొందమన్న ఆలోచన రాఁగా ద్రోణుఁడు దుర్యోధనునితో భీష్ముని వాక్యముల సమర్థించుచు నిట్లనెను :

"బహుగుణ ముత్తమోత్తమము పథ్యము తథ్యము సాధుసమ్మతం
బహితబలప్రమాథి విపులార్థయుతం బగుటన్ భవత్పితా
మహావచనంబుఁ జేకొనుము; మానుగ వారలతోడ నీవు వి
గ్రహ మొనరింప నేమిటికిఁ గౌరవసౌబలకర్ణశిక్షలన్." 1.3.34

ఇందు బహుగుణ మిత్యాది విశేషణములు భీష్ముని వాక్యములను ద్రోసిపుచ్చరాకుండుట యందలి విశేషము నొత్తి చెప్పును. 'భవత్పితామహవచనము' అనుటచే నాతఁడు మావలె నీ కితరుఁడుకాడు. మీతాత; మీయందలి ప్రేమాదరములచే మీ కేయాపదయు రాకుండఁ గాపాడుతాత్పర్యము గలవాఁడు. అట్టి వానిమాట నీవు తప్పక చేకొనవలయు ననునొత్తిడి స్పష్టమగును. 'వారలతోడ' అనున దర్థాంతర సంక్రమిత వాచ్యము. "మహాపరాక్రమవంతులు, సాధు సమ్మతులు, సద్గుణ గరిష్ఠులు, ఒకవేళ నీ మూర్ఖతవలన యుద్ధమే వచ్చినచో మిమ్మెల్ల నపగతదర్పులఁ జేయఁగలవారు నగు వారలతో" ననునర్థ మిట ప్రతీయమానమగును. 'నీవు' ను అట్టిదియే. స్వయముగా కార్యసాధకుఁడవు కావు. వారితో మార్కొని పరాభవము నొందువాఁడవు నైన నీవు విగ్రహ మొనరింపనేల? యను నర్థమిందు ప్రతీయమానమగును. లేదా పినతండ్రి పుత్రులైన పాండవుల యెడ సౌదర్యము నెరపవలసిన నీవు విగ్రహమును కోరనేల? యను నర్థము గమ్యమాన మగును. 'కౌరవసౌబలకర్ణశిక్షలన్' అనునదియు నర్థాంతర సంక్రమిత వాచ్యమే. ఈ ముగ్గురు నీకు హితులు కారు. ఇచ్చకములాడి నిన్ను మెప్పింతురు. ఇట్టివారి యుపదేశమును గొని పితామహవచనము నిరాకరించుటయా? అనునర్థము వ్యంగ్యమగును. వీరి యుపదేశము గుణహీనము, అధమాధమము, అపథ్యము, అతథ్యము, దుష్టసమ్మతము, అహితబలప్రవృద్ధకము, అనర్థయుతము సుమా! అనునర్థము భీష్మవచన విశేషణములనుబట్టి సంభావ్యము. ఇట్టి నింద యిందు గర్భితముగా నున్నది కావుననే ఖడ్గవాదియగు కర్ణునికిఁ గోపము వచ్చెను. కావుననే యాతఁడు భీష్మద్రోణులవాక్కుల నవకర్ణించి యిట్లు పలికెను :

"ముదుసలులు తమ కిమ్ముఁగా జదివికొండ్రు గాక; పతులకు హితమగు కర్జమేల
యొులసి చెప్పుదు రహితులఁగలిపికొనుట ధర్మువని; రిది నయవిరుద్ధంబుగాదె!"
1.8.38

కర్ణుఁడు గావించిన యధిక్షేపణమునకు ద్రోణుఁడు చెప్పిన సమాధానము :

"ఉడుగక యే మహితముఁ బలి కెడువారము-నీవు హితవు క్రియగొనఁగాఁబ
ల్కెడువాఁడవు - మాకంటెను గడుహితుఁడవు నీవకావె కౌరవ్యులకున్."1.8.40

ఇందు వ్యతిరేకలక్షణచే 'మేము నీవలె నిచ్చకములాడము; చెవుల కప్రియమైనను హితమే పలికెదము; నీవు తాత్కాలికతృప్తికై యిచ్చకము లాడి రాజును వంచింతువు. నీవు కౌరవ్యులకు మిక్కిలి యహితుఁడవు' అను నర్థము ప్రతీయమానమగును. ఈ యర్థము 'నీవకావె!' అనుచోటి కాకువుచేత నుక్తప్రాయ మగుటచే నిది గుణీభూతవ్యంగ్యమున కుదాహరణమగును.

"మాకంటెను గడు హితుఁడవు నీవకావె కౌరవ్యులకున్" అను వాక్యము నందు భీష్ముఁడు కౌరవ్యులకు పితామహుఁ డగుటచేతను, నేను గురువనగుట చేతను ప్రత్యేక ప్రయోజనాపేక్ష లేమిఁ జేసి మేము హితమునే యుపదేశింతుము. నీవన్నో మైత్రి యను నెపమిడి అంగరాజ్యమును బొందినవాఁడవు కావున దుర్యోధనునకు రుచింపని హితము చెప్పినచో మైత్రి చెడునను భీతితో హితమును జెప్పఁజాలవు. కాని నీదే హిత మనియు, మాది యహిత మనియు వాకొనుచున్నావు. ఇది యెంతయవివేకమో పరికింపు మనునర్థము గమ్యమానమగును.

అర్జునుఁడు కపటయతిగా నున్న తన్నుఁ బ్రకటించుకొని గాంధర్వవిధిని వివాహమాడుమని సుభద్ర నడుగఁగా నామె 'లజ్జావనతవదన యయి' యిట్లనెను :

"నన్ను నీనర్జు లెల్ల నిందున్నవారు; వార యెఱిఁగి చేయుదురు వివాహ; మనుచు
వనజనేత్ర కన్యాపురంబునకుఁ జనియె నరిగెఁ, దనలతాగృహమున కర్జునుండు."
1.8.189

సుభద్ర లజ్జావనతవదనాత్వము సంలక్ష్యక్రమమున నర్జునునియెడ నామెకుఁ గల యభిలాషమును వ్యక్తపఱచును. 'నన్ను నీనర్జులెల్ల నిందున్నవారు', 'వార యెఱిఁగి చేయుదురు వివాహము' అనుటవలన నామె వినయాభిజాత్యసంరక్షణ తాత్పర్యము అభివ్యక్తమగును. 'వనజనేత్ర' అనుపదము అర్జునుఁడని యెఱుఁగుటవలన నామె హృదయమునందు వెల్లివిరిసిన యానందవిశేషము కన్నులలో నభివ్యక్తమగుటను సూచించును. 'కన్యాపురంబునకుఁ జనియె' ననుటలో లజ్జాభరముచే ప్రియుని యెదుట నిలువఁజాలని తారళ్య మభివ్యక్తమగును. ఇట్లీ పద్యమున సుభద్రార్జునుల పరస్పరాను రాగము ప్రతీయమానమగును.

జరిత పిల్లలతో నేమాయెనో యని చింతించుచుఁ దనతోఁ బ్రసంగించిన మందపాలునితో లపిత యిట్లు పలికెను :

"నా యొద్దన ప్రార్థించిన వాయుసఖుం డపుడు నీకు వరదుం డయి శా
ర్ఙ్గేయుల నలువురఁ గాతును ధీయుత యని పలికె; మఱచితే మునినాథా!"
1.8.317

"అలికి నెయ్యుండవయి దాని యోగక్షేమం బరయం దలంచి తది పులుఁ గెట యేనియుం బఱచుఁగా కేమయ్యెడు వగవకుండు మనిన....." 1.8.316

ఇందు లపిత సపత్నీమాత్సర్యము చక్కగా నభివ్యక్తమగుచున్నది. 'నాయొద్దన' అనుటచే నిది నేనెఱుఁగనిదా? తల్లి పుట్టిల్లు మేనమామ యొద్దఁ బొగడి నట్లు నన్నే వంచింపనేల? అను నభిప్రాయము వ్యంగ్యము. 'మఱచితే' అనుటలో నీవు మఱచి యగ్నిదేవుఁడు మఱచెనేమో యని యాత్మదోషము నాతని కంటఁగట్ట నేల? యను నభిప్రాయము వ్యంగ్యము. 'వరదుఁడు' అనుటచే దేవత్వము గలిగి వరమిచ్చినవాఁడు మఱచునా? వరమిచ్చినవానిని క్రూరాత్ముఁడని సంభావించుట పాడియా? యనునర్థము తోఁచును. 'మునినాథా!' అను సంబోధనము మౌనివర్యునకు భార్యాపుత్రవ్యామోహము సముచితమా? యను నధిక్షేపణము నభివ్యంజించును. 'అలికి' ననుటలో నీకదియే ప్రియమైన భార్య. నేను గాకపోతి నన్న కోపశోకోక్తి వ్యంగ్యము. ఇట్లు సపత్నీ మాత్సర్య మీలపితావాక్యములందు ప్రస్ఫుటమగుచున్నది.

ఈయాశ్వాసమునందుఁ బాండవుల కర్ధరాజ్యము సిద్ధించుటయు, నారదుని ప్రోత్సాహమువలన వారు భార్యయందు సమయక్రియ నొందుటయు, నర్జును తీర్థ యాత్రలును, వివాహములును, ఖాండవవనదహనమును ప్రధానాంశములు.

ఇందు నమయపరిగ్రహణ వృత్తాంతము వారి సౌభ్రాత్రధర్మానురక్తిని, నియమశీలము నభివ్యంజించుచు ధర్మవీరమును నెలకొల్పుచున్నది. తీర్థయాత్ర యందు ప్రాయికముగా ధర్మవీర శృంగారములు పెనఁగొని యున్నవి. సుభద్రా వివాహ వృత్తాంతమున శృంగారరసము ప్రధానము. ఖాండవ వన దహన వృత్తాంత మద్భుత రస సమన్వితము. ఇందింద్రునకుఁ గృష్ణార్జునులతో నైన యుద్ధమున వీర రసస్ఫూర్తి కలదు. అది యద్భుతమున కంగప్రాయమే యని చెప్పనొప్పును.

## సభాపర్వము - ప్రథమాశ్వాసము :-

సభాలాభముచే యుధిష్ఠిరునకుఁ గలిగిన వైభవ మెట్టిదియో యీ క్రింది పద్యమున కవి వర్ణించెను.

"మదమాతంగతురంగకాంచనలసన్మాణిక్యగాణిక్యసం
పదలోలిం గొనివచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించి ర

య్యుదయాస్తాచల సేతుశీతనగమధ్యోర్వీపతుల్ సంతతా

భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణప్రతాపోదయున్" 2.1.19

కృష్ణుడు సభానిర్మాణమును గూర్చి మయునికి వక్కాణించుచు నది సకల క్షితిపాలసేవ్య సుస్థిర విభవాభిరాముఁడైన యుధిష్ఠిరునకు యోగ్యమైనదిగా నుండవలయుట సూచించెను. సభాలాభమువలన నిట్టి లక్షణము ధర్మజునియందు సమగ్ర మయ్యెనని యిందుఁ జెప్పఁబడినది. ఉదయాస్తాచల సేతుశీతనగమధ్యోర్వీపతులు బలాత్కారముగాఁ గాక ముదమొప్పఁగా వస్తువాహనాదుల నొసఁగి ధర్మజుని సార్వభౌముని సేవించినట్లు సేవించిరి. ఇట్లు సభవలనఁ దత్స్వామి కింత ఘనత వచ్చె ననఁగాఁ దన్నిర్మాణచాతుర్యప్రశంస మాటల కలవికాని దయ్యె ననుట వ్యంగ్యము. ధర్మజుఁడు సహజముగా సంతతాభ్యుదయుఁడే. ఇప్పుడు తత్సభాస్థితుఁడై జగత్పూర్ణప్రతాపోదయుఁ డయ్యెను. ఇది రాఁబోవు రాజసూయ యాగమునకు పూర్వ రంగమైన రాజకోటిని జయించి సార్వభౌముఁ డగుటను సూచించును.

కుశల ప్రశ్న లడిగి నారదుఁడు ధర్మజుని మంత్రుల నియామకమును గూర్చి యిట్లు ప్రశ్న చేసెను :

"అనఘుల శాస్త్ర విధిజ్ఞుల ననురక్తులఁ బితృపితామహక్రమమున వ

చ్చిన విప్రుల మంత్రులఁగా నొనరించితె కార్యసంప్రయోగము పొంటెన్."

2127

ఇందు మంత్రియయినవాఁ డెట్టిలక్షణములు గలవాఁడై యుండవలయునో వ్యంగ్యముగాఁ జెప్పబడినది. అతఁడు పాపరహితుఁడై యుండవలయును. శాస్త్ర విధానముల నన్నింటిని బాగుగా నెఱిఁగినవాఁడై యుండవలయును. తాను సేవించు రాజునెడఁ ద్రికరణశుద్ధిగ ననురక్తుఁడై యుండవలయును. అనువంశికముగ నీలక్షణములు రక్తములో జీర్ణించినవాఁడగుట మేలు. విప్రుఁడనుట వలన "జన్మనా బ్రాహ్మణో జ్ఞేయః, సంస్కారాద్ద్విజ ఉచ్యతే, విద్యయా యాతి విప్రత్వం, త్రిభిః శ్రోత్రియ ఉచ్యతే" అను నభియుక్తోక్తిని బట్టి పరిపూర్ణ విద్యావంతుఁడు కావలయు ననుట వ్యంగ్యము. అపుడే పూనిన కార్యము ఫలవంత మగుననుట యిందు తోచును.

అమాత్యపురోహిత దండనాయకాదులను గురించియు, నృపధర్మములను గూర్చియు పృచ్ఛచేసిననారదునకు ధర్మజుఁడు చెప్పిన సమాధానము :

"నా యథాశక్తిఁజేసి యన్యాయపథముఁ బరిహరించి మహాత్ములచరితలందు

బుద్ధినిలిపి మీయుపదేశమున శుభంబు లయినవానినను‌ష్ఠింతుఁ బ్రియముతోడ."

2157

నారదుఁ డడిగిన సుమారు ముప్పది ప్రశ్నలకు ధర్మజుఁడు చెప్పిన సమాధానమిది యొక్కటియే. ఇది ధర్మజుని వినయమును, శక్తి సామర్థ్యములను సువ్యక్తము చేయును. 'యథాశక్తి' ననుటలో శుభకర్మానుష్ఠానమునందలి ధర్మజుని గాఢశీల మభివ్యక్తమగును. 'అన్యాయపథముఁ బరిహరించి' యనుటచే 'జానా మ్యధర్మం న చ మే నివృత్తిః' అనునట్టి దౌర్బల్యము లేక యన్యాయమార్గమును బరిహరించుచున్నా నను నర్థము తోఁచును. 'మీయుపదేశమున' అను పదముచే నిట్లిట్లు ప్రవర్తిల్లుచుంటివా? యని మీరు నన్నడిగినను నిట్లిట్లు నడవవలయునుసుమా! అని యుపదేశించుటయే మీ యభిప్రాయ మని నేనెఱిఁగితి నని చెప్పుట వ్యంగ్యము. 'ప్రియముతోడ' ననుటచే నిది కేవలము కర్తవ్యమను దృష్టితోఁగాక దానియందు ప్రేమాదరములుంచి యాచరింతు ననునర్థము వ్యంగ్యమగును.

తండ్రి వనువున రాజసూయ యాగముచేయుట కుత్సహించియుఁ బ్రజాసంక్షయ మగునని సంకోచించుచున్న ధర్మజునితో ధౌమ్యప్రభృతు లిట్లనిరి :

"చేయుము రాజసూయ మెడసేయక; దానన చేసి దోషముల్
వాయు నిలేశ! భూప్రజకుఁ; బార్థివులెల్ల భవత్ప్రతాప ని
ర్జేయులు; సర్వసంపదలు సేకొనఁగాఁ దఱియయ్యెఁ; గౌరవా
మ్నాయలలామ! నీ కెనయె మానవనాథులు మానుషంబునన్." 2.1.98

ఇందలి 'దాననచేసి దోషముల్ వాయు నిలేశ భూప్రజకు' అనువాక్యమున రాజసూయ యాగమువలన నీ వేదోషములను శంకించుచున్నావో యవి వాయుట కదితప్ప వేఱుమార్గములే దనునర్థము ధ్వనించును. 'ఇలేశ!' అనుసంబోధనము ప్రజాదోష పరిహారము నీకర్తవ్యమునుమా! అనునర్థమును వ్యక్తముచేయును. 'పార్థివులెల్ల భవత్ప్రతాపనిర్జేయులు' అనుటచేత రాజసూయ యాగనిర్వహణమునకుఁ గావలసిన లక్షణములలో నొకటియగు సార్వభౌమత్వము నీకు సిద్ధించియే యున్నదను నర్థము గమ్యము. 'సర్వసంపదలు సేకొనఁగాఁ దఱియయ్యెఁ' ననుటచే సంపద లల్పబుద్ధుల కడఁజేరి నిష్ప్రయోజనములుగా నున్నవి. వానిని నీవు చేకొని యాగ మొనరించి యోగ్యులకు వంచిపెట్టి 'ఆదానంహి విసర్గాయ సతాం వారిముచామివ' అనున్యాయమును నిరూపింపు మనునర్థము స్ఫురించును. 'నీ కెనయె' అనునది యర్థాంతర సంక్రమిత వాచ్యము. సర్వసద్గుణ గరిష్ఠుఁడవు, మహాపరాక్రమవంతులగు సోదరులు కలవాఁడవు, సర్వజగన్నియామకుఁడైన శ్రీకృష్ణ భగవానుని యండదండలు గలవాఁడవు నైన నీకు రాజు లొక లెక్కయా? యనునర్థ మిట వ్యంగ్యము.

తాను నిర్దోషి యని పలికిన జరాసంధునితోఁ గృష్ణుఁడిట్లనెను :

"కులరక్షార్థ మఖిలనృప కులోద్వహునియోగమున నకుంఠితశత్రు
ప్రళయ విధాయులమయి యిం దులకున్ వచ్చితిమి దుష్టదూషణబుద్ధిన్."

2.1.188

ఇందలి 'కులరక్షార్థము' అనుపదముచే మాపూన్కి పరహితాచరణమునకు కాని స్వార్థపరము కాదు కావున దోషజుష్టము కాదను భావము ప్రతీయమాన మగును. 'అఖిలనృపకులోద్వహునియోగమునన్' అను పదముచే మాకు సర్వరాజకోటియందును శ్రేష్ఠుఁడైన మహారాజుననుజ్ఞ యున్నది కావున మాచేయుపనికి రాజులెల్ల హర్షింతు రనునర్థము సిద్ధించును. 'అకుంఠిత శత్రు ప్రళయ విధాయులమయి' యనుటచే నే నకుంఠితుఁడను, నన్నెవ్వరేమి చేయఁగల రను గర్వము నీకుఁ గలదు. అట్టి శత్రువ వగు నీకు ప్రళయము చేయఁగల సామర్థ్యముతో వచ్చితి మనునర్థము తోఁచును. 'ఇందులకున్ వచ్చితిమి దుష్టదూషణబుద్ధిన్' అనుటచే నీవే దుష్టుఁడవు. మేము చేయఁ బోవు సంహారకాండ త్వల్లక్ష్యమే యనునర్థము వ్యంగ్యము.

ఈ సభాపర్వప్రథమాశ్వాసమున ధర్మజునకు సభాలాభము, నారదుఁడు రాజసూయ ప్రేరకుఁ డగుట, ఇంద్రాదుల సభలవర్ణనము, జరాసంధ వధ, పాండవుల దిగ్విజయము, ధర్మజుఁడు రాజసూయము చేయుట యను వృత్తాంతములు ప్రధానములు. నారద ధర్మజ ప్రసంగమున ధర్మనీతి వాక్చాతుర్యము కన్పట్టుచు పరిపాలనా విషయకములగు ననేకోపదేశములు ప్రతీయమానము లగును. జరాసంధోపాఖ్యానమున జరాసంధుని జనన వృత్తాంత మద్భుత రసావహము. తఱువాతి యాతనివధను వర్ణించుఘట్టము వీరరససమంచితము. పాండవుల దిగ్విజయ వృత్తాంతమునందును వీరరసమే గోచరించును. మాహిష్మతీపురమునందు నీలునితో సంభవించిన యుద్ధమున నాతని కగ్ని సహాయుఁడై సహదేవుని నిలువరించుటయు నాతని ప్రార్థనచే నతఁడు పాండవ సేనకు భయము పాచుటయు నద్భుత రసమును బుట్టించును. అది వీరమున కంగ ప్రాయము. రాజసూయ యాగమునకు చోదనము, ధర్మజుఁడది నిర్వహించుటయు మున్నగు వృత్తాంతమంతయు ధర్మాచరణోత్సాహ సమన్వితమై ధర్మవీరమును స్ఫురింపఁ జేయును.

## సభాపర్వము - ద్వితీయాశ్వాసము :-

కృష్ణుని కర్ఘ్యదానము తగదని నిందించి సభను వీడిపోయిన శిశుపాలునిఁ బట్టువఱచుచు ధర్మజుఁ డిట్లు వచించెను :

"గురుఁడని సమస్తలోకో త్తరుఁడని నీకంటె వృద్ధతములైన నరే
శ్వరు లచ్యుతునర్చన నెడఁ గర మభినందింప నీకుఁ గాదనదగునే." 2.2.20

'నీకంటె వృద్ధతములైన నరేశ్వరులు' అనుటచే సభలోనున్న రాజుల కందఱ కవమానము ఘటిల్లిన దని నీహృదయమును వారి కన్వయించితివి కాని వారి కట్టి యభిప్రాయ మున్నట్లు తోఁచదు. వారందఱు నీకంటె నెన్నో రెట్లు గొప్పవారు. వారిదృష్టిలో నీవు చాల బాలుఁడవు (తమప్ప్రత్యయ మిట వ్యంజకము). వారెంతయో సువిచార శీలముకలవారు (వృద్ధశబ్దమిట వ్యంజకము). నీ కట్టిది లేదు. వారందఱు మోమాట పడికాక ప్రీతి పూర్వకముగా నచ్యుతుని యర్చనను నెడఁదలో మిక్కిలి యభినందింపఁగా అల్పజ్ఞుఁడవు, ఆలోచనారహితుఁడవు, అసూయాగ్రస్తుఁడవు నగు నీవు కాదన్నచో నేమియగు నను నర్థమిట ప్రతీయమానమగును. వృద్ధతములైన నరేశ్వరులు కూడ సవ్యాజముగా కృష్ణుని పూజార్హత నంగీకరించినవారు కారు. బుద్ధిబలముచే నాతని గురుత్వమును, సమస్తలోకోత్తరత్వమును నిశ్చయించుకొనియే యాతని యర్చన నభినందించి రను నర్థము 'గురుఁడని', 'సమస్తలోకోత్తరుఁడని' యను వాక్యభాగములవలనఁ బ్రతీయమానమగును.

శిశుపాలునిఁ బట్టువఱచుచున్న యుధిష్ఠిరునితో భీష్ముఁ డిట్లు పలికెను :

"పాలితదుర్ణయుండు శిశుపాలుఁడు బాలుఁడు; వీని నేల భూ
పాలక! నీకుఁ బట్టుపఱుపన్; మఱి ధర్మ మెఱుంగ వీనికిం
బోలునె రాగకోపపరిభూత మనస్కున కల్పరాజ్యల
క్ష్మీలలనాంధబుద్ధి కనిమిత్తమహత్పరివాదశీలికిన్?" 2.2.22

ఇందు 'భూపాలక' అనుసంబోధనము సాభిప్రాయము. నీవు మహారాజవు. వీఁడు పాలిత దుర్ణయుఁడు. కావున వీనిని శిక్షింపవలయును. లేదా బాలుఁడు కావున వివేకరహితుఁడై ప్రల్లదములాడుచున్నాఁడు, వీనితో నేమియని యొప్పరికింపవలయును. అట్టి స్థితిలో వీని ననునయింపనేల? యను నర్థ మిటఁ దోఁచును. 'నీకు' అనునదియు నర్థాంతర సంక్రమిత వాచ్యరూపమునఁ బైయర్థమునే ధృఢమొనరించును. శిశుపాలుని రాగకోపపరిభూత మనస్కతాదులను బేర్కొని యిట్టివి గల వీనికి ధర్మువెఱుఁగఁబోలునె? యని ప్రశ్నించుటచే ధర్మ మెట్టివానికిఁ దెలియనగునో యను విషయము వ్యంగ్యము. ఎవని మనస్సు రాగ కోపములు పెట్టు త్రిప్పులకు లోనుగాదో, ఎవని కల్ప సంపదవలనఁ గనుగాననిస్థితి యుండదో, ఎవఁడు నిష్కారణముగఁ బెద్దలను నిందించు శీలము లేనివాఁడో యట్టివాఁడే ధర్మము నెఱుఁగు నర్హత గలవాఁ డనునర్థ మిట స్ఫురించును. ఇందలి అంధపదము లాక్షణికము. దీనివలన కంటికిఁగల ఆంధ్యము లోకాలోకన సామర్థ్యము నెట్లు హరించునో యట్లే బుద్ధికి సరియైన నిశ్చయము చేయఁజాలని స్థితి ధర్మువు నెఱుఁగు సామర్థ్యమును హరించును. అట్టివానికిఁ దెలియఁజెప్పినను దెలియదు

సుమా! కావున వీనిని బ్రతిమాలి చెప్పవలసినయవసరము లేదు, విరమింపు మనునర్థము ప్రతీయమానమగును. ఇట్లు శిశుపాలునినైచ్యము నెడ భీష్మునికిఁ బొడమిన జుగుప్సాదిక మిందభివ్యక్తమగును.

శిశుపాలుఁడు యుద్ధసన్నద్ధుఁడు కాగా సభయంతయు మహాసాగరమువలె సంక్షుభితమాయెను. యుధిష్ఠిరుఁడు సభాక్షోభమువారింపు మని భీష్మునిఁ బ్రార్థింపఁగా నాతఁ డీతనితో నిట్లుద్భాటించెను :

> "నీయజ్ఞమునకు విఘ్నము సేయఁగనోపుదురె యొరులు జితదైత్యుఁడు నా
> రాయణుఁడు యజ్ఞపురుషుఁ డ జేయపరాక్రముఁడు దీనిఁ జేకొని కావన్." 2237

ఇందలి 'అజేయపరాక్రముఁడు', 'జితదైత్యుఁడు' అను విశేషణములచేత మహోద్ధతులగు దైత్యుల ననేకుల జయించిన మహానుభావుఁడు శ్రీకృష్ణునకు ఈ సభాక్షోభమునకుఁ బాల్పడిన దుష్టు లొక్కలెక్కయా? ఇందసుర భావముగలవారి నెల్లర నాతఁడొక్కఁడే జయింపఁగలఁడు. అతని పరాక్రమ మెట్టివారికైన నెందఱకునైన అజేయముసుమా! కావున నీవు బెగడొందనవసరములే దనునర్థము వ్యంగ్యమగును. 'యజ్ఞపురుషుఁ' డనుటచే నట్టివాడు చూచుచుఁ జూచుచు యజ్ఞ భంగము నుపేక్షించునా? యనునర్థము స్ఫురించును. 'చేకొని' అనుపదముచే నాతఁడు నీయందలి యాదరాభిమాన ములచే నీయజ్ఞము తనదియే యన్నట్లు భావించి స్వీకరించెను. అట్టివాఁడు దీని నొప్పరికించునా? యనునర్థము వ్యంగ్యము. 'ఒరులు' అనుచోటి బహువచన ప్రత్యయము వ్యంజకమై శత్రువు లెందఱైనను శ్రీకృష్ణుని శక్తికి అగ్నికి శలభములవలె మాడిపోవుదురు గాన యజ్ఞభంగము చేయఁజాల రనునర్థము వ్యక్తమగును.

శిశుపాలుని అధికముగా నున్నయవయవములు కృష్ణుఁ డెత్తికొనినంతనే యణఁ గిపోఁగా సాత్త్వతి భయసంభ్రమములతో నతనితో నిట్లనెను :

> "కుపథప్రవృత్తుఁడయి వీఁ డపనయమున నీ కనిష్టుఁ డయినను గరుణా
> నిపుణుఁడవై నీమఱఁదికి నపరాధశతంబు సైపుమయ్య యుపేంద్రా!"2.2.59

ఇందు 'నాపుత్రునకు' అనక 'నీమఱఁదికి' అనుటలో వీనిని సంరక్షించు బాధ్యత నీదే, ఏలయన వాఁడు నీవాఁడే సుమా! అనునభిప్రాయము వ్యంగ్యమగును. కుపథప్రవృత్తుఁడయి యపనయమున నీ కనిష్టుఁడయినను నపరాధశతము సైపు మనుటలో మాతృవాత్సల్య మెంతగంభీరమైనదో యను నంశము తోఁచును. 'కరుణానిపుణుఁడవై' యనుటవలన సాధుజనసంరక్షణ విషయమున నీవు చూపు కరుణకు

నైపుణ్య మక్కరలేదు. ఇట్టి దుష్టుని సంరక్షించుటయందే నిపుణమగు కరుణ కావలయును. అట్టివానినిఁ గాచినప్పుడే నీకీర్తి యినుమడించు ననునర్థము వ్యక్తమగును. 'ఉపేంద్రా!' అనుసంబోధనము కూడ నీవు కేవలము నా మేనల్లుఁడ వను భావముతోఁ గాక సాక్షాదవతారపురుషుఁడ వను భావముతోనే ప్రార్థించుచున్నాను. సర్వసమర్థుఁడవైన నీ కీతనిఁ గాచు టెంతవని? యనునర్థమును వ్యంజించును. ఇట్లీ పద్యమున సాత్త్వతిహృదయమునందలి భీతియు దైన్యము నభివ్యక్తమగును.

శిశుపాలుడు "అవివేకాస్పదులైన పాండవులు, మోహాంధుండు భీష్ముండు, నీవును సంగ్రామమున నెదుర్కొనుఁ" డని కృష్ణునితో గర్వించి పలుకఁగా కృష్ణుఁడాతని పూర్వాచరితపాపముల నెల్లవారికి నిట్లు తెలియఁజేసెను :

"ప్రాగ్జ్యోతిషంబున భగదత్తుపయి నేము వోయిన నీతఁ డన్యాయవృత్తి
నిట బాలవృద్ధులకెల్ల భయంబుగా ద్వారకాపురిఁ గాల్చె; వీరులైన
భోజరాజన్యులు పొలఁతులతోడ రై వతకాద్రిఁ గ్రీడాభిరతిఁ బ్రమత్తు
లయియున్నవారల ననయుఁడై వధియించె; దేవాభుఁ డగు వసుదేవు చేయు
నశ్వమేధమునకు నభ్యర్చితంబైన హయము నపహరించి యజ్ఞమునకు
విఘ్నమాచరించె వీఁ డతిపాపుఁడై; బభ్రుభార్యఁ దనకు భార్యఁ జేసె."2.2.65

ఇందు వర్ణింపఁబడిన శిశుపాలుని దుశ్చేష్టితములలో వాని పరాక్రమహీనతయు, దౌష్ట్యమును పరిహాస గర్భితముగాఁ జెప్పఁబడినవి. 'ఇట బాలవృద్ధుల కెల్ల భయంబుగా' ననుటలో నెదుర్కొని యుద్ధము చేయఁజాలనివారి నెన్నుకొని పరాక్రమ వంతులెవ్వరు లేనిసమయమున నెత్తి వచ్చిన మహావీరుఁ డీదుష్టుఁ డను పరిహాస మభివ్యక్తమగును. పాప మా భోజరాజన్యులు పొలఁతులతో రైవతకాద్రియందుఁ గ్రీడాభిరతితో నుండి యుద్ధమునకు సంసిద్ధులుకాని స్థితి యందుండఁగా నట్టివారియందు పరాక్రమము ప్రదర్శించిన పరమశూరుఁ డితఁ డనువెక్కిరింపు రెండవ యంశమున నభివ్యక్తము. తనకు బంధువై దేవాభుఁడైన వసుదేవుఁడు యజ్ఞము చేయుచుండఁగా సంరక్షింపవలసిన బాధ్యత గల వీఁడు హయము నపహరించి విఘ్నమాపాదించెను. ఇది యొకటి వీఁ డొనర్చిన సత్కార్యము. ఈయన్నింటికంటె ఘోరమైన పాప మితరుని భార్యను దనకు భార్యఁ జేసికొనుట. ఇట్లు వీఁడనేక మహాపాతకము లొనర్చెను. కావున అవశ్యవధ్యుఁ డను శ్రీకృష్ణుని యభిప్రాయమిట వ్యంగ్యము. ఈ పేర్కొన్న యంశముల చేత శిశుపాలుని యాతతాయిత్వము ప్రతీయమానమై యిట్టి పాపాత్మునిఁ జంపుట మీకందఱకు హితకరమైన విషయము సుమా! అని హెచ్చరించుట యభివ్యక్తమగును.

ఈయాశ్వాసమున శిశుపాలవధ యొక ఘట్టము. ఇందు శ్రీకృష్ణుని కర్ఘ్య మిచ్చుటచే నీసువహించి ప్రల్లదములాడిన శిశుపాలుఁ డాతని చక్రాభిఘాతముచే సమయుట విషయము. ఇందు ప్రాయికముగా రౌద్రాద్భుత రసములు సమకక్ష్యలో నెలకొని శ్రీకృష్ణుని దుష్టశిక్షణ శిష్టరక్షణ యను ధర్మముల కంగములై విలసిల్లినవి. శిశుపాలుని విజృంభణము, భీముని కోపాటోపము, సహదేవుని యౌద్ధత్యము, శిశుపాలుని యుద్ధాహ్వానము, శ్రీకృష్ణుఁడు వాని తలను ఖండించుట యను విషయములు రౌద్రరసజనకములు. శిశుపాలుని జన్మ వృత్తాంతము, వాఁడొనరించిన పాపములు మున్నగునవి విస్మయ హేతువులు. వధ ధర్మ సంస్థాపనార్థము చేయఁబడినది కావున శ్రీకృష్ణాలంబకమైన ధర్మవీర మిందు సంభావింపనగును. ఏత దున్ముఖముగనే తక్కిన వృత్తాంతమంతయుఁ బ్రవర్తిల్లుటచే నిది యంగిగా భావింపనవకాశము గలదు.

మయసభయందుఁ దనపడిన యవమానాదికము నభివర్ణించి శకుని యుపాయమున కంగీకరింపు మని తండ్రినిఁ బ్రార్థించిన సుయోధనునితో నాతఁడిట్లు పలికెను :

"ధీరమతి విదురుతోడ వి చారింతము; వాఁడు నయవిశారదుఁడు; కళా
పారగుఁడు; దీర్ఘదర్శి; య పారహితారంభుఁ డుభయపక్షంబులకున్."2.2.124

ఇందు విదురునికి ప్రయుక్తములైన విశేషణము లన్నియు ధృతరాష్ట్రుని యెదలోని భయసంకోచములను, కపటనీతిని నభివ్యక్తము చేయును. ఇట్టిట్టిఁవాడైన విదురునితో విచారింపక మన మీ కార్యమునకు దొరకొనినచో మనకోరిక నెఱవేఱదన్న భీతి యిందు స్ఫురించును. ధీరమతి కావున వాఁడు తన బుద్ధివిశేషముచే మన కాపట్యమును పసికట్టి సాఁగనీయఁడు. నీతినిపుణుఁడు శకుని కలఁడుగదా యందు వేమో యాతని మించిన నయప్రాగల్భ్యముగలవాఁ డీతఁ డనునర్థము 'నయవిశారదుఁ' డనుపదముచే స్ఫురించును. ఎట్లో ద్యూతమునకుఁ బాండవుల నొప్పించినను నితఁడు కళాపారగుఁడు కావున ధర్మజుని పక్షమవలంబించి ద్యూతమాడినచో జయము శంకాస్పదమగును. మనకడ నుండి వారిపక్ష మేల యవలంబించు నని తలఁపకుము. వాఁడుభయపక్షములకును అపారమైన హితమునే చేయు స్వభావముగలవాఁడు. మనయింటఁ గుడిచి కూర్చున్నమాత్రమున మనయందుఁ బక్షపాత ముంచునని భావింపకుము. మనకైనను జూదము మేలుకాదని వాఁడెంచినచో మనయాట సాఁగదు. రాఁబోవు మేలుగీళ్ళన్నియు మునుముందే విచారించి కనిపట్టఁగల దీర్ఘదర్శిత్వము వానికిఁ గలదు. కావున నిట్టి వానితో విచారించి వాని నంగీకరింపఁజేయనిచో కార్యము

చెడు నను ధృతరాష్ట్రునియభిప్రాయ మిట వ్యంగ్యము. ఇట్లనుట కుటిలత్వముచేతనే యనుటకు వేఱుచోట ప్రమాణము గలదు. విదురుఁడు ధృతరాష్ట్రునివలన విషయమెఱిఁగి నేను దీని నంగీకరింపనని సప్రమాణముగా నుగ్గడింపఁగా ధృతరాష్ట్రుఁ డేమనెనో పరిశీలించినచో నాతని కౌటిల్య మెట్టిదో తెలియును :

"పుత్రుల కేలభేద మగు భూనుత! యేనును నీవు జాహ్నవీ
పుత్రుఁడు నుండఁగా నహితమున్ భయమున్ దొరకొన్నె నాకు నా
పుత్రులకుం బ్రసాదకృతబుద్ధులు వేల్పులు గాన దీనికిన్
మిత్రనిధీ! యొడంబడుము; మిన్నక సంశయమందనేటికిన్" 2.2.133

ఈపద్యార్థమువలన ద్యూతమును వారించుటలో ధృతరాష్ట్రునకు తాత్పర్యము లేదనుట సువ్యక్తము. పాండవులు బలవంతులు గావున విదురుఁడు నీతికుశలుఁడు కావున వీరివలన సూటిగా ప్రమాదమురాకుండఁ జూచుకొనుటకే యాతని ప్రయత్నమంతయు ననునంశ మీపద్యమువలనఁ దెలియుచునే యున్నది. కావున పైకందమున భావించిన వ్యంగ్యార్థము నిరాధారము కాఁజాలదు.

ఈపద్యమునందు ధృతరాష్ట్రుని పుత్రవ్యామోహజనిత బుద్ధిదోష మంతయు వ్యక్తమగును. తనతో పాటు విదురగాంగేయుల గ్రహించుటలో నేదేని ప్రమాదము వచ్చినచో వీరిరువురు నాకండగా నుండి రక్షింపరా? యనునర్థము ధ్వనించును. 'ప్రసాదకృతబుద్ధులు వేల్పులు' అనుటచే నొకవేళ మనకు చేజాఱిపోయినను దైవము మనల నాదుకొనునులె మ్మిపుడు పుత్రులసంబరమును నిష్కారణముగా వారింపనేల? యను భావము ప్రతీయమానమగును. 'మిత్రనిధీ!' అను సంబోధనముచే నాయందు నీకుఁ గల మైత్రిచే నీవు కాదనవలదు సుమా! అను ప్రార్థన మభివ్యక్తమగును. 'మిన్నక సంశయ మందనేటికిన్' అనుటవలన నీ వకారణముగా శంకించుచున్నావు. అట్లు శంకించుట మనదోషమే కాని వారు పాపము చిన్నవారు. వారి కేప్రమాదము ఘటిల్లదు లెమ్మనునర్థము స్ఫురించును. ఋజువర్తనుఁడగు విదురుని దుష్టకార్యమునకు బలవంతముగా నొప్పించు ధృతరాష్ట్రుని ప్రయత్న మీపద్యమున నభివ్యక్తమగును.

ద్యూతక్రీడకుఁ దన్నుఁ బురికొల్పుచున్న దుర్యోధనునితో ధర్మజుఁ డిట్లనెను :

"కుటిలమార్గులైన కుత్సితకితవుల తోడఁ గడఁగి జూదమాడఁజనదు
దానఁజేసి యర్థధర్మవివర్జితు లగుదు రెట్టివారు జగములోన" 2.2.167

ఇందలి 'కుటిలమార్గులయిన కుత్సితకితవులతోడ' అనునది లోకసాధారణముగాఁ జెప్పినట్లున్నను వ్యంగ్యముగా నది తనతో నిపుడు ద్యూతమాడఁగడఁగిన

దుర్యోధనాదులను బరామర్శించును. 'మీరు కుటిల మార్గులు. కుత్సిత కితవులు. నే నెంతద్యూత ప్రియుఁడనయ్యు మీతో నాడుట తగదు. దీనివలన నే నర్థధర్మ వివర్జితుఁడ నగుదును' అను ధర్మజుని భావ మిట వ్యంగ్యము. ఈయధిక్షేపణము సూటిగాఁబోయి శకునికిఁ దగిలినది. కావుననే యాతఁ డానిందను భరింపలేక దుర్యోధనుఁడు ధర్మజునకుఁ దగిన ప్రత్యుత్తర మీఁజాలఁడని భావించి తాను కల్పించుకొని యిట్లు పలికెను:

"ద్యూతకలాకుశలుండగు  నాతఁడు లోకజ్ఞుఁడును మహామతియును వి
ఖ్యాతుఁడు నగు సత్క్షత్రియ  నీతివిదుఁడు దగునె దాని నిందింపంగన్."

2.2.169

ఈశకుని వాక్యములలో ధర్మజుని వెక్కిరించు వైఖరియు నాతఁడు జూడమాడక తప్పని పరిస్థితిని గల్పించుయత్నమును బ్రతీయమానములగును. ఇదియుఁ బైయుధిష్ఠిరుని వాక్యమువలె లోకసాధారణముగా నున్నట్లే యున్నది కాని 'యింతవఱకు నిన్ను మేము ద్యూతకలాకుశలుఁడనియు, లోకజ్ఞుఁడనియు, మహామతియనియు, విఖ్యాతుఁడనియు, నన్నింటికిమించి, సత్క్షత్రియుడనియు సంభావించుచుంటిమి. ఇట్టివాఁ డెవ్వఁడును ద్యూతమును నిందింపఁడు. నీవు నిందించుచున్నావు. దీనిని బట్టి నీకు ద్యూతకళయందుఁ గౌశలములేదనియు, లోకజ్ఞుఁడవు కావనియు, నల్పమతివనియు, విఖ్యాతుఁడవుకావనియు, నుత్తమక్షత్రియనీతి యెట్టిదో నీకుఁ దెలియదనియు సంభావింప వలసి యున్నది' ఇత్యాదినింద అభివ్యక్తమగుటకే శకుని యీ వాక్యమును బ్రయోగించెను. ధర్మజుఁడు తప్పించుకొనుట కిఁక నవకాశము లేదు. దీనిపై నగ్నికాజ్యాహుతివలె 'జూదంబున కీవోడుదేని యుడుగు' మనియు శకుని పల్కెను. ధర్మజుఁడిట్లు ద్యూతక్రియకు బద్ధుఁడు కావలసివచ్చు నేర్పాటును వ్యంగ్యముగా శకుని చేసెను.

భీమసేనుఁడు ద్రుపదరాజనందనకు దుశ్శాసనుఁడు చేసిన యవమానమును గాంచి యిట్లు పలికెను :

"కురు వృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచుచుండన్ మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లుచేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘుని
ర్ఝుర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్."2.2.233

ఇందలి మహాప్రాణాక్షర బాహుళ్యమును, దీర్ఘ సమాసములును నసంలక్ష్య క్రమమున భీమసేనాలంబకమగు రౌద్ర రసమును వ్యంజించును. 'ఇట్లు చేసిన' అనునది చేసిన పని యవాచ్యతను వ్యంజించును. 'ఉర్వీపతి సూచుచుండన్' అనుటలో

నెవని ప్రేరణమున నీఖలుఁ డింతటి నీచకృత్యము నాచరించెనో వాఁడు నిస్సహాయుఁడై నిష్క్రియుఁడై కేవలము చూచుట మాత్రమే చేయుచుండఁగా, నాస్వాదింతు ననునర్థము వ్యంగ్యమగును. 'అనిన్' అనుటవలన మీరు తుచ్ఛులు, ధర్మపాశబద్ధులవై పరాక్రమప్రకటన చేయఁజాలని స్థితిలో నున్న మ మ్మవకాశమును వినియోగించి వంచనతో హింసింపఁగల్గితిరి. మే మట్లుగాక ధర్మయుద్ధమున, పరాక్రమమును బ్రకటించి యెవ్వరు నాక్షేపించుటకు వీలులేని విధమున వర్తింతు మను నర్థము వ్యక్తమగును. 'ఉగ్రాకృతిన్' అనుచోట శబ్దశక్తివలన ఉగ్రుని యాకృతి వంటి యుగ్రమైన యాకృతితో ననునర్థము వ్యక్తమై నాచేయు సంహారము ప్రళయస్వరూపము వంటిదై యెవ్వరికి మాన్పఁజాలనిదగు ననునర్థము వ్యక్తమగును. 'వక్షశ్శైలరక్తౌఘనిర్ఝరము' అనుచోటి రూపకము రక్తము ప్రమాణాతిశయమును దెలుపుచు నేకొంచెమో యాస్వాదించినచో నాకోప మెట్లు తీఱును? వాని కొండవంటి గుండెలోనుండి వచ్చు రక్తము నంతటిని పీల్చివేయుదు నను రూపమున భీమునికోప తీవ్రత నభివ్యంజించును. 'ఆస్వాదింతు' నను క్రియాపదముచే నది నాకు మిక్కిలి యిష్టమైన పానీయమువంటి దగుననునర్థము స్ఫురించును. ఇట్లీ పద్యమున భీమసేనుని నిరవధికమగు కోపోద్వేగము చక్కగా వ్యంజింపఁబడినది.

నేను దాసినా? అదాసినా? యని కోపదుఃఖములు పెనఁగొన నడిగిన ద్రౌపదితో భీష్మాచార్యుఁడిట్లు పలికెను :

*"అవ్వా! నీ ప్రశ్నంబునకు నుత్తరం బయ్యుధిష్ఠిరుండు సెప్పవలయుఁ గాని నాఁడు ధర్మసూక్ష్మత యెవ్వరికిని నెఱుంగ గహనంబు దీనిఫలంబు వేగంబ యిక్కురుకులపాంసను లనుభవింతురు".* **2.2.245**

ఇందు వ్యంగ్యార్థభావన కెంతయు నవకాశము గలదు. భీష్ముఁడు ఈసందర్భమున ధర్మనిర్ణయము చేయఁజాలక కాక, చేయనిష్టపడక యిట్లు పలికెను. అతని ధర్మాభిజ్ఞతకు మహాభారతమునఁ గొల్లలుగా నుదాహరణములు గలవు. కావున నిట నిట్టి యర్థమును వ్యంగ్యముగా భావించుకొనవలయును. 'అమ్మా! నీవడిన యాయ వస్థకు నోటితో నుత్తరమీఁగాదు. ఈ యుధిష్ఠిరుఁడు తన పేరును సార్థక మొనరించి మిమ్మిట్లు చేసిన యానీచులను దారుణముగా వధించుటయే సదుత్తరము' అనునర్థమిట వ్యంగ్యము. ఈయభిప్రాయము 'దీనిఫలంబు వేగంబ యిక్కురుకులపాంసను లనుభవింతు' ననువాక్యమువలన దృఢమగుచున్నది. మఱియు నిందలి పాపఫలంబను భవింతు రనుదానిచే భీష్ముఁడు ద్రౌపదీప్రశ్నమునకు వ్యంగ్యముగా సమాధానము చెప్పుట యైనది. కురుకులపాంసనులదే యధర్మము; నీవు దాసివి కావు; కాని నే నీవిషయము

చెప్పియేమి? చెప్పక యేమి? దీని కీదుష్టులను యుద్ధమున సంహరించుటతక్క వేఱునిష్కృతి లేదుసుమా! అనునర్థము వ్యంగ్యము. దీనివలన భీష్ముని హృదయమునఁ గౌరవులయెడఁ గలిగిన క్రోధాతిశయమును, ద్రౌపదియందును, బాండవుల యందును గల సానుభూతియు, వారి దుఃఖమువలనఁ గలిగిన దుఃఖోద్వేగమును వ్యక్తములగుచున్నది.

దుర్యోధనుని మనఃపరితాపాభివర్ణనము మొదలుకొని యీయాశ్వాసమున జరిగిన కథాభాగమంతయు, ద్యూతము, అనుద్యూతము, పాండవవనగమనము నను నంశములతో నిండినది. దుర్యోధనుని వాక్కులయం దీర్ష్యాసూయలు పెనఁగొని పాండవులయం దాతనికిఁ గల క్రోధామర్షముల నభివ్యక్తము చేయును. ద్యూత ప్రసంగము ధర్మజాలంబకమగు ధర్మాభిరక్షణోత్సాహము నభివ్యక్తము చేయుచు ధర్మవీరమును బుట్టించును. ద్రౌపదీ పరాభవఘట్టము జుగుప్సావహమై బీభత్సరసోత్పాదకమగును. ద్రౌపద్యాలంబకమగు కరుణము దాని కంగము. అనుద్యూతవనగమన వృత్తాంతములయందు ధర్మవీరమే ప్రధానమై కరుణము, రౌద్రము (పాండవుల చేష్టాదికవర్ణనమునందు) మున్నగు రసముల నంగములుగా గ్రహించును. మొత్తముమీద 'ధర్మజుని చెల్లి యుండియు సైరణ సేయు' స్వభావమును, మాటకు కట్టువడి యుండుటయు నెల్లయెడల గోచరించుటచే నీయాశ్వాసమున శిశుపాలవధానంతరము జరిగిన వృత్తాంతమునందు ధర్మవీరమే యంగియని చెప్పనొప్పును.

## అరణ్యపర్వము - ప్రథమాశ్వాసము :

అరణ్యవాసమున కరిగిన పాండవు లేమిసేయువారని ధృతరాష్ట్రుఁడు విదురు నడుగఁగా నతఁడాతనితో నిట్లు పలికెను :

"దేవమూర్తులు పాండుపుత్రులు ధీరచిత్తులు; వారి పెం
పీ వెఱుంగనివాఁడవే ధరణీశ! వాయుసుతుండు గాం
డీవియున్ భుజవిక్రమప్రకటీకృతుల్ వివిధాస్త్రవి
ద్యావిశేషులు వైరివీరులఁ దక్కనిత్తురె పోరులన్." 3.1.46

ఇందలి పాండవవిశేషణములు వారి కన్యాయము చేయరాకుండుటను, జేయఁగా నగుప్రతిఫల మెట్టిదగునో యను నంశమును ప్రతీయమాన మొనరించును. 'వారు దేవమూర్తులు, కావున వారిని వంచించుట దైవవంచనమువంటిదై నిష్కృతి లేనిదగును. వారు పాండుపుత్రులు. అనఁగా గ్రుడ్డివాఁడగు నిన్నన్నయను భక్తితో నారాధించి రాజ్యమునఁ బ్రతిష్ఠించి నీకున్నతి నాపాదించిన నీతమ్ముఁడు పాండుని పుత్రులు, మఱియు వారు

ధీరచిత్తులు. నీకృతఘ్నతను సైచి నీ చిత్తము వచ్చినట్లే ప్రవర్తించి నీవు చేసిన మహాక్రూర నికారమునకు ప్రతిక్రియ నాచరింపక యెప్పటికైన నీకు పశ్చాత్తాపము కలుగదా? అను ధైర్యమును వహించియున్నారు. ఇంతకు నిదియంతయు నీకు తెలియనిది కాదు. తెలిసి తెలిసి సింహపరాక్రములైన వారి కపకృతిఁ గావించితివి కావున నీపాపఫల మనుభవింపక తప్పదు. అందు వాయుసుతుఁడును, గాండీవియుఁ గలరు. ఒకఁడు తన దేహబలముచే తమ కెగ్గొనరించిన వారి నూది వేయును. ఇంకొకఁడు తన యప్రతిమానధనుర్విద్యా వైభవముచే శత్రువులఁ గాల్చి వేయును. కావున పదునాల్గవయేట నెట్లును దప్పని యుద్ధమున నీపక్షమవలంబించువైరు లెంతవీరులైన నెందఱైనను మిగులరు. ఈవిజృంభణమంతయు పోరులందు జరుగును గావున వారిని మీవలె నధర్మచిత్తులని యెవ్వరు సంభావింపఁజాలరు' అను నీవెుదలగు నర్థవిశేష మంతయు నిందభివ్యక్తమగును.

మఱియు విదురుఁడు ధృతరాష్ట్రునితో నిట్లనెను :

"అతిశయితామరోత్తముఁ డహర్పతితేజుఁ డజాతశత్రుఁ డూ
ర్జితుఁ డజితుండు నీసుతులు సేసినయెగ్గు దలంపఁ డాతనిన్
ధృతి నభిషిక్తుఁ జేయుము ప్రతీపకులోద్వహ! యిట్లయైన నీ
కృతమునఁ గౌరవాన్వయ మకిల్బిషకీర్తిఁ బ్రకాశితంబగున్." 3.1.51

ఇంత పరమక్రూరముగా వారిని హింసించిన పిదప ధర్మజునకు రాజ్యమిచ్చినచో నధికార బలమున నాతఁడు నన్నును నాపుత్రులను చిత్రవధ గావింపఁడా? యనుశంక నీకుదయింపనక్కరలేదు. ధర్మజుఁడు దేవతల నతిక్రమించిన సత్స్వభావముగలవాఁడు. కావునఁ బగగొనఁడు. 'అహర్పతితేజుఁడు' కావున తుచ్ఛభావ మాతని దరిఁజేరదు. అజాతశత్రుఁడు కావున నీవును నీపుత్రులును జేసిన యెగ్గులను క్షమింపఁగలఁడు. 'ఊర్జితుఁడు' కావున బంధుజనపీడాకరుఁడు కానోపఁడు. 'అజితుఁడు' కావున రాజ్యమును యోగ్యముఁగా పాలించు సామర్థ్య మాతనికిఁ గలదు. అంతేకాదు ఒకవేళ నీవు రాజ్యమీనిచో తన పరాక్రమముచే విజృంభించినచో నీవా రాతని నేమియుఁ జేయఁజాలరు. ఇట్టి మహాత్ముఁడు కావున 'ధృతిన్' నన్నేమి చేయునో యను భయమునకు తావులేని ధైర్యముతో నాతని నభిషిక్తు నొనర్పుము. నీవు ప్రతీపకులోద్వహుఁడవు. కావున కులనాశనము కాకుండ రక్షింప నెంచినచో నిట్లు చేయుట నీ కవశ్యకర్తవ్యము. చేయనిచో కులమంతరించు ప్రమాదము కలదు. ఇట్ల యైనన్ - ఇది తప్ప వేఱుమార్గాంతరము లేదు. కావున ధర్మజు నభిషిక్తుఁ జేయుము - ఇత్యాద్యర్థ విశేష మిట ప్రతీయమానమగును.

ద్వైపాయన ప్రేరణచే దుర్యోధనునికి హితోపదేశము సేయఁబూని వచ్చిన మైత్రేయుని ధృతరాష్ట్రుఁ డెటనుండి వచ్చితి రని యడుగ నాతఁ డాతనితో నిట్లనెను :

"అలఘుతపోభరంబున జటాజినముల్ ధరియించి రూక్షవ
ల్కలములుగట్టి కూరలును గాయలుఁ బండులు భోజనంబుగా
నలయక కామ్యకం బను మహావిపినంబున నున్న పాండవే
యులకడనుండి వచ్చితిఁ గురూత్తమ! నినుతు నిన్నుఁ జూడఁగాన్."3.1.94

'నీతమ్మునిపుత్రులు నీవనుభవించునట్టి భోగభాగ్యములే యనుభవింపఁ దగినవా రెట్టిదయనీయస్థితిలో నున్నారో భావింపుము. అయినను వారుత్తములు కావున మహావిపినమునందు క్షత్రియజాత్యుచితముగాని తీరున జటాజినములు ధరియించుట మున్నగునవి చేయుచును అలయకయే యున్నారు. అట్టి మహితాత్ముల కడనుండి, వారి కట్టి దారుణపరిస్థితి గల్పించిన నీ కుమారుని, నిన్నును జూడఁగోరి వచ్చితి' ననునర్థ మిట వ్యంగ్యము. 'కురూత్తమ' అను సంబోధనము సాభిప్రాయము. ఈ వంశమున నుత్తముఁడవు కావలసిన నీవిట్టి నీచకార్య మాచరింపఁ దగునా? అనునర్థ మిందు వ్యంగ్యము. 'పాండవేయులకడనుండి నీ సుతు నిన్నుఁ జూడఁగా వచ్చితి' ననుటలో పరమయోగ్యులైన పాండవులను జూచితిని. ఇప్పుడు మీయోగ్యత యెట్టిదియో చూతు నన్న అధిక్షేపణము వ్యంగ్యమగును. ఇట్టి యధిక్షేపణము సూటిగా తగిలినది కావుననే ధృతరాష్ట్రుఁ డిట్లనుచున్నాఁడు :

"అనిన నవనతాస్యుఁడయి ధృతరాష్ట్రుఁడి ట్లనియె; నెట్లు సెప్పుఁడయ్య; యందుఁ
బాండవులకు - సత్యభాషణులకుఁ గుశ లంబె? వార లిట దలంతురొక్కొ?"

"అమితభుజశక్తి నంతక సము లప్పాండుసుతు లిందు సౌభ్రాత్ర స్నే
హమునకు విచ్ఛేదముగా సమయాతిక్రమముసేయ సమకట్టరుగా!"3.1.95, 97

ఇందు ధృతరాష్ట్రుని 'యవనతాస్యత' తాము పాండవులకుఁ జేసిన యెగ్గు మహర్షి కసహ్యమాయెనని తెలియుటచేఁ గలిగిన సిగ్గును సంలక్ష్యక్రమమున నభివ్యక్తము చేయును. 'సత్యభాషణులకు' అనువిశేషణము వారాడిన మాట తప్పి క్రోధాతిరేకమున మాపై నెత్తి వచ్చుటకుఁ జింతింపరుగదా! అనురూపమున ధృతరాష్ట్రుని భీతి నభివ్యక్తము చేయును. 'ఇట తలంతురొక్కొ' యనునదియు నాభీతిని ద్విగుణీకృతముగా వ్యంజించును.

'అమితభుజశక్తిన్', 'అంతకసము' లను పదములు పాండవులన్నచో ధృతరాష్ట్రునకుఁ గల భయాతిశయమును నభివ్యంజించును. సౌభ్రాత్రస్నేహ మనుమాట ధృతరాష్ట్రునికాపత్యమునకు మచ్చుతునక. మేము వారి కెట్టి యపకారము చేసినను

వారు మాయం దపకార బుద్ధిని వహింపరా దనునర్థ మిట తోఁచును. 'సమకట్టరుగా' అనుట సమకట్టకుండునట్లు భగవంతుఁడు చేయుఁగాక యను నాశాభావము నభివ్యక్తము చేయును.

పై ధృతరాష్ట్రుని కుశల ప్రశ్నమునకు మైత్రేయుని సమాధానము :

"చనుదెంచి మహామునివరు లనవరతము వారలకుఁ బ్రియంబొనరఁగ దీ
వనలీగిఁ జేసి కుశలమ మనుజేశ్వర! వారు ధర్మమతియుతు లగుటన్."3.1.99

ఇందు పాండవులకుశలమునకు సుదీర్ఘమైన వాక్యమునఁ గారణమును చెప్పెను. 'చనుదెంచి' - మహామునివరులు పాండవులయందలి ప్రీతితో వారికి వారే వచ్చి దీవనలిత్తురు. వారి దీవనల కొఱకు ధర్మజుఁడు వారిని వెదకికొనుచుఁ బోనక్కరలేదు. 'మహామునివరులు' - వారు చాల గొప్పవారు, ఎవరో యొక రిద్దఱు కారనేకులు, కావున వారిదీవనలు వ్యర్థములు కానేఁపవు. అట్టి యమోఘములైన యాశీస్సుల బలముగల పాండవులకు ఏమి కొఱఁత యుండును? 'ఈగిఁజేసి' - నీ యట్టి కుత్సితు లెంద ఱెన్నియపకృతులఁ గావించినను వారికి మహర్షులయండదండ లుండును గావున వారికి సర్వదా క్షేమమే యగును. 'కుశలమ' - ఏకుశలములేకుండ నీవుచేయనెంచితివో వారాకుశలము సమృద్ధిగాఁ గలిగియున్నారు. 'వారు ధర్మమతి యుతులగుటన్' - '*ధర్మో రక్షతి రక్షితః*' అను న్యాయము ననుసరించి వారి ధర్మమువలననే వారి కిట్టి వైభవము ఘటిల్లినది. అంతేకాని మహర్షులకు వారియందు నిర్వ్యాజముగా ప్రేమ పుట్టలేదు. పరిశేష న్యాయమున 'మీ రధర్మమతియుతులగుటచే ధర్మద్రోహులైన మీకు పరమబ్రహ్మణ్యుల యాశీర్బలముండదు. కావున వినాశము తప్పదు' అనునర్థ మీ పద్యమున నభివ్యక్తమగును.

భీమసేనుని క్రోధోక్తులకు ధర్మజుఁడు సమాధానము చెప్పుచు నిట్లు పలికెను:

"అలఘుగుణంబులం దధికుఁడైనమహాత్ముఁడు రాగకోపమా
యలఁబడి యక్షమావివశుఁడై యచిరాంశులతావిలాసచం
చలయగులక్ష్మి కాసపడి సత్యము ధర్మువుఁ దప్పి సత్సభా
వలిఁ దగువారియొద్దఁ దగువాఁడయి సద్విధి నుండనేర్చునే!" 3.1.259

అలభ్యములైన గుణసముదాయముచేత సమానులలో నుత్తమశ్లోకుఁడై మహాత్మత గాంచినవాఁడు, తుచ్ఛములైన రాగకోపముల మాయలలోఁ బడుటయే దోషము. దానివలన ప్రత్యక్షముగాఁ గలుగు మొదటి నష్టము క్షమానాశము. దానితో తనవశము దనకుఁ దప్పును. పోనీ, వ్రతము చెడినను ఫలము దక్కెనని తృప్తి పడుటకును వీలులేదు. ఏలయన, దక్కెడు ఫలము లక్ష్మి. అది యెట్టిది? అచిరాంశు విలాసచంచల. క్షణకాలమైన

నిలుచునను నమ్మకము లేదు సరికదా, నశించుట మాత్రము నిశ్చితము. ఇట్టి యతిచంచలమైన తుచ్ఛ ఫలమునకై బలి పెట్టవలసిన విషయములో అమూల్యము లైన సత్యధర్మములు. ఇవి నిత్యములు. అనిత్య వస్తు ప్రాప్తికై నిత్య వస్తు వినాశ మభిలషణీయమా? ఇది యుభయభ్రష్టతకుఁ జక్కని మార్గము కదా! ఇట్లు చేయువాని నెవ్వరైనను సమాదరింతురా? - అనునర్థము ఈ పద్యమున వ్యంగ్యమగును.

ఊర్వశి దివ్యవిలాస విభ్రమములతో చక్కగా నలంకరించుకొని తనకడకు రాఁ గా నర్జునుఁ డిట్లు పలికెను :

"ననుఁ బుత్రస్నేహంబున మనమున మన్నించి శుభసమగ్రునిఁ జేయం
జనుదెంచి తీవు ముదమున జనయిత్రీ! యేఁ గృతార్థజన్ముఁడ నైతిన్."3.1.359

ఊర్వశివేషము, రాకలోనితీరు, విలాసాదులు నర్జునున కామెరాకయందలి కారణమును జెప్పకయే చెప్పినవి. కావుననే యామె కామతీవ్రత నడ్డుకొనఁ దలంచి యామె తన కోరికను విప్పి చెప్పకమున్నే తానే ప్రసంగ మారంభించెను. ఈ పద్యము నందలి వాక్యార్థము నియభిప్రాయమును నేనెఱిఁగితి నది కొనసాగ దని వ్యంగ్యముగా నర్జునుఁడు చెప్పుట నభివ్యక్తము సేయును. 'జనయిత్రీ' అను సంబోధనమును, 'పుత్రస్నేహంబున' అను పదమును నీయందు నాకు కామవికార ముదయించుట యసంభవ మనునర్థమును వ్యంజించును. 'శుభసమగ్రునిఁ జేయం జనుదెంచి తీవు' అనుటలో నట్టిదానికై రావలసిన నీ విట్టి దానికై వచ్చు టెంత గర్హ్యమో యూహింపు మనునర్థమును వ్యంజించును. 'ఏఁ గృతార్థజన్ముఁడ నైతిన్' అనుట దివ్య విలాస విభ్రమములతోఁ జనుదెంచి నానిగ్రహమును బరీక్షింప నెంచిన నిన్ను జనయిత్రీ! అని సంబోధించి యట్లు చూడఁగలిగితిని గావున నేను కృతార్థత నందితి ననునర్థమును స్ఫురింపఁజేయును.

పాండవవనవాసాయాసప్రారంభఘట్టము నభివర్ణించిన యీయారణ్య పర్వ ప్రథమాశ్వాసము నందు ధర్మజుఁ డతథిజనాభ తర్పణావకాశము లేమికి వగచుట మున్నగు విషయములు అతని ధార్మిక జీవనము నభివ్యక్తము చేయును. దీని కాతని దుఃఖము వలనఁ గలుగు కరుణ రసమంగము. కిమ్మీరవధ ఘట్టము వీరరసోత్పాదకము. రౌద్రము దాని కంగము. కృష్ణపాంచాలాభిగమనవృత్తాంతము ఇష్టజనస్నేహాభిలాషజనితరతి నభివ్యక్తము చేయును. అర్జునుని తప ఆదికము, పాశుపతాస్త్ర సంపాదనము, కైరాతము ననువృత్తాంతము లద్భుత రసావహములు. వీరాదిక మట నంగము. ఊర్వశీశాపవృత్తాంత కథనము అర్జునుని మనోధైర్యమును వక్కాణించుచు ధర్మవీరము నభివ్యక్తము చేయును.

నడుమ కృష్ణుఁడు ధర్మజునకుఁ జెప్పిన సౌంభకాఖ్యానము వీరాద్భుత రససమ్మిశ్రితము.

## అరణ్యపర్వము - ద్వితీయాశ్వాసము :-

దేవదూతయై తన యంతఃపురమునకు వచ్చిన నలుఁడు దమయంతి కెట్లెట్లు కాననయ్యెనో యీక్రింది పద్యమున వర్ణింపఁబడినది :

"దమయంతి మనోభవనిభు నమరేంద్రప్రతిము దినకరాభు సుధారుక్
సము వరుణసదృశు ధనదో పము నశ్విసమాను నిషధపతిఁ జూచి నలున్."3.2.41

ఇందలి నలవిశేషణమువలనఁ బ్రథమవీక్షణమునందే యాతఁడు దమయంతి హృదయమున నెట్లు హత్తుకొనిపోయెనో స్వయంవరమున నామె యింద్రాదులఁ దిరస్కరించుట యందలి యౌచిత్య మెట్టిదియో వ్యంగ్యముగాఁ జెప్పఁబడినది. మనోభవ నిభుఁ డనుటచే ననన్యరూప లావణ్యములును, అమరేంద్ర ప్రతిముఁ డనుటచే త్రిభువన పాలనదక్షతయు, దినకరాభుఁ డనుటచే పట్టశక్యము కాని తేజోవిశేషమును, సుధారుక్సముఁ డనుటచేఁ జల్లనికాంతి విశేషమును, వరుణసముఁ డనుటచే జలాధిదేవతయగు వరుణునిఁ బట్టి యూహింపదగుఁ గాంభీర్యమును, ధనదోపముఁ డనుటచే నైశ్వర్యమును, అశ్విసమానుఁ డనుటచే నాయురారోగ్య వైభవమును నలునియందు దమయంతికి గోచరించె నను నర్థమిట వ్యంగ్యము. ఈ గుణసమాహారముచే నాతఁడు దేవేంద్రాదులకంటె నధికుఁ డను నర్థము ప్రతీయమానమగును. వరుని విషయమున నన్వేషింపఁదగు సర్వలక్షణములును దమయంతికి నలునియందుఁ బ్రథమవీక్షణముననే గోచరించె నను నర్థము కూడ నిందుఁ దోఁచును.

ఇంద్రాదులలో నొక్కని వరింపుమని నలుఁడు కోరఁగా దమయంతి 'నేను నీధనమను, నాయందుఁ బతిబుద్ధి గావింపుము, కానిచో ప్రాణపరిత్యాగము చేసికొందు' నని పలికెను, అప్పుడు నలుఁడిట్లు పలికెను :

"భూరిసత్త్వులు సర్వలోకవిభుల్ విభూతిసమృద్ధు లి
ద్ధోరుతేజులు నిన్నుఁ గోరుచునున్నవా రమరోత్తముల్;
వారిపాదరజంబుఁ బోలనివాని నన్ను మనుష్యు సం
సారిఁ గోరఁగఁ జన్నె నీకుఁ బ్రసన్నులై సుర లుండగాన్". 3.2.49

'నిన్నుఁగోరెడివారు సామాన్యులు గారు. అమరులు. మరణము లేనివారు. అందు నుత్తములు కావున నీకు నమరత్వ మొసఁగి శాశ్వతమైన సుఖమును సంధానింతురు. భూరిసత్త్వులు గావున వారివలన నీ కపరిమిత సౌఖ్యము సమకూరును. సర్వలోక విభులు కావున నీ కగుప్రాభవము మేరలేనిది. విభూతిసమృద్ధులు గావున నీవు కోరిన భోగములఁ

గాదనక తీర్తురు. ఇద్దేరుతేజులు గావున మీదాంపత్యమున కెట్టివాఁడు నేయాపదయుఁ జేయఁజాలఁడు. అంతేకాదు, వారు తమకుఁ దామై నిన్నుఁ గోరుచున్నారు గావున నీ వనుగ్రహించినచో నిన్నుఁ బువ్వులఁబెట్టి పూజింతురు. ఇఁక నేనో, వారి పాదధూళికినిఁ బోలఁజాలనంతటి తక్కువవాడఁను. మఱియు మనుష్యుడను. ఏనాటికో యీశరీరమును విడువక తప్పని పరిస్థితి గలవాఁడను. మఱియు సంసారిని కావున నావలన నీకు సాపత్న్య దోషము వాటిల్లును. కావున నన్నుఁ గోరుటమేలా? వారికిని నాకును హస్తిమశకాంతరము గానవచ్చుచునే యున్నది గదా!' అనురూపమున నలుని చిత్తశుద్ధి యిందభివ్యక్త మగును.

పతి తన్ను విడిచిపోయెనని యెఱిఁగి దమయంతి భయశోకవ్యాకుల చిత్తయై యిట్లు విలపించెను :

**"హా మహారాజ! మహామహీరక్షణ దక్షదక్షిణబాహుదండ! దండి**
**తారాతి! నిషధరాజాగ్రణీ! నన్నిట్లు వీతదయుండవై విడిచి చనఁగఁ**
**దగునె? నీవెన్నఁడు ధర్మువు దప్పని వాఁడవు - సూనృతవ్రతరతుండ-**
**వేడకుమని నన్ను నూఱడఁబలికిన పలు కిట్లు మఱవంగఁ బాడియగునె?**
**పొదలలోన డాఁగి పొడసూప కిట్లేల యున్నవాఁడ! విట్టి యుగ్రభావ**
**మేల నీకు వలసె; నెటవోదు; నింకెట్లు గాంతు నిన్ను నుగ్రకాననమున!" 3.2.82**

ఇందు 'హా మహారాజ' అనుసంబోధనముచే నట్టి నీభార్య కిట్టి దయనీయ స్థితి యోగ్యమా? అను భావము వ్యంగ్యమగును. 'మహామహీరక్షణ దక్షదక్షిణ బాహుదండ' అనుదానివలన ననంత మగుభూభారమును వహింపఁగల నీకు ధర్మపత్ని భరింపఁ జాలనిదైనదా? యనునర్థము తోచుఁను. దండితారాతి అనునది యేశత్రువో నిన్ను నానుండి వేఱు చేసెనని సంభావింప నవకాశము లేదు. నీయంతనీవే నన్ను వదలితి వనునర్థమును వ్యంజించును. 'నిషధరాజాగ్రణి' అనునది నీకీర్తి ప్రతిష్ఠల కిట్టిసేత సముచితమా! అనునర్థమును స్ఫురింపఁజేయును. 'నన్నూఱడఁ బలికినపలు కిట్లు మఱవంగఁ బాడియగునె' అని నలునిపోక మఱపుగా భావించుట పతియెడ దోషభావనా వైముఖ్యమును వ్యంజించును. 'పొదలలోన డాఁగి పొడసూప కిట్లేల యున్నవాఁడవు' అనుటచే నాశాబంధమును సడలనీని ప్రయత్నము వ్యక్తమగును. 'ఎటవోదు నింకెట్లు గాంతు నిన్ను' అనుట యెటకైనఁ బోవుట నిన్నుఁ గాంచుటకేగాని నన్ను రక్షించుకొనుటకుఁ గాదను నర్థమును వెలయించును. 'ఉగ్రకాననమున' అనుటచే దారితోఁపదు, క్రూర మృగములు నన్ను మ్రింగవచ్చును, దావాగ్ని భస్మీకరింపవచ్చును. ఆటవికులవమానము చేయవచ్చును. మున్నగు భావములు స్ఫురించి యామెభీతిని, నిస్సహాయ స్థితిని

నభివ్యంజించును. ఇట్లిందు దమయంతీ హృద్గతశోకము నలునిసామర్థ్యస్మరణము, తనగతికిఁ గలిగిన నిర్వేదము, దైన్యము, త్రాసము మున్నగు వ్యభిచారి భావములచే పుష్టమై శోకరసముగా నాస్వాదనీయమగుచున్నది.

విదర్భేశ్వరుఁడు నలురాజ్యభ్రంశము విని కూఁతురు నల్లుండు నెటవోయిరో యెందున్నవారో యని శంకించి -

"వారల రోయఁగఁ బంచె న పారబలుం డిష్టులైనబ్రాహ్మణుల సదా
చారుల విద్వాంసుల స త్కారంబులఁ దనిపి వారిఁ గడునెయ్యమునన్."

3.2.139

ఇందలి 'అపారబలుఁడు', 'కడునెయ్యమునన్' అనుపదములవలనను, బ్రాహ్మణవిశేషణములవలనను విశేషార్థ ప్రతీతి యొదవును. అపారబలుఁ డనుటచే నలదమయంతులయన్వేషణ సామర్థ్య మభివ్యక్తమగును. 'కడునెయ్యమునన్' అనుటచే మహారాజు తమయం దంతనెయ్యము చూపఁగా వారు శ్రమకోర్చి యెట్టైన కార్యము సాధించివచ్చు దీక్షగలవారగుట స్ఫురించును. 'ఇష్టులైన' అను విశేషణముచే వారు చిత్తశుద్ధితో కార్యము తమదియే యన్నట్లు వర్తిల్లుదు రను నర్థమును, 'సదాచారులన్' అనుటచే అంతఃపురాదులయందును ప్రవేశింప నర్హులగుదురను నర్థమును, విద్వాంసు లనుటచే తమ పాండిత్య కౌశలాదులచే నలదమయంతుల యన్వేషణమునఁ గృతార్థులుకాఁ గల రనునర్థమును బ్రతీయమానములగును.

(1) "ప్రియమున దమయంతి పునః స్వయంవరము సేయఁగడఁగి సకలక్షత్త్రా
న్వయవీరుల రావించిన నయనిధి ఋతుపర్ణుఁ డొక్కనాటన వేడ్కన్"

(2) "వినవె శతయోజనంబులు సనుదెంచె నయోధ్యనుండి సరి నిందుల కా
తని రథసారథినై యే నును వచ్చితి నతనితో మనోవేగముననన్."3.2.187, 188

ఇందు నలుఁడు దమయంతి నధిక్షేపించు టభివ్యక్తమగును. 'ప్రియమునన్' అనుపదము భర్తృమతియు, సుతవతియు నగు నింతి కేవలశారీరక సుఖము నపేక్షించి మిక్కిలి ప్రియముతో రెండవ స్వయంవరము చాటించిన దిది యెంత హేయమో యూహింపు మనునర్థమును వ్యంజించును. 'పునఃస్వయంవరము' అనుమాట రెండవ పెండ్లి యన్నట్లు లఘుభావద్యోతకము. 'సకల క్షత్త్రాన్వయవీరులన్' అనుటచే పాపము పూర్వము వివేకములేక యితరుల గుణగణముల విచారింపక నలుఁడే కావలయునని పట్టుదల వహించి పెండ్లియాడి పడరానిపాట్లు పడినది. ఇపు డట్టి పొరపాటు రాకుండుటకై యోగ్యతము నెన్నుకొనుటకై క్షత్త్రాన్వయము నందలి వీరుల నెల్లర రావించినది

అనువెక్కిరింత అభివ్యక్తమగును. రెండవపద్యమునందలి 'యేనును వచ్చితి నతనితో మనోవేగమునన్' అనువాక్యమువలన నిట్టి యసాధారణ చరిత్రము గల యిల్లాలి నెప్పుడు చూతునా? యను నుత్కంఠతో మనస్సు వ్రాలిన ట్లిట వ్రాలితి నను నర్థము వ్యక్తమగును. ఇట్లభివ్యక్తమగు నధిక్షేపణమువలన దమయంతియెడ నలునకుఁ దత్కాలమున నుదయించిన యమర్ష మభివ్యక్తమగును.

ఈనలోపాఖ్యానమున ప్రముఖమైనది విప్రలంభశృంగారము. హంసచేఁ గలిగిన వినుకలి వారిరువురకు ననురాగాంకురముల మొలకెత్తించినది. భావనచే నది ప్రబలమైనది. స్వయంవర వృత్తాంతమున నది పుష్పించి ఫలించినది. కలిమాయ దానిని తాత్కాలికముగా ఛేదించినది. దమయంతి పడిన పాట్లన్నియు నలలాభమునకే యగుటచేతను, నలుఁడు తత్తత్సందర్భములందు దమయంతిని దలఁచి కుందుట మున్నగు వృత్తాంతముల చేతను వారిరువురివిప్రలంభము చక్కగాఁ బోషింపఁబడినది. పునస్సమాగమావకాశము ధృఢముగా నుండుటచే కరుణరసము నిట శంకింపరాదు. కాని దమయంతి పడినపాట్లు, అమె నలునికై చేయు కృషి మున్నగువానియందు కరుణ మున్నను నది ప్రధానమగు విప్రలంభశృంగారమున కంగప్రాయమే. కర్కోటకవృత్తాంతము, దమయంతిని పాముమ్రింగుట, బోయ యామెక్రోధాగ్ని జ్వాలల కాహుతియగుట మున్నగు నంశములు విస్మయ హేతువులై యద్భుత రసోత్పాదకము లగును. ఇదియును విప్రలంభ శృంగారమున కంగమే యగును. ఇట్లు పరమసుకుమారమైన విప్రలంభశృంగారమున కనుగుణముగా నిందు శార్దూల మత్తేభవృత్తములు చోటు చేసికొనలేదు. ("నన్నయగారి ప్రసన్నకథాకలితార్థ యుక్తి" యను గ్రంథమున కవిసమ్రాట్ విశ్వనాథవారీయభిప్రాయమును సూచించిరి.) ఈయుపాఖ్యానము మహాభారత గ్రంథమునందలి యాకర్షణీయరసవద్ఘట్టములలో నెన్నికగన్నది.

## అరణ్యపర్వము - తృతీయాశ్వాసము :-

రోమపాదుడు వేశ్యాంగనలను ఋష్యశృంగునిఁ దోడ్కొనివచ్చుటకుఁ బంపెను

"అవేశ్యాజను లధికర సావహభక్ష్యములు విలసదనులేపనమా
ల్యావళులుఁ గొనుచు నరిగిరి నావ్రాశమమునకు నమరనారులలీలన్." 3.3.95

ఇందలి 'అమరనారు' లను పదము వారి సౌందర్యవిలాసాదికముల నుగ్గడించునదియే యైనను అప్సరసలెట్లు దేవేంద్రప్రేషితలై మహర్షులతపములఁ జెఱచి యింద్రునకుఁ బ్రీతి నొనర్తురో యట్లే వీరును ఋష్యశృంగుని బ్రహ్మచర్యమును విఱిచి రోమపాదునకుఁ బ్రీతిఁగూర్తు రను వక్ష్యమాణకథాంశమును సూచ్యార్థసూచనగా వ్యంజించును.

"అభినవయౌవన విలాసభాసినియయిన వేశ్యాపుత్త్రిం గాంచి ఋష్యశృంగుడిట్లు పలికెను" :

"ఎందుండివచ్చితి ఋషికుమార; యే నెన్నఁడు నిట్టి
సుందరాకారు మునిసుతు నేఁదొల్లి చూచియెఱుంగ;
నిందుండు మీ; వని కృష్ణమృగచర్మకృతకుశాసనము
నందుండఁగా బనిచె ఋషి యను బుద్ధి నత్తన్విఁ బ్రీతి." 3.3.97

ఈపద్యమున రెండవ వాక్యమున అస్మదర్థక సర్వనామము ద్విరావృత్తమైనది. అది అపూర్వవ్యక్తి దర్శనమువలనఁ గలిగిన ఋష్యశృంగుని మానసమునందలి తత్తరపాటు నభివ్యక్తము చేయును. పద్యమునందలి ప్రసంగమంతయు నాతని మౌగ్ధ్యమును బ్రతీయమానమొనరించును.

ఈ ఋష్యశృంగచరితము విస్మయజనకమై యద్భుత రసము నాస్వాదింపఁ జేయును. ఊర్వశిఁగనిన విభాండకునకు రేతస్స్ఖలనమగుట, ఋష్యశృంగుని యసాధారణ ప్రవర్తనము, తదాగమనముచే నంగదేశమున వర్షము సమృద్ధిగాఁగురియుట మున్నగునవి విస్మయోద్దీపకములు. వేశ్యలవిలాసాదికములు, తత్కాలమున నిర్వికారచిత్త వృత్తిత్వమును భజించి శాంతరసమును స్ఫురింపఁజేయు ఋష్యశృంగునిమౌగ్ధ్యము నభివ్యక్తము చేయుటకు మాత్రమే యుపయుక్తములైనవి కావున నచట శృంగారమనుట కవకాశము లేదు. కావున నీకథాంశమున నద్భుతరస మంగి యని చెప్పనొప్పును.

పరశురాముఁడు కార్తవీర్యునిఁ జంపుట :

"బలిమి నశేషలోకపరిభావిమహాద్భుత శౌర్యసంపదం
బొలుచు సహస్రబాహుకరముల్ కులిశాతినిశాతబాణధా
రల నతివీరుఁడై తునిమి రాముఁ డరాతులకున్ భయంబుగాఁ
గలహములోన వాని నతిగర్వితుఁ జంపెఁ బరాక్రమోన్నతిన్." 3.3.150

ఇందలి మొదటిపాదమునందలి సమాసముచేతను, పరశురాముని బాణములకు జెప్పఁబడిన కులిశౌపమ్యమువలన స్ఫురించు హస్తముల పర్వతకాఠిన్యము చేతను, ఎదుర్కొన నేయొక్కఁడును సాహసింపలే డను నర్థమును స్ఫురింపఁజేయు 'నరాతులకున్ భయంబుగా' నను వాక్యభాగముచేతను, అతివీరుఁడై యను విశేషణముచేతను పరశురాముని క్రోధశౌర్యములు చక్కగా తోఁచుచున్నవి.

ఈయాశ్వాసము నందలి పరశురామోపాఖ్యానమున ప్రాయికముగా రౌద్రరసము ప్రధానమగుచున్నది. జమదగ్ని భార్యను పుత్రుచే వధింపించుట, కార్తవీర్యుఁడు జమదగ్నిని

సంహరించుట, పరశురాముఁడు కార్తవీర్యుని వధించుట మున్నగు నంశములు క్రోధమును బరిపోషించి రౌద్రరసము నావిష్కరించును.

తన యాహారమును విడువు మనిన శ్యేనముతో శిబి చక్రవర్తి యిట్లనుచున్నాఁడు:

"ప్రాణభయమున వచ్చి యిప్పక్షి నన్ను నాశ్రయించె; నాశ్రితు నెట్టి యధముఁ డయిన
విడువఁ; డనినను నేనెట్లు విడుతు దీని; నాశ్రితత్యాగ మిది ధర్మువగునె చెపుమ!"
3.3.232

ఇందలి 'నేను' అనుపద మర్థాంతరసంక్రమిత వాచ్యము. ఉత్తముఁడను, నిత్యసత్యధర్మనిర్మలుఁడని నీచేఁ బ్రశంసింపబడినవాఁడను నగు నేను అధములును జేయనిపనినిఁ జేయఁగలనా? అనునర్థము వ్యంగ్యము.

ఈశిబిచక్రవర్తియుపాఖ్యానమున దానవీరము ప్రధానరసము. శిబిచక్రవర్తి శరీరమునైనఁ ద్యజించుట కిష్టపడుటయు నాశ్రిత త్యాగమునకు నిష్టపడకుండుటయు నిందు చక్కగా తెలియవచ్చుచున్నవి.

భీమాహవపిశునములైన మహోత్పాతములు గాంచి ధర్మజుఁడు భీమసేనుం గానక 'తానపోయెనా? నీ వెటకేనిఁ బంపితివా?' అని ద్రౌపది నడుగ నామె యాతని కిట్లనెను :

"ధరణీశ! నీకు నాయిచ్చిన పసిఁడితామరపువ్వు
గురువాయువశమున వచ్చినను దానుగొని యిట్టి పువ్వు
లరుదు గాన కుఱంగటం గలిగెనేని యర్థిఁ దెమ్మనిన
నరిగె నీశానుదిక్కునకు నీయనుజుఁ డనిలవేగమున." 3.3.373

ఈ ద్రౌపదీవాక్యములు, చేసినయపరాధ మెట్టికీడుఁ దెచ్చునో, యేమగునో, ధర్మజుఁ డేమనునో యనునామె భీతిశంకాదైన్యాది భావముల నభివ్యక్తము చేయును. 'అరుదుగాన' అనుటచే నెక్కువగా నెందేని దొరకెడి వైనచో నేను గోరెడిదాననుగా ననునభిప్రాయము వ్యంగ్యమగును. 'కుఱంగటం గలిగెనేని' అనుటవలన దూరమైనచో భీముని నేనును బంపియుండెడి దాననుగా నను భావము వ్యక్తమగును. 'ఏని' అనుదానిచే దొరకినచో తెమ్మంటినిగాని తప్పక తేవలయునని నేను నిర్బంధింపలే దనునర్థము ప్రతీయమానమగును. 'అనిలవేగమునన్' అనుటచే రెండవ యాలోచనమునకుఁ దావీక యడిగినదే తడవుగ నాతఁడరిగెను. లేనిచో వారించి యుండెడిదాన నను భావము తోఁచును. 'అర్థిన్' అనుట ఏదో యొక కోరిక యిన్ని నాళ్లకుఁ బుట్టెను. క్షమియింపు మన్నప్రార్థనము నభివ్యక్తము చేయును. ఇట్లీ వాక్యార్థమువలన ద్రౌపది ఆత్మదోషపరిహార

ప్రయత్నము సువ్యక్తమగును.

కనకకమలములకై చెప్పకయే పోయివచ్చిన తమ్మునితో ధర్మజుఁ డిట్లు పలికెను:

"చనునె నీకు నిట్టి సాహసక్రియఁ జేయ, నెల్లవారికంటె నెఱుకగలవు,
గురుభుజుండ నాకుఁ గూర్తెనిచేయకు మయ్య యిట్టి చెయ్వు లనఘ! యింక."

3.3.377

ఇందు 'ఎల్లవారికంటె నెఱుకగలవు' అనునది సుకుమారమైన మందలింపు నభివ్యక్తము చేయును. అందఱకంటె నెఱుకగలవాఁడు సాహసములాచరింపఁడు. నీవాచరించితివి కావున నీయెఱుక శంకనీయము సుమా! అనునర్థమిట వ్యంగ్యము. 'గురుభుజుండ' అనునదియు నట్టిదియే, భుజబలమును నమ్మి సాహసములకుఁ బూనినచో ప్రమాదము రావచ్చు నను నర్థము వ్యంగ్యమగును.

ఈసౌంగంధికాపహరణ వృత్తాంతమున భీమసేనాలంబకమగు ఉత్సాహము వీరరసముగాఁ బరిణతమై యాస్వాదనీయమగుచున్నది. హనూమద్భీమ సేనసమాగమ సందర్భమున నద్భుతము స్ఫురించును. అది వీరమున కంగము.



ఓమ్

# భారత ధ్వని దర్శనము

## సప్తమాధ్యాయము

## అరుణాంశురాగరుచులు

కవిత్రయములో కాలమును బట్టి మూఁడవవాఁడును గ్రంథక్రమమును బట్టి రెండవవాఁడును నగు నెఱ్ఱయ అరణ్యపర్వశేషమును నన్నయ 'రచనయకా' పూరించెను. అతని రచన కవీంద్రకర్ణపుట పేయము. త్రివేణీసంగమమున సరస్వతీ నదివోలె అతని రచన నన్నయతిక్కనల కవితాస్రవంతులలో లీనమై ప్రసరించెను. అతని భారత భాగములోని ధ్వని విశేషములను ముఖ్యములైనవానిని దిక్ప్రదర్శనముగా నీయధ్యాయమున ననుశీలింతము.

### అరణ్యపర్వము-చతుర్థాశ్వాసము :-

పరీక్షిత్తనుసూర్యవంశపురాజు మృగయార్థ మరిగి యొకకన్యఁ గాంచి యామెతో నిట్లనెను :

"ఎవ్వరిదాన వంబుజదళేక్షణ! యేకత మిట్టులేల నీ
విద్వనభూమియందుఁ జరియించెదు నావుడుఁ దండ్రిపంపునం
దిద్వనభూమియందుఁ జరియించెద సద్యరుఁగోరి కన్య నే
నెవ్వరిదానఁగావలయు నేర్పడఁ జెప్పుమ రాజనందనా!" 3.4.324

ఇందు రాజుయొక్కయు నాకన్యయొక్కయు సంభాషణములు వారిరువురి పరస్పరానురాగము నభివ్యక్తము చేయును. 'అంబుజదళేక్షణ' యను సంబోధన మామెసౌందర్యమును వక్కాణించును. రాజునభిలాషమును, నామె తదేకమగు నీక్షణమును దెలుపుచు నామెయనురాగమును వ్యంజించును. 'ఏకత' మనుపదముచే నీవు సిగ్గుపడక నీయభిప్రాయమును సూటిగా వచింపు మనునర్థము తోఁచును. 'నీవు' అనుపద మర్థాంతర సంక్రమితవాచ్యమై యతిలోక సౌందర్యవతివి, మహారాజ్ఞీత్వమునందఁగల యోగ్యతగల

దానవు నగునీవు అనునర్థమును వ్యంజించును. 'ఇట్టులేల ..... చరియించెదు' అనుటలో నన్ను వివాహమాడినచో నీవిట్లు చరింపనక్కరలేదుకదా! యనునర్థమును గూడ సంభావింపనగును. ఆమెయిచ్చిన సమాధానము గూడ వ్యంగ్యవిలసితమే. 'తండ్రిపంపునన్' అనుదానివలన తన శీలమును వక్కాణించు తాత్పర్య మభివ్యక్తమగును. 'నే నెవ్వరిదానఁగావలయు' ననునెదురు ప్రశ్నలో నీదాననుగాఁజాలనా? యనుప్రగల్భ వాక్యము వ్యంగ్యమగును. 'ఏర్పడఁజెప్పుమ!' అనుటలో నీయభిప్రాయమును మాటల మాటున దాపనేల? స్పష్టముగాఁ జెప్పరాదా!' యను భావము వ్యక్తమగును. ఇట్లు వారిరువురి యనురాగ మిట వ్యంగ్యముగాఁ జెప్పఁబడినది.

తన నాభికమలమున నున్న చతుర్ముఖుని వ్రేయనుంకించిన మధుకైటభులతో విష్ణువు 'మీకు గోరినవర మిచ్చెదఁ గొనుం' డనెను. అపుడు వారు 'మేమే నీకిత్తు' మనిరి. అంత నారాయణుఁ డిట్లు పలికెను :

"సత్యవ్రతులార! వరం బత్యంత ప్రీతి మిమ్మునడిగెద; లోక
ప్రీత్యర్థముగా నాచే మృత్యువునం బొందుఁ డిపుడ మీర లిరువురున్." 3.4.395

ఇందలి 'సత్యవ్రతులార!' అనుసంబోధనము ఆడినమాటఁ దప్పవలదు సుమా! అను నెచ్చరికను వ్యంజించును. 'అత్యంతప్రీతిన్' అనుట నేను మీవలెఁ జేఁజిక్కినయవకాశమును జాఱవిడుచుకొను స్వభావముగలవాఁడను గాను; సద్వినియోగము చేసికొందు; నను భావమును వ్యంజించును. 'లోకప్రీత్యర్థముగాన్' అనుటచే నిది నాస్వార్థమునకుఁగాదు, లోకమున కంతటికి బ్రీతిసంధించునది కావున మీకీయక తప్పదను నర్థము స్ఫురించును. 'మీర లిరువురున్' అనుటవలన మీయిద్దఱిలో నేయొక్కఁడు జీవించినను లోకము బాధింపఁబడుట తప్పదను నర్థము వ్యక్తమగును.

ఈయాశ్వాసమున ప్రారంభమున భీముఁడు గావించిన యక్షులతోడి యుద్ధము వీరరసాత్మకము. అట్లే యింద్రకథితార్జునకృత నివాచకవచాదివధవృత్తాంతమును వీరరసస్ఫోరకమే. అజగరోపాఖ్యాన మద్భుతరసావహము. వైవస్వతుచరితమును కల్పాంతాదివృత్తాంతకథనమును విస్మయసంధాయకములు. తక్కిన వామ్యాశ్వహరణేంద్రద్యుమ్నోపాఖ్యానదుంధుమారచరితములును సహృదమునకు విస్మయమునే సంధించును. కావున నివియును నద్భుతరససంధాయకము లగుచున్నవి.

## అరణ్యపర్వము - పంచమాశ్వాసము :-

తనపతికి సేవచేసివచ్చుటచే జాగైనదని విన్నవించు పతివ్రతాతిలకమునకుఁ గౌశికుఁడిట్లనెను :

"నీమగఁ డంత యెక్కుడె; మనీషులు భూసురు లింత తక్కువే;
కోమలి! యేల యిట్లు గడుఁగ్రొవ్వునఁ గానవు; లోకవంద్యులన్
భూమిసురేంద్రులన్ దివిజపుంగవుఁ డాదిగ భక్తిఁ గొల్చుచో -
నేమిట నొక్కవారు గడు నెల్లిదమై రిటు నీకు నిచ్చలున్." 3.5.16

ఇందలి 'నీమగఁడు, అంత, ఇంత, ఎక్కుడె, తక్కువె' యనుపదములు కౌశికుని క్రోధమును జక్కగా వ్యంజించుచున్నవి. 'క్రొవ్వునన్' అనుపద మత్యంత తిరస్కృత వాచ్యమై 'వివేకమేకొంచెమును లేనితనమున' ననునర్థమును వ్యంజించును. త్రిలోకాధిపతి యగుదేవేంద్రునికిఁ గూడ నారాధ్యులైన భూమిసురేంద్రులు కనీస మొక యూరికిఁగూడ నాధిపత్యము లేని మర్త్యభామవగు నీకేల యెల్లిదమైరి యను రూపమున 'నీకున్' అనుపద మర్థాంతరసంక్రమితవాచ్యమగును. 'నిచ్చలున్' అనునది కోపాతిశయమును వ్యంజించును. ఎట్లన తన కామెవలన నేదేని నిరాదరణము జరిగినదన్నచో నది యానాఁడు మాత్రమే కాఁగా 'నిచ్చలున్' అనుపదమును వాడుట 'యిది నీస్వభావమే సుమా! కావున నుపేక్షింపరాని' దను రూపమునఁ గోపమును బ్రస్ఫుటీకరించును. 'మనీషులు' అనుపద మహంకార స్ఫోరకము. తనకు వైయక్తికముగా జరిగినదనుకొను నవమానమును జాతిపరముగా సమన్వయించుటలో నాతని క్రోధము హద్దుమీఱి యుచితానుచితముల గుర్తింపనీనిస్థితి కాతనిఁ గొనిపోయిన దనునంశము ప్రతీయమానమగును. ఇట్లీ పద్యమునఁ గౌశికుని క్రోధావివేకములు అసంలక్ష్యక్రమమునఁ బ్రతీయమానములగుచున్నవి.

కౌశికునితో నాపతివ్రత యిట్లనెను :

"నీ వతిక్రోధనుండవగుటయు నెఱుంగుదు; నీకోపంబున నొక్కకొక్కెర నిహతం బయ్యెఁగాదె; యిది మదీయపాతివ్రత్యమహిమంజేసి గాంచితిం; గాన క్రోధంబు గొనియాడుట లగ్గుగాదని యిట్లనియె:" 3.5.22

ఇందు ప్రస్తావింపఁబడిన కొక్కెర వృత్తాంతము సన్ననిపరిహాసము నభివ్యక్తము సేయును. దీనికి ముందొక పద్యమున 'నొకఁడు కోపించి పయోధిజలము లపేయము లగునట్లు చేసెను. ఇంకొకఁ డలిగి దండకవిషయమును దగ్ధము గావించెను. మఱియొకఁడు బ్రాహ్మణోత్తముల నందఱ మిషవెట్టి మ్రింగు వాతాపిని మ్రింగి జీర్ణించుకొనెను' అని చెప్పి 'నీవొక్కకొక్కెరను జంపితి' వనుటలో నట్టివారికిని నీకు నెంతయంతరమో యూహింపు మనునర్థము వ్యక్తమగును. నీవు నీకోపముచే నల్పజీవి యగు కొక్కెరను మడియింపఁగా నేను నా పాతివ్రత్యమహిమచే దానినిఁ జూడకయే యెఱిఁగితిని గావున నెవ్వరిగొప్ప వారిది కాన కోపముచే నన్నుఁ దూలనాడ వలదుసుమా! యను నర్థమిట వ్యంగ్యము.

ధర్మవ్యాధోపాఖ్యాన ముత్తమధర్మప్రబోధము. మానవుఁడు స్వధర్మానుష్ఠాన తత్పరుఁడగుటయు, మాతాపితృ చరణశుశ్రూషా పరతంత్రుఁడగుటయు నెంతటి ఘనస్థితినిఁ జేకూర్చునో యిందుఁ జక్కగా వక్కాణింపఁబడినది. ధర్మపరతంత్రుఁడైనచో శూద్రుఁడును గురుపీఠము నధిష్ఠింపఁగల్గుననియు, క్రోధాధిదుర్గుణ భూయిష్ఠుఁడైనచో బ్రాహ్మణుఁడును 'శిష్యుడే' యగుననియు నిందు వ్యంగ్యముగా నీతి ప్రతిపాదింపఁ బడినది.

మహామునులందఱు మహాసేను నతిభక్తిం బూజించి కృతాంజలులై యాతని మహత్త్వమును గొనియాడి యింద్రపదవిని బొందుమని ప్రార్థించిరి. అతఁ డింద్రుని కర్తవ్యము లేవి యని వారి నడిగెను. వారు చెప్పిరి. అప్పు డిదియంతయు విని యింద్రుఁ డతనితో నిట్లనెను :

"అనునెడ నింద్రుఁ డిట్లనియె - నట్లయినం గడులెస్స; దేవ! నీ
వనిమిషనాయకత్వమునయం. దభిషిక్తుఁడవై ముదంబుతో
ననుఁ బనిగొమ్ము; నీదుకరుణన్ దొసఁగెల్లను దీఱియుండెదన్;
ఘనతరశౌర్యసారుఁడవుగావున నర్హుఁడ వింద్రలక్ష్మికిన్." 3.5.226

ఈ పద్యమునం దింద్రుని మానసవేదన యభివ్యక్తమగుచున్నది. ఇందలి 'అట్లయినన్' అనువాక్య భాగమునకు పూర్వవాక్యముతో సూటిగా సంగతి లేదు. పూర్వ పద్యమున నింద్రుని కర్తవ్యము లుగ్గడింపఁబడినవి. అట్టియెడ 'నట్లయినన్' అను చేదర్థక క్రియతోఁ బనియేమి? దానిని బట్టి యింద్రుని మనస్సులోని యభిప్రాయము నిట నిట్లూహింపుకోఁదగును. "ఓమహాసేనా! లోకోత్తరపరాక్రమముగలిగి పుట్టిన యైదవనాటనే నీవు నన్ను గెలిచితివి. కావున నీమహామునులందఱు నాముందే నావదవి నధిష్ఠింపవలసినదిగా నిన్నుఁ బ్రార్థించుచున్నారు. అనఁగా నే నాపదవియందుండుట వారికిష్టము లేదు. కావున మంచిదే, నీవే యీ యింద్రపదవి యందుండి సంతసింపుము. ఇంతవఱకు నింద్రుఁడనై యున్ననన్నుఁ బనిగొమ్ము. అపుడు వీరు నిరూపించిన నాయనమర్థత యనుదోషము తీఱిపోవును. ఇంతకును నీవు నాకంటె నధికమగు శౌర్యసారముగలవాఁడవు గదా! కావున బలవంతునిదే రాజ్యము. కానిమ్ము" ఇత్యాదిరూపమున నింద్రుని యమర్షము, కుమారుని, మునులను నేమియు సూటిగా ననలేక బాధపడుస్థితియు నభివ్యక్తములగుచున్నవి.

ఈయుపాఖ్యానమున ధర్మవ్యాధోపాఖ్యానము తఱువాత కుమారస్వామి వృత్తాంతము సవిస్తరముగా వర్ణింపఁబడినది. అందాతని యతిలోక వీరగుణ

సామర్థ్యములు చక్కగా వ్యంజింపఁబడినవి. అతని యవతారకథనమునకు పూర్వ రంగమైన యగ్ని వృత్తాంతమున శృంగారరస మించుక స్పృశింపఁబడినది. అనంతరకథా వృత్తాంతమున అద్భుతరసమును, మహిషాసుర వధఘట్టమున వీరరౌద్రములును నెలకొని యున్నవి.

ద్రౌపది సత్యభామకు పతివ్రతాధర్మము లెఱిఁగింపఁబూని యిట్లనెను :

"పతిమనసు నాఁచికొనియెడు చతురోపాయంబు నీకుఁ జపలాక్షి! సుని
శ్చితమతిఁ జెప్పెద విను, మూ ర్జితమును ధర్మాన్వితము సుశీలంబునుగాన్."
3.5.313

'పతిమనసు నాఁచికొనఁదలఁచినచో నామార్గ మూర్జితమును ధర్మాన్వితమును నుశీలమునుగా నుండవలయునే కాని యింతకుమున్ను నీవనినట్లు మంత్ర తంత్రౌషధములు పనికిరావు సుమా!' అను నెచ్చరిక యిందు వ్యంగ్యము. దాంపత్య జీవితమున ధర్మశీలములే వాంఛనీయములు గాని తుచ్ఛసుఖములు గావను నర్థము ధర్మాన్విత మిత్యాదిపదములచే నభివ్యక్తమగును. 'చపలాక్షి!' అను సంబోధనము సాభిప్రాయము. అక్షులయందలి చాపల్యమంద మేయగునేమో కాని యది మనసునకు దిగిన ప్రమాదకరమగు నను నర్థ మిట సంభావింపవచ్చును.

సత్యాద్రౌపదీసంభాషణ ఘట్టమున ద్రౌపద్యాలంబకమగు ధర్మజీవన విధానము, పతివ్రతాశీలమును జక్కగా నభివ్యంజింపఁబడినవి. ద్రౌపది శ్రీకృష్ణుని మహిషి కుపదేశముచేసె ననఁగా నెంతవారయినను తమయున్నతికిఁ దామేకారణము కావలయుఁ గాని, యాశ్రయమహత్త్వ మంతగా నుపకరింప దనునర్థ మిట వ్యంగ్యమగును.

సమంగుఁడు తనకథనమును ముగించిన వెంటనే కర్ణసౌబలులు గోగణ రక్షణమునకు భవత్సూను నియోగింపుమనఁగా ధృతరాష్ట్రుఁడు గొండొకవిచారించి యిట్లనెను:

తగు గోరక్షయొనర్ప; దుష్టమృగవిధ్వంసంబు నూహింప మే
లగు; నైనన్ - వినుఁ; డవ్వనాంతరమునం దాసక్తిమై నున్న వా
రు గరిష్ఠాత్ములు పాండురాజతనయుల్ రూఢప్రతాపాఢ్యు ల
ట్లగుటన్ మీ గమనంబు నామదిఁ బ్రియంబై తోఁప దెబ్బంగులన్."3.5.362

ఇందు 'వినుఁడు' అనునది తాను జెప్పఁబోవునంశము గౌరవము నభివ్యక్తము చేయును. పాండురాజతనయులు అనునది మీ రకారణముగా శత్రుత్వము వహించినవా రనునర్థమునందుఁ బర్యవసించును. గరిష్ఠాత్ము లనుటచే వారు తమంతతాము మీ కేయపకృతియుఁ గావింపరు, కాని పరిశేషన్యాయమున మీరు నీచాత్ములుకావున వారికిఁ

గీడుచేయఁబోవుదు రనునర్థము వ్యక్తమగును. అట్లగుచో వారు రూఢప్రతాపాఢ్యులు కావున ద్యూతమునాఁడువలె నేఁ డొప్పరికింపరు. మీపొగరణఁగింతురు. మీ కట్టిదగుట యిష్టములేని నామది నది ప్రియమై తోఁప దనునర్థము వ్యంగ్యము. ఈ యర్థము ముందుఁబద్యమున వివరింపఁబడినది కావున నిది గుణీభూత వ్యంగ్యమున కుదాహరణమగును.

"వనమునకేఁగి వందురినవారని వారల మీరవశ్యముం
జెనకఁదలంతు; రప్పురుషసింహులు భూరితపోనిధుల్, మనం
బునఁ గలుషించిరేనియుఁ దపోమహిమన్ మిము నిర్దహింతురొం
డె నతులితాస్త్రశక్తిని వడిం దునుమాడుదు రాజి నందఱన్." 3.5.363

చిత్రసేనుఁడు దుర్యోధనుని సపరివారముగాఁ బట్టుకొనిపోవుచుండఁగా మిగిలిన దుర్యోధనసైనికులు ధర్మజునిఁజేరి యిట్లు ప్రార్థించిరి :

"ఘనబాహాబలదుర్నివారమహిమన్ గంధర్వవీరుల్ సుయో
ధనుఁ దత్కాంతలఁ దత్సహోదరుల బంధప్రాప్తులంజేసి కై
కొని వే పోవుచునున్నవా రదె రిపుక్షోభంబుగావించి నీ
యనుజవ్రాతముఁ గావవే కరుణనిండారంగ రాజోత్తమా!" 3.5.402

ఇందలి 'గనబాహాబలదుర్నివారమహిమన్" అనుపదముచేతను, 'గంధర్వవీరు' లనుపదమునందలి వీరశబ్ద తద్బహువచనములచేతను దుర్యోధనసైనికులు తమ యోటమిని కొంత సమర్థించుకొను తాత్పర్య మభివ్యక్తమగును. వీరెంతవారైనను, ఆవలివారు గంధర్వులు, దివ్యలక్షణోపేతులు, అందును వీరులు, మఱియు బహుసంఖ్యాకులు. అంతేకాక వారి బాహాబలము మిక్కిలి గొప్పది. కావున వీరు వారిని గెలువలేక పోయిరి అను నర్థమిట వ్యంగ్యము. 'వే' అనుపదముచే శత్రువులు వేగముగాఁ బోవుచున్నారు కావున మీరు వేగముగా కార్యోన్ముఖులు కావలయును. లేనిచో వారెందుఁ బోయిరో తెలియక తఱువాత విక్రమించినను ప్రయోజనముండ దనునర్థము వ్యంగ్యమగును. 'అదె' అని చూపుటలో విషయమును మీరే ప్రత్యక్షముగాఁ జూచి యొక నిశ్చయమునకు రావచ్చు నను నర్థము స్ఫురించును. 'రిపుక్షోభంబుగావించి' అనుటవలన మీరు విజృంభించినచో తప్పక జయము లభింపగల దను నాశాభావ మభివ్యక్తమగును. 'నీయనుజవ్రాత' మనుటలో వారు నీవారే కావున నీకు రక్షింపకతీఱదను మృదువైన యొత్తిడియు, జాలిపుట్టించు తాత్పర్యము నభివ్యక్తములగును. 'కరుణనిండారంగన్' అనుటచే నీకు దుర్యోధనాదులు చేసిన యెగ్గు స్మరించుట కిది సమయము కాదు.

కృపయే చూపవలయు నను భావము తోఁచును. 'రాజోత్తమా!' అనుసంబోధన మిట్లు చేయుట యుత్తమరాజధర్మము. నీవంటి మహనీయుఁ డీధర్మము నుపేక్షింపఁ డను నర్థమును వ్యంజించును. 'కావవే' యనుట వారిప్రార్థనా దైన్యమును బ్రతీయమాన మొనరించును.

అర్జునుఁ డనేకగంధర్వశతసహస్రంబులతో యుద్ధము చేసిన విషయ మీక్రింది పద్యమున వర్ణింపఁబడినది :

"కదిసి యర్జునుతేరు భగ్నముగా నొనర్చఁదలంచి పె
ల్లొదవి ఖేచరకోటి క్రమ్ముటయుం బురందరనందనుం
డదయుఁడై పదిలక్షలం బ్రళయాగ్ని కల్పుల దివ్యులం
గదనశూరుల నిర్దహించెఁ బ్రకాండదివ్యశరార్చులన్." 3.5.420

ఈ పద్యమునందలి గంధర్వవీరుల విశేషణములు వారి యసాధ్యత్వమును వ్యంజించుచు నట్టివారిని సాధించిన యర్జునుని పరాక్రమ మెంత ఘనమైనదో యను విషయమును వ్యంగ్యముగా నిరూపించును. తనపైఁ గ్రమ్మినది ఖేచరకోటి. విశాలమైన యాకసమున శత్రుబాణములఁ దప్పించుకొనుచు వీరవిహారము చేయును. వారును దివ్యులు - మానవులకంటె శక్తిసామర్థ్యము లధికముగాఁ గలవారు. సర్వసృష్టిని భస్మీపటలముగావించు ప్రళయాగ్ని వంటివారు. అంతేకాక కదనశూరులు. అట్టివారిని పదిలక్షలను నిర్దహించె ననఁగా నర్జునుని పరాక్రమ మనిర్వచనీయ మనునర్థమిట వ్యంగ్యమగును.

ఘోషయాత్రకథ ధర్మజుని దయావీరమునకు మచ్చుతునక. తన కనుక్షణ మపకృతిఁ గావించినవాఁడును, తా ననుభవించు దుర్గతికి హేతుభూతుఁడైనవాడును, తన్నుఁ బరిహసింప నెపమిడి వచ్చినవాడును నగు దుర్యోధనుఁడు గంధర్వులకుఁ బట్టువడఁగా విని జాలిదలఁచి తమ్ముల నొప్పించి వానిని బ్రదికించిన కరుణాసింధువు ధర్మజుఁడు. ఇందు గంధర్వులు దుర్యోధనాదులతోఁ జేసిన యుద్ధమునందును అర్జునాదులు గంధర్వులతోఁ జేసిన యుద్ధమునందును వీరరసము స్ఫురించును. అది దయావీరమున కంగప్రాయము.

## అరణ్యపర్వము - షష్ఠాశ్వాసము :-

దుర్యోధనుఁడు తనకు సంభవించిన భంగపాటు కర్ణునకు వినిపించుచు నిట్లనెను:

"అకటకట! యిట్టి కష్టము నకు వచ్చెతినయ్య యేను, నన్నుటె వైరి
ప్రకరము లనిఁ బట్టినఁ గృప నొకరుఁడు విడిపించె దైవమోపదె యెట్లున్."
3.6.20

ఇందలి 'యకటకట! అయ్యో! అటె!' అనునవి దుర్యోధనుని దైన్యశోకముల నలక్ష్యక్రమమున వ్యంజించును. 'ఏను, నన్ను' అనునవి యర్థాంతర సంక్రమిత వాచ్యములు. అభిమానధనుఁడను, నీవంటిమహావీరునకుఁ దలంచినంతనే రాజ్యమీఁ గలవాఁడను, సత్కీర్తికి నెలవగు నుత్తమక్షత్రియకులమునఁ బుట్టినవాఁడను, మహాధనుర్ధరుఁడను, బలరామునియొద్ద గదాయుద్ధము నేర్చినవాఁడను - నగు నే నిట్టి కష్టమునకు వచ్చితినా? నీవంటి యోధాగ్రేసరుఁడును, బలపరాక్రమ సంపన్నులైన నూర్వురుతమ్ములును, నితరయోధవరులును సంరక్షించునన్నా వైరిప్రకరము లనిఁ బట్టుట? యనునర్థము లిట వ్యంగ్యములు. ఒకరుఁ డనుటలో ధర్మజుని యెడ నిప్పటికిని నాతనికిఁగల లఘుభావము వ్యక్తమగును. ఇదియు నర్థాంతర సంక్రమిత వాచ్యరూపమున మనము చేయు వంచనకుఁ బ్రతీకారము చేయలేక దిక్కులేక యడవులందు నవయుచు కందమూలాదు లశనముగా జీవయాత్రగడుపుచు ననామకుఁడై బ్రదుకు చున్నవాఁ డొకరుఁ డు కృపతో నన్ను విడిపించుటయా? ఇంతకంటె మానహానికరమగు విషయమేముండు నను నర్థము వ్యంగ్యము. ఇట్లు దుర్యోధనాలంబకమగు నుత్కటశోకదైన్యము లిందభివ్యక్తములగును.

పరమనిర్వేదపరుఁడై ప్రాయోపవేశమునం గృతబుద్ధియైన దుర్యోధనునితో శకుని యిట్లు వక్కాణించెను :

"కడఁగి బుద్ధిబలంబునంద యకంటకంబుగఁ జేసి యేఁ
బుడమిరాజ్యము సర్వముం దగఁ బుచ్చియిచ్చిన నిమ్మలం
గుడువనేరక దీని నిచ్చటఁ గూలఁదన్ని శరీరమున్
విడుతుఁగా కని నిశ్చయించెదు; వెఱ్ఱివైతె నరేశ్వరా!" 3.6.32

ఇందలి 'అకంటకము', 'కుడువనేరక', 'కూలఁదన్ని' - యనుపదము లత్యంత తిరస్కృత వాచ్యములు. దీనివలన, నీకుఁ బ్రధానశత్రువులై యజేయులైన పాండవులను బుద్ధికౌశలమున నోడించి సాధించిన యీ రాజ్యమును నిష్కారణముగ నోటిముందున్న కూటినిఁ గూలఁదన్నికొనుకూళవోలె, విడిచినచో వెఱ్ఱితనమగును గదా! నాపడిన శ్రమయంతయు వ్యర్థమొనరించుచున్నావు గదా! ఇట్లు చేయుట నీ కుచితముగాదు సుమా! అను నర్థము వ్యంగ్యమగును.

ఈయాశ్వాసమున 55వ పద్యమువఱకు దుర్యోధనాలంబకమగు శోకము కరుణముగా రూపుకట్టుచున్నది. అయినను బ్రతినాయకగతమగుటచే నిది సహృదయుని సానుభూతిని జూఱఁగొనఁజాలదు. కావున నీ ఘట్టమున కరుణ మాభాసమయ్యెనని

భావింపనగును. దుర్యోధన పాతాళగమనాదికము విస్మయావహము. తఱువాతి దగు వ్రీహిద్రోణాఖ్యానము విస్మయజనకమై యద్భుతరసము నొదవించును.

సైంధవుఁడు సింహాగారంబు సొచ్చువృకంబునుంబోలెఁ బాండవనివాసంబు సొత్తెంచి పాంచాలిం గని యిట్లనియె :

"వామాక్షి! నీకుఁ గుశలమె? నీ మన సెవ్వారియందు నిత్యప్రేమం
బై మెఱయు - నట్టి సొబగులు నీ మగ లేపురకు నిపుడు నెమ్మదియె మదిన్?"
3.6.160

ఇదియంతయు వక్రభాషణము. 'వామాక్షి!' అనునంబోధన మామె సౌందర్యప్రశంస చేయుచుఁ దన కామెయెడ నుదయించిన యభిలాషము నభివ్యక్తము సేయును. 'నీమన సెవ్వారియందు నిత్యప్రేమంబై మెఱయు' ననుట వెక్కిరింత. వారు దరిద్రులు. అవసరమైనచో ద్యూతమున నిన్నుఁ బణముగాఁ బెట్టుటకైన శంకింపరు. అట్టివారియందు నీకుఁ బ్రేమముండునా? ఒకవేళ నేకొంచెమో యున్నను నది నిత్యమగునా? ఊరక నీవు వంచనకై వారియందుఁ బ్రేమమున్నట్లు మెఱయింతు వంతియే యనునర్థ మిట వ్యంగ్యము. 'సొబగులు' అనునది విపరీతలక్షణచే రూపహీను లనునర్థమునఁ బర్యవసెంచును. 'నీమగ' లను పదము కర్మవశమున వారు మగలైర కాని ప్రియులు కారు సుమా అనునర్థమును వ్యక్తము చేయును. 'ఏపురకున్' అనుట యామె యనేకభర్తృకత నధిక్షేపించుటకుఁ బ్రయుక్తమైనది. అగుచు నిట్టి నిన్ను నావంటివాఁ డితరుఁడు కామించుట దోషముకాదను భావమును వెలయించును. 'ఇపుడు' అనునది యర్థాంతర సంక్రమిత వాచ్యము. రాజ్యసుఖములు నశించి యడవులలోఁ బడరానిపాట్లు పడుచు భార్యవగు నీకు నిత్యదుఃఖముల సమకూర్చుచున్న యీ సమయమున నను నర్థమును వ్యంజించును. 'నెమ్మదియె మదిన్' అనుట వారి కెక్కడి నెమ్మది యనునర్థమునఁ బర్యవసించును. ఇట్లీ పద్యమున సైంధవుని నీచ స్వభావమంతయు సువ్యక్తమగుచున్నది.

సైంధవుని కుటిలభాషణమునకు ద్రౌపది యిచ్చిన ప్రతివచనము :

"స్థిరమతులైన పార్థులకు సేమము, నీకు ననామయంబె భూ
వర! తగవిందవైతి గుణవర్యుల యింటికి; నట్లు గావునం
బరువడి నాసనక్రియయుఁ బాద్యముఁ గైకొను మాదరంబుతో;
సరస కురంగమాంసములఁ జల్పుము భోజనకృత్య మిత్తఱిన్" 3.6.162

సైంధవుని వికారబుద్ధి నవగతము చేసికొని తగిన ప్రత్యుత్తరము ద్రౌపది యిచ్చుచున్నది. ప్రారంభముననే స్థిరమతు లను విశేషణము పేర్కొనుటలో

వారెట్టివారైననేమి నాయందుఁ జెదరని మతికలవారు కావున నాకెట్టి లోపమును లేదు. భర్తలయైశ్వర్యాదు లశాశ్వతములు, అనురాగము శాశ్వతము. కావున నాకట్టిది గల దనునర్థము స్ఫురించును. 'అనామయమె' అనునది పైకి కుశలప్రశ్నమువలెఁ గాన్పించినను యౌగికార్థ సంభావనచే నీకేమి రోగముపుట్టలేదు గదా! వెఱ్ఱితనముఁ దోఁప మాటాడుచున్నా వనునర్థము సంభావ్యము. మఱియు 'బ్రాహ్మణం కుశలం పృచ్ఛేత్ క్షత్రబంధు మనామయమ్' ఇత్యాది మనుస్మృత్యుక్త న్యాయము ననుసరించి నీకు క్షత్రబంధువు వలె మాటాడుట తగునా? యను నర్థము కూడ నిట వ్యంగ్యమని యూహింపనగును. 'గుణవర్యులయింటికి విందవైతి' అనుటచే గుణములచే విశిష్టులైనవారి యింటికి నతిథిగా వచ్చి యసభ్యప్రసంగము చేయటేల? మర్యాదాతి క్రమణము సేయక సామాన్యాతిథివలె నర్ఘ్య పాద్యభోజనాది సత్కారముల నంది చనుమను నర్థము వ్యంగ్యమగును. ఇట్లు ద్రౌపది యాతిథేయ ప్రవర్తనమునకు లోటు రానీక సైంధవుని కుత్సితవాక్కులకు సముచితమగు సమాధాన మొసఁగుట యిందు వ్యంగ్యమర్యాదతోఁ జూపఁబడినది.

ఈ సైంధవ పరాభవ ఘట్టమున సైంధవుని ద్రౌపదీగతాభిలాషరూపవిప్రలంభ శృంగారాభాసము చక్కగా వ్యంజింపఁబడినది. పాండవవీరుల విజృంభణము రౌద్రరసము నాపర్చుపంచును. సైంధవపరాభవఘట్టము హాస్యరసోత్పాదకము. తదాలంబకమగు భీత దాని కంగము. ఇదియంతయుఁ బాండవాలంబకమగు యుద్ధ ధర్మాది వీరరసమున కంగప్రాయము.

శూర్పణఖాప్రేరితుఁడై రాముని సాధింప నెంచిన రావణుఁడు మారీచునితో నిట్లు పలికెను :

"వినవె; రాముఁడనఁగ నొకఁడు విపులదర్పహృదయుఁడై
మన ఖరుండు లోనుగా సమగ్రశౌర్యులైన య
ద్దనుజవరులఁ దునిమి యిపుడు దండకస్థలంబునం
దొనర నిర్భయత్వమొప్ప నున్నవాఁడు మేటియై." 3.6.318

ఇందు రావణుని క్రోధార్భటియు; ససహనమును రామునియందుఁ బగదీర్చుకొనవలయు నను తొందరయు నభివ్యక్తములగును. ఉత్సాహవృత్తము దాని కెంతయు నభివ్యంజకము. 'వినవె' అనుట ఇంత ముఖ్యమైన వార్త నీవింకను వినలేదా? ఇపుడైన నవధాన బుద్ధితో విను మను నెచ్చరిక నభివ్యంజించును. 'ఒకఁడు' అనుపద మాత్రఁ డొక యప్రసిద్ధుఁడు అయినను నెంత దుష్కార్యమాచరించెనో చూడు మను భావమునకుఁ బ్రత్యాయకము. 'మన' అనునది ఖరాదులు నాకెట్టివారో నీకు నట్టివారే.

వారిని వధింపఁగా నావలె నీవును విజృంభించుట సముచిత మను నర్థమును వ్యంజించును. 'నిర్భయత్వమొప్ప నున్నవాఁ' డనుటచే మన ప్రతాపాతిశయము నెఱుఁగక ధీరుఁడై యహంకారముతో నిర్భయముగా నున్నాఁడిది మనకు సహ్యమగునా? యను నర్థము తోఁచును. 'ఇపుడు' అనునది ఇది యెన్నడో జరిగినదికా; దిప్పుడే జరిగినది, ఉపేక్ష చేసినచో నింకెన్ని జరుగునో - యను నర్థమును వ్యక్తము చేయును. 'ఒనరన్' అనుట యాతని ధైర్య గరిమను వెక్కిరించుట నభివ్యక్తము చేయును. 'దండకస్థలంబునం' దనుట మన తావుననే మనకు నపకృతి గావించి యింకను నిందే యున్నవాఁ డాతని ధైర్య మెట్టిదో యూహింపు మను నర్థమును దోఁపఁజేయును. 'సమగ్రశౌర్యులైన యద్దనుజవరులన్' అను పదములందలి 'సమగ్రశౌర్యులు', 'ఆ', 'వరులు' అనునవి ఖరాదుల పరాక్రమాతిశయమును, అవధ్యత్వమును వక్కాణించుచు నట్టివారినిఁ జంపినవాఁడు నిన్ను నన్ను నింకను మనవారలగునితరులను జంపకుండునా? కావున మనము విజృంభించి పగదీర్చుకొనక తప్ప దనునర్థమును బ్రతీయమాన మొనరించును.

తన్నుఁ గామింపుమని యడిగిన రావణునితో సీతాదేవి యిట్లనెను :

"ఇట్లాడ నర్హమే; యే నేడ - నీ వేడ; నక్షత్రతారాగణంబుతోడ
నాకసంబంతయు నవనిపైఁ గూలిన, వసుమతి వ్రస్సిన, వనధులెల్ల
నింకినఁ జంద్రదినేశ్వరు లన్యోన్య విపులతేజంబులు వీడువడిన
నే నేలయన్యుని నెదలోనఁ గామింతుఁ; గరిణీ యేనాట సూకరముఁ గలియు;
మహితకమలమధుర మధురసాస్వాదన పరవశాత్మయైన భ్రమరకాంత
రిత్తబుద్ధి - నకట ( రేఁగుపువ్వులరసం బానునెట్లు, బేలవైతిగాక." 3.6.341

ఇందలి 'యేనేడ?' 'నీవేడ?' అనువాని యందలి 'ఏను', 'నీవు' అను పదము లర్థాంతర సంక్రమిత వాచ్యములు. ఉత్తమవంశమునఁ బుట్టి, యుత్తమునిఁ జేపట్టి యాతనితో నవినాభావ సంబంధముతో నానంద సామ్రాజ్యసింహాసనాధిష్ఠితనై కలలోనైనఁ బరపురుష సంగమమును భావింపని యచ్ఛాచ్ఛశీలముగల నేనెక్కడ? నీచుఁడవై పశువువలె పరకాంతాసంగమవాంఛ పాపమని భావింపక వంచనమెయివచ్చి దౌష్ట్యము నెఱపుచున్న నీవెక్కడ? అనునర్థమిట వ్యంగ్యము. యే నేడ? నీవేడ? అనుటవలన నాకును నీకును హస్తిమశకాంతరముగల దనునభిప్రాయము వ్యంగ్యము. మహితకమల మధురమధుర సాస్వాదనపరవశాత్మయైన భ్రమరకాంతగాఁ దన్నుఁ బోల్చుకొనుటచే శ్రీరామచంద్రుని భార్యయై తా ననుభవించు పరమసుఖము ప్రతీయమానమై రేఁగుపువ్వుల రసమువంటి నీరసస్థితిగల నీవంటివాని నూహించుటయుఁ జేయఁజాలని పారవశ్యమునఁ దానుండె

నను భావ మభివ్యక్తమగును. 'కరిణి', 'సూకరము' అను పద్యములు తన యౌత్మోన్నత్యమును. వాని యశుద్ధచరితమును సువ్యక్త మొనరించును. మఱియుఁ దిర్యక్కుల నిట దృష్టాంతీకరించుటచే వివేకశూన్యములైనతిర్యక్కులే యిట్టి మహోదాత్త చరితముగలవి కాఁగా పరమ వివేకవతినై దుర్లభమగు మానవ జన్మము నొంది యుత్తమగతినందుటకు యతించునేను శీలమును జెఱచుకొందునా? అనునభిప్రాయము వ్యంగ్యము. అట్లే నీ యిప్పటి ప్రవర్తనము తిర్యక్ప్రవర్తనముకంటె నీచతర మను నభిప్రాయము గూడ సంభావింపనగును. 'నక్షత్రతారాగణంబుతోడ' నిత్యాది మిధ్యాధ్యవసిత్యలంకారము తన హృదయ స్థైర్యమెట్టి ప్రళయ సన్నివేశములందును విచలితము కానోప దను నర్థమును వ్యంజించును.

ఈయాశ్వాసమున రామాయణ కథ దృష్టాంతముగాఁ గొంత చెప్పబడినది. ఇందు రామవనవాస గమనవృత్తాంతమున నాతని ధర్మాచరణోత్సాహమును, సీతాహరణ కథనమునఁ గరుణమును, రామదుఃఖమునఁ గరుణమును, వాలిసుగ్రీవ యుద్ధమున వీరమును, త్రిజటస్వప్న వృత్తాంతమున నద్భుతరసమును, రావణోక్తుల విని సీత దుఃఖించునప్పుడు కరుణమును బ్రతీయమానములగును.

## అరణ్యపర్వము - సప్తమాశ్వాసము :-

హనుమంతుఁడు దాను గాంచిన సీతాదేవి స్థితిని రాముని కిట్లు వర్ణించెను :

"కన్నీరు జడిగొని క్రమ్మఁ బ్రాఁకెక్కిన కమ్రకపోలభాగములు గలిగి
యవశమై యొఱఁగిన యంగవల్లికపొంత నున్న భూమీరుహం బూతగాఁగ
వెడలు నిట్టూర్పుల వేఁడిమిఁ బడిన న య్యధరపల్లవము గారాకుఁ బోలఁ
దలఁపులసందడి దండడించినతాల్మి గదిరి శిరఃకంపగతులఁ బెరయ
నున్న పుణ్యమూర్తి నుత్తమ సౌందర్య నవనతాస్య నార్తయైన దానిఁ
గని విదేహతనయఁగా నెఱింగితి నేను హారఘుప్రవీర! యనుచు నడర."3.7.28

ఇందు సీతాలంబకమగు కరుణము - అథవా విప్రలంభ శృంగారము చక్కగా నభివ్యక్తమగుచున్నది. కన్నీరు జడిగొనుటచే నార్తినిర్వేదములును, అవశత్వము, భూమీరుహము నూతగొనుటలచే శ్రమజాడ్యములును, అధరపల్లవము గారాకుఁ బోలుటచే విరహ జ్వరతీవ్రతయుఁ జెప్పఁబడినవి. తలఁపుల సందడి 'స్మృతి' యను వ్యభిచారినిఁ జెప్పును. తాల్మి గఁదురుట ధృతిని వక్కాణించును. 'హా రఘు ప్రవీర!' అనుట దిక్కులేదన్న భావముతోడి దైన్యమును సూచించును. ఇట్టి విభావాది సామగ్రిచే విప్రలంభశృంగారము కరుణరససమ్మిశ్రితమై యాస్వాదనీయమగుచున్నది.

అంగదుఁడు శ్రీరాముని పంపున రాయబారమేఁగిన విధము :

"లంకాద్వారము దుర్నివారముగ నుల్లాసంబునం జొచ్చి ని
శ్శంకుండై సురశత్రుసైనిక సహస్రంబుల్ దనుం జూచి యా
శంకం బొందఁగ లీలమైఁ జని సుహృత్సంఘుంబు గొల్వన్ నిరా
తంకుండై కొలువున్నదైత్యుఁ గని యుద్యన్మూర్తియై యిట్లనున్". 3.7.59

ఇతరుల కప్రవేశ్యమైన లంకాద్వారమును దుర్నివారముగ నుల్లాసముతోఁ జొచ్చుట, నిశ్శంకుఁడగుట, దేవతలను హతమార్చు రావణుని సైనిక సహస్రములు దన్నుఁ జూచి యాశంకము నొందుట, సుహృత్సంఘుము గొల్వఁగా నిరాతంకుఁడై కొలువున్న దైత్యునిఁ గని యుద్యన్మూర్తి యగుట అను నీవర్ణనముచే నంగదుని ధైర్యము, నిర్భీకత, సాహసము, ఆత్మవిశ్వాసము, శరీరబలము మున్నగునవి యప్రమేయములను నర్థము ప్రతీయమానమగుచున్నది.

కుంభకర్ణునిపై సుగ్రీవుఁడు విజృంభింపఁగా నాతనిస్థితి యీక్రింది పద్యమున వర్ణింపఁబడినది :

"కని సుగ్రీవుఁడు బిట్టదల్చుచును వేగంబార దైత్యేంద్రు మా
ర్కొని సాలంబున వాని యాఁదలఁ గడున్ ఘోరంబుగాఁ బూన్కి వ్రే
సిన నావ్రేటున నిద్రదేఱి కడకం జేదోయి సారించి య
మ్మనుజాశుండు కపీంద్రుఁ బట్టి రభసోన్మాదంబుమై నార్చుచున్." 3.7.103

కవిసినవాఁడు సుగ్రీవుఁడు. వాఁడును వేగంబారఁగాఁగవిసెను. ఆయుధమా - సాలము. కొట్టినది యాఁదలపైని. అదియును గడుఁబూన్కితో, ఘోరముగా ఇంతఘోరముగా నెంతో ప్రయత్నముతో నంతటివీరుఁడు సాలముతో వ్రేసిన దెబ్బకుఁ గుంభకర్ణునకు నిద్రదేఱినదఁట. దీనిచే నాతని యసదృశనిద్రాతిశయము, దేహదార్ఢ్యము, బలసంపద మున్నగునవి యెంత ఘనములో యూహించుకొనవలయుననుట యిట వ్యంగ్యము.

ఈ సప్తమాశ్వాసమున మిగిలిన రామకథయందుఁ బ్రధానమైనది యుద్ధ వర్ణనము. అది వీరరససమంచితము. సీతాపరిత్యాగఘట్టము రాముని రాజధర్మ పరిపాలనము నందలి యభిరతి నభివ్యక్తము చేయును. మొత్తమీకథ ధర్మజునకు సీతారాములు పడిన కష్టపాటును వక్కాణించి యాతని నూరార్చుటకై చెప్పఁబడిన దగుటచే నిందు ప్రధానము కరుణరసమని సంభావింపనగును.

పతిప్రాణముకాక యేదేనివరముఁ గోరికొమ్మనిన యమునితో సావిత్రి యిట్లు పలికెను :

"అనవుడు మద్రరాజసుత ప్రాంజలియై సమవర్తితోడ ని
ట్లను; రిపుకోటిచే నపజయంబునుబొంది వనాంతరంబునం
దనవరతవ్రతాభిరతుఁడైన మహాత్ముఁడు సాళ్వభూవిభుం
డనఘుఁడు లబ్ధచక్షుఁ డగునట్టులుగాఁ గరుణింపవే దయన్." 3.7.225

ఇందలి 'అనవరతవ్రతాభిరతుఁడు', 'మహాత్ముడు', 'అనఘుఁడు' అను విశేషణములు ద్యుమత్సేనుని యర్హతల నుగ్గడించుచు మామామకు నీవిచ్చు వరము పాత్రతానుగుణమేకాని యస్థానపతితము కానేప దను నభిప్రాయమును వ్యంజించును.

సావిత్రి యమధర్మరాజును సత్యవంతుని ప్రాణముల వరమడుగుట యీక్రింది పద్యమునఁ జెప్పఁబడినది :

"పతిరహితంబు దుస్సహము; భర్తృవినాకృతయైనకాంత దూ
షిత యగు సర్వమంగళవిశేషములందును; గాన మత్ప్రియుం
డతులితకీర్తిశాలి సుగుణాఢ్యుఁడు సాళ్వసుతుండు లబ్ధజీ
వితుఁడుగ నిమ్ము ధర్మపదవీపరిరక్షణ! పుణ్యవీక్షణా!" 3.7.249

సాళ్వసుతుఁడు మత్ప్రియుఁ డగుటచే నీవు నాసేవకు సంతసించితివి కావున నంత మాత్రమునకే వరమీనక్కరలేదు. స్వయముగా సత్యవంతుఁడును అతులిత కీర్తిశాలి, సుగుణాఢ్యుఁడు గావున వరదానయోగ్యుఁడే సుమా! అనునర్థమిట వ్యంగ్యము. 'ధర్మపదవీపరిరక్షణ!' అను సంబోధనము నీవిట్టి వరమిచ్చుట ధర్మ పరిరక్షణము చేయుటయే యగు నను నర్థము నభివ్యంజించును.

సావిత్ర్యుపాఖ్యానము పరమపాతివ్రత్యమాహాత్మ్యమును బ్రతిపాదించునది యగుటచే ధర్మవీర మిందుఁ బండినదని తలఁపనగును. సావిత్రి యల్పాయుష్కుఁ డని తెలిసితెలిసి సత్యవంతుని వివాహమాడుట, మృతిదినము సమీపింపఁగా నతికష్ట సాధ్యమగు వ్రతము నవలంబించుట, భర్తతో వనమేఁగుట, యముని మెప్పించుట మున్నగు నంశములను బట్టి యామె ధర్మరక్షణోత్సాహము రసీభవించుచున్నది. మఱియు యముఁడు వరములడుగు మనఁగా మొదట నత్తింటిసౌభాగ్యము నరసికొని పిదపఁ బుట్టింటి ముచ్చట దీర్చుటలో నామె పత్యనురాగ మెంతదృఢమైనదో సువ్యక్తమగుచున్నది.

బ్రాహ్మణారణిని సాధించుటకై పాండవు లేవురుఁ బడనపాటు వ్యర్థమయ్యెను. అంత నకులుఁడు మనకిట్టి కష్టము లేల వచ్చెనని ధర్మజు నడిగెను. ఆయన పూర్వకర్మకృతమున వచ్చె ననెను. భీమార్జున సహదేవులు వరునఁగా నాఁడు ద్యూతావసానమున నీచముగాఁ బ్రవర్తించిన యాంబికేయులను, నీచోక్తులాడిన కర్ణుని,

నీచద్యూతముఁ గల్పించిన శకునిని సంహరింపకుండుటవలన మన కీకష్టములు వచ్చెననిరి. ఆ సందర్భమున -

"............ అని యిట్లందఱు నన్నితెఱంగులఁ బలుకుచుండ నజాతశత్రుండు నకులుం జూచి భవదీయ సోదరు లత్యంతపిపాసితులైనవారు. నీ విమ్మహీరుహంబెక్కి జలంబులున్న యెడ యరయు మనినన్........" 3.7.390

వారు తమతమ యభిప్రాయములను జెప్పుచుండఁగా ధర్మజుఁడు 'భవదీయ సోదరు లత్యంతపిపాసితులై యున్నవా' రనుట వ్యంగ్యముగా వారి కొకచుఱుక వేయుట. 'వీరు పిపాసితులై యనుచిత ప్రసంగము చేయుచున్నారు. అది మానవలయునన్న వీరి పిపాస యణఁగవలయును. నాయనా! నకులా? నీవు వీరికి నీరముఁ దెచ్చియిచ్చి నాపై విజృంభింపకుండఁ జేయుము' అనునధిక్షేపణ మిట వ్యంగ్యము. భవదీయ సోదరు లనుట యాదరమును సాధించు ప్రయత్నమును వ్యంజించును.

సావిత్ర్యుపాఖ్యానానంతర మిందుఁ జెప్పఁబడిన కర్ణచరితము తదాలంబకమగు దానవీరమును బ్రతీయమాన మొనరించును. వచ్చువాఁ డింద్రుఁడు, వంచన చేయునని సూర్యునిచేఁ బ్రబోధింపఁబడియుఁ గవచకుండలముల నీఁబూనుట యాతని దానోత్సాహమును జక్కగా వ్యక్తము చేయును. కర్ణోత్పత్తి కథన మద్భుత రససమన్వితము. దుర్వాసుని ప్రవర్తనము, కుంతి యాతని మనసునకు వచ్చునట్లు పరిచర్య గావింపఁ గల్గుట, వరప్రదానము, ఆమె సూర్యునారాధించుట, కన్యయగు నామెకుఁ బుత్రోదయము, ఆమె యాతని విడచుట, అతఁడు రాధాతిరథులకు దొరకుట మున్నగు వృత్తాంతమంతయు విస్మయావహము. కుంతీవిలాపము కరుణరసోత్పాదకము. ఆరణేయము, యక్షప్రశ్నములు - ననుభాగము ధర్మజుని ధర్మరక్షణ తాత్పర్య ధర్మజ్ఞత్వలోకజ్ఞత్వములను వ్యక్తము సేయును. ఇందు ధర్మవీరము సంభావ్యము.



ఓమ్

# భారత ధ్వని దర్శనము

## అష్టమాధ్యాయము

## తిక్కనార్యునిదివ్యవాణి



తిక్కన సోమయాజి 'బహుళాంధ్రోక్తిమయ ప్రపంచ మహనీయ స్థితికి మూలమై నిలిచిన కుండలీంద్రుడు.' ఆయన రచించిన భారత భాగము కవితావిరాట్స్వరూపము వంటిది. అతని రచన వ్యాకరణసూత్రమువలె అల్పాక్షరత, అసందిగ్ధత, సారవత్త మున్నగు లక్షణములతో విలసిల్లును. స్థాలీపులాక న్యాయముగా నాతని రచనాభాగము నందలి ధ్వని విశేషములను దర్శింతము.

### విరాటపర్వము - ప్రథమాశ్వాసము :-

పాండవుల వనవాసగమ్యనుష్ఠానము సవిస్తరముగా వినఁగోరి జనమేజయుఁడు వైశంపాయనున కిట్లనియెను :

"మహితసముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యు లంగనా
సహితముగాఁగ నేమిగతి సమ్యగుపాయనిగూఢవృత్తిమై
నహితుల కప్రభేద్యముగ నాపదుమూఁడగునేఁడు మత్పితా
మహులు చరించి రంతయుఁ గ్రమంబున నాకెఱుఁగంగఁ జెప్పుమా."4.1.44

ఇందలి మొదటి నాల్గు విశేషణములును బాండవుల యజ్ఞాతవాసములోని దుష్కరత్వమును జక్కగా నభివ్యక్తము చేయుచున్నవి. మహితసముజ్జ్వలా కృతులు కావున నెంతగా వేషము మార్చినను నెచట నున్నను ఆకృతివిశేషమే వారినిఁ బట్టి యిచ్చును. మానధనులు కావున నీచవృత్తి నవలంబించి జీవించుట దుష్కరము. ఒకవేళ నట్లు జీవితము గడపుచున్నను నేదైన మానాపహారక సన్నివేశము తటస్థపడినచో వారు దొరకిపోవచ్చును. జనమాన్యులు గావున వారెట్టి హీనదశలో నున్నను జనులు వారిని సన్మానించుటచే శత్రువులు గుర్తించుట కవకాశము గలుగును. అదియునుగాక

సర్వజనమాన్యులు సేవకాది వృత్తి నవలంబించుటయు, దానియందు నిరుపద్రవముగాఁ బ్రవర్తిల్లి కాలము పుచ్చుటయు నెంతయుఁ గష్టసాధ్యము. కేవలము మగవారైనచో నెట్లో కష్టమున శత్రూపాయములను నేర్పుమెయి వారించుకొందు రనుకొనినను అంగనాసహితుల కది మఱింత శ్రమసాధ్యము. అయిదుగురు పురుషులతోఁ గూడిన యొకయంగన యనులెక్క యెట్టివారికైనను బాండవుల స్థితిని వ్యక్తము చేయును. అంతేకాక అంగన - **'అఖిలలావణ్యపుంజము మెలఁతగా'** నైనదని సంభావింపఁబడు లావణ్యవతి (అంగాత్కల్యాణే) అజ్ఞాతవాసము చేయుట యతిదుష్కరము. ఇట్లు జనమేజయుని ప్రశ్నయందలి పాండవ విశేషణములు పైయర్థ విశేషములను వ్యంజించుచు జనమేజయుని యౌత్సుక్యమును బ్రతీయమాన మొనరించుచున్నవి.

మిక్కిలి యలసత నొందిన ద్రౌపదిని మోచితెమ్మని నకులసహదేవులకుఁ జెప్పఁగా వారు సిద్ధపడకపోఁగా ధర్మజుఁ డర్జునున కిట్లు చెప్పెను :

**"ఇమ్మదిరాక్షి డస్సె మన కీనడుమన్ విడియంగ నొండుచో**
**టిమ్మును గాదు నిక్కమున కేమును డస్సితి మట్టుకాన నీ**
**వెమ్మెయినైన దీని భరియించి పురంబు సమీపభూమికిం**
**దెమ్మని చెప్ప నాతఁడును దెచ్చెఁ బ్రియంబునఁ బుష్పకోమలిన్."** 4.1.154

'మదిరాక్షి' యనుశబ్దము ద్రౌపది యక్షిగతాలసత్వమును వక్కాణించుచు 'చూడుము - పాపము శ్రమతోఁ గనులు మూతలుపడిపోవుచున్న' వను నర్థమును వ్యంజించును. "నిక్కమున కేమును డస్సితి" మనుటవలన ద్రౌపదీవహనమునకుఁ దాము జాలనివారగుటయు నాతనికి మోవక తప్పదనియు వ్యంగ్యముగాఁ జెప్పఁబడినది. "అతఁడును దెచ్చెఁ బ్రియంబునఁ బుష్పకోమలిన్" అను వాక్యమునందలి ప్రియశబ్ద మాతనికి ద్రౌపదియెడఁ గల యనురాగాతిశయమును వ్యంజించును. 'పుష్పకోమలి' యను పదము ధనంజయుఁ డామెను బరువుగా భావింపక పూలమాలవలె చులకనగా ననాయాసముగా మోచితెచ్చె ననునర్థమును వ్యంజించును.

కంకభట్టుగా నున్న ధర్మజుఁడు విరాటునితో నిట్లు పలికెను :

"నృపనయవిద్యకుం దగిననే ర్పలవడ్డది కొంతకొంత; ధ
ర్మపరులసంగతిందగిలి మచ్చికనుండుదుఁ బేరుకంకుఁ; డే
వపుఁగొలువైన నాకు నిలువన్ మదిగొల్పదు; కాన నిన్ను భూ
మిపతులలోన సాధుజనమిత్రుఁడునా విని కొల్వవచ్చితిన్." 4.1.197

ఇందు 'నృపనయవిద్యకుందగిననేర్పలవడ్డది' అను వాక్యముచేత నీకు రాజనీతికి సంబంధించిన విషయములందు సాహాయ్యము చేయఁగల ననునర్థము

వ్యంగ్యము. 'ధర్మపరుల సంగతిందగిలి మచ్చికనుండుదున్' అనుటచే నన్ను స్వీకరించిన నావలన నీకెట్టి ప్రమాదమును రాదను నర్థము వ్యంగ్యము. "ఏవపుఁగొలువైన నాకు నిలువన్ మదిగొల్పదు" అనుటవలన నీవు నాకెన్నటికి నేవపుఁబనులఁ జెప్పకుండవలయు ననునర్థము భాసిల్లును. "భూమిపతులలోన సాధుజనమిత్రుఁడు నావిని కొల్వవచ్చితిన్" అను వాక్యమువలన నేను సాధుజనుఁడను. కొల్వవచ్చినను నాయందు మైత్రినేకాని ప్రభుత్వమును నెఱపకు మనునర్థము వ్యంగ్యము. మఱియు 'రాజులందఱిలో నీవు సాధుజనమిత్రుఁడ' వనుటచే, కావుననే మఱియొకని యొద్దకుఁబోక నిన్నే యాశ్రయించితి ననునర్థము వ్యంగ్యము.

విరాటపర్వ ప్రథమాశ్వాసమునఁ బాండవులు అజ్ఞాతవాసచర్యను నిర్ణయించుకొని తమతమవృత్తులలోఁ గుదురుకొనుట విషయము. ఇందు ప్రధానముగా పాండవులు నియమపాలనము చేయుటకు నిర్ణయించుకొనుటచే ధర్మవీరము సంభావ్యము. వారివారి పూర్వచరితములఁ దలఁచి ధర్మజుఁడు దుఃఖపడుటలో కరుణ రసమించించుక యనుభూయమానమగును. విరాటుని కొల్వున భీమసేనాదుల వాక్యము లొకింత హాస్యరస సంధాయకములు.

## విరాటపర్వము - ద్వితీయాశ్వాసము :-

బలవంతమగు కామవేదన కగ్గమయి యుక్తాయుక్తవివేకజ్ఞానము నశించి వదరుచున్న కీచకునితో సైరంధ్రి యిట్లు పలికెను :

"దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్పనిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా!" 4.2.55

ఇందలి పూర్వార్థము సంఘటనయునందలి రేఫవకార సంయుక్త ప్రాసమును దన భర్తలు చేయు సంహారకాండ తీవ్రత ననంలక్ష్యక్రమమున వ్యంజించును. 'గీర్వాణాకృతు' లను పదమువలన వారు నీ కగపడకయే రూపుమాపుదురు. అందఱితోడిగాఁ దలఁపకు మన్నభావమును దోఁపఁజేయును. ఏవు రనుటచే నేయొక్కఁడో యైనచో నేటుతప్పవచ్చునని నీ వూరట చెందునవకాశము లేదు. ఐదుగు రొక్కుమ్మడి విజృంభించి నిన్ను వధింతు రనునర్థము తోఁచును. 'ఇప్డు' అనుటచే 'నేను నిన్నుఁ బొందుటయే పరమార్థముగా భావించితిని. అది సిద్ధించిన పిదప నేమైనను సరియే' అనుకొందువేమో, యట్లు జరుగదు. నీవొకవేళ బలాత్కరింపఁదలఁచితివేమో? ఇప్పుడే -

బలాత్కరించులోపలనే వారు నిన్నుఁ బరిమార్తు రను నర్థము వ్యంగ్యము. 'నినున్' అనుపదము తుచ్ఛుఁడవు,నీచకాముకుడవు, ధర్మబలము లేనివాఁడవు నగు నిన్ను ననురూపమున నర్థాంతర సంక్రమిత వాచ్యమగును. 'దోర్లీలన్' అనుపదముచే నీవంటి సింహబలు లెందఱైనను వారిని సంహరించుట వారికొక క్రీడా ప్రాయ మనునర్థము వ్యక్తమగును. 'మానముఁ బ్రాణమున్' అనుక్రమముచే నూరక గుట్టు చప్పుడు గాకుండ నిన్నుఁ జంపుట కాదు. ఏ దుర్మానము వాటించి విఱ్ఱవీఁగుచున్నావో దానిని ముందుఁ బోనడచి పిదప నీపాపమునకుఁ బ్రాయశ్చిత్తముగాఁ బ్రాణముఁ గొందు రనునర్థము గమ్యమానమగును. తాను సేవకవృత్తి యందుండి తనదేవికి సహోదరుఁడైనవానిని 'కీచకా!' యని పేరుపెట్టి సంబోధించుటవలన వానియెడలఁ దనహృదయమున నుద్బుద్ధము లైన కోపము, ఏవగింపు, లెక్కలేనితనము మున్నగుభావము లభివ్యక్తములగును.

కీచకుని దురాగతమును జూచి వానిని, వాని దుండగమును సహించిన విరాటుని వధియించుటకై సన్నిహితమైన యున్నత వృక్షమును బెకలించుటకు సన్నద్ధుఁడై యనుజ్ఞకా యన్నట్లు తనవైపు చూచిన భీమసేనునితో ధర్మనందనుఁ డిట్లనుచున్నాడు:

"వలలుం డెక్కడఁజూచె; నొండెడ నసేవ్యక్ష్మాజముల్ పుట్టవే;
ఫలితంబై వరశాఖలొప్పఁగ ననల్పప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రితప్రతతికిన్ విశ్రాంతి కావింపఁగాఁ
గల యీభుజము వంటకట్టియలకై ఖండింపఁగా నేటికిన్."    4.2.136

ఇందుఁ బ్రస్తుతవృత్తాంతముచే మఱియొక ప్రస్తుత వృత్తాంతము గమ్యమానమగుట యనులక్షణము గలదు గావున నిటఁ బ్రస్తుతాంకురాలంకారము వాచ్యముగాఁ గలదు. దీనిని బట్టి భావింపదగు నర్థవిశేష మెంతయో కలదు. పద్యారంభముననే వలలుఁడనుట నీవు భీమసేనుఁడవు కావు, వలలుఁడవు, అజ్ఞాతవాసము చేయుచున్నాఁడవు. ఒడలుమఱచి సమయభంగ మాచరింపకు మనునర్థము నభివ్యక్తము చేయును. 'ఒండెడన్' అనుటచే నిది కోపప్రదర్శనమున కుచితమైన దేశముకాదను నర్థము తోఁచును. 'అసేవ్యక్ష్మాజముల్ పుట్టవే' అనుటచే మనల నాదరించి మనుగడఁ జూపిన మత్స్యపతి మనకు సేవ్యుఁడు; కావున నీ కోపమున కతఁడర్హుఁడుకాఁ డనునర్థము వ్యంగ్యము. మఱియు నసేవ్యక్ష్మాజసదృశుఁడగు కీచకుఁడు వేఱుచోట దొరకినచో వధించుట నాకును సమ్మతమే - యనునభిప్రాయము కూడ నిట ధ్వనించును. 'ఫలితంబై' యిత్యాది విశేషణములవలన 'నీవిరాటుఁడు సద్గుణవంతుడు; పుత్రమిత్రబంధుజనసహితముగ మనకు సాహాయ్యము చేయుచున్నవాఁ

డు, దుష్కర మైన యీయజ్ఞాతవాసమున మనలను దనకొలువులోనిడుకొని మహోపకారము చేసి మన కనల్పప్రీతి సంధించుచుఁ దన సౌజన్య మను విలసచ్ఛాయయందు మనవంటి యాశ్రితుల కెందఱికో విశ్రాంతి నొసఁగుచున్నాఁడు.' అను నర్థము వ్యంగ్యమగును. 'ఈభూజము' అని చూపి చెప్పుట లోకోపకృతియే తన కర్తవ్యముగా నాచరించు నీయుపకర్త కపకృతిఁ జేయవలదను నర్థమును వ్యంజించును. 'వంటకట్టియలకై' యనుట కీచకుఁడు వంటకట్టెల వంటివాఁడు. వానిని నిగూఢముగా విఱిచి ప్రోవులు పెట్టుము. కాని తగు దేశకాలములను గుర్తింపు మనునర్థమును స్ఫురింపఁజేయును. 'ఏటికిన్' అను నాలోచనా సూచిప్రశ్నము నానిర్దేశముకంటె నీయాలోచనమునకు ఎక్కువ ప్రాధాన్యము గలదు. కావున వివేకముతోఁ బ్రవర్తింపు మనునర్థమును వ్యంజించును.

ఈపై యర్థమంతయు నుత్తరపద్యమందలి 'నిగూఢభాషణముల' నను పదముచే నుక్త ప్రాయమై గుణీభూత మగుచున్నది.

అవమానపడి ద్రౌపది మగలను సభ్యులను తీవ్రదృష్టితోఁ జూచి యిట్లనెను :

"నిఖిలధర్మాధర్మనిపుణంబులైన శు ద్ధాంతరంగంబుల నతిశయిల్లి
శిష్టసంరక్షణ దుష్టనిగ్రహముల నీతిపాటింపంగ నేర్పుగలిగి
సకలశస్త్రాస్త్రసంచయములఁ బరమాద్భు తంబుసేయు పరిశ్రమంబు తాల్చి
దుర్దమప్రతిభటమర్దనక్రీడమైఁ జతురులునానెందు నుతికినెక్కి
యున్న గంధర్వు లేవురు నన్ను నిట్టు లొకఁడు పఱుపంగ నూరక యునికిచూడ
నచ్చెరువుగాదె యెవ్వరియాండ్రు రింకఁ బరిభవంబునఁ బొందక బ్రదుకువారు."

**4.2.140**

ఇందు సీసచరణములు నాల్గింటియందును గ్రమముగా ధర్మజభీమార్జున యములు పేర్కొనఁబడిరి. పేర్కొన్న వారిలక్షణములచే ననురక్తయగు నిల్లాలి నుపేక్షించుట శుద్ధాంతరంగ లక్షణమా? దుష్టనిగ్రహము చేయకుండుట నీతియా? శస్త్రాస్త్రసంచయముల విజ్ఞానము పరమాద్భుతము చేయుటకే కాని పడఁతిని గాపాడుటకుఁ గాదా? దుర్దమప్రతిభటమర్దన క్రీడతోఁ జతురులని నుతిగొని తుదికి భార్యను నీచునినుండి కాపాడలేకపోవుటయా? అను నధిక్షేపణము వ్యంగ్యమగును. 'ఏవు' రనుపద మొకఁడుకాడిద్దఱుకా దైదు గురుంటిరే; మీలో నేయొక్కఁడును నాభంగపాటునకుఁ బ్రతిక్రియ చేయరాదా? యనునర్థమును వ్యంజించును. 'నన్ను' ననుపదము ఉత్తమశీలను, మీ కనుఁగుభార్యను, మీకష్టసుఖములలో సమానభాగస్వామినినై యున్నదాననగు నన్ను ననునర్థమును వ్యంజించును. 'ఇట్టులు' అనుపదము తాను బడిన యవమాన

మెంతనికృష్టమైనదో తెలుపుట నభివ్యంజించును. 'ఒకఁడు' అనుటచే మీ శక్తి సామర్థ్యములలో నావగింజంతయు శక్తిలేని నీచుఁడీ కీచకుఁడు. అట్టివాఁ డిట్లు సేయఁగా నొప్పరికించుటయా? యను నర్థము ప్రతీయమానమగును.

శోక క్రోధములు మనసు నుద్రిక్తము సేయఁగా నుచితానుచితములు సంభావింపఁజాలని ద్రౌపది సభలో నిందావాక్యము లాడుచుండఁగా గంభీరతాఖని యగు ధర్మరా జామెతో నిట్లు పలికెను :

"జననాయకుండు నీసభవారు నీదగు తెఱఁగెల్ల నెఱిఁగిరి! యింక
మానక యీ పలుమాటలాడఁగనేల; చనుము నీవు సుధేష్ణసదనమునకు;
నీపరాభవమునఁ గోపింపనేరరే - గంధర్వులకుఁ దఱికాదుగాక;
సమయమెయ్యదియేనిఁ దమకును నీకుఁ గ ల్గినయట్టులైనను గినియ రిచటఁ
గాన నాథుల దూఱంగఁగాదు వినుము సతికిఁ దానెంతవడియును సభలలోనఁ
దడవుగా నిల్చి యిట్టు లుదగ్రవృత్తి శంకచెడి ధిక్కరింపంగఁ జనునె- చెపుమ."

**4.2.148**

ఇందు 'మానక-యీపలుమాటలేల? చనుము. నీవు సుధేష్ణసదనమునకున్' అనుటలో నెక్కువ మాటలాడినచో నెక్కువకాల మిట నున్నచో నజ్ఞాతవాసపు గుట్టు రట్టగును గావునఁ ద్వరగా నిటనుండి కదలుట లెస్స యను భావము ప్రతీయమానమగును. 'నీ పరాభవమునఁ గోపింపనేరరే గంధర్వులకుఁ దఱిగాదుగాక!' అనుటచేఁ దఱియైనపుడు మేలుగీడులారసి కార్యమునకుఁ దప్పక దొరకొందుము. ప్రస్తుతము నీవు కోపముడిపికొని నీ స్థానమున కరుగు' మను ననునయము వ్యక్తమగును. 'సమయమెయ్యదియేని' అనుట మన సమయము మాట మఱచితివా? యను నభిప్రాయమును వ్యక్తపఱచును. 'కినియరిచటన్' అనుటచే మేము పగదీర్చుకొనఁ దలంచుటయే లేదనుకొనుము. ఇచటఁ గినియము, తఱియైనపుడు తప్పక పగదీర్తు మనునర్థమును వ్యక్తము సేయును. 'సతికిఁ దానంతవడెయును' ఇత్యాద వాక్యముచే నీయవమానము దుస్సహమని మేమెఱింగితిమి కాని దానివలన వివేకము గోల్పోయి యనేకులున్న యీ సభలో నెక్కువ కాలము నిలిచి కోపముఁ బ్రకటించినచో మనగూఢవర్తనము బట్టబయలగును. కావున సమయమును స్మరించి యుదగ్రవృత్తి నవలంబింపక యిటనుండి వెడలిపొమ్మను నర్థము వ్యంగ్యమగును.

ఈయాశ్వాసమునఁ బ్రారంభమున విప్రలంభశృంగారాభాసమును, అంతమున వీరరౌద్రాద్భుత రసములు, నడుమ నడుమ హాస్యరసమును ప్రతీయమానములగును.

కీచకుఁడు ద్రౌపదిని గాంచుట, మదనవికారము లాతనిని పైకొనుట మున్నగు సంశములు విప్రలంభ శృంగారమును బుట్టించును. కాని యది యనుచితముగా ప్రవర్తితమగుటచేతను, అనురాగ ముభయనిష్ఠము కాకపోవుటచేతను ఆభాసమగు చున్నది. ద్రౌపది భంగపాటును నామెదుఃఖమును గరుణరసోత్పాదకములు. సంకేతించి పోయిన పిదప కీచకుఁడు పడిన పాటులు, చేసిన చేష్టలు హాస్యరసము ననుభవింపఁజేయును. భీమసేనునితోడి యుద్ధమున వీరరసమును, కీచక సంహార ఘట్టమున రౌద్రరసమును, భీమసేనుని విజృంభణమున నద్భుత రసమును జనించును.

## విరాటపర్వము - తృతీయాశ్వాసము :-

కీచకుని మరణవార్త విని యుపకీచకులంద ఱొక్కుమ్మడి విజృంభించి ద్రౌపదిని కీచకశవముపైవైచి కట్టికొనిపోవుచుండఁగా నామె విలపించుచు నిట్లనియెను :

"తొడఁగినపని చలంబెడపక యతిదుష్క రంబైనఁ గడతేర్చు ప్రభువులార!
పెనఁగిన వైవస్వతునినైనఁ గడిమిమై వ్రేల్మిడిఁ బరిమార్చు వీరులార!
శరణార్థి యగు దుష్టశాత్రవునైనను గరుణ రక్షించు సత్పురుషులార!
యర్థికిఁ బ్రాణంబులైనను డాఁపక తమకించి యిచ్చు నుదారులార!
నాథులార! గంధర్వరత్నంబులార! నన్ను నుపకీచకులు తమ యన్నశవము
నందు బంధించికొని వెస నరుగుచున్న వారు; రక్షింప వేగ రావలయు మీరు."
4.3.22

ఈ పద్యమునందలి సంబోధనముల సముదాయము ద్రౌపది శోకాతిశయమును చక్కగా వ్యంజించుచున్నది. మఱియు నిందుఁ బేర్కొన్న యంశము లన్నియు వ్యంగ్యార్థవిలసితములు. 'తొడఁగినపని...' ఇత్యాది ప్రథమపాదార్థముచే ప్రారంభించిన దుష్టసంహారకాండ యింకను ముగియలేదు, కావున వేగమ వచ్చి యాపని ముగింపుఁ డను నర్థము తోఁచును. ద్వితీయపాదార్థముచే నీయుపకీచకసంహారము మీకొక లెక్కలోనిది కాదు. కావున త్వరగా విజృంభించి శత్రువును రూపుమాపుఁడను నర్థము ప్రతీయమానమగును. తృతీయపాదార్థముచే శరణార్థియగు దుష్టశాత్రవునైనను గరుణతో రక్షించు సత్స్వభావముగల మీరు మీకనురక్తురాలను, భార్యను, ఉపేక్ష చేయరానిదానను అగు నన్ను రక్షింప వేగ రండను నర్థము వ్యక్తమగును. చతుర్థపాదార్థముచే నుపకీచకులతోఁ బోరినచో ప్రాణాపాయము ఘటిల్లునను వెఱపు లేక నన్ను మీరు తప్పక రక్షింతురను ధైర్యముతో నున్నదానను భావము వ్యంగ్యమగును. 'గంధర్వరత్నంబులార!' యనుట మీ రీమిషతో వచ్చి నన్ను రక్షించి వీరిని శిక్షించినచో అజ్ఞాతవాసమునకు భంగము రాకుండఁ గాపాడుకొనవచ్చు నను నర్థము వ్యంగ్యమగును.

ద్రౌపదీ విలాపము విని క్రోధరౌద్రములు పెనఁగొన నుపకీచకసంహారమునకై వచ్చిన భీమసేనుని యాకృతిని కవి యిట్లు వర్ణించెను.

"వికటభ్రూకుటిఘోరఫాలకలితస్వేదోద్భటుండుం, జల
ద్వికృతోష్ఠద్వయుఁడుం, బ్రవర్ధనదశావిర్భావసంభావితాం
గకుఁడుం, జిత్తవిదాహదోహలసమగ్రక్రోధవేగుండు నై
బకవిధ్వంసకుఁ డయ్యెడన్ నిలిచె శుంభన్మూర్తి విస్ఫూర్తితోన్." 4.3.25

ఇందలి సమాసదైర్ఘ్యమును, పరుషాక్షరబాహుళ్యమును, సంయుక్తాక్షర సమాహారమును భీమసేనాలంబకమగు భయకారిత్వమును రౌద్రరసముగా నిరూపించు చున్నది. స్వేదోద్భవము, చలద్వికృతోష్ఠములు మున్నగునవి యనుభావములు. బకవిధ్వంసకుఁడను పద మభిప్రాయగర్భితము. ఇప్పటి యీ భీమసేనుని విజృంభణమువలన నుపకీచకులు బకాద్యసురులవలె (బకశబ్దమిట భీమనిహతులగు నితరులకు నుపలక్షణము) నామమాత్రావశిష్టులగుదురను నభిప్రాయమిందు వ్యంగ్యమగును. శుంభన్మూర్తిపద మాతని ధైర్యగరిమ నభివ్యక్తము చేయును.

'సింహబల ప్రభృతి కీచకవిధ్వంసంబునం దెలివొంది పాంచాలి మందమంద యానంబునం బురంబుసొచ్చి రాజవీథి నరుగుదెంచునప్పుడు' :

"మనకీచకులకెల్ల మారియై పుట్టిన సుదతి పోయెడునని చూచువారు -
నద్దిరా నీకుఁ గ్రొవ్వఱుగదేఁ జూతు గా కని తలనూపక యడఁగువారు -
నలవోక గనుఁగొని యంతరంగము బిట్టు బెదర మాఱుమొగంబు పెట్టువారు-
నెదురుగా వచ్చిన నెంతయేనియు దవ్వుఁ గలుగ వేఱొకత్రోవఁ దొలఁగువారు-
ముట్టఁబడి మేనఁగంపంబుపుట్ట నొదిఁగి యుండువారుఁ గరంబున నుదర మప్ప
ళించి యమ్మరొరక్కసి యంచు నుల్ల ములుకువారునై పురజనంబులు తలంకి." 4.3.37

ఈ పద్యమునందలి జనుల ప్రవర్తనము హాస్యరసోత్పాదకము. ఒక స్త్రీనిఁ గాంచి తటస్థులగు జను లిట్లిట్లు బెగడొందుట పాఠకునకు నవ్వు పుట్టించును. ఏలయన వారిభీతి నిర్హేతుకము. ఆమె తన కపకృతిఁ గావించిన కీచకాధముల మడియింపఁజేసినది. ప్రస్తుతము ప్రసన్నముగా నున్నది. తా మామె కపకారము చేయుటగాని, చేయఁదలఁ చుట కాని జరుగదు. కాన భయపడుటకు హేతువు లేదు. ఇట్టి పరిస్థితిలో వారు భయపడి చూచుట, చూచువాని నదలించుట, మార్మొగము పెట్టుట, త్రోవఁదొలఁగుట మున్నగు వికారములు హాస్యరసము నుదయింపఁజేయును. తరువాతి పద్యమునందలి 'అన్నెలఁ

తుకయంతరంగమున నిండినహాస్యరసంబు' - ఇత్యాదిచే నిది చెప్పఁబడుటయునైనది.

ఈయాశ్వాసమున నుపకీచక వధ వృత్తాంతము అద్భుత రౌద్రరసాన్వితము. ద్రౌపద్యాలంబకమగు శోకము కరుణముగా రూపొంది ప్రధానముగ సంభావితమగు రౌద్రమున కంగప్రాయమగును. కీచకశవదర్శన సమయమున బంధుజనులు పడు విస్మయము, ఉపకీచకులు ద్రౌపదినిఁ గట్టుకొని పోవునప్పుడు భీమసేనుని విజృంభణము నందలి కోపమును అద్భుతముగా, రౌద్రముగా రూపొందుచున్నవి. ద్రౌపదిని గాంచి పురజనులు పొందిన యులుకుపాటు హాస్యరసము నుత్పాదించును.

దక్షిణగోగ్రహణ వృత్తాంతము వీరరసావహము. అజ్ఞాతవాసము చేయుచున్న పాండవులను గనిపట్టవలయునని దుర్యోధనాదు లుత్సహించుట, సుశర్మగోగ్రహణమున కుఱ్ఱూఁతలూగుట, విషయమెఱిఁగి విరాటుఁడు పుత్రసోదర సమేతుఁడై యుద్ధమున కరుగుదెంచుట, ప్రవర్తిల్లిన యుద్ధము - వీని వలన యుద్ధవీర మనుభూయమానమగును. సుశర్మ చేఁబట్టువడి ధర్మజుని ప్రేరణమున భీమనకుల సహదేవులచే విడిపింపఁబడిన విరాటుఁడు తనకు రాజ్యమిత్తు ననఁగా ధర్మజుఁడు కైకొనకుండుటయు, బంధితుఁడగు సుశర్మను సరథగజాశ్వంబుగ విడువుమని యాతఁడు విరాటునిఁ బ్రార్థించుటయు ననునంశములు ధర్మజాలంబకమగు ధర్మదయలను రసీకరించుటచే నందు ధర్మదయావీరములు ప్రతీయమానములగును.

## విరాటపర్వము - చతుర్థాశ్వాసము :-

బృహన్నలను సారథిగాఁ జేసికొని యుద్ధసన్నద్ధుఁడై వచ్చిన యుత్తరునకుఁ గానవచ్చిన కౌరవ రాజ్యసైన్య మిట్లభివర్ణింపఁబడినది :

**"అభినవజలధరశ్యామంబులగునెడ లాకుజొంపంబుల ననుకరింప**
**సాంధ్యరాగోపమచ్ఛాయంబులగుపట్లు కిసలయోత్కరములఁ గ్రేణిసేయ**
**రాజమరాళగౌరములగుచోటులు తఱచుఁ బూఁబొదలచందంబునొంద**
**హరిద్రరుచిసమానాకృతులగు తావు లడరెడుపుప్పొడులట్లు మెఱయ**
**గలయ నెగసి ధరాధూళి లలితవనము దివికి నలిఁగాఁపువోయెడు తెఱఁగు తాల్ప**
**గోగణము ముంగలిగ నేలగోడివడఁగ నడచు కౌరవరాజసైన్యంబుఁ గనియె"**

**4.4.50**

ఈ పద్యమునందలి ధూళి నుపమించినతీఱు దాని యతివిశాలత్వ సమున్నతత్వములను బ్రతీయమాన మొనరించుచుఁ గౌవరసేన మహత్త్వము నూహింపఁ జేయుచున్నది. కైకొనిన పద్యముకూడ సుదీర్ఘమైనదై పై యూహకు వ్యంజకమగుచున్నది.

'దివికిఁ గాపుపోయెడు తెఱఁగుతాల్పె' ననునది ధూళి యాకాశమున సుదూరముగా వ్యాపించెనను నర్థమును దెలిపి సేనాబాహుళ్యము నభివ్యంజించుచున్నది. దానికి 'నేలగోడివడఁగ' నను నతిశయోక్తియు సహకారకమగుచున్నది. ఇట్లీ పద్యమంతయుఁ గౌరవసేన మహత్త్వము నభివర్ణించుచుఁ బ్రథమదర్శనముననే యుత్తరుని మనసున నుత్తలపాటు గలుగుటలోని సామంజస్యమును వ్యక్తము చేయుచున్నది.

దూరముననందే సేనాపారావారము గని భీతిలిన యుత్తరుఁడు రథము మరలింపుమని యడుగ బృహన్నల యిట్లు పలికెను :

"అసదృశలీలఁబొల్చు రథికావలిమీఁదఁజనంగ వెజ్జినే;
మసలక యామిషంబుగొని మార్గముపట్టిన తుచ్ఛసైన్యమున్
వెసఁజనిముట్టి గోధనము వేగ మరల్తముగాక; యిమ్మెయిం
బసు లటు వోవఁగా మరలఁ బాడియె?నీకు నరేంద్రనందనా!" 4.4.57

ఇందు 'నీకు' అనుపదము వ్యంజకము. ఏ నీవు అంతిపురములో స్త్రీలకడ పౌరుషోక్తులాడితివో, యే నీవు సారథ్యమునకుఁ నేను దగనని సంభావించితివో, యే నీ పసులను శత్రువర్గము గైకొని పోవుచున్నదో యట్టి నీకు మరలఁబాడియా? యను నర్థ మర్థాంతర సంక్రమిత వాచ్య రూపమున సిద్ధించును. మఱియు ప్రధానవ్యక్తివగు నీవు సేవకుఁడవగు నన్ను ధీరునిగాఁ జేసికొనవలసి యుండఁగా నీవే భీతుఁడవైనచో నెట్లను నర్థముకూడ నిట వ్యంగ్యము. నీవు సామాన్యుఁడవైనచో పోనిమ్మని యొప్పరికింపవచ్చును. కాని భూపాలకుని పుత్రకుఁడవై, యుత్తమ క్షత్రియ కులంబున జనించి ప్రజాసంరక్షణ తత్పరుఁడవు కావలసిన నీవు నీధనమును రక్షించుకొను విషయముననందే యసమర్థుఁడవైనచో నీ నరేంద్రత్వ మేపాటిదో యూహించుకొను మను నర్థము 'నరేంద్రనందనా!' యను సంబోధనముచేఁ బ్రతీయమానమగును. మఱియు నీవు విక్రమించి శత్రువుల రూపుమాపి గోవులను మరలించినపుడే నీ తండ్రి యానందము నొందునుగాని యిట్లైనచో నాతనికి నీ వానందనంధాయకుఁడ వెట్లగుదువను నర్థము కూడ నిందుఁ బ్రతీయమానమగును. తుచ్ఛసైన్యమున్ అనుటచే నీచూపునకుఁ బెద్దగాఁ గానవచ్చినను భయపడఁదగినది కాదు. కావున ధైర్యముగా నుండు మను నర్థము తోఁచును.

పలాయమానుఁడగు తన్నర్జునుఁడు పట్టుకొనఁగా నుత్తరుని యవస్థ యీక్రింది పద్యమున వర్ణింపఁబడినది :

"వెలవెలఁబాఱుచు వెగడొందుఁ; బెదవుల తడియాఱ నెంతయుఁ దల్లడిల్లు;
జల్లన నంగంబు లెల్ల నిండఁజెమర్చుఁ; బదములుఁ గరములుఁ గుదియవడకు;

హృదయంబు తటతట నదరంగఁ బెలుకుఱు; దీనదృష్టుల మోముఁ దేఱిచూచు;
నెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు; విడుమని ప్రార్థించు మాటఁ గీడ్పాటు తోఁప;
నిష్కశతశుద్ధ హేమంబు నిర్మలోజ్జ్వ లాష్టవైడూర్యములుఁ దురగాఢ్యరథముఁ
గరటి దశకంబు నొకయూరుఁ బురముచొచ్చినపుడ యిచ్చెద నీ; కను నార్తుఁడగుచు."
4.4.80

ఇందుఁ బోరునకై వచ్చి పరసేనఁగాంచి భీరువై పాఱెడు నుత్తరుని శోకము కరుణముగాఁ బర్యవసించును గాని యది బీరమును జూపనెంచి వచ్చినవానియం దనుచితముగాఁ బ్రవర్తిల్లి యాభాసమై హాస్యముగాఁ బరిణమించుచున్నది. వెలవెలఁ బారుట, తల్లడిల్లుట మున్నగు ననుభావములును, గ్లానిత్రాసార్తాది వ్యభిచారి భావములును నిందుఁ జక్కగా వర్ణింపఁబడినవి. గీత పద్యమున నుత్తరుని లఘు స్వభావము చక్కగా వ్యంజింపఁబడినది. తానీఁబూనిన వస్త్వాదికమున కొక్కొక్కదానికి లెక్క చెప్పుట, మఱల నింటికేగినపిదపఁ గాదందునని నీవు శంకింతువేమో యట్టిదాని కవకాశము లేదు. పురముచేరిన వెంటనే యిచ్చివేసెదను గదా! అని నొక్కి చెప్పుటకైన అవధారణార్థకాకార ప్రయోగము మున్నగునవి మానముకంటెఁ బ్రాణ మధికమను వాని సిద్ధాంతమును వ్యంగ్యముగాఁ బ్రతిపాదించును. 'శుద్ధ', 'నిర్మలోజ్జ్వల', 'తురగాఢ్య' అను విశేషణము లావలివ్యక్తి కాశఁబుట్టించు ప్రయత్నము నభివ్యక్తము చేయును.

మోహరంబుదెస ననాదరంబుచేసి గోవులపజ్జంజనుచున్న కిరీటినిఁ గాంచి సురనదీసూనుఁడు కురువీరులతో నిట్లనియె :

"చిరకాలమునకుఁ గంటిమి నరు; నక్కట వీఁడు సజ్జనప్రియుఁడు సుహృ
త్పరతంత్రుఁడు బాంధవహితుఁ డరిభీకరుఁ డిట్టివార లవనింగలరే!"4.4.256

చిరకాలమునకుఁ గంటి మనుటచే భీష్ముని కర్జునుని బహుకాలముగాఁ జూడవలయునను వాంఛ కలదనునంశమును, దానిచే నాతని కాతనియెడఁగల ప్రేమాతిశయమును వ్యంగ్యములగును. అక్కట యనునిపాత మాశ్చర్యానందముల నభివ్యంజించును. సజ్జనప్రియుఁడు మున్నగు విశేషణములచే నాతఁడు దుర్జనులగు ధార్తరాష్ట్రుల నొప్పరికింపఁడనియు, శత్రువులకుఁ గాలయముఁడగుననియు, బాంధవుల కెంతగా హితుఁడైనను వారు శత్రుత్వము వహించినచో భీకరుఁడై చీల్చి చెండాడునే కాని యౌదాసీన్యము వహింపఁడనియు నర్థము తోఁచును.

ఈయాశ్వాసమున నుత్తరుని ప్రవర్తనము హాస్యరసము నుప్పతిల్లఁజేయును. ఎదిరిబలమెఱుఁగక యుద్ధ సన్నద్ధుఁడగుట, స్త్రీసమాజమున బీరములాడుట,

బృహన్నలను లఘు బుద్ధితోఁ జూచుట, కౌరవ సేనను జూచినంతనే భయపడుట, రథముడిగ్గి పరువెత్తుట, యర్జునుని నమ్ముటకు వివిధములైన ప్రశ్నములను గురిపించుట, దేవదత్తము పూరింపఁబడఁగా మూర్ఛనొందుట మున్నగు నంశములన్నియు క్షత్రియున కనుచితములై నవ్వు పుట్టించును. తక్కిన కథాభాగమునందుఁ బ్రధానముగ నర్జున పరాక్రమాతిశయము నాతని యుద్ధోత్సాహము ననునంశములు ప్రతీయమానము లగుచున్నవి. కర్ణునిమాటలయందు ధనంజయునిపై నతనికిఁగల స్పర్ధయు, గురుభీష్ముల వాక్యములందుఁ గౌరవ పాండవులయందు సమానములగు ప్రేమాదులు మున్నగునవి యభివ్యక్తములగును. కావున నట ధర్మవీరము రూపుదిద్దుకొనును.

## విరాటపర్వము - పంచమాశ్వాసము :-

కౌరవసేనలోని యెన్నఁదగినవారి నొక్కరి నొక్కరి నుత్తరునికిఁ బరిచయము చేయుచుఁ గర్ణునిఁజూపి యర్జునుఁడనిన పలుకులు :

"యోధాగ్రేసరుఁ డిద్ధతేజుఁడు - రణోద్యోగానురక్తుండు - దు
స్సాధప్రక్రమబాహువీర్యుఁడు - కురుక్ష్మాపాలవాల్లభ్య ల
క్ష్మీధామాత్ముఁడు - జామదగ్న్యకలిత శ్రేష్ఠాస్త్రవిద్యాఢ్యుఁ డీ
రాధేయుం డొక చిరికింగొనఁడు వీరవ్రాతముం బోరులన్". 4.5.11

తనకు నిత్యప్రతిద్వంద్వియును, తన్ను సాధించుటయే ప్రధాన లక్ష్యముగాఁ గలవాఁడును నగు కర్ణునిఁ బరోక్షమున నింతగాఁ బ్రశంసించుట యర్జునుని హృదయౌన్నత్యమును జక్కగా నభివ్యంజించును. అందును బెక్కువిశేషణములు పరాక్రమాతిశయద్యోతకములగుటయు నాతని నిండు మనస్సును బ్రతీయమాన మొనర్చును. మఱియు నిది యాత్మశ్లాఘయందుఁ బర్యవసించుననుటయు సంభావింపనగును. ఇంతటి పరాక్రమోపేతునిఁగూడ నింతమంది మహావీరులతోపాటుగ గెలుతును జూడు నాపరాక్రమాతిశయ మను నర్థము నిట నూహింపవచ్చును.

అర్జునుఁడు భీష్మునితోడి యుద్ధము నారంభించు సమయమున భీష్మార్జునుల శంఖనాదములను గవి యిట్లు వర్ణించెను :

"శాంతనవుండు నప్డు నిజశంఖము కౌరవరాజసైన్యముల్
సంతసమంద నొత్తుచు నసంభ్రమలీల నెదుర్కొనంగ దు
ర్దాంత భుజాబలప్రకటదర్పమెలర్ప నరుండు నొత్తె ది
గ్దంతి నికాయ కర్ణపుటదారణవిత్తము దేవదత్తమున్." 4.5.164

శాంతనవుఁడు కౌరవ సైన్యము మాత్రము సంతసమందునట్లుగా శంఖమును బూరింపఁగా నర్జునుఁడు దిగ్దంతినికాయకర్ణపుటదారణవిత్తమైన దేవదత్తము నొత్తెను. అనఁ

గా భీష్ముని శంఖనాదము తన పక్షమువారగు కౌరవులకు మాత్రమే తృప్తికరముకాఁగా నర్జునుని శంఖనాదము భూమికెల్లలయందు నిలిచిన దిగ్గజముల కర్ణరంధ్రములను గూడ భేదింప సమర్థమైనది. కావున కైముత్యన్యాయముచే సమీపగతులైనవా రాధ్వని కెంత భీతిల్లిరో యనునంశ మభివ్యక్తమగును. ఇట్లీ యిరువిధముల శంఖనాదములచే భీష్మార్జునుల శక్తి సామర్థ్యము లందలి తారతమ్యమును యుద్ధఫలితమును వ్యంగ్యముగా స్ఫురించును.

వికర్ణుఁడెక్కివచ్చిన 'పేరెన్నికగన్న మదహస్తి నర్జునుఁడు గూలనేసిన విధము :

"ఫాలకుంభసంధిఁబడి వాలమునదెస నుచ్చిపోవుటయును నుర్వి యద్రువఁ
గూలె నగ్గజంబు కులిశచండాహతిఁ బడు మహానగంబు భంగి తోఁప."4.5.194

ఇందర్జునుఁడేసిన బాణముచే నేనుఁగు మొగముకడనుండి వాలప్రదేశము వఱకు రంధ్రమేర్పడునట్లయ్యెనన్న విషయముచే దానికిఁ గ్రౌంచపర్వతసామ్యమును దద్భేదన మొనరించిన యర్జునునకుఁ గ్రౌంచదారణుఁడగు కుమారస్వామి సామ్యమును వ్యక్తములై యర్జునుని యతిలోక పరాక్రమమును వ్యక్తము చేయుచున్నవి. 'హస్తిపురిఁ బేరుగల మదహస్తి' యే యిట్లయ్యెనన్నచో తదితరములగు గజాశ్వసుభటవర్గముల పాటు వర్ణింపనేల యనుతీరున నర్థాపత్త్యలంకార మిట వ్యంగ్యమై యర్జునాలంబకమగు వీరోత్సాహముచే స్ఫురించు వీరరసమున కలంకారముగా నెలకొని యలరించుచున్నది. ఉపమాలంకారము కూడ నిట వ్యంగ్యము.

అర్జునుని బాణతీవ్రతకు నిలువలేక పాఱిపోవుచున్న దుర్యోధనునితో నర్జునుఁ డిట్లాడెను :

"క్షత్రియుఁ డోడునే తగదు కౌరవరాజ! యొకండ నేఁ బృథా
పుత్రులలోనఁ బిన్న నినుఁ బోరికిఁ బిల్వఁగ మానినాఁగ ని
ద్ధాత్రిఁ బ్రసిద్ధికెక్కి బలదర్పసమగ్రుఁడవైన నీవు నీ
మిత్రులుఁగూడ నిట్లయిన మెత్తురె వత్తురె కొల్వ భూభుజుల్." 4.5.203

ఇందలి 'క్షత్రియుఁ డోడునే' అను వాక్యముచే నీవిట్లు ప్రాణరక్షణకై పాఱినచో నీక్షత్రియత్వమే లోకులచే శంకింపఁబడు నను నర్థము వ్యంగ్యము. 'కౌరవరాజ' అనుసంబోధనముచే మహోన్నతమగు కురువంశమున నీచుఁడవు నీవు పుట్టి కులగౌరవమును జెఱుచుచున్నా వనునర్థము వ్యంగ్యము. 'ఒకండన్, నేన్, పృథాపుత్రులలోనఁబిన్న' ననుటచే నీవు భీష్మద్రోణాదిమహావీరుల సహాయ సంపదలు గలవాఁడవు, నూర్గురుసోదరుల కగ్రజుఁడవు నై యిట్లగుట పాడియా? యను నర్థము వ్యంగ్యము. మానినాఁగ

నిత్యాదికముచే నిట్లైనచో నీవు అభిమానవంతుఁడ వగుట యెట్లు? నీకుఁ గలిగిన ప్రసిద్ధి యంతయు దబ్బఱసుమా అనునర్థము వ్యంగ్యము. 'బలదర్పసమగ్రుఁడవైన నీవు' అనుటచే నీ బలదర్పములు మంటఁగలిసె నిఁక నేనింతవాఁడ నని భ్రమపడకు మనునర్థము వ్యంగ్యము. 'నీమిత్రులు' అనుట ప్రధానముగాఁ గర్ణుని సూచించును. ఎవనిపై నీకుఁ బరమవిశ్వాసముగలదో వాఁడు, చూడు, మేమయ్యేనో యట్టివాఁడు నీకు మిత్రుఁడగునా? అపన్నుఁడవగు నిన్ను విడచి పాఱిపోవుచున్నాఁడు, వీఁడు మిత్రుడా? యనునర్థ మిట వ్యంగ్యము. 'వత్తురె కొల్వ భూభుజుల్' అను వాక్యముచే నొకవేళ వచ్చినచో నిన్ను ఛీకొట్టుటకు వత్తురనునర్థము వ్యంగ్యము.

ఈయాశ్వాసమున 220 వ పద్యమువఱకు నర్జునుఁడు, 'భీష్మద్రోణకృపాది ధన్వినికరాభీల' మైన కౌరవసేనతో నసహాయశూరుఁడై పోరినపో రభివర్ణింపఁబడినది. ఇది యర్జునుని యసమానయుద్ధ వీరమునకు శిఖరాయమాణమైన సన్నివేశము. ఇందు వీరరౌద్రాద్భుత రసములు చక్కగా వ్యంజింపఁబడినవి. అర్జునుఁ డేకవీరుఁడై యింతమందిని గెలుచుటయు, నడుమనడుమ సారథి బెగడువడుచుండఁగా నతని నూరడించుచుఁ దానే సారథ్యమును గూడ నిర్వహించుచు యుద్ధము సల్పుటయు వీరరౌద్రాద్భుతముల నుప్పతిల్లఁజేయును. ఇందుఁ దిక్కనామాత్యుని రసప్రచన యద్భుతావహము. అర్జునునివిక్రమకేళి విస్మయావహముగా వర్ణింపఁబడినది.

జయించివచ్చిన పుత్రు నభినందించి విరాటుఁ డతనితో నిట్లనియె :

**"ద్రోణుడు భీష్ముడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణుఁడుం బశు**
**త్రాణపరాయణత్వమున దర్పసముజ్జ్వలభంగి నుల్లస**
**ద్బాణపరంపరల్ కురియ బార్థివుఁడున్ వెనుదన్నిచూడ న**
**క్షీణజవంబునం గవియుసేనకు మార్కొన నగ్గలించితే."** 4.5.279

ఈ ప్రశ్నలో విరాటుని పుత్రపరాక్రమశ్రవణజనితాశ్చర్య సంభ్రమానందాదులు మిక్కిలిగా నభివ్యక్తములగుచున్నవి. ఒకఁడు చాపాచార్యుఁడు, మఱియొకఁడు పరశురామునంతటి వాని నోర్చిన మహాధానుష్కుఁడు. వేఱొకఁడు ధనుర్విద్యాపాటవమునఁ బేరెన్నికగన్నవాఁడు, ఇంకొకఁడు తండ్రికడ నెల్లయుద్ధ విద్యల నారితేఱిన వాఁడు, ఇతరుఁ డు అస్త్రవిద్యలో నర్జుననంతటి మేటి. ఇట్టివారెల్లరు పట్టుదలతో, పట్టుపడిన పశుసమజమును రక్షింపవలయునను దీక్షతో నెదిరిపక్షమున యుద్ధము చేయుచుండిరి. అదియును నుదాసీన భావముతోఁగాక దర్పసముజ్జ్వలభంగితో, బాలుఁడు వీనితో నేమి యనక యుల్లసద్బాణముల, నొండురెంటిని గాక పరంపరలను, ప్రయోగించుట కాక

వర్షమువలెఁ గురియఁగా, నిదియంతయుఁ జూచుచు సైనికుల నుత్సాహపఱచుచుఁ గురుసార్వభౌముఁడుండఁగా నే కొంచెమును దఱుఁగని జవముతో నొక్క పెట్టునవచ్చిమూఁగుసేనకు మార్కొనఁగా నీవు సాహసించితివా? యని శత్రుపక్షముయొక్క ప్రత్యంశము భీకరమగుటను విరాటుఁడు భావించువైఖరియు నట్టిదానిని నిలుపరించి జయముగొని గోగణమును సాధించి నాపుత్రుఁడు తెచ్చె నన్న పరమానందమును నీపద్యమునం దభివ్యక్తములు.

ఈయాశ్వాసమునందలి మిగిలిన కథాభాగమంతయుఁ బాండవులు విరాటాదులకుఁ దమ్మెఱిఁగించుకొనుటయు, విరాటుఁడు కృతజ్ఞతాపూర్ణమానసుఁడై తన కూఁతు నుత్తర నర్జుననకు భార్యగా నీఁగోరుటయు నర్జునుఁ డామెను గోడలిగాఁ గైకొనుటయు నుత్తరాభిమన్యుల వివాహమహోత్సవమును నను నంశములతోఁ బరిసమాప్తమగును. ఇందుఁ బ్రాయికముగా నద్భుతరసము తోఁచును. విరాటుని విస్మయ మిట ప్రధానమై గోచరించును. ఉత్తరాభిమన్యుల వివాహ వృత్తాంతమున నభిలాషరూపవిప్రలంభ శృంగారము పుష్టినందెను. ఎడనెడఁ బాండవుల ధార్మిక ప్రవృత్తి ప్రస్తూయమానమగుచు ధర్మవీరము గూడ గోచరించును. ఇట్లీ విరాటపర్వ మించుమించుగా సర్వరసములకు నెలవగుటచేతనే తిక్కనామాత్యుఁడు దీనిని నానారసాభ్యుదయోల్లాసి యని కొనియాడెను. ఇందు శాంతరసముకాక తక్కినరసములన్నియు గోచరించుట యందందు వివరింపఁ బడినది.

## ఉద్యోగపర్వము - ప్రథమాశ్వాసము :-

'పాంచాలపతి వయోజ్ఞానవృద్ధుండైన తన పురోహితుం గురుపలిపాలికిం బుచ్చువాఁడై యతని రావించి' యిట్లు పలికెను :

> "హితుఁడవు; మతిమంతుండవు;చతురవచనకోవిదుఁడవు; సమయజ్ఞుఁడ; వు
> న్నతవంశవర్ధనుఁడ; వింగితవేదివి; నెచ్చెలివి; సుకృతి; వట్లగుటన్."
>
> 5.1.53

ఇందు రాయబారికిఁ గావలసిన లక్షణములన్నియు వ్యంగ్యముగాఁ జెప్పఁ బడినవి. రాయబారి ఎవరిపక్షమున రాయబార మరుగుచున్నాఁడో, వారి హితమునే మతిఁ దలఁపవలయును. బుద్ధిమంతుఁడై సమయోచిత ప్రజ్ఞను బ్రదర్శింపవలయును. మాటల నేర్పుతోఁ గార్యమును సానుకూల పఱుపవలయును. సమయము నెఱిఁగి ప్రవర్తింపవలయును. తనవంశ గౌరవమునకు యోగ్యముగా మెలఁగవలయును, శత్రుపక్షమువారి హృదయములందలి భావము నెఱిఁగి యుక్తిప్రత్యుక్తుల నెఱపవలయును.

నిండైన స్నేహమునకు భంగము రానీరాదు. తన పుణ్యప్రవర్తనమువలన చిత్తశుద్ధితోఁ బ్రవర్తించి కార్యసాధన మొనర్పవలయును. దూత యిట్లు మెలఁగవలయు ననునర్థ మిట వ్యంగ్యము. లేదా నీ విట్లిట్లు ప్రవర్తించి యీపని సఫలమొనరింపు మనుప్రార్థనయు నిట వ్యంగ్యము.

సాహాయ్యమర్థించుటకై యరిగిన అర్జునదుర్యోధనులు కృష్ణునికడ ప్రవర్తించిన విధము :

"అతఁడు పవడింప మును కౌరవాధినాథుఁ డరిగి తలయంపిదెస నున్నతాసనమున నుండెఁ బదపడి కాల్కడయొద్ద కల్లఁ జని వినమ్రుఁడై నిలుచుండె సవ్యసాచి."
5.1.65

అతఁడు కౌరవాధినాథుఁడ నను నహంకారముగలవాఁడు. కావుననే లీలామానుషవిగ్రహుఁడైన శ్రీకృష్ణునితత్త్వమెఱుఁగక దురభిమానమే గెలువఁగాఁ దలయంపికడ నున్నతమైన యాసనము నధివసించి యుండెను. అర్జునుఁడు తన ధనుర్విద్యాప్రాభవాదికము చేతను, నారాయణునితో నిత్యసఖ్యముచేతను దుర్యోధనునికంటె సన్నిహితుఁడే యయ్యును కాల్కడయొద్దకు, నిద్రించుచున్నవాసుదేవునకుఁ దన యడుగుల సవ్వడి నిద్రాభంగహేతువగునను భీతిచే, నల్లన - చప్పుడు కాకుండఁ జని నిద్రించుచున్న సమయముగదా నాహృద్భావము చూడవచ్చెనా యనక చిత్తశుద్ధితో వినమ్రుఁడై మేల్కొనునంతకు భయభక్తులతో నిలచియేయుండెను. ఇట్లే యిరువురికని గృష్ణునియెడఁగల భావము లెట్టివో యీ పద్యమున వ్యంగ్యముగా జెప్పఁబడినవి.

నిదురమేల్కొని, వచ్చిన కార్యము చెప్పుడని యడిగిన కృష్ణునితో ధార్తరాష్ట్రుఁ డిట్లు పలికెను :

"ము న్నేను గానవచ్చితినిన్ను; సుజనులైనవారు నెమ్మిని మునుమున్
గన్నందగఁ గైకొంద్రు; సమున్నతసౌజన్యసారయుతుఁడవు నీవున్' 5.1.70

ఇందు 'సుజనులైనవారు..... సమున్నతసౌజన్యసారయుతుఁడవు' అను వాక్యము కృష్ణునికి ముంగాళ్ళకు బంధము వేయుదుర్యోధనుని ప్రయత్నము నభివ్యక్తము చేయును. 'నీవు ముందుగా నాకోరిక నెఱవేర్పనిచో నీవు సుజనుఁడవు కాఁజాలవు. సమున్నత సౌజన్యసారయుతుఁడవని ప్రసిద్ధికెక్కిన నీవు సౌజన్యమును గోల్పోనిష్టపడక నాకోరిక తీర్చి నీప్రసిద్ధిని నిలఁబెట్టుకొనుము'. అను దుర్యోధనుని యభిప్రాయ మిట వ్యంగ్యము.

శల్యుఁడు ధర్మజునకు సహుషునికథ వివరించి తుది కిట్లనియె :

"కౌరవనాథుఁ డానహుషుకైవడి నాశముఁబొందు; వాసవ
శ్రీరమణీయుఁడై జయముచేకొని ధర్మజుఁ డంబురాశివే
లారశనాసముజ్జ్వలవిలాసమనోహరమేదినీవధూ
సారసమగ్రభోగముల నన్నుతికెక్కెడుఁ దానుఁ దమ్ములున్." 5.1.210

ఇందు దుర్యోధనునకును ధర్మజునకును బద్యమున వినియోగించిన పదజాలము, వాని ప్రమాణమును వ్యంజకములై దుర్యోధనుని వైభవము నల్పత్వమును, ధర్మజుని రాజ్యభోగముల విస్తృతిని వ్యంగ్యముగా వక్కాణించుచున్నవి.

ఇచ్చకములాడి పోఁజూచిన సంజయుని మాటలకుఁ గనలి ధర్మజుఁడు తనవారి పరాక్రమమును, దుర్యోధనాదుల తులువతనమును వక్కాణింపఁగా సంజయుఁ డిట్లనుచున్నాఁడు :

"పొందొందఁగఁ దలఁచితి నీవిందుశిశిరమైన విమలహృదయంబున; వా
రందఱకును సేమం బిటముందరలేకున్న నేఁడు మొదలుగఁ గలుగున్."
5.1.283

ధర్మజుఁడింతవఱకు నాడినమాటలలోఁ బొందుప్రసక్తియే లేదు. అట్టియెడ సంజయుఁడు నీవు పొందొందఁగఁదలఁచితివి కావున నింతకుముందు వారికి సేమము లేకున్నను నేటినుండి కలుగుననుట వక్రోక్తి. దీనిని బట్టి 'నీవు పొందునేకోరి నీవారైన ధృతరాష్ట్రాత్మజులను, వారిపక్షమువారినిఁ గాపాడుట లెస్స. అట్లు చేయనిచో నీయిందు శిశిరమైన విమల హృదయమునకు మలినత యేర్పడు నది యభిలషణీయము గాదుసుమా!' అను నర్థము వ్యంగ్యమగును. ఎదిరి వ్యక్తిలో తత్కాలమున లేని భావమును బ్రశంసించి వశీకరించుకొను తాత్పర్య మిందు వ్యక్తమగును.

సంజయుఁడు ధర్మజుని శక్తి సామర్థ్యముల నగ్గించుచు నిట్లాడెను :

"పెట్టనికోట నీకు హరి భీముఁడు నర్జునుఁడున్; రణంబునం
దొట్టినమంట లాకొలఁది యోధుల సాత్యకియున్ విరాటుఁడుం;
జుట్టపుమేరు వుగ్రరణశోభితుఁ డీద్రుపదుండు; నిన్ను ని
ట్టట్టనవచ్చునే సురలకైనను; నొల్లవుగాక చివ్వకున్." 5.1.297

మహా పరాక్రమవంతులైన యిందఱయండదండలుండియును నీవు చివ్వకు నొల్లవుగాక అనుటలో నూరక యేల వీరి సామర్థ్యము నూహించి యిప్పుడు రణమునకు సిద్ధపడి నీ కీర్తి ప్రతిష్ఠల మంటఁగలిపికొనెదవు? ఇప్పుడు నెప్పటివలె యుద్ధముమాట మఱచి శాంతుఁడవై యుండి కీర్తినిలుపుకొను మనునర్థము వ్యంగ్యమగును.

పై సందర్భమునందే కౌరవ సేనను గూర్చి సంజయుఁడిట్లు పలికెను :

"ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణశల్యులుం
బ్రాణము లాసుయోధనునిపాలివయంద్రుడు; నిజానుజన్ము ల
క్షీణపరాక్రముల్; సుతు లజేయులు; బాహ్లికసోమదత్తు లా
స్థాణునకైన నోడరు; వశంబె జయింపఁగ వారి నేరికిన్." 5.1.299

ఇందు ధర్మజుని బెదరించుతాత్పర్య మభివ్యక్తమగును. 'ప్రాణము లా సుయోధనుని పాలివయం' డ్రనుటచే దుర్యోధనుఁ డెట్టివాఁడైనను వీరందఱు ప్రాణములు డాఁపక యుద్ధమొనర్తురు. వాని ప్రవర్తనమునకు నేవగించి యుద్ధము మనః పూర్వకముగాఁ జేయరని నీవు సంభావింపకు మనునర్థము తోఁచును. బాహ్లికసోమదత్తు లాస్థాణునకైన నోడరనుటచే వారిముందు మీరెంత? యనునర్థము గమ్యమానమగును. 'వశంబె జయింపఁ గ వారి నేరికిన్' అనుటచే నట్టివారితో నీవు యుద్ధము చేసి యోడుటయే తప్ప పొందులాభమేమో నీవే యూహించుకొను మనునర్థమభివ్యక్తమగును.

కౌరవ పాండవుల తారతమ్యమును శ్రీకృష్ణుఁడిట్లు రూపించెను :

(1) "రోషమయమహాతరువు సుయోధనుఁ; డురుస్కంధ మందులోనఁ గర్ణు; డలయఁ గొమ్మ సౌబలుండు; కుసుమఫలములు దుశ్శాసనుండు; మూలశక్తి తండ్రి"

(2) "ధర్మజుండు ధర్మతరు; వర్జునుఁడు ఘనస్కంధ; మనిలసుతుఁడు శాఖ; కవలు పుష్ప ఫలము; లేను భూసురులును వేదములుఁ దదీయమైన మూలచయము."

(3) "ఈ రెంటియందు నరసి-యసారంబిది - గాఢసారసహితంబిది-నా
నేరవలయు; నదియునుగా కెరూపం బయ్యేనేని నీసేమిటికిన్."

5.1.355,356,357

అసలే రోషమయమహాతరువు కావున దోషైకాత్మకము. స్కంధము దుర్వినీతుఁ డగు కర్ణుఁడు, అలయఁగొమ్మ కుటిలోపాయపరాయణుఁడగు సౌబలుఁడు, కుసుమ ఫలములు వారియాజ్ఞల నాచరణలోఁ బెట్టునీచుడు దుశ్శాసనుఁడు. ఇదియంతయుఁ గాంచి యుపేక్షించెడుతండ్రి - జన్మముచే చర్మచక్షువులను, పుత్రవ్యామోహముచే బుద్ధి విశేషమును గోల్పోయి హితాహితముల నెఱుఁగఁజాలనిస్థితిలో నున్నవాఁడు - మూల శక్తి, ఇట్టి పట్టులేని, దైవబలములేని, దైవముచేఁ దిట్టువడిన, లోకులకు విషప్రాయమైన యీవృక్ష మెంతగొప్పదియైనను నిలువఁగలుగుట యెట్లు? ఒకవేళ నిలిచినను దానివలన నేరికిఁ బ్రయోజనము? పనికిమాలిన యీ వృక్షమును, ధర్మతరువును జూచినతఱువాతనైన లోకులు ఛేదింపకుందురా?

ఇంక రెండవపక్షమన్ననో - ధర్మజుఁడు ధర్మతరువు. 'ధర్మో రక్షతి రక్షితః' అను న్యాయము ననుసరించి దానికి క్షతియుండదు. దానికి దైవమానుషబలములు సమగ్రముగాఁగల పరాక్రమనిధి యర్జునుఁడు స్కంధము. మూర్తీభవించిన బల పౌరుషములైన భీముఁడు దానికిఁ గొమ్మ. తదాజ్ఞావశవర్తులైన కవలలు పుష్పఫలములు. సర్వజగద్రక్షణపోషణములకుఁ దగిన శాసనము లొనరించెడు వేదములు, వాని నాచరణలోఁ బెట్టుటకును, బెట్టించుటకును యోగ్యులైన భూసురులును సర్వజగన్నియామకుఁడై ధర్మసంస్థాపనమే కర్తవ్యముగా నవతరించిన తానును (శ్రీకృష్ణుఁడు) మూలచయము.

పైవృక్షమునకు మూలము కర్మవశమున జాత్యంధుఁడగుటయే కాక ప్రవర్తనముచే, కుత్సితమైన పుత్రవ్యామోహముచే జ్ఞానచక్షువుగూడ మూఁతపడి, యుక్తాయుక్త వివేకమెఱుఁగని చీకురాజు. అందును నొక్కఁడు. ఈ వృక్షమునకో - లోకుల జ్ఞానచక్షుర్వికాసమునకు మేలిబాటచూపు వేదములును, వానిని నిరంతరము చదివి, చదివించి, యందలి ధర్మముల నాచరించి, యాచరింపించెడు భూసురులును, సాక్షిభూతుఁడై తత్తత్కర్మఫలదాతయై దుష్టశిక్షణ శిష్టరక్షణములఁ గావించు శ్రీకృష్ణుఁడును - ఈయన్నింటి సమాహార రూపము మూలచయము. ఇట్టి దానికి క్షతి యెవ్వఁడు చేయనోపును? పై వృక్షమును (రోషమయమును) గాపాడఁ జాలువాఁ డెవ్వడు? కావున మూడవపద్యమున వ్యంగ్యముగాఁ జెప్పబడినట్లు మొదటిది యసారము. రెండవది గాఢసారసహితము. ఇది యెఱుఁగక యెవ్వఁడేని యజ్ఞానముతోఁ బ్రవర్తించినచో నాఫల మాతఁడే యనుభవించును గాని వేఱొక విధముగా జరుగదను నర్థమీపద్యములం దభివ్యక్తమగును.

ఈయుద్యోగపర్వప్రథమాశ్వాసమున నుత్తరాభిమన్యుల వివాహమునకు విచ్చేసిన ప్రభువర్గమంతయుఁ బాండవుల కర్తవ్యమునుగూర్చి చర్చించుటయు, సైన్య సమీకరణమును, ద్రుపదపురోహితునియు, సంజయునియు రాయబారములును జెప్పఁ బడినవి. ఇందు సాత్యకిపలుకులయందును నట్లే సంజయునితో ధర్మజవాసుదేవులు నొక్కి వక్కాణించిన యుక్తులందును రౌద్రరసము బ్రతీయమానమగును. శల్యుఁడు చెప్పిన వృత్రాసురవధాదివృత్తాంతము, నహుష చరితమును అద్భుతరసోత్పాదకములు. అందు నహుషునిశచీకామము, ఋషివాహనుఁడగుట, మున్నగు నంశములు జుగుప్సను గలిగించును. సంజయ రాయబారఘట్టము రాజనీతి లోతులను వ్యక్తము చేయును.

## ఉద్యోగపర్వము - ద్వితీయాశ్వాసము :-

దూతగా ధర్మజునికడకేఁగి తిరిగివచ్చిన సంజయుడు ధృతరాష్ట్రునితో నిట్లు వచించెను :-

"దేవర పంపఁగాఁ జని యుధిష్ఠిరునింగని వచ్చినాఁడ; నా
భూవిభుఁ డప్రమేయగుణపూజ్యుఁడు మీకు నమస్కరించె; సం
భావనచేసె నా; కిచటి బంధులనెల్లఁ దలంచె; మీ సుఖ
శ్రీవిభవంబులున్ సుతులసేమము నన్నడిగెం బ్రసన్నుఁడై." 5.2.3

ఇందు సాధారణ కుశలప్రశ్నములు వాచ్యముగానున్నను వ్యంగ్యముగా దౌత్య ఫలితము యుధిష్ఠిరుఁ డనుసాభిప్రాయవిశేష్యముచేతనే చెప్పబడుచున్నది. ధర్మజుఁడు యుద్ధమునందే స్థిరుఁడై యున్నాఁడు సుమా! అను నభిప్రాయ మిట వ్యంగ్యము. 'అప్రమేయగుణపూజ్యుఁ' డనునదియు సాభిప్రాయమే. అతఁడట్టివాఁడు కావుననే మనసులో నూహించుటకైన వెగటుగా నుండు కీడులాచరించిన మీకును నమస్కరించెను. అట్టి మీచేఁ బంపఁబడిన నాకును సంభావనము చేసెను. మీపాపములనన్నింటిని జూచుచునూరకున్న బంధులనెల్ల పృచ్ఛ చేసెను. నిత్యము వారి వినాశమునే కోరు మీ సుతుల సేమమును బ్రసన్నుఁడై యడిగెను. కావుననే యాతఁడప్రమేయ గుణపూజ్యుఁ డగుచున్నాఁ డనునర్థము వ్యంగ్యమగును.

అర్జునుఁడు చెప్పిన మాటలుగా సంజయుఁడు ధృతరాష్ట్రునితో నీమాటలాడెను:

"పాండుని యగ్రనందనుఁడు పాలడుగం దగ నీఁడయేని మా
కొండనవేల; మేలది; సుయోధనుఁ డింతకుమున్ను పెక్కు లు
ద్దండతఁ దాను జేసిన విధంబులకెల్ల మెఱుంగుపెట్టిన
ట్లుండెడుఁగాక యేమును వృకోదరుఁడుం బ్రియమందునట్లుగాన్." 5.2.134

ఇందలి 'పాండుని యగ్రనందనుఁడు' అనుమాట సాభిప్రాయము. నిజమునకు రాజ్యాధికారము పాండునిది. అంధుఁడగుటచే ధృతరాష్ట్రుఁడు జ్యేష్ఠుఁడయ్యును తదధికారమును గోల్పోయెను. పాండురాజు సౌభ్రాత్రముచే నాతని రాజుగాఁజేసి యారాధించెను. మఱియు నాతఁడు మహాపరాక్రమముతో దిగ్విజయమొనరించి సామ్రాజ్యాధిపత్యమును గలుగఁజేసెను. అతని యగ్రనందనుఁడగు ధర్మజుఁడు ధృతరాష్ట్రునిచేతనే యువరాజుగాఁ జేయఁబడెను. అతఁడు కుమారులందఱకు నగ్రజుఁడు. అట్టివాని కడుగకయే రాజ్యమీవలసియుండగా నందుఁ గొంతభాగ మడిగినను నీకుండుట యెంతద్రోహమో భావింపుఁడను నర్థమిట వ్యంగ్యమగును. పాలిచ్చుట వారికే మంచిది. ఈకున్నచో వారు మామా ప్రతిజ్ఞలు తీర్చుకొనుట కవకాశము నొసఁగినవారగుదురు. మేము వారిని చీల్చి చెండాడి ప్రియమందుదుము. మాకదియే మేలుకదా! కావున మేము యుద్ధమున కిష్టపడకయో వెఱచియో యుపేక్షవహింతుమని వారు భావింపకుందురుగాక యనునర్థ మిందు వ్యంగ్యమగును.

నేను కౌరవులకు హితమే యాచరించుచున్నానను కర్ణుని మాటల కసహ్యపడి గాంగేయుఁడు ధృతరాష్ట్రునితో నిట్లనియెను :

"ఒక్కఁ డొకం డనేకవిధయుద్ధజయంబులు కొన్నవారు వా;
రెక్కడ నేమిచేసె నితఁ; డీతని తమ్మునిఁ గూలనేసి యు
క్కెక్కినపార్థుపైఁ గవిసెనే; పసులాతఁడు గ్రమ్మఱింపఁగా
నక్కడలేఁడె వీఁడు; భవదాత్మజుఁ గోల్పడె ఘోషయాత్రలోన్." 5.2.162

పాండవులం దొక్కఁడొక్కఁ డనేక విధయుద్ధములలో జయంబులు గొన్నవారనుటచే నందఱుఁగూడి యనల్పమగు సహాయసంపదతోనున్నయిత్తఱి వారికి జయమగు ననుటలో నందియమేల యనునర్థము గమ్యమానమగును. అనేక యుద్ధములనికాక యనేకవిధయుద్ధము లనుటచే వారికిఁ దెలియని యుద్ధ పద్ధతి నవలంబించి గెలుతుమనుటకు వీలులేదు. వారన్నింటియం దారితేఱినవా రనునర్థము వ్యంగ్యమగును. ఇఁక నీతఁడన్నచో చెప్పికొనఁదగిన విజయమొక్కటియు లేనివాఁడు, పైఁగాఁ దనయెదుటఁ దమ్మునిఁ గూలనేయఁగాఁ బ్రతిక్రియ నాచరింపలేనివాఁ డితరుల నెట్లు కాపాడును? ఈతని పరాక్రమమెట్టిదో యెవ్వరెఱుఁగరు? నిన్నటి యుత్తర గోగ్రహణమునందుఁగాని యంతకుముందటి ఘోషయాత్రలోఁగాని పాండవుల గెలుతునని వీరములాడు నీతఁ డున్నపుడేకదా యోటమిగలిగిన దనునర్థము వ్యంగ్యము. ఘోషయాత్రలో భవదాత్మజుఁ గోల్పడె ననుటచే తనవృద్ధికిఁ గారణమై సర్వదా రక్షించు దుర్యోధనుని గంధర్వులు తన్నుకొనిపోవుచుండఁగా నుపేక్షించిన యతఁడు హితుఁడో, పగను దలఁపక అవమానము చేయవచ్చిన వానినిఁ గాపాడి సంరక్షించిన పాండవులు హితులో ఆలోచింపుఁడు. ఇట్టి పరిస్థితిలో నీతఁడు "పతికిఁ బుత్రులకును మనుమలకు హితంబ యొనరనడతు" నను టెంతసత్యమో పరికింపు మనుట వ్యంగ్యము.

హితముపదేశించు భీష్మద్రోణులవాక్యములఁ బెడచెవినిడి ధృతరాష్ట్రుఁడు సంజయు నిట్లడుగుచున్నాఁడు :

"ధర్మపుత్రున కిక్కడి తలఁపుభంగి యెట్టులుండు! నిసైన్యంబు లెల్లఁగూడి
యునికివినియెనే? యెవ్వరిగొని యతండుకౌరవులమీఁద నెత్తిరాఁగలుగువాఁడు?"
5.2.168

ధృతరాష్ట్రుని దుర్యోధనపితృత్వ మీపద్యమునఁ జక్కగా వ్యంజింపఁబడినది. కడచినరాత్రియంతయు మనోవేదనతో నిద్రలేక కుంది పాండవులశక్తి సామర్థ్యములను విదురునివలన ...ని బెదరి నీవు చెప్పినట్లే పాండవులతో సంధిచేయుదునని మాటయిచ్చి

తెలవారుసరి కాహితమును గంగలోఁగలిపి యిట్లనుచున్నాఁ డనఁగా దుర్యోధనునికంటె దుష్టత్వమున నీతఁడు రెండాకులెక్కువ చదివె ననుట వ్యంగ్యము. 'ఈసైన్యంబులెల్లఁ గూడి యునికి వినియెనే' అనుటలో ధృతరాష్ట్రునకు సంఖ్యాబలమునందే విశ్వాసముగాని వైయక్తికశక్తియుక్తుల నాతఁడు నరకుగొనఁడనుట వ్యంగ్యమగును. 'ఎవరిగొని...' ఇత్యాదివాక్యమువలన సమస్తభూచక్రమునకు సార్వభౌములవ్మైన మమ్మే యందరాశ్రయింతురుగాని దరిద్రాగ్రేసరచక్రవర్తులగు వారల నెవ్వరాశ్రయింతురను దురభిమానము వ్యంగ్యమగును. 'ఎత్తిరాఁగలుగువాఁడు' అనుచోటి 'కలుగు' ధాతువు ధర్మజునికి మాపై నెత్తిరాఁగల సామర్థ్య మెక్కడి దనునర్థమును వ్యంజించును. ఇట్లు ధృతరాష్ట్రుడు తన నిజస్వరూపమును విస్పష్టముగా వ్యంజించెను గావుననే "సంజయుఁ డు వెప్పనూర్చి ఱిచ్చవడి మూర్ఛవోయినచందంబున డెందంబు మొగుడం జేష్టలు దక్కియుండెను."

భీముని యాటోపమునకు బెదరిపోయిన తండ్రికి ధైర్యముచెప్పుచు సుయోధనుం డిట్లు పలికెను :

"అతఁడు వడిన వెండి యాసేనఁ గోల్తలసేయ నొకఁడు లేమి సిద్ధ, మింత యెఱిఁగి వెఱచికాదె యేనూళ్ళులైననుదమకుఁ జాలుననియె ధర్మసుతుఁడు."

5.3.219

ఈపద్యము క్షమియించువానిఁగని చాలమివెట్టు వానిన్వభావమును, సుధీగుణమును దురితారూఢముచేయు వానిభావమును జక్కగా నభివ్యంజించును. ఒకటిరెండు మారులు వారిపరాక్రమము చవిచూచి చావుదప్పికన్నులొట్టవోయెనను సామెతకు లక్ష్యప్రాయుఁడైన దుర్యోధనుఁడు ధర్మజుఁడు వెఱచి యైదూళ్ళడిగె ననుటలో నాతని దురభిమాన మెట్టిదో, తెలిసితెలిసి నిప్పుతోఁ జెలగాటమాడి యాత్మవినాశము కోరితెచ్చుకొను స్వభావమెట్టిదియో యీపద్యమున నభివ్యక్తము చేయఁబడినది.

ఈయాశ్వాసమున ధృతరాష్ట్రునకుఁ జిత్తస్వాస్థ్యము లేనియెడల విదురుఁడాతనికి హితముపదేశించుటయు, సంజయుఁడు దూతగానేఁగి వచ్చి పాండవులసంగతులు వక్కాణించుటయు, బంధుజనులందఱు దుర్యోధనుని సంధికొడఁబడుమని యనేక విధముల నొక్కిచెప్పుటయు నాతఁడు వినక యుద్ధమునకు నిశ్చయము చేయుటయు వ్యాసగాంధారులుకూడఁ జెప్పిచూచుటయు ననునంశములు వివరింపఁబడినవి. ఇందు విదురనీతి పరమరమణీయమై యెల్లవారికిని జక్కని యుపదేశమొసఁగుచున్నది. అంతేకాక యందలి పద్యములన్నియు భాండవకౌరవుల గుణవిశేషములను మిక్కిలిగా

వక్కాణించుచున్నవి. తక్కిన కథాభాగమునందంతటను దుర్యోధనుని మౌర్ఖ్యము, ధృతరాష్ట్రుని పుత్ర వ్యామోహము, భీష్మాదులహితైషిత, విదుర సంజయుల నిష్కళంక ప్రభుభక్తి, కర్ణుని స్వామిప్రియత్వము మున్నగుభావములు వ్యక్తము చేయఁబడినవి. అనర్థబహుళమగు యుద్ధమును విడువనిపట్టుదలతో నవలంబించిన దుర్యోధన ప్రవర్తన మిందు జుగుప్సాకరము. కర్ణాదులుకాక తక్కిన తదీయులెల్లరు బహువిధములుగా నాతనిని, వంశమును గాపాడుటకుఁ జేయుప్రయత్నములందు ధర్మవీరము సంభావ్యము. ధృతరాష్ట్రుని యస్థిరచిత్తవృత్తి యందం దాశ్చర్యమును గలిగించుచుండును. విదుర సంజయుల మోమోటమిలేని హితోక్తులుగూడ విస్మయజనకములు. అట్లే కర్ణదుర్యోధనుల మౌర్ఖ్యముకూడ నబ్బురమే యనిపించును.

## ఉద్యోగపర్వము - తృతీయాశ్వాసము :-

కౌరవులను నిర్దాక్షిణ్యముగా వధించుటే కర్తవ్యమని బోధించుచుఁ గృష్ణుఁడు ధర్మజునితో నిట్లనెను :

**"మీతండ్రికి భీష్మునకుం జేతోముదమొదవ భక్తి సేయనతగునీ;**
**కాతలకు నేను జని విఖ్యాతంబుగ నీదువినయ మభివర్ణింతున్."** 5.3.38

కృష్ణుఁడిట్లనుటలో నీవినయాదులను బెద్దలు శంకింతురేమో యను నను మానముతో నీవు యుద్ధమునకు సిద్ధపడకున్నావు. నీమంచితనము లోకమునకుఁ జాటుటయే నీయభిమతము. దాని కనుకూలముగనే నేను బ్రయత్నింతును. కాని ముఖ్యమైనది యుద్ధము సుమా! దృష్టి దానిపైఁ గేంద్రీకరింపుమను నభిప్రాయమును, ధర్మజుని మెత్తగా మందలించు వైఖరియు నభివ్యక్తములగును.

ధర్మజాదులు సంధియే కార్యమనుచుండగా సహింపని ద్రౌపది శ్రీకృష్ణునితో నిట్లనుచున్నది :

**"అంతలుచేసి పోనడిచి యక్కట సంజయుచేతఁజెప్పి పు**
**త్తెంతురె; యిట్టియూఱటమదిం బ్రియమందె యుధిష్ఠిరుండు తా;**
**నంతన యూళులేవురకు నైదు సుయోధనుఁడిచ్చునొక్కొ; యీ**
**కంతకృపావిహీనమతి నాతఁడునొంచునె యన్నదమ్ములన్."** 5.3.101

ఇది ద్రౌపది ప్రారంభవచనము. ఇందలి మొదటి వాక్యమున అంతలు, అక్కట అనునవి వ్యంజకములై యామె హృదయమున రగుల్కొనుచున్న శోకకోపముల నభివ్యక్తము చేయుచున్నవి. అంతేకాదు, వాక్యవైఖరియే యిట విలక్షణముగా నున్నది. 'పుత్తెంతురె' అను క్రియ కిట కర్తృవాచకపదము లేదు. అట్లు లేకుండ వాక్యమును రచించుట యొకవిధమగు వ్యవహారము. వారు చెప్పకున్నను దెలియఁజాలినవారు,

అవాచ్యులు, నీచులు మున్నగు నర్థమిట వ్యంగ్యమగును. 'చెప్పి' అనుటయు విశేషార్థద్యోతకము, ఏమి చెప్పిరో చెప్పఁబడలేదు. అనఁగా నా చెప్పుట మనకెంత ద్రోహకరమైన విషయము, అది మన కపేక్షింపఁదగినదియా? దీనికొఱకా మనము పదుమూఁడు వత్సరములు పడరాని పాట్లుపడి నియమపాలనము చేసినది? ఇత్యాదిభావ మందభివ్యక్తమగును. ఇట్లీ ప్రథమ వాక్యమున ద్రౌపదికి ధృతరాష్ట్రులయందుఁ బెల్లురేఁగిన కోపాసహ్యములు ప్రతీయమానములైనవి. రెండవ వాక్యమున మదిం బ్రియమందె యుధిష్ఠిరుండనుటలో మనబంగారము మంచిదికానిచో కమసాలి ననవలసిన పనియేమి? యన్నట్లు ఈ మహానుభావుఁడు వారుచేసిన ద్రోహమునకు హృదయపూర్వకమైన ప్రియమును బొందెను. ఈతని యుధిష్ఠిరత యర్థవంత మెట్లగునను నధిక్షేపణ మభివ్యక్తమగును. 'అంతన యూళులేవురకు నైదు సుయోధనుఁడిచ్చునొక్కొ' అను వాక్యమున సుయోధనశబ్దమర్థాంతరసంక్రమితవాచ్యము, మొదటినుండియుఁబగ వహించి కుయుక్తులతో ప్రాణములు తీయుటకును వెఱవనివాఁడు, కపటద్యూతము కల్పించి నిలువనీడ లేకుండఁ జేసినవాఁడు, పట్టుదలతో నజ్ఞాతవాసభంగము కావించి శాశ్వతముగా నిడుమలఁబడఁద్రోయనెంచినవాఁడు, తలఁచుటకు వీలులేని వస్త్రాపహరణాది నీచకృత్యము లాచరించి నంతసించిన తుచ్ఛుఁడు సుయోధనుఁ డీయన యూఱటవహించినంత మాత్రమున జాలిదలఁచి యైదూళ్లైనను నిచ్చుననుకొనుట యెంతభ్రాంతి యనునర్థమిట వ్యంగ్యము. తుదివాక్యము నిండైన యధిక్షేపణమును వ్యంజించును. అవును పాపము మీరన్నచో నాతనికెంతకృప! ఏమైనను అన్నదమ్ములుగదా! అతఁడు మిమ్ములను నొంచునా? అతని కృపావిశేషము నింతవఱకు మన మనుభవించుచునే యున్నాముగదా! అను వెక్కిరింత యిందభివ్యక్తమగును. ఇట్లు దుర్దాంతమగు ద్రౌపద్యమర్ష మీ పద్యమున నభివ్యక్తము చేయఁబడినది.

తాను జెప్పవలసినవిషయములు చెప్పి -

"ద్రోవది బంధురమ్మయినక్రొమ్ముడిగ్రమ్మునవిడ్చి వెంద్రుకల్
దా పలచేతఁబూని యసితచ్ఛవిఁబొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగు విషాదరోషముల్
కావఁగలేక బాష్పములుగ్రమ్మఁగ దిగ్గునలేచి యార్తయై." 5.3.114

ఇందు ద్రౌపద్యాలంబకములగు శోకక్రోధములు చక్కగాఁ బుష్టములై కరుణరసనమాస్వాదనము గావించుచున్నది. క్రొమ్ముడిగ్రమ్మన విడ్చుట, వెంద్రుకలువలచేతఁ బూనుట, బాష్పములుగ్రమ్ముట మున్నగు ననుభావము లిందుఁ

జెప్పఁబడినవి. నిర్వేదము, ఆర్తి, దైన్యము, ఆవేగము, ఉగ్రత్వము మున్నగు వ్యభిచారి భావము లిందుఁ దోఁచును. అసితచ్ఛవిఁబొల్చుమహాభుజంగమో - యనునట్లు వెంద్రుకలు వ్రేలుటయుఁ దత్కాలకోపాతిశయమును, అవకాశమున్నచో తన కపకృతిఁగావించినవారిని గాటువేసి కసిమసంగవలయునన్నంత తీవ్రక్రోధమామెయందు సముద్భూతమాయె ననునంశము నభివ్యక్తము చేయును. దిగ్గన లేచుటయు లోనున్నకోపతీవ్రతను వ్యంజించును.

శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రభవనమున కరుగునపు డంగనాజన మిట్లు భావించిరి :

"ప్రాణంబుతోఁగూడ రక్కసిచన్నుల పాలుద్రావిన ప్రౌఢబాలుఁడితఁడె,
వ్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మె చ్చించిన యాజగజెట్టి యితఁడె,
దుర్వృత్తుఁడగుకంసుఁ దునిమి యాతనితండ్రిఁ బట్టంబుఁగట్టిన ప్రభు వితండె;
సత్యభామకుఁ బారిజాతంబుపైఁగల కోర్కిదీర్చిన రసికుం డితండె;
వెన్నలును గోపికాచిత్రవృత్తములును నరసి మ్రుచ్చిలనేర్చిన హరియితండె;
శ్రుతిశిరోభాగములఁ దన సుభగచరణ సరసిజామోదమునుగూర్చుచతురుఁడితఁడె"

5.3.175

ఇందు మొదటిమూడుపాదములును శ్రీకృష్ణునియవతార ప్రయోజనమును వ్యక్తము చేయుచున్నవి. దుష్టశిక్షణముగావించి ధర్మసంస్థాపనముగావించుటయే యవతారప్రయోజనము. మఱియు రక్కసిచన్నులపాలతోపాటు ప్రాణములను గొనుట, చాణూరు విఱిచి జగములమెచ్చించుట యనునంశములందు సమగ్రమైన వీర్యమును, యశస్సును గమ్యమానములగుచున్నవి. కంసునిఁ దునిమి యాతని తండ్రినిఁ బట్టంబుఁ గట్టె ననుటచే నాతని శిష్టసంరక్షణసామర్థ్య మభివ్యక్తమగుచున్నది. సత్యకుఁ బారిజాతముపైఁగల కోర్కిఁ దీర్చినరసికుఁ డనుటచే భువియందే కాక దివియందు నాతని కెదురులేదను నర్థమును, రసికతవలన సమగ్రమైన సంపద్విశేషము నభివ్యక్తములగును. వెన్నలును గోపికాచిత్రవృత్తములును మ్రుచ్చిలనేర్చిన హరి యనుటచే నాతని భక్తసులభతయు సర్వేశ్వరత్వము నభివ్యక్తములగును.' శ్రుతిశిరోభాగముల' నిత్యాదికముచే నాతని జ్ఞానవిజ్ఞానము లభివ్యక్తములగును. ఇట్లీపద్యమున -

"ఐశ్వర్యస్య సమగ్రస్య - వీర్యస్య - యశస - శ్రియః
జ్ఞానవిజ్ఞానయో శ్చాపి - షణ్ణాం భగ ఇతీరణా."

అను శ్లోకమునఁ జెప్పఁబడినలక్షణములన్నియుఁ జెప్పఁబడి శ్రీకృష్ణుని పరమాత్మత్వము ప్రతీయమానము చేయఁబడినది. వాచ్యమగు నుల్లేఖాలంకారముచే జనమునకుఁగల భగవద్రతి యభివ్యక్తమగుచున్నది.

కుంతీదేవి శ్రీకృష్ణునిఁ బాండవులకుశలముల నిట్లడిగెను :

"దానదయాపరుండయిన ధర్మతనూభవుసేమమెట్లు; పం
చాననవిక్రముండగుబకారికి భద్రమె; యస్త్రశస్త్రవి
ద్యానిపుణుండు క్రీడి సుఖితయా; వినయాభరణుల్ కవల్ సమా
ధానసమేతులే; యకట ద్రౌపది సాధ్వి; సుఖంబె దానికిన్." 5.3.166

ఇం దాయావిశేషణములు సాభిప్రాయములు. దానదయాపరుఁడు ధర్మజుఁ డనుటచే నిప్పుడు సమస్తము కోల్పోయి దానమునకు దయాదానమునకు నవకాశములేక యెంతగా దుఃఖపడుచున్నాఁడో కదా! అనునభిప్రాయము వ్యంగ్యము. పంచాననవిక్రముఁ డగుబకారికి ననుటచే పరాక్రమైకజీవియై బకాదిదుష్టరాక్షసుల హతమార్చిన వాయునందనుఁ డిపుడు నిష్క్రియుఁడై యెట్లుండెను? అనునర్థము వ్యంగ్యమగును. 'అస్త్రశస్త్రవిద్యానిపుణుఁడు క్రీడి సుఖియా?' అనుటవలన హరునోర్చి హరిని మెప్పించి పాశుపతాది దివ్యాస్త్రములఁ బడసిన, దివ్య కిరీటముగల యర్జునుని కెంతటి దుర్గతిపట్టిన దనుభావము వ్యంగ్యము. వినయాభరణుల్ కవలనుటచే వరమనుకుమార మూర్తులు, వినయమేకాని, యౌద్ధత్యమెఱుఁగని సాధుశీలురు నైన చిఱుఁతవారు నిష్కారణముగాఁ బడరానిపాట్లు పడవలసివచ్చెనుగదా! అను భావము వ్యంగ్యము 'అకట ద్రౌపది సాధ్వి' అనుటలో మహారాజుబిడ్డ సద్గుణవతి, ఉత్తమస్వభావ అయిన కోడలి కెంత కష్టములు వాటిల్లిన వనునర్థము వ్యంగ్యమగును. ఇట్టీయర్థవిశేషములన్నియు కుంతి శోకము నభివ్యంజించుచున్నవి.

కృష్ణుఁడు వచ్చి తన్నూఱడించుచుండఁగాఁ గుంతి యతనితోఁ దనయులకుఁ జెప్పవలసినమాటలుగాఁ గొన్నిచెప్పుచు నిట్లాడెను :

"భుజబలమున జీవించుట నిజధర్మము; మెత్తఁబడుట నింద్యము; మాద్రీ
ప్రజలకుఁ జెప్పుము; ద్రుపదాత్మజఁ గార్యంబడుగు మనుము తగ నందఱతోన్."
5.3.200

ఇందుఁదుదివాక్యము విశేషార్థద్యోతకము. 'మీకేదికార్యమో యేదకార్యమో యెట్లును నిర్ణయించుశక్తిలేదు. మేము పురుషులము, స్వయంనిర్ణయశక్తి కలవారమను నహంకారమును వదలి యేమిచేసిన మేలుగలుగునో యది ద్రౌపది నడిగి తెలిసికొనుఁడు. ఆమెకుఁగల వివేకము మీకు లేకపోయెనుగదా!' అనునభిప్రాయమును, గుంతికి ద్రౌపదియెడఁగల యుదాత్తభావమును నిందభివ్యక్తములగును.

శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రునితో సంభాషించుట కిట్లారంభించెను :

"జననాథ! నీయెఱుంగని పనులుగలవె యైనఁ దగవుఁ బరమహితంబున్
దనవారికిఁ జెప్పన తగు నని వచ్చితి భారతాన్వయము ప్రియమొందన్."

తిక్కనార్యుని దివ్యవాణి

5.3.257

జనులందఱకుఁ బ్రభువవై యాదర్శప్రాయముగా ఉండవలసిన ఓమహారాజా! నీవట్లున్నావేమో నీ మననును బరీక్షించుకొను మనునెచ్చరిక 'జననాథ!' అను సంబోధనమునం దభివ్యక్తమగును. 'నీయెఱుంగనివనులుగలవె' అనుట యువచారవాక్యము. నీయంతట నీవెఱిఁగినచో నేనింత కష్టపడి రావలసిన పనియేముండును? నిజమున కన్నియు నెఱిఁగి యందఱకు హితముగాఁ బ్రవర్తింప వలయునన్న జ్ఞానము నీకు లేకపోఁబట్టి నారాక యవసరమయ్యె ననునర్థము ఇందు వ్యంగ్యము. 'పరమహితముఁ దనవారికిఁ జెప్పన తగు' ననుటచే నేను నీకెవ్వరుఁ గూర్పఁ జాలని పరమ హితముఁ గూర్చుటకే వచ్చితిని గాని యపకారము చేయననియు, నీవాఁ డననియు విశ్వసించి నాపలుకు లాలింపు మనునర్థము వ్యంగ్యము. 'భారతాన్వయము ప్రియమొందన్' అనువాక్య భాగమువలన నిది మాకుటుంబవ్యవహారము నీకిందు జోక్యమేల? యనకుము. ఈ నా ప్రయత్నమువలనఁ గలుగు మహాప్రయోజనము మీవంశమున కంతటికిని సంబంధించినది. కావుననే యత్నించుచున్నాను. కావుననే యిది స్వార్థముతోఁ బక్షపాతముతోఁ జేయుప్రయత్నమని శంకింపకు' మనునర్థము వ్యంగ్యమగును. మఱియు నా యత్నము నీకును నీకుమారులకును బ్రియము గాకున్నను దక్కిన నీయన్వయమంతటికినిఁ బ్రియము సంధానించు ననునర్థము కూడ నిట సంభావ్యము. నీయన్వయ మనక భారతాన్వయ మనుటలో నీవు నీపూర్వుల గొప్పఁ దనమును స్మరించియైన నీచబుద్ధిని విడనాడవలయు ననునర్థము ప్రతీయమానమగును.

కృష్ణుఁ డాసందర్భమునందే మఱియు నిట్లనెను :

"ఎఱుఁగవె యజాతశత్రుని నెఱియును ధర్మంబు సత్యనిష్ఠయు? మిము నె త్తైఱఁగున ననువర్తించెనొ యెఱుఁగవె? తగు చేవ గలుగు టెఱుఁగవె యధిపా?"

5.3.278

ఇం దజాతశత్రు వనువిశేషణము సాభిప్రాయము. నీవును, నీ వారును నిష్కారణముగా నాతనియందు శత్రుత్వము వహించిరి కాని యాతనికి మాత్రము నీయందు శత్రుత్వము లేదు. కావుననే యాతఁడు మీరు పెట్టిన కష్టముల నన్నింటిని సహించి తన మంచితనమును, ధర్మమును, సత్యనిష్ఠను గాపాడుకొనుచు మీహితమునే యభివాంఛించి సంధికై యత్నించుచున్నాఁడను నర్థము వ్యంగ్యము. మిము నెత్తెఱఁగున ననువర్తించెనొ యని తగుచేవగలుగు టెఱుఁగవె యనుటలో మిమ్మనువర్తించుట పెద్దవారనుగౌరవము చేతను, సహజమైన సౌజన్యముచేతను మాత్రమేకాని యశక్తత వలనఁగా దను విషయము నీవెఱుఁగవా? యనునర్థము వ్యంగ్యము. ఎఱుఁగవె అను ప్రశ్నార్థకక్రియ పలుమాఱు లావృత్తమై నీకు తెలియకేమి? తెలిసితెలిసి వినాశమును గోరితెచ్చుకొనుచున్నా వనునర్థము వ్యంగ్యము.

ఈయాశ్వాసమున ధర్మజాదులు, ధృతరాష్ట్రుకడకు దూతగానేఁగు కృష్ణునితోఁ దమ తమ యభిప్రాయములను జెప్పుట, అతఁడు హస్తిన కరుగుదెంచి కౌరవులను సంధికై యొడంబఱుపయత్నించుట, అతని మాటలకుఁ గనలి దుర్యోధనాదులు బంధింపదొరకొనుట, కృష్ణుఁడు తన మహిమఁ బ్రదర్శించి వారికిఁ దానెవరో తెలియఁ జెప్పుట యనునంశములు గలవు. అభిప్రాయనివేదన ఘట్టమున పాండవుల ధర్మాభిరతియుఁ గారుణికత్వము నభివ్యక్తములగును. శ్రీకృష్ణుని దౌత్యము అత్యద్భుతవాగ్విన్యాసనిధానమై ప్రాయికముగా నద్భుతరసమును, ధర్మవీరమును బ్రతీయమానమొనర్చును. దుర్యోధనుని ప్రవర్తనము జుగుప్సావహము. గాలవోపాఖ్యాన మద్భుతరసావహము. మొదటినుండి తుదివఱకు నిందుఁ బ్రధానముగా గోచరించు లీలామానుషవిగ్రహుఁడు శ్రీకృష్ణుఁడు చేయవలసిన దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మ ప్రతిష్ఠాపన యనునవి సర్వత్ర ప్రతీయమానములగుచు ధర్మవీరము నాస్వాదింపఁ జేయును. అద్భుతాది రసములు దాని కంగములు. భూభారనిరసనము తన కర్తవ్యమే యైనను సాధ్యమైనంతవఱకుఁ బ్రజాసంక్షయముకాకుండఁ జూడవలయు ననెడి శ్రీకృష్ణుని యభిప్రాయ మిందుఁ జక్కగా గోచరించును.

## ఉద్యోగపర్వము - చతుర్థాశ్వాసము :-

కృష్ణుఁడు దౌత్యమును ముగించుకొని వెడలునప్పు డాంబికేయుఁ డిట్లనెను :

"వీరునుఁ బాండుపుత్త్రులును వేరముదక్కి పొసంగి మన్కికై
పోరితమాడి యేనటులు బుద్ధులు చెప్పినభంగియుం గులా
చారము నిర్వహింపఁ బలుచందములుం దగ దుఃఖపాటు నీ
కౌరవజాతికిం దెలిసెఁగాదె గదాధర! నీదు సన్నిధిన్." 5.4.3

"నీకు శుద్ధుండ నగుటయు నిఖిలబంధు మిత్రగురుజనకోటికి ధాత్రికెల్ల
నంబుజాక్ష! నిర్దోషుండ నగుట గాన నాతెఱుంగు నీ వెఱుఁగుట నాకుఁ జాలు."
5.4.5

ధృతరాష్ట్రుని యీయభిప్రాయమంతయు విషకలుషితము. ఇచ్చకమునకై పుత్రునిఁ గొంతవఱ కాతఁడు మందలింపకపోలేదు. అందును బాండవులకు రాజ్యమిచ్చు సంకల్పముకంటె వారివలన భయపడియే సంధిచేయుమని కుమారునితో నెక్కువగాఁ జెప్పెననుటకుఁ జాలప్రమాణములు గలవు. అట్టియెడ 'పొసంగి మన్కికై పోరితమాడి -బుద్ధులు చెప్పినభంగి, దుఃఖపాటు' మున్నగుపదములును నీవెఱిఁగిన లోకమంతయు నెఱిఁగినట్లే యను భావనమును ధృతరాష్ట్రుని కాపట్యము నభివ్యక్తము చేయును. ఎదుటివ్యక్తిని మోమోటపఱచి తనయభిప్రాయము నాతనిచే నంగీకరింపఁజేయు వంచకప్రవృత్తి యిందభివ్యక్తమగును. నిజమునకు ధృతరాష్ట్రుఁడే పాలుపంచి యిచ్చుటకుఁ జిత్తశుద్ధితో సంకల్పించినచో దుర్యోధనుని యంగీకారముతోఁ బనియేలేదను

నంశమును గాంధారి విస్పష్టముగా సభలో నందఱువినుచుండఁగాఁ జెప్పెను.

"అనుడు నీపుత్రుఁడవినీతుఁడగుట యెఱిఁగి యెఱిఁగి వానివశంబున నేలపోయె;
దీవు పాండవులకు నేమి యిచ్చితేని నడ్డపడ నెవ్వరికి వచ్చునధిపచెపుమ."
5.3.386

నీవు మహారాజవైయుండి చేయుపనికెవ్వరడ్డు రాఁగలరని యామె యనఁగా నేనేదో దుఃఖపడి చేసిన ప్రయత్నమంతయు వ్యర్థమైనదని యిట్లు వాపోయి నా దోషమేమియు లేదని నీవంగీకరించితివికదా! యని ధృతరాష్ట్రుఁడనుట యెంత సత్యదూరమో తెలియుచునేయున్నది. కావుననే శ్రీకృష్ణుఁడు దీనికి సమాధానముగా 'బాహ్లికభీష్మద్రోణకృప ప్రముఖ నిశిలవిశిష్టజనంబుల నాలోకించి' వారితో నిట్లు పలికెను:

"ఇప్పుడీ డీసభఁ బుట్టిన యింతవట్టు మీకుఁ దెల్లంబుగాదె; యీమేదినీ వి
భుండు - తానేమిటికిని ముఖ్యుండఁగాను తప్పు తనదెసలేదని చెప్పి విడిచె."
5.4.7

"కావున నాకు నియ్యోడం దడయంబనిలేదు........" 5.4.8

కృష్ణుఁడు ధృతరాష్ట్రుని వాక్యములకు సూటిగా నతనికిఁ బ్రతివచనమీక భీష్మాదులతో మాటాడుటవలననే యాతని యభిప్రాయము వ్యక్తమగుచున్నది. దోషమంతయుఁదనదియే కాఁగా నేను నిర్దోషుఁడనని పలుకు నీతనితో నేనేమి చెప్పిన నేమి ప్రయోజనము? అతని చిత్తవృత్తి యెట్టిదో సభలో సుస్పష్టముగా బహిర్గతము కాఁ గాఁ జూచిన మీరెల్లరు నుండఁగాఁ గార్యార్థినై వచ్చిన నాతో నీతఁడిట్లు మాట్లాడుట న్యాయమేమో మీరలే విచారింపుఁడు. మేదినీవిభుఁడై సర్వాధికారములుగల యాతఁడు నేను ముఖ్యుఁడఁగానన్నచో నీతనివేదినీవిభుత్వమేటికి? తప్పు తనదెనలేదని చెప్పివిడిచినంత మాత్రమున లేకపోవునా? ఈతని కుత్సిత ప్రవృత్తి నేనెఱుఁగనా? మీరెఱుఁగరా? కావున నిట నింకను నిలుచుటకు గొంచెమేని అవకాశము లేదు. అనునభిప్రాయమిట వ్యంగ్యమగును.

శ్రీకృష్ణుఁడు కర్ణునికి జన్మరహస్యము నెఱిఁగించుచు నిట్లు పలికెను :

"నీవు వృద్ధజనోపసేవివి; ధర్మసం వేదివి; తెలియంగ వినుము; సిద్ధ
మంత్రబలంబున మార్తాండు వరమునఁ గన్నియతఱి గొంతి కన్నవాఁడ
వగుటఁ బాండునృపాలు నగ్రసుతుండవు; ధర్మమార్గంబిడి ధర్మతనయుఁ
డాదిగాఁగల తమ్ములందఱు నాచేత నెఱిఁగి నీయడుగుల కెఱఁగి సకల
పుత్రమిత్రబంధు భూరిసేనాసమ న్వితముగాఁగఁగొలిచి నిన్ను రాజ్య
భార సహనమునకుఁ బట్టంబుగట్టి నుజ్జ్వలుఁడ వగుదు - రమ్ము వారి కడకు."
5.4.29

ఇంఁటు 'వృద్ధజనోపసేవివి ధర్మసంవేదివి' అను పదములు నా చెప్పు నంశము

ధర్మసమ్మతమైనదని గుర్తించుటకుఁ దగిన శక్తిసామర్థ్యములు గలవాఁడవు కావున కోపింపక ద్వేషింపక నా చెప్పుమాటల బాగుగా విచారించి నిర్ణయమునకు రమ్మను నర్థమును వ్యంజించును. 'మంత్రబలమున మార్తాండువరమునన్' అను పదములవలన నీపుట్టుక ధర్మబాహ్యమైనది. లోకనింద్యమైనది యని నీవు విచారింపఁబనిలేదు, మంత్రబలమువలనను, లోకైక దీపకుఁడైన సూర్యనారాయణుని యనుగ్రహము వలనను జన్మించిన నీవు దూష్యుఁడవుకావని విశ్వసింపుమనునర్థము వ్యంగ్యమగును. నా జన్మము దూష్యము కాకున్నను నేను గన్యయగు కుంతికిఁ బాండురాజుతో సంబంధము లేని యపుడు పుట్టినవాఁడనుగదా పాండవుఁడ నెట్లగుదుననియు శంకింపఁ బనిలేదు. ఏలయన ధర్మమార్గమును బట్టి నీవు క్షేత్రజుఁడవు కనుక పాండురాజు నగ్రసుతుఁడవే యగుదు వనునర్థము ధర్మమార్గంబిది యను దానిచే నభివ్యక్తమగును. 'నాచేతనెఱిఁగి' యనుటచే నన్నుఁ బాండవులు మన్నింపవలదా? యని నంకోచింపకుము. వారి హితమునే కోరుదునని నాయందు సంపూర్ణమైన విశ్వాసముగల వారు తప్పక మన్నింతురను నర్థము గమ్యమానమగును. 'నీయడుగులకెఱఁగి' యనుటచే నూరక మన్నించుటే కాదు పరమభక్తిపరులై నిన్ను దైవ సమానముగా నారాధింతు రనునర్థము వ్యంగ్యమగును. వారట్లు విశ్వసించినను వారి వారు నన్నాదరింతురా? యనఁబనిలేదు. అందఱు నిన్నుఁ గొలుతురను నర్థము తరువాతి వాక్యమువలనఁ బ్రతీయమానమగును. ఉజ్జ్వలుఁడవగుదు వనుటలో నీ వీదుష్టుఁడగు దుర్యోధనుని సేవించుదానికంటెఁ నధికముగాఁ బ్రకాశింతువనునర్థము తోఁచును. ఇట్లు కృష్ణుఁడు కర్ణావర్జనమునకుఁ జేయుమహాప్రయత్నమంతయు నిందభివ్యక్తమగును.

కృష్ణుఁడాడిన మాటల కంగీకరింపని కర్ణునితో నాతఁడిట్లు వచించెను :

**"దయానాయాడిన మాట గైకొనవు, సంతాపంబుఁ దెచ్చుంజుమీ**
**స్మయమెట్లుందుది; నీకు నర్జునునితో మాత్సర్యమైనం బరా**
**జయమొండెన్ మృతియొండెఁగాక గెలువన్‌శక్యంబె? పెక్కండ్రకిం**
**తియకాలంబగునట్టె! నీ మనము శాంతింబొందఁగా నేర్చునే"** 5.4.47

ఈపద్యమునందలి మొదటివాక్యముచేత నేనాడినమాటయెల్ల నిన్ను సంరక్షించు తాత్పర్యముతోనే గాని పాండవులు నీకు వెఱతురను తాత్పర్యముతోఁ గాదను నర్థము వ్యంగ్యము. 'నా' అనుపదము హితోపదేష్టను, నీమేలుగోరిన వాఁడనగు నామాట అనునర్థ మున సంక్రమితవాచ్యమగును. నేను రాధాతిరథుల నెట్లు వీడుదును, దుర్యోధనుఁడు నన్ను నమ్ముకొనియుండె నెట్లు వంచింతును? లోకము నన్నుఁ జులుకనచేయదా? మున్నగు నీయభిప్రాయములన్నియుఁ గేవలము నీగర్వమునే తెలుపును గాని వివేకమును వ్యక్తపఱపవనునర్థము 'సంతాపంబుఁదెచ్చుంజుమీ స్మయమెట్లున్' అనువాక్యముచేఁ

బ్రతీయమానమగును. 'పెక్కండ్ర కింతియకాలంబగునట్టె' అనుటలో రాఁబోవు మహా యుద్ధమున అసంఖ్యాకములగుజనులు నశింపకుండఁ జేయవలయునను నాయుద్దేశము భగ్నమైనదికదా? నీవు పాండవులఁజేరినచో నిన్నే నమ్మి యుద్ధమునకు దిగు సుయోధనుఁడు యుద్ధమునకు విముఖుఁడు కావచ్చును. అపుడు పాండవ కౌరవులకు సఖ్య మేర్పడు నవకాశముండును. జననష్టము జరుగదని నేను యత్నించుచుండఁగా నామాటవినక పెక్కండ్ర వినాశమునకు హేతుభూతుఁడవగుచున్నాడవను కోపనిర్వేదము లభివ్యక్తములగును. మఱియు రాఁబోవు యుద్ధము మహాపత్కరమని యెఱింగియు మూర్ఖత్వమును వహించి యనుజుల సాధింపనెంచిన నీహృదయమునకు శాంతి యెప్పటికైన లభించునా? యనునర్థము తుదివాక్యమునఁ బ్రతీయమానమగును. ఇట్లిందుఁ గృష్ణుని కోపనిర్వేదజనసంరక్షణతాత్పర్యము లభివ్యక్తములగును.

అయావ్యక్తులను సేనాధిపతులనుగా నియోగించి వారినెల్ల ధనంజయునకుం జూపి ధర్మరా జిట్లు పలికెను :

"ఎప్పుడు నెయ్యోడం బొదివి యిందఱకున్దగ నీవు కంటికిన్
ఱెప్పయుఁబోలె మాటలు నెఱింబనులారసె యుజ్జచాడ్పునం
జెప్పుచు వీరిబుద్ధిఁగొని చేయుము కార్యము; నీకు రక్ష తా
నిప్పరమేశ్వరుండు కలఁ: డిచ్చుశుభం; బనిచూపెఁ గృష్ణునన్." 5.4.114

"ఇట్లు గాంభీర్యమాధుర్యధుర్యుండైన యుధిష్ఠిరుండు వరిష్ఠ ప్రభువుల చిత్తంబు లారాధించి" 5.4.115

ఈ పద్యార్థముచే సేనాధిపత్యము పేరున కెవ్వరు వహించినను ప్రధానముగా భారమంతయు వహింపవలసినవాఁడవు నీవు. ఏ చిన్న యాపద యేరికెపుడెట్లు ఘటిల్లినను ఱెప్పవిధమున నీవట బ్రాలి సంరక్షింపవలయును. ఎవరేని కార్యమేదియో తెలియనిస్థితిలో నున్నచో వారికి నముచితమగు నుపదేశమును నీవే యీవలయునను నర్థమిట వాచ్యరూపమున నెలకొని తక్కిన సేనాపతులగు రాజులందఱకు వ్యంగ్యముగా మీరీతఁడు చెప్పిన చొప్పున నడచుకొనవలయునుసుమా! అనునుపదేశము నొసంగును. ఇది వ్యంగ్యమగుట యెంతయు నముచితము. వాచ్యమైనచోఁ గొందఱభిమానము దెబ్బతినెనని భావించుట కవకాశము గలదు. అట్లే ఇప్పరమేశ్వరుండు గలఁడనుటయు శ్రీకృష్ణుని సర్వకార్యనిర్వహణమునకు బాధ్యత నీవే వహింపుము మహాదేవా! అని ప్రార్థించుటలోఁ బరిణమించును. పరమేశ్వరుఁడనుటయు సాభిప్రాయము. అతని యుపదేశమును గుణదోషవిచారణము చేయక యాదరించుట మనకర్తవ్యమట్లైనచో శుభము గల్గునను నర్థము వ్యంగ్యము. ఇట్లీయర్థము సంభావితము కావలయునను కవితాత్పర్యము గాంభీర్యమాధుర్యధుర్యుఁడను యుధిష్ఠిర విశేషణముచే వ్యక్తమగుచున్నది.

ఈయాశ్వాసమున 272 వ పద్యమువఱకు కృష్ణుఁడు రాయబారము ముగించుకొని కర్ణావర్జనమునకు యత్నించి పాండవుల కడ కరుగుటయుఁ, గుంతి కర్ణుని రహస్యముగాఁ జేరి జన్మవృత్తాంత మెఱింగించుటయు, నుభయ పక్షములందును సేనాధిపత్య నిర్ణయము, భీష్ముఁ డుభయపక్షములందు నతిరథాదినిరూపణము గావించుట యను వృత్తాంతములు చెప్పఁబడినవి. కర్ణునితోఁ గృష్ణుఁడును గుంతియును బాండవులఁ జేరుమని యుపదేశించుట వారి జనసంరక్షణ తాత్పర్యమును వాత్సల్యమును నభివ్యక్తము చేయుచు ధర్మాభిరతిని ప్రతీయమానమొనర్చును. కర్ణుఁడు దాని కంగీకరింపకపోవుటలో నాతని ధైర్యగరిమయుఁ, గృతజ్ఞతయు, స్వామిభక్తియు నభివ్యక్తములగుచున్నవి. అతిరథాదినిరూపణమున కర్ణభీష్ముల వాక్కులలో శోకక్రోధములు ప్రతీయమానము లగుచున్నవి. ఆశ్వాసమున మిగిలిన భాగమంతయు సంబోపాఖ్యానముతోఁ గూడియున్నది.

అంబను దనతమ్మునికిచ్చి వివాహము చేయఁజాలనని పలికిన భీష్మునితోఁ బరశురాముఁ డిట్లనెను.

"గురుఁడని నన్నెఱుంగు; దనఘుండవు; నావచనంబునం దనా
దరణముచేసి; తెన్నియొవిధంబులఁ బల్కెదు భక్తితోడ, నీ
వెరవులతక్కు మీయబల వేగమ పెండిలిచేయు, మంతతో
మరలు మదీయ కోపశిఖి; మానదు వేఱొకచేయుఁ జేసినన్." 5.4.307

ఇందు గురుఁడని నన్నెఱుంగుదనుటలో నిజముగా నెఱిఁగినచో గౌరవ మున్నచో నేను చెప్పినది చేయక ధిక్కరించుచు నిట్లాడుదువా? ఇదియంతయు నిచ్చకముసుమా! అనుభావ మభివ్యక్తమగును. అనఘుండ వనుట వెక్కిరింత. గురుధిక్కారము చేసినవాఁ డెంతటి పాపాత్ముఁడో యూహింపుమను నర్థమిందు గోచరించును. 'నావచనంబునందు' అనుపదమునందలి 'నా' యనునది యర్థాంతరసంక్రమిత వాచ్యము. ఏనేను నీకు ధనుర్విద్యాప్రాభవము గడించిపెట్టి యింతటివాని నొనరించితినో, యేనాయందు భక్తిభావముండవలయునో యట్టి నావచనమునందే యనాదరణము చూపితివను నర్థమిట వ్యంగ్యము. ఎన్నియొవిధంబులఁ బల్కెదు భక్తితోడ ననుట లేనిపోని టక్కరిభక్తి నటించి యిచ్చకములాడిన నేమి ప్రయోజనము. నాయుపదేశమును మన్నించిననే నాకుఁ బ్రీతిఘటిల్లు నను నర్థము వ్యంగ్యము. 'ఈయబల' ననుటలో పాపము దిక్కులేనిది బలహీనురాలు, వివాహము లేనిచో నేమగునో యూహింపుమను ననునయము కొంత అభివ్యక్తమగును.

అంబోపాఖ్యానము ధర్మయుద్ధవీరాద్భుత రసనమంచితము. అంబ వృత్తాంతము అందందుఁ గరుణమును గూడఁబుట్టించును. ధర్మసంరక్షణతత్పరుఁడై

దేవవ్రతుఁడు గురుదేవునితోఁ బోరాడుట, కన్యాసంరక్షణతత్పరుఁడై గురుఁడు శిష్యునిఁ
గ్రూరముగాఁ బోరుట యనునంశములందు ధర్మవీరయుద్ధవీరము లభివ్యక్తము
ఈకథయంతయు భీష్మునిమహోదాత్తత నభివ్యక్తముచేయుటలోఁ బ్రయోజనవంతమగు
అంబ తపమాచరించుట, శిఖండియగుట, స్త్రీత్వపురుషత్వముల వినిమయము మున్న
వృత్తాంతమంతయు నద్భుతావహము.

## భీష్మపర్వము - ప్రథమాశ్వాసము :-

భీష్మమరణమును విని పలవించుచు ధృతరాష్ట్రుఁడిట్లు పలికెను.

"అశౌర్యం బాసత్త్వం భాశీలం బాపరాక్రమాభీలత్వం
భాశుద్ధవ్రతమెందు న నాశములని భీష్ముఁబెద్ద నమ్మితిమిగదే." 6.1.

ఇందలి ప్రక్రాంతపరామర్శకము కాని తచ్ఛబ్దప్రయోగబాహుళ్యము భీష్ము
శౌర్యసత్యశీలాదికము ననిర్వచనీయతను వ్యక్తము చేయుచు ధృతరాష్ట్రాలంబకమ
శోకమును కరుణముగా ననంలక్ష్య క్రమమునఁ బ్రతీయమాన మొనర్చుచున్న
ఆశౌర్యమనఁగా నేది యిరువది యొక్క మారులు క్షత్రియసంహారము గావిం
పరశురాముని జయించుట యందభివ్యక్తమై కీర్తనీయమైనదో, యేది కాశిరాజదుహితల
దెచ్చునపుడు అసహాయముగా రాజలోకమునంతటిని నిర్జించుటకు వినియుక్తమైన
యట్టిది నేఁడు శిఖండివిజృంభమున కగ్గమై వినాశముఁ బొందెనా? యను నీమొదల
భావము లిట ధృతరాష్ట్రుని శోకమును రసీభవింపఁజేయును.

మఱియు ధృతరాష్ట్రుఁడు సంజయునితో నిట్లనెను :

"అతఁడు నొచ్చిన తఱి నడ్డంబు సొచ్చెద మని వచ్చువారు లేరైరె యచ
నడరిపోరాడక యన్ని యక్షౌహిణు లొప్పరికించెనె యొకనిఁ గలన;
నతని నోర్వఁగఁ జాలవని నిశ్చయించితి మంతకు నోపెనే యరిబలము
ద్రోణుండుఁ గృపుఁడును ద్రోణసుతుండును శల్యుండు గ్రేడించి చనిరె యపుడ
పాండుసుతులు శిఖండియుఁ జండశక్తి మెఱయ నొక్కటఁ బైఁబడ్డ వెఱచి తా
విడిచి నాపుత్రులందఱు విఱిగి యడవిఁ గలసిరొకొ; యాతనికిఁబడవలసె నకట
8.1.58

ఇందలి ప్రథమాపాదార్థము పాపము వయోజ్ఞానవృద్ధుఁడు సకలసేనాసంరక్ష
తత్పరుఁడై యుద్ధము చేసిచేసి యలసి సొలయఁగా నతనిచే సంరక్షింపఁబడు వ
డొక్కఁడు నడ్డము రాకుండు టెంతశోచనీయ మను రూపమున ధృతరాష్ట్రుని నిర్వేదవ
నభివ్యక్తము చేయును. ద్వితీయపాదార్థముచే నొకరిద్దఱైనచో సమాధానపడవచ్చున
పదునొకం డక్షౌహిణులసేనయుఁ బ్రధానవ్యక్తినే యొప్పరికించి ఆహా! ఘనవిజయము

గొందురు గావలయు ననుదుఃఖసమ్మిశ్రితాధిక్షేపణ మభివ్యక్తమగును. తృతీయపాదార్థముచే శత్రుబలములయెడఁ బొడమిన యీర్ష్యాద్వేషము లభివ్యక్తమగును. చతుర్థ పాదార్థముచే ద్రోణాదులయెడ నుదయించిన యేవగింపు ప్రస్ఫుటమగును. గీతప్రథమ ద్వితీయపాదార్థములచే నందఱు నొక్కుమ్మడి విజృంభించి యెవనిఁజూచినచో భీష్ముఁడు యుద్ధవిముఖుఁడగునో వాని ముందిడుకొని క్రూరముగా హింసించిరి కావలయు, లేనిచో నాతఁడు పడునా? యను శంకాదు లభివ్యక్తములగును. 'తాతవిడిచి' యనుటలో నెవ్వఁడోకాదు, తాత, తమహితము కోరి ముసలితనమున యుద్ధమున విజృంభించిన మహితాత్ముఁడు. స్వార్థమించుకయు లేని యుదాత్తచరితుఁడు - అట్టివానిని శత్రువులకు వధింపనప్పగించి చనుట యెంతనీచము! వీరిపరాక్రమము గాల్పనా? యను నర్థము వ్యంగ్యమగును. 'నాపుత్రులందఱున్' అనుటలో వందమందిలోఁ గొందఱైనను పితామహునిఁగూడి యుండఁజాలకుండిరా? ఏ యొక్కనికైన నిట్లు విడిచి చనుట హేయమనుభావము కలుగలేదా? అనురూపమున శోకక్రోధములభివ్యక్తములగును. 'అడవిఁ గలసిరొకొ' యనుటలో భరింప శక్యముకాని కోపమభివ్యక్తమగును. 'అతని' కనునది యర్థాంతర సంక్రమిత వాచ్యము. భీష్మాచార్యుని యప్రధృష్యత్వాదు లిందుఁ బ్రతీయమానములగును.

కట్టాయితమైన కౌరవసేన యిట్లుపమింపఁబడెను :

"అమరుతొడవుల వజ్రాంశు లంచపిండు కరణి, హరినీలములఁ జేర్చుకాంతి యళుల పగిది, మాణిక్యరుచి పద్మభంగి మెఱయఁ గురుబలంబు గెందామరకొలనిఁబోలె." 8.1.96

ఈ పద్యమునందు దుర్యోధనబలమునకుఁ జెప్పఁబడిన కెందామర కొలని సామ్యవహాసేన దర్శనీయతను, పైయాడంబరము నభివ్యక్తము చేయును. ఉద్యోగపర్వచతుర్థాశ్వాసమున 130వ పద్యమునందును ఈయాశ్వాసమునందే 131 వ పద్యమునందును బాండవసేనకు సముద్రసామ్యము చెప్పఁబడినది.

"పాండవసేన సముద్రంబు కాపువోవు చందంబయ్యె." 4.130

"అరదములు దీవులున్నత కరులు గిరులు హరులు వీచికలు సుభటసముత్కర ముగ్రసత్త్వములుగా శరనిధి గతిఁ బాండుపుత్ర సైన్యంబొప్పెన్."6.1.131

యుద్ధారంభమునందలి యీరెండు పద్యములవలనను బాండవసేన బహుకాల మిడుమలఁబడి, వంచనకులోనై కోల్పోయిన రాజ్యమును బొందుటకును, దమకట్టి యపకారముచేసిన శత్రువులఁగసిమసంగుటకును నుప్పొంగుచు క్షోభపడిన పాండవుల

హృదయములవలె సముద్రముతీఋునఁ బరవళ్లు ద్రొక్కుచున్నదనియు, గౌరవసేన యట్లే కష్టనష్టము లెఋుఁగనిది కావున స్తిమితమై యలంకృతమై యనుద్రిక్తమై దర్శనీయమై యలరారుచున్నదనియు నర్థము వ్యంగ్యమగును. ఈ రెండుపమల తారతమ్యముచే యుద్ధ ఫలితముకూడ సూచింపఁబడుచున్నది.

ఈయాశ్వాసమునఁ బ్రారంభమున భీష్మమరణమును విని ధృతరాష్ట్రుఁడు శోకించు ఘట్టము కరుణ రససమన్వితము. ఇరుబలమును యుద్ధమునకుఁ దలపడుట యందుత్సాహ మభివ్యంజితమగును. ధర్మజుఁడు పాదచారియై భీష్మాదులఁగలసి వచ్చుట వృద్ధజనమునెడ నాతనికిఁ గల గౌరవమును భీతిని నభివ్యక్తము చేయును. కడమయుద్ధవర్ణనమంతయు వీరరసస్ఫోరకము. ఇందు ప్రాయికముగా ద్వంద్వ యుద్ధములు చెప్పఁబడినవి. వానివలన నాయావ్యక్తులకుఁగల పరస్పరమాత్సర్య జిగీషలు చక్కగా నభివ్యక్తము చేయఁబడినవి. యుద్ధారంభమునఁ జెప్పబడిన యర్జునుని మోహావిష్టత పాండవుల హృదయ మార్దవమును, భగవంతుని దుష్టశిక్షణ శిష్ట రక్షణల తాత్పర్యము నభివ్యంగ్యమొనర్చును.

## భీష్మపర్వము - ద్వితీయాశ్వాసము :-

తొలిఁనాటి యుద్ధమునఁ దనసేనకుఁ గలిగిన వెనుబాటును దలఁచి దుఃఖించుచు ధర్మజుఁడు కృష్ణునితో నిట్లనెను :

**"అలవియెఱుంగనెరక మహాత్ముని లోకముతోడి పాటిగాఁ**
**దలఁచితి; బేలనైతి; శరతాడనపీడితులైరి నీమఱం**
**దులు నమరాపగాతనయుతోడి రణంబునకున్ దిశాధినా**
**థులు నఱుమంగఁజాలరని తోఁచుచునున్నది నామనంబునన్."** 6.2.6

ఇందు ధర్మజుని నిర్వేదమును, అధిక్షేపణమును, మీరింకను విజృంభింపవలయునన్న ప్రార్థనయు నభివ్యక్తము లగును. 'బేలనైతిన్' అనువాక్యమున మీయందఱమాట విని భీష్ముని విజృంభణమును మున్నె స్వయముగా నఱుఁగక మోసపడి వెఱ్ఱినైతిని. నన్ను మీరిట్లు చేయుట న్యాయమా? యనుభావ మభివ్యక్తమగును. 'శరతాడనపీడితులైరి నీమఱందులు' అనుటలో మున్నెన్నియో బీరము లాడిన యీ వీరాగ్రేసరులు తొలితాఁకునకే తట్టుకొనలేక పీడఁబొందిరి. ఇంక ముందున్న యుద్ధ సముద్రమునంతటి నెట్లు తరింతురోకదా! యనునిర్వేదము, ఒక విధమగు నెత్తిపొడుపును నభివ్యక్తములగును. నీమఱందులనుటలో నిది యంతయు నీప్రోత్సాహముచేతనే జరిగినది కావున సర్వసమర్థుఁడవైన నీవు మనసిడి మమ్ముఁ బాలింపనిచో నిలువఁజాలమను నర్థ

మభివ్యక్తమగును. 'నీ' అను సంబంధార్థకము బాధ్యత యంతయు నీదేసుమా! యను హెచ్చరిక నభివ్యక్తము చేయును. 'దిశాధినాథులును' అనుచోటి అపిశబ్దార్థకావ్యయము భీష్మునిప్రతాపాతిశయము నభివ్యంజించుచు ధర్మజుని భీతికి వ్యంజకమగును.

ఉద్యద్విక్రమప్రక్రియతో రథము పఱపుము. భీష్మునియాటోపము నడంతును. ఖేచరులు వర్ణించునట్లు విజృంభించెద నని క్రీడి పలుకఁగాఁ గృష్ణుఁ డిట్లనుచున్నాఁడు :

"గజిబిజిలేక యుబ్బక యఖండిత శౌర్యము నస్త్రవీర్యమున్
భుజబలముం బొగడ్తవడ భూరిపరాక్రమశాలి భీష్ము న
క్కజముగఁ దాఁకి యద్దెస నకంపితులైనడతెంచుశల్యకుం
భజకురురాజు లచ్చెరువుపాటు భయంబును బొందఁజేయుమీ." 6.2.33

'గజిబిజిలేక యుబ్బక' యనుటలో నీమాటలలో నవి గోచరించుచున్నవి, వాని నవలంబింపకు మనుట వ్యంగ్యము. అది నిన్నాక్రమించినచో నఖండిత శౌర్యాదులు బెండువడు నను నర్థము తోఁచును. 'భూరిపరాక్రమశాలి' యనువిశేషణముచే నట్టివానిని జయించుటకు వేగిరపాటు, గర్వము మున్నగునవి తోడ్పడవు సుమా! మెల్లగా నాలోచించి నేర్పుమైఁ గార్యము సాధింపవలయు నను నర్థము తోఁచును. 'అద్దెస నకంపితులై....' ఇత్యాదికముచే నీవొక్కభీష్ముని మాత్రమే గమనించితివి. అతనితోపాటు ద్రోణశల్యాను యోధనులు సుస్థిరులై నడతెంచు చున్నారు. వారిని గమనింపుము. వారికి భయాశ్చర్యములు గలిగించు విజృంభణము నెఱపు మను హెచ్చరిక తోఁచును. ఈయర్థ విశేషమిట సంభావ్యమను సూచన, అర్జునుఁడు తన్నుద్యద్విక్రమ ప్రక్రియతో రథమునడుపు మనఁగా 'నచ్యుతుం డుచిత రయముతో' (34) నడపుటలో గోచరించును.

అర్జునుని విజృంభణమునకు తనవారు భీతులుకాఁగా దుర్యోధనుఁడు భీష్మునితో నిట్లాడెను :

"తనభుజసార మేర్పడఁగ దర్పితుఁడై మనయందుఁ జేయఁగ
ల్గననృపకోటి నెల్ల నవలీలమెయిన్ మును మించి త్రుంచె న
ర్జునుఁడదె నీవు సూడ; ననురూపమె నీకిది; మున్ను కర్ణభం
డనముదొలంగఁజేసి; తకటా యిటు లొప్పరికింపఁబాడియే." 6.2.41

ఇందలి 'తనభుజసార మేర్పడఁగ ననుదానిచే నాతఁడు తనభుజముల సారమంతయు ప్రదర్శించుచుండఁగా మనము మనసారమును గొంతయే ప్రదర్శనము చేయుచున్నా మనుదుర్యోధనుని యధిక్షేపణము వ్యక్తమగును. 'అవలీల మెయిన్' అనునదియు నధిక్షేప వ్యంజకమే. మీయంతటి మహాదోర్విభవశాలితోఁ

బోరునప్పుడాతలివాఁడెంతయో ప్రయత్నముతో నొకింతసాధించినచో సమాధాన పడుటకైనను వీలగును గాని యది యేమియు లేక యవలీలగా మించి త్రుంచుట మీయౌదాసీన్యమును దెలుపుననునింద నభివ్యక్తము చేయును. నీవు నూడ ననుట సర్వసేనకు సంరక్షకుఁడవైన నీవు చూచుచుండఁగా నిట్లయ్యెనన్నచో నీవు మనః పూర్వకముగా నీ విధిని నిర్వహించుటలే దనునర్థమును వ్యక్తము చేయును. ఇది యంతయు వంచన. సమర్థుఁడగు కర్ణుని యుద్ధమునకు రాకుండఁజేసి నీ వుదాసీనుఁ డవై నా కొంపముంపనెంచితి వనుధిక్కారము కర్ణభండనముఁదొలంగఁజేసి తను వాక్యమున వ్యంగ్యమగును. ఇట్టి దుర్భరమగునింద యీ వాక్యములందు వ్యంగ్యముగా స్ఫురించును గావుననే భీష్ముడు 'ఇతం డింత యొప్పనిపల్కుపల్కునే' యని మనంబునఁ గుత్సించెను. (42)

శల్యనందనుఁడు ధృష్టద్యుమ్నునితో యుద్ధంబు సేసిచచ్చుట :-

"తల్రవయ్యలైనఁ బ్రాణం బులును గృపాణంబు విడిచి భువిఁ ద్రెళ్లె నతం

డలుకొంది కురుబలం బా కులతంబొందంగఁ గొండ గూలినభంగిన్."6.2.195

ఇందు శల్యతనయుఁడు తల్రవయ్యలైన పిదపఁ బ్రాణములు పోయినవెనుక కృపాణము విడిచెనని చెప్పుటవలన నుత్తమక్షత్రియుని వీరత్వ మెంతఘనమో యనునంశము ప్రతీయమానమగును. అతఁడు ప్రాణములు పోయినపిమ్మటనే యాయుధము విడుచుఁ గాని వ్యతిరేకముగాఁ జేయఁ డనియుఁ జేసినచో నది క్షత్రియత్వము గాదనియు నర్థమిందుఁ దోఁచును. ఉత్తమవీరాగ్రేసరునకు ప్రాణముకంటె మానమే ప్రధానమను సామాన్యాంశ మిట స్ఫురించి యర్థాంతరన్యాసాలంకారము వ్యంగ్యముగా నుదయించును. అది వీరరససన్నివేశము నెంతయు నలంకరించును.

వీరాద్భుత రసప్రవణమగు నీయాశ్వాసమున నందందు రౌద్రరసావిర్భావము, ముఖ్యముగాఁ బవమానసుతునిలోకోత్తర పరాక్రమాతిశయమును, నభిమన్యుని దుర్వారవీర విహారమును, భీష్మద్రోణాదుల విజృంభణమును, వారి వారి శక్తిసామర్థ్యములును జక్కగా వ్యంజింపఁబడినవి. నడుమనడుమ ధృతరాష్ట్రునుయోధనాలంబకమగు శోకము మూర్తికట్టుచున్నది.

## భీష్మపర్వము - తృతీయాశ్వాసము :-

భీమునిచే సునాభాదిధార్తరాష్ట్రు లెనమండ్రు మరణింపఁగా సుయోధనుఁడు భీష్ముఁ జేరి యిట్లు పలుకును :

"ఇమ్మెయిఁ గిట్టి వాయుసుతుఁ డేపునఁ గోలుమసంగి పొంగి నా

తమ్ములఁ జంపఁగా నకట తప్పక చూచెదు గాని రోషశో

కమ్ములు లేవు; తోడుపడఁగాదని నిల్చితో! యున్నవారు నొ
క్కుమ్మడిఁ జావఁగోరి యిటు లూరకయుండితో! కౌరవోత్తమా!" 6.3.77

ఇందలి 'కౌరవోత్తమా' అనుసంబోధనము వ్యంగ్యముగా నింద నభివ్యక్తము చేయును. నీవారైన కౌరవులను వాయుసుతుండు చంపుచుండఁగా సర్వసేనాధిపత్యము వహించి యెందుఁ గీడువాటిల్లునో యందు వాలి శత్రుసంహారము చేయవలసి నీ వుపేక్షాపరుఁడ వైనచో నుత్తముఁడ వెట్లగుదువు? నమ్మికొన్న మమ్మెల్లరఁ జంపఁదలఁచిన క్రూరాత్ముఁడ వనునింద యిం దభివ్యక్తమగును. 'ఇమ్మెయి' ననుపదము భీముని విజృంభణ మనిర్వాచ్య మనునర్థమును వ్యంజించును. 'తప్పక చూచెదు' అనుట నింద నినుమడింపఁజేయుటకు వ్యంజకము. 'రోషశోకమ్ములులే' వనుటవలన నీవు మాయందలి బాంధవ్యమును గూడ విడనాడితి వను నర్థము వ్యక్తమగును. 'తోడుపడఁగాదని నిల్చితో, ఉన్నవారు నొక్కుమ్మడిఁ జావఁగోరి యిటు లూరకయుండితో' యను నీవికల్పమువలన దుర్యోధనునికి భీష్మునియెడ నుదయించిన కోపము తీవ్రత యభివ్యక్తమగుచున్నది.

పై యధిక్షేపణమునకు భీష్ముఁడు చెప్పిన సమాధానము :

"వీరస్వర్గము ధనముగఁ బోరుము; నీవింక నొండుబుద్ధు లుడుగు; మేఁ
బోరెద నోపిన మెయిఁ దెగి పోరఁగ జయమైనదానిఁ బోఁద్రోచెదమే." 6.3.81

యుద్ధ ఫలితమును ముందుగనే నేనును ద్రోణుఁడును విదురుఁడును జెప్పఁగ్గా వినక యిప్పుడు విచారింపఁగా నేమియగు నని పిదప భీష్ముఁడిట్లనుటలో 'ఈచచ్చిన సునాభాదులే కాదు. మిగిలిన నీసోదరులందఱితో నీవును జత్తువు. రాజ్యలక్ష్మికై దురాశవహించి సోదరులగు పాండవులఁ జంపఁబూనిననీకు ఈధన మెట్లును నిలువదు కావున మరణము నిశ్చయము. వీరస్వర్గమే నీకు గతి. వేఱొకమాట పలుకవలసిన యవసరము లేదు' అను నర్థము వ్యంగ్యమగును. 'ఏఁ బోరెద నోపినయంతయు' ననుటవలన నీవు పొందుపరాజయమునకు నీదుష్కర్మమే హేతువు కాని నా యసమర్థత కారణము కా దను భావము వ్యంగ్యము. 'తగపోరఁగ జయమైనదానిఁ బోఁద్రోచదమే' యనుటచేత యుద్ధమున జయాపజయములు దైవాధీనములు. జయమైనచో నెట్లు స్వీకరింతుమో యపజయమైనచో నట్లే యనుభవింపవలయుఁ గాని నిందావాక్యములతోఁ బనియేమి? యనునర్థము వ్యంగ్యము.

భీష్మాచార్యుని తుదిమూఁడు నాళ్ళయుద్ధముతోపా టాతనిపాటు నభివర్ణించు నీయాశ్వాసము వీరరౌద్రాద్భుతబీభత్సరససమన్వితమై యొప్పుచున్నది. అందందు దుర్యోధన ధృతరాష్ట్రార్జునుల దుఃఖములు నిందు వర్ణితములై కరుణరసస్ఫూర్తియుఁ

గానవచ్చును. అర్జునుని వింటి నేర్పుచే శరతల్పగతుఁడైన భీష్మాచార్యునికిఁ దలగడ యేర్పడుట, దివ్యజలోత్పాదనము మున్నగునవి యద్భుతరసజనకములు. యుద్ధమునఁ గూలినపశుజననంఘాతముల వర్ణనము బీభత్సరసమును బుట్టించును. తన మృతిహేతువును భీష్ముఁడు చెప్పుట దానవీరమునకుఁ దలమానికము. భీష్మపతనముచే నెల్లరు దుఃఖించుఘట్టము కరుణోదంచితము.

## ద్రోణపర్వము - ప్రథమాశ్వాసము :-

భీష్ముఁడు మరణించిన పిదపఁ గౌరవసేన యెట్లున్నదో య్రీకింది రెండు పద్యములు రమణీయముగా వివరించుచున్నవి.

(1) "పతిరహితాత్మయైనసతిభంగియు, గోపకహీనమైనగో
ప్రతతివిధంబు, సస్యవిధురస్థితియైనధరిత్రిచాడ్పు, ను
ద్ధతహరిశూన్యమైనవసుధాధరకందర భూమిచందమున్
మతి మనసేనఁ దోఁచె బుధమాన్యుఁడు భీష్ముఁడు లేకయుండుటన్"7.1.16

(2) "అంగద నాథు మ్రింగినవృకావలి దన్ వెసముట్టికొన్న స
ర్వాంగములుం జలింప వెగడందుచు దిక్కులు సూచుచున్న సా
రంగియ పోలె నుండెఁ గురురాజ! భవత్సుతుసేన భీష్ము నా
జిం గబళించి పాండవులు జృంభిత విక్రమలీలఁ బొల్చుటన్."7.1.17

కౌరవసేనయందుం బతిరహితాత్మయైన నతిభంగి దోఁచె ననుటచే సర్వశోభాదరిద్రాణమై యది యున్నదనియు, గోపకహీనమైన గోప్రతతివిధంబున నున్న దనుటచే నదవదలై యాజ్ఞలేక యలమటించుచున్నదనియు, సస్యవిధురస్థితియైన ధరిత్రిచాడ్పు దోఁచె ననుటచే సంపద్విహీనమై చెలువేఁదె ననియు, నుద్ధతహరి శూన్యమైన వసుధాధరకందర భూమిచందము దోఁచె ననుటచే భీతిలేక యెవ్వఁడేని చొచ్చి స్వాధీనము చేసికొనుటకు వీలైన స్థితిలో నున్నదనియు వ్యంగ్యార్థములు తోఁచును. ఈయుపమానములచేఁ గౌరవసేన యెంత దయనీయముగా నున్నదో యభివ్యక్తమగుచున్నది. మఱియు భీష్మునియాధిపత్యమున నది యెంతవైభవోపేతమై యొప్పెనో యనునంశమును నిందుఁ బ్రతీయమానమగుచున్నది.

రెండవ పద్యమున దానిశోచనీయత మఱియుఁ జక్కగా వ్యంజింపఁబడినది. మొదలే సారంగి, బెదరుటలో, భీతిలో దానికదే సాటి. అందును నాడుది. అంతేకాక ఒకటో రెండో కాక ఒక మంద తోడేళ్ళు చుట్టుముట్టియున్నవి. ఎంత భీకరముగాఁ జంపునో చవిచూచుటకో యన్నట్లవి యింతకుముందే నాథుని మ్రింగి యున్నవి. ఆ దుఃఖమునకుఁ

గుములుటయా? ఈ రాఁబోవు ప్రాణసంకటమునకుఁ దల్లడిల్లుటయా? ఇత్యాది వికల్పములు పెనగొనఁగా సర్వాంగములును జలించుచున్నవి. ఆ భయమిట్టిదట్టిదని చెప్పుట దుష్కరము. ఏయత్యల్పావకాశమున్నను సంరక్షించుకొనుటకై దిక్కులు సూచుచున్నది. చూచుచుండుట వర్తమానమే యగుటచే దిక్కేమియుఁ దోఁచనేలేదని భావము. అట్టి సారంగివలె నున్నది కురురాజసేన. ఈ యుపమాన మప్పటికురురాజ సేన పరమదయనీయస్థితిని, రాఁబోవు యుద్ధఫలితమును మనోజ్ఞముగాఁ బ్రతీయమాన మొనర్చుచున్నది.

ఈయాశ్వాసమున 81వ పద్యమునుండి 102వ పద్యమువఱకు ద్రోణవధ శ్రవణజనితధృతరాష్ట్రశోకము బహువిధముల వర్ణితమై కరుణరససమాస్వాదనము కలిగించుచున్నది. ద్రోణుని గుణకీర్తనము స్మృతి యను వ్యభిచారిని, ఇంక మన కెవ్వరూఁత యనుటలో దైన్యమును, పాండవ పక్షవీరుల ప్రశంసచే గ్లానిత్రాసములును, ఇంక నీవేమియుఁ జెప్పవలదనుటలో నింకేమి భయంకరవార్త వినవలసి వచ్చునో యనుశంకయును జెప్పఁబడినవి. ఆసమాలుట, వివశాత్మకుఁడగుట, వెచ్చనూర్చుట మున్నగునవి యనుభావములు. సొమ్మపడుట మున్నగునవియు నిటఁ జెప్పఁబడినవి. ఈ సముదాయముచేఁ బ్రతీయమానమగు కరుణము సహృదయహృదయమును లోఁగొని యాతనిఁ బరవశింపఁజేయును.

కొంతవడికి మనముఁ గుదుటపఱచుకొని ధృతరాష్ట్రుడు యుద్ధమెట్లు జరిగెనో వివరింపు మనఁగా సంజయుఁ డిట్లారంభించెను :

**"అనిన సంజయుఁ డిట్లను నాంబికేయు తోడఁ నేను దెల్లంబుగ ద్రోణుసమర**
**మెఱిఁగివచ్చితిఁ జెప్పెద నెల్లఁ దెలియ వినుము దిరమయి; మాటలు వేయు నేల?"**
**7.1.103**

ఇందు సంజయుఁడు 'నేను దెల్లంబుగ ద్రోణుసమర మెఱిఁగివచ్చితి' నని చెప్పుటలో 'ఇప్పుడే ఏమయినది? నీ వింకను దుఃఖింపవలసిన విషయము లనేకములు గలవు. అవియన్నియు సవిస్తరముగా వివరించెదను. గుండె దిటవు చేసికొను' మను నెచ్చరిక యభివ్యక్తమగును. 'ఎల్లఁదెలియ వినుము' అనుటవలన సంధికై చెప్పిన హితవాక్యముల నాదరింపని ఫలముగా ప్రతినిమేషము నిట్టి దుర్వార్తలు వినవలసి వచ్చినది. సమాహితచిత్తుఁడవై విని యాత్మకృతాపరాధమును ఇపుడైన గుర్తింపుమను నర్థము తోఁచును. మాటలు వేయునేల? యనుటలో నెఱిఁగియెఱిఁగి నీవారి హృదయములలోఁ జిచ్చిడి యిప్పు డింతగాఁ బలవించుటవలనఁ బ్రయోజనమేమి కలదు? కావున నిబ్బరముగా నాలకింపు మనునర్థము తోడియెత్తిపొడు పభివ్యక్తమగును.

ద్రోణకర్ణార్జున విక్రమము, సుశర్మాదులవిజృంభణము ప్రధానముగా వర్ణింపబడిన నీయాశ్వాసము వీరరసఘట్టములలోఁ బేరెన్నిక గన్నది. ఇందందందు రౌద్రాద్భుత రసములు అంగములుగా నిబంధింపఁబడినవి. భగదత్తు సంకుశముఁ గృష్ణుఁడు తనమేనఁబట్టుట విస్మయజనకము. 386వ పద్యమున కీలాలజలమునఁ దేలిపోయెడు దేహములు మాంసచయములు మున్నగునవి వర్ణింపఁబడి బీభత్సరసమును బుట్టించుచున్నవి. అది యచటఁ గవిచే 'రౌద్రబీభత్సనర్తనరంగభంగి' ననుపదముచే వాచ్యము చేయఁబడినది.

## ద్రోణపర్వము - ద్వితీయాశ్వాసము :-

లక్ష్మణకుమారుఁడు అభిమన్యునితో యుద్ధమునకు వచ్చినప్పటిస్థితి నీక్రింది పద్యము వర్ణించుచున్నది :

"అదలిచి లక్ష్మణుండు విజయాత్మజుఁ దాఁకినఁ జూచి యమ్మొలం
బొదవఁగఁ బుత్త్రుఁ బెట్టి చననోపక క్రమ్మఱురాజుఁ గాంచి యం
బుదములు గొండపై నడరుపోలిక నన్నరుపట్టి నందఱుం
బొదువ నతండు ఘోరశరభూరిసమీరమునం దెరల్చుచున్." 7.2.88

ఇందలి యుపమాలంకారముచేత మేఘములెంత దట్టముగాఁ గ్రమ్మినను బర్వతము నేమియుఁ జేయఁజాలనివిధమున నీవచ్చిపొదివినవా రెంతటిపోటరులైనను నిలువఁజాలరనునర్థము వ్యంగ్యమగును. కొండ అచలము, మేఘము వాయుప్రసారమును బట్టి నిత్యచలనశీలము. ఈయుపమానమునుబట్టి యభిమన్యుని ధైర్యస్థైర్యములుఁ, బొదివినవారిచాంచల్యము నభివ్యక్తములై ఫలితమును వ్యంజించుచున్నవి.

ఈయాశ్వాసమున 134వ పద్యమువఱకు నభిమన్యుకుమారుని లోకోత్తర వీరవిహారసంరంభమును నాతనిమరణము నభివర్ణింపఁబడినవి. కొండొకయెడ నాతనివిజృంభణము ధనంజయ విజృంభణాతిశయమై యత్యాశ్చర్యకమగుట యిందుఁ జెప్పఁబడినది. ఈ ఘట్టము నందలి ప్రధానమగు వీరరసమునకు రౌద్రాద్భుత బీభత్సరసము లంగములుగా నిబంధింపఁబడినవి.

మఱియు 226వ పద్యమునుండి 281 వఱకుఁగల పద్యములు కరుణరసోదంచితములు. అభిమన్యువధజనితార్జునశోక మిందుఁ గరుణరసమై నిండారినది. అర్జునుడు కుమారుని రూపలావణ్యగుణపరాక్రమాదులఁ దలఁచితలఁచి పలవించుటయు, నాతని వధించినవారియందు దలుకవహించి వధోద్యుక్తుఁడగుటయు, సైంధవసంహారమునకుఁ బ్రతిజ్ఞపట్టుటయు ననునంశము లిందు రసౌభ్యుచితముగా వర్ణింపఁబడినవి. 'యోధబృందమ్ములచేత మ్రగ్గడుగదా' (235) ఇత్యాదికముచే శంకయు,

'హరి మేనల్లు' (230) డిత్యాదికముచే స్మృతియు, 'హంసతూలికపాన్పునందుఁ బొందెడు మేను కఠినంపునేలతోఁ గదిసె నేఁడు' (239) ఇత్యాదికముచే నిర్వేదాదులును, 'హాయను ధర్మరాజతనయా యను' (242) నిత్యాదికముచే దైన్యార్త్యావేగచపలత్వాదులును జక్కగా వర్ణితములై రసనన్పార్తికిఁ దోడ్పడుచున్నవి. నిట్టూర్పులు నిగిడించుట (246), 'గద్గదకంఠమును బొందుట' (250) చల్లనిడెందము సెదరుట, మూర్ఛిల్లుట, పరవశుఁ డగుట (274, 275) మున్నగుసాత్త్వికభావములును జెప్పఁబడినవి. కుమారహంతలవధకై పట్టశక్యముకాని కోపము ప్రదర్శింపఁబడి రౌద్రముగా నది తుదికిఁ బరిణమించినది. ఇవి ప్రధానమగుయుద్ధవీరమున కంగములు.

ద్రోణాచార్యుఁడు సైంధవు నూఱడించుచు నిట్లు పలికెను :

"శ్రుతు లభ్యసించి తతుల క్రతువులు సేసితి కులంబు రక్షించితి నీ
వితరులక్రియ మృత్యుభయా న్వితుఁడవు గాఁదగునె మేదినీవర! యింకన్."

7.2.297

ఇందు నీవాయాపనులఁజేసితి వనిపేర్కొనుటలో బ్రదికి సాధింపవలసిన దెల్ల సాధించితివి కింక మృత్యువన వెఱపేల? క్షత్రధర్మోచితముగాఁ బోరి యర్జునునిచేతఁ జచ్చుటవలనఁ గలుగుసుఖముకంటె భీతుఁడవై పాఱి ప్రాణరక్షగావించుకొనుటవలనఁ గలుగు సుఖమధికమా! ఎట్లును నీకు మృతి దప్పదు, సిద్ధముగా నుండు మన్న ధ్వని గోచరించును. మేదినీవర! యనుసంబోధనముగూడ సాభిప్రాయము. రాజ్యమేలుచుఁ బ్రజల కాదర్శప్రాయుఁడవై యుండవలసిన నీవు ప్రాణభీతిచే యుద్ధభూమిని వీడి చనఁ గోరు టెంతనీచమో యాలోచింపు మనుట యిందభివ్యక్త మగును. తఱువాతి పద్యమున నీయర్థ మించించుక స్పృశింపఁబడినది.

"యాదవకౌరవపాండవు లాదిగఁ గల యఖిలనృపులు నవ్యయవృత్తిన్
మేదిని నిలుతురె క్రమమునఁ బోదురు గాకెల్లజనులుఁ బోవుతెరువునన్."

7.2.298

అర్జునుని ప్రతిజ్ఞకుఁ జిడిముడిపాటుపడుచు సగము నిద్రలో లేచి దారుకునితో తాన సైంధవుఁ జంపుదు నందఱఁ గూల్తు ననుచున్న కృష్ణునితో దారుకుఁ డిట్లు పలికెను:

"అలఘువిచార! యట్లతగు, నప్పనిసేసెద, వంతసేయఁగా
వలయునె; యెవ్వ రక్కడ నవార్యులు క్రీడికి? సారథిత్వముం
దలకొని నీ వనూనశుభదంబగువర్తన మాచరింప నీ
నిలుపును బార్థుచాలుటయు నేడుగదా భువనం బెఱింగెడున్." 7.2.355

ఇందలి 'యలఘువిచార' యనునంబోధనము వ్యంగ్యార్థస్ఫోరకము. శస్త్రాస్త్రముల నంటనని మాటయిచ్చి యింత వఱకట్లే నిర్వహించుచున్న నీ వది మఱచి శత్రుసంహారము చేయుటకు నిర్ణయించుట సముచితమా? ఇంత పెద్ద విచారము నీ కీ సమయమున నవలంబనీయమా? జాగ్రత్తగా నాలోచింపు మనునర్థ మిట వ్యంగ్యమగును. 'అంతసేయఁగా వలయునె' యనుటలో నర్జునుని యందలి వాత్సల్యానురాగములచే నీవు యుద్ధమునకు సిద్ధపడి మాటతప్ప నుంకించుచున్నావు. కాని నిజమున కంతగా విజృంభింప నవసరము లేదను నర్థము వ్యంగ్యము. 'ఎవ్వరక్కడ నవార్యులు క్రీడికి' ననుటచే నిది యంతయు నీయాశంకావేగముల నభివ్యక్తము చేయునే కాని నీవు విజృంభణమునకు దొరకొనవలసినపనిలే దనునర్థము వ్యంగ్యము. నివాతకవచపౌలోమకాల కేయాదిరాక్షససంహారము గావించి త్రిలోకాధిపతియగు దేవేంద్రునిమన్ననచేఁ బ్రశస్తమగు కిరీటము నొందిన క్రీడివిక్రమమునకు సైంధవ సంహార మొకలెక్కయా? యనునర్థము 'క్రీడి' యనుపదముచే నభివ్యక్తమగును. 'సారథిత్వముం దలకొని నీవనూన శుభదంబగువర్తన మాచరింప' ననుటలో కర్తవ్య విస్మరణము గావింపకుము. నీవు సారథ్యమునే చేయవలయును గాని యుద్ధమాడరాదు. అట్లగుటయే అనూనశుభవర్తనము. లేనిచో ధనంజయునకు దుష్కీర్తి సంఘటిల్లు ననునర్థము సంభావ్యము. 'నీనిలుపును బార్థుచాలుటయు నేఁడుగదా భువనంబెఱింగెడున్' అనుటవలన నివియే లోక మెఱుఁ గునట్లు చేయవలయును గాని విపరీతముగాఁ జేయవలదను ప్రార్థన మిందభివ్యక్త మగును. తఱువాతి వచనమునందలి 'అని సవినయంబుగాఁ బలికి దనుజమర్దనుతమకంబు వారించె' నను వాక్యముచేఁ బైవిశేషార్థభావనము కవికి సమ్మతమైన ట్లూహింపనగును.

ఈయాశ్వాసమునఁ దుదిభాగమున సైంధవుఁ డర్జునుప్రతిన విని కొందలమందుట, వానిని ద్రోణాదు లూరార్చుట, కృష్ణుఁ డర్జునుని ప్రతిజ్ఞనుగూర్చి చింతాకులిత హృదయుఁడగుట, దారుకుఁ డతనిఁ దేర్చుట, కృష్ణార్జునులు శివానుగ్రహమునఁ బాశుపతమంత్రోపదేశము కలయందొందుట యనుభాగములు చెప్పఁ బడినవి. సైంధవవిలాపము హాస్యరసజనకము. వీరదర్పము చూపనగువాఁడు పరితపించుటచే నిది సంభావ్యము. కృష్ణుని వాత్సల్యమిందుఁ జక్కగా వ్యంజింపఁ బడినది. స్వప్న వృత్తాంత మద్భుతావహము.

## ద్రోణపర్వము - తృతీయాశ్వాసము :-

ద్రోణుఁడు ధృష్టద్యుమ్నుని లక్షించి దొడ్డనారస మేయఁగా సాత్యకి దాని నడుమ నఱకె నని విని ధృతరాష్ట్రుఁడు సంజయునితో నిట్లనెను :

"పులివాతికందఁ గొనుగతి నలవునఁ బాంచాలతనయు నయ్యెడరునకుం
దొలఁగించినసాత్యకిపై నలుకవొడమకుండునెట్టు లాచార్యునకున్?"7.3.127

ఇట నాచార్యునికి నలుక కలుగుమాట యెట్లున్నను శ్రోతయగుధృతరాష్ట్రునకు మాత్ర మొడలుమండు నంతటికోపము కల్గె నను విషయము ఈవాక్యమువలన నభివ్యక్తమగును. ద్రోణవధార్థము జన్మించె నని చెప్పఁబడు ధృష్టద్యుమ్నుఁడు మరణించెనని సంతసించుట కుద్యుక్తుఁడగుచుండఁగా నింతలో సాత్యకి యాతని రక్షించుట ధృతరాష్ట్రునకు దుర్భరమాయెను. సాత్యకిపైఁ గోప మడరెను. ఇంత మంచి యవకాశమును బాడుచేసిన సాత్యకిని ద్రోణుఁడేమి చేసెనో చెప్పుము. వీనులారవిందు ననుధృతరాష్ట్రుని యుత్కంఠ యిందభివ్యక్తమగును.

అర్జుననిజృంభణ మీక్రింది పద్యమున వర్ణింపఁబడినది :

"నరుఁడు తనతేరువోయెడు తెరువునకై నంత సేనఁ దీవ్రాస్త్రములన్
ధరఁ గూల్పఁగ నయ్యెడ న య్యరదముఁ గృష్ణుండు వఱపు టద్భుతమయ్యెన్."
7.3.141

అర్జునుఁడు కూల్చిన సేనాసముదయముగల ధరపైఁ గృష్ణుఁడు పఱపుటద్భుత మయ్యెనన్న యీ విషయముచేఁ గైముత్యన్యాయము స్ఫురించి యర్జునవీర విహార మెంత యద్భుతజనకమో చెప్పనలవికా దనునర్థము ప్రతీయమానమగును.

మహోదాత్తవిక్రముఁడగు నర్జునుఁడు ప్రతిజ్ఞానిర్వహణమునకై శత్రుసేనలఁ బీనుఁ గుతిప్పలుగాఁ జేసి వీరరసస్ఫోరకుఁడగుట యీయాశ్వాసమున వర్ణింపఁబడినది. అర్జునుఁ డు శత్రుసేనామధ్యమున రథ్యములకు నీళ్లు పట్టించి యాహారము తినిపించుచునే శత్రువ్రాతముఁ దునుమాడుట యద్భుతరసము నాస్వాదింపఁజేయును. పాంచజన్యారవము విని గాండీవగుణధ్వని వినరామికి వగచి సాత్యకి నర్జున రక్షణమునకుఁ బంపునప్పటి ధర్మజోక్తులు కరుణరసోదంచితములు. సైంధవ వధ యెంత దుష్కరమైనదో వ్యంగ్యముగాఁ జెప్పుటకో యన్నట్లు అది ముగింపక ముందే తిక్కనామాత్యుఁ డాశ్వాసమును ముగించుట యొక విధమగు శిల్ప విశేషమనఁదగును.

## ద్రోణపర్వము - చతుర్థాశ్వాసము :-

సాత్యకిచే నోడి పాఱుదెంచిన దుశ్శాసనునిఁ గాంచి ద్రోణాచార్యుఁ డిట్లు పలికెను:

(1) "ఏమి యువరాజవిభునకు సేమమె? సైంధవుని నేమిచేసె నరుఁడు; నీ
వేమిటి కిట్లీరథిక స్తోమముతో విఱిగి తెందుఁ జొచ్చెద వింకన్." 7.4.88

(2) "అడుకులు దిన్నట్లగునే కడుపునఁ గుట్టెత్తినపుడు గడుఁ బఱచితి నాఁ

తిక్కనార్యుని దివ్యవాణి
దొడలెఱుఁగక పాండుసుతుల నుడిగి మడుగవలసె నిప్పు డొకసాత్యకిచేన్."
7.4.89

ఈ పద్యములలో దుశ్శాసనుని యెడ ద్రోణునకుఁ గలిగిన యమర్షాసహ్యములు వ్యంగ్యముగాఁ జెప్పఁబడినవి. 'యువరాజవిభునకు' అనునది భరింపరాని యవహేళనము. యుద్ధమునఁ బాఱివచ్చిన నీవు యువరాజవా? విభుత్వమన నింత నీచమైనదియా యనునర్థమిట వ్యంగ్యము. 'సేమమె' యనుటచే పాఱివచ్చి ప్రాణములు దక్కించుకొంటివి గదా! వీరత్వ మేమైనఁ గానిమ్మను వెక్కిరింత యభివ్యక్తమగును. 'ఈరథికస్తోమముతో' ననుటలో నింత సహాయసంపత్తికలవాఁడవే విఱిగినచో నొంటరివైనచో నీపాటు చెప్పనేల? యనునర్థము వ్యంగ్యమగును. 'ఎందుఁజొచ్చెద వింకన్' అనుటచే నిప్పటికి నీవు చావు తప్పించుకొన్నను నీకది తప్పదు. ఎందుఁ జొచ్చినను బాండవుల కోపాగ్ని నిను మండఁబెట్టు నను నర్థము వ్యంగ్యము. రెండవ పద్యమునందలి యడుకు లిత్యాదికముచే నేదైనఁ గార్యమాచరించునపుడు పర్యవసాన మూహించి చేయుట క్షేమదాయకము. మీరట్లు చేయక దుర్గర్వముతోఁ బాండవుల హింసించితిరి. దానిఫల మిప్పు డనుభవింపక తీఱదనునర్థము వ్యంగ్యమగును. 'ఒకసాత్యకిచేన్' అనుమాట యందలి 'ఒక' యనుపదైక దేశము సాత్యకియెడ గురునకుఁ గల లఘుభావము నభివ్యక్తము చేయును.

అర్జునసాత్యకులేమైరో తెలియక విచారించుయుధిష్ఠిరుఁడు భీమసేనుని వారికడ కంప నిశ్చయించి యిట్లు పలుక నారంభించెను :

"భీముఁ జేర నరిగి బీభత్సు నీతమ్ము నని యెలుంగుగళమునందుఁ దగుల నశ్రులొలుక మాటయటసెప్పలేఁ డతఁ డార్తి సూచి యిట్టు లనియె నతఁడు"
7.4.133

అర్థోక్తిగాఁ బలుకుట, యెలుఁగుగళమునందుఁ దగులుట, అశ్రులొలుకుట, మాట సెప్పలేకుండుట యనునీయంశములచే ధర్మజునిశోకోద్వేగము పరాకాష్ఠకుఁ దేఁ బడినది. దీనిచే నాతనిసోదర వాత్సల్యము చక్కగాఁ బ్రతీయమానమగుచున్నది. ఆ దినమంతయు నాతని కర్జునుడె మనమున నెలకొని యుండుట యందందు నిందువలెఁ జెప్పఁబడినది. తిక్కనాచార్యుని కవితయందలి రసైకప్రవణత కిట్టి పద్యములు మంచి యుదాహరణములు.

భీమసేనునియప్రతిమాన వీరవిహారము నాలకించి ధృతరాష్ట్రుడు దుఃఖించుచు సంజయున కిట్లనియె :

"వినఁడె జరాసంధాదులఁ దునుముట; మన దుర్జయుండు దుర్ముఖుఁడును భీ

మునితోడఁ బెనఁగువా; రే మని కర్ణునిఁ గావఁబనిచె నబ్బాలకులన్." 7.4.207

ఇందలి 'జరాసంధాదులన్', 'భీమునితోడన్' అనుపదము లర్థాంతరసంక్రమిత వాచ్యములు. మహాబలశాలి, క్షత్రియుల నందఱ బంధించి దేవికి బలియొసంగ నుంకించినవాఁడు, అసాధ్యుఁడు నగు జరాసంధు నొక్కనినే కాక యట్టివారి ననేకులఁ దునిమె నని యిది భీమునిభీమత్వ ప్రతిపాదనమునఁ బరిణమించును. అట్లే యరిలోక భయంకరుఁడు, కురుకుమారుల నందఱ వధించు తీవ్రోద్యోగముగలవాఁడు నగు భీమునితోఁ బెనఁగుసామర్థ్య మల్పప్రాణులగు దుర్జయదుర్ముఖులకుఁ గలదా? యను నర్థము వ్యంగ్యము. 'మన' అనుటయు వ్యంగ్యార్థసంకలితమే. మనవారెట్టి శక్తియుక్తులు గలవారో మనకుఁ దెలియదా? తెలిసి తెలిసి చంపుకొననేల? యనునర్థమిట వ్యంగ్యము. 'అబ్బాలకులన్' అనుచోటి 'క' ప్రత్యయము వారి యల్పత్వహీనత్వముల వ్యంజించుచు ధృతరాష్ట్రుని జాలి నభివ్యక్తము చేయును. 'కర్ణునిఁ గావఁబనిచె' ననుటయు విశేషార్థప్రత్యాయకమే. మాటిమాటికి యుద్ధమునకు దుర్యోధను నెగఁద్రోయుచు మిమ్మెల్లఁ గాతు నను కర్ణుని, విజయునికిఁ బ్రతిద్వంద్వియగు వీరునిఁ గాచుటకు బాలకులను బంపుటయా యను నాశ్చర్యామర్షము లిందభివ్యక్తములగును.

సాత్యకిఁ జంప నుంకించిన భూరిశ్రవునియెత్తిన చేతిని కత్తితోపాటు ఖండించిన యర్జునునితో నతఁడిట్లనియె :

"నీదెసఁ జూడ నొండొకరునిం దగమార్కొని పోరుచుండఁ బెం
పేది వినీచకర్మమున కియ్యకొనందగునే భవాదృశుం;
డీ దురుపాయ మగ్గురుఁడొ యింద్రుఁడొ రుద్రుఁడొ నీకుఁ జెప్పె; దా
మోదరుఁ డింత పాపమున కోర్వఁగఁజేయునె నిన్ను నర్జునా!" 7.4.268

ఇందలి 'వినీచకర్మమున' కను పదమునందలి 'వి' నను నుపసర్గయు సౌమదత్తిహృదయమునందలి యేహ్యాభావము నభివ్యక్తము చేయును. ఈ దురుపాయ మిత్యాదివాక్యముచే జగత్ప్రసిద్ధుఁడగు ద్రోణాచార్యునకు శిష్యుఁడవు, స్వర్గాధినేత పుత్రుఁడవు, రుద్రుని యుద్ధక్రీడచే మెప్పించి పాశుపతాస్త్రమును బడసిన మహోదారుఁడవు నైనని విట్టి నీచకర్మమునకుఁ జొచ్చినచో నీకంటె వారి కెక్కువ యపయశస్స్ఫురిల్లును గదా! ఇదియా నీవు వారి కిచ్చు గురుదక్షిణ? యను వెక్కిరింత యభివ్యక్తమగును.

సైంధవవధైకలక్ష్యముగా సాఁగిన మహాభయంకర యుద్ధ వర్ణనము గల యీ యాశ్వాసము వీరరౌద్రాద్భుత బీభత్సరసముల సమాహారమై యొప్పుచున్నది. విజయ సాత్యకి భీమసేనాదు లీవైపునను, ద్రోణాచార్యరాధేయాది రథికవరు లావైపునను వీర విక్రమ విహారము సల్పి వీరరస ప్రవాహమును వెల్లిగొల్పుట యిందు గోచరించును.

భీమసేనుని విజృంభణము రౌద్ర రసభరితము. అర్జునుఁడు కృష్ణుని యుపదేశమున సైంధవుని తలనఱకుటయు, దానినిఁ బాశుపతాస్త్రప్రభావముచే వృద్ధక్షత్రుని తొడపైఁ బడవైచి యాతనితల నూఱుపఱియలగునట్లు చేయుటయు నద్భుత రసజనకములు. కవియుఁ బరవశుఁడై 'సకల భూతములు మహాద్భుత రసమున మునిఁగె' నని వాచ్యముగాఁ జెప్పునంతటి రసవత్సన్నివేశ మయ్యెది. భూరిశ్రవోవధ జుగుప్సను బుట్టించును. ఆంబికేయ గాంధారేయుల దుఃఖము కూడ నెడ నెడ గోచరించుచునే యుండును. కర్ణ సాత్యకుల విక్రమకేళియు నిందుఁ బ్రధానముగాఁ గానవచ్చును.

## ద్రోణపర్వము - పంచమాశ్వాసము :-

1) శారద్వతుండు దనయమ్ముల మూర్ఛిల్లుట సూచి సవ్యసాచి వగవఁగాఁ గృష్ణుఁ డిట్లనుచున్నాఁడు :

1) **కురుబలముఁదొడరి గెలువఁగ సురగణములకైన నరిది శూరోత్తమ! నీ**
**వురవడి గెలిచితి భాగ్య స్ఫురణంబును బాహుబలముఁ బొగడందగదే."7.5.7**

2) **"అవృద్ధక్షత్రుతపము వావిరి నోర్వంగ నీకు వచ్చినటులు వి**
**రావహునిఁ గర్ణు నోర్వం గావచ్చినఁ గాదె నాకుఁ గడుఁ బ్రీతియగున్."7.5.8**

ఈ రెండు పద్యములందలి ప్రశంసయు సాభిప్రాయములు. కృపాచార్యుఁడు మూర్ఛిల్లుటచే నర్జునుఁడు వగచుచున్నాఁడు. నాయనా! ఇది యుద్ధము. ఇందుఁ బాల్గొనుప్రతివ్యక్తియుఁ జావునకుఁ గాని చంపుటకుఁ గాని శంకింపరాదు. అవి అయినచో విచారింపరాదు. తదనంతర కర్తవ్యమేమో, హంతవ్యులెవరో యాలోచింపవలయుఁ గాని యిట్లైనచో నెట్లు? కావున మనసును గ్రుంగనీకు మనునుపదేశ మిట వ్యంగ్యము. కావుననే ముందుఁ బొగడికతో విచారమేఘము నపనయించి రెండవ పద్యమునఁ గర్తవ్యమును శ్రీకృష్ణుఁడు గుర్తునకుఁ దెచ్చుచున్నాఁడు. శూరోత్తమ! అను సంబోధనముచే నీశౌర్యముచే శత్రువర్గము మడియఁగాఁ జింతింపనేల యను భావము వ్యక్తమగును. 'భాగ్యస్ఫురణము, బాహుబలమును బొగడందగదే' యనుటవలన దైవమును నమ్మి భుజబలమును వినియోగించి శత్రుసంహారము చేయుటయే కర్తవ్యము కాని, విచారించుట కాదను నర్థము వ్యంగ్యమగును. దైవమును మెప్పించి తపోవిశేషముచేఁ దనయుని శిరః పాతనము చేయువాని శిరస్సు వ్రక్కలగునట్లు చేయనెంచిన వృద్ధక్షత్రునితపమునే భంగించిననీవు నిరంతరము నీకుఁ గీడురోయుకర్ణునిఁ బడవేయకయే విచారముతో గ్రుంగినచో ప్రయోజన మేమి ఘటిల్లును? కావునఁ బనికిమాలిన విచారమును బరిత్యజించి నీకు నిత్య ప్రతిద్వంద్వియగు కర్ణునివధ కాయత్తము కావలయును. అదియే నాకుఁ

ప్రీతిసంధాయకము. కావున వంతరవంతేని మనమున రానీకు మను హెచ్చరిక రెండవ పద్యమున వ్యంగ్యముగాఁదోచును.

దుర్యోధనుఁడాడు కీడుమాటలకు మిక్కిలివగచి ద్రోణాచార్యుఁ డాతనికున్న రూపు వివరించి తుది కిట్లనుచున్నాఁడు :

"భూసురభక్తియు వృద్ధో పాసనముం గలిగి ధర్మపథవర్తన వి
త్యాసక్తుఁడ వగు మనఘా! నాసుతు బోధింపు వగపునకుఁ జొరకుండన్."

7.5.40

"నాచేతఁ దెగని పాంచాలురు గలిగిరేనియు వారిం బోనీక పొదివి తెగఁ జూచునది యని చెప్పుము." 7.5.4

ద్రోణుని యీ యుపదేశము సాభిప్రాయము. నీకింత చేటుమూడునది భూసుర భక్త్యాదిసుగుణ సంపత్తిలేని కారణమువలననే, గురుఁడను, భూసురుఁడను, అధర్మమని యెఱిఁగియెఱిఁగి నీకై పోరుచున్నవాఁడను నగు నన్నుఁ దూలనాడితివి. సర్వవేద వేదాంతతత్త్వజ్ఞుఁడై నీహితము కోరి నిరంతరము పాటుపడిన గాంగేయుని, వృద్ధతముని నిరసించితివి. ధర్మమార్గమున నడినన్నపాండవుల నెల్లహింసలకు లోనుగావించితివి. ఇఁకనైనను నిట్టి తుచ్ఛమార్గమును వదిలి వీని నవలంబింపనిచో నీకు బ్రదుకులేదు. కావున నీ సుఖమున్నకై వీని నాదరింపుము. నాకెట్లు నవసానకాలము సమీపించినది. నాకుమారుఁడు నా మృతికి వగవకుండ బోధింపుము. అతనిచే నాశత్రువర్గము మిగులకుండఁ జేయుము. నేను నీ కై మరణించియైన నీకుఁ బ్రియముఁ గూర్తు నను భావ మిందభివ్యక్తమగును.

ద్రోణుఁడు దుర్యోధనుని దురుక్తులకుఁ గోపించి దుశ్శాసనశకునికర్ణులంగూడి తాన యర్జునుని వధింతునన్న యాతనితో నిట్లాడెను :

"కుడిచితి; కట్టితి; పెట్టితి; పుడమిసమస్తంబు నఖిలభోగంబుల నె
క్కుడుపేర్మి ననుభవించితి; తొడరుము వెఱపుడిగి పార్థుతోడఁ గుమారా!"

7.5.277

ఇందలి తొడరు మనువిధ్యర్థక క్రియకు తొడరకు మనువ్యతిరేకార్థము వ్యంగ్యము. నీవేడ? పార్థుఁడేడ? తొడరినచోఁ జత్తువనునర్థము వ్యంగ్యము. లేదా అనుభవింపవలసిన భోగములన్నియు ననుభవించితివి కావున నింకఁ జత్తు నను వెఱపుమాని పార్థునితోఁ దలపడుము. తప్పక చత్తువు. చచ్చిన నేమి? భూమిపై నీవుం డవలసిన కారణము లేదుగదా! యనునర్థము వ్యంగ్యము. పార్థునితోఁ బోరినచో నీకుఁ

జావుతప్పు దనుసూచన వ్యంగ్యము. 'వెఱపుడిగి' యనుటచే నింకఁజావనున్న నీకు వెఱవదియేల? విశృంఖలముగాఁ బోరి వీరస్వర్గ మలంకరింపు మనునర్థము వ్యంగ్యమగును.

ద్రోణధనంజయులు బ్రహ్మాస్త్రంబులఁ బ్రయోగించినవిధము :

"క్షితియుం బర్వతకోటియు న్వడఁకె; నగ్నిచ్ఛాయలయ్యేన్ దిశ
ల్చతురంభోనిధులుం గలంగె; భయలోలంబయ్యె దేవవ్రజం;
బతిసంక్షోభంబు నొందె నొక్కమొగి సైన్యద్వంద్వమున్ ద్రోణుఁడు
ద్ధతి బ్రహ్మాస్త్రము మౌర్వితో నియతమంత్రస్ఫూర్తి సంధించినన్."7.5.297

"అంతరంగమునం దొకయింతయేని యలుకులేక తనర్చి బ్రహ్మాస్త్రమునన
వేడుకకు మరలించినవిధముదోఁప నద్భుతంబుగ వారించె నర్జునుండు."
7.5.299

ద్రోణుఁడు బ్రహ్మాస్త్రము నుద్ధతితోఁ బ్రయోగించుటకు మత్తేభమును, అర్జునుఁడు వేడుకకు మరలించిన విధమును జెప్పుటకుఁ దేటగీతిని కవి గ్రహించుట యిట వ్యంజకము. ద్రోణాచార్యుని బ్రహ్మాస్త్రప్రయోగము లోకభయంకర మయ్యె ననునంశమును, అర్జునుఁ డద్దాని నవలీలగా మరల్చుట యనునంశమును నట నున్న యర్థము మాత్రమే కాక ఛందోగతి గూడ వ్యంజించుచున్నది.

కృపాచార్యునివలన పితృవధవృత్తాంతము వినిన యశ్వత్థామను గూర్చి ధృతరాష్ట్రుడు సంజయు నిట్లడిగెను :

"వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డశ్వత్థామ శ్రీరాముతో
సరిసేయందగువాఁడు దండ్రితల పాంచాలాత్మజుం డట్లు ని
ష్ఠురుఁడై పట్టె ననంగఁ ద్రుంచె నన వించున్ వారితోఁ గూడ నా
తురుఁడై పోయెనొ పోక నిల్చి యలుకన్ దోర్దర్పముం జూపెనో."7.5.331

ఇందలి యశ్వత్థామ విశేషణములన్నియు విశేషార్థస్ఫోరకములు. వరదివ్యాస్త్రవిదుఁడనుటచే నట్టి దివ్యాస్త్రములతోఁ దండ్రిని దుష్టముగా వధించినవారిని రూపుమాపలేదా? యనునభిప్రాయము వ్యంగ్యమగును. బాహుఘనుఁ డనుటచే చేతకానివాఁడను నేనేమి చేయుదునని నిరుత్సాహ పడవలసినవాఁడు కాదనునభిప్రాయము వ్యంగ్యము. 'శ్రీరాముతో సరిసేయందగువాఁడు' కావునఁ బితృభక్తితాత్పర్యముతో తప్పక పగదీర్చుకొను

నను భావము వ్యంగ్యమగును. 'పట్టెననంగఁ ద్రుంచెననన్' అని రెంటిని విడివిడిగాఁ బేర్కొనుటచే నేయొక్కటి చేయుటయు దుస్సహమే కాఁగా రెండును జేయఁగా నుపేక్షించునా? యనునర్థము వ్యంగ్యము. 'వారితోఁగూడ' ననుమాటచే నేమియుఁ బట్టనివానివిధమునఁ బోవుట యాత్మజున కుచితమెట్లగు ననునభిప్రాయము వ్యక్తమగును. ఇట్లు ధృతరాష్ట్రుని మదిలోని యశ్వత్థామ చేయవలసిన శత్రువధ స్వరూపమంతయు నిందభివ్యక్తమగును.

భీష్మునివెనుక నంతవాఁడైన యస్త్రగురుని మరణము నభివర్ణించిన యీయాశ్వాసము వీరరౌద్రాద్భుత బీభత్సరసమయమై యలరారును. ఘటోత్కచ విజృంభణమున రౌద్రము, ద్రోణుని ధృష్టద్యుమ్నుఁడు మడియించుటయందు బీభత్సము, నారాయణాస్త్ర ప్రయోగసందర్భమున నద్భుతము మున్నగునవి యిందుఁ దోఁచును. ద్రోణుని ధృష్టద్యుమ్నుఁడు వధియించిన విధానమున కర్జునుఁ డేవగించి పరమనిర్వేద పరుఁడగు సందర్భము అతనిగురుభక్తి తత్పరత నభివ్యంజించును. అట్లే గురుపుత్రుఁడు తండ్రి మృతివార్తవిని కోపదుఃఖములు పెనగొన విజృంభించుట రౌద్ర వీరరసములను పిత్రభిరతి నొక్కుమ్మడి నాస్వాదింపఁజేయును. ఘటోత్కచ మరణమునకుఁ గృష్ణుఁ డానందపడుట విస్మయజనకము. సాత్యకిధృష్టద్యుమ్ను లొకరి తప్పునొక రుటంకించి పరస్పరము శిక్షింపనెంచు భాగము భయానకరసమును బుట్టించును. వ్యాసాగమనము, నరనారాయణ మహత్త్వకథనము మున్నగు నంశములు శాంతరసవ్యంజకములుగా భావింపనగును. ఇట్లీ యాశ్వాసమున నించుమించు రసములన్నియు మేళగించి సహృదయ హృదయానంద సంధాయకములగుచున్నవి.

## కర్ణపర్వము - ప్రథమాశ్వాసము :-

కర్ణుమరణవార్త విని శోకించు సందర్భమున ధృతరాష్ట్రుఁ డిట్లాడెను :

"పౌరుష మేటికి; దైవం బేరూపునఁ జూడ ఫలద; మే మందము; దో
స్సారనితాంతోజ్జ్వలుఁడగు నా రాధేయుండు పచ్చె నర్జునుచేతన్." 8.1.28

ఇప్పటి ధృతరాష్ట్రుని యభిప్రాయమును బట్టి రాధేయుఁడు నిజమైన పౌరుషము గలవాఁడు; అర్జునుఁడు సాధారణమానవుఁడు. అతనికి దైవబలము తప్ప నాత్మబలము లేదు. ఇది ధృతరాష్ట్రునిచిత్తమున కెంతయు నొవ్వు గూర్చినది. కావునఁ గర్ణుని దోస్సారనితాంతోజ్జ్వలునిగా విశేషించి యర్జునుని నిర్విశేషముగాఁ బేర్కొనెను. దీనివలన నాతనికిఁ గర్ణునిపైఁ గల గాఢాభిమానమును, నర్జునునిపై గలయసూయయు నభివ్యక్తములగు చున్నవి.

కర్ణపర్వారంభము ధృతరాష్ట్రాలంబకమగుశోక ముద్వేత్తుగా వర్ణించుచుఁ గరుణరసజనక మగును. ఇం దాతఁడు రాధేయునియోధాగ్రేసరతను దలఁచిదలఁచి దుఃఖపడుట, తనయునిదిక్కుమాలినతనమునకు వివశుఁడై విలపించుట, పాండవులు భీష్మద్రోణుల వంచనమై వధించుట పేర్కొని యట్లే యీతని విషయమునందును నయ్యెనాయని శంకించుట, మూర్ఛమునుంగుట, తెప్పరిల్లుట, యుద్ధవృత్తాంతము కొంతవడి విననొల్లకుండుట మున్నగునంశములు కరుణరసవ్యంజకములై యలరు చున్నవి.

దుర్యోధనుఁడు ధర్మజున కోడిపాఱె నని విని ధృతరాష్ట్రుఁడు సంజయుని ట్లడిగెను:

"సమరము పెంపుసెప్పెదవు; సంజయ! చెప్పవు నీవు నీమహీ
రమణునిభంగి, ధర్మజుశరంబులచే విరథత్వమొంది మా
నముఁ జలముం దెగందొలఁగెనా మగుడం బురికొంట లేదె; ని
క్కము సెపుమా తనూజభుజగర్వవిహీనత నొంచెఁజిత్రమున్." 8.1.187

ఇందలి నీవు, నీమహీరమణుని భంగి యనుపదముల వలన ధృతరాష్ట్రునికోప మభివ్యక్తమగుచున్నది. నేను విన నుత్సుకత వహించిన విషయము నెఱిఁగి చెప్పవలసిన నీవు చవిగాని విషయములఁ జెప్పెద వేల? అలవుచలముల వహించి పాండవుల గెలుతునని తలఁచిన నీరాజు విక్రమించెనా? లేదా చెప్పు మనునర్థమిట వ్యంగ్యము. 'మానముఁ జలముం దెగం దొలఁగెనా'? యను ప్రశ్నలో నట్లుకాదని చెప్పుట నాశంసించు తాత్పర్య మభివ్యక్తమగును. 'మగుడం బురికొంటలేదె' యనుటలో లేకుండు టెంత యసహ్యమను భావమును వ్యక్తము చేయును.

దుర్యోధనుఁడు మద్రపతినిఁ గర్ణసారథ్యమునకై ప్రార్థించుచు నిట్లనెను :

"గురుఁడును భీష్ముఁడుం జనినఁ గొంచెపుమూఁకలతోడ నేను సం
గరవిజయంబు గోరి భుజగర్వమునన్ సడిసన్నపాండుభూ
వరసుతువర్గముం దొడరువాఁడనకా మది నిశ్చయించు టె
వ్వరిఁగొని? యింత నీ వెఱుఁగవా? నినుఁ గర్ణునిఁ గాదె నమ్మితిన్?" 8.1.246

భీష్మద్రోణులయనంతరము నిన్నుఁ గర్ణునిఁ గొని నమ్మకముతో సంగర విజయంబు గోరుదు నను నీదుర్యోధనోక్తిలో మీరు వారిరువురికంటె వీరవరులు, వా రీఁజాలని విజయము మీరిత్తురను ప్రశంస తోఁచి మద్రపతి వశీకృతుఁడు కావలయునను సుయోధనుని తాత్పర్య మిం దభివ్యక్తమగును. నీ వెఱుఁగవా? యను టాతని నుబ్బించి

కార్యము సాధించుకొనుట నభివ్యక్తము చేయును. 'భుజగర్వమునన్ సడిసన్నపాండు భూవరసుతువర్గమున్' ఇత్యాదికముచే మీముందు అట్టి పాండవులు నిలువఁజాల రని ప్రశంసించుట తోఁచును.

విజయుని జయించుటయే వీరవ్రతముగా జీవితలక్ష్యముగాఁ బాటించు కర్ణుని ప్రతాపమును, దక్కుంగలరథికుల యౌద్ధత్యము నీయాశ్వాసమున వర్ణింపఁబడినవి. ముఖ్యముగా ధర్మజుని యుధిష్ఠిరత్వ మిందు సార్థకమైనదని చెప్పనొప్పును. ఇట్టిది వీరరసప్రవణమై యలరారుచున్నది. కర్ణునికి సారథ్య మొనరించుటకై దుర్యోధనుఁడు మద్రపతి నభ్యర్థించుట, యాతఁడు కోపించుట, యాతఁ డనునయించుట, యాతని నంగీకరింపఁజేయుట యనువృత్తాంతమున దుర్యోధనుని కార్యసాధకత్వనైపుణి యభివ్యక్త మగుచున్నది.

## కర్ణపర్వము - ద్వితీయాశ్వాసము :-

సంకులనమరము సాగునప్పటికి కర్ణుని విజృంభణము వీరరౌద్ర రసస్ఫోరకముగా నుండుట నీక్రింది పద్యమునందలి సమాససంఘటన యెట్లభివ్యక్తము చేయుచున్నదో కాననగును. మహాప్రాణసంయుక్తాక్షరబాహుళ్యముకూడఁ దద్రసముల కిట వ్యంజకము.

"బాణజ్వాలలు బెట్టు పర్వ గగనప్రక్షోభణజ్వాలతా
క్వాణస్ఫూర్తి ఛటచ్ఛటారవముగాఁ గర్ణోగ్రదావాగ్ని య
క్షీణోదగ్రత వైరిసైన్యవనభస్మీభావనిర్వాహపా
రీణంబై వెలుఁగొందె నిర్జరులు వర్ణింపంగ నే మ్బుఁగన్." 8.2.184

ఈయాశ్వాసమునందలికర్ణశల్యులప్రసంగములు జుగుప్సావహములు. హంసకాకీయోపాఖ్యానము, అంగమద్రదేశాచారముల నుటంకించి వారు పరస్పరము నిందించుకొనుట మున్నగునవి యందం దేవగింపును గలిగించును. కర్ణునివిశృంఖల విహార మిందు వీరరసోత్పాదకమై యొప్పుచున్నది. అట్లే భీమశ్వత్థామాదులయుద్ధ విజృంభణమును రసోదంచితమై యలరారుచున్నది. భీముఁడు కర్ణు నోడించి మూర్ఛపుచ్చి నాలుకంగోయఁబూనుట రౌద్రరససంజనకము. కర్ణునికి సారథ్యముచేయ నంగీకరించి యథేచ్ఛముగ నిందించుచుఁ గర్ణమనశ్శూలాయమానవాగ్వ్యవహారము గలశల్యునిప్రవర్తన మాతనికిఁ బాండవులయెడఁగలప్రీతి నభివ్యక్తము సేయును. ఆశ్వాసాంతము నందలి ధర్మజునోటమి జాలిఁ బుట్టించును.

## కర్ణపర్వము - తృతీయాశ్వాసము:-

కర్ణునిచే దుర్భరపరాభవము నొంది యొడలుమఱచి సేమమరయవచ్చిన తన్నుఁ దూలనాడెడు ధర్మజునితలనఱకఁబూనిన యర్జునునితోఁ గృష్ణుఁ డిట్లనెను :

"అనినఁ గృపాణంబుగొని సవ్యసాచి యవ్విభు వ్రేయఁదలఁచినవిష్ణుఁ డెఱిఁగి
వాలు గేలనమర్పవలసినకత మేమి; కౌరవు లియ్యెడ లేరు; మనము
ధరణీశ్వరునిసేమ మరయంగ వచ్చితి; మీతనికుశల మిట్లేర్పడంగఁ
గంటిమి; సంతోషకాలంబుగా కిది క్రోధకాలమె? వధ్యకోటి యిచట
నేది గాఁగ నలిగి తీ; వని పలికిన రూక్షభంగియగుకటాక్షదృష్టి
యానరేంద్రుమీఁద నడరంగ నర్జునుఁ డమ్మురారి కిట్టు లనియె నధిప!"
8.3.67

ఈపద్యము వ్యంగ్యముగాఁ గృష్ణు డర్జునునకుఁ గార్యాకార్య వివేకము నుపదేశించుటను దెలుపును. వాలుగేల నమర్పవలసినకత మేమి? యనుప్రశ్నలో తండ్రివంటివాఁ డవమానపడి కోపగించినచో శత్రువులకడఁ దీయవలసినఖడ్గము నిచటఁ దీయుట యెంత యవివేకమో యూహింపు మనునర్థము గమ్యమానమగును. 'కౌరవు లియ్యెడ లేరు' అనుటవలన వారు నీకు వధ్యులు, ధర్మజుఁడు కాఁడు గుర్తింపు మనునర్థము వ్యంగ్యము. 'మనము ధరణీశ్వరునిసేమ మరయంగ వచ్చితిమి' అనుటచే మహాభయంకరమైనయుద్ధములోఁ బ్రవర్తిల్లుచు వీలుకానియెడ వీలుచేసికొని పరమభక్తిగౌరవములతో నన్నసేమమరయుటకు వచ్చి యిచ్చట నతఁడు కోపించెనని నీవును వివేకము గోల్పోయి వధింపఁబూనినచో భక్త్యాదులు మట్టిలోఁ గలియవా? వధించి నీవు ఆదుఃఖమును భరింపఁగలవా? అదియే లక్ష్యమైనచో ఈయుద్ధమేల? అతఁడు ధరణీశ్వరుఁడు. కావున నేదియైన మాటాడఁదగును. సేవకప్రాయుడవైననీ వుద్ధతి చూపనగునా? ఇది సేమమరయువిధమా? ఇత్యాద్యభిప్రాయము వ్యంగ్య మగును. 'వధ్యకోటి యిచట నేదిగాఁగ నలిగితి' వనుటలో ధర్మజుఁ డేమనినను నీకుఁ బూజ్యుఁ డేసుమా! యను హెచ్చరిక ప్రతీయమాన మగును. 'ఈవు' అనునది వివేకముగలవాఁ డవు, ధర్మజసంరక్షణతత్పరుఁడవు, శత్రువధచేసి యాతనికి మనఃప్రీతి గలిగింపవలసినవాఁడవు ననునర్థాంతరమున సంక్రమితవాచ్యమగును.

ఈయాశ్వాసమున 52వ పద్యముమొదలుకొని 112వ వచనమువఱకు గల భాగము రసవద్ఘట్టములలో వేలైనది. యుధిష్ఠిరుని తీవ్రకోపము,

అర్జునునిధర్మసంరక్షణతాత్పర్యము, శ్రీకృష్ణునిమెలఁకువతోడిశిష్టరక్షణప్రావీణ్యము, పాండవుల సౌభ్రాత్రము, శ్రీవాసుదేవునిపాండవప్రీతి మున్నగునంశము లిందుఁ జక్కగా నభివ్యక్తములగును. ప్రతిపదమున నేమియనర్థము జరుగునో యె ట్టిఘట్టము గట్టెక్కునో యనునుత్కంఠ సహృదయహృదయమున నిండి వేద్యాంతరమును విగళితమొనర్చును. మొత్తముమీఁద యుధిష్ఠిరార్జునులధర్మవీర మిందు వెల్లిగొనెను.

113 నుండి 129 వఱకు కృష్ణుఁడుచేసినయుపన్యాస మభిప్రాయగర్భితము. ఎంత తేర్చినను నర్జునునకు ధర్మజుఁ బదరినవిషాదము మదిలో మెఱమెఱలాడుచునే యుండును. ఆతని నాశోకమునుండి కోపములోనికిఁ బరువెత్తఁజేయవలయును. కావునఁ గౌరవులదౌష్ట్యము, కర్ణునివైమనస్యము, భీష్మద్రోణాదులయాశ్రితవాత్సల్యము మున్నగునవి యర్జునునకుఁదెలియఁజేసి యాతనిని కర్ణవధకు సిద్ధము చేయవలయును. లేనిచో నర్జునుడు నీరుగారిపోవునట్లున్నాఁడు. పార్థసారథి యీప్రయత్నవిశేషమంతయు నీవాగ్జాలములో నభివ్యక్తమగును. కావుననే కృష్ణుని వాక్యము లాలించి యర్జునుఁ డుత్సాహముఁబూని తా నే మేమి చేయునో కృష్ణునితో నిట్లు చెప్పుచున్నాడు :

"నీతోడ్పాటున నేఁ ద్రివిష్టపముల న్గెల్వంగ నూఁకింతు; నా
చేతం గర్ణుఁడు రూపుమాలి చను, మెచ్చింతున్ నినుం, జూడుమీ
దైతేయాంతక! యంచు శేషనిభహస్తం బుద్ధతిం జాఁచి ని
ర్ధూతారాతిబలుండు పుచ్చుకొనియెన్ దుర్దాంతకోదండమున్." 8.3.130

తనతోఁ బోరవచ్చినదుశ్శాసనుం గాంచి భీముఁ డిట్లు పలికెను :

"ఆసభలోనఁ గొన్నఋణమంతయు నీఁగఁగఁ గంటి వడ్డితో;
బాస కొకింతయుం దొలఁగఁబాఱకు; తీర్చెద నిప్డు; నేఁడు నా
చేసినపుణ్య మెవ్వరును జేయరు; నిన్నిటుసేరఁదెచ్చుటం
జేసి విధాత నాకుఁ గృపసేయుట గానఁగవచ్చెఁదమ్ముఁడా !" 8.3.195

ఇందలి 'తమ్ముఁడా!'యనునంబోధనము భీమసేనునిమహాక్రోధమును వ్యంగ్యమొనర్చును. మనమన్నదమ్ములమను భావము మీ కున్నయెడల నింతటియనర్థము జరిగెడిదా? పుట్టినదాది మమ్ముఁబరిమార్చుటకు యావచ్ఛక్తిని వినియోగించి సాఫల్య మందఁజాలకపోయిరి. అది నేనిప్పుడు గాంతునను భావ మిట వ్యంగ్యమగును. 'నా చేసినపుణ్య మెవ్వరును జేయ' రిత్యాదికముచే పగదీర్చుకొనఁ గలుగుచున్న హేతువున భీముఁడు పొందు నానందపారవశ్య మభివ్యక్తమగుచున్నది. 'ఆసభలోనన్' అనునది వస్త్రాపహరణాదిఘోరావమానముల నన్నింటిని స్మృతికిఁదెచ్చుట

నభివ్యంజించును.

193వ పద్యమునుండి 226వ పద్యమువఱకు భీమసేనుఁడు చేసిన దుశ్శాసనవధ వర్ణింపఁబడినది. పరమభయంకరమైనభీమసేనునివర్తన మిందు రసవంతముగాఁ దీర్చిదిద్దఁబడినది. రౌద్రరస మిందు మూర్తీభవించెనా యన్నట్లుండును. దుశ్శాసనుని వధించుట, బొమ్మగలఁజేసి రక్తపానముచేయుట, చచ్చినవానితో వాఁడు చేసిన పాపముల నుగ్గడించుట, స్వైరవిహారము సలుపుట యనునీయంశములు రసావతారసమర్థములై యానందదాయకములగుచున్నవి. మార్కొనువాఁడెవ్వఁడును లేక ప్రతీవీరు లందఱు జీచ్చవడియుండుట తదాలంబకమగుభయమును వ్యక్తము చేయుచు రౌద్రము నలంకరించుచున్నది.

రథచక్రము నెత్తునంత కేయకుండుట పాడి యనుకర్ణునితో నచ్యుతుఁ డిట్లు పలికెను :

> "ఏమీ ! తగవును ధర్మము నీమనమున నేఁడ పుట్టెనే; గర్వము ను
> ద్దామదురభిమానము నే లా మఱచితి; కర్ణ ! యా చలం బెటవోయెన్?"
>
> 8.3.353

పరులను నిష్కారణముగ హింసించునపుడు స్మృతికి రానితగవు ధర్మములు ప్రాణత్రాణపరాయణత్వమునకు నేఁడే పుట్టుట యెంత వింత? నీ వితరులయెడ వానినిఁ బాటించినచో నీయందితరులు వానినిఁజూపుదురు. అట్టిది లేదు గదా! జీవితమంతయు గర్వము నుద్దామదురభిమానమును బూని నేఁడు చచ్చుచో వానిని మఱచి దీనుఁడ వైనంత మాత్రమున ని న్నర్జునుఁ డొప్పరికించునా? ని చలమెట్టిదో యట్టిదే యర్జునుఁడు నీయెడఁ బూనవలయు ననుకృష్ణునియభిప్రాయ మిట వ్యంగ్యము. అర్జునునకుఁ గ్రోధోద్రేకము కలిగించు కృష్ణుని తాత్పర్య మిందభివ్యక్త మగును.

'కర్ణునొఁదలనె భారత సంహితనిల్చు' నని నడిసన్న మహావీరుని మహోదాత్త యుద్ధవీరము నాతనిమరణమును బ్రధానవృత్తములుగా నీయాశ్వాసము రూపుదిద్దుకొనినది. ఇందుఁ గర్ణార్జునుల పౌరుషములు వీరుల కుత్సాహమును, భీరులకు భయానకరసమును, నుదాసీనులకు అద్భుతరసమును బుట్టింపఁజాలియున్నవి. నానాస్త్ర ప్రయోగదక్షత కలరి శివబ్రహ్మేంద్రాదులును వచ్చి చూచి తారతమ్య వివేకమును జర్పించి రన్నచో కర్ణార్జునుల యతిమానుషతత్త్వ మభివ్యక్తమై విస్మయజనక మగు చున్నది. కృష్ణునిమహత్త్వ మర్జునునిఁ గాపాడుచు, కర్ణునిఁ గాలపురుషునిబారికిఁ ద్రోయుచు, నాతని యాశ్రితవాత్సల్య దుష్ట దూషణాభిరతులను వక్కాణించుచున్నది. ఏమైనను నేకవీరుఁడగుకర్ణునిలోకోత్తర

పరాక్రమాభీలత లిందు మూర్తీభవించి యాతనిదుర్నయమును దాత్కాలికముగా మఱపించి సర్వ జనులసానుభూతిని సాధించుటకు హేతువులగుచున్నవి. యుద్ధవీరమున కీఘట్టము పరసీమ యననొప్పును.

## శల్యపర్వము - ప్రథమాశ్వాసము :

దుర్యోధనమరణమును సంజయునిచే విని ధృతరాష్ట్రుడు విలపించు సందర్భమునందలి యొక పద్యము -

"విను; దుర్యోధనదుశ్శా సనులఁ బలికి పలికి నిచ్చచావుగ నప్పా
వనియలఁచుఁ గాన నడవికిఁ జనుట మేలైనతెఱఁగు సంజయ! నాకున్."

9.1.32.

ఇందుఁ బలికిపలికి యనుచోటిద్విరుక్తి పలుకుటలో భీమునికిఁ గల యిష్టమును ధృతరాష్ట్రునకగుకష్టమును వ్యంగ్యముగాఁ దెలుపును. అతఁడు పలికినపుడెల్ల తనకుఁ జావైనట్లుండును. వారలు చచ్చినందుల కేడ్చుటయా? ఈనిచ్చచావున కేడ్చుటయా? ఇది చావుకంటెను నధికదుఃఖకారణము. కావున వనగమనము మేలైన తెఱఁగను భావమిటఁ దోఁచును. ఈ పద్యార్థమును బట్టి పాండవులకుఁ దాను చేసిన యెగ్గులును, పావనియన్నచో నతనికిఁ గలభయాతిరేకమును నభివ్యక్తములగును.

ఈయాశ్వాసమున మొదటి నలువదిపద్యములు కరుణరసావిర్భావకములు. సర్వనాశనమయ్యెనని తెలిసి ధృతరాష్ట్రునితోపా టాతనివారందఱు దుఃఖించు నిఘట్టమును రసవంతము. ముఖ్యముగా ధృతరాష్ట్రునివిలాపము, అతఁడొక్కొక్కరి సామర్థ్యము నుటంకించి యదియెల్ల నాఱడియైపోయెనని చింతించుటయుఁ జక్కగాఁ జిత్రింపఁబడినవి. ప్రతినాయక పక్షమువాఁడైనను, దనయునిదుష్కృతులకుఁ దలయొగ్గి యనర్థమును గోరితెచ్చుకొనినవాఁడైనను ధృతరాష్ట్రుడు అందందు సమభావమును బ్రదర్శించుటచే సానుభూతికి లక్ష్యమగుచున్నాఁడు. కావుననే కరుణరసమును సంభావించుట.

పరమశోకావృతచిత్తుఁడై యున్న సుయోధనునిఁ గాంచి కృపార్ద్రచిత్తుఁడైన కృపాచార్యుఁడు మేలుమాటలఁ జెప్పుచు నిట్లు ప్రాక్రుచ్చెను;

"జ్యారవము నాదముగ నతి ఘోరత నైరు లనుకరటికోటికి రయదు
ర్వారంబగునర్జునకం ఠీరవము శితాస్త్రనఖపటిష్ఠతఁ జూపున్."   9.1.47

ఈ పద్యమునందలి సావయవరూపకమువలనను, రయదుర్వార మను విశేషణముచేతను భవిష్యద్యుద్ధమునఁ గౌరవవినాశ మెట్లనివార్యమో వ్యంగ్యముగాఁ జెప్పఁ బడినది. సింహమునకు గజమునకు జాతివైరము. అందు సింహవిజృంభణము గజమున

కనివార్యముగా మరణహేతువు. సింహ మాకృతిలోఁ బిన్నదైనను బరాక్రమములో మిన్న. గజమునకు సింహస్వప్నము కూడ మరణదాయకము. ప్రకృతపుసింహము శితాస్త్రనఖ పటిష్ఠత చూపనున్నది. ఇంక మనకు బ్రదుకులేకుండుట నిశ్చయ మనునభిప్రాయమిట వ్యంగ్యము.

యుధిష్ఠిరుని శక్తి ప్రయోగముచే మద్రాధిపతి మడిసినప్పటి స్థితి యీ క్రింది రెండు పద్యములం దభివర్ణింపఁబడినది :

(1) **"క్షతమున ముక్కునం జెవులఁ గన్నుల నొల్కెడు రక్త మంగ మా**
**ప్లుతముగఁ జేయఁగా నతఁడు బోరగిలంబడియెన్ ధరం గర**
**ద్వితయము సాఁచి ధర్మజునిదిక్కుశిరంబుగ వజ్రదారుణా**
**హతిఁ బడు భూరిభూధరమహత్తర శృంగముభంగి భూవరా!"** **9.1.285**

(2) **"భూమిమీఁద నిట్లు బోరగిలంబడి**
**మద్రనాథుఁ డొప్పె మానవేంద్ర!**
**లేమయురమునందు లీలమై వ్రాలిన**
**ప్రాణనాథుఁ బోల్పఁబట్టుగాఁగ."** **9.1.286**

బోరగిలఁబడుట, కరద్వితయము సాఁచుట, శిరము ధర్మజునిదిక్కగుట అనులక్షణములచే మద్రపతి తన్ను సంహరించుటకుఁ బరమేశ్వరుఁడే యుధిష్ఠిర రూపమున వచ్చెనని గుర్తించెనో యనునట్లును, లోకకల్యాణార్థ మాతఁడు చేయు సంహారము తన కభిమతమే యని చెప్పెనో యన్నట్లు సాష్టాంగదండ ప్రణామమాచరించి మృతిచెందె ననునుత్ప్రేక్ష వ్యంగ్యమగును.

భూమిమీఁద బోరగిలఁబడిన మద్రపతి లేమయురముననున్న ప్రాణనాథునివలె నుండె ననునీయుపమచే యుద్ధరంగమునఁ బడినశల్యుఁడు ప్రాణములుపోవు తుది క్షణమున సైతము దుఃఖమును మనసునకు రానీక పరమోత్సాహముతోఁ జచ్చిన స్వర్గకాంతలపరిష్వంగసుఖమందవచ్చునను నిండైన తృప్తితోఁ బోరె ననునర్థము ప్రతీయమానమగును.

ఈయాశ్వాసమున మద్రేశ్వరునియసమానవిక్రమము సమగ్రముగా వర్ణింపఁ బడినది. యుధిష్ఠిరుఁ డెన్నడు లేని విధమునఁ బోరి తన పేరు సార్థకముగావించుకొనెను. శల్యయుధిష్ఠిరనకులసహదేవుల యుద్ధోత్సాహమిందు వీరరసమై మించినది. నకుల సహదేవులు శకునిని వారి వారిని సంహరించి తమ ప్రతాపమును లోకఖ్యాత మొనరించుకొనుటయు నిందు వక్కాణింపఁబడినది.

## శల్య పర్వము - ద్వితీయాశ్వాసము :-

జలస్తంభనవిద్యచే ద్వైపాయనహ్రదమున డాఁగియున్న సుయోధనునితో ధర్మజుఁ డిట్లనుచున్నాఁడు :

"ఇటుతగునే సుయోధన: మహీవలయంబున నిట్టిదైన్య మె
చ్చుట వినఁ జూడఁగల్గెనె; యసంఖ్యులు రాజులు నీకుఁ గాఁగఁ జ
చ్చుటయును బంధుమిత్రులు విశుద్ధచరిత్రులు పోర నట్లు త్రుం
గుటయును జూచి; తేమిటికిఁ గ్రుంకితి నీళ్ళను; జావుదప్పునే?" 9.2.54

'మహీవలయంబున నిట్టిదైన్య మెచ్చుట వినఁజూడఁగల్గెనె' యను నీ వాక్యముచే నిప్పటి నీప్రవర్తనము పరమతుచ్ఛమైనది, అభిమానధనుఁడ వని పేరుగన్న నీకిట్టిది తగునా? యనునర్థము వ్యంగ్యమగును. అసంఖ్యులు, రాజులు... ఇత్యాదికముచే నెవ్వరో సామాన్యులు గారు, రాజులు, వారు నొకరో యిద్దఱో కారు, లెక్కింపనలవికాని సంఖ్యలవారు. మఱియు వారి చావు వారికేమైనఁ బ్రయోజనకరమా? కాదు. తోకచుక్కవలె లోకవినాశకారకుఁ డవైననీకొఱకై వారు నిర్విచారముగఁ జావఁగా నీవు బ్రదికియుండు టేమి పాడి? యనునర్థము వ్యంగ్యము. 'బంధుమిత్రులు, విశుద్ధచరిత్రులు' అనుటచే నట్టివారిని బొట్టనిడికొని నీయట్టి యశుద్ధచరిత్రుఁడు జీవించుటయా? యను భావము వ్యంగ్యము. 'చూచితి' అనుటచేఁ జూచి నీవు నేర్చుకొనినదేమియు లేదు. నీవు కులఘాతకుఁడవు, కృతఘ్నుడవు, మూర్ఖుఁడవు అను నీ మొదలగునభిప్రాయ మిందు వ్యంగ్యమగును.

గదాయుద్ధము తనకు సమ్మతమని చెప్పిన సుయోధనునితో ధర్మజుఁ డన్న మాటలు, దానికి సుయోధనునిరోషావేశము నీక్రింది పద్యమునఁ జూడనగును :

"అనుటయుఁ బొంగి ధర్మసుతుఁ డాతనితో గద నొక్కరుండ నేఁ
గొనియెద నీదు ప్రాణము లకుంఠితబాహువిలాసభాసినై
యనవుడుఁ బుట్టలోపలి మహాభుజగేంద్రుఁడు రోఁజునట్లు రోఁ
జె నధిప! యవ్విభుండు దనచిత్తము నప్పలుకుల్ గలంచినన్" 9.2.94

ఇంతవఱకు ధర్మజుఁడు పలికిన పలుకులకంటె "గదనొక్కరుండనేఁ గొనియెద నీదు ప్రాణములు" అనువాక్యము సుయోధనునికి మిక్కిలి కోపహేతువైనది. దుర్యోధనుఁ డు గదాయుద్ధమునఁ దనతో సాటియగువాఁడు లేఁడనియు, ధర్మజుఁడావిద్యలోఁ దనముం దెందుకుఁ గొరగాడనియు నను భావముగలవాఁడనుట యిందు వ్యంగ్యము. అట్టివాఁ డు తన్ను గదాయుద్ధమునఁ జంపెద ననుట తన విద్యాప్రాభవము నవమానించుటగా భావించి మహాభుజగేంద్రుడు రోఁజినట్లు రోఁజెననుట సార్థకమగుచున్నది.

గాంధారి నూఱడింపఁ గరిపురి కరిగిన కృష్ణుఁడు ధృతరాష్ట్రునితో మెల్లన నిట్లనియె:

"అకట! కులం బకారణమ యంతయు నాశము నొందె; నిట్టిదా
నికిఁ జొరనొల్లరైరి మహనీయచరిత్రులు నాఁడు పాండవు;
ల్సకలము నీవెఱుంగుదు చలంబును నీసును దక్కి నన్ను సం
ధికి నిటరా నొనర్పుట మదిం దలపోయు; మదెట్టిశాంతియో!" 9.2.363

ఇందు, పాండవుల దినుమంతయుఁ దప్పులేదు, దోషమంతయు మీవారిదే. కావునఁ జచ్చినవారికై దుఃఖించి చంపినవారిపైఁ గోపించి యిహపరములకుఁ జెడకు మనునుపదేశ మిందు వ్యంగ్యమగును.

'ఇట్టిదానికిఁ జొరనొల్లరైరి మహనీయచరిత్రులు పాండవుల్' అనుమాటచే దుష్టాత్ములగు నీతనయులుఁ గర్ణాదులు వారిని బలాత్కారముగా యుద్ధములోనికి దింపి రనుట మీకుఁ దెల్లమేకదా! యనునర్థము వ్యంగ్యము. 'సకలము నీ వెఱుంగుదు' వనుటలోఁ దెలిసితెలిసి నీవు పాండవులపైఁ గోపింపనవసరములేదనునర్థము వ్యంగ్యము. 'చలంబును నీసును దక్కి' యనుటలో నట్లు దక్కుట యసాధారణ విషయ మనునర్థము వ్యంగ్యమగుచుఁ బాండవుల యెడ దోష మాపాదించుటకు వీలులేదనునభిప్రాయమును వ్యక్తమునర్చును. 'మదిం దలపోయుము' అనుటలోఁ బాండవులమంచితనమే నీవు భావింపవలయుఁ గాని నీ కొడుకుల చావునకు హేతుభూతులై రని చింతింపఁబనిలే దను నర్థము వ్యంగ్యము. 'అదెట్టిశాంతియో' యనుటవలన వారి శాంతి యనిర్వచనీయ మట్టి దానిని విఱిచి వారిని యుద్ధమునకుఁ దెచ్చిన దోషమంతయు నీకుమారునిదే యనునర్థము ప్రతీయమానమగును. ఇట్లే తఱువాతియైందాఱు పద్యములలో పాండవులయెడఁ గోపింపవలదను నుపదేశ మనేక విధములఁ బ్రతీయమానమగుచున్నది.

సర్వకురుక్షేత్ర మహాయుద్ధమునకు నెవ్వనిమూర్ఖత్వము మూలకారణమో యట్టి సుయోధనుఁ డీల్గినవృత్తాంత మీయాశ్వాసమున వర్ణింపఁబడినది. భీమసేనాలంబక క్రోధ మిందు రౌద్రరసముగా మూర్తీభవించినది. శ్రీకృష్ణుని పాండవానురక్తి ప్రత్యక్ష స్వరూపముతో నిందు సాక్షాత్కరించినది. ఆ వాత్సల్యము నిరుపమానము. దుర్యోధనుని దుఃఖము, అశ్వత్థామక్రోధము, పాండవుల పశ్చాత్తాపము మున్నగు భావము లిందుఁ జక్కగా రూపుదిద్దుకొన్నవి. బలరామునితీర్థయాత్రాభిరతియు నిందు సరసముగా వర్ణింపఁబడినది.

## సౌప్తికపర్వము - ప్రథమాశ్వాసము :-

సౌప్తికవధకు నిశ్చయించినయశ్వత్థామకుఁ గృపాచార్యుడు హితబోధఁ జేయుచు నిట్లు పలికెను.

"క్రోధము లోభమున్ భయముఁ గూరినచిత్తముతోడ దుష్క్రియా
సాధనవృత్తి దుర్జనుఁడు సజ్జను లాఁగఁగఁజేయుకార్యముల్
బాధలఁ బెట్టకున్నె; సిరిపాయఁగఁ జేయకయున్నె వానిఁ; దీ
వ్రాధినితాంతదుఃఖహృదయత్వము దేరకయున్నె వానికిన్" 10.1.36

ఈ పద్యము వాచ్యముగా నీతిబోధగాఁ గానవచ్చినను, అశ్వత్థామయప్పటి స్థితికి సంపూర్ణముగా నన్వయించి యుపదేశము నొసఁగుచున్నది. తన తండ్రి మృతికి క్రోధము, జయమునెడలోభము, చక్కటి పరాక్రమమునఁ దన్నుఁ బాండవులు సంహరింతురేమో యను భయము - ఈ మూఁడును నాతనిహృదయమును లోఁగొని కపటోపాయమున నిద్రాసక్తులై యున్నవారిని దయాహీనతఁ జంపఁ దలంపుఁ బుట్టించినవి. ఆమార్గము ధర్మవ్యతిరేక మని సజ్జనుఁడగుకృపాచార్యుఁడు వారించెను. కాని యశ్వత్థామ చేయుటకే నిశ్చయించెను. 'ఓయీ! నీ యీ యకార్యమువలన, సిరిపాయును, యావజ్జీవము తీవ్రనితాంతదుఃఖహృదయత్వము గలుగును. ఒకింత వివేకముతో నామహాపదను వారించుకొనరాదా! యనుకృపాచార్యునుపదేశ మిట వ్యంగ్యము.

ఈయాశ్వాసము రౌద్రాద్భుతభయానకరసములసమాహారము. మహాక్రౌర్యము మదలౌ వల్లువయ్యి యుప్పొంగనయశ్వత్థామకిరాతకృత్యము లందు రసవంతముగా వర్ణింపఁబడినవి. ఉలూకముచే నువదేశమునొందుటయే యాతనిక్రౌర్యమునకు వ్యంజకము. కృపాచార్యుఁడు వ్యంగ్యధోరణిలో నాతనినిఁ దత్కాలమున శాంతుఁజేసినచోఁ దఱువాత నుద్ధతి యడఁగు నని చేసిన ప్రయత్నమున నాతనిధర్మబుద్ధియు (31-44 పద్యములలో) నభివ్యక్తమగును. అశ్వత్థామ చెదరని బుద్ధితోఁ దన చేయఁబూనినపనిని స్థిరీకరించుట యాతనిదీర్ఘక్రోధమును వ్యక్తము చేయును. ఈ సందర్భమునందే పాండవులన్నచో నాతనికిఁ గలభయమును జెప్పఁబడినది. భూతాకృతితోఁ దోఁచినశివునితో నీతఁడు పోరాడువఘట్ట మద్భుతభయానకరసముల కిక్క. మఱియు నాతఁ డాత్మోపహారమునకుఁ దలపడుటయు, శివుఁడు సాక్షాత్కరించి ఖడ్గ మొసఁగుటయు ననువృత్తాంతములు విస్మయమును బండించి యద్భుతరసమును నిండించును. ఆ పిదప నాతఁడు చేసిన ధృష్టద్యుమ్నాదివధయంతయుఁ బరమభయంకరమై భయానకరసమును రౌద్రమును బుట్టించును. వానిబారిఁబడిన వారి యాక్రందనములు కరుణరసోత్పాదకములు. ఉపపాండవుల వధను ఏకవృత్తముననే నడిపి వారి పరాక్రమమును, వధయును సమానములన్నయంశమును గవి వ్యంజించెను. లయకాల రుద్రునివలె శత్రుశిబిరమునేవుఁ గొంచెము సేపున నుడిపినయశ్వత్థామా

లంబకమగురౌద్రరసమిందుఁ బ్రధానము, తదితరము లన్నియు నంగములు. కృప కృతవర్మాశ్వత్థామలు తాముచేసిన వీర విహారము దుర్యోధనుని కెఱింగించుటయు నాతనినిఁ బ్రశంసించుటయు మున్నగు వృత్తాంత మావీరుల కాతనియెడఁ గల ప్రీతిని వారి స్వామిభక్తిని వ్యంజించును. జయార్హులైన పాండవులు దుర్జయులైన భీష్మద్రోణకర్ణాదుల నెపమిడి చంపుట యనుపాపమునకుఁ బ్రాయశ్చిత్తకాండవంటిదీ యాశ్వాస కథాభాగము. ఎంతటివాఁడైనను జేసిన పాప మనుభవింపకతీఱ దనునంశ మిందువలన సహృదయపాఠకున కుపదేశముగా వ్యక్తమగును. అశ్వత్థామకు శివుని యనుగ్రహము గలుగుట యనునది కాలప్రభావమును వ్యంజించును.

## సౌప్తికపర్వము - ద్వితీయాశ్వాసము :-

ఉత్తర గర్భమునందున్న తనయున కాయువు నిత్తు నని కృష్ణుఁ డనగా నశ్వత్థామ యిట్లు పలికెను.

"అనిన విని నగుచుఁ గుంభజ తనయుం డిట్లనియె: నస్త్రదగ్ధుని బ్రతికిం
చిన మేల కాదె; నీ వి న్ననువు నెఱింగెదము కాక - నరసఖ! దీనన్."10.2.85

ద్రౌణి నవ్వుటలో నాయస్త్ర ప్రభావము నీచేఁ దిరోహితముకాఁజాల దను భావము వ్యక్తమగును. 'అస్త్రదగ్ధున బ్రతికించిన మేలకాద' యనుట పరిహాసమును వ్యంజించును. 'నీ విన్ననువు నెఱింగెదముకాక' యనుట నీయాటలు నాకడసాఁగ వనునర్థమును దోఁపఁ జేయును. 'నరసఖ' యనుసంబోధనము నీ వర్జునున కెంతఁగా సమప్రాణుఁడవైనను ఈ విషయమున నాతనికి సహాయపడఁజాలవనురూపమున నశ్వత్థామదురభిమానమును వ్యంజించును.

పరమనికృష్టమార్గమున భవ్యచరిత్రులగు పాండవుల కపకృతిఁ గావించిన యశ్వత్థామను బాండవులు సాధించుట యీయాశ్వానమున వర్ణితము. ఇందుఁ బ్రారంభమునఁ జచ్చినవారికై విలపించుపాండవులశోక ముత్కటముగా వర్ణింపఁబడినది. అది కరుణరసపరిపూరితము. అట్లే ద్రౌపదీదుఃఖమును. అది కొంతసేపటికిఁ గ్రోధముగా మారి పాండవులఁ బ్రేరేచినది. బ్రహ్మశిరోనామకాస్త్ర ప్రయోగోపసంహారకథనము అద్భుత భయానకరసములఁ బ్రతీయమానమొనర్చును. అశ్వత్థామవర్తనము జుగుప్సావహమై గోచరించును. అశ్వాసాంతమునందలి శివమహత్త్వ ప్రతిపాదక కథాంశ మద్భుతరసావహము. ముగిసిన మహాయుద్ధమున కిది యొక శాంతిపాఠమువంటిదిగా భావింపనగును. శ్రీకృష్ణుఁడు పాండవులను, ఉత్తరగర్భమును గాపాడువృత్తాంత మాతని భక్తరక్షణకళాపారీణతను, మహత్త్వము నభివ్యక్తముచేయును. పరమనిగ్రహావరుడైన

వేదవ్యాసమునీంద్రుడు గూడ నశ్వత్థామకు శాపమిచ్చుట యనునంశముచే పాండవులు ధర్మమార్గనిరతులు, వారి కేరును గీ డొనరించుట యధర్మమను నాతని తాత్పర్య మభివ్యక్తమగును.

## స్త్రీపర్వము - ప్రథమాశ్వాసము :-

సర్వవినాశమైపోయిన పిదపఁ బట్టరానిదుఃఖమునఁ గుములుచు ధృతరాష్ట్రుఁ డిట్లేడ్చెను :

"సంధికిఁ గృష్ణుండు సనుదెంచి పెక్కుభంగులఁజెప్ప భీష్ముండు గుంభజుండు
నట్లు హితార్థులై యంతలంతలు మాట లాడిరి; జామదగ్న్యాదులైన
మునివరు లవ్విధంబున నొత్తిచెప్పి రా బుద్ధులన్నియును దుర్బుద్ధినగుటఁ
బాటింపనైతి; లోభమునఁ బాండునృపాలు పాలు తత్సుతులకుఁ బంచి యీని
నాకతంబునఁ బొలిసిరి నందనులును జెలులుఁ జుట్టంబులును సహాయులును; ధైర్య
మెట్లు కలుగు; వైదికముల కెట్లు మనసు గొలుపుఁ; బ్రాణంబుతో నెట్లు నిలువవచ్చు" **11.1.12.**

ఈ పద్యమున ధృతరాష్ట్రుఁడు పరాకాష్ఠనందిన తన హృదయమౌర్ఖ్యమును జక్కగా వ్యంజించి పశ్చాత్తాపమును వెలిగ్రక్కుచున్నాఁడు. వచ్చినవాఁడు సర్వలోకమునకు మాననీయుఁడ్డు హితమును గోరు కృష్ణుఁడు. ఎచ్చుటయు సంధికొఱకె కాని చఱచుటకుఁ గాదు. తానై చనుదెంచుటలోనే యాతనియాత్మీయత యభివ్యక్తమగుచున్నది. అట్లు వచ్చి యెట్లైనను బొందుగూర్పవలయునని యనేక విధముల సామాద్యుపాయములఁ బ్రయోగించి చెప్పెను. అట్లే తనకుఁ బితృస్థానీయుఁడై తనహితము తప్ప స్వార్థ మావంతయు నెఱుఁగనిపవిత్రచిత్తుఁడు భీష్ముఁడును, వేదధనుర్వేదముల నభ్యసించుటయే కాక కురుకుమారుల కందఱకు నాచార్యకమును వహించిన ద్రోణుఁడును, తనవలనను, దనతనయుని వలననుగలిగెడునవమానముల నన్నింటిని పరిగణింపక, యనిర్వచనీయమైన విధమున హితమునే కోరి యంత లంతలు మాటలాడిరి. తమయంత తాము తపముచేసికొనుచు లోకవృత్తమును బట్టించుకొనవసరము లేని జామదగ్న్యాదిమునులును నావంశము చెడుట కిష్టములేక అవ్విధంబున నొత్తి చెప్పిరి. ఇంద ఱిన్ని విధములఁ దనకై, తన కొడుకులకై చెప్పిన బుద్ధులన్నియును దుర్బుద్ధినగుటచే నాదరింపలేదు. దీనికంతటికిఁ గారణము సర్వవినాశహేతువగులోభము. ఆవలి వ్యక్తులు తనకు సంబంధములేనివారు కారు. తన తమ్మునిబిడ్డలే. తనకు రాజ్యమును గూర్చి భక్తిశ్రద్ధలతో నారాధించిన మహారాజు పాండునిసుతులు. ఇట్టియవివేకముతో నందఱఁ జంపుకొని దిక్కుమాలిన పక్షి నైతినను పశ్చాత్తాప మిందు రమణీయముగా వ్యంజింపఁబడినది. ఇందలి కృష్ణుఁడు

మున్నగుపదము లర్థాంతరసంక్రమితవాచ్యములు. అట్లు, అంతలంతలు, అవ్విధంబున మున్నగు పదములు వ్యంజకములు. ఈ సామాగ్రిచేఁ బైయర్థమంతయుఁ బ్రతీయమాన మగుచున్నది.

వీరరౌద్రబీభత్సాద్భుత భయానకరససమ్మిశ్రితమగు మహాభయంకర యుద్ధమునకు సిద్ధించిన ఫలము కరుణశాంతరసప్రవణమగు స్త్రీపర్వము. రాఁబోవు శాంత్యాను శాసనికపర్వముల కిది బీజప్రాయము. ఇందు ధృతరాష్ట్రుని దయనీయమైన శోక మొకవంక కరుణముగా రూపొందుచుండఁగా సంజయవిదురకృష్ణద్వైపాయనులమధుర సంలాపము లాచిచ్చు నార్పుటకైనయమృత సేచనమువంటివై శాంతరసస్ఫోరకములగుచున్నవి. సంజయునియూరార్పు లౌకికోపశమనవాక్యసమ్మిళితముకాఁగా విదురోక్తులు సంసార గహనత మున్నగుభావములతోఁ గూడి యెట్టివానికిని మోక్ష మార్గసందర్శకమగునిర్వేదమును బుట్టింపఁజాలియున్నవి. ఇఁక కృష్ణద్వైపాయనుఁడు సాక్షాదవతారపురుషుడు కావున నిటు లౌకికముగా నటు పారలౌకికముగా ధృతరాష్ట్రునితత్కాలచిత్తవృత్తి కనుగుణమగు వాగ్విన్యాసము నెఱపి శోకామర్ష క్షాళన పూర్వకముగా వైరాగ్యబీజముల ధృతరాష్ట్ర హృదయక్షేత్రమున నాఁటెను. కాని యాక్షేత్రము బీజప్రరోహజనకమగుటకుఁ దగిన విధముగా నార్ద్రముకాలేదు. ఇంకను దానియందు శోకక్రోధాగ్నిజ్వాల లెగయుచునే యున్నవి. ఈ స్త్రీ పర్వమున మొదటి యాశ్వాసమున 94వ పద్యము వఱకు జరిగినకథాంశ మీభావములతో నిండియున్నది.

భీమునియినుపరూపును నులినులిగా నొనర్చిన ధృతరాష్ట్రుఁడు మెఱమెచ్చునకై రోదనము చేయుచుండఁగా కృష్ణుఁడతనితో నిట్లాడెను :

"బలమున నీతో దొరయఁగ నిల నెవ్వఁడు గలఁడు నీమహితభుజశాఖల్
తలఁపఁగ బ్రళయాంతకు దంష్ట్రలు వీనిం దగిలి వశమె చాకుండంగన్?"11.1.134

ఇది పైకి ప్రశంసగాఁ గన్పట్టుచున్నను వ్యంగ్యముగా - నిందఁగా బరిణమించు చున్నది. బలమున నీతో..... ఇత్యాదివాక్యమువలన బుద్ధిబలముతో రక్షించు నేను లేకున్నచో నీపాటికి పాండవులు నీపాడుబలమువలనఁ బాడఱియుండెడి వారు. నీ వెంతటి పాపాత్ముఁ డవో కదా! యనునర్థము వ్యంగ్యమగును. నీమహిత భుజశాఖలు ప్రళయాంతకుదంష్ట్ర లనుటచే నవ్వవి ప్రళయమునకే తగును గాని ప్రణయమునకుఁ బనికిరావు. ఈ పాండవు లిట్టి నిన్ను గౌరవింతు రెంతటి శాంతిపరులో యనునర్థము వ్యంగ్యమగును. 'వీనిఁ దగిలి వశమె చాకుండంగన్' అనునది తక్కిన పాండవుల కొక హెచ్చరికను బ్రతీయమానమొనర్చును.

నీ విత్తఱిఁ గోపాయత్తచిత్తవై లాఘవమొందక మేదినివలె మేలైనయోర్పు నందవలయును సుమా! నీగురుసారధీరబుద్ధిని నుతించుజనమున కప్పుడు గాని తృప్తిగలుగ దని గాంధారి నూరార్చు కృష్ణద్వైపాయనోక్తులు మేదినీవృత్త గర్భితములై యుంట వ్యంజకము. క్షమాగుణమున క్ష్మాకాంతనుబోలు మను వ్యంగ్యార్థము నిటఁ గవి ఛందస్సుచే వ్యంజించెను :

మేదిని :

"విను మిటు లేటికిం జనినవృత్త మూఁది యల్గన్ జనము నుతించి నీదుగురుసారధీరబుద్ధిన్,
నిను నతిశాంతచిత్త యని నిక్క మేను గందున్; మనమున నిట్టి నీకగునె మత్సరంబు వత్సా!"
11.1.152

గాంధారి, దుశ్శాసనశోణితమానఁదగునా యని భీము నిట్లు ప్రశ్నించినది :
"వైరి ననిఁ జంపుదురు గాక; వ్రచ్చి నెత్తు రెత్తుకొని క్రోలు క్రూరాత్ము లెచటనైన
నెన్నఁడేనియుఁ గలిగిరే యీవుదక్క; నది వృకోదర! వృకవిధ మసురభంగి."
11.1.162

ఇందు 'ఎత్తుకొని' యనుపదమున నారక్తము ద్రావుట నీకెంతయో ప్రీతి పాత్రమైన దనునింద యభివ్యక్తమగును. 'వృకోదర' యనుసంబోధనము గూడ సాభిప్రాయము. అది యాతనియాఁకలి, తిండిపోతు లక్షణముచే భక్ష్యాభక్ష్యనిర్ణయము చేయలేని క్రౌర్యము నభివ్యక్తము చేయును. 'వృకవిధ మసురభంగి' యనుటచే నీవు క్రూరజంతువవో రాక్షసుఁడవో కావలసినవాఁడవు. మానవులలోఁ దప్పిపుట్టితి వనునింద వ్యక్తమగును.

ధృతరాష్ట్రుడు సపరివారముగాఁ బొలికలని కేఁగుటాదిగా నీయాశ్వాసము కరుణరసభూయిష్ఠము. ధృతరాష్ట్రుడు అయోమయభీమరూపమును బొడిచేయుట గాంధారితో ధర్మజుఁడాడిన మాటలు గాంధారి కోపశాంతికిఁ జక్కని హేతువులై యలరారినవి. కుంతీ గాంధారీద్రౌపదుల పరస్పరానునయములు కరుణరసమయములు. కృష్ణకృష్ణద్వైపాయనుల యాశ్రితవాత్సల్య మనుపమానము. ధృతరాష్ట్రునికాపత్యము జుగుప్సావహము.

## స్త్రీ పర్వము - ద్వితీయాశ్వాసము :

గాంధారి కర్ణునిఁ గృష్ణునకుఁ జూపి యిట్లు విలపించెను ;
"పాండు పుత్త్రుల భుజాబలమున కులుకక యెవ్వరి ప్రాపున నెదురనడచె;
దుర్యోధనుఁడు, గొంతితొలిచూలి కెవ్వఁడు హృదయశల్యంబయి నిదురసెఱుచు;
నట్టికర్ణుండు మదాంధసింధురము బ లోద్ధతద్విరద మహోగ్రవిక్ర
మమునఁ గీటడఁగిన మాడ్కి నర్జునుబలు గడిమిచేఁ దెగటార్చఁబడియె; వీని

బాహువిలసనమునఁ బడిన మహాయోధ వరు లనేకు; లితఁ డవార్యరోష దూషితుండు; పరుషభాషణశీలుండు; ధైర్యధనుఁడు; దానశౌర్యశాలి."11.2.86

ఇందలి 'మదాంధసింధురము' అనుచోటి మదాంధశబ్దముచే నాయాంధ్యమును దోషములేనిచోఁ దప్పక గెలిచియుండెడివాఁ డనునర్థమును గాంధారి సంభావించె ననుట వ్యంగ్యము. మదాంధసింధురము, బలోద్ధతద్విరదమహోగ్రవిక్రమము అను విశేషణములలోని తారతమ్యమువంటిది కర్ణార్జునులలోఁ గల దనునర్థముకూడ సంభావింపనగును. 'వీని బాహువిలసనమునఁ బడిన మహాయోధవరు లనేకులు' అను వాక్యమునందలి విలసనము, మహత్, వరులు, అనేకులు అనుపదములు కర్ణుని లోకోత్తరసామర్థ్యాభివ్యంజకములు. అవార్యరోషదూషితుఁడు, పరుషభాషణశీలుఁడునని రెండు దోషోద్ఘాటనలక్షణములను, ధైర్యధనుఁడు, దానశౌర్యశాలి యని రెండు గుణప్రశంసారూపవిశేషణములను జెప్పుటలో నితనిలో గుణదోషములు సమానమైన పాళ్లలో నుండి కీర్తికిని వధమునకును గారణములైన వనునర్థమును వ్యంజించును.

ఈయాశ్వాసము బీభత్సరస మంగముగా నున్న కరుణరసముతో నిండారినది. చచ్చినవారియంగములు, రక్తనదులు, వానిని పీకికొని తిను పశుపక్ష్యాదులవిహారములు మున్నగునవి పేరు పేరున వర్ణింపఁబడినవి. అట్లే గాంధారి యొక్కొక్క మృతవీరుని ఘనతలను బేర్కొని వారి తత్కాలదీనావస్థల నుగ్గడించి వారివారు వారికై యేడ్పుధోరణులను బూసఁగ్రుచ్చినట్లు వక్కాణించువైఖరి పాషాణములను గూడఁ గరఁగించునంతటి కరుణరసమును బ్రతీయమానమొనరించును. కుంతి కర్ణుఁడు తనపుత్రుడఁని యెఱిగింపఁగా నెల్లవారి శోకములు దుర్భరములైనవి. ముఖ్యముగా ధర్మజుఁడు పొందిన వేదనాతిశయము నిరుపమానము. ఇట్లీయాశ్వాసము కరుణరసము జాలువాఱు పరమోదాత్తఘట్టము.

## శాంతిపర్వము - ప్రథమాశ్వాసము :-

దేవలాదిమహామునివర్గముతో ధర్మజుని సంభావింపవచ్చిననారదుఁ డందఱయనుమతంబున నతనితో నిట్లని పలికెను :

"గోవిందుం డనిశంబు శోభన మెదం గోరంగఁ; బార్థుండు ద
ర్పావేశోజ్జ్వలబాహుసారమహనీయస్ఫూర్తి శోభిల్ల గాం
డీవోల్లాసవిభాసియై సమరపాండిత్యంబు వాటింప సం
భావింపన్ జగమెల్ల; రాజ్యమిటు లొప్పం గొంటె రాజోత్తమా?" 12.1.3

గోవిందుఁడు, భూమికి, వేదములకు, వాక్కులకు, నింకను నట్టివానికి

ప్రీతిసంధాయకుఁడు. తనకుఁ దానై నీశోభనముఁ గాంక్షించుచున్నాఁడు. నీవెంత యదృష్టవంతుఁడవో కదాయను ప్రశంస యిటఁ దోఁచును. ఆకోరుటయు నేదో యొకకాలమునఁ గా దనిశమును. కావున సర్వకాల సర్వావస్థలలో నీకేయాపదయు ఘటిల్ల దనునర్థము ప్రతీయమానమగును. అదియు నిచ్ఛకమునకుఁ గాక హృదయ పూర్వకముగాఁ గోరు ననునర్థ 'మెదన్' పదము ద్యోతకముచేయును. 'కోరంగన్' అనుటచే నీప్రార్థనపై నీయందనుగ్రహించుట కాదు. తనంతతానే పూని నీకు శుభమొడఁగూర్చు ననునర్థము సిద్ధించును. ఈవాక్యభాగముచే నీ మహనీయత, పుణ్యాత్మతయు ననితరసాధారణము లనునర్థము వ్యంగ్యము. అట్లే భగవానుని భక్తసులభతయు నిందు వ్యజ్యమానమగును. 'దర్పా...... ....... ....... స్ఫూర్తి' యను పదము పార్థునియకుంఠితపరాక్రమమును దెలుపును. 'గాండీవోల్లాసవిభాసి' యను విశేషణము శత్రుదుర్భేద్యత్వము నభివ్యక్తము చేయును. 'సమరపాండిత్యంబు పాటింప' ననుట నీవుచేసిన సమరము దోషభూయిష్ఠము కాదను నర్థమునకు వ్యంజకము. 'సంభావింపన్ జగమెల్ల' అనుటచే యుద్ధమున భీష్మాదివధ మపకీర్తికరము కాదను నర్థము స్ఫురించును. జనులది దోషముగా భావించి నిన్ను నిందింపరని తాత్పర్యము 'రాజ్య మిటు లొప్పంగొంటె' యనుట నీవు రాజ్యస్వీకారము చేయుట ప్రశస్తమైన విషయము. ఏవోశంకలు మనమున నిడుకొని బాధపడవల దనునర్థమును వ్యంజించును. రాజోత్తమా! యనుసంబోధనము దైవమానుషబలసంపన్నుఁ డవైన నీవు రాజులలో నుత్తముఁడవు. కావునఁ బ్రజలు నీయేలుబడిని మన్నింతు రను నర్థమునకు వ్యంజకము. ఇట్లే పద్యమంతయు రాఁబోవు ధర్మరాజు హృదయావేదనను అంతర్ముఖులై గమనించి ముందే యుపశమనవాక్యములాడు ఋషులయభిప్రాయమును నాతనియెడ వారికిఁగల ప్రీతివిశేషము నభివ్యక్తము చేయును.

కర్ణునిమృతికిఁ గారణములను నారదుఁడు ధర్మజునితో నిట్లు వచించెను :

"వినుము-నరేంద్ర! విప్రు డలిగెన్; జమదగ్నిసుతుండు శాప మి
చ్చె; నమరభర్త వంచనముచేసె; వరంబని కోరి కుంతి మా
న్చె నలుక; భీష్ముఁ డర్థరథుఁజేసి యడంచెఁ; గలంచె మద్రరా
జనుచితమాడి; శౌరి విధి యయ్యెఁ; నరుం డనిఁ జంపెఁ గర్ణునిన్." 12.1.35

ఇందుఁ జెప్పినకారణపరంపరచేతఁ గర్ణుచావునకు నీవు కారణముకాదు. అతఁ డు నీయన్న యనువిషయ మెఱుఁగవు. శౌరి విధియై పూనఁగా నాతనికిఁ జావకుండు టలుగలదా? మఱియు నతఁడందఱ కనిష్టుఁడగుటచే నాతనిభాగధేయమే యాతని జంపెనని తలంపుము. దీనికై నీవు విచారింపఁబనిలే దనునర్థము వ్యంగ్యము. మఱియుఁ

గర్జునియెడ ధర్మజునకు భ్రాతృగౌరవముఁ దొలగించు నారదుని తాత్పర్య మిందుఁ దోఁచును. పరశురామునికడ విద్యాభ్యాసవృత్తాంత మెఱిఁగించి 'యివి మీయన్నపోయినపోకు' లనుటయు నీభావమును సమర్థించును.

ధర్మజునితో ననిలతనయుఁ డిట్లు పలికెను :

"నీ వడవికరుగ నొడఁబడి నీవెనుకన వచ్చునపుడు నిందింతురు మ

'మ్మీమెఱ్ఱు లితని మాన్పం గా వలఁతురు గార' యని జగజ్జను లధిపా!"12.1.65

ఇట 'నీవెనుకన వచ్చునపుడు' అనుటలో నీ వింతకుముందు 'ఏనొల్ల మహిమీర కైకొనుం' (45) దంటివి; మేమంత యవివేకులమును స్వార్థపరులమును గాము. మాకు నీతోడిదే లోక మనునర్థము ప్రతీయమానమగును. మమ్ము నిందింతురు అనుటలో ననుసరించు మమ్మే నిందించినచో నాయకుఁడవగు నిన్ను నిందింతురనుట వేఱచెప్పవలయునా? నిందించినచో నాకేమి యనకుము. 'సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే' యనున్యాయమున నది దుర్భరమగు ననునర్థము వ్యంగ్యమగును. 'జగజ్జనులు' అనుటచేత నెవరో కొందఱు కాదు. స్త్రీపురుషభేదము లేక, బహుసంఖ్యాకులు నిందింతు రనునర్థము వ్యంగ్యము.

సకలబంధువధ మొనరించి పొందినమహాపాపమునకుఁ బ్రాయశ్చిత్తముగాఁ దపస్వినై వన మేఁగుదు ననుధర్మజుని పరమనిర్వేద మీశాంతిపర్వప్రథమాశ్వాసమున రమణీయముగా వర్ణింపఁబడినది. భీమార్జునులును, ద్రౌపదియు, కృష్ణ కృష్ణద్వైపాయనులును బహువిధములఁ జెప్పువాక్యములందు వారికి ధర్మజునియెడఁ గల యనురాగాతిశయము తోఁచుచున్నది. ఎట్టకేలకు ధర్మజుఁడు రాజగుట కంగీకరించుటయుఁ, బట్టాభిషిక్తుడై యాయావ్యక్తుల నాయాపనులయందు నియోగించుట, ధృతరాష్ట్రుని నన్మానించుట యనువృత్తము లాతని ధార్మికత నభివ్యంజించును.

## శాంతిపర్వము - ద్వితీయాశ్వాసము :-

శ్రీకృష్ణుడు భీష్మునిట్లు ప్రశంసించెను :

"రాజటె; రాగహీనుఁడటె; రాజితసుందరమూర్తియట్టె; వి

భ్రాజితసంపదున్నతివిభాసితవర్తనుఁడట్టె; కామినీ

రాజిమనోజ్ఞభంగిచతురత్వధనుండటె; బ్రహ్మచర్యదీ

క్షాజితమన్మథుండునటె; జన్మము లిట్టివి యెందుఁ గల్గునే!" 12.2.103

ఇందలి 'యటె' యనునిపాతముల యావృత్తి యాయాగుణముల

యేకత్రావస్థానాసంభవత్వమునకుఁ బ్రత్యాయకమగుచు సంభవముచేసిన భీష్ముని ఘనతను వక్కాణించుచున్నది. రాజు మిక్కిలి భోగభాగ్యముల సమృద్ధికలవాఁడు. అట్టివాఁడు రాగహీనుఁడగుట దుర్లభము. మహారూపవంతుఁడు దురభిమానగ్రస్తుఁడై సాధారణముగ సత్ప్రవర్తనకుఁ దావీఁడు. కాని యవి రెండు నిందుఁబొందిపొసఁగియున్నవి. కామిని - కామింపఁజేయుటలో సడినన్నది. అట్టివారి సముదాయమునకు మనోజ్ఞమైన విధముగల చాతుర్యము ధనముగాఁ గలవాఁడు. అయినను బ్రహ్మచర్యదీక్షతో దుర్ధర్షుఁడగు మన్మథుని జయించినవాఁడు. కావుననే భీష్ముఁడు కృష్ణభగవానుని ప్రశంసకెక్కి వరిష్ఠుఁడగుచున్నాడు.

శ్రీకృష్ణుఁడు భీష్ముని ధర్మజునకు ధర్మప్రబోధముచేయుమని నియోగించుటయు నాతఁడనేక ధర్మముల వక్కాణించుటయు నీ యాశ్వాసమునఁ జెప్పఁబడినది. కురుక్షేత్ర మహాసంగ్రామమున జరిగిన వీరరౌద్రభయానకాదిరసములకు శాంతినిఁ గలిగించు నీ శాంతిపర్వము సాధారణముగా దైవధర్మపురుషార్థ స్వరూప నిరూపణ పరమై మోక్షమార్గదర్శనచణమై యలరారుటచే నిందు శాంతరసము సంభావ్యము. తద్రసమునకుఁ గావలసిన నిర్వికారచిత్తవృత్తిత్వము నియ్యది పరంపరాక్రమమున సాధించుటంబట్టి శాంతరస మిట నూహింపఁబడుచున్నది. ఈయభిప్రాయమీ పర్వమునం దించుమించుగా నన్నియెడల ననుసంధించుకొననగును.

## శాంతిపర్వము - తృతీయాశ్వాసము :-

నష్టములగు ధనములకు వగవరాకునికిఁ దెలుపుచు భీష్ముఁడు ధర్మజున కిట్లనియె :

**"జననీజనకులును సుహృ జ్జనులును దెగునపుడు గావఁజనమి దెలియదే;**
**ధనములు వారలకంటెనె; మనుజేశ్వర ! వగవు వాని మడిగించునొకో."12.9.29**

దేహ మిచ్చి బాల్యమున మల మూత్రాదుల కేవగింపక యనుక్షణము రక్షించువారు తల్లిదండ్రులు. *"అత్యాగసహనో బంధుః సదైవానుమత స్సుహృత్, ఏక క్రియం భవేన్మిత్రం, సమప్రాణః సఖా మతః"* అను న్యాయముచొప్పున సర్వకాల సర్వావస్థలయందును ననుగుణ ప్రవర్తనగలవారు సుహృత్తులు. మానవున కీముగ్గురకు మించిన పెన్నిధానము లేదు. కాని వారు మరణించినను నిష్క్రియుఁడై యుండుటయే కాని మఱియేమియుఁ జేయఁజాలనినరుఁడు అచిరాంశువిలాసచంచలములైన ధనములకు వగచు టెంత యవివేకము! అనునర్థ మిట వ్యంగ్యము.

భీష్ముఁడు ధర్మరాజున కరిషడ్వర్గాదులను దెలుపుచు నాతనిలో నివి లే వని యిట్లు పలికెను:

"అధిప:యివి ధార్తరాష్ట్రులయందుఁ జాలఁ గలిగియుండు; నీబుద్ధి నొక్కండుఁ జొరదు;
సారధీరతాసంపదుదారమతివి; గాన యింకను నిర్జింతు వీనినెల్ల."12.3.424

'సారధీరతాసంపదుదారమతివి' యను హేతుకథనముచే నీయం దభిమానముచేఁ జెప్పుటలేదు. సకారణముగానే వచించుచున్నాఁడ నిది యిచ్ఛకము కాదను నభిప్రాయము వ్యంగ్యము. మఱియు నరిషడ్వర్గములనిరాసము చేయఁగోరువాఁ డిట్టి లక్షణముల నలవరించుకొనవలయు నను నుపదేశమును వ్యంగ్యము. ఇవి ధార్తరాష్ట్రులయందుఁ జాలఁగలిగియుండు ననుటచేతను, 'ఈ యాఱింటను నకలాపాయంబులు మానవులకుఁ బాటిలు' నని యింతకుపూర్వము చెప్పియుండుటచేతను (422) ధార్తరాష్ట్రులచావున కివియే కారణములు కాని నీవు కాదు. కావున దుఃఖపడ వల దనునోదార్పు వ్యంగ్యముగాఁ దోఁచును.

## శాంతిపర్వము - చతుర్థాశ్వాసము :-

భీష్ముడు మోక్షకాంక్షి నిగ్రహస్వరూపము నిట్లుగ్గడించెను :

"మనసును వాక్కును గాయంబు నియంత్రితములుగఁజేసి పొందుదురు ధనం
బునకై ముచ్చులు, దానిం గనుగొనఁగావలదె మోక్షకాంక్షికి వత్సా!"12.4.313

మనఆదులను నియంత్రిత మొనరించువారు నింద్యజీవనులగుముచ్చులు. సాధించెడిఫలమన్ననో యనిత్యమగుధనము. దీనివలనఁ బేరును బెంపును లేదు. సరికదా పట్టువడినచో ప్రాణాపాయము ఘటిల్లును. ఇఁక మోక్షమన్నచో నిత్యము. శాశ్వతానంద నంధాయకము. దీనికై యతించుట సర్వజనవంద్యమగువిషయము. ఇట్టి నిత్యసత్యానందదాయి యగుమహాధనముకొఱకై మనోవాక్కాయముల నియంత్రితముగాఁ జేయవలయుట సువిదితముగదా! యన నర్థమిటఁ బ్రతీయమాన మగును.

బలిచక్రవర్తి ఖరరూపమున నుండఁగా నాతని గుర్తించి దేవేంద్రుఁడిట్లనెను :

"ఉముక దినుచు నిట్టు లుండి నీతొల్లింటి లీలఁ దలఁచి యుమ్మలింతొ; లేదొ;
యున్నరూపు సెప్పవన్న గార్ధభరూప ధారణైకనిపుణదానవేంద్ర!"12.4.391

నీ వొకప్పుడు మహాగర్విష్ఠివై, మహాప్రాభవముతో లీలగా జీవించితివి. ఇప్పుడు పరమనీచమైన బ్రదుకు బ్రదుకుచున్నావు. దీనికి నీకు దుఃఖముగలదా? లేదా? ఉన్నరూపుచెప్పు మనుటలో నీ నీచరూపమున కనుగుణముగా నీచబుద్ధి వహించి యసత్యమాడవలఁ దనుట వ్యంగ్యము.'గార్ధభరూపధారణైకనిపుణ' యనుసంబోధనమున నెంతయో వెక్కిరింత యభివ్యక్తమగును.

## శాంతిపర్వము - పంచమాశ్వాసము :-

"పరమసంవిదేకాయనుండగుకృష్ణద్వైపాయనుండు కృతార్థీభూతచేతస్కుం డగు నందనుప్రతిపత్తికి నభినందనవిశేషంబుగా నధ్యాత్మవిద్యావిలాసవిషయంబు లగువాక్యములు మఱియు ననుగ్రహించె."

ఇందలి 'మఱియు' ననుపదము వ్యంజకము. "నాపృష్టః కస్యచిద్బ్రూయాత్" అని ధర్మశాస్త్రమున్నను, "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా, ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః" యనుగీతోక్తి యున్నను వ్యాసునికి కుమారుని ప్రతిపత్తి యతనియం దత్యంతాదరాతిశయమును గల్గించినది. కావుననే యత డడుగని విషయములను గూడ నతడు పరమకారుణ్యముతో ననుగ్రహించెను. దీనివలన వ్యాసునిహృదయపరితోషము, సద్గురుతత్త్వము నభివ్యక్తము లగుచున్నవి.

మేధాతిథి యను ముని తనకుమారుఁడైన చిరకారి యనువాని నొక్క కారణమునఁ దల్లిని వధింపుమని యాజ్ఞాపించెను. అప్పు డాతఁడు తండ్రిమాటను విని తల్లిని వధించుట కర్తవ్యమా? తండ్రి మాటను బాటింపక తల్లిని రక్షించుట కర్తవ్యమా? యని విచారింప మొదలిడి యొకనిశ్చయమునకు వచ్చులోపలఁదండ్రి పశ్చాత్తాపముఁ జెంది భార్యను గాపాడఁదలఁచెను. తనయుఁ డెట్లును వేగిరపడఁ డని యాతఁ డెఱుఁగును. కావున వచ్చి భార్యను సంరక్షించుకొనెను. చిరకారి యాలోచనము సుదీర్ఘమై యనర్థనిరాసకమయ్యె నను నర్థమును దీర్ఘాలోచనమును వదునొకండుపద్యములలో వర్ణించి యాతని చిరకారిత్వమును గవి చక్కగా వ్యంజించెను. రచన వ్యంజకమగుట యనునొకపద్ధతి కట్టి ఘట్టము లుదాహరణములు.

## శాంతిపర్వము - షష్ఠాశ్వాసము :-

ధర్మజుఁడు భీష్ముని క్షరాక్షరతత్త్వమును వివరింపుమని ప్రార్థింప దానికై వసిష్ఠజనకసంవాదమును భీష్ముఁ డిట్లారంభించెను :

> "అనఘ! సుఖాసీనుఁడైన వసిష్ఠసం యమిఁ గాంచి భక్తిఁ బాదముల కెఱఁగి
> జనకభూనాథుండు వినయంబుతోడ నుపాసించి 'మునివర! యక్షరం బ
> నాదిశివంబన నపునరావృత్తి సి ద్ధిద మగుచుండు నెయ్యది యెఱుంగఁ
> జెప్పవే' యనుడు నాశ్రితవత్సలుండగు నమ్మహాత్ముఁడు దెలియంగఁజెప్పె." 12.6.3

ఇందలి సుఖాసీనుఁడైన యనుపదముచేత జిజ్ఞాసు వుపదేశకునిమనః ప్రసన్నత నరసి యడుగవలయు నను నర్థము వ్యక్తమగును. 'భక్తిఁబాదముల కెఱఁగి' యనుటచే జ్ఞానమహాధనలబ్ధికై యహంకారనిరసనము చేసికొని గురువునకుఁ బ్రణిపాతము

చేయవలయు నను నర్థము వ్యంగ్యము. 'భూనాథుఁడు వినయంబుతోడ నుపాసించి' యనుటచే నేను గొప్పవాఁడ ననుగర్వమును విడనాడి సేవాతాత్పర్యముతో వేదితవ్యమును దెలియఁదగు నను నర్థము వ్యంగ్యము. 'మునివర' ఇత్యాదివాక్యము పరిప్రశ్నము విధానమును వ్యక్తము చేయును.

ఇట్లు -

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః"

ఈనుగీతావాక్యార్థ మిట వ్యంగ్యముగాఁ బ్రతిపాదింపబడినది.

భృగునామకవిప్రున కొక్క బ్రాహ్మణుఁడు పద్మఁడనునాగపతివృత్తాంతమును వివరించి 'యాతఁడు నీకోరిక తీర్చు, పొ' మ్మనుట:

(1) "పద్మఁడనుపేరియన్నాగపతి యుదాత్తుఁ; డఖిలధర్మజ్ఞుఁ; డతులదయాన్వితుండు
సుజనసంభావ్యమానుఁ డస్తోకపుణ్య నియతనిత్యుఁ డాగంతుకప్రియతముండు."

12.6.558

(11) "అతనిఁ గానఁ బొమ్ము; ప్రచురాదరణంబున నీదుకోర్కి సం
ప్రీతిగఁ దీర్చు నాగుణగరిష్ఠుడు....." 12.6.559

మొదటి పద్యమునందలి విశేషణము లన్నియు విశిష్టార్థప్రత్యాయకములై రెండవ పద్యమునందలి యర్థమును సమర్థించును. ఉదాత్తుఁడు కావున నిన్నుఁ ద్రోసి పుచ్చక యాదరించును. ఆదరించిన మాత్రమున నేమగు జ్ఞాతవ్యమైనయర్థము నెఱుంగు టెట్లన నాతఁడు అఖిలధర్మజ్ఞుఁడు కావున నేదైనఁ జెప్పఁగలఁడు. అఖిల ధర్మజ్ఞుఁడు కావచ్చును జెప్పవలయును గదా యని శంకింపకుము. అతులదయాన్వితుఁడు కావునఁ 'గేవలకృప నజ్ఞానికి నుపదేశవిధిఁ బ్రకాశము' చేయవలయునను దయాస్వభావముగలవాఁడు కావునఁ దప్పక చెప్పును. నన్నుపదేశమునకు అనర్హునిగా సంభావించు ననియుఁ దలఁపవలదు. అతఁడు సుజనసంభావ్యమానుఁడు గావున నీచే సంభావింపఁబడి తప్పక నీయర్హత గుర్తించును. అతఁడు ధర్మజ్ఞుఁడు కావచ్చును గాని యాచరణలేనివాఁడేమో యను సందియము వలదు. ధర్మాచరణ తత్పరుఁడై యస్తోకపుణ్యానియతనిత్యుఁ డయ్యెను. తాను ధర్మాచరణమున నిమగ్నుఁడై దయాగుణము ప్రేరేపఁగా నేదియో కొంచెము చెప్పి పంపివేయు నని భావింపకుము. నీవంటి యాగంతుకులయందలి ప్రియముచే నాతఁడు నిన్ను సంపూర్ణముగా సమాదరించును. ఈయర్థ విశేషమంతయు నీవిశేషణములచే నభివ్యక్తమగును.

శాంతిపర్వము భారతము పంచమవేదమను నానుడిని సార్థకపఱచు జ్ఞాన విజ్ఞానకోశము. ఇందు పురుషార్థపరిపూర్ణతకుఁ గావలసిన మార్గములన్నియుఁ జక్కగా

విపులీకరింపఁబడినవి. ఒక విధముగాఁ జూడఁగా శాంత్యానుశాసనికపర్వములు మహాభారత కథాసారభూతములని చెప్పనొప్పును. వేదవ్యాసభగవానుఁడు ఏతద్గ్రంథము ద్వారమున నేది లోకమునకుఁ జెప్పఁదలఁచుకొనియెనో యదియెల్ల నవనీతసదృశముగా నిందు నిక్షేపింపఁబడినదని భావింపనగును. ఇందుఁ జెప్పిన ధర్మతత్త్వ విశేషములన్నియు సూటిగానో, పరంపరాక్రమముననో మోక్షపురుషార్థ లక్ష్యములుగా నుండుటచే నొండు రెండు ఘట్టములు తప్పఁ దక్కనయన్నింటియందును శాంతరసమును సంభావింపవచ్చును. జిజ్ఞాసలో ధర్మజునియొక్కయు వివక్షలో భీష్మాచార్యుని యొక్కయుఁ బరమానురాగ మిందుఁ జక్కగా వ్యంజింపఁ బడినది.

"వేదములకు నఖిలస్మృతి వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైనచోటులను దా మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్"

అనుతిక్కనార్యునియుక్తి కీపర్వమే యెక్కువగా నాధారభూతమగు నను టతిశయోక్తి కానేరదు.

## అనుశాసనికపర్వము - ప్రథమాశ్వాసము :-

మతంగుఁడనువిప్రకుమారకుఁ డొకగార్దభివలనఁ దాను చండాలుఁ డగుట యెఱిగి తపముచే బ్రాహ్మణ్యము పడయఁగోరనవాఁడై యద చేయుచుండఁగా నింద్రుడు ప్రత్యక్షమై యిట్లనెను :

"అనవుఁడు బ్రాహ్మణత్వము మహత్త్వ మెఱుంగవ; యన్యజాతి కం
దునె యది; యొండు వేఁడు మది దోఁచిన మే లనియెన్ బలారి; వాఁ
'డనితరసాధ్యమైనతప మస్ఖలితంబుగఁ జేయుచుండెదం
జనుము మహాత్మ! నీ' వనిన నస్మితుఁడై యతఁ డేఁగె; నేఁగినన్." 13.1.94

మతంగుఁ డనితరసాధ్యమైనతప మస్ఖలితముగఁ జేయుదును ఓ మహాత్మ నీవరుగు మనుటలో నాకోరిక నెఱవేఱువఱకుఁ దపమును మాన; నెట్లయిన దాని సాధింతు ననునర్థము వ్యంగ్యము. 'మహాత్మ! చనుము' అనుటలో నొకింత చిఱుకోప మభివ్యక్తమగును. నా కోరిక తీర్చలేని మహానుభావుఁడవు, నీవిట నుండనేల? మఱి యేదేని కోరుమని చెప్పనేల? నీదారిని నీవేఁగు మనునర్థము వ్యంగ్యము. ఇంద్రుఁడు సస్మితుఁ డగుటయు నభిప్రాయస్ఫోరకము. నీవెంతగా ననితరసాధ్యమైనతపముచేసినను, నది యెంతగా నస్ఖలితమైనను నీ కోరిక సిద్ధింపదు సుమా యను భావ మిందు వ్యక్తమగును.

గరుత్మంతుఁడు తల్లి విషయము పట్టించుకొనక యథేచ్ఛాసంచారము చేయుచుండఁగా నారదుఁ డాతనితో నిట్లనెను :

"దాసియై సవతాలికిఁ దల్లి పనులు సేసె నలఁగంగ నద్దెనఁ జింత వంత
లేక నీ విట్లు దిరుగుట లెస్సయగునె-యద్భుతోజ్జ్వలతేజ! కశ్యపతనూజ!"13.1.205

ఆమె యెవ్వరో కా దుపేక్షచేయుటకు, తల్లి. కాలక్షేపమునకుఁ గాక దాసిగా నై పనులు చేయుచున్నది. అదియు నెవ్వరికో యైనచోఁ గొంత సద్దుకొనవచ్చును. సవతాలికి దాసియైనది. ఆమె యెంతయో తా నంతే యైన స్థితిలో నిదియెంత హైన్యముదెచ్చునో యూహింపుము. అయినను నిష్టపడి తృప్తితో చేయుచున్నదను కొనుటకును వీలులేదు. నలఁగుచున్నది. ఇట్టి స్థితిలో పుత్త్రుఁడవు, తల్లికి దయనీయస్థితిని దూరీకరింపవలసినవాఁడవు నగు నీవు ఇట్లు దిరుగుట లెస్సయగునా? నేనేమి చేయఁగలను, తల్లి దాస్యము పోఁగొట్టుశక్తి నాకేటిదని నిరుత్సాహపడకుము. నీ వత్యాశ్చర్యకరమగు నుజ్జ్వలమైన తేజము గలవాఁడవు. దానిని వినియోగించుకొనుము. ఎట్లని సందేహింపకుము. మీనాయన కశ్యపుఁడు. ప్రజాపతి. మహాసమర్థుఁడు, ఆయనయుపదేశమును బొందుము. నీవంటి యుజ్జ్వలతేజము గలవాఁడు తల్లిదాస్యము నీగకున్నచో నది యెంత లజ్జావహమైన విషయమో యూహింపు మను నారదునికర్తవ్యోపదేశమిట వ్యంగ్యమగును.

గరుత్మంతుఁ డమృతముఁ దెచ్చి కద్రువకుఁ జూపి మఱలఁ దానే కైకొని యిట్లు వచించెను :

"జననీ! నీ వమృతంబుఁ దెమ్మనిన యాసత్యోక్తి పాటించి యేఁ
జని నానావిధకర్మకర్మఠుఁడనై సాధించి వే తెచ్చితిన్;
విను నా నీ యొడఁబాటు చెల్లె; జనులన్ విన్పించితిం దెల్లగా
వినతం దోడ్కొనిపోయెదన్; మనమునన్ విభ్రాంతి లేకుండుమీ." **13.1.263**

ఇందు గరుత్మంతుని వాగ్విన్యాసము పరమరమణీయముగా నున్నది. జననీ! అనుసంబోధనముచేఁ దల్లివై పుత్త్రులఁ గంటికి ఱెప్పవలెఁ గాపాడవలసిననీవు దుస్సాధమగువస్తువును దెమ్మని హింసింపనెంచితివి. ఆహా! నీమాతృత్వగరిమ యెంతటి దందు నను నధిక్షేపణము వ్యంగ్యమగును. అమృతంబుఁ దెమ్మంటివి గాని నీకిమ్మనలేదు. (211వ పద్యమున "... తల్లికి మదింగూర్తేని వేపోయి లోకులు నిన్నుం బ్రణుతింపఁ దెమ్మమృతమున్...." అని మాత్రమే కద్రువ చెప్పినది. ఇమ్మనలేదు) మఱియు నీవన్నట్లుగనే లోకులు ప్రణుతించునట్లు నానావిధకర్మ కర్మఠుఁడనైతిని. కేవల క్రౌర్యముతో, నాదరము చూపవలసినచోట, నెంత కష్టపెట్టితివో చూడుము. నీవు, అమృతము తెమ్మన్నచో తత్ప్రయత్నమున నీబలాఢ్యుఁ డెట్లును రూపఱును; నాకు బలవద్విరోధము తప్పును; వినత నాకు శాశ్వతముగా దాసియగు; నని సంతోషింప నెంచితివి. కాని నీకోరిక విఫలమగునట్లుగా నాసామర్థ్యముతో వేగముగా సాధించి తెచ్చితిని. తెచ్చుటయే కాదు, మన యొడఁబాటు చెల్లిపోయినది. ఇఁక మఱల నీవు ఏదేని కుటిలోపాయముతోఁ జెల్లలే

దనుటకు వీలులేకుండ నిది జను లందఱకు విన్పించితిని. అంతేకాదు, నీతత్త్వమును గూడ లోకమెల్ల నెఱుఁగున ట్లొనరించితిని. ఇంక నీకు దాస్యము చేయ నవసరము లేనివినతను దోడ్కొనిపోయెదను. ఇఁకపై నెప్పుడును నిట్లెవరినేని వంచింపవచ్చు నను విభ్రాంతి లేక ఋజుబుద్ధితో నుండుము. ఇత్యాద్యర్థమిట వ్యంగ్యముగా భాసిల్లును.

పరమోత్తమధర్మములను బరమాత్మతత్త్వమును గొన్ని లోకవృత్తములను ననుశాసించు నీపర్వమునఁ బ్రథమాశ్వాసమునందు విస్తృతముగాఁ జెప్పబడిన గరుత్మదుపాఖ్యానమునఁ ధర్మవీర మంగిరసము. దాని కద్భుతరసాదు లంగములు. భంగాస్వనచరిత్రయు నద్భుతరసప్రవణము. అందు పురుషుఁడు స్త్రీయగుట, సంతానము బడయుట, తుది కింద్రుడు పురుషత్వ మిత్తు ననఁగా రతిసుఖతారతమ్యమును వక్కాణించి స్త్రీత్వమునే యర్థించుట మున్నగువిషయములు విస్మయావహములు. ఇం దనేకోపాఖ్యానము లయ్యేయుపదేశముల వ్యంగ్య మొనర్చును.

## అనుశాసనికపర్వము - ద్వితీయాశ్వాసము :-

ఈయాశ్వాసమున 25వ పద్యమువఱకు అష్టావక్రుఁడు వివాహమాడుట వివరింపబడినది. అందు ఉత్తరదిశ స్త్రీరూపముతో నాతనిఁ బరీక్షించుటయు దానియందాతఁడు విజయమునందుటయుఁ జెప్పఁబడినది. దీనిచే నుత్తముఁడగువరుఁడు కఠోర బ్రహ్మచర్యవ్రతనియతి కలవాడై యుండవలయు ననియు, ధనలౌల్యము, స్త్రీవ్యామోహము మున్నగుదుర్గుణములను బరిత్యజించి తాను గోరిన కన్యయందే స్థిరచిత్తముగలవాడై యుండవలయు ననియు నర్థ ముపదేశరూపమున వ్యంగ్య మగును. ఇం దష్టావక్రాలంబక ధర్మరక్షణోత్సాహము ధర్మవీరముగా రూపుదిద్దుకొనెను.

దేవశర్మయను మునివరునిభార్యను రుచిని సంరక్షించుచుఁ దచ్ఛిష్యుఁడు విపులుఁ డామెఁ గోరివచ్చినయింద్రు నిట్లు మందలించెను :

"అమ్మునిశిష్యు డి ట్లువిదయంగము వాసి నిజాంగవర్తియై
యమ్మరుదీశుతో; 'మఱచితా మును మూఁడిన యబ్బగాంకిత
త్వ; మ్మొకభంగి నీఁగు టిది దైవతసంయమిసేవనీయభా
వమ్ము గలట్టి నీకుఁ దగవా? యసిరో!' యని పల్కి వెండియున్." 13.2.200

ఇందలి 'మునుమూఁడిన యబ్బగాంకితత్వమ్ము మఱచితా' యనువాక్యముచే నీబ్రతుకంతయు నిట్లు నింద్యమైపోయినను బుద్ధిరానివాఁడవు; నీవేటియింద్రుఁడ వనుధిక్కారము వ్యంజితమగును. 'దైవతసంయమి సేవనీయభావమ్ముగలట్టినీకు' అనుట యట్టి యత్యుత్తమ గౌరవమునకు నీ వనర్హుఁడవు కానేల? యనునర్థమును వ్యంజించును.

నిన్ను సేవించువారికిఁ గలసంయమనము, నీకు లేనిచో నీవు వారి కెట్లారాధ్యుఁడ వగుదు వను భావము వ్యంగ్యము. 'ఇసిరో' యనునవ్యయము విపులునిమనస్సునఁ బుట్టిన జుగుప్సను వ్యంజించును.

ఇందు 291వ వచనమునుండి 331వ వచనమువరకు చ్యవనకుశిక సంవాదమను నితిహాసము కలదు. చ్యవనుఁడు కుశికకులముకారణముగా నిజవంశమునకు సంకరము గలుగు నని యెఱింగి యది సంభవింపకుండుటకై యుత్పాతం బాపాదింపఁగోరుట యిందలి కథాంశము. అతఁడు కుశికదంపతులఁ బెట్టినహింసలును వారవి మహోదాత్తమగు క్షమాగుణముతో సహించుటయు నత్యాశ్చర్యకరములై యద్భుతరసాభివ్యంజకము లగును. ఆమహర్షి యిరువదిరెండేసిరోజు లొకపార్శ్వముగా నిద్రించుటయు నన్నినాళ్ళాదంపతులు నిద్రాహారము లెఱుఁగక యాతని సేవించుటయు మున్నగువృత్తము మహావిస్మయహేతువు. అట్లే యాతఁడు వారిరువురిని బండికి వాహనములుగాఁ గట్టి ములుగఱ్ఱలతోఁ బొడిచి హింసించినను వారు కినియకుండుట యత్యద్భుతము. కడ కాతఁడు వారి క్షమను బ్రశంసించుటతోఁ గథ ముగియును. క్షమాగుణౌదాత్త్య మీకథయందు వ్యంజింపఁ బడినది.

## అనుశాసనికపర్వము - తృతీయాశ్వాసము :-

ఈయాశ్వాసమున 127వ పద్యమువరకు గో గోదానమహత్త్వములు వక్కాణింపఁ బడినవి. పూర్వాశ్వాసాంతమునందును గోప్రభావము కొంత చెప్పఁ బడినది. ఇంత సుదీర్ఘముగా దీనిని గుఱించి చెప్పుటలో గోసంరక్షణము భారతీయునకుఁ బరమధర్మ మను నుపదేశము వ్యంగ్యమగును. రంతిదేవుని యజ్ఞమున జరిగిన గోవధ, గోవులకు ఉత్తమలోకప్రాప్తికలుగుటకై తత్ప్రార్థనచేఁ జేయఁబడిన దనుకథాంశమునుబట్టి యాతనిగోవధ నింద్యము కాదను తాత్పర్య మభివ్యక్తమగును. లక్ష్మియు గోవులకుఁ దిరస్కరణీయ యగుటయు, వానియనుగ్రహమును నామె పొందుటయు ననునితిహాసము గోవు సర్వోత్తమత్వమును వ్యంజించును.

వృషాదర్భియనురాజు, సప్తర్షులు నరుంధతియు వారి పరిచారికాపరిచారకులతో క్షుధార్తులై యుండఁగా వారితో నిట్లు పలికెను :

"బహువిధముల ధాన్యములును బహురసవర్గములు మీకు భక్తి నొసఁగెదన్;
బహుతురగశకటగోగణ బహుళబహుగ్రామములును బహుమతినిత్తున్."13.3.213

ఈపద్యమునందలి బహుపదప్రయోగబాహుళ్యము వారి కభిమతార్థము లిచ్చుటలో నామహారాజునకుఁ గల యుత్సాహాతిశయము నలక్ష్యక్రమమున వ్యంజించును.

**ఆనుశాసనికపర్వము - చతుర్థాశ్వాసము :-**

ఈ యాశ్వాసమునందలి యింద్రమతంగసంవాద మనునది యాయా పుణ్య విశేషముల కా యా యుత్తమలోకప్రాప్తియగు ననువిషయమును వ్యంగ్యముగాఁ బ్రతిపాదించును. ఆశ్వాసాంతమునం దారంభింపఁబడిన యుమామహేశ్వరసంవాద మనునది శివుని సర్వజ్ఞతాకృపాళుత్వముల నభివ్యక్తముచేయును. తక్కిన యాశ్వాసమునందంతటను, ధర్మములును, తత్త్వములును వివరింపబడినవి.

**ఆనుశాసనికపర్వము - పంచమాశ్వాసము :-**

కాంతాధర్మములు నీవలన వినుటకు నాకాసక్తి జనించె నని పరమేశుఁ డనఁగాఁ బార్వతి యిట్లాడెను :

**"ఐనను మీరడిగిన మన్మానసబోధంబుకొలఁది మగువలతెఱఁగుల్**
**పూని వినిపింపకుండుట దాన తగదు గాన చెప్పెదను సర్వజ్ఞా !" 13.5.278**

ఇందలి 'సర్వజ్ఞా!' యనుసంబోధన మభిప్రాయగర్భితము. సమస్తము నెఱింగిన మహానుభావుఁడవు. నాకు నీ రందఱయెదుట నొకగౌరవ మాపాదించుటకై స్త్రీధర్మములఁ జెప్పుమని యడిగితివి కాని నీకుఁ దెలియనివిషయము కలదా? యనునంశ మిట వ్యంగ్యము.

పార్వతి పతివ్రతాధర్మముల నెఱిఁగించుచు నిట్లు పలికెను :

**"లలనయిలువాడు నాథుఁడు వలచినచవివంటకములు వండి యిడి తనుం**
**గలయఁదలంచిన మెయికొని యెలమిం గైసేసి హృదయ మీవలయు శివా!"**
**13.5.290**

ఇందు 'తనుంగలయఁదలంచిన మెయికొని యెలమిం గైసేసి' అనుటలో నలంకారకరణము దాంపత్యసౌఖ్యమే లక్ష్యమైనది కావలయు ననునర్థము వ్యంగ్యమగును. 'హృదయమీవలయు' ననుటచే కాయమును మాత్రము పతి కప్పగించి యన్యమును జింతించుట దూష్య మనునర్థము వ్యంజితమగును. హృదయ సమర్పణమే సతీసతుల కత్యంతసుఖహేతు వగు ననునర్థ మిట వ్యంగ్యము.

భీష్ముడు ధర్మరాజునకు అశేషధర్మములను వక్కాణించిన యానుశాసనిక పర్వము మానవులకుఁ గర్తవ్యాకర్తవ్యములను నాయావస్తువులమాహాత్మ్యమును, సాంఖ్యాదితత్త్వములను నుపదేశించుచు సమగ్రపురుషార్థసిద్ధికి మార్గదర్శకమగుటచే నిందు శాంతరసము సంభావ్యము. సమస్తశత్రునిరాస మొనరించినపిమ్మట ధర్మజుఁడు జిజ్ఞాసువై సర్వధర్మముల నెఱుఁగఁగోరుటలో రాజ్యలాభాదికము శాశ్వతము కాదు. పరసుఖమే

ప్రార్థనీయ మనునంశము వ్యంగ్యమగును. పంచమవేదవ్యవహారమునకు లక్షణ ప్రాయమైన శాంత్యానుశాసనికపర్వములలో మోక్షపురుషార్థసిద్ధికి మార్గము సూటిగా బోధింపఁబడినది.

**అశ్వమేధపర్వము - ప్రథమాశ్వాసము :-**

ఇంద్రప్రేషితుఁడగు నగ్ని మరుత్తునితో బృహస్పతి యాజకుఁ డైనచోఁ గలుగు ప్రయోజనము నిట్లుగ్గడించెను :

"అనిన నగ్నిదేవుఁ - డమరగురుం డుప ద్రష్టయైన వజ్రధరుఁడు నీకు
నలఘుపుణ్యలోకములు సులభ్యములుగ లీలఁ జేయు; నట్లు మేలు గాదె!"
14.1.71

ఇందలి అమరగురుఁ డనుపదముచే దేవతలంతవారికి గురువైన మహానుభావుఁడు నీకుపద్రష్ట యగుట అధిక ప్రయోజనము ఘటిల్లఁ జేయు ననునర్థమును వ్యంజించును. మఱియు "నలఘుపుణ్యలోకములు సులభ్యములుగ లీలఁ జేయు" నను వాక్యమున ఏవో పుణ్యలోకములు గాదు. చాల గొప్పవి. ఎక్కువ కష్టపడ నక్కరలేదు. అవి నీకు సులభ్యము లగును. ఇది యంతయు నుపదర్శకుడు లీలతోఁ జేయును. అట్టియెడ నది కోరక యీసంవర్తుని యాజకత్వముచే నెట్టిలోకములను బొందుదువో యెంతదుష్కరముగా యజ్ఞము లాచరింపవలయునో, యెంతశ్రమ కలుగునో యాలోచించుకొను మనునర్థము వ్యంగ్యమగును. అగ్నిదేవుని యీవాక్యములు వ్యంగ్యముగా సంవర్తునిఁ బరామర్శించినవి కావుననే యాతఁడు "ఇట్టిగతి నీవిం కాడిన మద్దారుణదృష్టిని, నినుఁ గాల్తు" (78) నని పలికెను. మఱియు నిందలి వజ్రధరుఁ డనుశబ్దముకూడ సాభిప్రాయము. నీవు నాయుపదేశము నంగీకరింపనియెడల నాతఁడు వజ్రముతో నిన్ను దారికిఁ దెచ్చుననుబెదరిం పిందభివ్యక్తమగును.

అర్జునుఁ డొకనాడు కృష్ణునితోఁ బ్రసంగించుచు యుద్ధప్రారంభమున నాత్మగలంగగా నీవు చెప్పిన తత్త్వబోధనమహనీయవాక్యములు మనమున నిల్పఁజాల నైతిని. మఱియొక్కమాఱు చెప్పుమని ప్రార్థింపగా -

"అనిన నగుచు నొకకేల న తనిఁ గౌగిటఁ జేర్చి బుద్ధి తత్త్వవిహీనుం
డును శ్రద్ధారహితుఁడునై తని దూఱి ముకుందుఁ డిట్టులను నాతనితోన్."
14.1.154

ఇందు నవ్వుట 'నేను నిందించినచో గోపింపకు' మను ననునయము నభివ్యక్తముచేయును. ఒక కేల నతనిఁగౌగిట జేర్చుట యాతనిజిజ్ఞాసను మెచ్చుకొనుటను వ్యంజించును. తత్త్వవిహీనుండు నిత్యాదివాక్యముచే నిట్టివానికి మఱలఁ జెప్పనను

మనమున కెక్కునా? యనునర్థమును, ఇటుపై నట్టివాఁడవు కాకు మను హెచ్చరికయుఁ బ్రతీయమానములగును. ఈపద్యార్థముచే "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం మత్పరః సంయతేంద్రియః" యనుగీతావాక్యార్థము వ్యంగ్యమగును.

ఈయాశ్వాసమున నించుక విస్తృతముగాఁ జెప్పఁబడినది మరుత్తునిచరిత్రము. అతఁడు సంవర్తునాశ్రయించుట, ఇంద్రబృహస్పతులు వారికి విభేదము గల్గింప యత్నించుట, వారు నిష్ఠాగరిష్ఠులై చెడకుండుట యనునంశము లిందుఁ జక్కగా వర్ణింపబడినవి. ఇందు ధర్మవీరము సంభావింపఁదగును. అనంతరకథాభాగమున శ్రీకృష్ణుడు ధర్మరాజునకు మనస్తాపము పోగొట్టి యర్జునునకు తత్త్వజ్ఞానోపదేశముచేయుట గలదు. అయ్యది శాంతరసాత్మకము.

## అశ్వమేధపర్వము - ద్వితీయాశ్వాసము :-

భార్యాభర్తృసంవాదమునఁ బ్రాస్తావికముగా వచ్చిన పరశురామవృత్తాంతమున నాతనిపితృదేవతలు సన్నిధిచేసి నరేశ్వరులఁ జంపవలవ దని చెప్పగా నాతడిట్లు పలికెను:

1. సారనియతిఁబాటించి మ హారోషాగ్ని పరితృప్త మగునట్టులుగా
వీరాధ్వరంబుచేసెద; వారింపక యరుగు; డనిన వా రాతనితోన్-"14.2.79

2. "యజ్ఞంబులలోనఁ దపో యజ్ఞంబుత్తమము దాని నాదరణమునం
బ్రాజ్ఞోత్తమ! చేయుము; స ర్వజ్ఞుఁడు ప్రీతుఁ డగు; శాంతరస మొప్పుఁ జుమీ."
14.2.80

వీరాధ్వరంబు సేసెద ననిన పరశురామునకుఁ బితృదేవతలు యజ్ఞములలో తపోయజ్ఞ ముత్తమమని చెప్పుట నీ వాచరింపఁదలఁచినయజ్ఞము నీచమైన దనునర్థమును వ్యంజించును. 'ఆదరణమునన్' అనుపదమువలన దీనియందు నిరాదరణము వహించిననే కాని నీ కది సాధ్యముకా దనునర్థము వ్యంగ్యమగును. ప్రాజ్ఞోత్తమ! అనుసంబోధనము నీవంటివాని కేది యుత్తమయజ్ఞ మనువివేకము గలుగకుండుట యొప్ప దనునర్థమును స్ఫురింపఁ జేయును. 'సర్వజ్ఞుడు ప్రీతుఁడగు' ననుటలో మన మేకార్యముచేసినను సదసద్వివేకముతో సర్వజ్ఞుమెప్పునకై చేయవలయును గాని తాత్కాలికమును, ఇహపరదూరమును నగు రోషాగ్ని పరితృప్తికై చేయుట నింద్యము కదా! యనునర్థము తోఁచును. 'శాంతరస మొప్పుఁ జుమీ' యనువాక్యమువలన నీ వీ రౌద్రభావమును బరిత్యజింపవలయు నను నభ్యర్థనము ప్రతీయమానమగును.

ఈయాశ్వాన మంతయుఁ గృష్ణుఁ డర్జునునకు భార్యాభర్తృసంవాద రూపమునను, గురుశిష్యసంవాదరూపమునను జెప్పిన యధ్యాత్మవిద్యాదులు సంగ్రహింపఁ

బడినవి. ఇవి యన్నియు మోక్షపురుషార్థసిద్ధి కుపాయభూతములగుటచే శాంతరసమిందు సంభావ్యమగును.

## అశ్వమేధపర్వము - తృతీయాశ్వాసము :-

మహాయుద్ధమంతయు ముగియఁజేసి ధర్మరాజు నూఱడించి యర్జునున కధ్యాత్మవిద్యారహస్యంబు లన్నియు నెఱిఁగించి శ్రీకృష్ణుడు ద్వారక కేఁగుచు మార్గమధ్యమున నుదంకాశ్రమమున కరిగి యతిథిసపర్యలు గొని కూర్చున్నపిదప నతనితో నుదంకుఁడిట్లు పలికెను :

"భరతులపాలి కేఁగితగఁ బాండవకౌరవబంధుభావ సం
గరము దృఢంబు సేసితె; సుఖస్థితి రాజుల వారివారి వి
స్ఫురిత మహాధిరాజ్యముల చొప్పున నిల్పితె పక్షపాతితా
దురితము లేని నీవు జనతోషవిధానవిశారదుండవై?" 14.3.29

ఈపద్యమంతయు నిందాగర్భితము. నీవు ప్రయత్నపూర్వకముగా సంధి విఘటితముచేసి మహాసంగ్రామమునకుఁ గారణమైతివి. దేశమునఁ గలరాజు లెల్లరు వారివారి మహాధిరాజ్యముల నెల్ల దిక్కుమాలినవిగాఁ జేసి స్వర్గతులగునట్లొనరించితివి. పాండవులయందుఁ బక్షపాతము వహించి దురిత మాచరించితివి. దీనివలన జనులందఱు దుఃఖభూయిష్ఠులయిరి. నీవే దీని కంతటికిఁ గారణ మనునర్థ మిట వ్యంగ్యము. తఱువాతి వచనమున "అని యిట్లెఱుంగనివాఁడయి యడిగెడునట్ల పోలె నిందాగర్భంబుగాఁ బలికినన్" అనువాక్యముచే నిది వాచ్యముచేయఁ బడినది.

మృతజాతుఁడగు నుత్తరాపుత్త్రుని బ్రదికింపు మని కుంతీసుభద్రాదులు సకరుణముగా విలపింపఁగా శ్రీకృష్ణుడు :

"అనినఁ గృపయును శోకంబు నగ్గలింప వనజనాభుండుజను లర్థి వినఁగఁ- బిన్న
వానిబ్రదికింతు; వగవంగవలవ; దనియె నెలుఁగు జలదస్వనమ్మున బ్లెసకమెసఁగ."
14.3.178

కృష్ణునియెలుఁగు జలదస్వనమ్మువలె నున్నదనుటచే నచ్చటిజనులయెడఁ దలకు అవగ్రహముచే బీటలు వాఱినపొలములతో నౌపమ్యము వ్యక్తమగును. కృష్ణునిజలదస్వనమున విన్నవానికి క్రొత్తజీవనము వెల్లివిరియుట గమ్యమాన మగును. పరీక్షిదుజ్జీవనమే వారికి నూతనజీవనము. దానితో నాహృదయక్షేత్రములం దానందపుఁ బంట పండుట యభివ్యక్తమగును. వనజనాభుఁడనుపదము కూడ నభిప్రాయగర్భితము. దీనిచే కృష్ణునివిష్ణుత్వము ప్రతిపాదింపఁబడి పరీక్షిదుజ్జీవనము సుకర మనునంశము ప్రతీయమానమగును.

ఈయాశ్వాసమున సగ ముదంకోపాఖ్యానమును బెరసగమునఁ గొంతభాగ మశ్వమేధ ప్రయత్నమును, పరీక్షిదుదయవృత్తాంతమును జెప్పఁబడినవి. ఉదంకోపాఖ్యానమున నాతని ధర్మైకప్రవణత చక్కగా వ్యంజింపబడినది. శ్రీకృష్ణుఁడు దయతో నాతనికి విశ్వరూపము చూపుటయందే యాతని హృదయపరీపాక మభివ్యక్త మగుచున్నది. అశ్వ మేధయాగకరణమున ధర్మజుని ధర్మవీరము దృశ్యమాన మగుచున్నది. పరీక్షిత్తు మృతుడై పుట్టుట, కుంతీసుభద్రోత్తరులవిలాపములును గరుణ రసనిర్భరములై యొప్పుచున్నవి. శ్రీకృష్ణునికృపవలన నతఁడు పునరుజ్జీవితుఁ డగుట యద్భుతమును బుట్టించును. శ్రీకృష్ణునియార్తజనశరణ్యత యిందు చక్కగా గోచరించును.

## అశ్వమేధపర్వము - చతుర్థాశ్వాసము :-

అశ్వమేధాశ్వ సంరక్షణమున కరిగినయర్జునుఁడు ప్రాగ్జ్యోతిషపురమున భగదత్తునితనయునియేనుఁగును గూల్చినవిధము -

"కరి యిటు లేపునం గవియఁగా భగదత్తసుతుండు దీప్తని
ష్ఠురశరపంక్తి నాహవపటుత్వము సూపిన నల్పకోప సుం
దరుఁ డగుచు న్నరుండు శతధారనిభంబగునారసంబు భీ
కరగతి నేయఁ గూలె నది కౌరవనాయక ! పర్వతాకృతిన్." 14.4.31.

ఎదురుగా వచ్చినది మహాభయంకరమైనగజము. అదియును బట్టుదలతోఁ గవిసినది. దానికితోడు భగదత్తసుతుఁడు దీప్తములును నిష్ఠురములును నగు బాణము లొండురెండు గాక పంక్తులుగాఁ బ్రయోగించుచు నాహవమునందుఁ దనుకున్న పాటవము నంతటినిఁ జూపఁగా నర్జునునకు నల్పమైనకోప మొదవినది. దానితో నాతని ముఖము సుందరమైనది. అను నీవిషయముచే ధనంజయునిశక్తిసామర్థ్యములు వర్ణనాతీతము లనునర్థము ప్రతీయమానమగును. మఱియు నాతనిదయాళుత్వము నిరవధిక మనునర్థమిట వ్యంగ్యమగును. అతనినారసమునకు శతధారముతోడిసామ్యమును, గూలనగజమునకుఁ బర్వతసామ్యమును జప్పుటచే నర్జునున కింద్రసామ్య మభివ్యక్తమగుచుఁ బాండవాశ్వమేధము జగద్ధితత్వమును బ్రతీయమాన మొనరించును.

కృష్ణుడు ధర్మజున కర్జుననిసందేశము విన్పించుచు నిట్లు పలికెను :

"మణిపూరపురాధీశుఁడు గుణగణవిభ్రాజితుండు గురుహితుఁడు విచ
క్షణపరుఁడు బభ్రువాహనుఁ డణుమాత్రముఁ గీడులేనియట్టిం డెందున్."
14.4.149

తిక్కనార్యుని దివ్యవా

"మీచరణసరసిజంబులు చూచుటకై రాక తనకు సువ్రతముగ మున్
వేచి యునికి వచ్చుఁ గృపా గోచరమగుచేఁతకుం దగును మీ కనుమీ." 14-4-15

ఇట్లు బభ్రువాహనునిగుణగణములను అర్జునుఁడు మిక్కిలిగాఁ బ్రశంసిం టయు, సణుమాత్రముఁ గీడులేనివాఁ డనుటయు, మీ చరణకమలములు చూచుట వచ్చుటయే సువ్రతముగ వేచియున్నాఁడనుటయు, కృపాగోచరమగుచేఁత కు దగుననుటయు నభిప్రాయగర్భితములు. మీరు చారులవలన నాతఁడు నన్నుఁ గూ నేయుట వినియుందురు. నాపైని నిర్భరముగ నున్న వాత్సల్యముతో నాతనియెడఁ గోపమ వహింతురేమో, యది యంతయు దైవికముగా నైనది. అతనిదోషము లేశ మేని లేదు కావున నాతనిపై నాగ్రహింపవలదుసుమా! అనుప్రార్థన మిందభివ్యక్తమగును. ఒకవే ధర్మజుఁడు విషయ మెఱుఁగకున్నచోఁ బుత్రవాత్సల్య స్ఫోరకము లనిమాత్రమే యాత డనుకొనుటకును, అయనిష్టము నాతనికిఁ దెలుప కుండుటకును నీవ్యంగ్యవైఖ యవలంబింపఁబడిన దని తలఁచుట సముచితము.

ఈయాశ్వాసమున నర్జునుని సౌమ్యపరాక్రమము, ధర్మాభిరతియు, భ్రాత గౌరవమును మనోజ్ఞముగా వ్యంజింపఁబడినవి. అశ్వమేధయాగనిర్వహణము ధర్మజునిధర్మనిర్వహణపాటవము, దక్షిణగా భూమి నంతటిని దాన మిచ్చుటయుఁ గొననొల్లకుండుటయు నాతని ధర్మపరిపాలనోత్సాహమును ధర్మవీరముగా రూపొందించును సక్తుప్రస్థునివృత్తాంతము మహావిస్మయజనకమై యద్భుతరసము నాస్వాదింపఁజేయును జమదగ్ని నకులమైనకథ శాంతాద్భుతరససమ్మిళితము.

## ఆశ్రమవాసపర్వము - ప్రథమాశ్వాసము :-

ధర్మజుఁడు పట్టాభిషేకము నొందినపిదప ధృతరాష్ట్రు నరసికొనినవిధ మీక్రిం పద్యమున వర్ణింపబడినది :

"వంశవృద్ధులు పుత్రవర్గవియుక్తులై యున్నవా రేమిట నున్మలింతు
రో యనువుయిలోట నాయుధిష్ఠిరుఁడు దమ్ములకును దగునమాత్యులకు ని
భృత్యులకును- 'మీరు ప్రీతియు భక్తియు నాంబికేయునిదెస నతిశయిల్ల
నారాజు పంచినయట్ల చేసి చరింపుఁ; డతని నారాధించు టస్మదీయ
చిత్తమునకుఁ బ్రియముసేయుట; యతనికి మనసు గాని యట్టిపని యొనర్చ
టగ్గలంపుదుఃఖ మావహించుట' యని యనుదినంబుఁ జెప్పు మనుజనాథ!'
15.1.10

ధృతరాష్ట్రుడు పితృస్థానీయుడై పాండవులయెడ చూపినవైరస్యమునకును ధర్మజుడు పుత్ర స్థానీయుడై గాంధారీధృతరాష్ట్రులయెడ చూపినయనన్యభక్తిభావమునకును

భేదము కొండంత యగుచున్నది. ధర్మజుని యప్పటిసహనమునకును నిప్పటి యుదాత్తతకును మేర లేదనిపించును. ఈపద్యమునందలి ధర్మజుని ప్రవృత్తి యాతని వృద్ధోపసేవయందలి ప్రగాఢ ప్రీతిని వక్కాణించుచు నాయకోత్తమత్వమును వ్యక్తము చేయును. 'అతిశయిల్ల' ననుపదముచే నేకొంచెమో చూపి మ్రొక్కుబడి చెల్లించు కొనుట నాకు సమ్మతము కాదనునర్థము వ్యంగ్యమగును. 'అగ్గలంపుదుఃఖము' అనుచోటి విశేషణము ధృతరాష్ట్రానభిమతకృత్యములు కొంచెమేని సహింపఁ జాలనితనము నభివ్యక్తము చేయును. అనుదినంబును జెప్పుటలో మానవస్వభావ తత్త్వమును ధర్మజుఁ డెఱిఁగె ననుట తోఁచును. అజ్ఞాపాలనాదివిషయమున నిత్యజాగరూకత యవసర మనువిషయము లోకమున సార్వత్రికముగాఁ గానవచ్చును.

స్త్రీపర్వావధికమగుకథాభాగములో పుత్త్రవ్యామోహదూషితుఁడై నింద్య జీవనుఁ డైన ధృతరాష్ట్రుని హృదయములో, గాఢమైన పరివర్తన తేజాలినయంశములలో భీముని నూటి పోటుమాటలకంటె ధర్మజుని యీయరయికయే ప్రాధాన్యము వహించునని నాయభిప్రాయము. 'అపకారికి నుపకారము నెపమెన్నక చేయు నేర్పరితనము' సుప్తమైన మంచితనమును జాగృత మొనర్చును. అది గాఢవైరాగ్యమునకుఁ బునాది యగుట ధృతరాష్ట్రునిచరిత్రములో కానవచ్చును. దానికి ధర్మజుని యత్యుదార ప్రవర్తనము నిమిత్తమగుట యీయాశ్వాసమునఁ బరమరమణీయముగా వర్ణింపఁ బడినది. ఈపద్య మీయభిప్రాయమునకు వ్యంజకము.

ధృతరాష్ట్రుడు మృతులయినబాంధవులకు సవిశేషశ్రాద్ధములు చేయఁగోరెనని విదురునివలన విని భీముఁడు కోపగింపఁగా నర్జునుఁ డిట్లాడెను :

> "రాజు వృద్ధుఁడు ధృతరాష్ట్రుడు భీష్మ ముఖ్యజ్ఞాతులకు శ్రాద్ధకర్మ మాచ
> రింపఁదలంచి యర్థించె భవజ్జిత ధనధాన్యములు; నీవు దాని కియ్య
> కొనమి యశంబునకును ధర్మమునకు విధ్వంసంబు సేయదే; ధర్మతనయు
> తలఁచినపని విఘ్నితము సేయఁ దగునయ్యమనకు; నయ్యంబికాతనయుఁదొల్లి
> వేఁడికొందు; మతఁడు వేఁడెడుఁ గానకు నేఁగుచుండి మనల; నిప్పు డింత
> సూడవలదె; యొండు లాడక యప్పని సలుపు టొప్పు బాహుశాలి! నీకు."
>
> 15.1.111

అడిగెడువాఁడు రాజు. అపరిహరణీయమైన యాజ్ఞాధికారము గలవాడు. అది సమ్మతింపనందువా, వృద్ధుఁడు. వృద్ధోపసేవ మనకుఁ గర్తవ్యము. మఱియు వృద్ధుడు మాత్రమే కాదు మనతండ్రికి పూజనీయుఁడైన ధృతరాష్ట్రుడు. మనకు నారాధ్యుడు. అతఁ

"మీచరణసరసిజంబులు చూచుటకై రాక తనకు సువ్రతముగ మున్
వేచి యునికి వచ్చుఁ గృపా గోచరమగుచేఁతకుం దగును మీ కనుమీ." 14.4.150

ఇట్లు బభ్రువాహనునిగుణగణములను అర్జునుఁడు మిక్కిలిగాఁ బ్రశంసించుటయు, సణుమాత్రముఁ గీడులేనివాఁ డనుటయు, మీ చరణకమలములు చూచుటకు వచ్చుటయే సువ్రతముగ వేచియున్నాఁడనుటయు, కృపాగోచరమగుచేఁతకుఁ దగుననుటయు నభిప్రాయగర్భితములు. మీరు చారులవలన నాతఁడు నన్నుఁ గూల నేయుట వినియుందురు. నాపైని నిర్భరముగ నున్న వాత్సల్యముతో నాతనియెడఁ గోపము వహింతురేమో, యది యంతయు దైవికముగా నైనది. అతనిదోషము లేశ మేని లేదు. కావున నాతనిపై నాగ్రహింపవలదుసుమా! అనుప్రార్థన మిందభివ్యక్తమగును. ఒకవేళ ధర్మజుఁడు విషయ మెఱుఁగకున్నచోఁ బుత్రవాత్సల్య స్ఫోరకము లనిమాత్రమే యాతఁ డనుకొనుటకును, ఆయనిష్టము నాతనికిఁ దెలుప కుండుటకును నీవ్యంగ్యవైఖరి యవలంబింపఁబడిన దని తలఁచుట సముచితము.

ఈయాశ్వాసమున నర్జునుని సౌమ్యపరాక్రమము, ధర్మాభిరతియు, భ్రాతృగౌరవమును మనోజ్ఞముగా వ్యంజింపఁబడినవి. అశ్వమేధయాగనిర్వహణమున ధర్మజునిధర్మనిర్వహణపాటవము, దక్షిణగా భూమి నంతటిని దాన మిచ్చుటయుఁ, గొననొల్లకుండుటయు నాతని ధర్మపరిపాలనోత్సాహమును ధర్మవీరముగా రూపొందించును. సక్తుప్రస్థునివృత్తాంతము మహావిస్మయజనకమై యద్భుతరసము నాస్వాదింపఁజేయును. జమదగ్ని నకులమైనకథ శాంతాద్భుతరససమ్మిళితము.

## ఆశ్రమవాసపర్వము - ప్రథమాశ్వాసము :-

ధర్మజుఁడు పట్టాభిషేకము నొందినపిదప ధృతరాష్ట్ర నరసికొనినవిధ మీక్రింది పద్యమున వర్ణింపబడినది :

"వంశవృద్ధులు పుత్రవర్గవియుక్తులై యున్నవా రేమిట నుమ్మలింతు
రో యనువుయిలోట నాయుధిష్ఠిరుఁడు దమ్ములకును దగునమాత్యులకు నిష్ట
భృత్యులకును- 'మీరు ప్రీతియు భక్తియు నాంబికేయునిదెస నతిశయిల్ల
నారాజు పంచినయట్ల చేసి చరింపుఁ; డతని నారాధించు టస్మదీయ
చిత్తమునకుఁ బ్రియముసేయుట; యతనికి మనసు గాని యట్టిపని యొనర్చు
టగ్గలంపుదుఃఖ మావహించుట' యని యనుదినంబుఁ జెప్పు మనుజనాథ!"
15.1.10

ధృతరాష్ట్రుడు పితృస్థానీయుడై పాండవులయెడ చూపినవైరస్యమునకును ధర్మజుడు పుత్ర స్థానీయుడై గాంధారీధృతరాష్ట్రులయెడ చూపినయనన్యభక్తిభావమునకును

భేదము కొండంత యగుచున్నది. ధర్మజుని యప్పటిసహనమునకును నిప్పటి యుదాత్తతకును మేర లేదనిపించును. ఈపద్యమునందలి ధర్మజుని ప్రవృత్తి యాతని వృద్ధోపసేవయందలి ప్రగాఢ ప్రీతిని వక్కాణించుచు నాయకోత్తమత్వమును వ్యక్తము చేయును. 'అతిశయిల్ల' ననుపదముచే నేకొంచెమో చూపి మ్రొక్కుబడి చెల్లించు కొనుట నాకు సమ్మతము కాదనునర్థము వ్యంగ్యమగును. 'అగ్గలంపుదుఃఖము' అనుచోటి విశేషణము ధృతరాష్ట్రానభిమతకృత్యములు కొంచెమేని సహింపఁ జాలనితనము నభివ్యక్తము చేయును. అనుదినంబును జెప్పుటలో మానవస్వభావ తత్త్వమును ధర్మజుఁ డెఱిఁగె ననుట తోఁచును. అజ్ఞాపాలనాదివిషయమున నిత్యజాగరూకత యవసర మనువిషయము లోకమున సార్వత్రికముగాఁ గానవచ్చును.

స్త్రీపర్వావధికమగుకథాభాగములో పుత్రవ్యామోహదూషితుఁడై నింద్య జీవనుఁ డైన ధృతరాష్ట్రుని హృదయములో, గాఢమైన పరివర్తన తేజాలినయంశములలో భీముని నూటి పోటుమాటలకంటె ధర్మజుని యీయరయికయే ప్రాధాన్యము వహించునని నాయభిప్రాయము. 'అపకారికి నుపకారము నెపమెన్నక చేయు నేర్పరితనము' సుప్తమైన మంచితనమును జాగృత మొనర్చును. అది గాఢవైరాగ్యమునకుఁ బునాది యగుట ధృతరాష్ట్రునిచరిత్రములో కానవచ్చును. దానికి ధర్మజుని యత్యుదార ప్రవర్తనము నిమిత్తమగుట యీయాశ్వాసమునఁ బరమరమణీయముగా వర్ణింపఁ బడినది. ఈపద్య మీయభిప్రాయమునకు వ్యంజకము.

ధృతరాష్ట్రుడు మృతులయినబాంధవులకు సవిశేషశ్రాద్ధములు చేయఁగోరెనని విదురునివలన విని భీముఁడు కోపగింపఁగా నర్జునుఁ డిట్లాడెను :

"రాజు వృద్ధుఁడు ధృతరాష్ట్రుడు భీష్మ ముఖ్యజ్ఞాతులకు శ్రాద్ధకర్మ మాచ
రింపఁదలంచి యర్థించె భవజ్జిత ధనధాన్యములు; నీవు దాని కియ్య
కొనమి యశంబునకును ధర్మమునకు విధ్వంసంబు సేయదే; ధర్మతనయు
తలఁచినపని విఘ్నితము సేయఁ దగునయ్య మనకు; నయ్యంబికాతనయుఁడొల్లి
వేఁడికొందు; మతఁడు వేఁడెడుఁ గానకు నేఁగుచుండి మనల; నిప్పు డింత
సూడపలదె; యొండు లాడక యప్పని సలుపు టొప్పు బాహుశాలి! నీకు."

15.1.111

అడిగెడువాఁడు రాజు. అపరిహరణీయమైన యాజ్ఞాధికారము గలవాడు. అది సమ్మతింపనందువా, వృద్ధుఁడు. వృద్ధోపసేవ మనకుఁ గర్తవ్యము. మఱియు వృద్ధుడు మాత్రమే కాదు మనతండ్రికి పూజనీయుఁడైన ధృతరాష్ట్రుడు. మనకు నారాధ్యుడు. అతఁ

డభ్యర్థించునదియు మనకు విశిష్టారాధ్యులైన భీష్మముఖ్యజ్ఞాతుల సమర్చనకుం. అదియును శ్రాద్ధ కర్మలాచరించు తలఁపుతోఁ జేయుచున్నాఁడు. మఱియు నాజ్ఞాపించునధికారము గలవాడు దీనముగా నర్థించుచున్నాఁడు. మనము పుత్రహంతలమను క్రోధము మాని నీవు సాధించిన ధనధాన్యముల నడుగుటలో నాతఁడు పాప మభిమానము నెంతగాఁ జంపుకొనెనో యోచింపుము. అట్లు మన మడ్డుపడినచో ఇహమున కీర్తినాశము, పరమున నుత్తమగతిభంగము నగును. అది నీకు సమీహితమా? మహాభయంకర కష్టపరిస్థితుల యందును ధర్మతనయునాజ్ఞ నుల్లంఘింపని మన కీపుణ్య కార్యాచరణవిషయమున తదాజ్ఞోల్లంఘనము ఎంతహైన్యము నాపాదించునో పరీక్షింపుము. ఇప్పుడిచ్చినచో నీతఁడు దినదిన మిట్లే యడుగుచుండు ననియు నీవు శంకించుట కాస్కారము లేదు. ధృతరాష్ట్రుడు చేసినపాపమునకుఁ బశ్చాత్తాపతప్తుడై నిస్పృహాలోలుఁడై యడవి కరుగుచుఁ దుదిపున్నెముగా ఈశ్రాద్ధక్రియల నాచరింపఁ గోరినవాడు. దీనిని గాదనుట యెంతనింద్యమో బాగుగా నాలోచింపుము. నీవు బాహుశాలివి. బాహుశాలిత్వముతోఁ బగ సమగ్రముగాఁ దీర్చి యీతని నీఁకలు పెఱికినపులుఁగువలెఁ జేసియు నింకను మెడపిసికిచంప నుంకింతు వేల? నిబాహుశాలిత్వమునకు లక్ష్య మీదీనుడు కావలయునా? అనునర్జునుని తాత్పర్య మీపద్యమున మనోజ్ఞముగా ప్రతీయమానమగును. అన్నకు హితబోధచేయఁగల యర్జునుని హృదయవైశాల్య మిందభివ్యక్తము చేయఁబడినది. మఱియు నిందు భీష్మముఖ్యజ్ఞాతులని దుర్యోధనాదులను బ్రత్యేకించి పేర్కొనకపోవుటయు నర్జునుని భీమకోపోపశమనతాత్పర్యము నభివ్యక్తముచేయును.

అర్జునుని వాక్యములు వినియు దురుక్తులాడినభీముని మందలించి యాతఁడు విదురునితో నిట్లు పలికెను :

> "నాయింటిధనము గైకొని చేయఁగలాఁ; డమ్మహీశుచిత్తము సంతో
> షాయత్తంబుగ వేగమ పోయి యనఘ! చెప్పు మవ్విభుఁడు ప్రియమందన్."

15.1.120

ఇం దర్జునుఁడు 'నాయింటిధనము గైకొని చేయుఁగలాఁ' డనుట భీముని కొక కశాఘాతమువంటిది. నీ వంగీకరింపకున్నచోఁ గార్యమాగునా? యనునభిప్రాయ మిట వ్యంగ్యము. 'అమ్మహీశుచిత్తము సంతోషాయత్తంబుగ', 'అవ్విభుఁడు ప్రియమందన్' అనుటచే నీభీమసేనుని యుద్ధత వాక్యములను ధృతరాష్ట్రునికి వినిపించి యాతఁడు దుఃఖపడునట్లు చేయకుము. ఏమాటలు చెప్పినచో నాతనిచిత్తము సంతోషాయత్తమగునో, యేది విన్నచో నాతఁడు ప్రియమందునో యవియే విన్నవింపుము. పాప హితుఁడవైన

నీ కిది యసాధ్యము కాదనునర్థము వ్యంగ్యమగును. 'వేగమ' యనుటలో నీవింకను నిచట జాగుచేసినచో భీమసేనుఁ డేమే నాడును. ఆ అప్రియ వాక్యములు విననేల? యనునభిప్రాయము తోఁచును.

స్త్రీపర్వముతర్వాత మఱల నంతటి కరుణరసము నిండిపొంగారు పర్వమాశ్రమవాసము. ఇందొకవంక ధర్మజునియనన్యసాధారణ మగువృద్ధోపసేవయు, నింకొకవంక ధృతరాష్ట్రునియపారపశ్చాత్తాపసముద్రమును పరమరమణీయముగా వర్ణింపఁబడినవి. ధృతరాష్ట్రాదులు వనవాసమున కరుగుఘట్టమును, ధృతరాష్ట్రుడు పురప్రజల ననుమతి వేఁడుటయు, పాండవులు, వనవాసగమనమునకు నిశ్చయము చేసికొన్న కుంతీదేవిని బ్రతిమాలుటయు నిత్యాదివృత్తాంతములు విని పాఠకుఁడు కన్నీరు పెట్టక మానఁడు. ధృతరాష్ట్రునివైరాగ్యభావము మిన్నుముట్టి మున్నాతఁ డొనరించినయన్యాయముల మఱపింపఁ జేయును. కుంతీహృదయపరిపాక మిందు మనోజ్ఞముగా నభివ్యక్తము చేయఁబడినది.

## ఆశ్రమవాసపర్వము - ద్వితీయాశ్వాసము :-

వేదవ్యాసుడు మృతవీరుల నెల్ల ధృతరాష్ట్రాదులకుఁ జూపినపిదప ధృతరాష్ట్రునితో నిట్లు పలికెను :

"కావున నింక వారికయి కౌరవసత్తమ! యుమ్మలింప; కా
ల్మావిలభావముం దపము నగ్గలికం బెడఁబాపు నిన్ను సం
భావనఁ గొల్చి యొక్క నెల పాండవముఖ్యుఁడు నిల్చె నిష్ఠమై
నీవనభూమి; నీవసుమతీశ్వరుఁ బొమ్మనఁగాదె వీటికిన్." 15.2.131

ఇందలి 'పాండవముఖ్యుఁడు', 'ఈవసుమతీశ్వరుడు' అనుపదము లభిప్రాయగర్భితములు, పాండవముఖ్యుడు గావున నీయందలి బంధుభావమును విడనాడలేక యొకనెల నిష్ఠతో నిన్ను సంభావనతోఁ గొల్చి యీ వనభూమియందుండెను. అతఁడు వసుమతీశ్వరుడు కావున నిట్లధిక కాలము వసుమతిని విడి వనవాసము చేయుట ధర్మము కాదు కదా! కావున నాతనికర్తవ్యమును గుర్తించి నీవు పొమ్మన్నఁ గాని పోఁడు. కావున నాతనిఁ బంపు మనునుపదేశ మిందు వ్యంగ్యమగును. వసుమతీశ్వరుఁ డని చెప్పుటలోని వ్యంగ్యమగు నభిప్రాయమును ధృతరాష్ట్రుడు గుర్తించెను. కావుననే 'అంబికేయుఁడు ధర్మాత్మజుఁ జిత్తనంప్రీతి మోమునఁ దోఁపఁ జేరఁనిలిచి వసుమతీకార్యనిర్వహణంబు పెద్దకొల్పునుండి నీ వనుదినము నడపకునికి కర్తవ్యమే' యని తఱువాత మందలించెను.

ధృతరాష్ట్రగాంధారీకుంతీదేవులు దేహవిమోచనము గావించుకథతో నంతమగు నీయాశ్వాసము కరుణరసోదంచితము. ధర్మజాదులు వారికై విలపించుటయందిది దృశ్యమానమగును. వేదవ్యాసుఁడు ధృతరాష్ట్రునకుఁ దాత్కాలికదృష్టిదానమొసగి మృత వీరుల నందఱను జూపిన వృత్తాంత మద్భుతరసమయము.

## మౌసల పర్వము :-

వినాశకాలము దాపురించిన యాదవులవిపరీతబుద్ధి యెట్టిదో యీక్రింది పద్యమున వక్కాణింపబడినది :

"భూమిసురావళీమహితభోజనతంత్రముఁ దీర్చుఁబూని హృ
ద్యామలరాజితంబులగున ట్లొనరించినకూడుగూర లా
కోమలు లాఁగఁగాఁ గడఁగి క్రోతుల కన్నియుఁ బంచిపెట్టి రు
ద్దామవిహారలీల వసుధావర! యాదవు; లేమి చెప్పుదున్." 16.37

కూడుగూరలు భూమిసురావళీమహిత భోజనతంత్రముఁ దీర్చఁబూని యొనరింపఁ బడినవి. భోక్తలు భూమిసురులు. వారును అనేకులు. భోజనతంత్రము మహత్త్వపూర్ణము. పదార్థము లేకారణముననైనఁ బరిత్యాజ్యము లైనవని భావించుటకు వీలులేదు. అవి హృద్యములుగా అమలములుగా రాజితములుగాఁ జేయఁ బడినవి. అట్లు చేయఁబడినను నవి యదుద్దిష్టములో తెలియక చేసినపనికాదు. కోమలులు వారించుచునే యుండిరి. కోమలులు కావున నుద్దామవిహారలీలతో విజృంభించిన యాదవులను దుర్వృత్తినుండి బలప్రయోగముచేసి మాన్పజాలరైరి. మఱియు సాధారణముగా దుష్టప్రవృత్తికలవాఁడైనను కోమలి వారించినచో హృదయమున అప్రయత్నముగ మెత్తఁదనమును వహించును. అట్టిది యిట గలుగలేదు. ఇట్టి శ్రేష్ఠపదార్థములన్నియు వారు క్రోఁతులకుఁ బంచిపెట్టి రనఁగా వారిహృదయములో భూమిసురులకు క్రోతులతోడిసామ్యము తోచినదని సంభావింపవచ్చును. లేదా, వారికంటె నివియే యాదరపాత్రము లని వారు తలచి రనియు నూహింప నగును. ఇట్టి యాగడముచేసినవా రెవ్వరో కాదు, యాదవులు. ఏవంశమున భగవంతుడు కోరి యవతరించెనో, యాయవతారమువలన నేవంశము జగన్మాన్యమై యలరారెనో, యావంశమువారు. ఇఁక వారివినాశకాలము నిశ్చితమగుటలో నాశ్చర్యమేమి? అది వాక్కులతో జెప్పుట యెట్లు? అనువైశంపాయనునిర్వేద మీపద్యమునఁ బ్రతీయమాన మగును.

వసుదేవుడు యాదవుల అన్యోన్యహననమును గూర్చి యర్జునునకు వివరించెను. పిమ్మట-

"అనునెడఁ- గ్రీడి యితఁడు కృ ష్ణునుపేక్షయచెప్పెఁ గాని శోకమడరియుం
బనవఁడు కృష్ణుని; గావున ననుమానము వలవ దమ్మహాత్ము నునికికిన్."
16.114

అర్జునుని యీయనుమానమువలన నోరార నెవ్వరినేని అడిగినచో నెట్టి దుర్వార్త వినవలసివచ్చునో యంది వినశక్యముగాదను నభిప్రాయమును, దన్మూలమున శ్రీవాసుదేవునియం దాతనికిఁ గల గాఢానురాగమును బ్రతీయమానములగుచున్నవి. మహాత్ముఁ డను విశేషణముగూడ సాభిప్రాయము. మహాత్ముడగు నాతనికి మృతి యెట్లు సంఘటిల్లు నను నూఱట యిందు వ్యంగ్యము.

వసుదేవుడు ధనంజయునకుఁ జెప్పవలసిన వన్నియుఁ జెప్పి తుది కిట్లనెను:

" పీనుఁగు పెంటగాఁ బడినబిడ్డల నెల్లఁ దలంచు టిప్పుడున్
మానఁగరామి తెల్ల మిది మానసముం గలఁగింప నన్నముం
బానము నెమ్మెయిన్ రుచికి బట్టగు? నట్లును గాక యిద్దెసం
దాను సహించి యేమిగతిఁ దావికొనున్ మెయిఁ బ్రాణ మర్జునా!" 16.122

ఇందు వసుదేవుడు తనజీవన మింకనసాధ్య మనునంశమును వ్యంగ్యముగా నుటంకించెను. 'పడినవారు బిడ్డలు, ఒకరిద్దరు కారు. ఎల్లరును బడిరి. అదియు జరారోగపీడచే నైనచో కొంతసహ్యము. అట్లుగాక వేఱుమార్గమున పీనుఁగు పెంటగా భరింపశక్యముకానిజుగుప్స నావహించుచుఁ బడిరి. ఇట్టిస్థితిలో మనస్సు అనుక్షణమును గలఁగింప కెట్లుండును? ఆ కలఁకతో జీవితస్థితికిఁ దావలములైన యన్నపానములే రుచింప వన్నచో తక్కినయరయిక కవకాశ మెక్కడ? ఇట్టి దుర్భరమైనపరిస్థితిలో ఈ ప్రాణముమాత్రము ఎట్లు శరీరమున నిలువఁగలదు? అనఁగా నది వజ్రసన్నిభమై మొండితనముతో నిలిచిననిలుచుఁగాక! నాకు దానితోఁ బని యేమియు లేదు' అనునభిప్రాయము లిందుఁ బ్రతీయమానములై ప్రాణములయెడ వసుదేవున కుదయించినవిరక్తిని బ్రస్ఫుటముచేయుచున్నవి. నామరణము తథ్యము. శ్రీకృష్ణుడు నిన్నుఁ జూపి నా కప్పగించినవాని నన్నింటిని నీకప్పగించితిని. ఇఁకపై నీవే బాధ్యత వహింపు మనుభావ మిట వ్యంగ్యము.

అర్జునుఁడు శ్రీకృష్ణు నన్వేషించి తుది కాతనిదేహమును గని శోకవివశమైన చిత్తముతో నుండఁగా దోడవచ్చినభూసురు లనునయించి కృష్ణదేహమును గొనిపోదమా? బంధువుల నిటకుఁ గొనివత్తమా యని యడిగిరి -

"అని యడుగంగ 'దైవగతి నంబుధి పట్టణ మాక్రమించు టె
ద్దినముననొక్కొ?' యన్వగ మదిం జొనిపెం గురునాథ! యప్పుడ

వ్వినుతగుణాభిరాము డడవిం దమ త్రిమ్మటఁ జన్నప్రొద్దుల
య్యనుచరకోటితోడఁ దెలియం దలపోయఁగ లెక్కవచ్చినన్." 16.168

ఇందలి అడవిం దమత్రిమ్మటఁ జన్న...... ఇత్యాది వాక్యభాగమువలన నారాయణాన్వేషణమున దినములుగడచిన సంగతి గాని, నిద్రాహారజ్ఞానము గాని, తదితరదేహ సంబంధవృత్తులు గాని గుర్తింపశక్యముకానివిధమునఁ బరమనిష్ఠాగరిష్ఠులై వారన్వేషించి రనునంశము ప్రతీయమానమగును. తన్నునుక్షణము కాపాడిన దయాలోలుడు శ్రీకృష్ణుడు కానవచ్చునంతకు అర్జునున కన్యవిషయజ్ఞానచింత బీజప్రాయముగా నైన పొటమరింపలే దనునర్థ మిటఁ దోఁచి యాతని యనన్యసాధారణ భక్తివిశేషమును బ్రతీయమాన మొనరించును. కావుననే యాతఁడు వినుతగుణాభిరాముఁ డగుచున్నాడు.

రౌద్రభయానకరసములతో నారంభమైనయీపర్వము సర్వయాదవసంహార తద్బంధువిలాపాదిరూపమునఁ గరుణముతో నిండారి తుదకు విజ్ఞానసంపద్విఖ్యాతుఁ డగు సాత్యవతేయుఁ డర్జును నోదార్చుటయందలి శాంతరసముతో పరిసమాప్తమగుచున్నది. బలరామకృష్ణులన్యస్థానగమనవృత్తాంత మద్భుతావహము. లీలామానుష విగ్రహుండును, జగన్నాటక సూత్రధారియు నగు శ్రీకృష్ణునినిర్యాణము జగదనిత్యత్వ ప్రతిపాదకమై శాంతరసభరితమై యొప్పుట యిందుఁ గానవచ్చును.

## మహాప్రస్థానిక పర్వము :-

తనపాటునకుఁ గారణ మేమని వాయుజుఁ డడుఁగఁగా ధర్మజుఁ డిట్లు సమాధానించెను :

"అన విని యాతఁ డిట్లనియె నాతనితో 'భవదీయమైన భో
జన మతిమాత్ర ముద్ధతిఁ బ్రచండుఁడవై భుజశక్తి నెవ్వరిం
గొనక కడంగి రజ్జుపలుకుల్ గడుఁ బెక్కులు వల్కు దెప్ప నీ
వనుపమశౌర్య! యిప్పుడుట కత్తెఱఁగుల్; గత మెల్లఁ జెప్పితిన్." 17.44

ఇందలి ఉద్ధతిన్, ప్రచండుఁడవై, గడున్, పెక్కులు, ఎప్పు అనుపదములు భీమసేనుని దోష మతిమాత్ర మను నంశమును వ్యంగ్య మొనర్చుచున్నవి. అనుపమశౌర్య! అనునంబోధనము, ఎంతశౌర్యమున్నను నమయానుగుణముగనే ప్రకటించుట దోషముకాదు కాని దాని నూఁతగాఁ గొని రజ్జులాడుట పతనహేతువగు ననునర్థమును బ్రతీయమానమొనరించును.

ఇంద్రుడు రథంబు గొని ధర్మరాజు నెదుర్కొని దివ్యస్యందన మెక్కుమని పలుకఁగా నతఁ డతని కిట్లనెను :

"తోడంబుట్టువు లందఱుంబడిన యాదుఃఖంబు చిత్తంబు సం
పీడం బెట్టెడు; సౌకుమార్యవతి దప్పింగూలెఁ బాంచాలి; వా
ర్లేడై వచ్చిరి; వారు లేక యిట మీతో రాను; వారెల్ల నా
తోడం గూడఁగవచ్చునట్లుగఁ గృపాధుర్యాత్మ! కావింపవే" 17.50

ఇందలి యందఱు ననుపదము ధర్మజునిదుఃఖాతిశయము నభివ్యంజించును. 'సౌకుమార్యవతి' యనువిశేషణము ద్రౌపదియెడఁ బొడమినజాలి నభివ్యక్తము సేయును. 'మీతో రాను' అని ఖండితముగాఁ బల్కుట యాతనిధైర్యగరిమను గమ్యమానమొనర్చును. 'కృపాధుర్యాత్మ' అనుసంబోధనము ప్రార్థనాదైన్యము నభివ్యంజించును. 'వారు' అనుసర్వనామవు త్రిరావృత్తి వారిపై నాతనికిఁ గల యాదరాతిశయమునకుఁ బ్రత్యాయకము.

శునకరూపమును వదలి ధర్ముఁడు ధర్మజునియాశ్రితవాత్సల్యమును గొని యాడుచు నతనితో నిట్లు పలికెను :

"విను భక్తియుక్త మిది యని శునకముఁ జేపట్టి నీవు సురపతికొనివ
చ్చిన యరద మెక్కనొల్లవ; యనఘా సరినీకు దివమునందును గలరే."1.7.65

'శునకముఁ జేపట్టి' యనుటలో నుచ్చనీచతారతమ్యవివక్ష నీకు లేదు. ఇట్లు నీవు భావనను బండించుకొంటి వనునర్థము తోఁచును. 'సురపతి కొని వచ్చినయరద మెక్కనొల్లవ' అనుటలో నీ 'స్వసుఖనిరభిలాషత' పారముముట్టిన దనునంశము వ్యక్తమగును. 'సరి నీకు దివమునందును గలరే' అనుటచే నీయౌదాత్త్యమునకు స్వర్గప్రాప్తి యొకఫలముగా సంభావింపఁదగినది కాదనునర్థము ధ్వనించును.

ధర్మజునిహృదయపరీపాకము, లక్ష్యసిద్ధికి వలయు వైరాగ్యసంపదయు, మార్గమునఁ బడిన సోదరులకొఱకును, ద్రౌపదికొఱకును విచారగ్రస్తుఁ డగుట ఫలసిద్ధికి భంజకమగు ననువివేకమును, శునకమునకై యింద్రానుగమనతిరస్కారముచేయుటచే వ్యక్తమగువాల్లభ్యము మున్నగులక్షణము లీపర్వమున మనోజ్ఞముగాఁ జిత్రింపబడినవి. ఇందు స్వర్గప్రాప్తికి పూర్వ మాతఁడు చూపినధైర్యగరిమ యాతని నిర్వికార చిత్తవృత్తిత్వమునకు వ్యంజకమై శాంతరసము నాస్వాదింపఁ జేయును. ఇంద్రదర్శన మైనవెనుక నాతనిమమకారాదులు దోషభూయిష్ఠములు గావు. లక్ష్యసిద్ధియైన పిదప నాతని యీ ప్రవర్తన మాతని యాత్మోన్నత్యమునే యభివ్యంజించును.

## స్వర్గారోహణపర్వము :-

నరకమున నున్నసోదరులను గాంచి ధర్మజుఁడు దేవదూతతో నిట్లనుచున్నాఁ డు :

"నాయనుజులు దుఃఖార్దితు లైయున్నా; రట్టు లగుట నచటికి రా; నిం
కీయెడన యేను నిలిచెదఁ బాయక; యనిచెప్పు మాకృపానిరతునకున్."18.28

ఇందలి 'నాయనుజులు' అనుపదము నావంటివారేయైన వారికి నాకుఁ గలుగు సుఖము లేనిచో నాకేటిసుఖ మను భావమును వ్యంజించును. 'ఎడన' అనుచోటి యవధారణార్థకమును, 'పాయక' అనుపదమును నాతని మనోధైర్యమును వక్కాణించును. 'అకృపానిరతునకున్' అనుపద మధిక్షేపవ్యంజకము. నన్ను నాసోదరులనుండి వేఱుపఱచినయాతఁడు కృపానిరతుఁ డెట్లగును? ఆతఁడు కఠోరహృదయుఁ డనునింద యిందు వ్యంగ్యము.

తన దివ్యప్రవర్తనముచే భూలోకమును భవ్యమెునర్చి యుత్తమ పురుషప్రవర్తనముచే దివి నలంకరించిన ధర్మజుని మహోదాత్తత యీస్వర్గారోహణ పర్వమున వర్ణింపఁ బడినది. స్వర్గమున దుర్యోధనునిఁ గాంచి యసూయచెందుటయు నరకమున దారసోదరులఁ గాంచి దుఃఖించుటయు నాతనివివేకము నభివ్యంజించును. పాపాత్ములకు స్వర్గమును, పుణ్యాత్ములకు నరకమును గూడవని యాతనినిష్కర్ష. తుది కింద్రయము లాతనికి బ్రీతిసంఘటించి తమతోఁ గలుపుకొనుటచే నాతని యీ ప్రవర్తనము దుష్టముగాదనునర్థము వ్యక్తమగును. పరిపూర్ణమానవుఁడు పరమగతి కెట్లుచేరునో యిందు నిరూపితము.



ఓమ్

# భారత ధ్వని దర్శనము

## నవమాధ్యాయము

## అంగిరసము

శ్రీమదానందవర్ధనాచార్యులు ధ్వన్యాలోకచతుర్థోద్ద్యోతమునఁ బ్రాస్తావికముగాఁ బ్రబంధమున నంగిరస మొక్కటియే యుండునని సిద్ధాంతీకరించుచు లక్ష్యములుగా శ్రీమద్రామాయణ మహాభారతములను గైకొనిరి. అందు రామాయణమునఁ గరుణరసమును భారతమున శాంతమును అంగిరసములుగా వారు సోపపత్తికముగా నిరూపించిరి. ఈవిషయమున నీనిరూపణములో నొక్కవిశేషము గోచరించును. వారు రామాయ ణాంగిరసము నొక్కముక్కలోఁ దేల్చివేసి, భారతవిషయమునఁ గొంతచర్చగావించిరి. ఇందొకప్రత్యేకతగలదు. వ్యాసరచిత శ్రీమహాభారతము రామాయణమంత ప్రసన్నమైన గ్రంథముకాదు. అది శాస్త్రకావ్యమగుటచేతను, సంపూర్ణముగా నొక యుగమునకు సంబంధించిన కథావస్తువు కలదియగుటచేతను, భాషయును శైలియును రామాయణము నందుకంటె ప్రౌఢములగుటచేతను నియ్యది మిక్కిలి గంభీరమై రసాదివిషయమున నలవోకగా నిర్ణయముచేయుటకు వీలులేనిదై యున్నది. కావుననే ధ్వనికారులు శాంతరస ప్రతిపాదనమును బ్రయత్నపూర్వకముగా సాధింపవలసివచ్చినది. సంస్కృత మహా భారతము నందు శాంతరసమే యంగి యనుటకు వారు చూపిన యుపపత్తులను బరిశీలించుటకు ముందు శాంతరసము అస్తిత్వమును గూర్చియే యభిప్రాయభేదము లున్నవి కావున దానిని విమర్శింపవలసియున్నది.

శాంతమని యొకరసమున్నదా? యనుశంకకు బీజము అలంకారశాస్త్రమునకుఁ బ్రథమప్రమాణగ్రంథమైన నాట్యశాస్త్రమునందే కానవచ్చును. అందు శాంతరసము పేర్కొనఁబడక రసములను వాని స్థాయిభావములును ఎనిమిదేసియే చెప్పబడినవి. వాని పరిగణనము నీక్రింది శ్లోకద్వయమునఁ జూడవచ్చును.

"శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః,
బీభ త్సాద్భుత సంజ్ఞౌ చే త్యష్టౌ నాట్యే రసాః స్మృతాః!
రతి ర్హా సశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా,
జుగుప్సా విస్మయ శ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః!"

ప్రకృతము లభించు నాట్యశాస్త్రప్రతులలో శాంతరసముకూడ నున్నను నది ప్రాచీనగ్రంథములలో నుండియుండదను ననుమానమునకుఁ గొన్నిహేతువులు గాన వచ్చుచున్నవి. (1) భరతుడు తక్కినరసములకు వలె శాంతరసమునకు స్వరలయ గుణాలంకారముల నిరూపింపకుండుట (2) ధ్వన్యాలోకమున నానందవర్ధనులు శాంతరసప్రతిపాదనము గావించుచు నాట్యశాస్త్రవాక్యముల నుపోద్బలకముగా నుద్ధరింపకుండుట. (3) అభినవగుప్తులు శాంతరసస్థాపనముఁ గావించుచు "మునినా వ్యంగీక్రియతే క్వచి చ్ఛమ ఇతివదతా" యని మార్గాంతరమునఁ జెప్పవలసి వచ్చుట. ఇట్టివే మఱికొన్నియును భరతుఁడు శాంతరసము నంగీకరింపలేదని యనుమానించుటకు హేతువులగుచున్నవి. మరియు నీవిషయమును క్షుణ్ణముగాఁ జర్చించి డా॥ పోణంగి శ్రీరామ అప్పారావుగారు తమ నాట్యశాస్త్రాను వాదమున నిట్లు వ్రాసిరి :

"భరతుడు శాంతరసమును బేర్కొనలేదనుట తెల్లము. దృష్టిముఖరాగాదులను స్వరలయగుణాలంకారాదులను ఎనిమిదిరసములకు మాత్రమే భరతుఁడు వివరించెను. మఱియు వర్ణదైవతములను చెప్పునప్పుడు, ప్రధానజన్యరసములను చెప్పునప్పుడును శాంతరసప్రసక్తియేలేదు. ఆనందవర్ధనుడు శాంతమును రసముగా స్థాపించునప్పుడు తనవాదమున కనుకూలమైన వాక్యములను నాట్యశాస్త్రమునుండి ఉదాహరించలేదు. కావున భరతుఁడు శాంతమును పరిగ్రహించలేదనుట నిశ్చయము."

(ఆంధ్ర నాట్యశాస్త్రము - పు. 217)

కాని యానందవర్ధనాభినవగుప్తుల యభిప్రాయము ననుసరించి శాంతరసము గలదు. భరతుడుఁను దీనిని భంగ్యంతరముగా నంగీకరించె ననుటకు నాధారములు గలవు. (1) శాంతరసములేదన్నచో భరతుఁడే నుడివినట్లు నాట్యము త్రైలోక్యానుకరణ మనుట పొసఁగదు. ఏలయన లోకమున వైరాగ్యమును దత్ఫలమగు మోక్ష పురుషార్థ సిద్ధియు ననుమానాదిప్రమాణములచేనైనను గోచరించుచునేయున్నది. (2) అనాదికాల ప్రవాహాయాతములైన రాగద్వేషాదుల యుచ్ఛేదన మశక్యమగుటచే నిది యుండుటకు వీలులేదని కొంద అనుటయుఁ గుదురదు. అదియే సత్యమైనచో వైరాగ్యమును మోక్షమును అస్తిత్వమునే పొందఁజాలవు. కొందఱకు సంస్కార బలమున రాగద్వేషాదుల యుచ్ఛేదనము శక్యమే యగుట గోచరించుచునేయున్నది. కావున సర్వజనానుభవగోచరత లేనిచో తావన్మాత్రమున నావస్తువు లేదనుటకు వీలులేదు. కాదన్నచో శృంగారరసానుభవము లేనివాఁ డెవఁడేని ఉన్నయెడల శృంగారమే లేదనవలసివచ్చును. (3) రత్యాదులు కవి నట వ్యాపారముచే నాస్వాదయోగ్యము లైనట్లే మోక్షపురుషార్థోచితమగు చిత్తవృత్తియు రసస్వరూపమును బొంది యాస్వాదయోగ్యమగు ననుటలో నాక్షేపముండదు.

అయినచో శాంతమును దక్కినరసములతోపాటు భరతుడేల పేర్కొనలేదను ప్రశ్నకుఁ గొంద ఱిట్లు సమాధానము చెప్పిరి. అయ్యది ప్రకృతిరసము. తక్కినవి వికృతిరసములు. ఈయన్నింటిని సమానకక్ష్యలోఁ బరిగణించుట శాంతరసమునకు న్యూనత నాపాదించును. కావుననే "క్వచి చ్ఛమః", "తుష్యన్తి - మోక్షే ష్వథ విరాగిణః" మున్నగువానిచేత సూచించి వదలిపెట్టెనుగాని తక్కినవానివలె దానిని సాంగోపాంగముగా వివరింపలేదు.

కావున ముముక్షువులై సంస్కారాభ్యాసబలములవలన జగదనిత్యత్వ భావమును బండించుకొనిన వీతరాగులు శాంతరసాస్వాదమును బొందుట కధికారులనుటలో నెట్టి విప్రతిపత్తియు నుండవీలులేదు.

ధనిక ధనంజయ విశ్వనాథాదులుగూడ శాంతరసమునుగూర్చి బాగుగాఁ జర్చించిరి. ధనంజయుఁడు శాంతరసము నాశంకించి 'శమ మితి కేచి త్ప్రాహః పుష్టి ర్నాట్యేషు నైతస్య' అని నాట్యములందు శాంతమునకుఁ బుష్టిలేదని నొడివెను. దశరూపకవ్యాఖ్యాత ధనికుఁడు శాంత మభినేయము గాకపోవుటచే నాట్యమునందు లేకపోయినను గేవలశబ్దవ్యాపారముగల శ్రవ్యకావ్యములలో, శబ్ద మతిసూక్ష్మ విషయములను గూడ నిరూపింపఁగలదు గావున, నుండవచ్చునని తీర్మానించెను. అతఁడు శాంతరసస్వరూపము నిట్లు వక్కాణించెను :

"న యత్ర దుఃఖం న సుఖం న చిన్తా నద్వేషరాగౌ న చ కాచి దిచ్ఛా
రసస్తు శాన్తః కథితో మునీంద్రైః సర్వేషు భావేషు శమప్రధానః"

ఇట్లు చెప్పి యాతడిది సర్వవిషయములందును శమమే ప్రధానమైన దగుట చేతను, మోక్షావస్థయందే లభించున దగుటచేతను దీనికి సంచార్యాది స్వరూపనిరూపణము దుష్కరమనియుఁ గావున దానిని సూటిగాఁ జెప్పఁజాల మనియు వాక్రుచ్చెను. శ్రుతి పరమాత్మస్వరూపము నన్యాపోహరూపమున నేతి నేతి వాక్యములచేఁ బ్రతిపాదించిన విధమున శాంతమును గూడ నట్లు భావింపవలయునే కాని ఇది దీనిస్వరూప మని విస్పష్టముగా నిరూపించుట శక్యముగాదని యాతని యభిప్రాయము. కాని నిత్యసంతుష్ట్యాదులచే నది యనుభూయమానమగుచున్న దనియు నాతఁ డనెను.

విశ్వనాథుఁ డీయభిప్రాయమును ఖండించుచు శమము మోక్షావస్థయందు మాత్రమే కాక యాత్మసాక్షాత్కారదశయందును, తద్వ్యతిరేకదశయందునుగూడఁ గలదనియుఁ గావున నప్పుడు సంచార్యాదు లుండుటకు వీలేర్పడి యది రసముగాఁ బరిణమించుననియు నిరూపించెను. కావున నిది దృశ్యశ్రవ్యకావ్యోభయసాధారణ మనియు నాతఁ డుగ్గడించెను.

రస మనుకర్తృనిష్ఠ మనువారు కొందఱు-

"శాన్తస్య శమసాధ్యత్వా న్నటే చ తదసంభవాత్,

అష్టా వేవ రసా నాట్యే నశాన్త స్తత్ర యుజ్యతే"

అందురు. రస మనుకర్తృనిష్ఠ మను నభిప్రాయమే అసంగతము కావున నీవాక్య మనాదరణీయము. మరికొందఱిది దయావీరముకంటె భిన్నముకాదందురు. వీర ముత్సాహస్థాయికము కావునను, ఉత్సాహ మహంకారరూపము కావునను, అహంకారప్రశమన రూపమగుశాంతము దయావీరము కానోపదు. కొందఱు దీని నంగిగా నిబంధింపరాదందురు. అదియు భ్రాంతిమూలకమే. ప్రబోధచంద్రోదయాదులం దిది యంగిగానే నిబంధింపఁబడినది.

ఇట్లు శాంతరసము అస్తిత్వము నిరూపింపఁబడినది. దీనికి స్థాయి భావమేది యనుప్రశ్నయు విస్తృతమైనచర్చకు దారితీసినది. శమము, సమ్యగ్జ్ఞానము, తృష్ణాక్షయసుఖము, సర్వచిత్తవృత్తిప్రశమము, నిర్విశేషచిత్తవృత్తి, నిత్యసంతుష్టిరూపయైన ధృతి, తత్త్వజ్ఞానజన్యమైననిర్వేదము, మోక్షప్రాప్తియత్నోత్సాహము, జుగుప్స, ఆత్మరతి మున్నగునవెన్నియో శాంతమునకు స్థాయిభావములుగాఁ బలువురిచే బేర్కొనఁబడినవి. ఇం దొండురెండుకాక తక్కినవన్నియు నించుమించు సమానార్థకములే. సర్వచిత్త వృత్తిప్రశమము అభావరూపము కావునను, ఉత్సాహ మభిమానమయ మగుటచేతను, జుగుప్స వ్యభిచారభావ మగుటచేతను, ఆత్మరతియును నట్టిదే యగుటచేతను నవి శాంతమునకు స్థాయిత్వము నొందఁ జాలవు. శమమన్నను సమ్యగ్జ్ఞానము, తృష్ణాయసుఖము, ధృతి, నిర్వేదము- ఇవియన్నియు నొకేయభిప్రాయ మును బోధించును. వీనిచేఁ జెప్పఁబడునదియే శాంతమునకు స్థాయిభావము.

ఇట్లు శాంతము ఉనకి నిరూపింపఁబడినది కావున నిది సంస్కృత భారతమునకు నంగిరస మయ్యె ననుట కానందవర్ధనులు చూపిన యుపపత్తుల నరయఁదగును.

(1) భారతము శాస్త్రకావ్యము - శాస్త్రములవలె పురుషార్థముల నిరూపించును. కావ్యమువలె రససమంచితమగును. ఆమూలాగ్రము భారతముఁ జదివిన పిమ్మట సంస్కారవంతుఁడైన మానవునకు వైరాగ్యము తప్పక కలిగితీఱును. ఏలయన నిందుఁ బర్యవసానమున యాదవపాండవు లత్యంతశోచనీయమైనవిధముగా తనువులు చాలించిరి. ఈవృత్తాంతము చే నంతకుమందు వారనుభవించిన యైశ్వర్యాదుల యనిత్యత ప్రతిపాదింపఁ బడుచున్నది. కావునఁ బాఠకునకుఁ దప్పక వైరాగ్య మొదవును. ఈయభిప్రాయమును వ్యాసభగవానుఁడు కంఠోక్తిగాఁ జెప్పియు నున్నాఁడు -

"యథా యథా విపర్యేతి లోకవృత్త మసారవత్,
తథా తథా విరాగోఽ త్ర జాయతే నాత్ర సంశయః"
ఇట్టి యభిప్రాయము పలుమాఱులు చెప్పఁబడినది.

(2) అనుక్రమణికలోని "భగవాన్ వాసుదేవోఽ పి కీర్త్యతేఽ త్ర సనాతనః" అనువాక్యమునందలి 'సనాతనః' అనుపదము భారతమునందలి సారతమార్థమును వ్యంగ్యముగాఁ బ్రతిపాదించుచున్నది. ఈ పదము సాక్షాచ్ఛ్రీమన్నారాయణునిఁ దెలుపుచు నతఁడే సర్వగమ్యుఁ డను నభిప్రాయమును, అతని కీర్తన మిందుఁ గలదను నంశమును బోధించును.

(3) శ్రీమహాభారతము హరివంశముతో ముగియుటయు శాంతరసప్రతిపాదకము. "సాంసారికవృత్తిరూపమగు మహాభారతము చివర సంసారాతీతమగుతత్త్వము శ్రీవాసుదేవపరబ్రహ్మమును గీర్తించెను." (ఆంధ్ర ధ్వన్యాలోకము - పు. 666)

ఆనందవర్ధనులు చూపిన పై హేతువు లాంధ్రమహాభారతమున నెంతవఱ కన్వయించునో పరిశీలింపవలయును. కవిత్రయమువారు భారతమును జగద్ధిత బుద్ధితోడను, ఆంధ్రావళి మోదముఁ బొందునట్లును, సాధుజనహర్షసిద్ధి గలుగునట్లును మూలభారతము నవసరములగు మార్పులతోఁ గొన్నిచేర్పులతోఁ దెలుఁగున రచించిరి. కాని వారి మార్పుచేర్పులు సంస్కృతభారతమునందలి యంగిరసమును మ్రింగి వేయునంతటివి కావని నాయభిప్రాయము.

(1) యాదవ కౌరవ పాండవ విరసావసానము తెలుఁగున నన్యథాకరింపఁ బడలేదు. కావున సంస్కృతభారతముఁ జదువువారి కాముగింపువలన నేయనుభూతి గలుగునో యిందును నదియే కలుగును.

(2) సనాతనుఁడైన వాసుదేవకీర్తనమాంధ్రభారతమునందును సంస్కృతము నందువలెనే కలదు.

(3) కవిత్రయములో మూఁడవవాఁడగు నెఱ్ఱాప్రెగ్గడ ఆరణ్యపర్వశేషముతో పాటు హరివంశమునుగూడఁ దెలుఁగున రచించెను.

ఇట్లు శాంతరసస్థాపకములుగా ధ్వన్యాలోకమునఁ జూపఁబడిన హేతువు లాంధ్రమహాభారతమునందును గోచరించుచునేయున్నవి కావున నిందును శాంతరసమే యంగి యనుట కెట్టి యాక్షేపణము నుండరాదు. అయినను నీవిషయమునఁ గొందఱకు ప్రత్యయము గలుగుటలేదు కావున నీయభిప్రాయము నింకను వివరింప వలసియున్నది.

(1) నన్నయ భారతరచనారంభమున :

"శ్రీ వాణీ గిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్,
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకన్ధరాః శ్రేయసే." 1.1.1

అను పద్యమునఁ బాఠకునకు శ్రేయస్సును ఫలముగా నాకాంక్షించెను. "ముక్తిః కైవల్య నిర్వాణ శ్రేయో నిశ్శ్రేయ సామృతమ్" అని యమరము. శ్రేయశ్శబ్దమునకు పుణ్యము, శుభము అను మరియొకయర్థమున్నను (స్యాద్ధర్మ మస్త్రియాం పుణ్యశ్రేయసీ సుకృతం వృషః- అమరము) ఈరెంటిలో నన్నయ్య మహాప్రయోజనమగుముక్తినే తన భారతరచనవలనఁ బాఠకున కపేక్షించె ననుట సముచితమగును.

తిక్కనామాత్యుఁడును-

"శ్రీయన గౌరినాఁబరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగురూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్." 4.1.1

అని యిష్టసిద్ధికై పరతత్త్వమును గొల్చెద ననెను. అతఁడు తనయిష్టమేదో హరిహరనాథునికి విస్పష్టముగా నివేదించియేయున్నాఁడు -

"ఇంతకు నేర్చు నీకు నొకయింతటిలోన మదీయవాణి న
త్యంతవిభూతిఁ బెం పెసఁగునట్టి నినుం గొనియాడఁ జేఁత తా
నెంతయుఁ బెద్ద నీకరుణ నిట్లు పదస్థుఁడ నైతి నింక జ
న్మాంతరదుఃఖముల్ దొలఁగునట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే." 4.1.21

*"అని యుపలాలితుండగు డింభకుండు తనకొలది యెఱుంగక మహాపదార్థంబు వేఁడువిధంబున బ్రహ్మానందస్థితిం గోరి....."* ఈ వాక్యమువలన నాతఁ డపేక్షించినది తురీయపురుషార్థమగు మోక్షానందమే యనుట స్పష్టము. అట్టి యానందవిశేషమునే తనకావ్యముద్వారమున నాంధ్రుల కాతఁడు అభివాంఛించె ననుట 'ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ' అనువాక్యభాగమువలన సంభావింపనగును.

ప్రబంధపరమేశ్వరుఁడగు నెఱ్ఱనయు 'నన్నయభట్టమహాకవీంద్రు సరస సారస్వతాంశప్రశస్తి దన్నుఁ జెందఁగా' 'సాధుజనహర్షసిద్ధిఁ' గోరి యారణ్య పర్వశేషమును రచించెను. ఇందలి హర్షముగూడ నన్నయ తిక్కనల యడుగు జాడలలో నడచిన యాతనిదృష్టిలో కైవల్యానందమే యని సంభావించుట సత్యదూరము కానోపదు.

ఇట్లు కవిత్రయంమువారి భారతోపక్రమము ఏకాభిప్రాయముతోఁగూడి మోక్షలక్ష్యముగా శాంతరసప్రధానముగా ఆంధ్రమహాభారతరచనము సాగె నను నంశమును బ్రతిపాదించును.

భారతప్రశస్తిసందర్భములందెల్ల నుపాయభూతములగు ధర్మార్థకామములతో పాటు ఉపేయముగ మోక్షముగూడ దృఢముగా వక్కాణింపఁబడినది.

(1) "కమనీయ ధర్మార్థ కామమోక్షములకు నత్యంతసాధనంబయినదాని...."
1.3.9

(2) "ఆయుష్యం బితిహాసవస్తుసముదాయం బైహికాముష్మిక శ్రేయఃప్రాప్తి నిమిత్తము..........." 1.3.11

(3) "వేదముల్ నాలుగు నాదిపురాణముల్ పదునెనిమిదియుఁ దత్ప్రమితధర్మ శాస్త్రంబులును మోక్షశాస్త్రంబులు నెఱిఁగిన ఫలమగు......" 1.1.72

(4) "అమల ధర్మార్థకామ మోక్షముల గురిచి
యొలయు తెరువెద్దియును నిందుఁ గలుగు నదియ
యొండెడలఁ గల్గుదీన లేకుండు చొప్పు
దక్కొ కంటనులేదు వేదజ్ఞులార!" 18.82

ఇట్టివి మఱియు పరశ్శతములుగా గలవు. వీనిచే అభ్యాసము - పునఃపునః కథనమను తాత్పర్యనిర్ణయలింగము శాంతరసప్రతిపాదకమగుచున్నది.

కథాంశమునుబట్టిచూచినను నాయకుఁడగు ధర్మజునకు, తత్తత్కాలములందు తత్తద్విశైషిజనప్రేరణమువలనఁ గలిగిన రాజ్యకాంక్షాదులను విడచినచో తక్కినకథాంశము నందెల్ల నాతని వైరాగ్యమే ప్రస్ఫుతముగా భాసిల్లును. ఆతని రాజ్యకాంక్షయు బలవత్తరము కాదనుట కనేకప్రమాణములు గలవు. (1) చెల్లి యుండియు సైరణచేయుట (2) శ్రీకృష్ణుని రాయబారమునకుఁ బంపునపు డన్న దమ్ములకుఁ గనీన మైదూళ్ళిచ్చినను జాలు ననుట (3) యుద్ధమునకు విముఖుఁ డగుట (4) శత్రువినాశమంతయు నైనపిదప మహాప్రయత్నముతోఁగాని రాజ్యపాలనమున కంగీకరింపకుండుట (5) రాజ్యము సిద్ధించిన పిదప ధృతరాష్ట్రునియందించుమించుగా నర్వాధికారముల నిక్షేపించుట (6) అశ్వ మేధయాగాంతమున దక్షిణగా భూమినంతటిని ఋత్విక్కుర మొనర్చి తిరిగి గ్రహింప నొల్లకుండుట (7) వ్యాసాదిప్రచోదనమువలన గత్యంతరములేక గ్రహించుట (8) శ్రీకృష్ణా దుల నిర్యాణవార్తవిని రాజ్యమునకుఁ బరీక్షితుని రాజుఁ గావించి యుయుత్సుని మహానాయకుఁడుగా నియమించి మహాప్రస్థానమున కేఁగుట మున్నగున వెన్నియో యాతని వైరాగ్యమును బ్రతిపాదించును.

యుద్ధషట్కముకూడ శాంతరసపరముగనే ముగియును. పాండవపక్షమునకుఁ బేరునకు జయము కలిగినది కాని యది ధర్మజుని హృదయమునకు మోదము నీకపోగా కడమజీవితమున కంతటికిని సరిపడు ఖేదమును మాత్రము సమకూర్చినది. సాధారణముగ మఱియేయితరకావ్యమునందును యుద్ధఫల మిట్లు జయించిన పక్షమునకు పరమదుఃఖహేతువుకాలేదు. ఈవిజయఫలమునుబట్టి భారతకథను జదువునపుడు ముఖ్యముగా ననుభూయమానమగునది నిర్వేదపూర్వకమగు శాంత రసమని చెప్పకతప్పదు.

అరణ్యపర్వమును, శాంత్యానుశాసనికపర్వములును ధర్మజుని శుశ్రూషా తత్పరత్వమును, వైరాగ్యగరిమమును జక్కగా నిరూపించుచున్నవి. అశ్వమేధ పర్వమునందు శ్రీకృష్ణుడు ధర్మజునకు దుఃఖోపశమనమును గావించుచుఁజివరకుఁ గామగీతలను వివరించి :

"పనివడి పూచిపట్టమి, సుబంధురధైర్యము, నిర్వహింతు నే
ననుమతి సొన్పకుండుట, సమగ్రతపంబునఁ దత్పలేచ్ఛలే
కునికి విమోక్ష తృష్ణభరమొందమి కాము నడంచుఁ గాన ని
య్యనువులలేమి సువ్వె యనపాయతగా నతఁ డాడె భూవరా!" 14.1.132

"అశ్వమేధమఖమునం దట్ల యనఘ య లోలుపత్వగుణవిశాలబుద్ధి
శాలివై ఫలాభిసంధిలే క క్కాము ధర్మగాఁ బొనర్పు ధర్మతనయ."

14.1.133

ఈయుపదేశము ధర్మజుని యశ్వమేధయాగమునకు స్వర్గము ఫలము గాదనుటను నిరూపించును. సక్తుప్రస్థునికథనుజెప్పి సకులము ఈధర్మజునియజ్ఞ మాతని దాతృత్వముతోఁ బోలదనుటచే నే మహాయజ్ఞము నెంతఘనముగాఁ జేసినను గలుగు ప్రయోజన మేమి యను నిర్వేదమును బాఠకునకుఁ బుట్టించును.

ఆశ్రమవాసపర్వమునందలి విదురధృతరాష్ట్రాదులదేహత్యాగము వైరాగ్యోద్బోధకమే యగును.

సర్వభారతములో నేవిషమసన్నివేశమున నైనను జక్కగా మెలఁకువతో నేర్పుతో పరిష్కారమార్గమును జూపి పాండవులను గాపాడిన శ్రీకృష్ణుడు తన వారు తనముందే పరస్పరాహననము చేసికొనుచుండగా నుపేక్షవహించుటయు, యాదవులందఱు దిక్కుమాలినచావులు చచ్చుటయు వర్ణింపబడిన మౌసలపర్వేతివృత్తము సాక్షాద్వాసుదేవునకే విధిచెయిదము లపరిహార్యములన్నచో సాధారణ మానవులమగు మనవిషయము

చెప్పనేల? యను రూపమున మానవుని తృష్ణా క్షయమునకు సహకరించును. ఆయాశ్వానము తుదను వేదవ్యాసుఁ డర్జునునకుఁ జేసిన బోధయు వైరాగ్యమునే కలిగించును.

"బలమును బుద్ధియుఁ జేవయు నలఘుమతీ! యుల్లసిల్లు నగుకాలమునం
బొలియుం గాలవిపర్యయ కలనంబున బుధుల కుబ్బుఁ గలఁకయుఁ గలవే."

16.221

"కాలమూలంబు సర్వంబుఁ గాన దీని కొండుతలఁపులు దక్కి మీ రుత్తమంపు
గతికిఁ జనుఁడు నిశ్చింత వికారతనులు విడిచి యార్యజనంబులు వినుతిసేయ."

16.222

ఈయుపదేశము, అర్జునునకు, అతనివలన వినిన ధర్మజునకు మాత్రమే పరిమితము కాదు. కాలము అవిలంఘ్యతను గుర్తించి యెల్లవారును ఐహిక బంధములకు లోనుగాక పరమసుఖమును బొందవలయు నను వివేకము సహృదయపాఠకునకు దీని వలనఁ దప్పక కలుగును. అట్టి వివేకమే శాంతరసానుభవమును బుట్టించును.

మహాప్రస్థానికపర్వమునందును ద్రౌపద్యాదు లొక్కొక్కరు వరుసగా పతనము చెందుచుండగా ఇంద్రదర్శనావధికముగా ధర్మజుఁడు నిర్వికారుఁడై చనుట యాతని ధైర్యలక్ష్మిని వ్యక్తము చేయుచు పాఠకునిలో శాంతరసమును నింపును.

మహీభారావతరణార్థము మహాదేవుని సంకల్పముచే నయ్యైదేవతాంశములతో భూమికివచ్చినవారెల్ల తిరిగి యా యా యంశముల నుపసంహరించి తమ తమ మూర్తులలోఁ గలియుట నభివర్ణించిన స్వర్గారోహణ పర్వముగూడ విధినియతి ప్రాబల్యమును వక్కాణించుచు శాంతరసమునే యాస్వాదింపఁజేయును. దుర్యోధనాదులను స్వర్గమునను, దన సోదరులను, ద్రౌపదిని నరకమునను గాంచి ధర్మజుడు దుఃఖపడుట యనుకథాభాగముకూడ నొక విధముగా పాఠకునకు స్వర్గము నందును విరక్తినే పుట్టించి యిది గమ్యముకాదు సుమా యను భావమును, దీని కంటెఁ బరమపద మింకొకటి కలదు, అదియే యభిలషణీయ మను భావమును వ్యంజించును.

శౌనకాదిమహామునులు సూతునితో-

"ఏయది హృద్య; మపూర్వం బేయది; యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బైయుండు; నఘనిబర్హణ మేయది - యక్కథయ వినఁగ నిష్టము మాకున్"

అని వచించిరి. ఇందు వారి కాంక్షితము చెప్పఁబడినది. సమగ్రమైన యెఱుకయు, నఘనిబర్హణమును భారతకథా శ్రవణమువలన వారపేక్షించిరి. సమగ్రమైన

యెఱుక యనఁగా జ్ఞానము. జ్ఞానమనఁగా మోక్షవిషయకమైన బుద్ధి. "మోక్షే ధీ ర్జ్ఞాన మన్యత్ర విజ్ఞానం శిల్పశాస్త్రయోః" అని యమరము. "జ్ఞానా దేవహి కైవల్యమ్" అనుసూక్తియుఁ గలదు. దీనిని బట్టి భారతమునందు వారపేక్షించినది పరమపురుషార్థమైన మోక్ష మనియే భావింపవలయును. తదనుగుణముగా భారతకథయందు శాంతరసమునే సంభావింపవలయును. మఱియు తిక్కన సౌతిమాటలను నన్నయ పద్యమునందలి మాటలతోనే పూర్తిచేయించెను. ".... అప్పరమార్థపరాయణులతని తోడ నెయ్యది హృద్యంబును నపూర్వంబును సమగ్రజ్ఞానప్రదంబును నఘనిబర్హణంబును నైనయది యక్కథ మాకు విన నిష్టంబని పలుకుటయు...."

"అతఁ డింతటిది మహాభా రతంబ యను నిశ్చయము తిరంబుగ మతి సం
గతమగుడు నమ్మహాత్ముల కతివిశదముగాఁగ నిమ్మహాకథ చెప్పెన్."

18.77,78

ఇట్లీ పద్యములందుఁ బరమపురుషార్థోపాయములే చెప్పఁబడుటచే ఉపక్రమోప సంహారైక్యము గావింపఁబడినది. కావున నిందు శాంతరసానుభూతిని త్రోసివేయఁజాలము. ఇంతయేల? తిక్కన మహాకవీంద్రుఁడే భారతము నుపసంహరించుచు -

"పరమపదాప్తిహేతువగు భారతసంహిత శౌనకాది భూ
సురవరు లింపునం గరఁగుచొప్పునఁ జెప్పిన వారు మోద సం
భరితతఁ బొంది యక్కథకు బ్రాతిగ నర్చితుఁజేసి; ధర్మలిన్
హరిహరనాథ! సర్వభువనార్చిత! నన్ దయఁజూడు మెప్పుడున్." 18.94

అని భారతసంహిత పరమపదాప్తిహేతువని వక్కాణించెను. అట్టిదాని యందు శాంత రసముకాక తదన్యము సంభావనీయము కానేరదు. భారతీయవిమర్శక శిరోమణులగు నానందవర్ధనాభినవగుప్తుల కిది సమ్మతమైనవిషయము.

విషయ మిట్లుండఁగా డా॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారు నవ్యాలోక మనుతమ వ్యాససంపుటియందు 'ఆంధ్రమహాభారతము - అంగిరసము' అనువ్యాసమున సుదీర్ఘ చర్చగావించి శాంతమును ఖండించి ధర్మవీరము నంగిగా నిర్ణయించిరి. ఈయభిప్రాయ మంగీకార్యముకాదు. కాదనుటకుఁ బైఁజెప్పిన యనేకోపపత్తులే చాలవఱకు సహకరించును. వీరియభిప్రాయములను పరిశీలించి యం దెంతవఱకు సత్యమున్నదో చూడవలయును.

వీరు నాయకుఁడగు ధర్మరాజునందును దదనుయాయులగు భీమాదుల యందును ధర్మ వీరమునకు స్థాయియగు నుత్సాహము గలదనుటకు భారతమునుండి యనేక సందర్భముల నుదాహరించిరి. కడకు శాంతము ధర్మవీరమున కంగ మని

నిరూపించిరి. మహాభారతమువంటి మహాగ్రంథమున నేదేనియభిప్రాయమునకు ఆధారములు కొల్లలుగానే దొరకును. కాని యవి యెంతవఱకు నిలుచునో పరిశీలించి చూడవలయును. వీరుచూపిన యుపపత్తులను విమర్శింతును.

ధర్మవీరమునకు స్థాయిభావము ఉత్సాహము. "పర పరాక్రమ హానాదిస్మృతి జన్మా ఔన్నత్యాఖ్య శ్చిత్తవృత్తివిశేష ఉత్సాహః" అని రసగంగాధరనిర్వచనము. ఇది నేనింతవాఁడ నను నభిమానముతో, నహంకారముతో, సాధారణముగఁ, గూడియుండును. నాట్యశాస్త్రములో ఉత్సాహనిర్వచన మిట్లు చెప్పఁబడినది. - "ఇది యుత్తమ ప్రకృతులయందుండును. విషాదము లేకుండుట, శక్తి, ధైర్యము, శౌర్యము మొదలగు విభావముల వలన ఉత్సాహము జనించును. ధైర్యము, త్యాగము, శౌర్యము మొదలగు ననుభావములచే ఉత్సాహమును అభినయించవలెను" -

(నా.శా. తెలుఁగు - పు. 239)

ధర్మరాజునం దిట్టి యుత్సాహము మొదటినుండి తుదివఱకు నిలఁద్రొక్కుకొని యున్నదా? అతఁడు మొదటినుండియు నైహిక విషయములం దంతగా నాస్థలేనివాఁడుగనే కన్పట్టును. పెద్దల నిర్ణయమునకుఁ దలయొగ్గి భగవంతుని నమ్మి కష్టసుఖములలో నొకేవిధమగు ప్రవర్తనముచేఁ గడిపెను. అతని జీవితమంతయు నించుమించుగా దుఃఖమయమే. కౌరవవీరులను జయింపలేమనుభీతి యాతనిలో గోచరించును గావుననే నిండైనశక్తి నాతనిలోఁ జూడఁజాలము. అతఁడు శూరుఁడే కాని యది శాంతగుణసమ్మిశ్రితము. కావున నీకారణములచే నాతనియందుత్సాహము కంటె నిర్వేదమే యెక్కువగా దృశ్యమానమై శాంతరసమునే ప్రతిష్ఠాపించును. మఱియు ధర్మకార్యరతి యాతనికి సమగ్రముగా నున్నంతమాత్రమున ధర్మ వీరమునకుఁ బెద్దపీట వేయఁజాలము. అది యైహికసుఖ పరాఙ్ముఖుఁడగు నాతనితో తృష్ణాక్షయరూపహృదయసంస్కారమున కెక్కువ సహకరించున దగుటచే శాంతమే యిందు సంభావ్యము. మఱియు నాతని ధర్మాభిరతి కొకప్రయోజన ముండవలయునుగదా! అదియే పారమార్థిక సుఖము. దానికిఁ గావలసిన మార్గము లన్నియు నాతఁడు క్షుణ్ణముగాఁ దెలిసికొనుటయు నాచరించుటయు జరిగినది. కావున శాంతరసముదృష్టితో తక్కువదియగు ధర్మవీరమే యిం దంగమనుట లెస్స.

(2) డా॥ సుబ్రహ్మణ్యంగారు "ఆనందవర్ధనాదులగు నాలంకారికులు మహాభారతమును శాంతరసప్రధానముగ నిర్దేశింతురుగాని, అదే యానందవర్ధనాచార్యులు 'రసస్తు కథానాయకాశ్రయః తద్విపక్షాశ్రయో వా' యని నిర్దేశించిన దానినిబట్టి కావ్యగత

రసము నాయకాలంబకముగా భావించినట్లు స్పష్టమగుచున్నది. సామాజికులా నాయకాశ్రితములయిన భావములను తాదాత్మ్యముతో 'యస్తుష్టౌ తుష్టి మాయాతి....' అనుభరతోక్తి ననుసరించి యనుభవింతురు" అని వ్రాసిరి. (నవ్యలోకము-పు. 43)

రసము కథానాయకాశ్రయ మనుటలో ఎట్టి విప్రతిపత్తియు లేదు. ప్రస్తుత సమస్య భారతకథానాయకునిలో ధర్మవీరమునకు స్థాయియగు ఉత్సాహము స్థితి చెడకయున్నదా! శాంతరసస్థాయియగు శమము నిలువద్రొక్కుకొని యున్నదా? అనునది. దీనికి సమాధానము ఇంతకుపూర్వమే చెప్పబడినది. ధర్మజునకు ఐహిక మగు నాస్థ కాలికమేగాని నిత్యముకాదు. దీనికి భారతమున పరశ్శతముగా ఆధారములు కలవు. అవి అందందు కొన్ని ఇందు ప్రదర్శింపబడినవి. కావున ధర్మజునిలో కానవచ్చునది శమమేకాని మరియొకటికాదు. అప్పుడు అంగిరసము శాంతమేయగునుకాని, వీరముకానోపదు. ఆనందవర్ధనులు భారతమును శాంతరసప్రధానముగా చెప్పుటయును, "రసస్తు కథా నాయకాశ్రయః, తద్విపక్షాశ్రయోవా" అనుటను డా॥ సుబ్రహ్మణ్యంగారు స్వవచన వ్యాఘాతములుగా భావించినట్లు తోఁచును. అట్టి దిందేమియును లేదు.

ఇట్లి చర్చవలన ధర్మజునియందున్న నిర్వేద మను స్థాయిభావమువలన శాంతమే యనుభూయమానమగునుగాని యాతని యందలి యుత్సాహము స్థాయిత్వమును బొందలేదని తెలియుచున్నది.

భరతుని యస్తుష్టౌ తుష్టిమాయా తీత్యాది శ్లోకముగూడ శాంతమునకు సమర్థకము. ఎట్లన ధర్మరాజు తనజీవితము మొత్తముమీఁద లౌకికముగా సుఖపడిన సందర్భము లత్యల్పములు. అతఁడు తన జీవితయాత్రయందు మహాభయంకరములైన దుఃఖములనే యనుభవించెను. ఈ యంశమును బట్టి సత్యధర్మపరాయణుఁడగు నాధర్మమూర్తికే దుఃఖములు తప్పవన్నచో సాధారణుల సంగతి చెప్పనేల? యను రూపమున పాఠకునకు నిర్వేదమే జనించును. ఆ నిర్వేదచర్వణయే సహృదయ హృదయమున శాంతరసము నాస్వాదింపఁజేయును.

(3) "ధర్మరాజు స్వర్గారోహణపర్వాంతమువఱకుఁగల జీవితవృత్తాంతమున మోక్షమును బొందినట్లు ప్రతిపాదింపఁబడక అతని ప్రవృత్తి ధర్మాచరణమునకు ఫలరూపముగా స్వర్గప్రాప్తి నిబంధింపఁబడినది. అందుచేత నాయకుఁడు స్వర్గఫలకమయిన ప్రవృత్తిధర్మాశ్రయముగలవాఁడని యేర్పడుచున్నది" - అని డాక్టరు సుబ్రహ్మణ్యంగా రందురు. (నవ్యా - పు. 43) ధర్మరా జేమి పొందె ననునంశము రసచర్చలోఁ బ్రధానముగాదు. మన మేమియనుభూతిని బొందుచున్నా మన్నదే ముఖ్యము. నాయకుని

ప్రవర్తనమువలన సహృదయపాఠకునిలోని యే సంస్కారము లుత్థితము లగుచున్నవో దానినిబట్టి రసనిర్ణయము జరుగవలయును. ధర్మరాజు గురుజనశుశ్రూషచేతను, భీష్మాదులకుఁ బ్రణిపాతముఁజేసియు, పరిప్రశ్నతోడను జిజ్ఞాసువై లౌకికధర్మములతో పాటు మోక్షధర్మములనుగూడఁ బొందెను. కాని యాతని జిజ్ఞాస కిది ఫలమని విస్పష్టముగా నిర్ణయించుటకుఁ దగినయాధారము లేదు. అతఁడు లౌకికసుఖముల నపేక్షింపలేదనుటకుఁ బూర్వమే యనేకోపపత్తులు చూపఁబడినవి. స్వర్గసుఖము నపేక్షించె ననుటకును ఆధారము గనఁబడదు. అతఁడు మహాప్రస్థానము చేయఁగాఁ జేయఁగా స్వర్గము తారసిల్లుట యాదృచ్ఛికము గానే జరిగినది. యుద్ధము చేయుటయుఁ, గులవృద్ధుల నందఱను కుటిలోపాయములతో జంపుటయు, నందఱు శత్రువులును జచ్చువఱకును యుధిష్ఠిరుఁ డనునామము సార్థకమగుటకో యన్నట్లు యుద్ధవిరమణము చేయకుండుటయు, లౌకిక సుఖాపేక్షలేనిచో నెట్లు సంభవములగు నను శంక యిటఁ బొడమవచ్చును. దీనికి సమాధానము నిట్లు భావింపవలయును. కులోచితవర్తనము ధర్మము. "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అను గీతోక్తి ననుసరించి క్షత్రియుఁడు సాంసారికబంధములతోఁ గూడినవాఁడు, కర్తవ్యాకర్తవ్యజ్ఞానమును కృష్ణద్వైపాయనాది మహామునులవలననే కాక సనాతనుఁడైన వాసుదేవునివలనను బొందువాఁడు - గత్యంతరములేని పరిస్థితులలో యుద్ధముచేయక తప్పదు. యుద్ధమారంభించిన పిమ్మట లక్ష్యసిద్ధికాకుండ నడుమ విరమించుట యుత్తమ లక్షణముకాదు. శత్రువధ నేదోయుపాయములతోఁ జేసికొనక యుద్ధమునకు దిగిన యెట్టివాఁడును ధర్మమునూఁదియుంటినని యాత్మాహూతిఁ గావించుకొనఁజాలఁడు. ఇంతకును నాయకనాయకుఁడైన శ్రీకృష్ణునిచేతిలో కీలుబొమ్మలవంటివారు ధర్మజాదులు. యుద్ధముముగిసిన వెనుక ధర్మజుఁడు పడిన పశ్చాత్తాపమునకు మేరలేదు. ఆ పశ్చాత్తాప మాతనిలో నేదేని స్వార్థపరత్వమను దోష మున్నచో క్షాళన మొనరించునట్టిది. కావున యుద్ధము, బంధువధ మున్నగునవి శాంతరసవాదమునకు భంజకములు కానక్కరలేదు.

ఇఁక నాతని ప్రవృత్తిధర్మాచరణమునకు ఫలరూపముగా స్వర్గప్రాప్తి నిబంధింపఁబడిన దను నభిప్రాయముకూడ సరికాదు. ధర్మరాజు స్వర్గమును తన మహాప్రస్థానములో నొకభాగముగా పుణ్యవిశేషముచే నొకమాఱు దర్శించి యింద్రాదులతో గౌరవింపఁబడె నంతియకాని నిజమున కాతఁడు పొందినది సాధారణ పుణ్యవంతులు పొందెడు స్వర్గముకాదు. అతఁడు యమధర్మరాజు నంశముగా భూలోకమునకు వచ్చెను. మఱల నాతనితో నైక్యమొందెను. స్వర్గారోహణపర్వమున పర్యవసానమున నిదియే నిబంధింపఁబడినది. ఈ క్రింది పద్యము పైయభిప్రాయమునకుఁ బ్రమాణము -

"వినుము ధర్మనందను పుణ్యతనువునందుఁ
దగఁ బ్రవేశించి యున్న విద్యామయాత్ముఁ
డైన విదురుండు సమ్మోహితాత్మబోధ
శాలియును ధర్ముఁ గూడిరి సచ్చరిత్ర!" 18.70

యమధర్మరాజునకుఁ గృష్ణద్వైపాయనుఁడు ముక్తి నిప్పింపఁజాలఁడుకదా! దీనినిబట్టి ధర్మరాజు ముక్తిని బొందెనని నిబంధించుటకు వీలులేదు కావున నాయకుఁడు స్వర్గఫలకమయిన ప్రవృత్తిధర్మాశ్రయముగలవాఁ డనుటయుఁ బొసఁగదు. దీనితో ధర్మవీరమున కంగిత్వమును ప్రతిపాదింపలేము.

(4) "అట్టి యతని ప్రవృత్తిధర్మము నివృత్తిధర్మరూపమైన మోక్షజ్ఞానముచేత మెఱుఁగులు పెట్టఁబడినప్పటికిని అతఁడు కథావ్యాప్తియందు ధర్మవీరుఁడే యగుచున్నాఁడు." (నవ్యా -పు. 43)

ధర్మజుఁడు కథావ్యాప్తియందు ధర్మవీరుఁ డెట్లు కాలేదో యింతకుముందే నిరూపింపఁబడినది. ఆమాట నటుంచి ప్రవృత్తిధర్మమునకు నివృత్తిధర్మము మెఱుగులు పెట్టుననుట యసంగతము నివృత్తి ధర్మము తక్కిన పురుషార్థములకు గమ్యము. అట్లే తక్కిన సర్వరసములును బర్యవసానమున శాంతరసమునకే గమకములు. శాంతమును బ్రకృతిరసమని గదా విజ్ఞులు నిరూపించిరి! ప్రవృత్తిధర్మవే ప్రధానగమ్యమగు నివృత్తిధర్మమునకు మెఱుగులు పెట్టును. భారతమున ధర్మజుని జీవనమునందలి ధర్మవీరము అతని యుత్తమగతికి హేతుభూతమై యంగముగా నలరారుచున్నది. దీని కనేకప్రమాణములు గలవు.

(1) ఫలాభిసంధిలేని కర్తవ్యనిష్ఠయే యాతని మహాప్రస్థానమునకు బీజము.

"అర్జునుం డమ్మెయి నచ్యుత రామాది యాదవజనుల వృత్తాంతములను
దనదు తెఱంగు సత్యవతీతనూభవ హితభాషణంబులు నేర్పడంగఁ
జెప్పిన విని యుధిష్ఠిరుఁడు ప్రస్థానంబు నకు మది యొలయ నన్నరునితోడ
నఖిలభూతంబుల ననఘ పాకంబుఁ బొం దించుఁ గాలుండు మదీయబుద్ధి
కర్మసంత్యాగకలనంబు కార్యమిప్పు డను వినిశ్చయమొందె నీమనము నరయ
నిదియ మేలుగఁగనుచున్కి విదితమయ్యె నాకు ననపుడు నయ్యింద్రనందనుండు."

17.4

ఇందు 'కర్మసంత్యాగకలనము' అనునది స్వర్గఫలకముకాదు. అది మోక్షపురుషార్థమునకు మార్గము. మఱియు 'సర్వాభరణంబులు నూడ్చి వల్కలాజినములు

ధరించుటయు' (17.19) వారి వైరాగ్యమునే ప్రతిపాదించును గాని స్వర్గకాంక్ష నభివ్యక్తము చేయదు.

(2) శునకమునుగూర్చి యింద్రునితో ధర్మజుండు వివదించునప్పుడును "కావున నాకలోకపుసుఖంబు లటుండగనిమ్ము (17.58)" అనుటయు నాతని స్వర్గాసక్తి మిక్కుటము కాదను నభిప్రాయమును దెలుపును.

(3) స్వర్గమున నాతని ప్రవర్తన మంతయు దానియందలి యనాసక్తినే యభివ్యంజించును. స్వర్గారోహణపర్వమున నింద్రుఁడాతని నిట్లు కీర్తించెను :

"సిద్ధియు నవ్యయలోక స మృద్ధసుఖావాప్తియును శమితవికృతియు స
ద్బుద్ధియు నుదాత్తభంగిని సిద్ధించెను నీదు గుణవిశేషముకతనన్."

18.37

ఈ పద్యార్థమును బట్టి మర్త్యలోకముననేకాక స్వర్గమునందును, అవిచలితమైన ధర్మదీక్షగలవానికి అవ్యయలోక సమృద్ధసుఖావాప్తియు, శమిత వికృతియు లభించును గావున మానవుఁడు తదేకలక్ష్యముగా శమదమగుణోపేతుఁడు కావలయునను నుపదేశము వ్యంగ్యమగును. ఇది శాంతరసమునకే సహకారకముగాని ధర్మవీరమునకుఁగాదు. ఈ పై యంశములచే ధర్మజుఁడు ప్రవృత్తిధర్మైక తత్పరుఁడును, స్వర్గఫలైకకాంక్షియనియుఁ జెప్పఁజాలము. కావున నాతని ధర్మవీరమే శాంతమున కంగము.

(5) డాక్టరు సుబ్రహ్మణ్యంగారు శ్రీవిశ్వనాథవారి యభిప్రాయమును దమవాదమున కుపోద్బలకముగా నుటంకించిరి. కాని యది వారివాదమున కంతగా సహకరింపదు. "మహాభారతముయొక్క సమిష్టిమీఁద సంస్కృత భారతమునందు నిర్ణీతమైన శాంతరసము తెలుఁగువాక్యమునందుఁగూడ సహజముగాఁ బర్యవసింపఁ జేసికొనవచ్చునుగాని యెచ్చట నీశాంతరసమున కద్భుతగులునో చెప్పలేము" అని వారే యుద్ధరించిన వాక్యము శాంత రసమునకు మూలచ్ఛేదకము కాదు. ఎందేని శాంత రసానుకూల విషయములు క్వాచిత్కముగా కవిభేదముచే వచ్చినరావచ్చునని మాత్రమే వారి తాత్పర్యము. మఱియు వారు 'ఇది చాల అగాధమైన విషయము' అనుటయు గమనింపఁదగినది. భారతమువంటి మహేతిహాసకావ్యమున అనేకకర్తృకత వలన నొకచో అభిప్రాయ భేదములు రసవిషయమున రావచ్చును. వానిని పరిష్కరించుట దుష్కరమని వారు తలఁచియుండవచ్చునని పైవాక్యమువలన భావింపనగును. వీరుద్ధరించిన వాక్యములను బట్టి శ్రీవిశ్వనాథవారికి భారతమున ధర్మవీర మంగి యనునభిప్రాయము గలదని నిబ్బరముగాఁ జెప్పఁజాలము.

(6) "న యత్ర దుఃఖం, న సుఖం, న చింతా న ద్వేషరాగౌ నచికాచి దిచ్ఛా రస స్తు శాన్తః" అను శ్లోకమును బేర్కొని ధర్మజునియం దివి యన్నియు నున్నవికావున 'శాంతరసము కానేరదు' (పు. 46) అని వీరు తీర్మానించుట రస సిద్ధాంతమునకే కాక హేతువాదమునకును విరుద్ధమైన విషయము. శాంతరసాస్వాదము చేయు సహృదయునిలో నిట్టిస్థితి యుండుననియే పైశ్లోక తాత్పర్యము. రసానుభవమెందుండునో యందే దుఃఖాదులుండవని మాత్రమే యిచట గ్రహింపవలయును. ఇట్లు భావింపనిచో శాంతరసమున కుదాహరణమే దొరకదు. ముముక్షువునకు నిచ్ఛగలదు. మోక్షమునం దనురాగమును దద్భిన్నమగు దానియందు ద్వేషమును వాని కుండును. అట్లే తత్ప్రాప్తియందు సుఖమును, ప్రాప్త్యభావమున దుఃఖమును గలుగుచునే యుండును. కావున నీయభిప్రాయము సరికాదు. శృంగారాదిరసానుభూతిలోని యానందముకంటె భిన్నమగు నానందవిశేషము గలుగునని మాత్రమే పైశ్లోకము తాత్పర్యము. ఆగ్రహమునఁ గాదన్నచో అసంమోహము, అధ్యవసాయము, నయము, వినయము, బలము, పరాక్రమము, శక్తి మున్నగునవి వీరరసమునకు విభావములని నాట్యశాస్త్రమునందుఁ జెప్పఁబడినది. ధర్మజునియందు సంమోహము పెక్కుమాఱులు గానవచ్చును. అభిమన్యు వధ, కర్ణుఁడవమానించిన ఘట్టము, దుర్యోధనాదులను స్వర్గమునఁ దమ్ములను నరకమునఁ గాంచు సందర్భము మొదలగునవి యిట స్మరింపనగును. అట్లే పట్టుదల లేకుండుటయు గోచరించును. ధర్మాధ్యవసాయము అవిచలితమని చెప్పఁజాలకపోవుటకు భీష్మాదివధోపాయప్రశ్నాదిక ముదాహరణమగును. కావున శ్రీసుబ్రహ్మణ్యంగారి యభిప్రాయము ప్రకారము ధర్మవీరమంగి యనుటయుఁ బొసఁగదు. కావున ధర్మజునియందు దుఃఖాదులు గలవు గాన శాంత రసము కాదనుట స్వవచన వ్యాఘాతమునకు దారితీయును. మఱియు నొక్క విశేషము - కావ్యావసానమున ధర్మజుఁడు దుఃఖాదుల నన్నిటిని సమూలముగా ఛేదించి నిర్మలుఁడై శాంతరసమునఁ జెప్పఁబడిన స్థితివిశేషమును బొందె ననియు నీక్రింది పద్యమున సూచింపఁబడినది -

"అని పల్కి ధర్ముఁ డత్తనయునిఁ దోడ్కొని యయ్యెందఱును దోడ నరుగుదేర
నాకాశగంగ యుపాంతంబునకుఁ బోవ నప్పుణ్యనది నమ్మహానుభావుఁ
డార్యసంస్తవనవాక్యంబులు చెలఁగ భ వ్యస్నానమంగళ మాచరించి
మానుషతనువు నమ్మాత్రన విడిచి ది వ్యంబగు మహితదేహంబు దాల్చి
వైర మత్సర స్నేహ సంవాస లౌల్య గర్వ శోకాదు లైన హృద్గత వికార
ములఁ దొఱంగి నిర్ధూమత్వమున వెలుంగు పావకుఁడుఁబోలె శోభిల్లెఁ బౌరవేంద్ర!"

18.52

ఇది యాతనిజీవితమునకును జరిత్రకును సంబంధించిన తుదిమాట. హృద్గత వికారములనెల్లఁ దొఱంగె ననుటచే నాతని పరిపక్వస్థితి చెప్పఁబడిది. ఇట్టి స్థితి శాంతరసైక గమ్యము.

ఇదియంతయు నూరక హేతువాదమునకై చెప్పఁబడినది. నాయకుని యనుభూతికిని రసనిర్ణయమునకును సుదృఢమైన సంబంధము లేదు. రసము సహృదయ నిష్ఠము.

వ్యాసాంతమున ధర్మజుఁడు ముక్తిపొందలేదని శ్రీసుబ్రహ్మణ్యంగారు చక్కని హేతువాదబలమున నిరూపించిరి - కాని ఒక్కమనవి. ధర్మవీరమునకు ఫలమని వీరు నిరూపించిన స్వర్గమునుగూడ నాతఁడు అనుభవింపలేదు. కావున ముక్తి పొందకపోవుటచే శాంతరసమనుట కభ్యంతర మున్నదన్నచో స్వర్గానుభవము తదితరులకువలె నీతనికిఁ గలుగలేదనుటచే ధర్మవీర మను వాదముకూడ వీగిపోవలసి వచ్చును. ధర్మజుఁడు ధర్మునిలో నైక్యమాయెను. తన్నుఁ దానెఱిఁగి తనలో నైక్యమగుటచేతను, పునరావృత్తిరహితస్థితి నొందుటచేతను నొక విధముగా నది ముక్తియే యనవలయును. కాదందురా - నష్టము లేదు. శాంత రసము ప్రధానముగాఁగల కావ్యమందు నాయకుఁడు ముక్తినొందవలయు నను నియమము లేదుగదా! స్వస్వరూపాను సంధానమునకై యాతఁడు భువియందును దివియందును బడినపాటులు సహృదయునకు ఐహికాముష్మికసుఖాపేక్షను ద్రుంచివేయును. పారమార్థికానందాపేక్షను బెంపొందించును. ఇట్టిస్థితి ధర్మజాలంబకమగు నిరభిమానాత్మకమైన తృష్ణాక్షయ రూపస్థాయిభావమువలననే సిద్ధించును. కావున మహాభారతము సంస్కృతమునందు వలెఁ దెలుఁగునను శాంతరసాంగిత్వమునే గ్రహించియుండుట యిందుమూలమున స్పష్టమగుచున్నది.

ఉపసంహారము :-

ఆనందవర్ధన మేధా మందరసమున్మథిత సాహిత్యశాస్త్రక్షీరసాగర సముద్భూత ధ్వనిసిద్ధాంతసుధాస్రవంతి దఱిఁజేరుటకు మహాప్రతిభావంతునకుఁగాని సాధ్యము కాదని యెఱుఁగుదును. అయినను దైవకృపచేతను గురువుల యాశీఃకరావలంబమునను ధ్వనిసిద్ధాంతమునెడల నాకుఁ గల యాసక్తినిఁ బురస్కరించుకొని ఆంధ్ర మహాభారతము నందలి ధ్వనిని గూర్చిన విశేషములను వెలికిఁదీసి తెలియజెప్పుటకు యథాశక్తి చిత్తశుద్ధితోఁ బరిశ్రమించితిని. దీనియందు నేనెంతవఱకుఁ గృతకృత్యుఁడ నైతి ననుదానికి సహృదయులే ప్రమాణము. ఈ నా కృషి వారి మనసుల కెక్కుటయే నా కానందము.

**ఓమ్ తత్సత్**

# దీనిని గూర్చి . . .

పరిచాయకముగా ఈనాలుగు ముక్కలు వ్రాయుటకు హేతువు - జిజ్ఞాసు సహృదయ సమాజముతో మాటలాడుకొనుట అదృష్టవిశేషమగుటచే అభిలషణీయ మగుటయే. అంతేకాని మాన్యులగు పండితులకు గాని పండితమ్మన్యులకు గాని వీనితో పనియేమి?

ఇది మనోరంజకములును విజ్ఞానప్రదములును నగు మధురతర నిబంధముల సంపుటి. తత్త్వాన్వేషణాత్మకమగు బృహన్నిబంధము. ఈబృహన్నిర్మాణమునకు ఆధారభిత్తి అలంకారశాస్త్రనిబంధమూర్ధన్య మగు ధ్వన్యాలోకమును - తత్కర్తచేతనే "ద్విత్రాః పంచషావా" అని పరిగణింపబడిన మహాకవులలో నొకడో ఒకటవవాడో అగు వ్యాసభగవానుడు రచించిన శ్రీమన్మహాభారతమునకు కవిత్రయమువారు అందిచ్చిన ఆంధ్రమహాభారతమును.

ఈవిషయమును గూర్చి ఆలోచించునపుడు

"పరస్పరేణ స్పృహణీయశోభం
నచే దిదం ద్వంద్వ మయోజయిష్యత్
అస్మి న్ద్వయే రూపవిధానయత్నః
పత్యుః ప్రజానాం విఫలో ఉ భవిష్యత్" (కుమారసంభవము - 7.66)

అను శ్లోకము స్ఫురించును.

ఇది వధూవరులగు పార్వతీపరమేశ్వరులను గాంచిన ఓషధీప్రస్థపుర కాంతలు అనుకొనిన మాట. పరస్పరమును స్పృహణీయమగు శోభకల ఆద్వంద్వము నొకచో యోజనచేసియుండనిచో ప్రజాపతి ఈజంటయందు రూపనిర్మాణమునకై చేసిన యత్నము వ్యర్థమై యుండెడిది.

ఇట్లే వ్యాసరచిత భారతావ్నాయము కూడ తనయందలి తత్త్వమును ప్రమాణపురస్సరముగ నిరూపించు సాహిత్యతత్త్వ వివేచకనిబంధమునకై యభిలషించు చుండినది. ఆలంకారిక శిరోరత్నమగు నానందవర్ధనుఁడును తన ధ్వనిప్రస్థానమున భారతసంహితాతత్త్వమునే వివేచించబూనియో "అస్మి న్నతివిచిత్ర కవి పరంపరావాహిని సంసారే కాలిదాస ప్రభృతయో ద్విత్రాః పంచషా ఏవవా మహాకవయ ఇతి గణ్యన్తే" అనియు - "వాల్మీకి వ్యాసముఖ్యాశ్చ యే విఖ్యాతాః కవీశ్వరాః" అనియు - వ్యాసునకు సముచిత స్థానము నిచ్చి పేర్కొనుటయే కాక చతుర్థోద్ద్యోతమున కావ్యప్రతిపాద్యరసముల కంగాంగిభావమును గూర్చి వివేచించు సందర్భమున శ్రీమన్మహాభారతమునందలి రసముల అంగాంగిభావమును చాల

విస్తృతముగా అనుశీలించెను. కాని ధ్వన్యాచార్యుని తన్నిబంధరచనా ప్రవృత్తి ధ్వనిప్రస్థానప్రతిష్ఠాపనమునకై కావున నాత డచట భారతవిషయకచర్చను సర్వాంగీణముగా నొనర్ప నవకాశము చిక్కలేదు. అది ఈనాటికి శ్రీరఘునాథశర్మగారి ద్వారమున చక్కగా నెరవేరినది. ఈనిబంధ మాంధ్రభారతము నాధారముగా గొనినదేయైనను తదాంధ్రీకృతి శ్రీ వ్యాసభగవానుని రచనాతత్త్వానుయాయియే. కనుక నిది శ్రీమన్మహాభారతాశ్రిత మని సామాన్యముగ ననదగును. నన్నయభట్టారకుడును "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని " ఇత్యాది పద్యమున విష్ణుసన్నిభుడగు వ్యాసునిరచనలోని విశ్వజనీనత్వమును ప్రతిపాదించుచు తల్లక్షణములు చెడకుండ రచనగావించుటయే తనలక్ష్యమునని సూచించెను. మిగిలిన తిక్కన యెఱ్ఱనలును ఈమార్గమునే అనుసరించి రనుటచే సమగ్రాంధ్రభారతమును వ్యాసరచనకు సంగ్రహముగ నొసగిన యాంధ్రరూపమే.

ఈ నిబంధము తత్త్వాన్వేషాత్మకము. అన్వేషింపబడిన తత్త్వము ఏది? తస్యభావః - తత్త్వమ్. తచ్ఛబ్దముచే సచ్చిదానందస్వరూపమగు పరమార్థమే చెప్పబడును. భావమనగా రూపము. కనుక ఏవిశ్లేషణాత్మకనిబంధమునందైనను సాక్షాత్తుగనో పారంపరికముగనో పరమార్థతత్త్వ స్వరూపమే వివేచించబడును. శ్రీమన్మహాహారత మొక రసఖండము. "రసోవైసః" - "రసగ్ంహ్యేవాయం లబ్ధ్వాఽఽనందీభవతి"ఇత్యాది ప్రమాణములచే కావ్య ప్రతిపాద్యవిషయాస్వాదజనితానందము బ్రహ్మానంద సబ్రహ్మచారి. ఈయది ప్రత్యగనుభవ గోచరమే కనుక ఇది లేదనరాదు. కనుక 'అస్తి' 'సత్'. ఇది "నానృషిః కురుతే కావ్యమ్ "ఇత్యాది ప్రమాణములచే క్రాంతదర్శియగు ఋషితో నభిన్నుడగు కవియొక్క చిదంశమగు ప్రతిభచే నిష్పన్నము కనుక కార్యకారణముల కభేదముచే కావ్యానందము "చిత్". దాని వాస్తవస్వరూపము ఆనందము. కనుక నిట్లు కావ్య ప్రతిపాద్యవిషయాస్వాదజనితానందము సచ్చిదానందరూపము అనుట అపరిహరణీయమైనది.

మరియొక విధముగ నాలోచింపగా - పరమార్థతత్త్వము స్వస్వరూపమున యోగిమాత్రగోచరము; కాని సర్వులకును తద్వివర్త మగు జగద్రూపమున గోచరించుచున్నది. తద్విషయకవ్యవహార మంతయు వాక్కుతోనే జరుగవలెను. అందుచేతనే ఈదృశ్యజాతమంతయు నామరూపాత్మకమనుట. ఇది బాహ్య జగద్విషయము."అపారే కావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః" ఇత్యాది ప్రమాణముల చేతను, యుక్తిప్రపంచము చేతను కూడ కవి స్రష్టయే.

ఈప్రపంచమును నామరూపాత్మకము. కాని బాహ్యసృష్టికిని కావ్యసృష్టికిని గల భేదమిది : బాహ్యసృష్టి యొక్క నామరూపాత్మకత్వములో రూపము దృష్టి గోచరమగుచుండును.

నామము - శబ్ద ప్రపంచము - వ్యవహర్తల ముఖమునుండి అంతలొ పుట్టి అంతలొ అనంతాకాశమున లయము నొందును. కాని కవిసృష్టి లోనో - తద్గ్రథిత వాగ్విసరము రచనాత్మకముగ స్థిరరూపమునొంది గోచరమగు చుండును. తత్ప్రతిపాద్యములగు విషయములరూపము మాత్రము సహృదయుల భావనాబలము నాశ్రయించి చిత్తగోచర మగుచు లయము నొందుచునుండును. శబ్దములు రూపములతో అవినాభావసంబంధము కలిగియుండి వానిని ప్రతిపాదించుచుండుట మాత్రము ఉభయత్రసమానము. శబ్దము ధ్వన్యాత్మకము. కాని భేరీపటహాదిధ్వనులకు అర్థప్రతిపాదకసామర్థ్యము లేదు. గవాదిశబ్దములకు అర్థప్రతిపాదనశక్తి కలదు. ఇట్లు శబ్దాత్మకధ్వని ప్రతిపాద్యమగు అర్థమును స్ఫుటము శబ్దాత్మకధ్వనిచే వ్యంజితము. తత్తచ్ఛబ్దప్రతిపాద్యములగు అర్థములు శ్రోతలకు ప్రతీతము లగుటలో ద్వార-సాధన-భూతము. ఈవిషయమున వైయాకరణులు వర్ణస్ఫోటము-పదస్ఫోటము - వాక్యస్ఫోటము అను మూడు ప్రధానభేదములను, మరియింకను తత్తదుపభేదములను విశ్లేషించి విషయవిస్తృతి నొనరించినారు, ఈమార్గమును కావ్యవిషయమున నన్వయించుటచే నిష్పన్నమైన సిద్ధాంతమే ధ్వని సిద్ధాంతము.

దానిని సంగ్రహముగా నిట్లు చెప్పవచ్చును :-

ప్రతిశబ్దమును తానొక యర్థమును సాక్షాచ్ఛక్తిచే ప్రతిపాదించును. దానిచే "గోవు" అను శబ్దము నుచ్చరింపగనే సాస్నాలాంగూల ఖుర విషాణా (గంగ డోలు - తోక - గిట్టలు - కొమ్ములు)ద్యవయవ సహితమగు ప్రాణిరూపము శ్రోతృమనోనేత్రమున గోచరించును, ఇచట "గోవు" అను శబ్దము వాచకము. ఈయర్థము 'వాచ్యము'. ఈశబ్దము ఈయర్థమును ప్రతిపాదించుటకు సహకరించిన శక్తి 'వాచకత' అథవా అభిధ.

"ఈబాలుదు అగ్ని" అందుము. ఈబాలుడు ఉన్నాడు. అగ్నిఉన్నది. కాని ఈవాక్యమునందు ఈఉభయమునకు గోచరించు అభేదము అసంభవము. కనుక ఈబాలునియందు "అగ్ని"యందలి "పవిత్రత" కలదు. అందుచే ఈవాక్యమున గోచరించు అభేదము ఉపపన్నము. ఈవిధముగ ఇచట "అగ్ని"పదము అగ్ని యందలి పావిత్ర్యమును లక్షింప - గుర్తింప - జేసినది. కనుక ఇచట 'అగ్ని' పదము లక్షకము. 'పావిత్ర్యము కలవాడు' అను అర్థము లక్ష్యార్థము. ఈపదము ఈయర్థమును ప్రతిపాదించుటలో సహకరించిన శబ్దశక్తి లక్షణ.

కాని ఈరెండుపద్ధతులకు అతీతముగా ఆ యా వాక్యములచేతను పదముల చేతను పదాంశములచేతను ఆయాసందర్భములందు సహృదయహృదయ చమత్కార జనకములగు అర్థములు స్ఫురింపచున్నవి. ఈయర్థములు పైని తెలిపిన స్ఫోట ప్రతిపాద్యార్థములతో

పోతిక కలవి. కాని వానికంటెను విలక్షణ మగునవి.

ఉదాహరణమునకు :-

" ఏవంవాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ
లీలాకమలపత్రాణి గణయామాస పార్వతీ" (కుమారసంభవము - 6.84)

ఇచట ఈశ్లోకమునందలి ఆ యా పదములకు గల అభిధాలక్షణాశక్తులచే ప్రతిపాద్యములగు అర్థములకంటె అతీతమై మరొక యర్థము గోచరించుచున్నది.

అది ఇట్లు :

దేవర్షియగు అంగీరసుడు హిమవంతునితో పార్వతిని శివున కిచ్చి పెండ్లిచేయు విషయమై ఈ (పై) విధముగ పలుకునప్పుడు తండ్రిపార్శ్వమున పార్వతి యధోముఖియై (నిలిచియుండి) లీలాకమలపత్రములను లెక్కించెను. హేతువేమై యుండును? అని ప్రశ్న. ఆమె కన్య; ముగ్ధ. కాని ప్రియవిషయకాలాపశ్రవణముచే ఆమెమనమున లజ్జ కలిగినది. దానివలన తనలో నేమి సాత్త్వికభావములు ప్రకటములగునో - అవి పెద్దల మనస్సున కేమనిపించునో; వానిని గోపనము చేసికొనవలెను, అందులకై తాను వ్యాపారాంతర ప్రవృత్తురాలగుట యావశ్యకము. అదియే ఈలీలాకమలపత్రగణనమునకు హేతువు. ఈవిషయమును వెనుక వెనుకకు యోజించుచు పోయినప్పుడు పార్వతీచి త్తజనితలజ్జానామక సంచారిభావము ఈశ్లోకముచే ప్రతిపాద్యమగు ముఖ్యార్థము. ఏలయన అదియే యిచ్చట సహృదయచిత్త చమత్కృతిజనకము. కవిచే సాక్షాత్తుగా చెప్పబడనిది. పరోక్షముగా చెప్పబడినది. "పరోక్షప్రియా ఇవ హి దేవాః" ఇట్టి పరోక్షికోక్తులచే దేవతలు ప్రీతి నొందుదురట. ఇచట సహృదయులే ఆదేవతలు. లజ్జాఖ్య సంచారి భావము రసాంగము. కనుక ఇచటి ఈయుదాహరణము రసధ్వనికి సంబంధించినది.

"గురుగుం జెంచలిఁ దుమ్మి లేఁదగిరి సాకుం దింత్రిణీ పల్లవో
త్కరముం గూడఁ బొరంటినూనియలతోఁ గట్టావికుట్టారుగో
గిరముల్మెక్కి, తమిం బసుల్పొలమువోఁ గ్రేపుల్మెయిన్నాక మే
కెరువుంగుంపటి మంచమెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్."

( ఆముక్తమాల్యద - 4.131. )

అను పద్యమున రెడ్లదానిద్ర్యమును వస్తువు - క్రేపులు రెడ్లను తమ తల్లులుగా తలచిన భ్రాంతిమదలంకారము దాని మూలమున స్ఫురించు హాస్యరసము అనునవి ధ్వనులు.

ఇప్పుడు మరల పైవిషయముల నాలోచించవచ్చును. వైయాకరణుల స్ఫోటసిద్ధాంతమున శబ్దాత్మకధ్వని -- స్ఫోటము -- శబ్దప్రతిపాద్యార్థ ప్రతీతి

ధ్వనిసంప్రదాయవాదులగు అలంకారికుల మతమున

వ్యంకజమగు వాక్యము<br>
లేదా<br>
పదము<br>
లేదా<br>
పదాంశము | --వ్యంజనావ్యాపారము -- వ్యంగ్యార్థ ప్రతీతి

ఈవిధముగా స్ఫోట - ధ్వని సిద్ధాంతములకు సామ్యము కుదురుచున్నది.

ఈధ్వనిసిద్ధాంతమును శ్రీమన్మహాభారతమున కన్వయించుటయే ఈనిబంధమున ప్రతిపాద్యవిషయము. ఇట్టి విషయమునందు ప్రవేశించుటకే ఎంతయో యోగ్యత కావలయును. గురుకులసమాశ్రయణమున సంపాదించిన సంప్రదాయ పరిజ్ఞానము - తత్త్వజ్ఞాననిష్ఠ- దృఢపరిశ్రమము- అనహంకారతాపూర్వకమైన సహృదయత్వము - లేనిదే ఇట్టి విషయములందు నిష్కృష్టమైన పాండితి యలవడదు. దానిని నిర్దుష్టముగను, స్పష్టముగను, సరళముగను ప్రతిపాదించు సామర్థ్యమును అబ్బదు. శ్రీశర్మగారికి ఈపై సాధనసామగ్రి యంతయు సమగ్రమునగలదు. శ్రీవేమూరి రామబ్రహ్మశాస్త్రులవారు ఆంధ్రదేశమునందు జన్మించి, భారతదేశమునందలి సుప్రసిద్ధ విద్వద్వరేణ్యుల కెవ్వరికిని తీసిపోని కూలంకష పాండితి కలిగియుండియు - మారుమూల నెచ్చటనో - ఆగిరిపల్లిలో చాల కాలమును చివర చివర ఒంగోలులో కొంతకాలమును శాస్త్రపాఠప్రవచనములతో కాలముగడిపిన మహానుభావులు. వారికి రాని శాస్త్రములేదు. అసమగ్రత యనునది వారి పాండితిలో నెచ్చటను కానరాదు. వేదభాష్యములు - మీమాంసాశాస్త్రమున అర్థసంగ్రహము మొదలు శాబరభాష్య - శ్లోక - తంత్ర - వార్తికముల వరకు అన్ని గ్రంథములును - వ్యాకరణశాస్త్రమున మంజూషాభూషణసారాదికము - అలంకారశాస్త్రమున అన్ని గ్రంథములును - వేదాంతశాస్త్రమున అద్వైతపరిభాష మొదలు ఖండన ఖండఖాద్యము వరకు నన్నియును - తర్కశాస్త్రమున నన్నిగ్రంథములును నిరాఘాటముగ ననేకావృత్తులు పాఠములు ప్రవచించి పండిన పాండితి కల వారిని గూర్చి ఏదో చెప్పబూనుట సాహసము, వారి శిష్యకోటిలో కడపటివారు శ్రీరామచంద్రుల కోటీశ్వరశర్మగారు న్యాయ వేదాంతాద్యనేకశాస్త్ర పారంగతులు. వారినుండి సంపాదించిన సంప్రదాయబద్ధ మగు శాస్త్రీయాలోచనా సరణి శ్రీశర్మగారిది. ఇట్టి వీరిచే సంగ్రథింపబడిన ఈనిబంధము మూలమున ధ్వన్యా చార్యుని ధ్వన్యాలోకమును శ్రీమన్మహాభారతమువంటి ఆర్షగ్రంథముపై నన్వయించుటలోను - దాని నొక సరసకావ్యముగా భావనచేసి ఆనందించుటలోను - సహృదయులకు తోడుపడుట అను

రెండు ప్రయోజనములు చక్కగా నెరవేరగలవు. ఈబృహత్ప్రయోజనమును సిద్ధింపజేయుటలో ఇది నిష్కృష్టముగ నుపయోగించు సాధనమగుటచే నిదియంతయుగాని. దీని యందలి ప్రత్యేకవ్యాసములేకాని ప్రత్యేకము సమగ్ర గ్రంథముగా పఠన - పాఠనములలో గ్రహింపబడినచో భారతీయాలంకారికభావనాసరణిసంప్రదాయ మవిచ్ఛిన్నముగ ఆంధ్రదేశమున ముందునకు సాగిపోవుచుండునని నిశ్చయముగ చెప్పవచ్చును. ఇందతిశయోక్తి లేశమాత్రమును లేదు.

ధ్వన్యాలోకమునకు వివరణములో - అనువాదములో - ఇతఃపూర్వము పెద్ద లెందరో రచించినవి కలవు. కాని ఈనిబంధరచయిత ధ్వన్యాలోకమును చూచిన తీరు - అన్వయించుకొనిన విధము - తనది. దీనిని వినియోగించుకొన గలుగుట ఆంధ్రసాహితీతత్త్వజిజ్ఞాసువులగు సహృదయులవంతు.

ఆదోని
ది 26-9-1979

**పాతూరి సీతారామాంజనేయులు**

